# మొల్ల రామాయణం

## పరిమళ వ్యాఖ్యతో

- ఆచార్య కోలవెన్ను మలయవాసిని





తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2023

# మొల్ల రామాయణం

## పరిమళ వ్యాఖ్యతో

వ్యాఖ్యాత్రి

ఆచార్య కోలవెన్ను మలయవాసిని





తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2023

# ముందుమాట

భారతీయ సంస్కృతి సంప్రదాయాలకు మూలాలు వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు. **'ఇతి హాసః'** అంటే ఇలా జరిగింది అని అర్థం. రామాయణ భారతాలు ఇతిహాసాలు. ఈ రెండు గ్రంథాలు కొందరు మహాపురుషుల చరిత్రలను వర్ణించి తద్వారా అత్యున్నతమైన జీవన విధానాన్ని మానవాళికి బోధించాయి.

**వాల్మీకి గిరి సంభూతా రామసాగర గామినీ**
**శ్రీమద్రామాయణీ గంగా పునాతి భువన త్రయమ్**

"వాల్మీకి అనే పర్వతం నుండి పుట్టి, శ్రీరామచంద్రుడనే సముద్రంతో కలిసిన శ్రీమద్రామాయణం అనే గంగ ముల్లోకాలను పరమపావనం చేస్తున్నది" అనే శ్రీ శ్లోకం వాల్మీకి మహర్షి విరచిత శ్రీమద్రామాయణం యొక్క గొప్పతనాన్ని వివరిస్తున్నది.

రామాయణం అంటే రాముని ప్రయాణం. రామకథ రమణీయం, అద్భుతం, ఆనందకరం, మహామహిమాన్వితం. ధర్మస్వరూపుడైన శ్రీరామచంద్రుడు ఈ సమాజంలో ఎలా జీవించాలో తను స్వయంగా ఆచరించి చూపి ఆదర్శప్రాయుడైనాడు. మర్యాద రాముడైనాడు. పురుషోత్తముడైనాడు.

రామకథను మొట్టమొదట వ్రాసినవారు వాల్మీకి మహర్షి. వాల్మీకి ఆదికవి రామాయణం ఆదికావ్యం. వాల్మీకి మహర్షి విరచిత శ్రీమద్రామాయణాన్ని భారతీయ భాషల్లో అనేకమంది అనువదించుకున్నారు. తమ తమ ప్రాంతాలకు ప్రాతినిధ్యాన్ని కల్పిస్తూ కూడా చాలామంది రామకథను తమ యాస బాసలలో వ్రాసుకున్నారు.

తెలుగుభాషలో ఎందరో కవులు రామకథను పద్యంలోను, వచనంలోను, చంపూలోను, గేయంలోను ఇలా విభిన్న ప్రక్రియలలో వ్రాసి లోకానికి అందించారు. అయినా ఎవరి ప్రత్యేకతను వారు చాటుకున్నారు. తెలుగులో ఈ రామాయణాలన్నీ దేనికదే సాటిగా ఖ్యాతిగాంచాయి.

మొల్ల రామాయణం తెలుగులో విశేష ఆదరణ పొందిన కావ్యం అని చెప్పడంలో ఎటువంటి అతిశయోక్తి లేదు. మొల్ల రామాయణం వ్రాసినది ఆతుకూరి మొల్లమాంబ. ఈమె తొలి తెలుగు పద్యకవయిత్రి.

మొల్ల అంటే సువాసనాభరితమైన పుష్పవిశేషం. ఆ పుష్పాలలోని సువాసన రామాయణ రూపంలో బహిర్గతం చేసింది మొల్లమాంబ. తాను శివభక్తురాలైనా తన తండ్రి ఆతుకూరి కేసయ ప్రోత్సాహంతోనే రామకథను కడు రమణీయంగా రచించింది.

తిరుమల తిరుపతి దేవస్థానములు ధర్మప్రచారంలో భాగంగా గ్రంథముద్రణను ఒక సాధనంగా ఎంచుకుని వేదవాఙ్మయంతోపాటుగా రామాయణ భారత భాగవతాది పురాణేతిహాసాలను, ఆధ్యాత్మిక గ్రంథాలను అసంఖ్యాకంగా ధార్మిక లోకానికి వివిధ భాషలలో అందిస్తున్నది.

అందులో భాగంగా తెలుగులో కవిత్రయ భారతాన్ని, పోతన భాగవతాన్ని సవ్యాఖ్యానంగా ముద్రించి ఇదివరకే పాఠకలోకానికి అందించింది. ప్రస్తుతం విశాఖపట్టణానికి చెందిన సుప్రసిద్ధ రచయిత్రి ఆచార్య కోలవెన్ను మలయవాసిని గారిచే మొల్ల రామాయణానికి **'పరిమళ'** వ్యాఖ్యానాన్ని వ్రాయించి పాఠకలోకానికి అందిస్తున్నది. పరిమళభరిత మొల్ల రామాయణాన్ని ఆస్తిక మహాశయులు ఆదరిస్తారని ఆశిస్తూ...

సదా శ్రీ వేంకటేశ్వరస్వామి సేవలో

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

శ్రీః

# పరిమళపు గుబాళింపు

రామాయణం అనగానే శ్రీమద్వాల్మీకి రామాయణం అందరికీ గుర్తుకువస్తుంది. సంస్కృతంలో వ్రాయబడిన వాల్మీకి రామాయణానికి అనుకరణలు, అనుసృజనలు, ఆశ్రితములు అయిన కావ్యాలు, నాటకాలు ఎన్నో ఉన్నాయి. శ్రీరామునికథ భారతీయుల ఆత్మకథ, మర్యాదా పురుషోత్తముడైన రాముని ఆదర్శవ్యక్తిత్వం ఇందులో చిత్రింపబడింది. అందుకే ఇది ప్రజలకు మనోరంజకమైంది. సీతామహాసాధ్వి ఆదర్శగృహిణి. లక్ష్మణుడు ఆదర్శసోదరుడు, ఆంజనేయుడు ఆదర్శదాసుడు. ఇలా రామాయణ పాత్రలన్నీ భారతీయులకు ఆదర్శప్రాయమై నేటికీ ప్రజల్లో తమ ప్రభావాన్ని చూపుతున్నాయి.

ఆదినుండి తెలుగు సాహిత్యం సంస్కృతభాషా సాహిత్యాలచే పరిపుష్టమైంది. రామాయణ భారత భాగవతాలు తెలుగుకవుల కావ్యసృష్టికి కల్పవృక్షాలయ్యాయి. తెలుగులో కూడ రంగనాథరామాయణం, భాస్కరరామాయణం, బాలరామాయణం, ఉత్తరరామాయణం - ఇలా ఎన్నో కావ్యాలు వచ్చాయి. ఒక్క చేతిమీదిగా రచింపబడిన పూర్వ రామాయణకావ్యం మాత్రం మహారచయిత్రి మొల్ల రచించిన శ్రీరామాయణమే.

మొల్ల తెలుగు సాహిత్యచరిత్రలో రెండవ కవయిత్రి. ఈమె సంస్కృతభూయిష్ఠమై అర్థంకాని దీర్ఘసమాసవిన్యాసాలతో కవిత్వం ఉండకూడదని, కందువమాటలతో తేటతెనుగులో అందరికి హృదయావర్జకంగా కవిత్వం ఉండాలని అభిప్రాయపడింది. అలాగే తాను రామాయణాన్ని రచించింది కూడ.

ఈ సందర్భంగా మొల్లను గూర్చిన ఆరుద్రగారి అభిప్రాయాలు శిరోధార్యం – "1. ఈమె అచ్చంగా వాల్మీకి రామాయణాన్ని అనుసరించలేదు. అధ్యాత్మరామాయణం మొదలైనవాటిలో ఉండే ఘట్టాలను అనువదించింది... 2. సంస్కృత రామాయణాలనేకాక మొల్ల తెలుగులో పూర్వ కవులు వ్రాసిన రామాయణాలనుకూడ అక్కడక్కడ అనుసరించింది. 3. ఏది కవిత్వమో, దాన్ని ఎలా చెప్పాలో ఆమెకు బాగా తెలుసు. అన్నిటికన్నా ముఖ్యం తెలుగులో కవిత్వం ఎలా చెప్పకూడదో ఆమెకు నిజంగా తెలుసు. ఆమె ఉద్దేశంలో కావ్యం తేటమాటలలో చెప్పినా, కొత్తరీతులలో పొలుపు వహించాలి. తేటగా చెప్పాలన్నది సూటిగాకాక ధ్వనిస్తేనే బాగుంటుంది. మొల్ల ఇలా కవిత్వం చెప్తుంది కనుకనే ఆమెకావ్యం తెలుగునకుం బొందై, రుచియై, వీనులకు విందై కానిపిస్తుంది." (స.ఆం.సా.సం.2. పుట 269,70,71)

నన్నయనుండి నేటిదాక కావ్యరచన చేసిన కవులు కావ్యం లేదా కవిత్వం ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో, లేదా తమ కవిత్వం / కావ్యం ఎలా ఉంటుందో చెప్పడం సూచించడం పరిపాటిగా వస్తోంది.

నన్నయ, తిక్కన, పాల్కురికి, రాజరాజభూషణుడు, చేమకూర... ఇలా కవులు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. అదేవిధంగా మొల్లకూడా.

క. **మును సంస్కృతమ్ముఁదేట గఁ**
**దెనిగించెడి చోట నేమి దెలియకయుండన్**
**తన విద్యమెఱయ, గ్రమ్మఱ**
**ఘనమగు సంస్కృతముఁజెప్పగా రుచియగునే?**

ఆ.వె. **తేనెసోఁక నోరు తీయన యగురీతి**
**తోఁడ నర్థమెల్లఁదోచకుండ**
**గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము**
**మూగ చెవిటి వారి ముచ్చటగును**

క. **కందువ మాటలు, సామెత**
**లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగునకున్**
**బొందై, రుచియై, వీనుల**
**విందై, మఱి కానుపించు విబుధులమదికిన్.**

అలా చెప్పడమే కాదు, అక్షరశః పాటించింది కూడ.

రామాయణ రచనకు పూనుకోవడానికి గల కారణం కూడా రామాయణ కర్తలు చెపుతూ వచ్చారు–

**నేరిచి పొగడిన వారిని**
**నేరక కొనియాడువారి నిజ కృప మనుపం**
**గారణ మగుటకు భక్తియె**
**కారణమగుఁగాని చదువు కారణ మగునే?**
**సల్లలిత ప్రతాపగుణ సాగరుఁడై విలసిల్లి, ధాత్రిపై**
**బల్లిదుఁడైన రామ నరపాలకునిన్ స్తుతిసేయు జిహ్వకున్**
**జిల్లరరాజ లోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే?**
**యల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాససేయునే?**

అని మొల్ల తెలియ చేసింది.

విశ్వనాథవారు కూడ –

సీ. **మఱల నిదేల రామాయణం బన్నచో**
**నీ ప్రపంచక మెల్ల నెల్ల వేళఁ**

**దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ల**
**తన రుచి బ్రదుకులు తనవిగాన.....**
**......అని సాధారణంగా చెప్పి,**
**'తండ్రి యాజ్ఞయు జీవుని వేదన రెండునేకమై'** అని అసలు కారణాన్ని చెప్పారు.

ఇటువంటి తేటతెనుగు మొల్లరామాయణానికి ఆచార్య మలయవాసినిగారు వ్యావహారికాంధ్రంలో చక్కని పరిమళ వాఖ్యను సంతరించారు. ఈ వాఖ్య సరళసుందరమైన తెలుగులో నడిచింది. 'నామూలం లిఖ్యతే కించిత్ నానపేక్షిత ముచ్యతే' అని మల్లినాథసూరి చెప్పినట్లుగా నిరాధారంగా, మూలంలో లేని విషయాలు ప్రస్తావించకుండా, అవసరంలేని స్వపాండిత్యస్ఫోరకమైన విషయములతో అకాండతాండవం చేయకుండా, ఎంతకావాలో అంతే వివరిస్తూ వ్యాఖ్యానించడం వ్యాఖ్యాత్రి వాక్సంయమనానికి నిదర్శనం. అవసరమైనచోట చక్కని వివరణలతో వాఖ్యకు పుష్టిని కూర్చి పఠితలకు తుష్టిని కలిగించారు. అందుకు ఉదాహరణంగా – 'నారదులైరి సన్మునులు నాకమహీజములయ్యె భూజమల్' (2–15) అనే పద్యానికి వివరణ పఠితలకు సంతృప్తిని కలిగిస్తుంది. సామాన్య పాఠకులకు విషయపరిజ్ఞానాన్ని కూడా అందిస్తుంది. బాలకాండలోని 'శారద గాయత్రి శాండిల్య గాలవ కపిల కౌశిక కులఖ్యాతి గలిగి' అనే పద్యానికి (1–38) చాల చక్కని వివరణ అందించారు. ఇందులో వనపరంగా, బ్రహ్మాదిలోకాలపరంగా చేసినవాఖ్య పండితులకు ఆమోదాన్ని కలిగిస్తుంది.

మొల్ల రచనలోని సీసపద్యాల సొగసుల్ని ఆయా సందర్భాలలో చక్కగా వివరించారు. వీటిలో విరోధాభాసలు, శ్లేషలు, ఉపమలు కోకొల్లలు. వాటిని సందర్భానుసారంగా క్లుప్తంగా వ్యాఖ్యాత్రి వివరించారు. (ఉదా. సుందర–48).

రసవత్తరమైన, ధ్వనియుక్తమైన పద్యాలను వివరించే సందర్భంలో వ్యాఖ్యత్రి పాండిత్య వైయత్యాన్ని మనం గమనించవచ్చు. సుందరకాండలో 'కంటిన్ జానకిఁ బూర్ణ చంద్రవదనన్' (సుందర.245) అనే పద్య వివరణం సహృదయ హృదయరంజకంగా సాగింది. పద్యం ఎత్తుగడలోని ఔచిత్యాన్ని బాగా వివరించారు.

మొత్తంమీద ఈ పరిమళవ్యాఖ్య సహృదయుల హృదయపద్మాలకు నూతన పరిమళాన్ని కలిగిస్తుందని భావిస్తూ, ఇటువంటి చక్కని వ్యాఖ్య అందించినందులకు ఆచార్య మలయవాసిని గారికి అభివందనములు తెలియజేస్తూ పాఠకులు దీనిచే మొల్ల రామాయణ ప్రాశస్త్యాన్ని గ్రహించగలరని విశ్వసిస్తున్నాను.

ధర్మప్రచారంలో భాగంగా ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథాలను ముద్రిస్తున్న తి.తి.దే. మొల్ల రామాయణాన్ని కూడా పాఠకలోకానికి అందుబాటులోకి తేవాలని తమ లేఖద్వారా అభ్యర్థించి, నిరంతర సంప్రదింపులతో గ్రంథ స్థితిగతులను తెలుసుకొంటూ ప్రోత్సాహాన్ని అందించిన ఆంధ్రప్రదేశ్ శాలివాహన సంఘం కార్పొరేషన్ చైర్మన్ శ్రీ యం.పురుషోత్తం గారికి కృతజ్ఞతలు.

తిరుమల తిరుపతి దేవస్థానం – కార్యనిర్వహణాధికారి, ఉపకార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు మున్నగు పెద్దలంతా తి.తి.దే. ప్రచురణలపక్షాన దీనిని ప్రచురించి పాఠకలోకానికి గొప్ప సదవకాశాన్ని కలిగిస్తున్నందుకు ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు.

**ప్రత్యేకాధికారి**
ప్రచురణల విభాగం
తి.తి.దే. తిరుపతి.

# తొడిమ

## "మొల్ల తొలి పద్య కవయిత్రి"

ఆంధ్ర సాహితీ నందనవనంలో వికసించిన పరిమళ భరితమైన, అతి సుకుమారమయిన కుసుమం 'మొల్ల'. మొల్ల ఈశ్వరునికి ప్రీతికరమైన పువ్వు. భారతదేశంలోని దక్షిణ ప్రాంతంలోని శివాలయాలలో మొల్ల తీగెలను ప్రత్యేకంగా పెంచుతారు శివ పూజకోసం. సన్నజాజి కంటే సన్నగా, కొంచెం చిన్నగా, వాసన ఎక్కువగా ఉండే తెల్లని పువ్వు మొల్ల. ఆ పువ్వు పేరును తన కుమార్తెకు ఎంతో ప్రేమతో పెట్టుకున్నాడు – ఆతుకూరి కేసయ. అతడు

**'గురులింగ జంగమార్చన**
**పరుడును, శివభక్తిరతుడు, బాంధవ హితుడున్**
**గురుఁ డాతుకూరి కేసయ'**

తనను తాను పరిచయం చేసుకుంటూ మొల్ల పై పద్యం వ్రాసింది. గురులింగ జంగమార్చనపరుడూ, శివభక్తిరతుడు, బాంధవ హితుడు, గురుడు అంటే తండ్రి – గురువు కూడా అయిన ఆతుకూరికేసయకు – తాను 'వరపుత్రిని మొల్లయనగ వఱలిన దానన్'. అంటుంది. తండ్రిపట్ల ఆ తనయకు గల భక్తితాత్పర్యాలు ఇంతటి ఉదాత్తంగా ఉన్నాయి. ఎందుకంటే ఆ తండ్రి ప్రోత్సాహంతోనే ఆమె రామాయణ రచన చేయగలిగింది.

శివభక్తిరతుడైన కేసయ శివప్రియమైన 'మొల్ల'ను తన తనయకు పేరుగా ఎన్నుకోవడం ఎంతో ఔచితీ భరితంగా ఉంది. మొత్తంమీద ఈ కవయిత్రి పేరు అపురూపమైంది.

తెలుగు సాహిత్య రంగంలో తొలిపద్యకవయిత్రి మొల్ల. మొల్ల ఊరు, కాలం, కులం కూడా వాఙ్మయ చరిత్రకారుల్లో భిన్న, భిన్న అభిప్రాయాలు కలిగించాయి.

**ఊరు :** మొల్ల తనకు కవిత చెప్పే నేర్పు ఎలా అలవడిందీ చెప్పే సందర్భంలో

**'విఖ్యాత గోప**
**వరపు శ్రీకంఠ మల్లేశు వరముచేత**
**నెఱిఁగవిత్వంబు ఁజెప్పగా నేర్చికొంటి. పీఠిక-12**

అని చెప్పుకుంది. దీనినిబట్టి ఆమె ఊరు 'గోపవరం' అని నిర్ధారించుకోవచ్చు. నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలోను, కడప తాలూకాలోను గోపవరం ఉంది.

శ్రీ మున్నెల్లి శివశంకరయ్య & శ్రీమతి దగ్గుపాటి శ్రీదేవి అనే పరిశోధకులు **కవయిత్రి – ఆత్మకూరి మొల్లమాంబ నెల్లూరు జిల్లా (గోపవరం) స్థానికత ఆధారాలు – నిజనిర్ధారణ** అనే గ్రంథంలో మొల్ల ఊరు – నెల్లూరు జిల్లా గోపవరం అని వివిధ ఆధారాలతో నిర్ధారణ చేసారు.

**ఇంటి పేరు :** తన తండ్రి పేరు ఆతుకూరి కేసయ అని తాను, వరపుత్రినని చెప్పడం వల్ల – మొల్ల ఆతుకూరి మొల్లగా ప్రసిద్ధికెక్కింది. ఆతుకూరి ఇంటి పేరు.

**కాలం :** మొల్ల, తిక్కన కాలంనాటిదనీ, కృష్ణదేవరాయల కాలంలో ఉందనీ రకరకాల రచనల వల్ల ఎన్నో అభిప్రాయభేదాలు ఏర్పడయ్యాయి. కానీ మొల్ల చేసిన పూర్వకవి స్తుతిలో – శ్రీనాథుని ప్రస్తుతించింది. శ్రీనాథుణ్ణి పేర్కొనడంవల్ల – 13వ శతాబ్దిలో తిక్కన సమకాలికురాలు కాగలిగే అవకాశంలేదు.

తొల్లిటి ఇప్పటి కవులను అంటోంది కనుక శ్రీశ్రీనాథుడు సమీప పూర్వుడు కావడానికి అవకాశం ఉంది. పోతనను పూర్వకవిస్తుతిలో పేర్కొనలేదు కానీ పోతన ప్రభావం మొల్ల రచన మీద ప్రస్ఫుటంగా ఉంది. పెద్దనాదుల పేరు ఎత్తలేదు. ఈ నేపథ్యంలో మొల్ల కాలం క్రీ॥శ 1500 కావొచ్చునని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తమ **తెలుగు సాహిత్య చరిత్ర**లో పేర్కొన్నారు.

**కులం :** మొల్ల కుమ్మరి కులానికి చెందినది అనేవాదం ఒకటి ఉంది. అయితే కావ్యంలో ఎక్కడా ఆమె తన కులాన్ని ప్రస్తావించలేదు. గ్రంథస్థ విషయాలను బట్టి మొల్ల శ్రామిక వర్గమునకు చెందినదని ఊహ చేయగల సందర్భం ఒకటి ఉంది. శ్రామికుల జీవనంలో – పగలంతా కష్టపడి రాత్రి స్నానం చేయటం ప్రసిద్ధ విషయం. వారి దినచర్య అది. మొల్ల తన రచనలో– సూర్యాస్తమయ వర్ణన సందర్భంలో

**తే.** **పగలు ప్రాగ్భాగమున నుండి గగనవీథి**
**జరమ దిక్కున కేఁగఁగా శ్రమముదోఁచి**
**చెమట పట్టిన స్నానంబుఁ జేయ నరుగు**
**కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె.** **అ.6**

సూర్యుడు ఉదయ సమయంలో తూర్పున మొదలు పెట్టి ఆకాశవీధిలో పగలంతా ప్రయాణం చేసిచేసి పశ్చిమ దిక్కుకు చేరుకుంటాడు. నిమిషమైనా విశ్రాంతి తీసుకోకుండా సూర్యుడు అలా శ్రమపడడం వల్ల ఆయనకు ఒంటినిండా చెమటపట్టింది. ఆ శ్రమ తీర్చుకోవడానికి చెమటకడుక్కోవడానికి స్నానం చేయడానికి పశ్చిమసముద్రంలోకి దిగుతున్నాడా! అన్నట్లుగా – సూర్యబింబం అస్తమిస్తూ సముద్రంలో మునిగింది అని మొల్ల భావన చేసింది.

ఆశ్వాసాంత గద్యలో తండ్రిని – 'ఆతుకూరి కేసయసెట్టి' అని పేర్కొంది. తండ్రి పేరులో ఆ సెట్టి ఉత్తరపదంగా ఉండడం వల్ల ఈమె బ్రాహ్మణేతర స్త్రీ అని చెప్పవచ్చు. ఇది శ్రామిక జీవన ప్రతిఫలనం.

పరిశోధకులు శ్రీ మున్నెల్లి శివశంకరయ్య & దగ్గుపాటి శ్రీదేవి గారు తమ గ్రంథంలో – మొల్ల కులం 'కుమ్మరి'గా నిర్ధారణ చేసారు.

**శ్రీయుతులు మండెపూడి పురుషోత్తంగారు – ఆంధ్రప్రదేశ్ శాలివాహన కార్పొరేషన్ చైర్మన్‌గారు –** కవయిత్రి మొల్లమాంబకు సంబంధించిన వివరాలు సేకరించి ప్రచురింపచేయడంలో ఎంతో శ్రద్ధ వహిస్తున్నారు.

తెలుగులో రామాయణ రచన చేసిన మొల్ల జీవించిన కాలంనాటి స్త్రీల స్థితిగతుల గూర్చి – విద్వాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, ఎమ్.ఎ., గారు వ్రాసిన విషయాలు ఇక్కడ ప్రస్తావించుకోవలసి ఉంది.

"ఒక సరోజినీనాయుడు మహావిదుషీ, జగద్విఖ్యాతిగాంచిన కవయిత్రీ అయినా, మరొక ఇందిరాగాంధీ ప్రపంచంలోనే పెద్ద ప్రజాస్వామిక రాజ్యాలలో ఒకదానికి ప్రధానమంత్రి కాగలిగినా ఈ ఇరవయ్యో శతాబ్దం ఉత్తర భాగంలో మనకేమీ ఆశ్చర్యంగా అనిపించకపోవచ్చును. ఏ ఆఫీసుకు పోయినా టైప్ మిషన్ల చప్పుళ్లతో పాటు గాజుల గలగలలు కూడా వినిపిస్తూ, ఏ ప్రజాహిత రంగంలో చూసినా పురుషులతో సమస్కంధంగా స్త్రీలు కూడా ముందుకు వస్తూ ఉన్న ప్రస్తుత కాలంలో అది అత్యంత సహజంగానే తోచవచ్చును. కాని ఇప్పుడు ఏ డెబ్భయ్యోపడిలోనో, ఎనభయ్యోపడిలోనో ఉన్న మన తాతయ్యలను, అవ్వలనూ కదిపి చూస్తే ఈ శతాబ్దం ఆరంభంలోనే మన తెనుగుదేశంలో స్త్రీల పరిస్థితి ఎంత నాసిగా ఉండేదో వాళ్ళు మనకు చెబుతారు. 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి', 'ఆడదానికి స్వాతంత్ర్యం ఏమిటి?'

'ఆడపెత్తనం తంబళ దొరతనం', 'ఆడవాళ్ళకు చదువులెందుకు? 'రామాయణాలు వ్రాయాలా?' 'రాజ్యా లేలాలా?' ఇలాంటి మాటలు, నమ్మకాలూ, సంఘాన్ని పరిపాలిస్తూ ఉండేవి ఇటీవలి వరకూ. విద్యావతులు, అక్షరాస్యలూ అయిన స్త్రీలు వేళ్లమీద లెక్కించ దగినట్టు ఉండేవారు.

ఈ శతాబ్దం ఆరంభంలోనే పరిస్థితి ఇలా ఉంటే సుమారు నాలుగైదు వందల సంవత్సరాల క్రితం, మొల్ల జీవించి ఉన్నకాలంలో ఆమె విద్యావతి కావడానికీ, కవయిత్రి కావడానికీ సంఘంలో ఎలాంటి ప్రతిఘటనను ఆమె ఎదుర్కోవలసి వచ్చి ఉంటుందో మనం తేలికగానే ఊహించుకోవచ్చును.

మొల్ల ఆడది కావడమే కాదు. బ్రాహ్మణేతరకులంలో పుట్టింది. ఆరోజులలో విద్యా విజ్ఞానరంగాలకు అధికారులు బ్రాహ్మణులే. స్త్రీ స్వాతంత్ర్యం విషయంలో లాగే ఇప్పటి పరిస్థితికి పూర్తిగా విరుద్ధంగా ఆరోజుల్లో బ్రాహ్మణేతరులకు విద్యారంగంలో ప్రవేశం ఉండేది కాదు. ఆనాటి విద్వద్ బ్రాహ్మణ వర్గం నుండి ఎంతటి ప్రతిఘటనను మొల్ల ఎదుర్కోవలసి వచ్చి ఉంటుందో మనం సులభంగానే ఊహించుకోవచ్చును. పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నా, అధ్యయన సౌకర్యాలు కొరవడినా పట్టుదలతోనూ, భగవదనుగ్రహం వల్లను మహాకవయిత్రి అయి, రామాయణంలాంటి ఉద్గ్రంథం వ్రాసిన మొల్ల మన ఆధునిక యువతులకు అనేక విధాలుగా. ఆదర్శప్రాయురాలు." (ఎమెస్కోవారి మొల్లరామాయణ పీఠిక **'వాచవి'.**) పరిస్థితులు సానుకూలంగా లేని ఆనాళ్లలో మొల్ల విద్యావంతురాలై కావ్యరచన చేయడం గొప్ప విషయం.

**'మొల్ల పలికె జాజిమల్లె రీతి'** : ఆచార్య కాకర్ల వేంకట రామనరసింహం గారు 'సాహిత్య చరిత్ర' పాఠం చెప్పే సందర్భంలో రామాయణ రచయితల గురించి చెప్తూ

**'భాస్కరుండు పల్కె పంచదారల పోల్కి**
**మొల్ల పలికె జాజి మల్లె రీతి!**

అనే ఆటవెలది పద్యంలో రెండోభాగం చెప్పి, ప్రథమభాగం కూడా ఉండే ఉంటుంది. ఆ రెండు పాదాలలో బహుశా బుద్ధారెడ్డి రంగనాథ రామాయణం గురించి, ఎఱ్ఱన రామాయణం గురించి చెప్పి ఉంటారు అని చెప్పారు. ఆ మొదటిభాగం నా సారస్వత అధ్యయనంలో తారసపడలేదు. అదే సందర్భంలో పోతనకు రామాయణ రచనమంటే అత్యంత ప్రీతి అనీ, కానీ భాస్కరుడు అప్పటికే రామాయణ రచన చేసి ఉండడం వల్ల తాను విరమించుకున్నానని – 'భాస్కరుడు పలుకకున్న, బండ్లకెత్తెడివాడను కదా!' అని అనుకున్నాడని కూడా చెప్పారు. మొత్తానికి మొల్ల రామాయణాన్ని జాజిమల్లెలా వ్రాసింది అనే పాదం మనకు దక్కింది. మొల్లకంటే ముందు తెలుగు వాఙ్మయంలో రామాయణం వ్రాసిన వారిలో ముఖ్యులు.

| | | |
|---|---|---|
| **తిక్కన** | **–** | **నిర్వచనోత్తర రామాయణం** |
| **బుద్ధారెడ్డి** | **–** | **రంగనాథ రామాయణం** |
| **ఎఱ్ఱన** | **–** | **శ్రీరామాయణం** |
| **భాస్కరుడు** | **–** | **భాస్కర రామాయణం** |
| **కొఱవి సత్యనారన** | **–** | **రామాయణం** |

తాళ్ళపాక అన్నమాచార్యులు – నవముగా రామాయణం వ్రాసినట్లు గ్రంథస్థమైన ఆధారాలు ఉన్నాయి. అయితే వీటిలో తిక్కన వ్రాసినది నిర్వచనోత్తర రామాయణం. నిర్వచనం అంటే అసలు వచనం లేకుండా అన్నీ పద్యాలే వ్రాయడం. రెండోది తిక్కన పూర్వరామాయణాన్ని వదలి – కేవలం ఉత్తర రామాయణం మాత్రమే ఎత్తుకోవడం.

బుద్ధారెడ్డి వ్రాసిన రంగనాథ రామాయణం ద్విపద ఛందస్సులో వ్రాయబడింది. మొదటి ఆరు కాండలు బుద్ధారెడ్డి వ్రాయగా, ఉత్తరకాండ అతని కొడుకులు కాచవిభుడు, విఠలనాథుడు వ్రాసారు, ద్విపదలోనే.

ఎఱ్ఱన రామాయణం చంపూపద్ధతిలో వ్రాసి ప్రోలయ వేమారెడ్డికి అంకితం ఇచ్చాడు. నేడు అది లభ్యం కావడం లేదు.

భాస్కర రామాయణం కూడా చంపూపద్ధతిలో వ్రాసినదే. ఒక్కచేతి మీదుగా నడచిన రచన కాదు.

| | | |
|---|---|---|
| **బాల, కిష్కింధ, సుందరకాండలు** | **–** | **మల్లికార్జునభట్టు** |
| **అయోధ్యకాండ** | **–** | **కుమార రుద్రదేవుడు** |
| **అరణ్యకాండ, యుద్ధకాండలో కొంతభాగం** | **–** | **భాస్కరుడు** |
| **యుద్ధకాండ శేషభాగం** | **–** | **అయ్యలార్యుడు వ్రాసారు.** |

అన్నమాచార్యుల రామాయణం, కొఱవి సత్యనారాయణ రామాయణం లభ్యం కాలేదు. పూర్వ రామాయణం పూర్తిగా చంపూపద్ధతిలో రచింపబడినది మొల్ల రామాయణమే. దొరికినవాటిలో ఒక్కచేతి

మీదుగా నడిచినట్టిది ఇదే. ఆ విధంగా మొల్లకి ఆంధ్ర రామాయణ సాహిత్యరంగంలో ఒక ప్రత్యేక స్థానం ఉంది. తన రామాయణం ఆశ్వాసాంత గద్యల్లో మొల్ల.

'శ్రీ గౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజన వినుతకవితా చమత్కారాతుకూరికేసన సెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందు బాలకాండము సర్వము ఏకాశ్వాసము' అని చెప్పుకుంది.

ఈ గద్యలో తన తండ్రి కేసనసెట్టిని మొల్ల – 'సూరిజనవినుత కవితా చమత్కార!' అనే విశేషణంతో సంభావించి గౌరవించింది. పండితులచేత ప్రశంసింపబడిన కవితా చమత్కార సంపదగల కేసన సెట్టి కుమార్తె ఆమె. నిజానికి మొల్ల కూడా 'సూరిజనవినుత కవితా చమత్కారి'. పిత్రార్జితంగా మొల్లకు సంక్రమించిన సంపద ఈ కవితా సంపద. పిత్రార్జితానికి స్వార్జితాన్ని జోడించి మొల్ల కవయిత్రిగా స్థిరమైన స్థానాన్ని సంపాదించింది. ఆనాళ్లలో పురుషకవులతో సాటిగా రచన చేయగలను అని నిరూపించుకొందుకే మొల్ల కొన్ని వర్ణనలు చేయవలసి వచ్చింది.

బాలకాండ అయోధ్యాపురవర్ణనలో శ్లేష, యమక, విరోధా భాసాలంకారాలను ప్రయోగించి చేసిన ప్రౌఢతరమైన వర్ణనలు, గర్భవతుల వర్ణన అయోధ్యకాండలో– సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనలు అరణ్యకాండలో – శూర్పణఖ చేసిన సీతా సౌందర్యవర్ణన, రాముని విరహవర్ణన కిష్కింధాకాండలో – వర్ష వర్ణన, సుందరకాండలో – సీతారావణ సంవాద వర్ణన, హనుమ – రాక్షసులతో చేసిన యుద్ధ వర్ణన, యుద్ధకాండ – మొత్తము – మొల్ల తనను కవయిత్రిగా కవిలోకం అంగీకరించడం కోసం శ్రద్ధతో వ్రాసింది అనిపిస్తుంది. బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధాకాండలు పూర్తిగా సంక్షిప్తీకరించిన మొల్ల సుందర యుద్ధ కాండలను – విపులీకరించడంలో ఉద్దేశం తాను యుద్ధవర్ణనలు పురుషకవులతో సాటిగా చేయగలను అని నిరూపించడానికా! అని తోచకమానదు. అయోధ్యకాండను అతిగా సంక్షిప్తీకరించిన మొల్ల యుద్ధకాండను మూడు ఆశ్వాసాలుగా చేసి రచించింది నేర్పుమెరయ. శ్రీరామరాజ్యవైభవాన్ని రెండు సీసపద్యాల్లో మహనీయంగా ప్రదర్శించింది.

తన రామాయణం చదివి సంస్కృతాంధ్ర భాషాపరిజ్ఞానం ఇబ్బడి ముబ్బడిగా సంపాదించుకోవచ్చని నిరూపించింది.

మొల్లకవితా ప్రాగల్భ్యాన్ని గురించి ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు వ్రాసిన విషయాలు ఈ సందర్భంలో అనుసంధించుకోవడం సమంజసం.

"భాష, వ్యాకరణము, ఛందశాస్త్రము, అలంకారశాస్త్రము, నిఘంటువులు" ఏవియు నెఱుగనని 'గోపవరపు శ్రీకంఠ మల్లేశు వరముచేత నెఱికవిత్వంబు చెప్పగా నేర్చికొంటి'నని చెప్పినది మొల్ల. కాని శ్రీకారము చుట్టిన మొట్ట మొదటి పద్యములోని 'సుత్రామ' శబ్ద ప్రయోగము భాషా పరిజ్ఞానమునకు,

పురవర్ణనములోని 'సుమన ఐరావత' సమాస ప్రయోగము వ్యాకరణ శాస్త్ర పరిజ్ఞానమునకు, కవితా చమత్కారము, అలంకారశాస్త్ర పరిజ్ఞానమునకు నిదర్శనములు.

మొల్లరామాయణానికి విలువ కడుతూ ఆచార్య కొర్లపాటివారు "మొల్ల రామాయణము మొల్ల పువ్వంత పరిమాణము. మల్లె పువ్వంత పరిమళము. వాల్మీకి రామాయణమునకు ఆంధ్రీకరణము కాదు. పారాయణ సారగ్రహణము. నారదుడు రామకథను వాల్మీకికి చెప్పుట ప్రకరణము అధ్యాత్మానంద రామాయణములలోని అంశములు కలవు. కథా ప్రారంభములోని అయోధ్యా పురవర్ణనము అంధానుసరణము కాదు. అపూర్వ కవి చమత్కార విలసితము. విరోధాభాసాలంకార విశిష్టము" అన్నారు.

మొల్ల రామాయణం సంక్షిప్తంగా చెప్పదలుచుకుంది. ప్రధానాంశాలను వదలకుండా సమగ్ర సుందరంగా రచించింది. ఆమె రచనలో గద్యపద్యాల సంఖ్య 869. కాండలవారీగా -

| | | |
|---|---|---|
| అవతారిక | - | 24 |
| బాలకాండ | - | 100 |
| అయోధ్యకాండ | - | 43 |
| అరణ్యకాండ | - | 76 |
| కిష్కింధకాండ | - | 27 |
| సుందరకాండ | - | 249 |
| యుద్ధకాండ | - | 351 |

ఈ పద్యసంఖ్యలను పరిశీలిస్తే మొదటి నాలుగు కాండలు సాధ్యమైనంత సంక్షిప్తీకరించిదనీ, సుందర యుద్ధకాండలు కొంత వివరంగా వ్రాసిందనీ గమనించవచ్చు.యుద్ధకాండతప్ప మిగిలిన కాండలన్నీ ఏకాశ్వాస పరిమితాలే. యుద్ధకాండ మూడు ఆశ్వాసాలలో వ్రాసింది.

**చెప్పుమని రామచంద్రుఁడు**
**సెప్పించిన పలుకుమీఁదఁ జెప్పెదనే నె**
**ల్లప్పుడు నిహపరసాధన**
**మిప్పుణ్య చరిత్ర, తప్పు లెంచకుడు కవుల్.** **పీఠిక-13**

రామచంద్రుడు చెప్పమంటే చెప్తున్నాను. ఈ రామకథ ఎల్లప్పుడూ ఇహపరసాధనముగా మానవజాతిని నడిపిస్తోంది - అని ఉదాత్తంగా చెప్తూనే - స్త్రీ కాబట్టి తన కవితలో తప్పులు పట్టవద్దని కోరింది.

మొల్లకి కవితారచన ముఖ్యంగా సంస్కృతం తెలుగు చేసే సందర్భాల్లో రచన ఎలా ఉండాలో మంచి అవగాహన ఉంది.

క. **మును సంస్కృతమ్ముఁ దేటగఁ**
**దెనిగించెడి చోట నేమి దెలియకయుండన్**
**తన విద్యమెఱయ, గ్రమ్మఱ**
**ఘనమగు సంస్కృతముఁజెప్పగా రుచియగునే?** అని తేటతెలుగులో వ్రాసేటప్పుడు మళ్లీ ఘనమగు సంస్కృత ప్రయోగాలు ఎందుకు? అంటూ ప్రశ్నించింది.

**తేనెసోఁక నోరు తీయన యగురీతి**
**తోడ నర్థమెల్లఁ దోచకుండ**
**గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము**
**మూగ చెవిటి వారి ముచ్చటగును.** **పీఠిక-17**

గూఢశబ్దాలతో కూర్చిన కావ్యం మూగ చెవిటివారి ముచ్చటలా ఉంటుందని మొల్ల స్పష్టంగా చెప్పింది.

అసలు తెలుగు కవిత్వం ఎలాఉంటే విబుధులమదికి ఇంపునింపుతుందో మొల్ల వివరంగా చెప్పింది.

క. **కందువ మాటలు, సామెత**
**లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగునకున్**
**బొందై, రుచియై, వీనుల**
**విందై, మఱి కానుపించు విబుధుల మదికిన్.** **పీఠిక-18**

అంటూ తెలుగు నుడికారంతో కూడిన చమత్కారమైన మాటల్లో సామెతలు అందంగా కూర్చి చెప్తే తెలుగు కవిత అందంగా అమరి, రుచిమంతంగా, చెవులకు విందుగా ఉండి పండితుల మనస్సులకు ఎక్కుతుందని వివరంగా చెప్పింది మొల్ల. అదే పద్ధతి అనుసరిస్తూ తన రామాయణం రచించింది.

ఎన్నో రామాయణాలు ఉన్నా తాను మళ్లీ రామకథ వ్రాయడానికి కారణం-

క. **ఆది రఘురాము చరితము**
**నాదరముగ విన్న గ్రొత్తయై, లక్షణ సం**
**పాదమ్మై, పుణ్యస్థితి**
**వేదమ్మై తోచకున్న వెఱ్ఱినె చెప్పన్.** **పీఠిక-19**

అంటూ **"వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"** అనే శ్లోకాన్ని అనుసంధించింది.

లలితమైన తెలుగు భాషలో రచనసాగిస్తూనే వాక్ప్రౌఢి ప్రదర్శించిన పద్యాలు కూడా మొల్ల వ్రాసింది. విఘ్ననాథుని ఆమె ప్రథితవాక్ప్రౌఢికై ప్రస్తుతింతు అంది.

మొల్ల పద్యశిల్పాన్ని గురించి వ్రాస్తూ కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు వెలిబుచ్చిన అభిప్రాయం తెలుసుకోదగ్గది.

"పద్యశిల్పంలో మొల్ల ప్రత్యేకించి కందం విషయంలో శ్రద్ధ తీసుకున్నదా అనిపిస్తుంది. మొల్ల రామాయణంలో 869 పద్యాలు ఉన్నాయి. అందులో ఆమె సుమారు 250 కందాలు వ్రాసింది. అన్ని ఛందాలు ఒక యెత్తు. కందాల అందాలు ఒక యెత్తు. అన్ని కందాలు పంచకల్యాణి గుఱ్ఱాలలాగా మాంచి దిట్టమైన నడకతో కదను త్రొక్కినవే. అసలు ఇంకొక రహస్య మేమిటంటే అన్నికందాలూ వరుసగా చేరిస్తే మొల్లకందరామాయణం అవుతుందేమో అనిపిస్తుంది" – అంటారు.

మా నాన్నగారు శ్రీ ఆంధ్రశేషగిరిరావుగారు వ్రాసిన **"ఆంధ్ర విదుషీమణులు"** అనే గ్రంథంలో–మొల్ల పేరు గురించి, రచన గురించి–

"పుణ్యగంధము వెదజల్లు పువ్వుపేరు ధరించి పుణ్యగ్రంథమగు రామాయణము రచియించిన ఈ విదుషీమణికి నోచి పుట్టిన తెలుగు నేల అదృష్టము కొలదులు వెట్ట దరముగానిది. సుగంధ సంవాసిత పుష్పనామధారిణి ఐనందుకు మొల్ల సౌరభము వెదజల్లు చక్కని కవిత్వము చెప్పి ఆంధ్ర సారస్వతమున శాశ్వత స్థానము సంపాదించినది."

మా నాన్నగారి వద్ద మొల్ల రామాయణం చదువుకోవడం వల్ల మొల్లకవిత్వంమీద నాకు అభిమానం ఏర్పడింది. మా గురువుగారు ఆచార్య యస్వీ జోగారావుగారు ఒక సందర్భంలో 'మొల్ల రామాయణానికి వ్యాఖ్యానం వ్రాయి' అని నిండు మనసుతో ఆశీర్వదించారు.

మొల్ల రామాయణం 20వ శతాబ్ది తొలినాళ్లలో వీధిబడులలో పాఠ్యాంశంగా ఉండి విద్యార్థులకు తెలుగు భాషాపరిజ్ఞానం కలిగించేదని మా నాన్నగారు చెప్తూ ఉండేవారు. ఇంతవరకు మొల్ల రామాయణానికి వ్యాఖ్యానం ఎవరూ వ్రాయకపోవడం, వ్రాసే అదృష్టం నాకు లభించడం శ్రీరాముని ఆశీస్సులుగా భావిస్తున్నాను.

తిరుమల తిరుపతి దేవస్థానం, ప్రచురణ విభాగం, ప్రత్యేకాధికారి ఆచార్య రేమిల్ల వేంకట రామకృష్ణ శాస్త్రి, ఎమ్.ఏ., పిహెచ్.డి. గారు మొల్ల రామాయణానికి వ్యాఖ్యానం వ్రాసే అవకాశం కలిగించినందుకు వారికి హృదయపూర్వక ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ప్రచురణగా ఈ మొల్ల రామాయణం వెలువడడం ఆనందదాయకమైన విషయం.

**ఓమ్ నమో వేంకటేశాయ!**

**కోలవెన్ను మలయవాసిని**
శుభకృత్ – వైశాఖము – అక్షయ తృతీయ
03-05-2022

# విషయసూచిక


| | |
|---|---|
| తొడిమ | |
| బాలకాండ | 1 – 74 |
| అయోధ్యాకాండ | 75 – 96 |
| అరణ్యకాండ | 97 – 129 |
| కిష్కంధాకాండ | 130 – 144 |
| సుందరకాండ | 145 – 256 |
| యుద్ధకాండ – ప్రథమాశ్వాసం | 257 – 317 |
| యుద్ధకాండ – ద్వితీయాశ్వాసం | 318 – 356 |
| యుద్ధకాండ – తృతీయాశ్వాసం | 357 – 429 |
| అనుబంధములు | 430 – 433 |

# బాలకాండ

## అవతారిక

**శ్రీమహిమాభి రాముఁడు, వశిష్ఠ మహాముని పూజితుండు, సు**
**త్రామవధూ కళాభరణ రక్షకుఁ దాశ్రిత పోషకుండు, దూ**
**ర్వామల సన్నిభాంగుఁడు, మహా గుణశాలి, దయాపరుండు, శ్రీ**
**రాముఁడు ప్రోచు భక్తతతి రంజిలు నట్లుగ నెల్లకాలమున్.** 1

**ప్రతి :** శ్రీమహిమ+అభిరాముఁడు=అధికమయిన సంపదలతో మనోహరమైనవాడు, వశిష్ఠమహాముని పూజితుండు=వశిష్ఠ మహామునిచే పూజింపబడినవాడు, వశిష్ఠమహామునిని పూజించువాడు, సుత్రామ వధూకళాభరణ రక్షకుఁడు-సుత్రామవధూ=ఇంద్రుని భార్య అయిన శచీదేవికి, కళాభరణరక్షకుడు= సౌభాగ్యాన్ని, అలంకరణలను రక్షించేవాడు, ఆశ్రితపోషకుండు=తనను ఆశ్రయించిన వారిని దయతో పోషించేవాడు, దూర్వామల సన్నిభాంగుడు=స్వచ్ఛమైన గరికచేలవంటి వర్ణముగల శరీరము గలవాడు, శ్రీరాముఁడు=శ్రీరాముడు, భక్తతతిన్=భక్తుల సమూహమును, రంజిలునట్లుగన్=ఆనందించే విధముగా, ఎల్లకాలమున్=అన్నివేళలా, ప్రోచు=కాపాడుగాక!

**తా :** గొప్ప సంపదతో ఒప్పేవాడు, తన కులగురువయిన వశిష్ఠమహామునిని పూజించేవాడు, ఇంద్రుని ఇల్లాలి సౌభాగ్యాన్ని కాపాడేవాడు, ఇంద్రునిపైకి రాక్షసులు దండిత్తి వస్తే తాను తోడుగా ఉండి రాక్షసుల్ని సంహరించి ఇంద్రుణ్ణి కాపాడేవాడు. ఇంద్రుని భార్యసౌభాగ్యాన్ని కాపాడడం అంటే - ఇంద్రుణ్ణి క్షేమంగా ఉండేలా చేయడమే, అంతేకాక తనను ఆశ్రయించిన వారిని చక్కగా కాపాడి రక్షించి పోషించేవాడు, సస్యశ్యామలమైన శరీరచ్ఛాయ గలవాడు, గొప్ప గుణములు కలవాడు, కరుణాసముద్రుడు, అయిన శ్రీరాముడు తన భక్తసమూహాన్ని ఎల్లవేళలా సంతోషించే విధంగా కాపాడుగాక!

దూర్వామలసన్నిభాంగుడు=దుర్వా అంటే గరిక, నిర్మలమయిన గరిక దట్టంగా పెరిగినప్పుడు- ఒకరకమైన - చిక్కని ఆకుపచ్చని రంగులో ప్రకాశిస్తూ ఉంటుంది.

రాముడు నీలమేఘశ్యాముడు అనే వర్ణన సాధారణంగా వింటూ ఉంటాం. అలాగే సస్యశ్యామలమనే వర్ణన కూడా శ్రీరామునికి ప్రయోగించింది, సస్యశ్యామలము అంటే పంటలపచ్చదనం. సస్యము అని సాధారణంగా కాక -'గరిక'ను ప్రత్యేకంగా చెప్పి "దూర్వామలసన్నిభాంగుడు" అనే నూతన ప్రయోగం చేసింది కవయిత్రి, ఒక పవిత్ర భావాన్ని ప్రోది చేసింది.

**ఉ. శ్రీనగమందిరుం, డమరసేవితుఁ దర్ధశశాంక మౌళి, స**
**న్మౌని మనః పయోజ దిననాయకుఁ డబ్జభవామరేశ్వర**

**ధ్యాన లసత్ప్రసన్నుఁ డతి ధన్యుఁడు, శేషవిభూషణుండు, వి**
**ద్యానిధి, మల్లికార్జునుఁడు, తానిదు మాకు శుభంబులొప్పగన్. 2**

**ప్రతి :** శ్రీనగమందిరుండు=శ్రీశైలము మందిరముగా (ఇల్లుగా) గలవాడు, అమర సేవితుఁడు=దేవతలచేత సేవింపబడేవాడు, అర్ధశశాంకమౌళి=చంద్రునిలో సగాన్ని (అర్ధచంద్రుణ్ణి) తలమీద ధరించినవాడు, చంద్రకిరీటుడు, సోమశేఖరుడు, చంద్రరేఖను తలలో పూవువలెదాల్చినవాడు అనిశివుని వర్ణనలు. మొల్ల అర్ధశశాంక – అంది. చంద్రరేఖ – విదియ, తదియనాటి చంద్రుని ధరించినట్లు పౌరాణికోక్తి, అర్ధచంద్రుడు అంటే – అష్టమినాటి చంద్రుడుకావాలి, సన్మౌనిమనఃపయోజ దిననాయకుఁడు=ఉత్తమమునుల మనస్సులనే తామర పువ్వులకు దిననాయకుఁడు అంటే సూర్యుడు. సూర్యోదయం కాగానే తామరలు విచ్చుకున్నట్లే– ఈశ్వరుడనే సూర్యుణ్ణి తలుచుకోగానే మునుల మనస్సులు అనే తామరలు వికసిస్తాయి అని భావము, అబ్జభవ=తామరపూవు నుండి పుట్టినవాడు – బ్రహ్మ, అబ్జ+భవ–అబ్జ=తామరపువ్వు – నీటినుండి పుట్టినది. అప్=నీరు–జ=పుట్టినది అబ్జ, అబ్జభవుడు – తామరపువ్వు నుండి – భవుఁడు=పుట్టినవాడు బ్రహ్మ, అమరేశ్వరుఁడు=దేవతలకుప్రభువు–ఇంద్రుడు, ధ్యాన లసత్ప్రసన్నుఁడు=ధ్యానముచే ప్రకాశించి ప్రసన్నమగువాడు, అతిధన్యుఁడు=మిక్కిలి ధన్యుడైనవాడు, శేషవిభూషణుండు=శేషుడు అనే పామును అలంకారముగా ధరించువాడు, విద్యానిధి=విద్యలకు నిధియైనవాడు, మల్లికార్జునుఁడు=మల్లికార్జునుడు, అను పేరుగల శ్రీశైలములోని శివుడు, మాకు శుభంబులొప్పగన్=బాగుగా శుభాలు కలుగునట్లు మాకు, తానిదు–తాను+ఇదు=తాను ఇచ్చుగాక!.

**తా :** శ్రీశైలంలో ఉండేవాడు, దేవతలచే పూజింపబడేవాడు, చంద్రుని తలమీద ధరించేవాడు, మునుల మనస్సులకు ఆనందం కలగజేసేవాడు, తనను ధ్యానించే బ్రహ్మఎడల, ఇంద్రుని ఎడల ప్రసన్నమయ్యేవాడు, ధన్యుడు, నాగభూషణుడు, విద్యానిధి అయిన మల్లికార్జునుడు మాకు శుభములను ఇచ్చుగాక!

**విశే :** శ్రీశైలంలో వెలసిన శివుని పేరు మల్లికార్జునుఁడు, విద్యానిధి అయిన మల్లికార్జునుడు– శైవపండితత్రయములో ఒకడు, అతనిని కూడా ఈ సందర్భంలో మొల్లస్మరించింది, అని చెప్పవచ్చు.

**ఉ. తెల్లని పుండరీకముల తేజము మెచ్చని కన్నుదోయితో**
**నల్లని శక్రనీలరుచి నవ్వెడు కోమల దేహకాంతితో**
**నల్లినఁ బిల్లఁగ్రోవి కర మంచిత సంజ్ఞల నింపునింపఁగా**
**గొల్లతలన్ విరాళి తగఁ గొల్పెడు కృష్ణుఁడు బ్రోచుఁ గావుతన్. 3**

**ప్రతి :** తెల్లని పుండరీకముల=తెల్లతామరపూవుల, తేజము=ప్రకాశమును, మెచ్చని=మెచ్చుకోని, కన్నుదోయితో=రెండు కన్నులతో, నల్లని=నల్లని, శక్రనీలరుచి=ఇంద్ర నీలమణికాంతిని, నవ్వెడు=హాస్యము చేయు, కోమలదేహకాంతితో=సుకుమారమయిన శరీరపుకాంతితో, అల్లిన=కూర్చిన, (పట్టుకున్న), పిల్లన్ గ్రోవికరము=వేణువు గలచేయి, అంచిత=విశేషమయిన, సంజ్ఞలన్=సంకేతాలతో, ఇంపునింపగా= అందాన్ని

కలిగించగా, గొల్లతలన్=గోపకాంతలందు, విరాళి=విరహతాపాన్ని, తగన్=మిక్కిలిగా, కొల్పెడు=కలిగించునట్టి, కృష్ణుడు=శ్రీకృష్ణుడు, ప్రోచుcగావుతన్=రక్షించుగాక! కాపాడుగాక!

**తా :** తెల్లతామరపువ్వుల కాంతిని మించిన స్వచ్ఛమైన కాంతిగలిగిన కన్నులతో, ఇంద్రనీలమణి ప్రకాశాన్ని మించిన ప్రకాశము గలిగి కోమలమైన శరీరచ్ఛాయతో, చేతిలో పిల్లనగ్రోవిని పట్టుకుని విశేషమయిన సంకేతాలతో ఆనందాన్ని కలిగిస్తూ గొల్లభామలకు విరహతాపం కలిగించే శ్రీకృష్ణుడు కాపాడుగాక!

**ఉ.** **మించి సమస్తలోకములు మిన్నక తాc దన నేర్పుమీఱ ని**
**ర్మించి, ప్రగల్భతన్ మెఱసి, మేలును గీడును బ్రాణికోట్లు సే**
**వించ ఘటించి శాస్త్రములు, వేదములుం గొనియాడు చుండు నా**
**కాంచన గర్భుc డిచ్చు నధికంబుగ నాయువు నీప్సితార్థముల్** **4**

**ప్రతి :** మించి=అతిశయించి, సమస్తలోకములు=అన్నిలోకాలు, మిన్నక=అప్రయత్నముగా, తాcదన–తాన్‌దన=తాను తనయొక్క, నేర్పుమీఱ=నైపుణ్యముతో, నిర్మించి=సృష్టించి, ప్రగల్భతన్=ప్రతిభతో, మెఱసి=ప్రకాశించి, మేలును కీడును=మంచి, చెడు, ప్రాణికోట్లు=సమస్తజీవులు, సేవించన్=కొలువగా, ఘటించి=కూర్చి, శాస్త్రములు=శాస్త్రములు, వేదములున్=వేదాలు, కొనియాడుచుండు=కీర్తించుచుండగా, ఆ కాంచనగర్భుcడు=ఆ బ్రహ్మదేవుడు, ఆయువు=ఆయుర్దాయము, ఈప్సితార్థముల్=కోరినట్టికోరికలు, అధికంబుగా=ఎక్కువగా, ఇచ్చున్=ఇచ్చును.

**తా :** తనకు గల నేర్పునంతా ప్రకటించి లోకాలనన్నింటిని సృష్టించి, ప్రాణికోట్లకు మంచిచెడులు కల్గిస్తూ, వేదాలచేత, శాస్త్రాలచేత కొనియాడబడే బ్రహ్మదేవుడు అధికమయిన ఆయుస్సును, కోరిన కోరికలను ఇచ్చుగాక!

**సీ.** **చంద్రఖండకలాపుc జారు వామన రూపుc**
**గలిత చంచల కర్ణుc గమల వర్ణు**
**మోదకోజ్జ్వల బాహు, మూషకోత్తమ వాహు,**
**భద్రేభ వదను, సద్భక్త సదను**
**సన్ముని స్తుతిపాత్రు, శైల సంభవపుత్రు,**
**ననుదినామోదు, విద్యాప్రసాదుc,**
**బరమదయాభ్యాసుc బాశాంకుశోల్లాసు,**
**నురుతరఖ్యాతు, నాగోపవీతు,**

**తే.** **లోకవందిత గుణవంతు, నేకదంతు**
**నతుల హేరంబు, సత్కరుణావలంబు**
**విమల రవికోటి తేజు, శ్రీవిఘ్నరాజుc**
**బ్రథిత వాక్ప్రౌఢికై యెప్డు ప్రస్తుతింతు.** **5**

**ప్రతి :** చంద్రఖండకలాపున్=చంద్రకళను అలంకరించుకొన్నవాని, చారువామన రూపున్=అందమైన పొట్టిరూపము గలవాని, కలిత చంచలకర్ణున్=కదులుతున్న చెవులు గలవాని, కమలవర్ణున్=తామరపువ్వు వంటి రంగుతో ఒప్పేవాని, మోద కోజ్జ్వల బాహున్=మోదక+ఉజ్జ్వలబాహున్=ఉండ్రాళ్లతో కూడి ప్రకాశిస్తున్న చేయి కలవాని, మూషకోత్తమవాహున్=ఉత్తమమయిన ఎలుక వాహనముగా గలవాని, సద్భక్తసదనున్=మంచి భక్తులయందు వసించువాని, మంచిభక్తుల మనస్సులే ఇల్లుగా గలవాని, సన్మునిస్తుతిపాత్రున్=ఉత్తమ మునుల పొగడ్తలకు తగినవాని, శైల సంభవపుత్రున్=గిరికుమారి అయిన పార్వతి కొడుకును, అనుదినామోదున్=ప్రతిరోజు సంతోషంగా ఉండేవాని, విద్యాప్రసాదున్= విద్యలను ఇచ్చువాని, పరమదయా భ్యాసున్=విశేషమయిన దయను అభ్యాసం చేస్తూ ఉండేవాని (దయ కలవాడు అని తాత్పర్యము), పాశాంకుశోల్లాసున్=పాశ+అంకుశ+ఉల్లాసు=పాశము అంకుశము అనే ఆయుధాలతో ప్రకాశించేవాని, ఉరుతరఖ్యాతున్=గొప్పఖ్యాతి గలవాని, ప్రసిద్ధిగలవాని, నాగోపవీతున్=పాము యజ్ఞోపవీతముగా గలవాని, లోకవందితగుణవంతున్= లోకముచే పూజింపబడే గుణము కలవాని, ఏకదంతున్=ఒకే దంతము కలవాని, అతులహేరంబున్=సాటిలేని శౌర్యగర్వము కలవాని, సత్కరుణావలంబున్=మంచి కరుణకు ఆధారమయినవాని, విమలరవి కోటితేజున్= స్వచ్ఛమయిన కోటి సూర్యుల తేజస్సు కలవాని, శ్రీవిఘ్నరాజున్= శ్రీగణనాథుని, ప్రథితవాక్ప్రౌఢికై= అధికమయిన మాటల నేర్పుకొరకు, ప్రస్తుతింతు=కొనియాడుదును.

**తా :** శశిరేఖాభరణుడు, గుజ్జురూపువాడు, కదలాడే చెవులు, తామరల వంటి రంగు, చేతిలో కుడుము, ఎలుక వాహనము, ఏనుగుముఖము కలిగి, భక్తులలో నివసించేవాడు, మునులచే పొగడబడేవాడు, పార్వతీదేవిపుత్రుడు, నిత్యసంతోషి, విద్యలను ఇచ్చేవాడు, కరుణాశాలి, పాశము, అంకుశము ఆయుధములుగా ధరించేవాడు, గొప్పఖ్యాతి గలవాడు, నాగ యజ్ఞోపవీతము గలవాడు, ప్రజలు పూజించే గుణాలు కలవాడు, ఏకదంతుడు, పరాక్రమవంతుడు, దయాశాలి, కోటి సూర్యప్రకాశుడు అయిన విఘ్నరాజును కొనియాడదగిన మాటల నైపుణ్యం కోసం ప్రస్తుతిస్తాను.

**విశే :** పరంపరగా తెలుగునాట వ్యవహారంలోఉన్న వినాయకుని స్తుతించే పద్యంలో– 'తొండము నేకదంతమును తోరపుబొజ్జయు – 'కోరిన విద్యల కెల్లనొజ్జయై యుండెడు' గణాధిపతిని కొలుస్తాను అని ఉంది. 'శైలసంభవపుత్రు' దగ్గర శైలరాడ్దౌహిత్రు అనే పాఠాంతరం ఉంది. 'ప్రథిత వాక్ప్రౌఢి సేవించి ప్రస్తుతింతు' అనే పాఠాంతరం ఉంది. ఆ భావాన్ని గ్రహించి మొల్ల–ప్రథిత వాక్ప్రౌఢి అనే విద్యను – ఈ గురువును కోరుకుంటూ స్తుతించింది.

**చ.** **కరి ముఖుఁడుం గుమారుఁడు వికారపుఁ జేఁతల ముద్దు సూపుచున్**
**గరువులు వాఱుచు న్నెదుట గుట్టలు దాటుచుఁ జన్నుదోయితో**
**శిరములు రాయుచుం గబరిఁజేర్చిన చంద్రునిఁబట్టి తీయఁగాఁ**
**గరములఁజాఁప నవ్వెదు జగమ్ములతల్లి శుభంబు లీవుతన్.** **6**

**ప్రతి :** కరి=ఏనుగు, ముఖుండున్=ముఖముగలవాడు, వినాయకుడు (గజాననుడు), కుమారుఁడు= కుమారస్వామి, వికారపుచేతలన్=అల్లరిపనులతో, ముద్దుచూపుచున్=ముద్దువచ్చేలా, గురువులు వాఱుచున్= వేగంగా పరుగులు పెడుతూ, గుట్టలు=చిన్నచిన్న కొండలు, దాటుచున్=దాటుతూ శిరములు=వారి తలలు, చన్నుదోయితో=తల్లిపాలిండ్లతో, రాయుచున్=రాస్తూ, కబరిన్=కొప్పులో, చేర్చిన చంద్రునిన్=పెట్టుకున్న చంద్రుణ్ణి, పట్టితీయఁగాన్=పట్టుకుని తీయడానికి, కరములన్ చాఁపన్=చేతులుచాచగా, నవ్వెడు=ఆనందంతో నవ్వేటి, జగముల తల్లి=లోకాలన్నిటికి తల్లి అయిన పార్వతి, శుభంబులు=శుభాలు, ఈవుతన్=ఇచ్చునుగాక!

**ప్రతి :** పార్వతీదేవికి వినాయకుడు, కుమారస్వామి ఇద్దరు పిల్లలు. వాళ్లిద్దరూ రకరకాలయిన అల్లరి పనులు చేస్తూ ముద్దువచ్చేలా ఆడుకుంటున్నారు. వారి నివాసం కైలాసగిరి. ఆ కొండమీద చిన్న చిన్నకొండలు, గుట్టలు ఉన్నాయి. ఆగుట్టలు దాటుతూ, కొండలమీదనుండి గెంతుతూ అటూ ఇటూ పరుగులు పెడుతూ ఆడుకుంటున్నారు. అంతలోనే తల్లి ఒడిలో చేరి ఆమె చన్నుదోయిని తమ శిరస్సులతో రాస్తున్నారు. తల్లి తలలో అలంకరించుకున్న చంద్రుణ్ణి పట్టితీయాలని, చేతులు చాపుతున్నారు. పోటీపడి ఇలా బాల్యచేష్టలు నెఱపుతున్న తన పిల్లలను చూచి నవ్వే జగదంబ–జగములన్నిటికి తల్లి–అందరికీ శుభములను ఇచ్చుగాక!

**విశే :** మొల్ల ఒక మనోహర సన్నివేశాన్ని భావించిస్తుతించింది.

(గురువులు వాఱుచు స్సరిగ గుట్టలు)–పాఠాంతరము.

**ఉ.** **సామజయుగ్మ మింపలరఁ జల్లనినీరు పసిండికుండలన్**
**వేమఱు వంచి వంచి కడువేడుకతో నభిషిక్తఁ జేయగాఁ**
**తామరపువ్వు గద్దియ ముదంబున నుండెడి లోకమాత యా**
**కాముని తల్లి సంపద నఖండముగా నిడు మాకు నెప్పుడున్.** **7**

**ప్రతి :** సామజయుగ్మము=ఏనుగులజంట, ఇంపలరన్=శోభాయమానంగా, చల్లని నీరు=చల్లని నీటిని, పసిండి కుండలన్=బంగారపు బిందెలతో, వేమఱు=అనేక పర్యాయములు, చాలాసార్లు, వంచివంచి= వంచుతూ, కడువేడుకతోన్=మిక్కిలి ఆనందముతో, అభిషిక్తన్=స్నానమాచరించిన దానిగా, చేయగాన్= చేయగా, తామరపువ్వు గద్దియన్=తామరపువ్వు అనే సింహాసనము మీద, ముదంబునన్=ఆనందంతో, ఉండెడి=కూర్చుని ఉండెడి, లోకమాత=లోకములన్నిటికి తల్లియైన లక్ష్మీదేవి, యా కామునితల్లి=ఆ మన్మథుని తల్లి, సంపదన్=సంపదను, మాకున్+ఎప్పుడున్=మాకు ఎల్లప్పుడు.

**తా :** రెండు ఏనుగులు రెండుప్రక్కల నిలచి బంగారు కుండలతో చల్లని నీరు తెచ్చి అనేక పర్యాయాలు వంచివంచి పోస్తూ ఎంతో వేడుకతో అభిషేకం చేయగా (అంటే సహస్రఘటాభిషేక కార్యక్రమం ముగించుకుని) చక్కగా అలంకరించుకొని తామరపువ్వు గద్దెమీద ఆనందంతో కూర్చునే లోకమాత, మన్మథుని తల్లి అయిన లక్ష్మీదేవి మాకుఎల్లప్పుడూ సంపదలను ఇచ్చుగాక!

**విశే :** (కాముని తల్లి లోకముఁ గాచు కృపామతి నెల్ల కాలమున్) – పాఠాంతరము

**ఉ. మేలిమి మంచుకొండ నుపమింపఁగఁ జాలిన యంచనెక్కి, వా**
**హ్యాళి నటించి వచ్చు చతురాస్యు నెదుర్కొని నవ్వుదేరగా**
**వాలిక సోగకన్నుల నివాళి యొనర్చి, ముదంబు గూర్చు వి**
**ద్యాలయవాణి శబ్దముల నర్థములన్ సతతంబు మాకిడున్. 8**

**ప్రతి :** మేలిమి=శ్రేష్ఠమైన, మంచుకొండన్=మంచుకొండఅయిన హిమాలయంతో, ఉపమింపగఁ జాలిన=పోల్చదగిన, అంచన్=హంసను, ఎక్కి=ఎక్కి, వాహ్యాళిన్= విహారాన్ని, నటించి=సంచరించి, వచ్చు=వచ్చెడి, చతురాస్యున్=నాలుగు ముఖాలు గలిగిన బ్రహ్మదేవుని, ఎదుర్కొని=ఎదురువెళ్ళి, నవ్వుదేరగా= నవ్వుతూ, వాలిక= వాడియైన, సోగకన్నుల=అందమయిన కన్నులతో, నివాళియొనర్చి=చూపులతో హారతి ఇచ్చి, ముదంబుగూర్చు=ఆనందాన్ని కూర్చెడి, విద్యాలయ=విద్యలకునెలవైన, వాణి=సరస్వతీదేవి, శబ్దములన్=పదాలను, అర్థములన్=అర్థాలను, సతతంబు= ఎల్లప్పుడు, మాకు, ఇడున్=ఇచ్చును గాక!

**తా :** తెల్లని మంచుకొండతో పోల్చదగిన తెల్లటి రాజహంసను ఎక్కి విహారానికి వెళ్లివచ్చిన భర్తకు ఎదురువెళ్లి చిరునవ్వుతో, తన సోగకళ్లతో(చూపులతో) హారతి ఎత్తి సాదరంగా ఆహ్వానించి ఆనందాన్ని కూర్చే విద్యలకు నెలవయిన సరస్వతీదేవి, మాకు నిరంతరము, శబ్దాలను, అర్థాలను ఇచ్చునుగాక!

ఇంతవరకు మొల్ల ఇష్టదేవతాస్తుతి చేసింది. ఇక – సంస్కృతాంధ్ర మహాకవిస్తుతి.

**సీ. సురసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి**
**నఖిలవేదాగమావాసు వ్యాసు**
**ఘోరాంధకార ప్రభారవి భారవి**
**సత్కాంతిహిమకరశ్లాఘు మాఘు**
**వివిధకళాన్విత విఖ్యాతి భవభూతిఁ**
**బ్రకటకార్యధురీణు భట్టబాణు**
**మానినీలోకసమ్మదముద్రు శివభద్రుఁ**
**గవితారసోల్లాసుఁ గాళిదాసు**

**తే. స్తుతగుణోద్దాము నాచనసోము భీము**
**నవ్యమంజులవాగ్ధుర్యు నన్నపార్యు**
**రసికుఁడై నట్టి శ్రీనాథు రంగనాథు**
**దిక్కకకవిరాజును నుతించి ధీని మించి. 9**

**ప్రతి :** సురసన్నుత జ్ఞానున్=దేవతల చేత కొనియాడబడిన జ్ఞానముకలవాడు, సువివేకి=మంచివివేకము కలిగినవాడు అయిన, వాల్మీకిన్=వాల్మీకి మహర్షిని, అఖిలవేదాగమ=సమస్తమైన వేదాలకు శాస్త్రాలకు, ఆవాసు=ఆవాసమైన (నిలయమైన) వ్యాసున్=వ్యాసమహర్షిని, ఘోరాంధకార=భయంకరమైన చీకటికి,

ప్రభారవి=కాంతిగల సూర్యునివంటి, భారవిన్=భారవి అనుకవిని, సత్కాంతి=మంచికాంతితో, హిమకరశ్లాఘు= చంద్రునివంటి పొగడదగిన, మాఘున్=మాఘమహాకవిని, వివిధ=అనేక విధములయిన, కళానీతి=కళలలోను, నీతిలోను, విఖ్యాతు=ప్రసిద్ధి కలిగిన, భవభూతిన్=భవభూతి అనే కవిని, ప్రకట= ప్రసిద్ధమయిన, కావ్యధురీణు= కావ్యనిర్మాణంలో సమర్థుడయిన, భట్టబాణు=బాణభట్టు అనేకవిని, మానినీలోక=అభిమాన వతులయిన స్త్రీ సమూహానికి, సమ్మదభద్రు=ఆనందాన్ని కలిగించిన, శివభద్రున్=శివభద్రుడనే కవిని, కవితారసోల్లాసు= కవితారసంతో సంతోషింప చేసేవాడు, కాళిదాసున్=కాళిదాసు అనేకవిని, స్తుతగుణోద్దాము=పొగడబడిన గొప్ప గుణవంతుడు, నాచనసోము=నాచనసోముని, భీము=వేములవాడ భీమకవిని, నవ్య=కొత్తవైన, మంజుల= మనోహరమైన, వాగ్ధుర్యు=వాక్కుల సారముకలవాని, నన్నపార్యు=నన్నయభట్టును, రసికుఁడైనట్టి= రసికుడయిన, శ్రీనాథు రంగనాథు, తిక్కకవిరాజు=కవిరాజయిన తిక్కనను, నుతించి=కొనియాడి, ధీని= బుద్ధివిశేషములో, మించి=అతిశయించి.

**తా :** దేవతల చేతకొనియాడబడిన జ్ఞానముతో సువివేకి అయిన, రామాయణము రచించిన వాల్మీకిని; అఖిల వేదాలు, ఆగమాలు నివాసంగా గల వ్యాసమహర్షిని. (భారత భాగవతాలు, అష్టాదశపురాణాలు), భయంకరమైన చీకటిని ఛేదించి తనకిరణాలతో వెలుగును, నింపే సూర్యునివంటి భారవిని– (కిరాతార్జునీయము). విశేషమైన కాంతిని ప్రసరించే చంద్రుణ్ణి మెచ్చేమాఘకవిని. (శిశుపాలవధ) వివిధ కళలలో, నీతిలో విఖ్యాతుడైన భవభూతిని (ఉత్తరరామచరిత్ర, మహావీరచరిత్ర – నాటకాలు). ప్రకటకావ్యధురీణుడైన భట్టబాణుణ్ణి (కాదంబరి–గద్యకావ్యం) మానినీలోకానికి సమ్మదభద్రుడైన శివభద్రుణ్ణి.

రఘువంశాది కావ్యాలు, అభిజ్ఞానశాకుంతలము మొదలయి నాటకాలు వ్రాసిన కాళిదాసుని స్తుతించిన తరువాత మొల్ల ఉత్తరహరివంశం వ్రాసిన నాచనసోముని, రాఘవపాండవీయమనే ద్వ్యర్థికావ్యం వ్రాసినట్లు ప్రసిద్ధి గల వేములవాడ భీమకవిని, నవ్యమంజుల వాగ్ధుర్యుడయిన నన్నయ్య భట్టుని, రసికుడైన శ్రీనాథుణ్ణి, రంగనాథుణ్ణి, కవులలో రాజయిన తిక్కనను నుతించి బుద్ధికి పదును పెట్టుకుని–కావ్యరచనకు పూనుకున్నది.

**విశే :** శివభద్రుడు అనే కవిఏకావ్యం వ్రాసాడో తెలియరాలేదు. ఈ కవిని సంస్కృత కవులు ఆంధ్రకవులు కూడా పూర్వకవిస్తుతిలో స్తుతించారు. తెలుగు కవుల్లో శ్రీనాథుడు, పెద్దన కూడా ఈ కవిని స్తుతించారు.

**క.** **తొల్లిటి యిప్పటి సత్కవి**
**వల్లభులను రసిక వినుత వాగ్విభవకళా**
**మల్లులఁ గవితా రచనల**
**బల్లిదులైనట్టి ఘనుల భక్తిగఁ దలఁతున్.** **10**

**ప్రతి :** తొల్లిటి=పూర్వకాలపు, ఇప్పటి=సమకాలపు, సత్కవివల్లభులను ఉత్తమకవి శ్రేష్ఠులను రసికులచేత పొగడబడిన, వాగ్విభవ=మాటలవైభవము అనే, కళామల్లులన్=కళలలో ఆరితేరినవారిని, కవితారచనల=

కవిత్వము రచించుటలో, బల్లిదులైనట్టి=నేర్పరులయినట్టి, ఘనుల=గొప్పవారిని, భక్తిగన్=భక్తితో, తలతున్=తలచుకొంటాను.

**తా :** పూర్వ కవులను, ఇప్పటి అంటే తనకాలం నాటి మంచి కవులను, రసికులు మెచ్చేవిధంగా మాటలు కూర్చే కళలో నైపుణ్యం గలవారిని, కవితారచనలో శక్తిమంతులయిన వారినందరినీ భక్తితో స్మరిస్తాను.

**క. గురు లింగ జంగ మార్చన**
**పరుఁడును, శివభక్తి రతుఁడు, బాంధవ హితుఁడున్,**
**గురుఁ డాతుకూరి కేసయ**
**వరపుత్రిని మొల్లయనఁగ వఱలిన దానన్. 11**

**ప్రతి :** గురులింగ జంగమ=గురువును, లింగాన్ని, జంగమరూపంలో ఉన్నశివ భక్తుల్ని, అర్చన పరుఁడును=అర్చించే విషయంలో శ్రద్ధ కలవాడు, శివభక్తిరతుఁడు=శివభక్తిలో పారవశ్యం పొందేవాడు, గురుఁడు=తండ్రి అయిన, ఆతుకూరికేసయ, వరపుత్రిని=వరము వల్ల పుట్టిన కూతురిని, శ్రేష్ఠురాలైన కూతురు, మొల్లయనగ=మొల్ల అనేపేరుతో, వఱలినదానన్=ప్రవర్తిల్లుచున్నదానను.

**తా :** గురువును, లింగాన్ని, జంగముల్ని (శివభక్తులు) పూజించడంలో శ్రద్ధకల వాడు, శివభక్తి తత్పరుడు, బంధువులకు మేలు చేసేవాడు, అయినట్టి ఆతుకూరి కేసయకు మంచి కూతురుగా లోకంలో వ్యవహరింపబడుతూ ఉన్నాను అని మొల్ల తన తండ్రిని ముందుగా గౌరవంగా పరిచయం చేసింది. ఆ తరువాత మొల్ల తన కవితారచన గురించి వివరిస్తున్నది.

**సీ. దేశీయపదములు దెనుఁగులు సాంస్కృతుల్**
**సంధులు ప్రాజ్ఞుల శబ్దవితతి**
**శయ్యలు రీతులుఁ జాటుప్రబంధంబు**
**లాయా సమాసంబు లర్థములును**
**భావార్థములుఁ గావ్యపరిపాకములు రస**
**భావచమత్కృతుల్ పలుకుసరవి**
**బహువర్ణములును విభక్తులు ధాతుల**
**లంకృతిచ్ఛందో విలక్షణములుఁ**

**తే. గావ్యసంపదక్రియలు నిఘంటువులును**
**గ్రమములేవియు నెఱుఁగవిఖ్యాత గోప**
**వరపు శ్రీకంఠ మల్లేశువరము చేత**
**నెఱిఁ గవిత్వంబుఁజెప్పఁగా నేర్చికొంటి. 12**

**ప్రతి :** దేశీయపదములు=దేశంలోవాడుకలో ఉన్నమాటలు, తెనుఁగులు= తెలుగుమాటలు, సాంస్కృతుల్= సంస్కృత పదాలు, సంధులు=తెలుగు, సంస్కృత సంధులు, ప్రాజ్ఞుల శబ్దవితతి=పండితులు ప్రయోగించిన శబ్దసమూహము, శయ్యలు=పదాలకూర్పులు, రీతులు=వైదర్భీ, గౌడీ మొ॥ కావ్యరచనా పద్ధతులు, చాటు ప్రబంధంబులు=చమత్కారమైన కల్పనలు, ఆ యా సమాసంబులు=ద్వంద్వ, బహుబ్రీహి, కర్మధారయం వంటి సమాసాలు, అర్థదృష్టి=అర్థము మీద చూపు, భావార్థము=చక్కని భావాలతో కూడిన అర్థాలు, కావ్యపరిపాకములు=దాక్ష, కదళీ, నారికేళాదిపాకాలు, రసభావ చమత్కృతుల్=వీరము, శృంగారమువంటి రసాల చమత్కారాలు, పలుకుసరవి=మాటలుకూర్పు, బహువర్ణములును=పరుష, కోమల, మధ్యస్థవర్ణాలు, విభక్తులు=నామవిభక్తులు, క్రియావిభక్తులు, ధాతులు=క్రియామూలరూపాలు, అలంకృతి=అలంకారాలు, (శబ్ద, అర్థ అలంకారాలు), ఛందోవిలక్షణములున్=ఛందస్సులోని విశేషమైన లక్షణాలు, కావ్యసంపద=పూర్వ కవులు వ్రాసిన వివిధ కావ్యాలు, క్రియలు=క్రియలు, నిఘంటువులును=శబ్దముల అర్థములు తెలియజేయునవి, క్రమములు=పద్ధతులు, ఏవియు నెఱుఁగ=ఏమీ తెలియని దానను, విఖ్యాతగోపవరపు= ప్రఖ్యాతి గల గోపవరగ్రామంలోని, శ్రీకంఠమల్లేశు వరముచేత=శ్రీకంఠమల్లేశుడనే దేవుడిచ్చిన వరముచేత, నెఱికవిత్వంబున్=చక్కని కవిత్వమును, చెప్పగా=చెప్పడాన్ని, పాఠాంతరము, (నేర్చికొంటి)=నేర్చుకొన్నాను, నేర్చుదాన=నేర్చుకున్నదానను.

**తా :** కవికి కావలసి జ్ఞానసంపద అంతా ఈపద్యంలో చెప్పింది మొల్ల. దేశీయమైన పదాలు, తెనుగుపదాలు, తత్సమాలు, సంధివివరాలు, పండితుల ప్రయోగాలు, శయ్యలు, రీతులు, చాటు రచనా పద్ధతులు, సమాసాలు, అర్థాలు, భావార్థాలు, పాకాలు, రసభావ చమత్కృతులు, పదములకూర్పు, వర్ణభేదాలు, విభక్తులు, ధాతువులు, అలంకారాలు, ఛందోభేదాలు, కావ్యాలు, క్రియాపదాలు, నిఘంటువులు, కావ్యపద్ధతులు కావ్యశాస్త్రమర్యాదలు, భాషావిశేషాలు మొదలయినవి. ఇవి ఏవీనాకు తెలియవు, అయితే కవితారచన మాత్రం గోపవరగ్రామంలో వెలసిన శ్రీకంఠమల్లేశ్వరస్వామి ఇచ్చిన వరంవల్ల, ఆస్వామి. అనుగ్రహంవల్ల సంక్రమించింది. ఈ కవితారచనకు పూనుకున్నది ఆస్వామిదయ చేతనే అంటూ తన భక్తిని, వినయాన్ని చాటుకుంది మొల్ల.

**క.** **చెప్పుమని రామచంద్రుఁడు**
**సెప్పించిన పలుకుమీఁదఁజెప్పెద నే నె**
**ల్లప్పుడు నిహపరసాధన**
**మిప్పుణ్య చరిత్ర, తప్పులెంచకుఁడు కవుల్.** **13**

**ప్రతి :** చెప్పుమని=చెప్పు అని, రామచంద్రుడు=ఆ శ్రీరామచంద్రుడు, చెప్పించిన పలుకుమీదన్=చెప్పించిన మాటమీద, చెప్పెద నేను=నేను చెప్తాను, ఎల్లప్పుడు= సర్వకాలాలలోను, ఇప్పుణ్యచరిత్ర–ఈ+పుణ్యచరిత్ర= నేను వ్రాయబోయే ఈ పుణ్యకథ, ఇహపర సాధనము=ఈ లోకపు, పరలోకపు ఫలాలను సాధించడానికి సాధనము, కవుల్= కవులారా! (విమర్శకులారా! విద్యావంతులారా!), తప్పులు ఎంచకుఁడు=ఈ రచనలో తప్పులు ఎంచకండి.

**తా :** ఆ రామచంద్రుడు తనకథ చెప్పుమని నా మదిలో కోరిక కలిగించడం వల్ల – ఆయనే చెప్పించడం వల్ల ఈ కావ్యరచనకు పూనుకుంటున్నాను, పవిత్రమయిన ఈ కథ ఇహలోకంలోనూ, పరలోకంలోనూ శుభాలను పొందడానికి ఉపయోగపడుతుంది. ఆ రాముడు, చెప్పగా వ్రాసిన ఈ నా రచనలో కవులారా! (విద్వాంసులారా!) తప్పులు వెదకకండి.

**విశే :** పోతన భాగవతంలోని పద్యాన్ని అనుసరిస్తూ మొల్ల ఈ పద్యం చెప్పి ఉంటుందని విమర్శకుల మాట.

క. పలికెడిది భాగవతమఁట
పలికించెడివాడు రామభద్రుండఁట నే
పలికిన భవహరమగునఁట
పలికెద వేరొండుగాథ పలుకగ నేలా! భాగ–ప్రథమ–18

**వ. అని మఱియును. 14**

**చ. వలిపపు సన్న పయ్యెదను వాసిగ గంధపుఁ బూఁత తోడుతన్**
**గొలదిగఁగానవచ్చు వలిగుబ్బ చనుంగవఠీవి నొప్పుఁగా**
**దెలుఁగని చెప్పుచోటఁ గడుఁ దేటలఁ మాటలఁ గ్రొత్తరీతులం**
**బొలుపు వహింపకున్న, మఱి పొందగునే పటహాది శబ్దముల్? 15**

**ప్రతి :** వలిపపు=తెల్లని పరిశుభ్రమైన వస్త్రపు, సన్నపయ్యెదను=సన్నని పల్చని పైటలో, వాసిగ=బాగుగా, గంధపుపూతతోడుతన్=గంధము పూసుకొని, కొలదిగన్=కొంచెముగా, కానవచ్చు=కనుపించు, వలిగుబ్బచనుంగవఠీవిన్=గుండ్రని, లావైన చున్నులజంటవలె, ఒప్పగా=ప్రకాశించగా, తెలుఁగని=తెలుగులో, చెప్పుచోటన్=చెప్పేసందర్భంలో, కడుతేటల=మిక్కిలి తేలికైన, మాటలన్=పలకులతో, పొలుపు వహింపకున్న= అందాన్ని పొందకపోతే, మఱి=ఇక, పటహాదిశబ్దముల్=తప్పెటలు మొదలయిన వాద్యముల పెద్దపెద్ద చప్పుళ్లు, పొందగునా=నచ్చుతాయా?

**తా :** చక్కగా చందనం పూసుకుని పల్చటి తెల్లని వస్త్రాన్ని పైటగా వేసుకుని, చనుగవ ఠీవి అందము ఆ పైటలోనుండి కొద్ది మాత్రంగా కానవచ్చేలా – తెలుగులో కవిత్వం చెప్పేటప్పుడు మిక్కిలి తేటతెలుగు మాటలతో, కొత్త విధానంలో అందంగా చెప్పకుండా తప్పెట్ల చప్పుళ్లవంటి సంస్కృత పదాలతో తెలుగు కవిత్వం వ్రాస్తే అది ఏమంత మనోహరంగా ఉంటుంది? చెవులకు ఏమి యింపు కలిగిస్తుంది?

**క. మును సంస్కృతమ్ముఁ దేటగఁ**
**దెనిఁగించెడి చోట నేమి దెలియకయుండన్**
**దన విద్య మెఱయఁ గ్రమ్మఱ**
**ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే? 16**

**ప్రతి :** మును=పూర్వము, సంస్కృతములన్=సంస్కృతభాషలోని కావ్యాలను, తేటగన్=సులభమైన శైలిలో, తెనిఁగించెడి చోట=తెలుగులోకి అనువాదం చేసేప్పుడు, ఏమి తెలియక యుండన్=ఆ తెలుగు అనువాదం కూడా ఏమి అర్థం కాకుండా ఉండేలా, తనవిద్య=తనకుగల ఆ పాండిత్యము, మెఱయన్=ప్రకాశించేలా, క్రమ్మఱ=మరల, ఘనమగు=ప్రౌఢమయిన, సంస్కృతమున్=సంస్కృత పదభూయిష్ఠంగా, చెప్పగా=చెప్తే, రుచియగునా=ఇష్టమగునా?

**తా :** పూర్వ సంస్కృత కావ్యాలను తేటతెలుగులోకి అనువదించేటప్పుడు, ఏమీ బోధపడకుండా ఉండేలా తమ పాండిత్యాన్ని ప్రదర్శిస్తూ ప్రౌఢమైన సంస్కృత పదాలతో తెలుగు కవిత చెప్తే అది ఏమి రుచిగా ఉంటుంది?

**ఆ.వె. తేనెసోఁక నోరుతీయన యగురీతిఁ**
**దోడ నర్థమెల్లఁ దోచకుండ**
**గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము**
**మూఁగ చెవిటి వారి ముచ్చటగును. 17**

**ప్రతి :** తేనెసోకన్=తేనె తగులగానే, నోరు తీయనయగు రీతిన్=నోరుతియ్యగా అయ్యే విధంగా, తోడన్=వెంటనే, అర్థమెల్లన్=భావమంతా, తోచకుండ=తెలిసి రాకుండా, గూఢశబ్దములను=కఠినమైనవి, సంకేతార్థములు గలశబ్దాలను, కూర్చిన=కూర్చిన (వ్రాసిన), కావ్యము=కావ్యము, మూఁగచెవిటివారి ముచ్చటగును= మాట్లాడలేనివాడు, వినబడనివారు ముచ్చటించుకున్న విధంగా ఉంటుంది.

**తా :** తేనె నాలుకకు సోకీసోగానే నోరంతా తీయగా అయినట్లుగా, పద్యం వినీ వినడంతోనే అర్థమంతా స్పష్టంగా తెలిసేలా కాకుండా, గూఢ శబ్దాలతో – నిఘంటువులు చూస్తేనే కాని అర్థంగాని పదాలతో వ్రాసిన కావ్యం మూఁగ చెవిటవారి ముచ్చటగును, అని మొల్ల నిర్మొహమాటంగా చెప్పింది.

**విశే :** 'మూఁగచెవిటి వారి ముచ్చటగును' – అంటే మూఁగవాడు స్పష్టంగా మాట్లాడలేకపోయినా, చెవిటివాడు, వాడు ఏదో చెప్తున్నాడనుకుని సమాధానం ఇస్తాడు. చెవిటివాడి ధోరణి చెవిటివాడిది. మూగవాడి హావభావాలు మూగవాడివి. పరస్పరం విషయం ఏదీ ఎవరికీ అంతు పట్టదు, ఇదేవిధంగా గూఢశబ్దాలతో చేసిన కావ్యం కూడా పాఠకులకు అర్థం కాకుండాపోయే సావకాశం ఉంది. అందుకే ఆ స్థితిని, మూగ చెవిటి వారి ముచ్చటగా అభివర్ణించింది.

**క. కందువ మాటలు, సామెత**
**లందముగాఁ గూర్చిచెప్ప నది తెనుఁగునకున్**
**బొందై, రుచియై, వీనుల**
**విందై, మఱి కానిపించు విబుధుల మదికిన్. 18**

**ప్రతి :** కందువమాటలు=తెలుగునుడికారంతో కూడిన చమత్కారమైన మాటలు, సామెతలు–సామ్యాన్ని చెప్పే చిన్న చిన్న వాక్యాలు, అందముగా కూర్చిచెప్పన్=అందంగా కూర్చిచెప్పగా, తెనుగునకున్=తెలుగు భాషకు, అది=ఆవిధమయిన రచన, పొందై=అనుకూలమై, రుచియై=రుచికరమై, వీనులవిందై=చెవులకు విందువలె ఇంపై, మఱి=నిశ్చయముగా, విబుధుల=పండితుల, మదికిన్=మనస్సుకు, కానుపించు= కనబడుతుంది.

**తా :** తెలుగు నుడికారంతో చమత్కారమైన మాటలు, సామెతలు కలిపి కవిత చెప్తే – అది తెలుగు భాషకు అందంగా అమరి, రుచిమంతమై, చెవులకు విందు కూరుస్తూ తప్పకుండా పండితుల మనస్సుల కెక్కుతుంది.

**విశే :** 15, 16, 17, 18 సంఖ్యల పద్యాలలో తెలుగుకవిత్వం ఎలా ఉండాలో, ఆంధ్రీకరణ చేసేవాళ్లు తెలుగు పదాలప్రయోగం ఎలాచేయాలో, కందువ మాటతో సామెతలతో తెలుగుభాషా మాధుర్యాన్ని కూర్చి తెలుగుకవితవ్రాస్తే అది పండితుల మనస్సును ఆకర్షిస్తుంది అనేమాట నిశ్చయము అంటూ– తనకు– తెలుగు భాషాసాహిత్య రచనావిధానం పట్లగల అభిప్రాయాన్ని తెలియజేసింది మొల్ల.

ఇక రామకథా ప్రాభవాన్ని గురించి వివరించనుంది.

**క.** **ఆది రఘురాము చరితము**
**నాదరముగ విన్నఁ గ్రొత్తయై, లక్షణ సం**
**పాదమ్మై, పుణ్యస్థితి**
**వేదమ్మై తోఁచకున్న వెఱ్ఱినె చెప్పన్?** **19**

**ప్రతి :** ఆది=మొదటిదైన పురాతనమైన – రఘురాముచరితమున్ – రఘువంశ తిలకుడయిన శ్రీరాముని చరిత్రమును, ఆదరముగ=గౌరవభావముతో, మనసుపెట్టి, విన్నన్=వినిన, క్రొత్తయై=క్రొత్తగా ఉండి, లక్షణసంపాదమ్మై=లక్షణమును పొందినదై, పుణ్యస్థితి=పుణ్యమునకు నివాసమైన, వేదమ్మై=వేదమై, తోచకున్న= తోచకపోతే, చెప్పన్=చెప్పుటకు–రచన చేయుటకు పూనుకొనుటకు, వెఱ్ఱినె?=పిచ్చిదానినా?

**తా :** ఆదికాలమునాటి అతిపురాతనమైన రఘువంశ రాముని చరిత్రము గౌరవభావముతో మనసు పెట్టి వింటే నిత్యనూతనంగా, సర్వలక్షణ సంపన్నమై, పుణ్యసంపదను కలిగించే వేదముగా నా మనస్సుకు తోచకపోతే ఈ రామాయణ రచనకు పూనుకుందుకు నేను పిచ్చిదానినా?

**విశే :** రామాయణాన్ని వేదంగా భావించిన కవయిత్రి మొల్ల అని స్పష్టపడింది కదా. అయితే రామాయణాన్ని వేదంలా మొల్ల ఎలా సంభావించింది అని పరిశీలిస్తే – రామాయణ అవతరణ గురించి ఆర్యులు చెప్పిన శ్లోకం ఒకటి ఉంది.

**వేద వేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే**
**వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా ॥**

వేదం చేత తెలుసుకోబడే పురుషుడు భూలోకంలో దశరథాత్మజునిగా అంటే శ్రీరామునిగా పుట్టగానే, ఆ విషయం తెలిసిన వేదం కూడా వెనువెంటనే వాల్మీకి రచనగా రామాయణంగా పుట్టిందట. అంటే వేదమే రామాయణమన్న మాట. మొల్ల ఈవిషయాన్ని "వేదమ్మె తోచకున్న వెజ్జీనె చెప్పన్" అని అనుసంధానం చేసింది.

**ఉ. రాజిత కీర్తియైన రఘురామ చరిత్రము మున్ గవీశ్వరుల్**
**తేజమెలర్పఁ జెప్పిరని తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్ప నేలనన్**
**భూజన కల్పకం బనుచు, భుక్తికిముక్తికి మూలమంచు, నా**
**రాజును దైవమైన రఘురాము నుతించినఁ దప్పుగల్గునే? 20**

**ప్రతి :** రాజితకీర్తియైన రఘురాము=ప్రకాశించు కీర్తిగలవాడయిన రఘువంశ దీపకుడయిన రాముని, చరిత్రము=వృత్తాంతమును, మున్=పూర్వము, కవీశ్వరుల్=కవిరాజులు, తేజమెలర్పన్=సారము అతిశయించేలా, చెప్పిరి+అని=చెప్పిరని= చెప్పారు అని, తెల్సియున్=తెలిసినప్పటికి, క్రమ్మఱ=మరల, చెప్పనేల=చెప్పడ మెందుకు, (వ్రాయడ మెందుకు), అనన్=అనగా, భూజన కల్పకంబు=భూమి మీద జీవించే జనులకు కల్పవృక్షమని, భుక్తికి=భోజనానికి, ముక్తికి=మోక్షానికి, మూలమంచున్=ప్రధాన కారణమని, ఆ రాజును=ఆ రాజును, దైవమైన=భగవంతుడు కూడా అయిన, రఘురాము=శ్రీరాముని, నుతించినన్=స్తుతించినచో, తప్పుగల్గునే= అందులో తప్పేమి ఉంది?

**తా :** ప్రకాశించే కీర్తి కలిగిన శ్రీరాముని చరిత్ర పూర్వం కవీశ్వరులు ఎంతో గొప్పగా వ్రాసారని తెలిసికూడా, మళ్లీ ఎందుకు చెప్పడం అంటే, భూజనులకు సకలమైన కోరికలను తీర్చేకల్పవృక్షమనీ, భుక్తికీ ముక్తికీ శ్రీరాముడు మూలమని తెలుసుకుని ఆయన రాజూ, దైవమూ కూడా కనుక రాజుగా భుక్తినీ, దైవంగా ముక్తినీ ప్రసాదించే పరదైవమయిన శ్రీరాముని నుతిస్తే తప్పేముంది?

**విశే :** రామాయణము వేదమనీ, రాముడు భుక్తికి ముక్తికి మూలమని స్పష్టంగా చెప్పిన మొల్ల ఇప్పుడు – 'రామ'నామం యొక్క విశిష్టతను వివరిస్తోంది.

**క. వారాంగన శ్రీరాముని**
**పేరిడి రాచిలుకఁ బిలిచి పెంపువహించెన్,**
**నేరుపు గల చందంబున**
**నా రాముని వినుతి సేయ నర్హము గాదే? 21**

**ప్రతి :** వారాంగన=వేశ్య అయినస్త్రీ, శ్రీరాముని పేరు=రాముని పేరును – 'రామా' అనే పేరును, ఇడి=పెట్టుకుని, రాచిలుకన్=రామచిలుకను, పిలిచి=రామా! రామా! అంటూ పిలిచి, పెంపువహించెన్= అభివృద్ధి పొందింది, నేరుపుగల=నేర్పుగల, చందంబునన్=పద్ధతిలో, ఆ రాముని=ఆ శ్రీరాముని, వినుతిసేయన్=కొనియాడడం. అర్హము గాదే!=ఉచితము కాదా! తగినది కాదా!

**తా :** ఒకానొక వేశ్య పూర్వం తన పెంపుడు చిలుకకు 'రామ' అనిపేరు పెట్టుకుంది. రామా! రామా! అంటూ చిలుకను నిరంతరం పిలుస్తూ ఉండేది. రామనామస్మరణ వల్ల ఆమె ఎంతో అభివృద్ధి పొందింది, మంచి పుణ్యఫలితాన్ని, పొందింది. పిలిచినది, కేవలం చిలుక పేరుగా రామా! అని పిలవడం వల్లనే అంతటి ఫలం లభిస్తే రామనామ మాహాత్మ్యం తెలుసుకుని ఆ రామునే కొనియాడడం అర్థమైన పనిగాదా?

**విశే :** అని రామనామ మాహాత్మ్యాన్ని చిన్న కంద పద్యంలో అందంగా అందించింది మొల్ల. అసలు చిలుకకు 'రామచిలుక' అనే ప్రసిద్ధి ఇందువల్లే కలిగిందేమో!

ఈవారాంగన వృత్తాంతాన్ని రామదాసుగా ప్రసిద్ధికెక్కిన కంచెర్ల గోపన్న తన కీర్తనలలో కూడా ప్రస్తావించాడు.**'ఎన్నగాను రామభజనకన్న మిక్కిలున్నదా'** అనేకీర్తనలో – **'రామచిలుక నొకతె పెంచి'** అనే సంగతిని కూడా చెప్పాడు.

క. **నేరిచి పొగడిన వారిని**
**నేరక కొనియాడువారి నిజ కృప మనుపం**
**గారణ మగుటకు భక్తియె**
**కారణమగుఁ గాని చదువు కారణ మగునే?** **22**

**ప్రతి :** నేరిచి=తెలుసుకుని, నేర్చుకుని, పొగడిన వారిని=పొగిడిన వారిని, నేరక=తెలియక, కొనియాడు వారిన్=పొగడెడివారిని, నిజకృపన్=తనయొక్క దయతో, మనుపన్=కాపాడడానికి, కారణము+అగుటకు= కారణం కావడానికి, భక్తియె కారణమగు=భక్తే కారణమవుతుంది. కాని=కానీ, చదువు=విద్య, కారణము+ అగునే=కారణమవుతుందా?

**తా :** రాముని మాహాత్మ్యాన్ని తెలిసి పొగిడిన వారిని, ఆ విషయాలేమీ, తెలియక కొనియాడిన వారినీ – శ్రీరాముడు తన కృపతో రక్షించడానికి కారణం ఏమిటా అని ఆలోచిస్తే భక్తి కారణంగాని, చదువు కారణం అవుతుందా? కానే కాదు.

**విశే :** భక్తి, చదువు ఈ రెంటిలో భగవంతుని దయకు పాత్రులు కావడడానికి భక్తే కారణం. చదువు కాదు – అని మొల్ల భక్తికి పట్టంకట్టింది. పాండిత్యం కంటే భక్తి గొప్పది.

ఉ. **సల్లలిత ప్రతాప గుణసాగరుఁడై విలసిల్లి, ధాత్రిపై**
**బల్లిదుఁడైన రామ నరపాలకునిన్ స్తుతిసేయు జిహ్వకున్**
**జిల్లరరాజ లోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే?**
**యల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాససేయునే?** **23**

**ప్రతి :** సల్లలిత=చక్కగా ప్రకాశించు, ప్రతాపగుణ=పరాక్రమమనే గుణానికి, సాగరుఁడై=సముద్రము వంటివాడై, విలసిల్లి=ఒప్పి, ధాత్రిపై=భూమిమీద, బల్లిదుడైన=బలవంతుడైన, రామనరపాలకునిన్=

శ్రీరాముడనేరాజును, స్తుతిసేయు=స్తుతించు, కొనియాడు, జిహ్వకున్=నాలుకకు, చిల్లర రాజలోకమును= సామాన్యులయిన రాజుల సమూహాన్ని, చేకొని=గ్రహించి-గుర్తించి, మెచ్చఁగన్=పొగడుటకు, ఇచ్చపుట్టునే= కోరికపుడుతుందా? అల్లము బెల్లముందినుచున్=అల్లము, బెల్లము తింటూ, అప్పటికప్పటి కాససేయునే= అప్పటికప్పుడే ఫలితాలను ఆశిస్తాడా?

**తా :** చక్కని పరాక్రమానికి సముద్రము వంటివాడు, మహావీరుడు అయిన శ్రీరాజారాముని స్తుతించే నాలుకకు చిల్లరరాజుల్ని (అల్పులయిన రాజుల్ని) పొగడాలనే కోర్కె పుడుతుందా! పుట్టదు. రాముని నుతించిన నాలుక ఇతరులను నుతించదు. అల్లము బెల్లము తిన్ననాలుకకు, ఆయారుచుల విషయం తెలియదా? బెల్లాన్నేతినాలను కుంటుంది కదా! అల్లంజోలికి పోదుకదా!

**విశే :** చిల్లర రాజుల కథల జోలికిపోను. భుక్తికి ముక్తికి మూలమైన మహావీరుడైన శ్రీరాముని కథనే స్వీకరించి రచన చేస్తాను, అని మొల్లతన అభిప్రాయాన్ని ఈపద్యంలో స్పష్టం చేసింది.

మొల్ల తాను రామాయణరచన చేయడానికి గల కారణాలను చెప్పి సల్లలిత ప్రతాప గుణసాగరుడైన రామనృపాలునిపై గల ఎనలేని భక్తి ప్రపత్తులతో రామాయణ రచనకు శ్రీకారం చుట్టింది.

సంస్కృత కవులు, నాటక కర్తలు, పూర్వాంధ్ర కవులనుండి. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి వరకు రామాయణ రచనకు పూనుకున్నవారందరూ- 'మళ్లీ ఎందుకు రామాయణ రచన' అని ప్రశ్నించుకుని వారివారి మనసుకు నచ్చిన సమాధానాన్ని చెపూనే ఉన్నారు. మొల్లకూడా ప్రశ్న వేసుకుని, సమాధానం చెప్పుకుంది.

**వ. అని వితర్కించి, ముదంబున నిష్టదేవతా ప్రార్థనంబును బురాతన కవీంద్రస్తుతియునుం జేసి నా యొనర్పంబూనిన మొల్లరామాయణ మహా కావ్యమునకుఁ గథాక్రమంబెట్టు లనిన. 24**

**ప్రతి :** అని వితర్కించి=ఆవిధంగా ఆలోచించి-సద్గుణవంతుడు, మహావీరుడు అయిన రాముణ్ణి వర్ణించడానికి కుతూహలపడే నాలుక అల్పులయిన రాజులను వర్ణిస్తూ కవిత్వం చెప్తుందా? అని ఆలోచించి-రామునే కీర్తించాలని నిర్ణయించుకుని - ముదంబున=సంతోషంతో, ఇష్టదేవతా ప్రార్థనంబును=ప్రియమైన దేవతలను ప్రార్థించి, పురాతన కవీంద్ర స్తుతియునుంజేసి=ప్రాచీనకవులను స్తుతించి, నా యొనర్పంబూనిన=నేను చేయాలనుకున్న, మొల్లరామాయణ మహాకావ్యానికి కథాక్రమము ఎట్లనిన.

మహావీరుడైన శ్రీరాముకథను చెప్పడానికి నిశ్చయించుకున్న మొల్ల ఇష్టదేవతలను భక్తితో ప్రార్థించి, పూర్వ కవులనుస్తుతించి తాను రచించే 'మొల్ల రామాయణ' కథాక్రమాన్ని చెప్ప నారంభించింది.

**విశే :** తెలుగు సాహిత్యరంగంలో ఎందరో కవులు రామాయణ రచన చేసారు. అందువల్ల ఆయా కవుల రామాయణాలు ఆ కవుల పేరనే ప్రసిద్ధి కెక్కాయి. రంగనాథరామాయణం, భాస్కర రామాయణం, గోపీనాథ రామయణము... ఈ విధంగా మొల్ల వ్రాసిన రామాయణం మొల్ల రామాయణంగా ప్రసిద్ధి పొందింది. ఆశ్వాసాంత గద్యలో మాత్రం మొల్ల తన రచకు 'శ్రీరామాయణము' అని పేరు పెట్టినట్లు తెలుస్తోంది.

'మొల్ల నామధేయ విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యమునందు' –

**సీ.** **సరయూ నదీ తీర సతత సన్మంగళ**
**ప్రాభవోన్నత మహావైభవమ్ము,**
**కనక గోపుర హర్మ్య ఘన కవాటోజ్జ్వల**
**త్ప్రాకార గోపుర శ్రీకరమ్ము,**
**గజ వాజి రథ భట గణికాతపత్ర చా**
**మర కేతు తోరణ మండితమ్ము**
**ధరణీ వధూటి కాభరణ విభ్రమరేఖ**
**దరిసించు మాణిక్యదర్పణమ్ము,**

**తే.గీ.** **భానుకులదీప రాజన్య పట్టభద్ర**
**భాసి నవరత్న ఖచితసింహాసనమ్ము,**
**నాఁగ నుతికెక్కు మహిమ ననారతమ్ము,**
**ధర్మనిలయమ్ము, మహి నయోధ్యాపురమ్ము.** **25**

**ప్రతి** : సరయూనదీతీర=సరయు అనే నది ఒడ్డున, సతత=ఎల్లప్పుడు, సన్మంగళ= మంచి శుభకరమయిన కార్యముల యొక్క, ప్రాభవ=ప్రభుత్వముతో కూడిన ఉన్నత=గొప్పదైన, మహావైభవమ్ము=గొప్పఐశ్వరము కలది, కనక గోపుర హర్మ్య=బంగారపు గోపురాలతో కూడిన భవనములు, ఘన కవాటోజ్జ్వలత్=పెద్ద పెద్ద తలుపులతో ప్రకాశిస్తున్న, ప్రాకార=చుట్టూకట్టబడిన గోడలు–ప్రహారి గోడలు, గోపుర=ఎత్తుగా కట్టిన కట్టడములతో, శ్రీకరమ్ము=శోభాకరముగా ఉన్నది, గజ=ఏనుగులు, వాజి=గుఱ్ఱాలు, రథ=రథాలు, భట= కాల్బలములు (సైనికులునేల మీద ఉండి యుద్ధం చేసేవారు), గణిక=వారకాంతలు, ఆతపత్ర= గొడుగులు, చామర=వింజామరలు, కేతు=జెండాలు, తోరణ=రాజమార్గాలలో కట్టేపూల దండలు వీనితో, మండితమ్ము= అలంకరింపబడినది, ధరణీ వధూటికా=భూమిఅనే రమణికి, ఆభరణ=నగలయొక్క, విభ్రమరేఖ= విలాసపుకాంతిని, దరిసించు=చూపించు, మాణిక్య దర్పణమ్ము=మాణిక్యములతో కూర్చిన అద్దము వంటిది, భాను కులదీప=సూర్యవంశానికిదీపము వంటి, రాజన్య=రాజులలో, పట్టభద్ర=పట్టాభిషిక్తులతో, భాసి= ప్రకాశించు, నవరత్నఖచిత=నవరత్నాలు పొదిగిన, (నవరత్నములు=ముత్యము, మాణిక్యము, వైడూర్యము, గోమేధికము, వజ్రము, పగడము, పుష్యరాగము, మరకతము, నీలము), సింహాసనమ్ము= సింహాసనము కలది, ధర్మనిలయమ్ము=ధర్మానికి నివాసస్థానము, నాఁగ=అనునట్లు, మహిమన్=ప్రభావముతో, అనారతమ్ము= ఎల్లప్పుడు, మహిన్=భూమియందు, అయోధ్యాపురమ్ము=అయోధ్యాపురము, నుతికెక్కు= పొగడ్తకు ఎక్కును.

**తా :** సరయూ నదీతీరంలో నిత్యమూ శుభకార్య పరంపరలతో కూడి ఉండేది, బంగారుగోపురాలు, పెద్దపెద్దకోట తలుపులతో ప్రాకారాలతో శోభిస్తున్నది, రథ, గజ, అశ్వ, పదాతి దళాలనే – చతురంగ

బలాలతో, వేశ్యలతో, ఛత్రచామరాలు, జెండాలు, అలంకరించిన పూలదండలతో శోభాయమానముగా ఉండేది, భూమి అనే రమణి అలంకరించుకున్న ఆభరణాల అందం చూచుకోవడానికి మణులు తాపిన అద్దములాంటిది సూర్యవంశంపు పట్టాభిషిక్తులయిన రాజులు ఆసీనులు కావడం చేత ప్రకాశించే సింహాసనము కలది, అయిన అయోధ్యాపురము ధర్మానికి నివాసస్థానంవలె శోభిస్తున్నది. ఇది పురవర్ణనలో మొదటి పద్యము.

**సీ. మదనాగ యూధ సమగ్రదేశము గాని**
**కుటిల వర్తన శేషకులము గాదు,**
**ఆహవోర్వీజయ హరి నివాసము గాని**
**కీశ సముత్కరాంకితము గాదు,**
**సుందర స్యందన మందిరం బగుఁగాని**
**సంతత మంజు లాశ్రయము గాదు,**
**మోహన గణికా సమూహ గేహము గాని**
**యూధికా నికర సంయుతము గాదు,**

**తే. సరస సత్పుణ్యజన నివాసమ్ముగాని**
**కఠిన నిర్దయ దైత్య సంఘమ్ముగాదు,**
**కాదు కాదని కొనియాడఁగలిగినట్టి**
**పుర వరాగ్రమ్ము సాకేతపురవరమ్ము. 26**

**ప్రతి :** మదనాగ=మదించిన ఏనుగల యొక్క, యూధ=సమూహముతో, సమగ్ర దేశముకాని=నిండియున్న దేశమేకాని, కుటిల వర్తన=వంకరటింకర నడకలుగల, శేషకులము కాదు=పాముల వంశముకాదు. ఆహవ+ ఉర్వీ=ఆహవోర్వీ=యుద్ధ భూమిలో, జయ=గెలుపుగల, హరి నివాసముగాని=గుఱ్ఱములకు నెలవయినదే గాని, కీశ=కోతుల, సముత్కర=సమూహముతో, అంకితముకాదు=గుర్తింపబడినది కాదు, సుందరస్యందన= అందమైన రథాలకు, మందిరంబగుగాని=నివాసస్థానము అగునుకాని, సంతత=ఎల్లప్పుడు, మంజులా శ్రయము=నీటి ప్రవాహానికి ఆశ్రయము, కాదు=కాదు, మోహన గణికా సమూహ=మోహింప చేసే వేశ్యల సమూహానికి, గేహముగాని=ఇల్లుగాని, యూధికా నికర=అడవి మొల్లతీగెల గుంపుతో, సంయుతము కాదు=కూడి ఉన్నది కాదు, సరస=సరసులు – ఏ విషయాన్ని ఏ దృష్టిలోచూడాలో ఆ దృష్టితో చూసి, చూసిన, విషయంలో గల మంచిని చక్కగా గ్రహించేవారు, సత్+పుణ్యజననివాసమ్ముగాని=మంచి పుణ్యాత్ములకు నివాసమే కాని, కఠిన నిర్దయ దైత్య సంఘమ్ముగాదు=కఠినాత్ములు!, దయ లేనివారు అయిన రాక్షసుల సమూహముకాదు! కాదు కాదు అని=కాదు కాదు అంటూ, కొనియాడఁ గలిగనట్టి=పొగడదగినట్టి, పురవరాగ్రమ్ము=పురములలో మిక్కిలి శ్రేష్ఠమయినది, సాకేతపురవరమ్ము=అయోధ్యా పురము.

**తా :** మదించిన ఏనుగల సమూహంతో కూడిన దేశమే గానీ, వంకర టింకరగా నడిచే పాములు గల దేశముకాదు. యుద్ధభూమిలో విజయాన్ని చేకూర్చే సామర్థ్యంగల గుఱ్ఱాలతో కూడిన ప్రదేశమే గాని, కోతుల గుంపుతో కూడిన ప్రదేశం కాదు. సుందరమయిన రథాలతో కూడినదేగానీ, నీటికోళ్లతో కూడినది కాదు. అందమయిన వేశ్యలతో కూడిన గేహమేగానీ మొల్లపూలతో కూడినదికాదు. ఉత్తములయిన పుణ్యజనులకు నివాసమైనదే గానీ, కఠినాత్ములయిన రాక్షస సంఘాలతో కూడినది కాదు. కాదు! కాదు! అంటూ కొనియాడదగినట్టి పురశ్రేష్ఠము సాకేతపురము.

**విశే :** ఈ పద్యంలో మొల్ల శ్లేషాలంకార నైపుణాన్ని ప్రదర్శిస్తూ విరోధాభాసాలంకారాన్ని కూర్చి తన వర్ణనావైదగ్ధ్యాన్ని పాఠకులకు అందించింది. శ్లేష అంటే–ఒక పదానికి వేర్వేరు అర్థాలున్నప్పుడు ఆ ప్రత్యేకమైన పదాన్ని ప్రయోగించి రెండు అర్థాలను సాధించడం. విరోధాభాసము అంటే– వర్ణించిన విషయంలో ఏదో విరోధం–అంటే ముందు చెప్పిన భావానికి వ్యతిరేకమయిన భావం స్ఫురించడం, అయితే పూర్తిగా అర్థం తీసుకుని అన్వయించుకుంటే – అంతా అర్థవంతంగానే ఉండడం.

సందర్భాన్ని పట్టి పదానికి అర్థాన్ని గ్రహించాలి. లేకపోతే అసందర్భంగా అనిపిస్తుంది... ఆ విషయాన్ని వివరించే పద్ధతిలో మొల్ల ఈ పద్యాన్ని కూర్చింది.

**తా : మొదటిపాదం :** 'మదనాగయూథ సమగ్రదేశముగాని కుటిల వర్తన శేషకులము కాదు! మదనాగయూథ అనే సమాసంలో నాగ అనే శబ్దానికి పాము అనీ, ఏనుగు అనీ రెండు అర్థాలు ఉన్నాయి. ఈ వర్ణన సందర్భంలో నాగ అనే శబ్దానికి ఏనుగు అనే అర్థం గ్రహించాలి. చక్కని నడక గల మదించిన ఏనుగు లున్న దేశము అయోధ్య. అంతేకాని కుటిలవర్తన శేషకులము కాదు – వంకరటింకరగా సంచరించే పాములకులం ఉండే దేశం కాదు అని తాత్పర్యం, ఇందులో నాగశబ్దానికి రెండు అర్థాలు ఉన్నాయి కానీ శేషశబ్దానికి పాము అని మాత్రమే అర్థం. ఇలా ఈ పద్యరచనా విధానాన్ని నాలుగు పాదాలలో చూపించింది మొల్ల,

**రెండోపాదం :** ఆహవోర్వీజయ హరి నివాసముగాని, కీశసముత్కరాంకితము కాదు, హరి అంటే గుఱ్ఱము అనీ, కోతి అనీ అర్థాలు ఉన్నాయి. అయోధ్యానగర యుద్ధభూమి జయాన్ని చేకూర్చే గుఱ్ఱాలకు నివాసమే కాని, కోతులతో కూడి ఉన్న ప్రదేశం కాదు. హరిశబ్దానికి ఈ సందర్భంలో గుఱ్ఱాలనే అర్థాన్ని తీసుకోండి. కోతులు అనే అర్థాన్ని కాదు. కీశ శబ్దానికి – కోతి అనే అర్థం మాత్రమే ఉంది.

**మూడోపాదం :** సుందరస్యందన మందిరంబగుఁగాని సంతత మంజులాశ్రయము గాదు స్యందనము అంటే – రథమనీ, నీటికోళ్లతో కూడిన ప్రవాహమనీ రెండు అర్థాలు. సాకేతపురం సుందరమయిన రథాలతో కూడిన దేశమే కాని ఎల్లప్పుడూ నీటి ప్రవాహంలో ఉండే నీటికోళ్లతో నిండిన దేశమని కాదు, మంజులము అంటే నీటికోళ్లు అనే అర్థం మాత్రమే ఉంది.

**నాల్గోపాదం :** 'మోహనగణికా సమూహగేహము గాని యూధికానికర సంయుతము గాదు' గణిక అంటే – వేశ్య అనీ, అడవి మొల్లలనీ అర్థం, ఇక్కడ వేశ్యలు అనే అర్థం తీసుకోవాలి మొల్లలు అనికాదు. యూధ శబ్దానికి – అడవి మొల్లలు అని మాత్రమే అర్థం.

తేటగీతిలో సరస సత్పుణ్యజన నివాసమ్ము గాని, కఠిన నిర్దయ దైత్యసంఘమ్ము గాదు. పుణ్యజనులు అంటే – పుణ్యకార్యాలు చేసిన మంచివాళ్లు అని ఒక అర్థం, రాక్షసులు అని మరొక అర్థం. దైత్యశబ్దానికి= రాక్షసులు అని మాత్రమే అర్థం. సాకేతపురం సరస సత్పుణ్య జననివాసమే కానీ కఠిన నిర్దయదైత్య సంఘమునకు నివాసంకాదు. పుణ్యజనులంటే రాక్షసులు అనే అర్థాన్ని గ్రహించకండి అని మొల్లమాట. ఈ పద్యరచనలో ప్రతి పాదం చివర 'కాదు' 'కాదు' అని వచ్చేలా వ్రాసింది, అందుకనే పద్యం ముగింపులో

**'కాదుకాదు అని కొనియాడ గలిగినట్టి**
**పురవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము**

అంది. నేను 'కాదు, కాదు' అంటూ కొనియాడాను గమనించండి అంది. ఇదొక రచనా వైచిత్రి. సాధారణంగా పొగడేటప్పుడు నిషేధ (కాదు) వాచకాలుండవు. కాని ఇక్కడ కాదు కాదంటూనే ప్రశంసించడం విశేషం.

**సీ. భూరి విద్యా ప్రౌఢి శారదా పీఠమై**
**గణుతింప సత్యలోకమ్ము వోలె**
**మహనీయ గుణ సర్వమంగళా వాసమై**
**పొగడొందు కైలాస నగమువోలె**
**లలిత సంపచ్ఛాలి లక్ష్మీనివాసమై**
**యురవైన వైకుంఠపురమువోలె**
**విరచిత ప్రఖ్యాత హరిచందనాఢ్యమై**
**యారూఢి నమరాలయమ్మువోలె**

**గీ. రాజరాజ నివాసమై తేజరిల్లి**
**నరవరోత్తర దిగ్భాగ నగరివోలె**
**సకల జనములు గొనియాడ జగములందు**
**బొలుపు మీరెను సాకేతపురవరమ్ము. 27**

**ప్రతి :** భూరి విద్యా ప్రౌఢి=గొప్పదైన అతిశయించిన విద్యలతో, శారదాపీఠమై=సరస్వతీదేవి గద్దెయై, గణుతింప=లెక్కపెట్టగా, పరిశీలింపగా, సత్యలోకమ్మువోలె=బ్రహ్మదేవుడు నివసించే బ్రహ్మలోకమువలె, మహనీయ గుణ = గొప్పవైన గుణములతో, సర్వమంగళావాసమై = పార్వతీదేవికి నివాసమై, పొగడొందు= పొగడబడు, కైలాసనగమువోలె = కైలాసపర్వతమువలె, లలిత= అందమైన, సంపత్+శాలి = సంపచ్ఛాలి= సంపదలతో ప్రకాశించు, లక్ష్మీనివాసమై=లక్ష్మీదేవికి నివాసమై, ఉరవైన=గొప్పదైన, వైకుంఠపురమువోలె=

వైకుంఠపురమువలె, విరచిత=కూర్చబడిన, ప్రఖ్యాత=ప్రసిద్ధమైన, హరిచందనాఢ్యమై=మంచిగంధపు చెట్లతో కూడినదై, ఆరూఢిన్=ప్రసిద్ధిలో, అమరాలయమ్మువోలె= దేవతల నివాసమైన స్వర్గలోకమువలె, రాజరాజు నివాసమై=కుబేరుని నివాసమై, తేజరిల్లి=ప్రకాశించి, నరవర= శ్రేష్ఠులయిన మనుష్యుల యొక్క, ఉత్తరదిగ్భాగ= ఉత్తరదిక్కునందలి, నగరివోలె=నగరము వలె – అలకానగరమువలె, సకలజనులు=జనులందరు, కొనియాడన్=పొగడగా, జగములందు=లోకములలో, సాకేతపురమ్ము=అయోధ్యాపురము, పొలుపు మీరెను= మనోహరముగ ఒప్పుచున్నది, అందముతో అతిశయించుచున్నది.

**తా :** అయోధ్యాపురం – బ్రహ్మలోకంవలె, కైలాసగిరివలె, వైకుంఠపురమువలె, స్వర్గలోకంవలె, అలకానగరివలె, ఉంది అని మొల్ల వర్ణన. ఆయా లోకాల్లా ఉండడానికి కారణాన్ని వివరిస్తోంది ఈ పద్యంలో. అయోధ్యానగరంలో వివిధ విద్యలలో గొప్ప పాండిత్యం గలిగిన విద్వాంసులు ఉన్నారు. అందువల్ల ఆ పురి సరస్వతీపీఠములా ఉంది. సరస్వతీపీఠం బ్రహ్మగారి సత్యలోకంలో ఉంటుంది. కాబట్టి సరస్వతీపీఠం గల అయోధ్యానగరం సత్యలోకంలా ప్రకాశిస్తోంది. స్వరమంగళ అంటే పార్వతీదేవి అని అర్థం. సర్వమంగళాదేవి ఉన్నచోటు శివుని కైలాసగిరి. అయోధ్యానగరం సర్వవిధములయిన శుభకార్యములకు నిలయం కావడం వల్ల కైలాసగిరి వలె పొగడబడుతోంది. లక్ష్మీనివాసం విష్ణునివాసమైన వైకుంఠపురం, అయోధ్య కూడా సకల సంపదలతో ప్రకాశిస్తూ వైకుంఠము వలె ఉంది.

స్వర్గలోకంలో కల్పవృక్షాలున్నాయి. అందులో హరిచందనం ఒకటి. అయోధ్యానగరంలో కూడా హరిచందన వృక్షాలున్నాయి అంటే మంచిగంధపు చెట్లున్నాయి. అందువల్ల అయోధ్య కూడా స్వర్గలోకంలా ఒప్పుతోంది.

ఉత్తరదిక్కుకు అధిపతి కుబేరుడు. అతని పట్టణం అలకాపురి. అలకాపురిలో నివసించే వారిని నరవరులు అంటారు. అయోధ్యనగరంలో కూడా ఉత్తమ మానవులు ఉన్నారు. కాగా అయోధ్యాపురి అలకాపురిలా ఒప్పి ఉంది.

ఇలా అయోధ్యానగరం బ్రహ్మలోకంలా, వైకుంఠపురంలా, కైలాసగిరిలా, స్వర్గలోకంలా, అలకాపురిలా– ఆయా నగరాల్లోని ఉత్తమ లక్షణాలను కూర్చుకుని ప్రకాశిస్తూ జనులందరి చేతా పొగడబడుతోంది అని అయోధ్యాపురి ఆధిక్యం వ్యక్తం చేసింది కవయిత్రి.

**క. ఇమ్ముల నప్పురి వప్రము**
**కొమ్ములపై నుండి పురము కొమ్మలు వేడ్కన్**
**దమ్ములచుట్టము పదజల**
**జమ్ములు పూజింతు రొగి నజస్రము ప్రీతిన్. 28**

**ప్రతి :** ఇమ్ములన్=అందముగా, అప్పురి=ఆ పట్టణముయొక్క, వప్రము=ప్రాకారము, కొమ్ముల పైనుండి= శిఖరముల మీద నుండి, పురముకొమ్మలు=అయోధ్యాపురములోని స్త్రీలు, వేడ్కన్=కుతూహలముతో,

తమ్ముల=తామరపువ్వుల, చుట్టము=బంధువైన సూర్యుని, పదజలజమ్ములు=తామరపువ్వుల వంటి పాదాలను, ఒగి=బాగుగా, అజస్రము=నిత్యమూ, ప్రీతిన్=ప్రేమతో, పూజింతురు= పూజచేస్తారు.

**తా :** ఆ అయోధ్యాపురములోని స్త్రీలు, ఆ నగర ప్రాకారపు గోపురాల మీదకు ఎక్కి అక్కడనుండి సూర్యభగవానుని పాదాలకు నిత్యమూ భక్తితో పూజ చేస్తారు.

**విశే :** ఈ పద్యంలో మొల్ల అయోధ్యాపుర ప్రాకారాలు ఎంతో ఎత్తుగా ఉన్నాయి అని చెప్పడానికి ఆ గోడలు ఎక్కి స్త్రీలు సూర్యుని పాదాలు పూజిస్తున్నారు అంది. సూర్యుడి పాదాలు అందేటంత ఎత్తుగా ఆ గోపుర ప్రాకారాలు ఉన్నాయనడాన్ని అతిశయోక్తి అనే అలంకారం అంటారు.

**క.** **పరువున మురువై యుండును**
**సురపురమునఁ గల్పతరులు చూపఱ కింపై;**
**పరువున మురువై యుండును**
**దురగంబు లయోధ్యఁగల ప్రతోళికలందున్.** **29**

**ప్రతి :** పరువున=గౌరవముతో, మురువై=అందమైనదై, ఉండును=ఉండును, సురపురమునన్=దేవతల నగరమైయిన అమరావతిలో, కల్పతరులు=కల్పవృక్షాలు. చూపఱకు=చూచేవారికి. ఇంపై=అందముగా కనిపిస్తున్నవి. పరువున=పరుగెత్తే వేగంలో వేగంలో. మురువై=గర్వము కలవై, తురగంబులు= గుఱ్ఱములు, అయోధ్యన్=అయోధ్యలో, కల=ఉన్న, ప్రతోళికలందున్=పురద్వారాలలో, ఉండును=ఉంటాయి.

**తా :** దేవతల పట్టణమైన అమరావతిలో కల్పవృక్షాలు సౌందర్యంతో, గౌరవంతో ఒప్పుతూ ఉంటాయి. పరువు అంటే బాగా పండి పరువుకురావడం అనికూడా అర్థం చెప్పుకోవచ్చు. కల్పవృక్షాలు బాగా పరువుకు వచ్చిన పండ్లతో అందంగా ఉన్నాయి అనికూడా అర్థం.

ఇక అయోధ్యాపుర సింహద్వారాల వద్ద అతివేగంగా పరిగెత్తే గర్వంతో కూడిన గుఱ్ఱాలు ఒప్పుతూ ఉన్నాయి అని.

**విశే :** వేగంగా పరిగెత్తగలగడం ఉత్తమజాతి గుఱ్ఱాలకు లక్షణం. అయోధ్యలో ఉత్తమజాతి గుఱ్ఱాలు ఉన్నాయి అని తాత్పర్యం. పరువు శబ్దానికి గల రెండు అర్థాలను పాఠకులకు చక్కగా పరిచయం చేసింది కవయిత్రి.

**క.** **దాన గుణమ్మున సురపురి**
**నేనాఁడును నమర రత్న మెన్నిక కెక్కున్,**
**దాన గుణంబున మిక్కిలి**
**యేనుఁగు లా పురములోన నెన్నిక కెక్కున్.** **30**

**ప్రతి :** దానగుణమ్మునన్=దానం చేసే ఉత్తమగుణంలో, సురపురిన్=దేవలోకంలో, ఏనాడును=ఎప్పుడైనా, అమరరత్నము=దేవతామణి, చింతామణి అని పేరు గలది, ఎన్నికకెక్కున్=ప్రసిద్ధికెక్కింది, దానగుణంబున=

మదజలము కార్చుటలో – మదించిన ఏనుగులకు, రెండు చెంపలనుండి కారే జలాన్ని మదజలం అంటారు, దానినే దానగుణం అని కూడా అంటారు, మిక్కిలి=అధికముగా, ఏనుగులు=ఏనుగులు, ఆ పురములోన=ఆ అయోధ్యాపురములో, ఎన్నిక కెక్కున్=ప్రసిద్ధి చెందాయి.

**తా :** స్వర్గలోకంలో 'చింతామణి' అనే ఒక పవిత్రరత్నం ఉంది. అది కోరినవారి కోరికలను దానంగా ఇవ్వడంలో పేరుపడింది. అలాగే అయోధ్యానగరంలోని ఏనుగులు దానగుణంలో ప్రసిద్ధికెక్కాయి. అంటే మదజలం స్రవించడంలో ప్రసిద్ధికెక్కాయి.

**విశే :** దానగుణం దేవలోకంలోనూ ఉంది. అయోధ్యాపురంలోనూ ప్రసిద్ధికెక్కింది. 'దానగుణము' అనే పదానికి గల రెండు అర్థాలు ఇక్కడ ప్రయోగింపబడ్డాయి.

క. **కవి గురు బుధ మిత్రాదులు**
**వివిధార్చనలను సురపురి వెలయుదు రెలమిన్**
**గవి గురు బుధ మిత్రాదులు**
**వివిధార్చనలం బురమున వెలయుదు రెపుడున్.** **31**

**ప్రతి :** కవి=శుక్రుడు, గురు=బృహస్పతి, బుధ=బుధుడు, మిత్రాదులు=సూర్యుడు మున్నగువారు, వివిధార్చనలను=అనేకవిధాలైన పూజలతో, సురపురి=దేవతల నగరములో, స్వర్గలోకములో, ఎలమిన్= చక్కగా, వెలయుదురు=ప్రకాశింతురు, కవి=కవులు, గురు=ఆచార్యులు, గురువులు, బుధ=పండితులు, మిత్రాదులు=స్నేహితులు మొదలగువారు, వివిధార్చనలన్=అనేక సత్కారాలతో, ఎపుడున్=ఎల్లప్పుడు, వెలయుదురు=ప్రకాశిస్తూ ఉంటారు.

**తా :** దేవలోకంలో శుక్రుడు, గురుడు, బుధుడు, సూర్యుడు మొదలయిన దేవతలు గ్రహాలరూపంలో అనేకవిధాల పూజలు అందుకుంటూ ఉంటారు. అయోధ్యానగరంలో కవులు, పండితులు, ఉపాధ్యాయులు, స్నేహితులు అనేక సత్కారాలు పొందుతూ, గౌరవింపబడుతూ జీవిస్తూ ఉంటారు.

**విశే :** దేవలోకంలోనూ, అయోధ్యలోనూ కూడా కవి గురు బుధ మిత్రాదులు పూజలందుతున్నారు. అయితే వేరు వేరు అర్థాల్లో ఈ నాలుగు పదాలకు దేవలోకంలో గ్రహదేవతలు, భూలోకంలో కవి, పండిత, గురు, మిత్రులు. ఒకే పదాన్ని వేరు వేరు అర్థాల్లో ప్రయోగిస్తే దాన్ని యమకాలంకారం అంటారు.

ఈ పద్యంలోని యమకాన్ని పాదయమకం అంటారు. ఎందుకంటె–1, 3 పాదాలు – ఒకే పదాలతో ఉండడంవల్ల.

క. **భోగాను రాగసంపద**
**భోగులు వర్తింతు రందు భూనుతలీలన్,**
**భోగాను రాగ సంపద**
**భోగులు వర్తింతు రిందు భూనుతలీలన్.** **32**

**ప్రతి :** భోగ=సుఖములు, అనురాగసంపద=ప్రేమ సంపదతో, భోగులు=సుఖజీవన ప్రీతులయిన దేవతలు, అందు=ఆ స్వర్గములో, భూనుతలీలన్=భూలోకములో పొగడబడునట్లుగ, వర్తింతురు=నివసిస్తారు. భోగానురాగ సంపద=వివిధములయిన సుఖాలు, ప్రణయ సంపదలతో, భోగులు=భోగములపై ఆసక్తి కలవారు, విలాసపురుషులు, ఇందు ఈ అయోధ్యాపురములో, భూనుతలీలన్=భూలోకములో పొగడబడే విధంగా, వర్తింతురు=నివసిస్తారు.

**తా :** స్వర్గలోకములోని దేవతలు-ఎప్పుడూ యవ్వనంలోనే ఉంటారు. సుఖాల మీదే అనురాగం కలిగి జీవనం సాగిస్తూ ఉంటారు. అయోధ్యలోని భోగపురుషులు కూడా సుఖాలు, సంపదలు, ప్రేమ కలవారై సుఖంగా జీవిస్తున్నారు.

**విశే :** ఈ పద్యంలో కూడా ఒకే పదాలతో వర్ణన సాగించి. పాదయమకాన్ని కూర్చింది మొల్ల.

**సీ.** **ప్రకటాగ్నిహోత్ర సంపన్నులౌదురు గాని**
**రమణీయ రుక్మకారకులు గారు,**
**శుభ పవిత్రోజ్జ్వల సూత్రధారులు గాని**
**టక్కరి హాస్యనాటకులు గారు,**
**ఉభయ సంధ్యాది విధ్యుక్త కర్మలుగాని**
**చర్చింపఁగా నిశాచరులు గారు,**
**తిలకించి చూడ సద్ద్విజు లౌదురే కాని**
**తలఁపంగఁబక్షిజాతములు కారు**

**తే.** **బాడబులు గాని యగ్నిరూపములు గారు**
**పండితులుగాని విజ్ఞుల పగిదిఁగారు**
**ధీవరులు గాని జాతినిందితులుగారు**
**పరమ పావను లా పురి ధరణిసురులు.** **33**

**ప్రతి :** ప్రకట=ప్రసిద్ధమయిన, అగ్నిహోత్రసంపన్నులు=నిత్యము, హెూమాలు చేస్తూ అగ్నిని అర్చిస్తూ అదే సంపదగా గలవారు, ఔదురుగాని=అవుతారే కానీ, రమణీయ=అందమైన, రుక్మకారకులు=బంగారు నగలు చేసే కంసాలులు, కారు=కానేకారు, శుభ=మంగళప్రదమైన, పవిత్ర=పవిత్రమయిన, ఉజ్జ్వల=ప్రకాశించు, సూత్రధారులు=యజ్ఞోపవీతమును ధరించే వారే, కాని=కాని, టక్కరి హాస్యనాట కులు గారు=నవ్వించే చేష్టలతో తాళ్లతో కట్టిన బొమ్మలను ఆడించే నాటకాలు వేసేవారు కాదు, తోలుబొమ్మలాడించేవారు కారు, ఉభయ సంధ్యాది=ఉదయ సంధ్య, సాయంసంధ్యల ప్రారంభంలో, విధ్యుక్త కర్మలు గాని=శాస్త్రము చెప్పిన అనుష్ఠానాలు చేసేవారే కానీ, చర్చింపగా=విచారణ చేయగా, నిశాచరులు కారు=రాక్షసులు కారు (రాత్రి చరించేవారు రాక్షసులు) తిలకించి చూడన్=పరిశీలనగా చూడగా, సద్ద్విజులు=

ఉత్తమ బ్రాహ్మణులు, ఔదురే గాని=అవుదురే గాని, తలపంగన్=ఆలోచించిగా, పక్షిజాతములు=వివిధ పక్షిజాతులు, కారు=కారు, బాడబులు గాని= బ్రాహ్మణులే కాని, అగ్నిరూపములు గారు=నిప్పురూపంలో ఉండేవారు కారు, పండితులు గాని=వేదశాస్త్రాలు బాగా చదువుకున్నవారే గానీ, విజ్ఞుల పగిదిన్=ఊరికే నేర్పు ప్రదర్శించేవారివలె, కారు=కారు, ధీవరులు=బుద్ధివిశేషము కలవారు, కాని=కాని, జాతినిందితులు కారు=కులముచే నిందింపబడినవారు కారు, ఆ పురి= అయోధ్యాపురములోని, ధరణిసురులు=బ్రాహ్మణులు, పరమపావనులు=మిక్కిలి పవిత్రులు.

**తా :** అయోధ్యాపురిలోని బ్రాహ్మణులు నిత్యాగ్నిహోత్రులు. నిత్యాగ్నిహోత్రులు అన్నానని - బంగారు పని చేసే కంసాలివారు అనుకోవద్దు. కంసాలులు నిత్యము నిరంతరము-అగ్నిహోత్రం (నిప్పుల కుంపటి పెట్టుకుని) దానిముందు కూర్చుని బంగారు వస్తువులు తయారు చేస్తూఉంటారు. పవిత్రమై శుభ్రమయిన ప్రకాశవంతమయిన జందెము ధరిస్తారు. అలా అన్నానని తోలుబొమ్మలాట ఆడించే సూత్రధారులు మాత్రం కాదు, నాటక ఆరంభంలో కూడా సూత్రధారి ఉంటాడు. రెండు సంధ్యల్లోనూ - ఉదయసంధ్య, సాయంసంధ్యలలో - సంధ్యావందనాది కర్మలు నిర్వహిస్తారు. అలా అని సంధ్యాకాలంలో సంచరించే రాక్షసులు మాత్రం కారు. ఉత్తమమైన ద్విజులే గాని - ద్విజులు అన్నానని పక్షిజాతులు అనుకోవద్దు. ద్విజశబ్దానికి - బ్రాహ్మణులు అనీ, పక్షులు అనీ అర్థాలు ఉన్నాయి. ద్విజ అంటే రెండుసార్లు పుట్టడం. బ్రాహ్మణునికి ఉపనయనం అయ్యాక మరోజన్మ లభించినట్లు.

వీరు బాడబులు అంటే అగ్నివలె పవిత్రులు అని, అగ్నిరూపులని కాదు. బాడబశబ్దాకి - గుఱ్ఱపు ముఖంగల అగ్ని అని, అది సముద్రంలో ఉంటుందనీ - దాన్ని బడబాగ్ని అంటారని పురాణోక్తి. బుద్ధిశాలురే గానీ తక్కువ జాతివారు కారు. ధీవరులు అంటే బుద్ధిలో శ్రేష్ఠులనే అర్థంతోపాటు, బెస్తవారు అనే అర్థం కూడా ఉంది. కాబట్టి ఆ అర్థం గ్రహించకండి.

అయోధ్యాపురంలోని బ్రాహ్మణులు అతి పవిత్రులు, పండితులు, నిత్యాగ్నిహోత్రులు, ధీవరులు అంటూ మొల్ల వర్ణన. శబ్దాల శ్లేషను ఆశ్రయించి చమత్కారం సాధించింది.

**విశే :** పక్షి కూడా రెండుసార్లు పుడుతుంది. ఒకసారి గ్రుడ్డుగా పుట్టి, తరువాతి గ్రుడ్డులో నుండి పిల్లగా పుడుతుంది. ద్విజ అంటే దంతాలు అనికూడా అర్థం వస్తుంది. పళ్లు-పాలపళ్లు ఒకసారి వచ్చి ఊడిపోతాయి, మళ్లీవస్తాయి.

**ఉ. రాజులు కాంతియందు, రతిరాజులు రూపమునందు, వాహినీ**
**రాజులు దానమందు, మృగరాజులు విక్రమ కేళియందు, గో**
**రాజులు భోగమందు, దినరాజులు సంతత తేజమందు, రా**
**రాజులు మానమందు, నగరమ్మున రాజకుమారు లందఱున్.** **34**

**ప్రతి :** నగరమ్మున=అయోధ్యానగరములోని, రాజకుమారులందఱున్=అందరు రాజకుమారులు, కాంతియందు=ప్రకాశమునందు, రాజులు=చంద్రులు, రూపమునందు=శరీరసౌందర్యములో, రతిరాజులు= మన్మథులు, దానమందు=దానము చేయుటలో, వాహినీరాజులు=సముద్రులు, విక్రమకేళియందు=పరాక్రమ ప్రదర్శనలో, మృగ రాజులు=సింహాలు, భోగమందు=సుఖాలు అనుభవించుటలో, గోరాజులు=ఆంబోతులు, ఇంద్రులు, సంతతతేజమందు=నిరంతర ప్రకాశమందు, దినరాజులు=సూర్యులు, మానమందు= అభిమానములో, రారాజులు=దుర్యోధనులు.

**తా :** అయోధ్యానగరంలో రాజకుమారులందరూ – కాంతిలో చంద్రులు, సౌందర్యంలో మన్మథులు, దానవిషయంలో సముద్రులు, పరాక్రమంలో సింహాలు, భోగాలు అనుభవించడంలో ఆబోతులు. ఆంబోతు– అడ్డూ ఆపూ లేకుండా ఏ పొలంలోనైనా, ఏది కావాలంటే దాన్ని తినేస్తుంది. ఎవ్వరూ అడ్డుచెప్పరు. మందలించరు. తేజస్సులో సూర్యులు. అభిమాన విషయంలో దుర్యోధనులు.

**విశే :** భారతకథలో దుర్యోధనుడు మిక్కిలి అభిమానవంతుడు అయితే ఇక్కడ చిన్న ఆక్షేపణ ఉంది. రామాయణం కాలంనాటి రాజుల్ని, త్రేతాయుగం వారిని, ద్వాపరయుగపు రారాజుతో పోల్చవచ్చా? అని, సమాధానంగా – మొల్ల రామాయణ రచనాకాలం నాటికి రారాజు ప్రసిద్ధుడే. పోల్చి చెప్పేటప్పుడు ప్రసిద్ధమైన వాటినే ఉపమానంగా చెప్పాలి కనుక దోషం కాదు అని తలచి రాజు శబ్దానికిముందు రతి, గో, వాహినీ, మృగ, దిన, రా – అనే విశేషణాలు చేర్చి అర్థభేదాన్ని సాధించి చక్కని పద్యం అల్లింది మొల్ల. గోరాజు అంటే – దేవతలరాజు ఇంద్రుడు, భోగాలు అనుభవించడంలో ప్రసిద్ధుడు. ఇంద్రభోగాలు అనుభవించేవారు అనికూడా అర్థం చెప్పవచ్చు.

**సీ.** **తగ దాన విఖ్యాతి ధరఁ గుబేరులు గాని**
**సతతాంగ కుష్ఠ పీడితులుగారు**
**నిర్మల సత్యోక్తి ధర్మ సూతులు గాని**
**చర్చింప ననృత భాషకులుగారు**
**ప్రకట విభూతి సౌభాగ్య రుద్రులు గాని**
**వసుధపై రోషమానసులుగారు**
**కమనీయ గాంభీర్య ఘనసముద్రులు గాని**
**యతులిత భంగ సంగతులు గారు**

**తే.** **వర్తకులుగాని పక్షు లే వరుసఁగారు**
**భోగులే గాని పాము లెప్పుడును గారు**
**సరసులే కాని కొలఁకుల జాడఁగారు**
**వన్నెకెక్కిన యప్పురి వైశ్యులెల్ల.** **35**

**ప్రతి :** తగన్=బాగుగా, దానవిఖ్యాతి=దానము చేయుటలో ప్రసిద్ధి పొందిన, ధరన్=భూమి మీద, కుబేరులు=కుబేరుని వంటి ధనవంతులు, కానీ=కాని, సతత=ఎల్లప్పుడు, అంగ=శరీరము, కుష్ఠపీడితులు గారు=కుష్ఠువ్యాధితో బాధపడేవారు కాదు, నిర్మల=స్వచ్ఛమయిన, సత్యోక్తి=నిజము చెప్పుటలో, ధర్మసూతులు=ధర్మరాజులు, కాని=కాని, చర్చింపన్=ఆలోచింపగా, అనృతభాషకులు=అబద్ధాలు చేప్పేవారు, కారు=కారు, ప్రకట=ప్రసిద్ధమైన, విభూతి=సంపద యొక్క సౌభాగ్యరుద్రులు=సౌభాగ్యం చేత శివుని వంటివార, కాని=కాని, వసుధపై=భూమిమీద, రోషమానసులు=కోపంతోనిండిన మనస్సు కలవారు, కారు=కారు, వర్తకులు=వ్యాపారాలు చేసేవారే, కాని=కాని, పక్షులు=పక్షులు, ఏవరుసన్ గారు=ఎలా చూసినా కారు, భోగులే కాని=అన్నిరకాల భోగాలను అనుభవించేవారే కాని, ఎప్పుడును=ఎన్నడును, పాములు కారు=పాములు కారు, సరసులేకాని=మంచిహృదయం కలవారే కానీ, కొలకుల=సరస్సుల, జాడగారు=వంటివారు కారు, వన్నెకెక్కిన యప్పురివైశ్యులెల్ల–వన్నెకెక్కిన=ప్రఖ్యాతివహించిన, అప్పురి=ఆ అయోధ్యాపురములోని, వైశ్యులెల్ల=కోమటివారందరు.

**తా :** అయోధ్యలోని కోమట్లు దానగుణంలో కుబేరులే, కానీ కుబేరునివలె కుష్ఠరోగంతో బాధపడేవారు కాదు. గొప్ప ధనవంతుని కుబేరుడు అని వ్యవహరిస్తారు. కుబేరుడు దేవలోకంలో ధనాధిపతి. నిజం పలికే విషయంలో ధర్మరాజువంటివారే. అయితే వీరు ఏనాడూ అబద్ధం చెప్పేవారు కాదు. భారతయుద్ధంలో 'అశ్వత్థామా హతః కుంజరః' అని అబద్ధం ధర్మరాజు చెప్పాడు. 'అశ్వత్థామా హతః' అని ద్రోణుడికి వినబడేలా గట్టిగా అని, 'కుంజరః' అని తనలో గొణుక్కున్నాడు. ఇలాంటి దోషం ఈపురి కోమట్లలో లేదు. గొప్ప ఐశ్వర్యంలో విభూతిసంపదలో రుద్రుని వంటివారే, రుద్రులే కానీ రుద్రునివలె కోపంతో మండిపడేవారు కాదు. రుద్రునికి కోపం ఎక్కువ, గాంభీర్యగుణంలో సముద్రమంతటి లోతైన మనస్సు కలవారు. కాని సముద్రంలోని అలల్లా లేవడం, పడిపోవడం వీరిలో ఉండదు.

వర్తకులే కాని పక్షులు కారు. వర్తక శబ్దానికి పక్షులు అనే అర్థం కూడా ఉంది. అందుకే పక్షులు కారు అని స్పష్టంగా చెప్పింది. భోగాలను అనుభవిస్తారు భోగులే కాని పాములు కారు. భోగము అంటే పడగ. పడగ గలది పాము. భోగము కలవాడు భోగి. సుఖానుభవము కలవాడు. పాములు అని రెండర్థాలు. అలాగేవారు సరసులు – సరసులు అంటే కొలనులు అనే అర్థం కూడా ఉంది. అందువల్ల వీరు కొలనులు కారు సహృదయులు. అయోధ్యాపురంలోని కోమట్లు అందరూ ప్రసిద్ధి కెక్కినవారే.

**క. పంటల భాగ్యము గలరై**
**పంటలపైఁ బంట లమర బ్రతుకుదు రెపుడున్**
**బంటలుఁ బాడియుఁ గల యా**
**పంటలు మొదలైన కాఁపుఁ బ్రజలా నగరిన్. 36**

**ప్రతి :** పంటలభాగ్యము=వరి, కందివంటి వివిధములైన పంటల సంపద, కలరై=కలిగినవారై, పంటలపై పంటలు=ఒక పంట తరువాత మరొక పంట, అమరన్=పండుతుండగా, ఎల్లప్పుడున్=ఎల్లకాలాల్లోనూ,

పంటలున్= అన్నిరకాలయిన పంటలు, పాడియున్=గోసంపద – పాలు, పెరుగు, వెన్న, నెయ్యి ఇవన్నీ పాడి సంపదలే, కల=కలిగినట్టు, ఆ పంటలు మొదలైనకాఁపు ప్రజలు=కాపులు ప్రధానంగా వ్యవసాయం వృత్తిగా గలవారు. ఈ కాపుల్లో మళ్లీ వివిధ తెగలున్నాయి. అందులో పంటలు పండించే కాపులను పంటకాపులు అంటారు, ఇలాపంటలు పండించే కాపుప్రజలు, ఆ నగరిన్=అయోధ్యానగరిలో, బ్రతుకుదురు=హాయిగా జీవిస్తూ ఉంటారు, ఎపుడున్=ఎల్లప్పుడు.

**తా :** అయోధ్యలో పంటలు పండించడంలో ప్రసిద్ధులైన రైతులు కాపులు. వీరు మంచి ధాన్యసంపద కలిగి, ఒక పంట తరువాత మరొక పంట పండిస్తూ, పాడిపంటలు పుష్కలంగా కలిగి వాటిని ఆనందంగా అనుభవిస్తూ పంటకాపులు సుఖంగా జీవిస్తున్నారు.

**సీ. కలికి చూపులచేతఁ గరఁగింప నేర్తురు**
**బ్రహ్మచారుల నైన భ్రాంతిగొలిపి,**
**మృదువచోరచనల వదలింప నేర్తురు**
**ఘన మునీంద్రుల నైనఁ గచ్చడములు**
**వలపులు పైఁజల్లి వలపింప నేర్తురు**
**సన్న్యాసులను నైనఁ జలముపట్టి,**
**సురత బంధమ్ములఁ జొక్కింప నేర్తురు**
**వ్రతములు గైకొన్న యతుల నైన**

**తే. నచల మెక్కింప నేరుతు రౌషధముల**
**మరులు గొలుపంగ నేర్తురు మంత్రములను**
**ధనము లంకింప నేర్తురు తక్కుసేసి**
**వాసి కెక్కిన యప్పురి వారసతులు. 37**

**ప్రతి :** కలికిచూపుల చేత=విలాసవంతయిన చూపులతో, బ్రహ్మచారులనైన=వివాహము కాని విద్యార్థులనయినా, కరగింపనేర్తురు=వారి మనసు రంజింపచేసి లోబరచుకోగలరు, భ్రాంతి గొలిపి= మోహములో పడవేసి, మృదువచోరచనలన్=లలితమైన మాటల నేర్పుతో, ఘనమునీంద్రులనైన= విశేషమయిన తపస్సు చేసిన మునిశ్రేష్ఠులనైనా, కచ్చడములు=కౌపీనములు–వారు ధరించిన గోచీలు, వద లింపనేర్తురు=విప్పుకునేలా చేస్తారు, వలపులు=ప్రేమలు, పైజల్లి=మీద కురిపించి, సన్న్యాసులనునైన= అన్నిటిని వదలి భగవద్ధ్యానంలో ఉండే సన్న్యాసులనయినా, చలముపట్టి=పంతముపట్టి, వలపింపనేర్తురు= తమను వలపించేటట్లుగా చేయగలరు, వ్రతములుగైకొన్న=విశేషమైన వ్రతాలను చేసే దీక్ష తీసుకున్న, యతులనైన=యతీశ్వరులనయినా, సురత బంధమ్ములన్=వివిధ సంభోగపు కేళీబంధాలతో, చొక్కింపనేర్తురు= తృప్తి కలిగించగలరు, ఔషధముల=మందులతో–శృంగారక్రీడాసక్తులు కావడానికి వాడే మందులతో,

అచలమును=పర్వతమును, ఎక్కింపనేర్తురు=ఎక్కించగలరు, మంత్రములను=వివిధరకాలయిన మంత్రాలతో, మరులు గొలుపంగ=ప్రేమ, వ్యామోహము కలిగేలా, నేర్తురు=చేయగలరు, వాసికెక్కిన=ప్రసిద్ధిపొందిన, అప్పురి=ఆ అయోధ్యాపురి, వారసతులు=వేశ్యలు, భోగకాంతలు.

**తా :** అయోధ్యలోని వేశ్యకాంతలు తమ మనోహరమైన చూపులతో బ్రహ్మచారులనయినా లోబరుచు కోగలరు. కమ్మని మాటలతో, మునిశ్రేష్ఠుల నిగ్రహన్ని కూడా కదిలించి వేయగలరు. వలపు కురిపించి సన్యాసులను కూడా ప్రేమలోకి దింపగలరు. వ్రత దీక్షవహించిన యతులను కూడా కామకేళీవిలాసాలతో ఆనందింప చేయగలరు. మూలికలతో మందుపెట్టి కొండలు ఎక్కించగలరు (ఎక్కడికి రమ్మంటే అక్కడికి వచ్చేలా చేయగలరు). మంత్రాలతో ప్రణయంలోకి తీసుకురాగలరు. మాయోపాయాలతో రసికుల వద్దనుండి ధనాన్ని రాబట్టుకో గలరు. ఇన్నివిధాలుగా అయోధ్యలోని వేశ్యాశిఖామణులు ప్రసిద్ధిపొంది ఉన్నారు.

ఇంతవరకు అయోధ్యానగరంలోని బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు, కాపులు, వేశ్యలు – ఏయేరీతిలో ప్రసిద్ధికెక్కారో వర్ణించింది మొల్ల. ఇప్పుడు అయోధ్యలోని తోటలు ఎంత గొప్పగా విశేషంగా ఉన్నాయో వర్ణిస్తోంది.

**సీ.** **శారద గాయత్రి శాండిల్య గాలవ**
**కపిల కౌశిక కుల ఖ్యాతి గలిగి,**
**మదన విష్వక్సేన మాధవ నారద**
**శుక వైజయంతి కార్జునులు గలిగి,**
**చంద్రార్క గుహ గిరిసంభవ జయ వృష**
**కుంభ బాణాదులఁ గొమరు మిగిలి,**
**సుమన ఐరావత సురభి శక్రామృత**
**పారిజాతముల సొంపారఁ గలిగి,**

**తే.** **బ్రహ్మ నిలయమ్ము, వైకుంఠ పట్టణమ్ము**
**నాగ కంకణు శైలమ్ము,నాక పురము,**
**లలిత గతిఁ బోలి, యే వేళఁ దులను దూఁగి**
**ఘనత నొప్పారు నప్పురి వనము లెల్ల.** **38**

ఈ పద్యంలో శ్లేషాలంకారం కూర్చబడింది. ఒకటి వనంపరంగా రెండోది ఆయా లోకాలపరంగా. **మొదట వనపరంగా అర్థాలు :** శారద=బ్రాహ్మీ, సరస్వతీ ఆకు, ఏడాకు అరటిచెట్లు, గాయత్రి=చంద్రచెట్లు, శాండిల్య=మారేడుచెట్టు, గాలవ=లొద్దుగ, కపిల=ఇరుగుడు, కౌశికకుల విఖ్యాతిగలిగి=రకరకాల కొబ్బరి చెట్లతో పేరుపొంది – (చెన్నంగి కొబ్బరి, ముంత కొబ్బరి, గంగాబోండాలు), **బ్రహ్మలోకంలో**–శారద= సరస్వతీదేవి, గాయత్రి= గాయత్రీదేవి, శాండిల్య, గాలవ, కపిల, కౌశికుల=వీరందరూ మహర్షులు. ఈ

పద్యంలో – పై నాలుగు పాదాలు క్రింద తేటగీతిలో చెప్పిన నాలుగు లోకాలతో వరుసగా అన్వయించుకోవాలి. ప్రథమపాదం – బ్రహ్మలోకం.

**2వ పాదం :** వైకుంఠపట్టణం – వనపరంగా ప్రతిపదార్థం: మదన=ఉమ్మెత్తచెట్లు, విష్వక్సేన= విష్ణుక్రాంతచెట్లు, మాధవ=ఇప్పచెట్లు, నారద=నారింజచెట్లు, శుక=దిరిసెన, శిరీషవృక్షం, వైజయింతిక= నెల్లిచెట్టు, అర్జునులు= తెల్లమద్ది చెట్లు, కలిగి=కలిగి, **వైకుంఠపురపరంగా :** మదన=మన్మథుడు, విష్వక్సేనుడు, మాధవుడు, నారదుడు, శుకమహర్షి, వైజయంతికామాల, అర్జున= నరుడనే మహర్షి – వైకుంఠంలో దర్శనమిచ్చే దేవతలు, ఋషులు.

**మూడోపాదం వనపరంగా :** నాగకంకణు శైలమ్ము=శివునికొండ కైలాసము, చంద్ర=ఏలకీ లతలు, అర్క=జిల్లేడు, గుహ=పొన్న, గిరిసంభవ=జువ్విచెట్టు, జయ=జమ్మిచెట్టు, వృష=అడ్డసరము, కుంభ=గుగ్గిలపు చెట్టు, బాణ= రెల్లుపొదలు, ఆదులు=మొదలయిన వాటితో, కొమరు మిగిలి=మిక్కిలి అందముగా ఒప్పి.

**కైలాసపురిపరంగా :** చంద్రుడు, అర్క=సూర్యుడు, గుహ=కుమారస్వామి, గిరిసంభవ=గిరిజ, పార్వతీదేవి, జయ=పార్వతి చెలికత్తె, వృష=శివుని వాహనమైన ఎద్దు, కుంభ=ప్రమథగణాలలో ఒకడయిన కుంభుడు, బాణాదులు=శివభక్తుడైన బాణాసురుడు మొదలైనవారితో, కొమరు మిగిలి=మిక్కిలి రమణీయంగా ఉంది.

**నాల్గవపాదం :** నాకపురం, అంటే స్వర్గలోకం, వనపరంగా–సుమన=బొండుమల్లె, ఐరావత=గజనిమ్మ, సురభి=తులసి, శక్ర=దేవదారు, అమృత=కరక్కాయచెట్టు, పారిజాతముల=పారిజాతపుచెట్లు, సొంపారఁగలిగి= అందముగా ఉండగా.

**స్వర్గలోకపరంగా :** సుమన=దేవతలు, ఐరావత=తెల్లని ఏనుగు (ఇంద్రుని వాహనము), సురభి=కామధేనువు, శక్ర=ఇంద్రుడు, అమృత=అమృతము, పారిజాతము=పారిజాతవృక్షము (శ్రీకృష్ణుడు సత్యభామకోసం అపహరించినది ఇదే.) సొంపార గలిగి=సొంపుగా ఒప్పిఉండి – నాకపురంలా ఉందట, లలితగతి= విలాసపురీతిలో, పోలి=సమానమై ఒప్పి, ఏవేళన్=ఏకాలంలో అయినా, తులనుదూగి=సాటిగా నిలిచి, ఘనతన్=గొప్పతనముతో, అప్పురిన్=ఆ అయోధ్యా నగరములోని–వనములెల్ల=తోటలన్ని, ఒప్పారున్= శోభించును.

**తా :** అయోధ్యాపురంలోని వనములు బ్రాహ్మీ, ఏడాకుల అరటిచెట్లు, చంద్రచెట్లు, మారేడు చెట్లు, లొద్దుగ చెట్లు, ఇరుగుడు చెట్లు – రకరకాల కొబ్బరిచెట్లు కలిగి బ్రహ్మ నిలయమైన సత్యంలోకంవలె, ఉమ్మెత్త, విష్ణుక్రాంత, ఇప్పచెట్లు, నారింజ దిరిసెన, నెల్లి, తెల్లమద్ది చెట్లు కలిగి వైకుంఠనగరం వలెను, ఏలకీలతలు, జిల్లేళ్లు, పొన్న, జువ్వి, జమ్మి, అడ్డసరం, గుగ్గిలపు చెట్లు, రెల్లుపొదలు కలిగి కైలాస గిరిలాగా, బొండుమల్లె, తులసి మొక్కలతో, గజనిమ్మ, దేవదారు, కరక, పారిజాత వృక్షాలతో సాక్షాత్తూ స్వర్గలోకంవలె ఘనత వహించి, లలితగతిని మనోహరంగా, ఆహ్లాదకరంగా అన్నివేళలా ఒప్పి ఉన్నాయి.

**విశే :** మొల్ల ఈ వనవర్ణలో పాఠకులకు ఆయా వృక్షాలను చూపిస్తూ సత్యలోక, వైకుంఠ, కైలాస, స్వర్గలోకాలను కూడా దర్శింపచేస్తోంది. ఇక్కడ అయోధ్యలో వనవిహారం చేస్తూనే ఆయాలోకాల్లో ప్రవేశించి అక్కడి ప్రధాన వ్యక్తులను, జంతువులను, వస్తువులను కలుసుకుని ఆనందించి తరించే చక్కని సావకాశం కల్పించింది తన వాక్ప్రౌఢితో.

ఈ వర్ణనకు మొల్ల సీసపద్యాన్ని ఎన్నుకుంది. సీసపద్యంలోని పై నాలుగు పాదాలకు వరుసగా ఎత్తుగీతిలో నాల్గులోకాలతో అన్వయం కూర్చింది. దీన్ని క్రమాలంకారం అంటారు.

**మొదటిపాదంలో –** ఒక్కొక్క పదం చదువుతూ వచ్చే పాఠకులకు సరస్వతి, గాయత్రి – బ్రహ్మగారి భార్యలు, శాండిల్యుడు, గాలవ, కపిల, కైశికులనే మహర్షులు దర్శనం ఇస్తున్నారు. ఈ మహనీయుల పేర్లలోనే వరుసగా సరస్వతీ ఆకు, బ్రాహ్మీ, చంద్ర, మారేడు, లొద్దుగ, ఇరుగుడు, కొబ్బరిచెట్లు ఉన్నాయి.

**రెండవపాదంలో –** వైకుంఠనగరాన్ని చూపిస్తున్నది. మన్మథుడు, విష్వక్సేనుడు, మాధవుడు, నారదుడు, శుకుడు, నరుడు అనే మహర్షులతోపాటు వైజయంతీమాల కూడా వైకుంఠంలో మనకు దర్శనమిస్తుంది. ఈ పేర్లలో వరసగా ఉమ్మెత్త, విష్ణుక్రాంత, ఇప్పచెట్లు, నారింజచెట్లు, దిరిసెన, నెల్లిచెట్లు కానవస్తాయి.

**మూడోపాదంలో –** నాగకంకణు శైలం – కైలాసం – చంద్రుడు, సూర్యుడు, కుమారస్వామి, పార్వతి, జయ, వృషభము, బాణాసురుడు మొదలయిన భక్తులు కనిపిస్తారు. ఈ పదాల్లో వరసగా ఏలకీలతలు, జిల్లేడుచెట్లు, పొన్నచెట్లు, జువ్విచెట్లు, జమ్మిచెట్లు, అడ్డసరము, గుగ్గిలపు చెట్లు రెల్లుపొదలు కనిపిస్తాయి.

**నాలుగోపాదం –** స్వర్గలోకం. ఈ లోకంలో దేవతలు, ఐరావతము, కామధేనువు, ఇంద్రుడు, అమృతము, పారిజాతము కానవస్తారు. ఈ పదాలు వినగానే ఆ లోకం స్వర్గలోకమని ఎవరయినా గుర్తుపట్టెయ్యవచ్చు. మొల్ల కవితలో ఆయా లోకాల్లోనివన్నీ చెట్లుగా మారిపోయాయి.

స్వర్గలోకంలోని చెట్లువరుసగా, బొండుమల్లె, గజనిమ్మ, తులసి, దేవదారు, కరకచెట్టు, పారిజాతవృక్షము, ఇలా మహనీయంగా ఎల్లవేళలా – బ్రహ్మపురం, వైకుంఠం, కైలాసం, స్వర్గలోకాలతో సరితూగి లలిత గతి ఘనత నొప్పారు, అప్పురి వనములెల్ల – అందిమొల్ల.

ఇక్కడ **'లలితగతి'** అనడంలో మొల్ల **'లలితాపరమేశ్వరిని'** సూచన చేస్తోంది భక్తితో, శ్రీమాత అయిన ఆమె ప్రకృతిస్వరూపిణి, వనస్వరూపిణి, వనదుర్గ. అందుకే మొల్ల లలితాస్వరూపంగా భావన చేసింది. సర్వలోక సంరక్షణి లలితామాత, ఈ పద్యంలో ప్రస్తావించిన – బ్రహ్మలోకం, వైకుంఠనగరం, కైలాసగిరి, నాకలోకం అన్నీ – ఆ తల్లి స్వరూపాలే, నివాసాలే. అందుకే 'లలితగతి' అనడం, ఆమె నడిపిస్తున్నది ఈ లోకాలనన్నిటిని, భాషమీద పట్టుగల కవులు పదాలతో ఏ లోకాన్నయినా, దర్శింపచేస్తారనడానికి మొల్ల వ్రాసిన ఈ పద్యం పరమోదహరణం.

మొల్ల తాను పెద్దగా ఏమీ చదువుకోలేదు అంది వినయంగా, ఏవేవి చదువుకోలేదో చెప్పిన జాబితాలో నిఘంటువులు కూడా ఉన్నాయి. మొల్లకు నిఘంటువుల పరిచయం ఉందో లేదో ఈపద్యం స్పష్టం చేస్తోంది.

## అయోధ్యాపురిలోని మేడల సొబగు వర్ణన

**చ. కనక విలాస కుంభములు గబ్బి కుచంబుల లీలఁ, జిత్ర కే**
**తనములు పైఁట కొంగుల విధంబునఁ గ్రాల, గవాక్షముల్ రహిన్**
**గనుఁగవ యట్ల పొల్పెసఁగఁగా భువి భోగులు మెచ్చ భోగినీ**
**జనముల రీతిఁ జెల్వమరు సౌధ నికాయము పాయ కప్పురిన్. 39**

**ప్రతి :** కనక=బంగారపు, విలాసకుంభములు=అందమయిన కలశాలు, గబ్బికుచంబుల లీలన్=నిక్కిన చన్నుల వలె, చిత్రకేతనములు=రంగు రంగుల జెండాలు, పైటకొంగుల విధంబునన్=పైట కొంగులవలె, క్రాలన్=ప్రకాశించగా, గవాక్షముల్=కిటికీలు, రహిన్=అందముగా, కనుఁగవ=రెండు కళ్లవలె, పొల్పు= అందము, ఎసగగా=ఒప్పగా, భువి=భూమిపై, భోగులు=రసికులు, మెచ్చన్=మెచ్చుకొనే విధంగా, సౌధనికాయము=మేడల సమూహం, అప్పురిన్=ఆ అయోధ్యలో, భోగినీజనముల రీతిన్=వేశ్యస్త్రీలవలె. చెల్వమరు=అందముతో ఒప్పుచున్నవి.

**తా :** ఆ పట్టణంలోని మేడల సముదాయం – విటజనులకు వారకామినుల వలె అందముగా కన్పిస్తున్నివట. మేడలు స్త్రీలవలె ఎలా కనిపిస్తున్నవీ అంటే.

మేడలపైభాగాన అందంకోసం అమర్చిన బంగారు కలశాలు, స్తనాలవలె ఉన్నాయిట, మేడలపైన ఎగురుతున్న రంగురంగుల జెండాలు ఆ స్త్రీలు ధరించిన పైటల వలె రెపరెపలాడుతూ ఎగురుతున్నాయట, ఆ సౌధాలకు గల పెద్దపెద్ద కిటికీలు భోగినీకాంతల నేత్రములవలె కన్పిస్తున్నాయట, మొత్తానికి విటరాయుళ్ళకు సౌధాల్లోనే కాదు సౌధాలే భోగకాంతలవలె కన్పిస్తున్నవని మొల్ల వర్ణన.

**విశే :** అచేతనంలో చేతనత్వాన్ని ఆరోపించి చేసిన ఈ వర్ణన తెలుగు సాహిత్యంలోనే అరుదైనది.

## అయోధ్యలోని సరస్సుల వర్ణన

**తే. మకర, కచ్ఛప, శంఖ, పద్మములు గలిగి,**
**ధనదు నగరమ్ముపైఁ గాలు ద్రవ్వుచుండు**
**సరస మాధుర్య గాంభీర్య సరణిఁ బేర్చి**
**గుఱుతు మీఱిన యప్పురి కొలఁకు లెల్ల. 40**

**ప్రతి :** మకర=మొసళ్లు, కచ్ఛప=తాబేళ్లు, శంఖపద్మములు=శంఖములు, తామరపువ్వులు, కలిగి= కలిగియుండి, సరసమాధుర్య=తీయని జలాలతో కూడి, గాంభీర్యసరణిన్=మిక్కిలి లోతుకలిగి, పేర్చి= అతిశయించి, గుఱుతు మీరిన=లెక్కకుమించిన, అప్పురి=ఆ పురములోని, కొలకులు+ఎల్ల=కొలకులెల్ల= సరస్సులన్నీ, ధనదు నగరమ్ముపై=కుబేరుని యొక్క నగరమైన అలకాపురిమీద, కాలుద్రవ్వుచుండు= పోటీపడుచుండును.

**తా :** అయోధ్యలో తియ్యటి నీరుకలిగి, మిక్కిలి లోతుకలిగిన సరస్సులు ఉన్నాయి. ఆ సరస్సులలో కొన్ని జలజంతువులయిన మొసళ్లు, తాబేళ్లు, శంఖాలుకాక తామరపువ్వులు ఉన్నాయి. తమలోని సంపదను చూసుకుని ఆ సరస్సులు కుబేరుని పట్టణమయిన అలకాపురితో పోటీపడుతున్నాయి, కాదు మేమే అధికం అని కయ్యానికి కాలు దువ్వుతున్నాయా అన్నట్లుగా ఉన్నాయట.

**విశే :** కుబేరుడు ధనాధిపతి. అతనిపురంలో – అతని అధీనంలో – మకరము, కచ్ఛపము, శంఖము, పద్మము అనే పేర్లుగల నిధులు ఉన్నాయి. శ్లేషతో సాధించిన సొగసిది, మొల్ల కవితా లక్షణాలు చెప్పే సందర్భంలో 'కందువమాటలు' ఉంటే కవిత అందంగా ఉంటుంది అంది. 'కాలుద్రవ్వుచుండు' అనేది చక్కని కందువమాట.

**తే.** **అమృత ధారా ప్రవాహమ్మునందు నెపుడు**
**నొక్క ధేనువు దివి నున్న నుచిత మగునె?**
**అమృత ధారా ప్రవాహమ్మునందు నెపుడుఁ**
**బెక్కు ధేనువు లప్పురిఁ బేరు నొందు.** **41**

**ప్రతి :** అమృతధారా ప్రవాహమ్మునందున్=పాలధారలను ప్రవహింప చేయుటలో, ఎపుడు=ఎల్లప్పుడు, ఒక్క ధేనువు=ఒకే ఒక ఆవు కామధేనువు, దివిన్=స్వర్గములో, ఉన్నన్=ఉన్నట్లయిన, ఉచిత మగునె?=అది అధికమగునా?, అమృత ధారాప్రవాహమ్మునందున్=పాలధారలను కురిపించి వెల్లువలా చేసే విషయంలో, ఎపుడు=ఎల్లప్పుడు, పెక్కుధేనువులు=ఎన్నో ఆవులు, అప్పురిన్=ఆ అయోధ్యాపురంలో, పేరునొందు=ప్రసిద్ధికెక్కి ఉన్నాయి.

**తా :** స్వర్గలోకములో అమృతధారలను ప్రవహింపచేసే కామధేనువు ఒకటే ఉన్నది. అది ఏమంత గొప్ప? అయోధ్యానగరంలో అమృతంవంటి పాలను ప్రవాహంగా కురిపించే ఆవులు అనేకం ప్రసిద్ధికెక్కి ఉన్నాయి.

**విశే :** ఈ పద్యంలో పాదయమకం పాటింపబడింది.

**క.** **ఈ కరణి సకల విభవ**
**శ్రీకర మయి తాఁ బ్రసిద్ధిఁ జెలఁగుచు మహిమన్**
**నాకపురితోడ నొఱయుచు**
**సాకేత పురమ్ము వెలయు జగము నుతింపన్.** **42**

**ప్రతి :** ఈ కరణి=ఈ విధముగా, సకల విభవ=సమస్తమైన సంపదలతో, శ్రీకరమైన=లక్ష్మీప్రదమైన, తాన్=ఆపట్టణము, ప్రసిద్ధిన్=గొప్ప పేరుతో, చెలగుచు=ఒప్పుచు, మహిమన్=గొప్పతనములో, నాకపురితోడన్=స్వర్గలోకపు రాజధాని అయిన అమరావతితో, ఒఱయుచు=పోటీపడుతూ, సాకేతపురమ్ము=అయోధ్యాపట్టణము, జగము=ప్రపంచమంతా, నుతింపన్=కొనియాడగా, వెలయు=ప్రకాశించుచున్నది.

**తా :** అయోధ్యాపురము సకలసంపదలతో లక్ష్మీకళ ఒప్పుతూ దేవతల రాజధాని అయిన అమరావతితో గొప్పతనంలో పోటీపడుతూ ప్రపంచమంతా పొగిడే విధంగా ప్రకాశిస్తూ ఉన్నది.

**వ. అట్టి మహా పట్టణంబున కధీశ్వరుం డెట్టివాఁ డనఁగ 43**

**ప్రతి :** అట్టి=అటువంటి, మహాపట్టణంబునకున్=గొప్ప పట్టణమునకు, అధీశ్వరుండు=అధినాయకుడగు రాజు, ఎట్టివాఁడు అనఁగ=ఎటువంటివాడనగా –

**తా :** అట్టి మహా పట్టణానికి ప్రభువయినవాడు. ఎలాంటివాడు. అంటే

**సీ. తన కీర్తి కర్పూర తతిచేత వాసించెఁ**
**పటుతర బ్రహ్మాండ భాండ మెల్లఁ,**
**దన శౌర్య దీప్తిచే నినబింబ మనయంబుఁ**
**బగ లెల్ల మాఁగుడు పడఁగఁ జేసెఁ**
**దన దాన విఖ్యాతి ననుదినంబును నర్థి**
**దారిద్ర్యము వెళ్లఁ బారఁదఱిమెఁ,**
**దన నీతి మహిమచే జన లోక మంతయుఁ**
**దగిలి సంతతమును బొగడఁ దనరెఁ**

**తే. భళిర! కొనియాడఁ బాత్రమై పరఁగినట్టి**
**వైరి నృపజాల మేఘ సమీరణుండు,**
**దినకరాన్వయ పాథోధి వనజ వైరి**
**నిశిత కౌక్షేయక కరుండు దశరథుండు. 44**

**ప్రతి :** తనకీర్తి=దశరథుని కీర్తి, కర్పూరతతిచేత=రాసులవలెపోయబడి కర్పూరము చేత, వాసించెన్=పరిమళించినది, పటుతర=అత్యధికమైన, బ్రహ్మాండ భాండమెల్ల=కుండవంటి ఈ ప్రపంచమంతా, తనశౌర్యదీప్తిచే=తన పరాక్రమమనే తేజస్సు చేత, ఇన బింబము=సూర్యబింబము, అనయంబున్=ఎల్లప్పుడు, పగలెల్ల=పగటిపూట అంతా, మాగుడువడగన్=మసకబారి నల్లగా ఉండేటట్లు, చేసెన్=చేసెను. తనదానవిఖ్యాతిన్=తాను చేయుదానముల ప్రసిద్ధితో, అనుదినంబును= ప్రతిరోజు, అర్థి=యాచించువారి, దారిద్ర్యములు=లేమి, బీదతనాన్ని, వెళ్లబాఱ దఱిమె=పారిపోవునట్లు చేసిన, తననీతి మహిమచే=తన రాజనీతి విశేషముచేత, జనలోకమంతయు=జనులందరు, తగిలి=పూనుకొని, సంతతమును=ఎల్లప్పుడు, పొగడన్=కొనియాడగా, తనరె=ఒప్పెను, భళిర=ఆహా!, కొనియాడన్=పొగడడానికి, పాత్రమై=అర్హతగలవాడై, పరగినట్టి=ఒప్పినటువంటి, వైరినృపజాల=శత్రురాజుల సమూహములనెడు, మేఘ=మేఘములకు, సమీరణుండు=గాలివంటివాడు, దినకరాన్వయ=సూర్యవంశమనే, పాథోధి=సముద్రానికి, వనజవైరి=చంద్రుడు, నిశిత=వాడియైన, కౌక్షేయక=ఖడ్గమును, కరుండు=చేతిలో ధరించినవాడు, దశరథుండు.

**తా :** తన కీర్తి అనే కర్పూరపు పరిమళంతో ప్రపంచాన్ని నింపేసినవాడు, తన పరాక్రమము అనే తేజస్సుతో పగటిపూట ప్రకాశించే సూర్యమండలాన్ని కాంతి విహీనంగా చేసినవాడు, తన దానగుణంతో యాచకుల పేదకరికాన్ని తరిమేసినవాడు, తన నీతివిధానంతో ప్రజలందరూ మెచ్చేలా చేసినవాడు, శత్రురాజులు అనే మేఘాలను చెల్లాచెదరు చేసే వాయువు వంటివాడు, సూర్యవంశమనే సముద్రానికి చంద్రుని వంటివాడు, వాడియైన కత్తిని చేతిలో ధరించినవాడు అయిన దశరథుడు అయోధ్యకు రాజుగా పరిపాలిస్తున్నాడు.

**సీ. పాలింపఁ డవినీతిపరుల మన్ననఁ జేసి**
**పాలించు సజ్జన ప్రతతి నెపుడు,**
**మనుపఁ డెన్నఁడుఁ జోరులను గారవము చేసి**
**మనుచు నాశ్రిత కోటి ఘనముగాఁగ**
**వెఱ పెఱుంగఁడు వైరి వీరులఁ బొడగన్న**
**వెఱచు బొం కే యెడ దొరలునొ యని,**
**తలఁక దర్థి వ్రాతములు మీఱి పైకొన్నఁ**
**దలఁకు ధర్మ మ్మెందుఁ దప్పునొ యని,**

**తే. సరవిఁ బోషింపఁ దరిగణషట్క మెపుడు**
**వెలయఁ బోషించు నిత్యమ్ము విప్ర వరుల,**
**భాస్కరాన్వయ తేజో విభాసితుండు**
**మాన ధుర్యుండు దశరథ క్ష్మావరుండు.** **45**

**ప్రతి :** అవినీతిపరులన్=అన్యాయమార్గంలో నడిచేవారిని, మన్ననఁజేసి=ఆదరించి, పాలింపడు=కాపాడడు, సజ్జనప్రతతిన్=ఉత్తముల సమూహమును, ఎపుడు, పాలించు=కాపాడును, ఎన్నఁడున్=ఎప్పుడూ, చోరులను=దొంగలను, గారవముచేసి=ప్రేమగా చూసి, మనుపఁడు=పోషింపడు, ఆశ్రిత=ఆశ్రయించిన, కోటి=ఎక్కువమందిని, ఘనముఁగాగన్=అధికముగా, మనుచున్=పోషించును, వైరివీరులన్=శత్రువీరులను, పొడగన్న=చూచినప్పుడు, వెఱపెఱుంగఁడు=భయము ఎరుగడు, బొంకు+ఏయెడ=బొంకేయెడ=అసత్యము ఎక్కడ, దొరలునొ యని=తెలియకుండా పలుకుతానేమో అని, వెఱచున్=భయపడును, అర్థివ్రాతములు=యాచకులగుంపులు, మీఱి=అధికమైన, పైకొన్న=మీదకు వచ్చిన, తలఁకఁడు=వెను దీయడు, ధర్మము, ఎందు=ఏ విషయంలోనయినా, తప్పునొ యని, తలఁకు=భయపడును, సరవిన్=క్రమముగా, అరిగణషట్కము=ఆరుగురు శత్రువుల సమూహాన్ని (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు) ఎపుడు, పోషింపడు, విప్రవరుల= బ్రాహ్మణశ్రేష్ఠులను, వెలయన్=ఒప్పుగా, పోషించు, నిత్యమ్ము=ఎల్లప్పుడు, భాస్కరాన్వయ= సూర్యవంశము యొక్క, తేజో విభాసితుండు=తేజస్సుతో ప్రకాశించేవాడు, మానధుర్యుండు=అభిమానముతో కూడినట్టివాడు, దశరథక్ష్మావరుండు=దశరథుడు అనేరాజు.

**తా :** ఆ దశరథమహారాజు – అవినీతిపరులను కాపాడదు, సజ్జనులను కాపాడుతాడు. దొంగలను ఆదరించి పోషించదు, తనను ఆశ్రయించిన వారిని రక్షిస్తాడు. శత్రువీరులను చూసి భయపడదు, ఎక్కడ పొరపాటున అబద్ధం దొర్లుతుందో అని భయపడతాడు. యాచకులు గుంపులుగా వచ్చిమూగినా జంకడు, ధర్మం తప్పుతుందేమో అని భయపతాడు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే శత్రువర్గాన్ని పోషింపడు, నిత్యము బ్రాహ్మణోత్తములను పోషిస్తాడు. సూర్యవంశపు తేజస్సుతో విరాజిల్లే దశరథమహారాజు అభిమానధనుడు.

**సీ.** **కనఁగోరఁ డొక నాఁడుఁ గన్నులఁ బర వధూ**
**లావణ్య సౌభాగ్య లక్షణములు,**
**వినఁగోరఁ డొకనాఁడు వీనులకింపుగాఁ**
**గొలుచువారల మీఁది కొండెములను,**
**చిత్తంబు వెడలించి జిహ్వాగ్రమునఁ గోరి**
**పలుకఁడు కాఠిన్య భాషణములు,**
**తలఁపఁ డించుకయైన ధనకాంక్ష నేనాఁడు**
**బంధు మిత్రాశ్రిత ప్రతతిఁ జెఱుప,**

**తే.** **సతత గాంభీర్య ధైర్య భూషణ పరుండు**
**వార్త కెక్కిన రాజన్య వర్తనుండు**
**సకల భూపాల జనసభా సన్నుతుండు**
**ధర్మ తాత్పర్య నిరతుండు, దశరథుండు.** **46**

**ప్రతి :** ఒకనాఁడు=ఒకప్పుడు కూడ, కన్నుల=కన్నులతో, పరవధూలావణ్య సౌభాగ్యలక్షణములు=పరస్త్రీల అందాల సొబగులు, కనఁగోరఁడు=చూడాలి అని అనుకోడు, ఒకనాఁడు= ఏనాడూ, వీనులకింపుగాన్= చెవులకు ఆనందం కలిగేలా, కొలుచువారల మీఁది=తనను సేవించే వారిమీద, కొండెములను=చాడీలను, వినఁగోరఁడు=వినాలని కోరుకోడు, చిత్తంబు=మనస్సు, వెడలించి=ప్రకటించి, జిహ్వాగ్రమునన్=నాలుక చివరను, కోరి=కావాలని, కాఠిన్యభాషణములు=కటువైన పరుషమైన మాటలు పలుకడు, ఇంచుకయైన= కొంచెమైనను, ధనకాంక్షన్=డబ్బుమీది ఆశతో, ఏనాడు, బంధుమిత్ర=చుట్టాలను, స్నేహితులను, ఆశ్రిత ప్రతతిన్=ఆశ్రయించిన సమూహాన్ని, చెఱుప= చెడగొట్టుటకు, తలపడు=ఆలోచింపడు, సతత= ఎల్లప్పుడు, గాంభీర్య=లోతైన స్వభావము, ధైర్య=ధైర్యమును, భూషణపరుండు=అలంకారములుగా అతిశయించినవాడు, వార్తకెక్కిన=ప్రసిద్ధి కెక్కిన, రాజన్యవర్తనుండు=ఉత్తములైన రాజుల స్వభావము కలవాడు, సకల=సమస్తమైన, భూపాలజన=రాజసమూహము యొక్క, సభాసన్నుతుండు=సభలలో కొనియాడబడేవాడు, ధర్మతాత్పర్యనిరతుండు=ధర్మమును ఆచరించుటలో శ్రద్ధకలవాడై ఒప్పెను.

**తా :** దశరథ మహారాజు ఒకనాడు కూడ పరస్త్రీల అందచందాలు చూడాలి అనుకోడు. తనను కొలిచేవారి మీద చాడీలు చెవులకు ఇంపుగా వినాలి అనుకోడు, తన నాలుక చివర ఒక్క పరుషమయిన మాటకూడా కావాలని పలుకడు. ధనము మీదగల వ్యామోహముతో తన బంధుమిత్రులను గాని, తనను ఆశ్రయించిన వారిని గాని చెడగొట్టాలని ఏనాడు అనుకోడు. నిరంతరము లోతైన స్వభావముతో మెలగేవాడు. ధైర్యమే భూషణముగా కలవాడు, లోకంలో ప్రసిద్ధికెక్కిన ఉత్తములయిన రాజుల వంటివాడు. రాజసమూహాలలో, సభలలో కొనియాడబడేవాడు, ధర్మాచరణతత్పరుడు - దశరథుడు.

**విశే :** వార్తకెక్కిన రాజన్యవర్తనుండు, వార్తకెక్కిన అంటే బాగా ప్రసిద్ధికెక్కినవాడు అని, వార్తల్లో వచ్చింది. అంటే ప్రసిద్ధికెక్కినది అని.

**సీ. విరహాతిశయమున వృద్ధి పొందఁగ లేక**
**విష ధరుండును గోఱ విషముఁ బూనె,**
**తాపంబు క్రొవ్వెంచి తరియింప నోపక**
**పలుమాఱుఁ గడగండ్లఁబడియెఁ గరులు,**
**కందర్ప శర వృష్టి నంద నోపక ఘృష్టి**
**వనవాసమునఁ గ్రుస్సె వనరు సూపె,**
**దీపించి వలపాపనోపక కూర్మంబు**
**కుక్షిలోపలఁ దలఁగ్రుక్కికొనియె.**

**తే. కుంభినీ కాంత తమమీఁది కూర్మి విడిచి**
**ప్రకట రాజన్య మస్తకాభరణ మకుట**
**చారు మాణిక్య దీపిత చరణుఁడైన**
**దశరథాధీశు భుజపీఠిఁదగిలినంత.** **47**

భూకాంత దశరథ మహారాజు భుజపీఠము మీదికి రాగానే - భూమిని మోసే శేషుడు, వరాహము, ఏనుగులు, కూర్మముల స్పందన చమత్కరించిన పద్యమిది.

**ప్రతి :** విరహాతి శయమున=ఎడబాటు వల్లకలిగిన విరహం ఎక్కువ కావడంవల్ల, వృద్ధి పొందగలేక=అభివృద్ధి పొందలేక, విషధరుండును=విషమును ధరించువాడు ఆదిశేషుడు, కోఱన్=తనకోరలో, విషముపూనె= విషాన్ని నింపుకున్నాడు, తాపంబు=ఎడబాటు వల్లకలిగిన వేడి, క్రొవ్వెంచి=పెరిగిపోవుటను గుర్తించి, తరియింప నోపక=దాటే శక్తిలేక, పలుమార్లు=చాలాసార్లు, కరులు=ఏనుగులు, కడగండ్ల బడియె=కష్టాలు పడినవి, కందర్ప=మన్మథుని యొక్క, శరవృష్టిన్=బాణాల వర్షాన్ని, అందనోపక=సహించలేక, ఘృష్టి=వరాహము, వనవాసమున=అడవి కాపురంలో, క్రుస్సె=కృశించిపోయింది, వనరు=శోకము, దీపించి=ప్రకాశించి, వలపు=ప్రేమ, ఆపనోపక=ఆపుకోలేక, కూర్మంబు=తాబేలు, కుక్షిలోపల= పొట్టలోపలికి, తలగ్రుక్కి

కొనియె=తలను కుక్కుకున్నది, కుంభినీకాంత=భూకాంత, తమమీది, కూర్మివిడిచి=అనురాగాన్ని వదిలి, ప్రకట=ప్రసిద్ధమైన, రాజన్య=రాజులయొక్క, మస్తకాభరణ=తలలకు అలంకారాలైన, మకుట= కిరీటాలలోని, చారుమాణిక్య=అందమైన మణులచేత, దీపితచరణుఁడైన=ప్రకాశించుచున్న పాదములుకలిగిన, దశరథాధీశు =దశరథమహారాజుయొక్క, భుజపీఠిన్=భుజము అనే గద్దెను, తగిలినంత=చేరగా, ఆగద్దెమీద కూర్చోగా.

**తా :** లోకంలోని రాజులు తమ కిరీటాలు వంచి నమస్కరించడంవల్ల కాంతివంతమయిన పాదాలు కలిగిన దశథమహారాజు భుజాలమీదకి భూకాంత వచ్చి చేరగానే–అంటే దశరథమహారాజు రాజు కాగానే– ఆదిశేషుడు, అష్టదిగ్గజాలు, తాబేలు, వరాహము విరహంలో పడ్డాయి. భూమిని ఆదిశేషుడు. అష్టదిగ్గజాలు, ఆదికూర్మము, ఆదివరాహము మోస్తూ ఉంటాయి అంటే ధరించి ఉంటాయి. ఇప్పుడు ఆ భూకాంత దశరథ మహారాజు భుజపీఠిని అధిష్ఠించింది. అందువల్ల శేషుడు ఆమె ఎడబాటును భరించలేక పైగా ఆమె దశరథుని వద్దకు చేరడం వల్ల కోపంతో తన కోఱల్లో విషం నింపుకున్నాడు. విరహతాపాన్ని తట్టుకోలేక ఎనిమిది దిక్కుల్లోనూ ఉన్న ఏనుగులు కడగండ్లు పడ్డాయి. కడగండ్లపడడం అంటే కష్టాలుపడడం అనే అర్థంతోపాటు, ఈ సందర్భంలో – కడగండ్లు – చివరిహద్దులు అనే అర్థం కూడా చెప్పుకోవాలి. అష్టదిగ్గజాలు భూమికి అష్టదిక్కుల్లో హద్దులో ఉండి మోస్తూ ఉంటాయి. అందువల్ల అవి చివరి చివరికి చేరిపోయాయి. భూదేవితో విరహాన్ని భరించలేక వరాహము అరణ్యాల్లో తిరుగుతూ చిక్కిపోయింది. వరాహాలు అరణ్యాల్లో నివసించడం సహజం. ఇక కూర్మము భూదేవిమీద వలపు ఆపుకోలేక దశరథమహారాజు దగ్గరకు ఆమె చేరిందని తెలిసి తల ఎత్తుకోలేక తలను పొట్టలో కుక్కుకుంది. కాళ్లు, తల పొట్టలోకి దూర్చుకోవడం తాబేలుకు సహజం.

**విశే :** వాటి వాటి సహజగుణాలను ధర్మాలను – విరహం వల్ల ఏర్పడినట్లు వర్ణించి చెప్పడం కవితాచమత్కారం, హేతువు కాని దానిని హేతువుగా చెప్పడాన్ని హేతూత్ప్రేక్ష అంటారు.

**క. ఆ రాజు రాజ్యమందలి**
**వారెల్లను నిరతధర్మ వర్తనులగుచున్**
**భూరి స్థిర విభంబుల**
**దారిద్ర్యం బెఱుఁగ రెట్టి తటి నే నాఁడున్. 48**

**ప్రతి :** ఆరాజు=ఆదశరథమహారాజు, రాజ్యమందలి=రాజ్యములోని, వారెల్లను= జనులందరు, నిరత ధర్మవర్తనులగుచున్=ఎల్లప్పుడు ధర్మబద్ధులైనడిచేవారు, అగుచున్=అగుచు, భూరి=గొప్పవైన, స్థిర=స్థిరంగా ఉండే, విభవంబులతో=సంపదలతో, ఎట్టితటిన్=ఎటువంటి సందర్భములోనైనా, ఏనాడున్=ఎన్నడైనా, దారిద్ర్యంబును=బీదతనమును, ఎఱుగరు.

**తా :** ఆ దశరథమహారాజు రాజ్యంలోని ప్రజలందరూ ఎప్పుడూ ధర్మమార్గంలో నడిచే వారై, గొప్పస్థిరమయిన సంపదలతో జీవిస్తూ పేదరికం అనేది తెలియకుండా ఉన్నారు.

**వ. ఇట్టి మహా ధైర్య సంపన్నుండును, మహైశ్వర్య ధుర్యుండును నగు దశరథ మహారాజు సకల సామంత రాజ లోక పూజ్యమానుం డగుచుఁ బ్రాజ్యంబగు రాజ్యంబు నేలుచు నొక్క నాఁడు. 49**

**ప్రతి :** ఇట్టి=ఇటువంటి, మహాధైర్య సంపన్నుండును=గొప్పధైర్య సంపద గలవాడు, మహైశ్వర్యధుర్యుండును= గొప్పఐశ్వర్యముతో ఒప్పువాడు, అగు, దశరథమహారాజు, సకలసామంతరాజలోక=సామంతరాజులందరి చేత, పూజ్యమానుండగుచు=పూజింపబడుతూ, ప్రాజ్యంబగు=ప్రసిద్ధి కెక్కిన, రాజ్యంబు=రాజ్యమును, ఏలుచు= పరిపాలించుచూ, ఒక్కనాడు=ఒకరోజు.

**తా :** గొప్ప ధైర్యవంతుడు, ఐశ్వర్యవంతుడు అయిన దశరథమహారాజు సామంత రాజులందరిచేత పూజింపబడుతూ ప్రసిద్ధికెక్కి పాలిస్తూండగా ఒకనాడు.

## దశరథుఁడు పుత్రకామేష్టి కావించుట

**సీ. సంతాన లబ్ధికై చింతించి చింతించి**
**శిష్ట వర్తనుఁడౌ వశిష్ఠుఁ జూచి,**
**తన కోర్కి వినుపింప, విని మునిసింహుండు**
**పలికె ఋష్యశృంగు నెలమిఁ దేర,**
**ఘనుఁ డాతఁ డొగిఁ బుత్రకామేష్టి యనుపేర**
**యాగమ్ముఁ గావింప, నందువలన**
**వినుతి కెక్కఁగఁ జాలు తనయులు గలుగుట**
**సిద్ధమ్ము, నా మాట బుద్ధిలోన**

**తే. నిలుపు మని చెప్ప, నా రాజు నెమ్మితోడ**
**నకుటిలాత్మకు నా విభాండకుని తనయు**
**నెలమి రావించి, పుత్రకామేష్టి యనెడి**
**జన్న మొనరించు చున్నట్టి సమయమునను. 50**

**ప్రతి :** సంతానలబ్ధికై=పిల్లలను పొందుటకై, చింతించి చింతించి=ఆలోచించి ఆలోచించి, శిష్టవర్తనుఁడౌ= మంచి నడవడిగల, వశిష్ఠున్=వశిష్ఠ మహర్షిని, చూచి, తన కోర్కె వినుపింపన్=తనయొక్క కోరికను వినిపించగా, విని, మునిసింహుండు=మునిశ్రేష్ఠుడైన ఆ వశిష్ఠుడు, పలికె, ఋష్యశృంగున్=ఋష్యశృంగుడను మహర్షిని, ఎలమిన్=ప్రేమతో, తేర=తీసుకొనిరమ్మని, ఘనుఁడు=గొప్పవాడయిన, ఆతడు= ఆ ఋష్యశృంగ మహర్షి, ఒగిన్=శ్రద్ధతో, పుత్రకామేష్టి యనుపేర=పుత్రకామేష్టి, అను పేరుగల, (పుత్రకామేష్టి=పుత్రులను కోరిచేయు యజ్ఞము) యాగమ్మున్=యజ్ఞమును, కావింపన్=చేయింపగా, అందువలనన్=ఆ యాగఫలితముగ, వినుతికి=పొగడ్తకు, ఎక్కఁగఁజాలు, తనయులు=కుమారులు, కలుగుట=పుట్టుట, సిద్ధమ్ము=నిశ్చయము, నామాట=నేను చెప్పినమాట, బుద్ధిలోన=ఆలోచనలో, నిలుపుము=పెట్టుకొనుము,

అనిచెప్పన్=అని చెప్పగా, ఆ రాజు=దశరథమహారాజు, నెమ్మితోడన్=ప్రేమతో, అకుటిలాత్మకున్=నిర్మలమైన మనస్సుగల, విభాండకునితనయున్= విభాండక మహర్షి కుమారుని, ఋష్యశృంగుని, ఎలమి= సంతోషముతో, రావించి=రప్పించి పుత్రకామేష్టి యనెడి, జన్నము=యజ్ఞము, ఒనరించుచున్నట్టి= చేయుచున్నట్టి, సమయమునను=వేళలో.

**తా :** దశరథుడు తనకు పిల్లలు లేకపోవడంతో ఆ విషయమై ఆలోచించి కులగురువైన వశిష్ఠమహామునిని దర్శించి తనకు గల సంతానవాంఛను వివరించాడు. వశిష్ఠుడు రాజా! ఋష్యశృంగ మహర్షిని ప్రేమతో పిలిపించు. ఆయన నీచేత పుత్రకామేష్టి అనే యాగం చేయించినట్లయితే నీకు తప్పకుండా లోకం కొనియాడే పుత్రులు పుడతారు అని చెప్పాడు, ఆ మాటవిని దశరథుడు ఆనందంతో నిర్మలాత్ముడయిన ఋష్యశృంగుణ్ణి తీసుకువచ్చాడు, ఋష్యశృంగుడు విభాండక మహర్షి పుత్రుడు, ఆతడు శ్రద్ధతో పుత్రకామేష్టిని జరిపించుచుండగా –

## సురల మొఱ లాలించి శ్రీమహావిష్ణు వభయ మొసఁగుట

**ఉ. రావణుచేతి బాధల నిరంతరమున్ బడి వేఁగి, మూఁకలై**
**దేవత లెల్ల గీష్పతికిఁ దెల్లముగా నెఱిఁగింప, వారి రా**
**జీవ తనూజుఁ డున్నెడకు శీఘ్రమ తోడ్కొనిపోయి చెప్ప, నా**
**దేవుఁడు విష్ణు సన్నిధికి దిగ్గనఁ జేకొనిపోయి యచ్చటన్. 51**

**ప్రతి :** రావణుచేతిబాధలన్=రావణుని వలన కలిగేబాధలు, నిరంతరము=ఎల్లప్పుడూ, పడి=పడుతూ, వేఁగి=తపించి, దేవతలెల్లన్=దేవతలు అందరూ, మూకలై=దండుగా ఏర్పడి, గీష్పతికిన్=గురునికి, తెల్లముగాన్=వివరంగా, ఎఱిగింపన్=తెలుపగా, వారిన్=దేవతలందరిని, రాజీవతనూజుఁడు=తామరపువ్వ నుండి పుట్టినవాడు (బ్రహ్మ), ఉన్న+ఎడకు=ఉన్నచోటికి, శీఘ్రమ=తొందరగా, తోడ్కొనిపోయి=వెంటపెట్టుకుని వెళ్లి, చెప్పన్=చెప్పగా, ఆ దేవుఁడు=ఆబ్రహ్మ, విష్ణుసన్నిధికి=విష్ణుమూర్తి దగ్గరకు, దిగ్గన=వెంటనే, చేకొనిపోయి= తీసుకుని వెళ్ళి, అచ్చటన్=అక్కడ.

**తా :** రావణుడు పెడుతున్న బాధలను తట్టుకోలేక దేవతలందరూ కలిసి సమూహంగా బృహస్పతి దగ్గరకి వెళ్ళారు. ఆయనతో విషయం చెప్పారు. ఆయన విషయం విని వీరందరినీ వెంటపెట్టుకుని బ్రహ్మదగ్గరకు వెళ్ళి విషయం చెప్పారు. బ్రహ్మ దిగ్గనలేచి వెంటనే, విష్ణుమూర్తి వద్దకు తీసుకుని వెళ్ళి అక్కడ.

**విశే :** 'రావణుచేతి బాధలు' – అనేది కందువమాట.

**వ. అప్పురాణ పురుషోత్తముం గాంచి, నమస్కరించి, యింద్రాది దేవతలం జూపి, బ్రహ్మ యిట్లని విన్నవించె. 52**

**ప్రతి :** ఆ+పురాణ పురుషోత్తమున్=అప్పురాణపురుషోత్తమున్=అనాది కాలపు పురుషోత్తముడయిన విష్ణువును, కాంచి=చూచి, నమస్కరించి, ఇంద్రాదిదేవతలన్=ఇంద్రుడుమొదలయిన దేవతలను, చూపి, బ్రహ్మ, ఇట్లని, విన్నవించె=తెలిపెను.

**తా :** అనాది పురుషుడయిన శ్రీమహావిష్ణువును చూచి, నమస్కరించి, తనతో వచ్చిన ఇంద్రాది దేవతలను విష్ణువుకు చూపి బ్రహ్మ ఈవిధముగా విన్నవించాడు,

**ఉ. రావణుఁ డుగ్రుఁడై తన పరాక్రమ శక్తిని వీరి సంపదల్**
**వావిరిఁ గొల్లలాడి త్రిదివంబును బాడుగఁ జేయ, నేఁడు దే**
**వావళి దీన భావమున నక్కడ నుండఁగ నోడి, భీతి చే**
**దేవరఁ గానవచ్చె నిఁక దేవర చిత్తము వీరి భాగ్యమున్. 53**

**ప్రతి :** రావణుఁడు=రావణుడు, ఉగ్రుఁడై=భయంకరుడై, తన పరాక్రమశక్తిని=తనకు గల పరాక్రమంతో, బలంతో, వీరి సంపదల్=ఈ దేవతల సంపదలను, వావిరిన్=క్రమముగా, కొల్లలాడి=దోచుకుని, త్రిదివంబును=స్వర్గలోకమును, పాడుగన్=పాడగునట్లు, చేయన్, నేఁడు=ఈనాడు, దేవావళి=దేవతల సమూహము, దీనభావమునన్=దిక్కులేనట్టి భావముతో, అక్కడన్ ఉండఁగన్=ఉండుటకు, ఓడి=భయపడిపాఱిపోయి, భీతిచే=భయముతో, దేవరన్=ప్రభువులయిన మిమ్ము, కానవచ్చె=చూడవచ్చారు, ఇకన్=ఇంక, దేవరచిత్తము=మీ సంకల్పము, వీరిభాగ్యమున్=వీరి అదృష్ణము.

**తా :** క్రూరుడయిన రావణుడు తన పరాక్రమంతో దేవతల సంపదలనన్నింటినీ అపహరించాడు. స్వర్గలోకాన్ని పాడుపడినట్లు చేసాడు. దేవతలు దిక్కుతోచక స్వర్గంలో ఉండలేక పారిపోయి భయంతో మీవద్దకు వచ్చారు. ఇక మీ దయ, వీరి అదృష్టము.

**విశే :** 'దేవరచిత్తము వీరిభాగ్యము' చక్కని కందువమాట.

**వ. అని విన్న వించిన విని వనరుహలోచనుండు దయాయత్త చిత్తుండై యనిమిషనాయకుని గూర్చి యిట్లానతిచ్చె. 54**

**ప్రతి :** అని, విన్నవించిన, విని, వనరుహలోచనుండు=తామరపువ్వుల వంటి కన్నులు గల విష్ణుమూర్తి, దయాయత్తచిత్తుండై=దయతో కూడిన మనస్సు గలవాడై, అనిమిషనాయకుని గూర్చి=దేవతలకు నాయకుడైన ఇంద్రునితో, ఇట్లు, ఆనతిచ్చెను=చెప్పెను.

**తా :** బ్రహ్మ చెప్పిన విషయాలు విని దయాంతరంగుడైన నారాయణుడు దేవతల రాజైన ఇంద్రునితో ఇలా చెప్పాడు.

**తే. వనజ గర్భుని గూర్చి రావణుఁడు మున్ను**
**తపముఁ జేసిన వర మిచ్చు తఱినిఁ దనకు**

**నేరిచేఁ జావు లేకుండఁ గోరువాఁడు**
**నరుల వానరులను జెప్ప మఱచినాఁడు. 55**

**ప్రతి :** వనజగుర్భుని గూర్చి=బ్రహ్మను గురించి, మున్ను=పూర్వము, రావణుడు, తపమున్=తపస్సును, చేసిన=చేయగా, వరమిచ్చుతఱిని=బ్రహ్మవరాలు ఇచ్చే సమయంలో, తనకున్, ఏరిచేన్=ఎవరిచేత కూడా, చావులేకుండన్, కోరువాఁడు=కోరుకుంటున్న రావణుడు, నరులన్=మానవులను, వానరులన్=కోతులను, చెప్పన్=చెప్పుట, మరిచినాఁడు=మరిచిపోయినాడు.

**తా :** పూర్వం రావణుడు బ్రహ్మగురించి తపస్సుచేసాడు, బ్రహ్మను వరాలు కోరుకునేటప్పుడు తనకుఎవ్వరి వల్ల చావు రాకూడదు అని చెప్పే సందర్భంలో, నాగ, యక్ష, గంధర్వ, దేవ, దానవ-ఇత్యాదిగా పేర్కొన్నాడు. ఆసందర్భంలో మానవుల చేత, కోతుల చేత అని అడగడం మర్చిపోయాడు.

**వ. అక్కారణంబునం జేసి. 56**

**తా** : ఆ కారణం వల్ల

**తే. వనరు గలిగెను మనకు రావణుని జంప.**
**వినుఁడు మీరెల్ల నా మాట వేడ్క మీఱ**
**దశరథుం డను రాజు సంతానకాంక్ష**
**నొనర జన్నంబు గావించుచున్న వాఁడు. 57**

**ప్రతి :** వనరు=అవకాశము, కలిగెను=లభించినది, మనకు, రావణునిన్, చంప, వినుఁడు=వినండి, మీరెల్లన్=మీరందరు, నామాట, వేడ్కమీఱన్=కుతూహలంతో, దశరథుడు, అను, రాజు, సంతాన కాంక్షన్=సంతానము మీది కోరికతో, జన్నంబు=యజ్ఞము, ఒనరన్=యథావిధిగా, కావించుచున్నవాఁడు=చేస్తున్నాడు.

**తా :** ఆ రావణుని చంపడానికి మనకొక అవకాశం దొరికింది. మీరంతా నామాట జాగ్రత్తగా వినండి. దశరథుడు అనేరాజు పిల్లలకోసంశ్రద్ధగా యజ్ఞంచేస్తున్నాడు.

**క. ధరణీపతి యగు దశరథ**
**నరనాయకు నింటఁ బుట్టి నర రూపమునం**
**బెరిగెద నేనిఁక, మీరును**
**సుర కంటకుమీఁద లావు సూపుటకొఱకై. 58**

**ప్రతి :** ధరణీపతి=భూపతి, అగు, దశరథనరనాయకుని=మానవులకు నాయకుడయిన దశరథుని, ఇంటన్=ఇంటిలో, పుట్టి, నరరూపమునన్=మానవునిగా, పెరిగెదన్, నేను, ఇక, మీరును, సుర కంటకుమీఁదన్=దేవతలను బాధిస్తున్న రావణుని మీద, లావు=బలము, సూపుటకొరకై=చూపించడానికి.

**తా :** భూనాయకుడైన దశరథుని ఇంటిలో నేను మానవునిగా పుట్టి పెరుగుతాను, మీరూ ఆ రావణుని మీద మన బలాన్ని ప్రదర్శించడానికి.

**క. కొందఱు కపి వంశంబునఁ**
**గొందఱు భల్లుక కులమున గురు బలయుతులై**
**యందఱు నన్ని తెఱంగుల**
**బృందారకులార! పుట్టిపెరుగుఁడు భువిపై. 59**

**ప్రతి :** కొందఱు, కపివంశంబునన్=వానరవంశంలోను, కొందరు, భల్లుక కులమున=ఎలుగుబంటి జాతిలోను, గురు బలయుతులై=గొప్ప బలవంతులై, బృందారకులారా!=ఓ దేవతలారా!, అందఱు=మీరు అందఱు, అన్ని తెఱంగుల=అన్నివిధాలుగా, భువిపై=భూలోకంలో, పుట్టి పెరుగుఁడు=పుట్టి పెరగండి.

**తా :** ఓ దేవతలారా! మీరందరూ కొందరు కోతులుగా, కొందరు ఎలుగుబంట్లుగా, భూలోకంలో మహాబలశాలులై పుట్టిపెరగండి.

**వ. అని, కృపా ధురీణుండైన నారాయణుఁ డానతిచ్చిన విని వనజాసనాది దేవతా నికరం బవ్వనజోదరుని పాదారవిందములకు వందనమ్ము లాచరించి, నిజ నివాసమ్ములకుం జని రయ్యవసరమ్మున. 60**

**ప్రతి :** అని, కృపా ధురీణుండైన=దయచూపుటలో ముఖ్యుడయిన, నారాయణుడు, ఆనతిచ్చినన్=ఆజ్ఞాపించగా, విని, వనజాసనాది=బ్రహ్మమొదలయిన, దేవతా నికరంబు=దేవతల సమూహము, ఆ+వనజోదరుని=అవ్వనజోదరుని=కమలము ఉదరమునందుకల నారాయణుని, పాదారవిందములకు=పాదపద్మములకు, వందనమ్ములు, ఆచరించి=చేసి, నిజనివాసమ్ములకున్=తమ తమ ఇళ్లకు, చనిరి=వెళ్లిరి, ఆ+అవసరమ్మున=ఆ సమయమున.

**తా :** దయాశాలి అయిన నారాయణుడు ఆవిధంగా దేవతలను ఆజ్ఞాపించగా బ్రహ్మాది దేవతలందరూ నారాయణుని పాదపద్మాలకు నమస్కరించి తమ తమ నివాసాలకు వెళ్లారు. ఆ సమయంలో –

## అగ్నిదేవుఁడు ప్రత్యక్షమై దశథునకుఁ బాయస మిచ్చుట

**మ. ఇల సాకేత నృపాల శేఖరుఁడు దా హేలా విలాసంబుతో**
**ఫల కాంక్షన్ గ్రతువుం బొనర్చినయెడన్ బంగారు పాత్రమ్ము లో**
**పల దుగ్ధాన్నము చాల నించుకొని తాఁ బ్రత్యక్షమై నిల్చి ని**
**ర్మల తేజంబునఁ బావకుం డనియెఁ బ్రేమన్ మంజు వాక్యంబులన్. 61**

**ప్రతి :** ఇలన్=భూమిపై, సాకేత నృపాలశేఖరుఁడు=సాకేతనగరానికి రాజైన దశరథుడు, తాన్=తాను, హేలావిలాసంబుతో=అధికమయిన ఆనందంతో, ఫలకాంక్షన్=సంతానఫలము మీది కోరికతో, క్రతువున్=పుత్రకామేష్టి యాగమును, పొనర్చిన యెడన్=చేసినచోట, బంగారు పాత్రమ్ములోపల=బంగారు గిన్నెలో,

దుగ్ధాన్నము=పాయసము, చాల నించుకొని=చాలా నింపుకొని, తాన్=తాను, అగ్ని, ప్రత్యక్షమై నిల్చి=కనబడే విధంగా నిలబడి, నిర్మల తేజంబునన్=స్వచ్ఛమయిన తేజస్సుతో, పావకుండు=అగ్నిదేవుడు, ప్రేమన్=ప్రేమతో, మంజువాక్యంబులన్=వినసొంపైన వాక్యాలతో, అనియెన్=అనెను.

**తా :** ఇక్కడ మానవలోకంలో దశరథమహారాజు ఎంతో ఆనందంతో పుత్రులను ఫలంగా కోరి పుత్రకామేష్టి నిర్వహిస్తుండగా, అగ్నిహోత్రుడు బంగారుగిన్నె నిండుగా పాయసము పట్టుకొని యజ్ఞకుండం నుండి ప్రత్యక్షమై, స్వచ్ఛమైన కాంతితో వెలిగిపోతూ ప్రేమగా వినసొంపైన మాటలు చెప్పాడు.

**క. భూపాల! నీదు భార్యల**
**కీ పాయస మారగింప నిమ్మీ! తనయుల్**
**శ్రీపతి పుత్త్ర సమానులు**
**రూపసు లుదయింతు రమిత రూప స్ఫూర్తిన్. 62**

**ప్రతి :** భూపాల!=ఓ రాజా!, నీదు=నీయొక్క, భార్యలకు, ఈ, పాయసము, ఆరగింపన్=తినుటకు, ఇమ్మీ=ఇమ్ము, తనయుల్=పుత్రులు, శ్రీపతి=లక్ష్మీపతి అయిన విష్ణువు యొక్క, పుత్త్రసమానులు=పుత్రునితో సమానమైన, రూపసులు=అందమైనవారు, అమిత రూపస్ఫూర్తిన్=గొప్ప ప్రకాశవంతమైన రూపాలతో, ఉదయింతురు=పుట్టెదరు.

**తా :** ఓ రాజా! ఈ పాయసాన్ని నీ భార్యలకు తినటానికి ఇవ్వు. నీకు మన్మథునితో సమానమైన రూపం కలవారు, గొప్ప ప్రకాశంగలవారు అయిన పుత్రులు పుడతారు.

**వ. అని చెప్పి యప్పాయస పాత్రంబు చేతి కిచ్చిన. 63**

**తా :** అని చెప్పి పాయసపాత్రను రాజు చేతికి ఇవ్వగా –

**ఆ. పాయసమ్ము రెండు భాగముల్ గావించి**
**యగ్ర సతుల కీయ, నందులోన**
**సగము సగము దీసి ముగుద సుమిత్రకు**
**నొసఁగి, రంత నామె మెసవెఁ బ్రీతి. 64**

**ప్రతి :** పాయసమ్ము=పాయసము, రెండుభాగముల్=రెండుభాగాలుగా, కావించి=చేసి, అగ్రసతులకీయ= పెద్దభార్యలకు ఇయ్యగా, అందులోన=తమ భాగములలో నుండి, సగము సగము=చెరిసగము తీసి, ముగుద=అమాయకురాలైన, సుమిత్రకున్=సుమిత్రకు, ఒసఁగిరి=ఇచ్చిరి, అంత=అంతట, ఆమె=సుమిత్ర, ప్రీతిన్=ఆదరముతో, మెసవెన్=తినెను.

**తా :** దశరథ మహారాజు పాయసాన్ని రెండు సమభాగాలుగా చేసి కౌసల్యకు కైకేయికి చెరోభాగము ఇచ్చాడు. వాళ్లిద్దరు తమ తమ భాగాల్లో నుండి చెరిసగ భాగం తీసి సుమిత్రకు ఇచ్చారు. సుమిత్ర దానిని ఆదరంతో తిన్నది.

**విశే :** ఈ పాయసం పంపకం విధానం వాల్మీకి రామాయణంలో – దశరథుడే – పాయసంలోని సగభాగం కౌసల్యకు ఇచ్చాడు. మిగిలిన సగంలో సగం – సుమిత్రకు ఇచ్చాడు. ఆ మిగిలిన సగాన్ని మళ్లీ రెండు భాగాలు చేసి ఒక భాగం కైకకు ఇచ్చాడు. మిగిలిన భాగం ఎవరికి ఇద్దామా అని క్షణకాలం ఆలోచించి మళ్లీ సుమిత్రకు ఇచ్చాడు.

అధ్యాత్మ రామాయణంలో పాయసవిభాగ విధానాన్ని మొల్ల స్వీకరించి ఈ విధంగా వ్రాసింది. అయితే ఇక్కడ ఆమె 'అగ్రసతుల కీయ' అన్నది. అగ్రసతులు అంటే పెద్దభార్యలు, వాల్మీకిరామాయణం ప్రకారం – కౌసల్య, సుమిత్ర, కైక–వరుస కాని ఇక్కడ మొల్ల బహుశా పట్టపురాణి కౌసల్య, దశరథుని మనసు గెలిచిన రాణి కైక కావడంవల్ల వాళ్లని 'అగ్రసతులు'గా పేర్కొని ఉండవచ్చు, అదీకాక – సుమిత్రను 'ముగుద' అన్నది. ముగుద అంటే అమాయకురాలు అనీ, సున్నితమైన మంచి మనసు గలది అనీ అర్థం. ఎలా పంచినా చేసుకోగలదు అనే ధైర్యంతో దశరథుడు అలా పంచాడు అని ఊహించుకోవచ్చు.

## కౌసల్యా కైకేయీ సుమిత్రల దౌహృద లక్షణములు

**వ. అంతం గొన్ని దినంబులకుఁ గౌసల్యా కైకేయీ సుమిత్రలు గర్భవతులై యొప్పారుచుండ. 65**

**ప్రతి :** అంతన్=అటుపై, కొన్ని దినంబులకున్, కౌసల్యాకైకేయీ సుమిత్రలు, గర్భవతులై=గర్భము ధరించినవారై, ఒప్పారుచుండ=ప్రకాశిస్తూండగా

**తా :** కొన్ని దినాలకు ఆ ముప్పురు రాణులు గర్భవతులై ప్రకాశిస్తూ ఉండగ.

**విశే :** కౌసల్యా కైకేయీ సుమిత్రలు – అనే వరుసనే ఇక్కడ కూడా చెప్పింది.

**సీ. ధవళాక్షు లనుమాట తథ్యంబు గావింపఁ**
**దెలుపెక్కి కన్నులు తేట లయ్యె**
**నీలకుంతలలని నెగడిన యామాట**
**నిలుపంగ నెఱులపై నలుపు సూపె,**
**గురుకుచలను మాట సరవి భాషింపఁగఁ**
**దోరమై కుచముల నీరువట్టె**
**మంజుభాషిణులను మాటదప్పకయుండ**
**మెలఁతల పలుకులు మృదువులయ్యెఁ**

**తే. గామినులటంట నిక్కమై కాంతలందు**
**మీఱి మేలైన రుచులపైఁ గోరికయ్యె,**
**సవతిపో రనఁ దమలోన సారె సారె**
**కోకిలింతలు బెట్టు చిట్టములుఁ బుట్టె 66**

**ప్రతి :** ధవళాక్షులు=తెల్లనికన్నులు కలవారు, అనుమాట=అనేమాట, తథ్యంబుగా వింపన్=నిజము చేయడానికి, తెలుపెక్కి, తెలుపు+ఎక్కి=తెల్లగామారి, కన్నులు, తేటలయ్యె=స్వచ్ఛంగా కాంతివంతంగా అయ్యాయి, నీలకుంతలలు+అను=నీల కుంతలలను=నల్లనికురులు కలవారని, నెగడిన=ప్రసిద్ధమైన, ఆ మాట, నిలుపంగ=నిలబెట్టడానికి, నెఱులపై=జట్టుమీద, నలుపుసూపె=నల్లని నిగనిగ కనబడుతోంది, గురుకుచలు=పెద్ద చన్నులు కలవారు, అనుమాట, సరవి=క్రమముగా, భాషింపఁగన్=అంటూ ఉండగా, తోరమై=అందమైన, కుచములన్=స్తనములందు, నీరువట్టె=నీరుపట్టినది, మంజుభాషిణులు=చక్కగా మాట్లాడేవారు, అనుమాట, తప్పకయుండ=తప్పిపోకుండా, మెలతల=ఆ స్త్రీల, పలుకులు=మాటలు, మృదువులయ్యె=మెత్తగ అయినవి, కామినులు=కోరికలు గలవారు, అటంట=అని అనడం, నిక్కమై=నిజమై, కాంతలందు=ఆ ముగ్గురు గర్భిణీ స్త్రీలలో, మీఱి=మించి, మేలైన=ఉత్తమమయిన, రుచులపై, కోరికయ్యె= కోరికలు కలిగాయి, సవతిపో రనన్= సవతిపెట్టే దెబ్బలాటలు అనేలా, తమలోన=వారిలో, సారెసారెకు= మాటిమాటికి, ఓకిలింతలు= వాంతులు, బెట్టు=ఎక్కువగా, చిట్టుములు=వేవిళ్లు, పుట్టె=పుట్టినవి.

**తా :** స్త్రీలు నెలతప్పిన కొత్తలో వారి శరీరంలో వచ్చే మార్పులను మొల్ల ఈ పద్యంలో సహజసుందరంగా వర్ణించింది. కళ్లలో నల్లజీరలు, ఎఱ్ఱజీరలు లేకుండా తెల్లగా స్వచ్ఛంగా ఉండి ధవళాక్షులు అనేమాట నిజం చేసేలా – వారికన్నులు తేటగా కాంతివంతగా అయ్యాయి. నల్లనిజుట్టు గలవారు అనేమాట నిలబెట్టేలా కురులు నల్లగా అయినాయి. గర్భవతుల కుచాలలో వచ్చేమార్పు నీరుపట్టి పెద్దవిగా కావడం, అలా నీరు పట్టి గురుకుచలు అనే పేరు సార్థకం చేసాయి. స్త్రీలు మంజుభాషిణులు అనే మాటను, అబద్ధం కాకుండా వారి మాటలు మృదువుగా అయ్యాయి. కడుపుతో ఉన్నవారికి రకరకాలయినవి తినాలనే కోరికలు కలుగుతాయి. అలా కలిగి కామినులు అనేమాటను నిజం చేసారు. వేవిళ్లు అధికం కావడంవల్ల మాటి మాటికి వాంతులవుతున్నాయి. అది సవతిపోరులా ఒకరివెంట ఒకరికి వాంతులు వేవిళ్లు పుట్టుకొచ్చినవి.

**విశే :** లేత నెలలో స్త్రీల శరీరంలో వచ్చే మార్పులన్నీ ఈ పద్యంలో కూర్పబడ్డాయి. మూడవపాదం– **'మందయాన లనంగ మానైన యమ్మాట నిక్కంబుగా మాంద్య మెక్కె నడలఁ'** కందుకూరి వీరేశలింగం గారి పరిష్కరణలో పాఠము. మందయానలు – నెమ్మదిగా నడిచే వారు అనేమాట నిజం చేసారు. మెల్లగా నడుస్తున్నారు.

**వ. మఱియును. 67**

**సీ. తనుమధ్య లను మాటఁ దప్పింపఁ గాఁబోలుఁ**
**బొఱ లేక నడుములు పొదలఁ జొచ్చెఁ**
**గుచములు బంగారు కుండలో యను మాట**
**కల్లగా నగ్రముల్ నల్ల నయ్యెఁ**
**జంద్రాస్య లను మాట సరవి మాన్పఁగ బోలుఁ**
**గళల విలాసమ్ము పలుచ నయ్యెఁ**

**సుందరు లను మాట సందియమ్ముగఁ బోలు**
**గర్భ భారమ్ములఁగాంతి దప్పె**

**తే. ననుచుఁ గనుగొన్న వారెల్ల నాడుచుండఁ**
**గట్టు చీరెల వ్రేఁకంబు పుట్టుచుండ**
**నా సతులఁ జూచి యందఱు నలరుచుండఁ**
**గాంతలకు నప్డు గర్భముల్ కానుపించె.** **68**

**ప్రతి :** తనుమధ్యలు=సన్నని నడుముకలవారు, అనుమాట, తప్పింపఁగా బోలు=తొలగించడానికి కాబోలు, పొఱలేక=మడతలు లేకుండా, నడుములు, పొదలజొచ్చె=పెరగసాగాయి, కుచములు=స్తనములు, బంగారుకుండలో, అనుమాట, కల్లగాన్=అబద్ధమయ్యేలా, అగ్రముల్=చనుమొనలు, నల్లనయ్యె= నలుపెక్కినవి, చంద్రాస్యలు=చంద్రునివంటి ముఖము కలవారు, అనుమాట, సరవిన్=క్రమాన్ని, మాన్పఁగన్= మాన్పించడానికి, పోలున్=వలె, కళలవిలాసము=ముఖంలో ఉండే కాంతులు, పలుచ నయ్యె=తగ్గినవి, సుందరులనుమాట=అందగత్తెలు అనే మాటలు, సందియమ్ముగఁ బోలు=సందేహించేలా, గర్భభారమ్ములన్= గర్భంలోని శిశువు బరువుతో, కాంతితప్పె=వన్నె తగ్గిపోయినది, అనుచు, కనుగొన్నవారెల్ల=చూసిన వారందరూ, ఆడుచుండన్=పలుకుచుండగ, కట్టుచీరల=కట్టినచీరల, వ్రేఁకంబు=బరువు, పుట్టుచుండ= కలుగుచుండగా, ఆ సతులన్=గర్భవతులయిన ఆ మువ్వురు రాణులను, చూచి, అందఱున్, అలరుచుండన్= ఆనందపడుతూ ఉండగా, కాంతలకున్=ఆ స్త్రీలకు, అంత=అప్పుడు, గర్భముల్=కడుపులు, కానుపించె= కనిపించినవి.

**తా :** సన్నని నడుము కలవారు అనేమాట తప్పించేలా ఆ రాణుల నడుములు పెరుగసాగాయి. స్తనాలు బంగారుకుండల్లా పచ్చగా ఉంటాయి అనేమాట అసత్యం చేయడానికి చనుమొనలు నల్లగా అయ్యాయి. శిశువులకు పాలు ఇవ్వడానికి స్తనాల్లో ఈ మార్పు వస్తుంది. చంద్రముఖులనే మాట తప్పించడానికి అన్నట్లు వారి ముఖాల్లో కాంతి తగ్గింది. సుందరాంగులు అనేమాట నిజమేనా అని సందేహించేలా ఉంది, అన్నట్లు పొట్టలు పెద్దవయ్యాయి, అని చూచిన వారందరూ అనుకుంటూ ఉన్నారు. నెలలు ముదిరినకొద్దీ కట్టుకున్న చీరే బరువై ఉస్సురనే వారిని చూచిన వారందరూ సంతోషపడేలా ఆ రాణులు ముగ్గురి గర్భచిహ్నాలు కనిపించాయి.

**విశే :** క్రిందటి పద్యంలో ఆయా మాటలు నిజమే అని అనుకునేలా చేసారని వర్ణించిన మొల్ల, ఈ పద్యంలో ఆయా మాటలు, నిజంకాదు అన్నట్లు చేసారని వర్ణించింది. ఇదొక రచనావిన్యాసము. ఈ పద్యంలో కానవచ్చే మార్పులు నెలలు పెరుగుతూ ఉండగా స్త్రీల శరీరంలో కలిగేవి.

(రెండోపాదం దగ్గర – **ముకుర కపోలలు ముగుద లనెడు మాట కల్లగా చెక్కులు నల్లనయ్యె** (కం.వీ.లిం.) ఆడవాళ్లు అద్దాలవంటి చెక్కిళ్లు గలవారు అనేమాట అబద్ధం అనేలా వారి చెక్కిళ్లు నల్లగా అయినవి.)

## శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నుల యవతారము

**వ. ఇట్లు దుర్భరంబులైన గర్భంబులు దాల్చిన కౌసల్యాది కాంతా త్రయమ్మును జైత్ర మాసమ్మున, శుక్లపక్షమ్మున, నవమీ, భాను వాసరమ్మునఁ, బునర్వసు నక్షత్రంబునఁ, గర్కటక లగ్నంబున శ్రీరామభరత లక్ష్మణశత్రుఘ్నులం గాంచినం దదనంతరంబున దశరథుండు యథోచిత కర్తవ్యంబులు జరపి, యప్పది దినంబులు నరిష్టంబు లేక ప్రతిదిన ప్రవర్ధమాన మగుచున్న కుమార చతుష్టయంబునకుఁ గాలోచితంబులగు చౌలోపనయనాది కృత్యంబులు గావించి, వెండియు విద్యా ప్రవీణు లగునట్టు లొనర్చి, గజాశ్వ రథారోహణంబులు నేర్పి, ధనుర్వేద పారగులం గావించి, పెంచుచున్న సమయమ్మున. 69**

**ప్రతి :** ఇట్లు=ఈ విధముగా, దుర్భరంబులైన=భరింపశక్యము గాని, గర్భంబులు, తాల్చిన=ధరించిన, కౌసల్యాది=కౌసల్య మొదలయిన, కాంతాత్రయమ్మును=ముగ్గురు స్త్రీలు, చైత్రమాసమ్మున, శుక్లపక్షమ్మున= నెలలో మొదటి పదిహేను రోజులు శుక్లపక్షము, చంద్రుడురోజుకో కళ అధికంకాగా ప్రకాశిస్తూ ఉంటాడు, నవమీ=నవమితిథిలో, భానువాసరమ్మునన్=ఆదివారమునాడు, పునర్వసు నక్షత్రంబునన్, కర్కటకలగ్నంబున, శ్రీరామభరత లక్ష్మణ శత్రుఘ్నులన్, కాంచిన=కనగా, తదనంతరంబున=ఆతరువాత, దశరథుడు, యథోచిత కర్తవ్యంబులు=ఆ సమయమున చేయవలసిన పనులు, జరిపి=చేసి, అప్పది దినంబులు=ఆ+పది దినంబులు= పురుడు పదిరోజులు, అరిష్టంబు లేక=నూతన శిశువులుకు ఎట్టిపీడలు కలుగకుండ, ప్రతిదిన ప్రవర్ధమాన=రోజురోజుకు ఎదుగుతున్న, కుమార చతుష్టయంబునకున్= నలుగురు కుమారులకు, కాలోచితంబులగు=ఆయా సమయానికి తగిన, చౌలము=చెవులు కుట్టించుట, ఉపనయము= వడుగు, మొదలైన, కృత్యంబులు=కార్యములు, కావించి=జరిపించి, వెండియు=మరల, విద్యాప్రవీణు లగునట్లు=విద్యలలో నేర్పరులయ్యే విధంగా, ఒనర్చి=చేసి, గజాశ్వరథారోహణంబులు= ఏనుగులను, గుఱ్ఱాలను, రథాలను ఎక్కి నడుపుటను నేర్పించి, ధనుర్వేద పారగులన్=విలువిద్యలో ఆరితేరిన వారిగా, కావించి=చేసి, పెంచుచున్న సమయంబున.

**తా :** గర్భవతులయిన కౌసల్య, కైక, సుమిత్ర, ముప్వురు రాణులు – చైత్రమాస శుక్లపక్షంలో, నవమీ ఆదివారం పునర్వసు నక్షత్ర కర్కాటక లగ్నంలో – రామభరత లక్ష్మణ శత్రుఘ్నులనే నలుగురు కొడుకులను కన్నారు. పుట్టిన పిల్లలకు దశరథుడు చేయవలసిన సంస్కారాలు జరిపించాడు, పురిటి పదిరోజులు ఎలాంటి అరిష్టాలు రాకుండా గడిచి దినదిన ప్రవర్ధమాను లవుతున్న ఆ బాలురకు ఆ యా వయస్సులలో చేయవలసిన చెవులు కుట్టించడం, వడుగు చేయడంవంటి సంస్కారాలు జరిపి,విద్యా ప్రవీణులు అయ్యేలా గురువుల శిక్షణలోపెట్టి, ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు నడిపే సామర్థ్యాన్ని కలుగజేసి, విలువిద్యలో నిపుణులయ్యేలా చేసి పెంచుతూ ఉండగా.

**విశే :** ఇక్కడ చెప్పిన ఈ మూహూర్త వివరాలు–శ్రీరాముడు, పుట్టినప్పటివి మాత్రమే, భరతుడు పుష్యమి నక్షత్రంలో, లక్ష్మణ శత్రుఘ్నులు ఆశ్లేషానక్షత్రంలో పుట్టారు అని వాల్మీకి రామాయణం. ఈ వచనంలో శ్రీరామాదులజననం, విద్యాభ్యాసం వివరాలతో కథను సంగ్రహంగా, వేగంగా నడిపించింది కవయిత్రి.

## యాగ రక్షణమునకుఁ రాముని బంపుమని విశ్వామిత్రుని వేఁడికోలు

సీ. ఒక నాఁడు శుభ గోష్ఠి నుర్వీశ్వరుఁడు మంత్రి
హిత పురోహితులును నెలమిఁ జేరి,
బంధువర్గము రాయబారులుఁ జారులుఁ
బరిచారకులు నెల్ల సరవిఁజేరి,
గాయకులును భృత్య గణమును మిత్రులు
సతులును సుతులును జక్క నలరి,
సరసులుఁ జతురులుఁ బరిహాసకులుఁ గళా
వంతులు గడు నొక్క వంకఁ జేరి,

తే. కొలువఁ గొలు వున్నయెడ, వచ్చి కుశికపుత్త్రుఁ
డర్థి దీవించి, తా వచ్చినట్టి కార్య
మధిపునకుఁ జెప్ప, మదిలోన నాత్రపడుచు
వినయ మొప్పార నిట్లని విన్నవించె. 70

ప్రతి : ఒకనాడు, శుభగోష్ఠిన్=అందరూ ఆనందంగా మాట్లాడుకుంటున్న సమయంలో, ఉర్వీశ్వరుఁడు= భూపతి, మంత్రి, హిత=మేలుకోరువారు, పురోహితులను, ఎలమిన్=సంతోషముగా, చేరి=కూడుకొని, బంధువర్గము=చుట్టాలు, రాయబారులున్, చారులున్=గూఢచారులు, పరిచారికలున్=సేవకులు, చుట్టాలు, ఎల్లన్=అందరు, సరవిన్=క్రమముగా, చేరి, గాయకులును=పాడేవారు, భృత్యగణమును=వివిధ సేవలందించేవారు, సతులును=భార్యలును, సుతులును=కొడుకులూ, చక్కన్=చక్కగా, అలరి=సంతోషించిరి, సరసులు=రసికులు, చతురులు=చమత్కారంగా మాట్లాడేవారు, పరిహాసకులు=హాస్యప్రసంగం చేసేవారు, కళావంతులు=వివిధ కళలలో నేర్పరులు, కడున్=మిక్కిలి, ఒక్కవంకన్=ఒకపక్కన, చేరి, కొలువన్=సేవించగా, కొలువున్నయెడ=కొలువుతీరి ఉండగా, కుశికపుత్రుఁడు=విశ్వామిత్రుడు, వచ్చి, అర్థిన్ దీవించి=ప్రీతితో దీవించి, తా వచ్చినట్టి=తాను వచ్చుటకు, కారణమైన, కార్యము=పనిని, అధిపునకు=రాజునకు, చెప్పన్=చెప్పగా, మదిలోన=మనస్సులో, అదిరిపడుచు=కంగారుపడుతూ, వినయము, ఒప్పారన్=ఒప్పగా, ఇట్లని, విన్నవించె= మనవి చేసెను.

**తా :** ఒకనాడు దశరథమహారాజు మంత్రులు, మిత్రులు, పురోహితులు, చుట్టాలు, రాయబారులు, గూఢచారులు, పరిచారకులు, గాయకులు, సేవకులు, రాణులు,కొడుకులు, విదూషకులు, హాస్యప్రియులు, సంగీతనాట్యాది వివిధ కళలలో నేర్పరులు మున్నగు వారందరితో కొలువుతీర్చి శుభగోష్ఠిలో ఉన్న సమయంలో కుశికపుత్రుడయిన విశ్వామిత్ర మహర్షి అక్కడకివచ్చి, రాజును దీవించి, తానుఎందుకు వచ్చినదీ రాజుతో చెప్పాడు. ఆ మాటవినగానే దశరథునకు మనస్సులో ఆందోళన కలిగి, వణుకుపుట్టి వినయం ఉట్టిపడేలా ఆ విశ్వామిత్ర మహర్షితో ఇట్లా విన్నవించాడు.

**విశే :** విశ్వామిత్రుడు ఏమికోరాడో దశరథుని సమాధానం ద్వారా పాఠకుడు గ్రహించుకోవాలి.

**క. రాముఁడు దనుజులతో సం**
**గ్రామము సేయంగఁ గలఁడె? కందు గదా! నే**
**నే మిమ్ముఁ గొలిచి వచ్చెద**
**నో మునిరాజేంద్ర! యరుగు ముచిత ప్రౌఢిన్. 71**

**ప్రతి :** రాముఁడు=రాముడు, దనుజులతో=రాక్షసులతో, సంగ్రామము=యుద్ధము, చేయంగఁ గలఁడె?= చేయగలడా? కందుగదా=చిన్నపిల్లవాడు కదా, నేనే మిమ్ము, ఉచితప్రౌఢిన్= తగినసామర్థ్యంతో, కొలిచి వచ్చెదను=సేవించడానికి వస్తాను, ఓ మునిరాజేంద్రా!=ఓ మునిరాజశ్రేష్ఠా!, అరుగుము=వెళ్లుము.

**తా :** రాముడు చిన్నపిల్లవాడు కదా? రాక్షసులతో యుద్ధం చేయగలడా? నేను మీ వెంటవచ్చి నాకున్న సామర్థ్యంతో మీసేవ చేస్తాను. మీరు దయతో ఓ మునిశ్రేష్ఠా! వెళ్లండి అన్నాడు.

**విశే :** సంగ్రామముసేయగలఁడె? కందుగదా!

కందుగదా! అంటే పసికందు కదా చిన్నపిల్లవాడు కదా అనే అర్థంతోపాటు కందుగదా – 'కందు' క్రియగా గ్రహిస్తే – కందిపోతాడు, కదా! యుద్ధంలో నొచ్చుకుంటాడు కదా! అనే అర్థం కూడా చెప్పుకోవచ్చు. ఇలా తెలుగు పదాల అందాన్ని మొల్ల కూర్చింది.

**మ. అనినం గౌశికుఁ డాత్మ నవ్వి, విను మయ్యా! రాజ! నీచేతఁ గా**
**దనరా దైనను రాక్షసుల్ విపుల గర్వాటోప బాహా బలుల్,**
**ఘనుఁడీ రాముఁడు దక్క వారి గెలువంగా రాదు పిన్నంచు నీ**
**వనుమానింపక పంపు మింకఁ, గ్రతు రక్షార్థంబు భూనాయకా! 72**

**ప్రతి :** అనినన్=అనగా, కౌశికుఁడు=విశ్వామిత్రుడు, ఆత్మ నవ్వి=తనలో నవ్వుకొని, వినుమయ్యా!, రాజా!, నీచేతన్ కాదనరాదు=నీవల్లకాదు అనకూడదు, ఐనను=అయినప్పటికీ, రాక్షసులు, విపుల=అధికమయిన, గర్వాటోప=అహంకారముతో కూడిన ఆడంబరముగల, బాహాబలుల్=భుజబలము కలవారు, ఘనుఁడు= గొప్పవాడైన, ఈరాముఁడు, దక్క=కాక, వారి గెలువంగరాదు=ఆ రాక్షసులను గెలువలేరు, ఇంకన్, పిన్నంచు (పిన్న+అంచు)=చిన్న పిల్లవాడని, నీవు, అనుమానింపక=సందేహం పెట్టుకోకుండ, క్రతురక్షార్థంబు= యజ్ఞమును కాపాడుటకొరకు, పంపుము, భూనాయకా!=ఓరాజా!

**తా :** దశరథుడు ఆ విధంగా కంగారుతో పలుకగా విని విశ్వామిత్రుడు నవ్వుకొని, రాజా! నా ఈ పని నీవలన కాదు అని అనకూడదు. ఆ రాక్షసులు గర్వాటోపం గలవారు. భుజబల సంపన్నులు. వారిని ఘనుడైన నీ రాముడు తప్ప మరెవ్వరూ గెలవలేరు. అందువల్ల చిన్నపిల్లవాడు అని సందేహించక నాయజ్ఞ రక్షణకోసం రాముణ్ణి పంపు మహారాజా! అన్నాడు.

**వ. అని ప్రియోక్తులు పలుకుచున్న విశ్వామిత్రునకు మిత్రకుల పవిత్రుం డైన దశరథుండు మాఱాడ నోడి యప్పుడు. 73**

**ప్రతి :** అని, ప్రియోక్తులు=మనసుకు నచ్చేవిధంగా మాటలు, పలుకుచున్న, విశ్వామిత్రునకు, మిత్రకుల పవిత్రుండైన=సూర్యవంశంలో పవిత్రుడయిన, దశరథుండు, మాఱాడన్=బదులు చెప్పుటకు, ఓడి=భయపడి, అప్పుడు.

**తా :** ఎంతో ప్రియంగా మనస్సుకు నచ్చేవిధంగా మాట్లాడుతున్న విశ్వామిత్రునికి ఎదురు చెప్పలేక దశరథుడు ఆ సమయంలో –

**క. మునినాథు వెంట సుత్రా**
**ముని నలజడి వెట్టుచున్న మూర్ఖులపై రా**
**ముని సౌమిత్రిని వెస న**
**మ్మునితో నానంద వార్ధి మునుఁగుచుఁ బనిచెన్. 74**

**ప్రతి :** మునినాథు వెంట=మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్రుని వెంట, సుత్రామునిన్= దేవేంద్రుణ్ణి, అలజడి వెట్టుచున్న=అందోళన పరుస్తున్న, మూర్ఖులపై=దుష్టులమీద, రాముని, సౌమిత్రిని, వెసన్=వేగముగా, అమ్మునితో=ఆ మునితో, ఆనందవార్ధిన్=ఆనందమనే సముద్రంలో, మునుగుచు, పనిచెన్=పంపెను.

**తా :** మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్రుని వెంట, ఇంద్రుణ్ణి అలజడిపెడుతున్న దుష్టరాక్షసులతో పోరాడడానికి రామలక్ష్మణులను దశరథుడు వేగంగా, ఆనందంతో పంపాడు.

**విశే :** ఈ కందపద్యం నాలుగు పాదాలలో 'ముని' అని వచ్చేవిధంగా కూర్చింది మొల్ల. ముని, సుత్రా, ముని, రా, ముని, అ, మ్ముని, వృత్త్యనుప్రాస.

## కౌశికుని యాజ్ఞపై రాముఁడు తాటకను గూల్చుట

**మత్తకోకిల.**

**వారిఁ దోడ్కొని కౌశికుం డట వచ్చు నయ్యెడ ఘోర కాం**
**తార మధ్యమునందు నొక్కతె దైత్య కామిని భీకరా**
**కార మొప్పఁగ నట్టహాస వికాస మేర్పడ రాగ నా**
**క్రూర రాక్షసిఁజూచి యమ్ముని కుంజరుం డొగి రామునిన్. 75**

**ప్రతి :** వారిన్=ఆ బాలురగు రామలక్ష్మణులను, తోడ్కొని=వెంటపెట్టుకుని, కౌశికుండు, అట వచ్చు నయ్యెడన్= అక్కడికివచ్చే సమయంలో, ఘోరకాంతార మధ్యమునందున్=భయంకరమయిన అరణ్యమధ్యంలో, ఒక్కతె= ఒక స్త్రీ, దైత్య కామిని= రాక్షస స్త్రీ, భీకరాకార మొప్పగ=భయంకరమైన రూపంతో, అట్టహాస వికారమేర్పడన్=

పెద్దనవ్వు నవ్వడంతో వికారం ఏర్పడగా, వచ్చు, ఆ క్రూర రాక్షసిన్=ఆ క్రూరురాలైన రాక్షసిని, చూచి, అమ్మౌని కుంజరుండు=ఆ మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్రుడు, ఒగి=చక్కగా, రామునిన్.

**తా :** ఆ రామలక్ష్మణులను వెంటబెట్టుకుని విశ్వామిత్రుడు తాను యజ్ఞంచేసే ఆశ్రమానికి వెళ్తుండగా, భయంకరమైన అడవి మధ్యలో ఒక రాక్షస స్త్రీ భీకరాకారంతో పెద్దగా నవ్వుతూ చూడడానికి వెగటుపుట్టేలా ఉండి, వస్తూ ఉండగా చూసి, ముని శ్రేష్ఠుడు రామునితో చెప్పాడు.

ఈ పద్యము మత్తకోకిల. గణములు, రసజజభర - 11వ అక్షరము యతి

**క. తాటక వచ్చిన దదిగో**
**నాటగ నాఁడుదని మేలమాడక నీ వీ**
**పాటి పడనేయు మని తద**
**బాటున శంకించు రామభద్రున కనియెన్. 76**

**ప్రతి :** తాటక, వచ్చినది, అదిగో; ఆటగన్=ఆటవలె, ఆఁడుదని=ఆడదే కదా అని, మేలమాడక= హాస్యమాడకుము, నీవు=నీవు, ఈపాటి=సామర్థ్యముతో, పడనేయుము=పడగొట్టుము, అని, తడబాటున=తొట్రుపాటుతో, శంకించు=సందేస్తున్న, రామభద్రునకు, అనియెన్=పలికెను.

**తా :** అదిగో తాటకవచ్చినది. ఆమె ఆడదేకదా అని ఆక్షేపించకు. ఆడదాన్ని చంపడమా అని సందేహిస్తున్న రామునితో నీ శక్తిసామర్థ్యాలతో ఆమెను పడవేయుము, అని విశ్వామిత్రుడు చెప్పాడు.

**విశే :** ఈ పద్యం రెండోపాదంలో -

'ఆటదియని యంచుచు మొగమాడక నీవీ' అనే పాఠాంతరం కూడా ఉంది. 'ఆడది అని తలచి మొగమాటపడక' - అని,

**వ. ఇట్లు చెప్పిన యా మునిచంద్రుని పల్కు లాలించి, రామచంద్రుండు తన యంతరంగమ్మున వితర్కించె. 77**

**ప్రతి :** ఇట్లు, చెప్పిన, ఆ, మునిచంద్రుని=విశ్వామిత్రుని, పల్కులు=మాటలు, ఆలించి=విని, రామచంద్రుండు, తన, అంతరంగమ్మునన్=మనస్సులో, ఇట్లని=ఈ విధముగా, వితర్కించె=ఆలోచించెను.

**తా :** విశ్వామిత్రుడు చెప్పిన మాటలు విని శ్రీరాముడు తనమనస్సులో ఈ విధంగా ఆలోచించాడు.

**క. ఈ యాఁడుదానిఁ జంపఁగ**
**నా యమ్మున కేమి గొప్ప?నగరే వీరుల్**
**ఛీ యని రోయుచు నమ్ముని**
**నాయకు భయ మెఱిఁగి తన మనమ్మున నలుకన్. 78**

**ప్రతి :** ఈ, ఆడుదానిన్, చంపఁగ=చంపినట్లయితే, నా యమ్మునకు=నా బాణానికి, ఏమి గొప్ప=ఏమంత గొప్పతనం, వీరుల్=వీరులయినవారు, నగరే=నవ్వరా?, ఛీ యని=ఛీ యని - నిందాభావముతో, రోయుచున్=

అసహ్యించుకొనుచు, అమ్ముని నాయకు=ఆ విశ్వామిత్రుని, భయమెఱింగి=భయాన్ని తెలుసుకుని, తన= తనయొక్క, మనమ్మునన్=మనస్సులో, అలుకన్=కోపముతో –

**తా :** ఈ ఆడుదాన్ని చంపితే నాబాణానికి గొప్పఏమి ఉంటుంది? వీరులు నన్ను చూచి నవ్వరా? ఛీ! ఈపని చేయతగ్గదికాదు అని అసహ్యించుకున్నాడు, కాని విశ్వామిత్ర మహర్షి యాగానికి ఈ తాటక వల్ల కలిగే ఆటంకాలను భయాలను తెలుసుకుని, మనస్సులో కోపంతో.

**విశే :** శ్రీరామ బాణము మొదటగా ఒక ఆడదాన్ని చంపింది–అంటే వీరులు నవ్వరా?అని రాముని ఆలోచన. శ్రీరాముడు మొదటగా చంపిన రాక్షసి తాటక ఒక స్త్రీ.

**క. వ్రేటు గొని రామచంద్రుఁడు**
**సూటిగ నొక దిట్ట కోల సురలు నుతింపన్**
**ఘోటక సమ వక్షస్థలఁ**
**దాటక నత్యుగ్ర లీల ధరపైఁ గూల్చెన్. 79**

**ప్రతి :** వ్రేటుగొని=దెబ్బకొట్టి, రామచంద్రుడు, సూటిగన్=చక్కగ, ఒక దిట్టకోలన్= ఒక బలమైన బాణంతో, సురలు=దేవతలు, నుతింపన్=పొగడగా, ఘోటక= గుఱ్ఱము, సమవక్షస్థల=సమానమైన రొమ్ముప్రదేశముగల, తాటకన్= తాటకను, అతి+ఉగ్రలీలన్=అత్యుగ్రలీలన్=మిక్కిలి భయంకరమగు విధముగా, ధరపై=భూమి మీద, కూల్చెన్=పడవేసెను,

**తా :** రాముడొక బలమైనబాణంతో గుఱ్ఱంరొమ్మువంటి రొమ్ముగల ఆ తాటకను సూటిగా గురిచూచి కొట్టి దేవతలు కొనియాడగా, భయంకరమయిన రీతిలో నేలకూల్చాడు.

**విశే :** తాటక సంహారం కనుక–టకారము–ప్రాసాక్షరంగా పెట్టి, వ్రేటు, సూటిగ, ఘోటక, తాటక–పద్యం అల్లింది మొల్ల.

**వ. అట్లు తాటకం గీ టణంచినయంత, నమ్మునీంద్రుండు మేటి సంతోషమ్మున రామునిం గొనియాడుచు నశ్రమంబున నిజాశ్రమంబున కేఁతెంచి, రామ సౌమిత్రుల సాయంబున జన్నంబు సేయుచున్న సమయంబున. 80**

**ప్రతి :** అట్లు, తాటకన్, కీటణంచినయంత=చంపినంతనె, అమ్మునీంద్రుండు, మేటిసంతోషమ్మునన్=మిక్కిలి ఆనందంతో, రామునిన్, కొనియాడుచున్=మెచ్చుకుంటు, అశ్రమంబున=శ్రమలేకుండా, నిజాశ్రమంబునకున్=తన ఆశ్రమానికి, ఏతెంచి=వచ్చి, రామసౌమిత్రుల, సాయంబునన్=సహాయంతో, జన్నంబు=యజ్ఞము చేయుచున్న సమయంబున.

**తా :** అలా తాటకను సంహరించగానే, విశ్వామిత్రుడు చాలా సంతోషించాడు. రాముణ్ణి మెచ్చుకున్నాడు. ఏశ్రమాలేకుండా తన ఆశ్రమానికి తిరిగివచ్చి, రామ లక్ష్మణులు తోడుగా తన యజ్ఞాన్ని నిర్వహిస్తుండగా–

**విశే :** రామలక్ష్మణులు – అని చెప్పే సందర్భాలలో మొల్ల సాధారణంగా 'రామసౌమిత్రులు' అంటుంది. సౌమిత్రి=సుమిత్రకొడుకు లక్ష్మణుడు.

## రాముఁడు రాక్షసులను జంపి తపసి జన్నమును గాచుట

**క.** **ఆకాశ వీథి నెలకొని**
**రాకాసులు గురిసి రమిత రక్తముఁ, బలలం**
**బా కౌశికు యజ్ఞముపై**
**భీకరముగ మునిగణంబు భీతింబొందన్. 82**

**ప్రతి :** ఆకాశవీథిన్=ఆకాశమార్గంలో, నెలకొని=నిలచి, రాకాసులు=రాక్షసులు, అమిత=ఎక్కువగా, రక్తమున్= నెత్తురు, పలలంబు=మాంసమును, ఆ కౌశికు=ఆ విశ్వామిత్రుని, యజ్ఞముపై=యజ్ఞవేదిక మీద, భీకరముగన్=భయంకరముగా, మునిగణంబు=మునుల సమూహము, భీతింబొందన్= భయపడగా, కురిసిరి=పోసిరి.

**తా :** రాక్షసులు ఆకాశంలో నిలబడి, విశ్వామిత్రుని యజ్ఞవేదికల మీద రక్తాన్ని మాంసాన్ని లెక్కలేనంతగా కురిపించారు. యజ్ఞవేదికలోని మునుల సమూహ మంతా బెంబేలు పడసాగారు.

**ఉ.** **అంబర వీథి నిల్చి త్రిదశాంతకు లెంతయు నేచి, రక్తమాం**
**సంబులు గాధినందనుని జన్నముపైఁ గురియంగ, నంతలో**
**నంబరరత్నవంశ కలశాంబుధిచంద్రుఁడు, రామచంద్రుఁ డు**
**గ్రంబుగఁ ద్రుంచెఁ జండ బలగర్వులఁ దమ్ముఁడు దాను నొక్కటై. 83**

**ప్రతి :** అంబరవీథినిల్చి=ఆకాశవీథిలో నిలబడి, త్రిదశాంతకులు=దేవతలను సంహరించి వారితో శత్రుత్వము గల రాక్షసులు, (త్రిదశులు=ఎప్పుడూ వయస్సు ముప్పై సంవత్సరాలే ఉండేవారు దేవతలు), ఎంతయున్= మిక్కిలి, ఏచి=బాధపెట్టి, రక్తమాంసంబులు=నెత్తురు, మాంసములను, గాధినందనుని=గాధిరాజు కొడుకైన విశ్వామిత్రుని, జన్నముపై=యజ్ఞముమీద, కురియంగన్=కురిపించగా, అంతలోన్=అంతలోనే, అంబరరత్న వంశకలశాంబుధి= ఆకాశానికి మణి అయిన సూర్యుని వంశమనే సముద్రానికి, చంద్రుఁడు= చంద్రునివంటివాడైన, రామచంద్రుడు, ఉగ్రంబుగన్=తీవ్రముగ, చండబల గర్వులన్=తీవ్రమయిన బలగర్వము గలవారిని, తమ్ముఁడున్=లక్ష్మణుడు, తాను నొక్కటై=తమ్ముడు తాను–ఒక్కటై, త్రుంచెన్= సంహరించెను.

**తా :** ఆకాశంలో నిలబడి రాక్షసులు విశ్వామిత్రుని యాగకుండం మీద రక్తాన్ని మాంసాన్ని అదేపనిగా కురిపిస్తూ, బాధ పెడుతుండగా, సూర్యవంశాంబుధి చంద్రుడైన రాముడు తాను తనతమ్ముడు ఒక్కటిగా విజృంభించి ఆ బలగర్వితులయిన రాక్షసులను సంహరించారు.

**విశే :** తమ్ముడు దానునొక్కటై – కందువమాట.

**వ. ఇట్లు రామచంద్రుండు సాంద్ర ప్రతాపంబు మించ నింద్రారులఁ ద్రుంచిన నమ్మునిచంద్రుఁడు నిర్విఘ్నంబుగా జన్నం బొనర్చి, రామ సౌమిత్రులం బూజించె నట్టి సమయమ్మున. 83**

**ప్రతి :** ఇట్లు, రామచంద్రుండు, సాంద్రప్రతాపంబు=దృఢమయిన పరాక్రమం, మించన్=అతిశయించగా, ఇంద్రారులన్=ఇంద్రుని శత్రువులయిన రాక్షసులను, త్రుంచినన్=చంపగా, అమ్ముని చంద్రుఁడు=ఆ విశ్వామిత్రుడు, నిర్విఘ్నంబుగాన్=ఎట్టి అడ్డంకులు లేకుండా, జన్నంబు=యజ్ఞము, ఒనర్చి=పూర్తిచేసి, రామ సౌమిత్రులన్, పూజించె=సత్కరించెను, అట్టిసమయంబున=ఆ వేళలో...

**తా :** ఈ విధంగా అమితపరాక్రమవంతుడయిన రాముడు రాక్షసులను చంపివేయగా విశ్వామిత్రమహర్షి ఎట్టి అడ్డంకులు లేకుండా, యజ్ఞాన్ని విజయవంతంగా పూర్తిచేసాడు. అట్టివేళలో.

**క. ధరణి సుత యగు సీతకుఁ**
**బరిణయ మొనరింప జనక పార్థివుఁ డిల భూ**
**వర సుతుల రండని స్వయం**
**వర మొగిఁ జాటించె నెల్ల వారలు వినఁగన్. 84**

**ప్రతి :** ధరణిసుతయగు=భూదేవిపుత్రిక అయిన, సీతకున్=సీతకు, పరిణయము=పెండ్లి, ఒనరింపన్=చేయసమకట్టి, జనకపార్థివుఁడు=జనకమహారాజు, ఇలన్=భూమిమీది, భూవరసుతులన్=రాజకుమారులను, రండు+అని=రండని, స్వయంవరము=తన వరుని తానే ఎన్నుకొను విధానమునకు, ఒగిన్=బాగుగా, ఎల్లవారలు=అందరు, వినగన్=వినునట్లుగా, చాటించెన్=ప్రకటించెను.

**తా :** జనక మహారాజు తానుపెంచిన భూపుత్రి అయిన సీతకు పెండ్లిచేయదలచి, సీతాస్వయంవరానికి రావలసినదిగా రాజకుమారులను అందరినీ ఆహ్వానిస్తూ ప్రకటన చేసాడు.

**వ. ఇట్లు స్వయంవర మహోత్సవ ఘోషంబున సంతోషమ్ము నొంది విశ్వామిత్రుండు రామ సౌమిత్రుల మిథిలా నగరంబునకుఁ దోడ్కొని చనుచుండు మార్గంబున. 85**

**ప్రతి :** ఇట్లు, స్వయంవర మహోత్సవ=స్వయంవరమనే గొప్ప ఉత్సవంయొక్క, ఘోషంబున=చాటింపుతో, సంతోషము, ఒంది=పొంది, విశ్వామిత్రుడు, రామ సౌమిత్రులన్, మిథిలానగరంబునకున్, తోడ్కొని=వెంటతీసుకొని, చనుచుండు=వెళ్లే, మార్గంబునన్=త్రోవలో,

**తా :** ఈ విధంగా మిథిలానగరంలో సీతాస్వయంవరాన్ని గురించిన ప్రకటన వెలువడడంతో ఎంతో సంతోషంతో, విశ్వామిత్రుడు రామసౌమిత్రులను వెంట బెట్టుకుని మిథిలకు వెళుతుండగా త్రోవలో.

## శ్రీరాముని పాద ధూళి సోక నహల్యయైన శిల

**క. ముది తాపసి వెనువెంటను**
**వదలక చనుదెంచునట్టి వడి రాముని శ్రీ**

**పద రజము సోఁకి, చిత్రం**
**బొదవఁగఁ గనుపట్టె నెదుట నొక యుపల మటన్.** **86**

**ప్రతి :** ముది తాపసి=వృద్ధుడైన ఆ మునియొక్క, వెనువెంటను=వెంబడి, వదలక, చనుదెంచునట్టి= వస్తున్నటువంటి, వడి=వేగంలో, రాముని=రామునియొక్క, శ్రీపద రజము సోఁకి=లక్ష్మీప్రదమయిన పాదముల ధూళితగిలి, చిత్రం బొదవన్=ఆశ్చర్యం కలిగేలా, ఎదుటన్=ఎదురుగా, అటన్=అక్కడ, ఒక=ఒక, ఉపలము= రాయి, కనుపట్టె= కనపించెను.

**తా :** వృద్ధతాపసి విశ్వామిత్రుని వెంట వేగంగా నడుస్తున్న రాముని పాదధూళి తగిలి, ఆశ్చర్యంగా ఎదురుగా ఒక రాయి కనబడింది.

**క. పదనై, యొప్పిదమై, కడుఁ**
**గదలుచు బంగారు పూదె కరఁగిన రీతిన్,**
**మెదలుచు, లావణ్య స్థితి**
**సుదతిగఁ జూపట్టి నిలిచె సురుచిర లీలన్.** **87**

**ప్రతి :** పదనై=తడిగా అయి మెత్తగా అయి, ఒప్పిదమై=అందమైనదిగా అయి, కడున్=మిక్కిలి, కదలుచు= కదులుతూ, బంగారుపూదె=బంగారుపూస, కరఁగినరీతిన్=కరిగినట్లుగా, మెదలుచు=కదులుతూ, లావణ్యస్థితిన్=మెరుపుగల శరీరముతో, సుదతిగన్=స్త్రీవలె, చూపట్టి=కనబడి, సురుచిరలీలన్=అత్యంత మనోహరంగా, నిలిచె=నిలబడినది.

**తా :** గట్టిగా ఉండే ఆరాయి క్రమంగా మెత్తనై అందంగా, బాగా కదులుతూ, బంగారుపూసను కరగించిన విధంగా పాత్రలో ఇటూ అటూ మెదులుతూ, ప్రకాశిస్తూన్నట్టి శరీరంతో అత్యంత మనోహరమైన స్త్రీ అయి అందంగా ఎదుట నిలబడింది.

**విశే :** బంగారం కరిగించేటప్పుడు ఆ బంగారం కదలికలోని మెరుపు అందమువలె ఈ రాయి స్త్రీగా మారినప్పుడు కనబడింది, అంటూ – విశేషమయిన ఉపమానం చెప్పింది మొల్ల.

**ఉ. ఆ ముని వల్లభుండు గొని యాడుచుఁ బాడుచు, వేడ్కతోడ శ్రీ**
**రాముని జూచి యిట్లనియె, రామ! భవత్పద ధూళి సోఁకి, యీ**
**భామిని రాయి మున్ను, కులపావన చూడఁగఁ జిత్రమయ్యె నీ**
**నామ మెఱుంగు వారలకు నమ్మఁగ వచ్చును భుక్తి ముక్తులున్.** **88**

**ప్రతి :** ఆ మునివల్లభుండు=ఆ విశ్వామిత్ర మహర్షి, కొనియాడుచున్=మెచ్చుకుంటూ, పాడుచు= పాటలు పాడుతూ, వేడ్కతోడ=సంతోషంతో, శ్రీరాముని చూచి=రాముని చూచి, ఇట్లనియె=ఇలా అన్నాడు, రామ!=ఓ శ్రీరామా!, భవత్=నీ యొక్క, పదధూళి=కాలిదుమ్ము, సోఁకి=తగిలి, ఈ భామిని రాయిమున్ను=

ఇప్పుడు మన ఎదురుగా ఉన్న ఈ స్త్రీపూర్వం రాయి, కులపావన=కులాన్ని పవిత్రం చేసేవాడా, చూడగన్= చూడగా, చిత్రమయ్యె=చాలా ఆశ్చర్యకరమైంది, నీనామము= నీపేరును, ఎఱుంగువారలకున్= తెలిసినవారికి, నమ్మగ=నమ్మినట్లయిన, భుక్తి ముక్తులున్=సంసార సౌఖ్యాలు, మోక్షము కూడా, వచ్చును= లభిస్తాయి.

**తా :** రాయి రమణిగా మారడం చూసి విశ్వామిత్రుడు ఆనందంతో రాముణ్ణి పొగుడుతూ, పాటలు పాడుతూ, ఓ రామా! మునుపు శిలగా ఉన్న ఈమె ఇప్పుడు నీ పాదధూళి పడి స్త్రీగామారింది. ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. నువ్వు మీ వంశాన్ని పవిత్రం చేసావు. నీ నామాన్ని తెలిసి నమ్మినవారికి ఇహలోక సుఖాలు, పరలోకంలో మోక్షపదవి కూడా కలుగుతాయి అన్నాడు విశ్వామిత్రుడు.

**విశే :** 1. రాముడు మహావీరుడు అని తాటక సంహారం వల్ల స్పష్టయయింది. 2. రాముడు పతిత పావనుడని, రామపదధూళి మహత్వము అహల్య వృత్తాంతంతో నిరూపితమయ్యాయి. 3. మొల్ల అవతారికలో రామకథ రచనకు కారణం చెప్తూ **'భూజన కల్పకంబనుచు, భుక్తికి ముక్తికి మూలమంచు, నా రాజును దైవమైన రఘురాము నుతించినఁ దప్పుగల్గునే'**? రాముని నుతి – భుక్తికి ముక్తికి మూలమంది. అదే భావాన్ని ఇక్కడ విశ్వామిత్రమహర్షినోట పలికించి ఆ భావనను మరింత పవిత్రం చేసింది. **'నామ మెఱుంగు వారలకు నమ్మగవచ్చును భుక్తిముక్తులున్'**.

**వ. అని యక్కాంతా రత్నంబు పూర్వ వృత్తాంతం బంతయునెంతయు సంతసమ్మున నమ్మనుజేంద్ర నందనుల కెఱింగింపుచు, మిథిలా నగరంబునకుం జనియె నచ్చట. 89**

**ప్రతి :** అని, అక్కాంతారత్నంబు=ఆ స్త్రీ రత్నము యొక్క, పూర్యవృత్తాంతం=వెనుకటి కథను, అంతయు, ఎంతయు=ఎంతో, సంతసమ్మున=సంతోషంతో, అమ్మనుజేంద్ర నందనులకున్=ఆ రాజకుమారులకు, ఎఱింగింపుచున్=చెప్తూ, మిథిలానగరంబునకున్= మిథిలానగరానికి, చనియెన్, అచ్చట.

**తా :** రాయిగా ఉండి నాతిగా మారిన ఆ స్త్రీరత్నం కథనంతా విశ్వామిత్రుడు పూర్తిగా ఆ రాజకుమారులకు చెప్తూ వారితో మిథిలానగరానికి వెళ్లాడు. అక్కడ.

## సీతా స్వయంవరము

**సీ. ద్రవిడ కర్ణాటాంధ్ర యవన మహారాష్ట్ర**
**రాజ కుమారులు తేజ మలరఁ**
**బాండ్య ఘూర్జర లాట బర్బర మళయాళ**
**భూపనందనులు విస్ఫూర్తిమీఱ,**
**గౌళ కేరళ సింధు కాశి కోసల సాళ్వ**
**ధరణీశపుత్రులు సిరి వెలుంగ,**
**మగధ మత్స్య కళింగ మాళవ నేపాళ**
**నృప తనూభవులు నెన్నికకు నెక్క**

తే. మఱియు నుత్కల కొంకణ మద్ర పౌంద్ర
వత్స గాంధార సౌరాష్ట్ర వంగ చోళ
రాజ్యముల నొప్పు ఛప్పన్నరాజసుతులు
వచ్చిరక్కామినీస్వయంవరమునకును. **90**

**ప్రతి :** ద్రవిడ, కర్ణాట, ఆంధ్ర, యవన, మహారాష్ట్ర దేశాలకు చెందిన, రాజకుమారులు, తేజమలరన్=కాంతియుతులై, గౌళ, కేరళ, సింధు,కాశి, కోసల, సాళ్వ, ధరణీశపుత్రులు=రాజకుమారులు, సిరివెలుగంగ వారికి గల సంపద కనబడేలా, మగధ, మత్స్య, కళింగ, మాళవ, నేపాళ, నృప తనూభవులు=రాజకుమారులు, ఎన్నికకునెక్క=గుర్తింపబడేలా, మఱియు, ఉత్కల, కొంకణ, మద్ర, పౌంద్ర, వత్స, గాంధార, సౌరాష్ట్ర, వంగ, చోళరాజ్యముల ఒప్పు=ప్రకాశించు, ఛప్పన్న=ఏభైఆరు, రాజసుతులు=రాజకుమారులు, అక్కామినీ=ఆ సీతాదేవి, స్వయం వరమునకును వచ్చిరి.

**తా :** మిథిలానగర రాజకుమారి సీతాదేవి స్వయంవరం అని ప్రకటించగానే ద్రవిడ కర్ణాటాంధ్రయవన-మొదలయిన యాభైఆరు రాజ్యాల రాజకుమారులు గొప్ప తేజస్సుతో సంపదతో, పేరు గల వారు వచ్చారు.

**విశే :** ఈ సీసపద్యం నాలుగు పాదాలలో కొన్ని రాజ్యాలపేర్లు చెప్పి ఆయా రాజ్యాల రాజకుమారులు వచ్చారు అని చెప్పే సందర్భంలో రాజకుమారులు, భూపనందనలు, ధరణీశపుత్రులు, నృపతనూభవులు, రాజసుతులు - అనే పర్యాయపదాలు ప్రయోగించింది. పర్యాయపదాలు అంటే ఒకే అర్థం చెప్పగలిగే భిన్నపదాలు. రాజు-భూప, ధరణీశ, నృప, కుమారులు - నందనులు, పుత్రులు, తనూభవులు, సుతులు, భారతదేశంలో 56 రాజ్యాలు ప్రసిద్ధికెక్కి ఉండేవి. ఈ పద్యంలో ముప్పైరాజ్యాలు ప్రస్తావించి - ఇలాంటి 56 దేశాల రాజకుమారులు వచ్చారు అని చెప్పింది. అంటే దేశంలోని రాజకుమారు లందరు వచ్చినట్లే.

ఛప్పన్న=యాభై ఆరు - అరుదుగా కనిపించే పదం.

ఉ. **కొందఱు పల్లకీల, మఱి కొందఱు తేరుల, నందలంబులం**
**గొందఱు, కొంద ఱశ్వములఁ, గొందఱు మత్త గజేంద్ర సంఘమున్**
**గొందఱు స్వర్ణ డోలికలఁ గోరిక నెక్కి నృపాల నందనుల్**
**సందడిఁగాఁగ వచ్చిరి, బుజంబు బుజంబును ద్రోపు లాడఁగన్.** **91**

**ప్రతి :** కొందఱు, పల్లకీలన్=పల్లకీలలోను, మఱికొందఱు, తేరులన్=రథాలమీద, అందలంబులన్=మేనాలలో, కొందఱు, కొందఱు అశ్వములన్=గుఱ్ఱాలమీద, కొందఱు, మత్తగజేంద్రసంఘమున్=మదించిన ఏనుగుల సమూహాలమీద, కొందఱు, స్వర్ణడోలికలన్=బంగారంతో చేసినడోలికలు=ఉయ్యాలవంటి, ప్రయాణ సాధనములను, కోరికన్= కోరికతో-సీతాదేవిని వివాహమాడాలి అనే కోరికతో, ఎక్కి, నృపాల నందనుల్=రాజపుత్రులు, సందడిగాగన్=గుంపులుగా, వచ్చిరి, బుజంబును బుజంబును=భుజము భుజము, త్రోపులాడగన్=త్రోసుకుంటుదండగా. (ఒరుసుకుంటూ)

**తా :** సీతా స్వయంవరానికి రాజకుమారులు కొందఱు పల్లకీలలోను, మరికొందఱు రథాలను, కొందఱుమేనాలను, కొందఱు గుఱ్ఱాలను, కొందఱు మదించిన ఏనుగులను, కొందఱు బంగారు డోలీలను ఎక్కి గుంపులుగా బుజంబు బుజంబు ఒరుసుకుంటూ (తోసుకుంటూ) ఉండగా వచ్చారు.

**విశే :** ఈ పద్యంలో – ప్రయాణసాధనాల వివరాలు ఉన్నాయి. పల్లకీలు, మేనాలు, డోలీలు – మనుష్యులు మోసేవి. డోలీలు తిరుపతి కొండ ఎక్కలేని వారిని తీసుకు వెళ్లేవారు, బస్సులు రాకముందు ధనవంతులు డోలీలమీద ఎక్కేవారు. ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు – తామే స్వయంగా నడుపుకో గలిగేవి. చాలామంది వచ్చారు అని చెప్పడానికి మొల్ల, బుజంబు బుజంబును. త్రోపులాడగన్ అని తెలుగు నుడికారం ప్రయోగించింది. రాజుల సమ్మర్దం కారణంగా ఆ ప్రదేశం ఇరుకుగా ఉంది. ఒకరి భుజం మరొకరికి ఒరుసుకుంటూ తగులుతోంది అని.

**వ. అట్టి సమయంబున** **92**

**తా :** అట్టి సమయంబున.

**చ. గురుభుజ శక్తి గల్గు పదికోట్ల జనంబులఁ బంప, వారు నా**
**హరుని శరాసనంబుఁ గొనియాడుచుఁ బాడుచుఁ గొంచు వచ్చి, సు**
**స్థిరముగ వేదిమధ్యమునఁ జేర్చిన, దానికి ధూప దీపముల్**
**విరులును గంధ మక్షతలు వేడుక నిచ్చిరి చూడ నొప్పుగన్.** **93**

**ప్రతి :** గురు=అధికమైన, భుజశక్తి గల్గు=బాహుబలంకల, పదికోట్ల, జనంబులన్=మనుష్యులను, పంపన్=పంపగా, వారున్=వారందరూ, ఆ హరుని=ఆ శివుని, శరాసనంబున్=విల్లును, కొనియాడుచున్=పొగుడుతూ, పాడుచున్=పాడుతూ, కొంచువచ్చి=తీసుకువచ్చి, సుస్థిరముగన్=కదలకుండ, వేదిమధ్యమునన్=స్వయంవర వేదికమధ్యలో, చేర్చినన్=చేర్చగా, దానికిన్=ఆ వింటికి, ధూపదీపముల్=ధూపము, దీపములు, విరులును=పువ్వులు, గంధము, అక్షతలు, వేడుకన్=ఆనందముతో, చూడన్=చూడడానికి, ఒప్పుగన్=మనోహరముగా ఉండునట్లు ఇచ్చిరి.

**తా :** జనకుడు అధికమైన భుజశక్తి గల పదికోట్లమందిని శివుని విల్లు గలపెట్టెను తీసుకుని రమ్మనిపంపగా వారు ఆ వింటిని పొగుడుతూ పాటలు పాడుతూ తీసుకుని వచ్చి, వేదిక మధ్యలోకి తెచ్చిపెట్టారు. అంతేకాక ఆ పెట్టెకు – ధూపదీపాలు, పువ్వులు, గంధము, అక్షతలు – ఆనందంతో అర్పించారు. ఆ దృశ్యం చూడ మనోహరంగా ఉంది.

**వ. అట్టి సమయంబున జనక భూపాలుండు రాజ కుమారులం గనుంగొని యిట్లనియె. 94**

**ప్రతి :** అట్టి సమయంబునన్=అటువంటి సమయంలో, జనకభూపాలుండు=జనక మహారాజు, రాజకుమారులన్, కనుంగొని=చూచి, ఇట్లు అనియె=ఈ విధంగా పల్కెను.

**తా :** ఆ సమయంలో జనకమహారాజు రాజకుమారులను చూచి ఇలా అన్నాడు.

## శివ ధనువు నెక్కు పెట్టిన ధీరునకు సీత నిత్తునని జనకుని ప్రకటన

**ఉ. కొంకక సావధానమతిఁ గూర్చి వినుం డిదె, మత్తనూజకై**
**యుంకువ సేసిఁనాడ వివిధోజ్జ్వల మైన ధనంబుఁ, గాన నీ**
**శంకరు చాప మెక్కిడిన సత్త్వ ఘనుం డగువాని కిత్తునీ**
**పంకజనేత్ర సీత, నరపాలకులార! నిజంబు సెప్పితిన్. 95**

**ప్రతి :** కొంకక=సందేహించక, సావధానమతిన్=ఏమరుపాటులేని బుద్ధిని, కూర్చి=నిలిపి, మనసు ఈవిషయం మీదనే ఉంచి, వినుండు=వినండి, ఇదె, మత్తనూజకై=నా కూతురి కొఱకు, ఉజ్జ్వలమైన=విలువ గలిగిన, ధనంబున్=సొమ్మును, ఉంకువ=పణముగా, చేసినాడన్=ఏర్పాటు చేసాను, వివిధ=అనేకములయిన, కాన=కావున, ఈ శంకరుచాపము=ఈ కనబడుతున్న శివుని విల్లు, ఎక్కిడిన=ఎక్కుపెట్టిన, సత్త్వఘనుండు=గొప్ప బలశాలియైన, వానికి, ఈ పంకజనేత్ర=తామరపువ్వుల వంటి కన్నులుగల, సీతను, ఇత్తు=ఇచ్చెదను, నరపాలకులార!=రాజులార! నిజంబు, చెప్పితిన్.

**తా :** ఓ రాజులారా! మీరంతా సావధాన బుద్ధితో వినండి. నా కూతురి వివాహంకోసం విశేషమైన ధనాన్ని ఉంకువ చేసాను. ఈ శివుని విల్లు ఎక్కుపెట్టిన బలవంతునికి సీతను ఇస్తాను. నేను నిజము చెప్పాను.

**ఆ. అనుచుఁ బలుకుచున్న యవనీశ తిలకుని**
**వాక్యములకు నుబ్బి, వసుమతీశ**
**సుతులు దాము తామె మతిలోనఁ జెలఁగుచు**
**దగ్గఱంగఁ బోయి ధనువుఁ జూచి. 96**

**ప్రతి :** అనుచున్, పలుకుచున్న=మాట్లాడుచున్న, అవనీశతిలకుని=రాజులలో శ్రేష్ఠుడయిన జనకుని, వాక్యములకున్=మాటలకు, ఉబ్బి=సంతోషించి, వసుమతీశ సుతులు=రాజకుమారులు, తాముతామె=తమలో తాము, మతిలోనన్=ఆలోచనలలో, చెలఁగుచు=ఉత్సాహం పొంది, దగ్గఱంగన్=దగ్గఱగా, పోయి=వెళ్లి, ధనువున్=వింటిని, చూచి.

**తా :** రాజశ్రేష్ఠుడయిన జనకుడు ఆ విధంగా చెప్పిన మాటలకు సంతోషించినవారై రాజకుమారులు తమంతట తాము ఉత్సాహం పొంది విల్లు దగ్గరకు వచ్చి ఆ వింటిని చూచి.

**విశే :** ఉంకువ=కన్యకొఱకు మామగారికి గాని కన్యకుకాని ఇచ్చే ధనము. (కన్యాశుల్కము). సీతను వివాహమాడాలి అంటే–శివధనుస్సును ఎక్కుపెట్టాలి. ఇక్కడ జనకుడు కోరినది–శివధనస్సును ఎక్కుపెట్టడమనే ఉజ్జ్వలమైన ధనం.

భారతంలో ద్రౌపదీ స్వయంవరంలో – మత్స్యయంత్రం కొట్టడమే ఉంకువ, భాగవతంలో రుక్మిణీదేవి కృష్ణునకు – పంపిన సందేశంలో భవదీయ శౌర్యమే ఉంకువచేసి! నన్ను కొనిపొమ్ము అంటుంది. ఇదే కాలక్రమాన కన్యాశుల్కంగా రూపొందింది.

**రాజకుమారులు శివచాపమును గదల్ప నోడుట**

**క. విల్లా? యిది కొండా? యని**
**తల్లడపడి సంశయంబు తలకొన మదిలో**
**బల్లిదు లగు నృప నందను**
**లెల్లరు దౌదవుల నుండి రెంతయు భీతిన్. 97**

**ప్రతి :** విల్లా?=ధనుస్సా?, ఇది, కొండా?=పెద్దపర్వతమా? అని, తల్లడపడి= కలతపడి, సందేహము, తలకొనన్=కలుగగా, మదిలో=మనస్సులో, బల్లిదులగు=బలవంతులైన, నృపనందనలు=రాజకుమారులు, ఎల్లరు=అందరు, ఎంతయు=మిక్కిలి, భీతిన్=భయంతో, దౌదవులన్=దూరదూరంగా, ఉండిరి.

**తా :** శివధనుస్సును కదల్పలేని బలవంతులైన ఆ రాజకుమారులు ఇది విల్లా, కొండా! అని కలతపడి, మనస్సులో సందేహం కలుగగా, మిక్కిలి భయంతో దూరదూరంగా ఉండిపోయారు.

**క. కొందఱు దగ్గఱ నోడిరి,**
**కొందఱు సాహసము చేసి కోదండముతో**
**నందంద పెనఁగి పాఱిరి**
**సందుల గొందులను దూఱి, సత్త్వము లేమిన్. 98**

**ప్రతి :** కొందఱు, దగ్గఱన్=సమీపించడానికి, ఓడిరి=భయపడిరి, కొందఱు, సాహసము చేసి=ధైర్యం చేసి, కోదండముతోన్=వింటితో, అందంద=అక్కడక్కడ, పెనఁగి=ప్రయత్నించి, సందులగొందులను=సందులలోను, సందుల కంటె చిన్నవి గొందులు–వాటిలోకి, దూఱి=ప్రవేశించి, సత్త్వము=శక్తి, లేమిన్=లేకపోవడం వల్ల, పాఱిరి=పరుగెత్తుకొనిపోయిరి.

**తా :** కొందఱు వింటి దగ్గఱ దాకా వెళ్లడానికే భయపడ్డారు. మరి కొందఱు సాహసం చేసి విల్లును ఎత్తడానికి ప్రయత్నించి, ఎత్తలేక పరుగెత్తుకుపోయారు. ఆ వింటిని ఎక్కుపెట్టే శక్తిలేక సందుగొందులను దూఱారు కొందఱు.

**విశే :** సందుల గొందుల దూరు–తెలుగునుడికారము.

**సీ. గాలిఁ దూలిన రీతిగా నెత్తఁజాలక**
**తముఁదామె సిగ్గునఁతలనువంచి**

కౌఁగిలించిన లోను గాక వెగ్గల మైన
భీతిచే మిక్కిలి బీరువోయి
కరముల నందంద పొరలించిచూచినఁ
గదలక యున్నఁజీకాకునొంది
బాషాణ మున్నట్టి పగిది మార్దవ మేమిఁ
గానరాకుండినఁ గళవళించి

తే. రాజసూనులు కొందఱు తేజ ముడిగి
జగతిరాజుల మోసపుచ్చంగఁ దలఁచి,
జనకుఁ డీ మాయఁగావించెఁ, జాలు ననుచుఁ
దలఁగిపోయిరి దవ్వుగా ధనువువిడిచి. **99**

**ప్రతి :** గాలిన్=గాలికి, తూలినరీతిగా=తూలిపడిపోయినట్లుగా, ఎత్తజాలక=వింటిని ఎత్తలేక, తముఁదామె=తమకుతామే, సిగ్గునన్=సిగ్గుతో, తలనువంచి=తలవంచుకుని, కౌఁగిలించినన్=విల్లును గుండెల దగ్గఱగా తెచ్చిపట్టుకుందామన్నా, లోనుగాక=వశము గాక, వెగ్గలమైన=అధికమయిన, భీతిచేన్=భయముతో, మిక్కిలి, బీరుపోయి=నీరసపడి, కరములన్=చేతులతో, అందంద=అక్కడక్కడ, పొరలించి=ఇటూ అటూ కదుపుదామని, చూచినన్=చూడగా, కదలకయున్నన్, చీకాకునొంది, పాషాణము=బండరాయి, ఉన్నట్టి పగిది=ఉన్నవిధంగా, మార్దవము=మెత్తదనము, ఏమి, కాన రాకుండినన్=కనబడకపోగా, కళవళించి=కలతపడి, రాజసూనులు=రాజకుమారులు, కొందఱు, తేజ ముడిగి=శక్తిని కోల్పోయి, జగతి=లోకములో, రాజుల=రాజులను, మోసపుచ్చంగన్=మోసం చేయాలి అని, తలచి=ఆలోచించి, జనకుడు, ఈ మాయన్=ఈ కపటమును, (విల్లు ఎత్తడం అనే కార్యక్రమం), కావించె=చేశాడు, అనుచు, దవ్వుగా=దూరంగా, ధనువు విడిచి, తలఁగిపోయిరి=తప్పుకొనిపోయిరి.

**తా :** విల్లు ఎత్తబోయి గాలికి తూలినట్లు తూలి సిగ్గుతో కొందరు తలలు వంచారు. ధనస్సును ఆలింగనం చేసుకుందామని ప్రయత్నించి వశంగాక నీరసపడి కొందరు, చేతులతో పొరలించి ఎంత ప్రయత్నించినా కదల్చలేక చీకాకుపడి కొందరు ఆ విల్లు బండరాయిలా ఏమాత్రం మెత్తదనం లేక లొంగక కలతచెంది కొందరు రాజకుమారులు శక్తిహీనులయ్యారు. ఈ జనకుడు రాజుల్ని వంచన చేయడానికి ఈ స్వయంవరం, విల్లు ఎత్తడం ఏర్పాటు చేసాడు. ఇకచాలు అంటూ శివధనుస్సుకు దూరంగా వెళ్లిపోయారు.

సీ. ఇది పర్వతాకార, మీ విల్లు కను విచ్చి
తేఱి చూడఁగరాదు దేవతలకు
నటుగాక మును శేష కటకుని ధను వంట
హరుఁడె కావలెఁ గాక,హరియుఁ గాక,

తక్కినవారికిఁ దరమె యీ కోదండ
మెత్తంగఁ? దగు చేవ యెట్లు గలుగు?
దీని డగ్గఱ నేల? దీని కోడఁగ నేల?
పరులచే నవ్వులు పడఁగ నేల?

తే. గుఱుతు సేసియుఁ దమ లావు కొలఁదిఁ దామె
తెలియవలెఁ గాక, యూరక తివుర నేల?
యొరుల సొమ్ములు తమ కేల దొరకు?
ననుచుఁ దలఁగిపోయిరి రాజ నందనులు గనుచు. 100

ప్రతి : ఇది, పర్వతాకారము=కొండవంటిరూపము కలది, ఈ విల్లు, దేవతలకును=దేవతలకుకూడా, కనువిచ్చి=కన్ను తెఱచి, తేఱిచూడఁగరాదు=పరిశీలనగా చూడడానికి వీలుకాదు, అటుకాక=అంతేకాక, మును=పూర్వము, శేషకటకుని=పాముని కడియముగా అలంకరించుకునే శివునియొక్క, ధనువంటన్=ధనస్సును ముట్టుకోవడానికి, హరుఁడె=శివుడే, కావలెన్=కావాలి, కాక=లేకపోతే, హరియుఁగాక=విష్ణువయినా కావాలి, తక్కినవారికి, తరమె=శక్యమా, ఈ కోదండమెత్తంగ?=ఈ వింటిని ఎత్తుటకు, తగు=సరిపడు, చేవ=బలము, ఎట్లుకలుగు, దీని డగ్గఱనేల=దీనికి దగ్గరగా వెళ్లడమెందుకు?, దీని కోడగనేల=దీనికి ఓడిపోవడమెందుకు?, పరులచే=ఇతరులచే, నవ్వులుపడఁగ నేల=నవ్వులపాలు కావడమెందుకు, గుఱుతు సేసియు=దీని విషయం తెలిసికూడా, తమ లావుకొలది=తమ బలము ఎంతటిదో, తామె, తెలియవలె, కాక=లేనిచో, ఊరికే, తివురనేల=ప్రయత్నించడం దేనికి, ఒరుల=ఇతరుల, సొమ్ములు, తమకు, ఏల=ఎందుకు, దొరకు?=లభిస్తాయి, అనుచు, రాజనందనులు, కనుచు=చూస్తూ, తలఁగిపోయిరి=తప్పుకొనిపోయిరి.

**తా :** ఈ విల్లు చూడబోతే కొండంత ఉంది. దీన్ని తేరిపార చూడాలంటే దేవతలకు కూడా శక్యం కాదు. ఈ శివుని విల్లు ఎత్తాలంటే – శివుడైనా, విష్ణువైనా కావాలి. ఇతరుల వల్ల అయ్యేపనికాదు. అంతటి శక్తి తక్కినవారికి ఎక్కడ ఉంది. దీనిదగ్గఱకు వెళ్లడమెందుకు? ఓడిపోవడమెందుకు? తమ బలమెంతో తాము తెలుసుకుని మరీ పూనుకోవాలి. అంతేకాని ఊరికే అనవసరంగా ప్రయత్నించడమెందుకు? ఓడిపోవడమెందుకు? నవ్వులపాలు కావడమెందుకు? ఇతరుల సొమ్ము మనకెలాదక్కుతుంది? అనుకుని రాజకుమారులు తొలగిపోయారు.

**విశే :** నవ్వులు పడగనేల, ఒరుల సొమ్ములు తమకేల దొరుకు? – నుడికారాలు.

వ. అంత విశ్వామిత్ర మునీంద్రుండు రామచంద్రుని ముఖావలోకనంబుఁజేసిన. 101

ప్రతి : అంత=అప్పుడు, విశ్వామిత్రమునీంద్రుడు, రామచంద్రుని, ముఖావలోకనంబున్=ముఖమువైపు చూచుట, చేసిన=చేయగా.

**తా :** అప్పుడు విశ్వామిత్రమహర్షి శ్రీరాముని ముఖము వైపుచూడగా.

## ముని యానతి శ్రీరామునిచే శివ ధనుర్భంగము

చ. **కదలకుమీ ధరాతలమ, కాశ్యపిఁ బట్టు ఫణీంద్ర, భూ విషా**
**స్పదులను బట్టు కూర్మమ, రసాతల భోగి ధులీ కులీశులన్**
**వదలక పట్టు ఘృష్టి, ధరణీ ఫణి కచ్ఛప పోత్రి వర్గమున్**
**బొదువుచుఁ బట్టుఁడీ కరులు, భూవరుఁ డీశుని చాప మెక్కిడున్. 102**

**ప్రతి :** ధరాతలమ=ఓ భూమి!, కదలకుమీ=కదలవద్దు సుమా, కాశ్యపిన్=భూమిని, ఫణీంద్ర= నాగరాజయిన శేషుడా!, పట్టుకో, భూవిషాస్పదులను=భూమిని, శేషుణ్ణి, కూర్మమ=ఓతాబేలా!, పట్టు= పట్టుకొమ్ము, ఘృష్టి!=వరాహమా, రసాతలభోగి ధులీకులీశులన్=భూమిని, శేషుణ్ణి, తాబేటిరాజును, వదలకపట్టు= వదలకుండా పట్టుకో, కరులు=దిగ్గజములారా!, ధరణీ ఫణి కచ్ఛప పోత్రివర్గమున్=భూమి, శేషుడు, తాబేలు, వరాహాల సమూహాన్ని, పొదువుచు=దగ్గరగా తీసుకుని, పట్టుఁడీ=పట్టుకోండి, భూవరుడు=రాజు, ఈశుని=ఈశ్వరుని, చాపము=విల్లు, ఎక్కిడున్=ఎక్కుపెడతాడు.

**తా :** శివకార్ముకాన్ని శ్రీరాముడు ఎక్కుపెట్టబోతున్నాడు. ఓ ధరాతలమా! భూదేవీ కదలకుమీ. భూదేవిని మోస్తున్న ఆదిశేషుడా – భూమిని గట్టిగా పట్టుకో. ఓ కూర్మమా! నువ్వు భూమిని, ఆదిశేషుణ్ణి గట్టిగాపట్టుకో, ఓ వరాహమా! నువ్వు భూమిని, ఆదిశేషుణ్ణి, కూర్మాన్ని ముగ్గురినీ కదలకుండా పట్టుకో. అష్టదిగ్గజాల్లారా మీరు భూమిని, శేషుణ్ణి, కూర్మాన్ని, వరాహాన్ని పొదువుచు పట్టుకోండి. మీరు ఎనిమిదిమంది గనుక అందరూ కలిసి ఈ నలుగురినీ దగ్గఱకు తీసుకుని కదలకుండా పట్టుకోండి.

**విశే :** ఈ పద్యానికి ఆధారము హనుమన్నాటకములోని ఈ శ్లోకము.

**"పృథ్వీ ! స్థిరాభవ, భుజఙ్గమ! ధారయైనాం!**
**త్వం కూర్మరాజ! తదిదం ద్వితయా దధీథాః**
**దిక్కుఞ్జరాః కురుత తత్త్రితయే దిదీర్షాం!**
**రామః కరోతి హరకార్ముక మాతతజ్యమ్"** హనుమన్నాటకము – ప్రథమాంకము

ఈ శ్లోకభావాన్ని మొల్ల రమణీయంగా తీర్చింది.

క. **ఉర్వీ నందనకై రా**
**మోర్వీపతి యెత్తు నిప్పు డుగ్రుని చాపం**
**బుర్విం బట్టుఁడు దిగ్దం**
**త్యుర్వీధర కిటి ఫణీంద్రు లూంతఁగఁ గడిమిన్. 103**

**ప్రతి :** ఉర్వీనందనకై=భూపుత్రి సీతకోసం, రామోర్వీపతి=రాముడనే రాజు, ఇప్పుడు=ఇప్పుడే, ఉగ్రునిచాపంబు=శివుని ధనస్సును, ఎత్తును=ఎత్తును, ఉర్విన్= భూమిని, పట్టుడు=పట్టుకోండి, దిగ్దంతి=

దిగ్గజాలు, ఉర్వీధర=పర్వతాన్ని, ధరించినది, క్షీరసాగరమథన వేళ మంథరపర్వతాన్ని ధరించిన కూర్మము, కిటి=వరాహము, ఫణీంద్రులు =శేషుడు మున్నగువారు, ఊఁతఁగ=ఆధారముగా, కడిమిన్= పరాక్రమముతో.

**తా :** భూపుత్రి అయిన సీతాదేవికోసం రాముడనే రాజు ఇప్పుడు శివధనుస్సు ఎత్తనున్నాడు-కనుక దిగ్గజాల్లారా! కూర్మమ, వరాహమా, ఫణీంద్రుడా మీరందరూ మీబలంతో భూమికి ఊతగా ఉండి, పట్టుకోండి.

**వ. అనుచు లక్ష్మణుండు దెలుపుచున్న సమయంబున. 104**

అని లక్ష్మణుడు చెప్తున్న వేళ-

**విశే :** లక్ష్మణుడు ఆదిశేషుని అవతారం. ఆదిశేషుడు భూమిని మోస్తున్న సామర్థ్యాని గమనించి-విష్ణుమూర్తి తనకు పాన్పుగా చేసుకున్నాడు. నిరంతరం విష్ణుసాన్నిధ్యం గల శేషునికి విష్ణుదేవుని శక్తి పూర్తిగా తెలుసు. విష్ణువు రామునిగా, ఆదిశేషువు లక్ష్మణునిగా నరులుగా దిగివచ్చారు రావణసంహారం కోసం. ఇప్పుడు సాక్షాత్తూ విష్ణుని అవతారుడైన రాముడు, ఉగ్రుడైన శివుని చాపాన్ని ఎక్కుపెడితే భూమి కదిలిపోవచ్చు అని ముందే గమనించాడు లక్ష్మణుడు. నేటికాలంలో వాతావరణ శాస్త్రవేత్తలు రాబోయే తుఫానులను, సునామీలను గుర్తించి హెచ్చరికలు చేస్తూ ముందు జాగ్రత్త చర్యలను తీసుకునేటట్లు చేస్తున్నారు. ఈ రకమైన హెచ్చరిక చేసిన మొదటి శాస్త్రవేత్త లక్ష్మణుడు. ఇలా భావనలోనేకాక, భాషలో కూడా పైరెండు పద్యాల్లో పర్యాయపదాలు ప్రయోగించింది మొల్ల. భూమికి పర్యాయపదాలు-1. ధరాతలము 2. కాశ్యపి 3. భూమి 4. రసాతలము 5. ధరణి, 6. ఉర్వి అనేవి. కందపద్యంలో - ప్రాసస్థానంలో 'ఉర్వి' శబ్దం అందంగా అమర్చింది.

1. ఉర్వీనందనకై 2. రామోర్వీపతి, 3. ఉర్వీధరము, 4. ఉర్విని.

ఇక ఆదిశేషునికి ప్రయోగించిన పర్యాయపదాలు -

1. ఫణీంద్రుడు, 2. విషాస్పదుడు, 3. భోగి,

కూర్మమునకు - 1. కూర్మము 2. ధులీకులీశుడు, 3. కచ్ఛపము 4. ఉర్వీధరము.

వరాహమునకు- 1. వరాహము 2. ఘృష్టి 3. పోత్రి 4. కిటి

ఏనుగుకు - 1. కరులు 2. దిగ్దంతులు.

**మ. ఇన వంశోద్భవుఁడైన రాఘవుఁడు, భూమీశాత్మజుల్ వేడ్కతోఁ**
**దను వీక్షింప, మునీశ్వరుం డలరఁ, గోదండంబు చేనంది, చి**
**వ్వన మోపెట్టి, గుణంబు పట్టి, పటుబాహాశక్తితోఁ దీసినన్,**
**దునిఁగెన్ జాపము భూరి ఘోషమున, వార్ధుల్ మ్రోయుచందంబునన్. 105**

**ప్రతి :** ఇనవంశోద్భవుఁడైన=సూర్యవంశములో పుట్టిన, రాఘవుఁడు=శ్రీరాముడు, భూమీశాత్మజుల్= రాజకుమారులు, వేడ్కతోన్=కుతూహలంతో, తనున్=తనను, వీక్షింపన్=చూడగా, మునీశ్వరుండు=విశ్వామిత్ర

మహర్షి, అలరన్=ఆనందింపగా, కోదండంబు=వింటిని, చేనంది=చేతితో పట్టుకొని, పటు=గొప్పదైన, బాహాశక్తితో=భుజబలముతో, తీసినన్=తీయగా, తునిగెన్=విరిగెను, చాపము=విల్లు, భూరి ఘోషమున= పెద్ద చప్పుడుతో, వార్ధుల్=సముద్రాలు, మ్రోయుచందంబునన్= హోరుతోపెద్దగా చప్పుడు చేసిన విధంగా.

**తా :** సూర్యవంశంలో పుట్టిన శ్రీరాముడు, రాజకుమారు లందరూ తనను కుతూహలంతో చూస్తుండగా, విశ్వామిత్రుడు ఆనందించేలా శివధనుస్సును చేతితో ఎత్తి నారి బిగించి లాగగా సముద్రపుహోరులా పెద్దధ్వని చేస్తూ విరిగి పోయింది ఆ విల్లు.

**ఆ. ధనువు దునిమినంత ధరణీశ సూనులు**
**శిరము లెల్ల వంచి సిగ్గు పడిరి,**
**సీత మేను వెంచె, శ్రీరామచంద్రుని**
**బొగడె నపుడు జనక భూవిభుండు. 106**

**ప్రతి :** ధనువు=వింటిని, దునిమినంత=విరువగానే, ధరణీశసూనులు=రాజకుమారులు, శిరములెల్ల=తలలు అన్నీ, వంచి, సిగ్గుపడిరి, సీత=సీతాదేవి, మేనువెంచె=శరీరాన్ని పెంచినది, సీతాదేవి శరీరం ఆనందంతో పొంగినది, అపుడు, జనకభూవిభుండు=జనకమహారాజు, శ్రీరామచంద్రుని, పొగడెను.

**తా :** రాముడు శివుని విల్లు విరవగానే – రాజకుమారులందరూ సిగ్గుతో తలవంచుకున్నారు. సీత ఆనందంతో పొంగి – మేను వెంచినది. జనకమహారాజు శ్రీరాముచంద్రుని ప్రశంసించాడు.

## సీతారాముల కల్యాణ వైభవము

**వ. ఇట్లు శ్రీరామచంద్రుని సత్త్వ సంపదకు మెచ్చి, సంతోషించి, జనక మహారాజు వివాహంబు సేయువాఁడై రమ్మని దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు వ్రాయించి పంచిన, దశరథ మహారాజును నా శుభలేఖలం జదివించి, సంతోషంబున నానంద బాష్పంబులు గ్రమ్మదేర మంత్రి ప్రవరుండగు సుమంత్రునిం బిలిపించి, "సుమంత్రా! యిపుడు మన మందఱమును బయలుదేఱి, మిథిలా పట్టణంబునకుం బోయి, యట జనక మహారాజు నింట మన రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు వివాహ మహోత్సవము జరుప వలయుఁ, గావున వశిష్ఠాది ద్విజ వర్యులను, గౌసల్యాది కాంతా జనమ్మును, నరుంధతి మొదలుగాఁగల భూసుర భార్యలను మఱియు సకల బంధు జనంబును రావించి, బంగరు టరదంబుల నిడికొని దోడ్కొని రమ్మ"ని యంపిన నతండును మహా ప్రసాదంబని తత్క్షణమ యంతఃపురంబునకుం బోయి, కౌసల్య కైక సుమిత్ర మొదలగు రాజ కాంతలను, వశిష్ఠాది ద్విజ వరిష్ఠులను, నరుంధతి మొదలుగాఁ గల ముత్తై దువలను, మిగిలిన సకల బంధు జనమ్మును రావించి, యుక్తప్రకారముగాఁ గనక రథమ్ముల పై నిడికొని, దశరథ మహారాజు కడకుం గొనివచ్చిన, యంత దశరథుండు పుత్ర ద్వయ సహితమ్ముగ రథ మారోహించి, సమస్త సేనా సమన్వితుం డగుచు వాద్య ఘోషంబులు దశ దిశలు నిండ, నడచుచున్న సమయమున, నంతకుముందు జనక భూవల్లభుండు దశరథ మహీపాలు నెదుర్కొని, తోడితెచ్చి, యదుగులు గడిగి,**

**యర్ఘ్యపాద్యాది విధుల విధ్యుక్తంబుగాఁ బూజించి, మానితంబుగఁ గానుక లొసంగి, సకల సంపత్సం పూర్ణమయిన నివేశముంగల్పించి, యందుఁ బెండ్లివారిని విడియించె, నంత నక్కడఁ గనక వికారమైన పీఠమ్ముపైఁ గూర్చున్న సమయమ్మున"దేవా! శుభమూహూర్తం బాసన్న మగుచున్నది ర"మ్మని వసిష్ఠుండు సను దేర నాతఁడు సని రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు మంగళ స్నానమ్ముఁ జేయించి, నిర్మలాంబరాభరణంబు లొసంగి, వేర్వేఱ నొక్క ముహూర్తమునఁ దన కూఁతు సీతను శ్రీరామచంద్రునకును, దన తమ్ముఁడు కుశధ్వజుని కూతు లగు మాండవ్యూర్మిళా శ్రుతకీర్తులను భరత లక్ష్మణ శత్రుఘ్నులకును నిచ్చి, వివాహముం జేసి, తన ప్రియ తనయల కొక్కొకతెకు నూతేసి భద్ర గజమ్ములను, వేయేసి తురంగంబులును,బదివేలు దాసీ జనమ్మును లక్ష ధేనువులును నరణంబు లిచ్చి, దశరథాది రాజలోకమ్మునకు బహుమానముగా నవరత్న ఖచిత భూషణమ్ములును, జీని చీనాంబరమ్ములును నొసంగి, సుగంధ ద్రవ్యముల నర్పించి, పూజించి యంపె, నంత దశరథ మహారాజు మరలి యయోధ్యా పట్టణంబునకు వచ్చుచుండఁగా మధ్యే మార్గంబున. 107**

**ప్రతి :** ఇట్లు=ఈ విధముగా, శ్రీరామచంద్రుని=శ్రీరాముని, సత్త్వసంపదకుమెచ్చి=బలసంపదకు సంతోషించి, జనకమహారాజు, వివాహంబు=పెండ్లి, చేయువాడై=చేయబూనినవాడై, రమ్మని, దశరథేశ్వరునిపేరిట= దశరథమహారాజు పేరుతో, శుభలేఖలు, వ్రాయించి, పంచిన=పంపగా, దశరథమహారాజును, శుభలేఖలన్, చదివించి, సంతోషంబున, ఆనందబాష్పమ్ములు=పట్టరాని ఆనందం వల్లవచ్చు కన్నీరు, క్రమ్ముదేర=కారిపోగా, మంత్రిప్రవరుండగు=మంత్రులలోశ్రేష్ఠుడైన, సుమంత్రునిన్, పిలిచి, సుమంత్రా! ఇపుడు, మనమందఱమును, బయలుదేఱి, మిథిలా పట్టణంబుకున్, పోయి, అట, జనకమహారాజు, ఇంటన్=ఇంటిలో, రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు, వివాహమహోత్సవము, జరుపవలయు=చేయవలెను, కావున, వశిష్ఠాది ద్విజవర్యులను= వశిష్ఠుడు మొదలయిన బ్రాహ్మణోత్తములను, కౌసల్యాది=కౌసల్యమొదలయిన, కాంతాజనమ్మును=స్త్రీలను, అరుంధతి మొదలుగాఁగల=అరుంధతి మొదలయిన, భూసురభార్యలను=బ్రాహ్మణుల భార్యలను, మఱియు, సకలబంధుజనమ్మును=చుట్టాలు అందరిని, రావించి= రప్పించి, బంగరుట రదంబులన్=బంగారు రథాలపై, ఇడుకొని=ఎక్కించుకొని, తోడ్కొనిరమ్ము=తీసుకొని రమ్ము అని, అంపిన=పంపగా, అతండును= ఆసుమంత్రుడు, మహాప్రసాదంబని=గొప్ప అనుగ్రహమని, తత్క్షణమ=ఆ నిముషంలోనే, అంతఃపురంబునకున్=రాణివాసమునకు, పోయి, కౌసల్య, కైకేయి, సుమిత్ర, మొదలగు, రాజకాంతలను, వశిష్ఠాది, ద్విజవరిష్ఠులను= బ్రాహ్మణశ్రేష్ఠులను, అరుంధతి మొదలుగా గల ముత్తైదువులను, మిగిలిన, సకలబంధు జనమ్మును రావించి, యుక్తప్రకారమ్ముగా=తగిన రీతిలో, కనకరథమ్ములపై=బంగారురథాల మీద, ఇడికొని=ఎక్కించుకొని, దశరథమహారాజు, కడకున్=దగ్గరకు, కొనితెచ్చిన=తీసుకొనిరాగా, అంతన్=అప్పుడు, దశరథుండు, పుత్రద్వయ సహితమ్ముగ=ఇద్దరు పుత్రులతో కూడి (భరతశత్రుఘ్నులు), రథమారోహించి= రథము ఎక్కి, సమస్తసేనా సమన్వితుండగుచు= మొత్తంసైన్యముతో కూడినవాడై, వాద్యఘోషంబులు=బాజాల చప్పుళ్లు, దశదిశలు=పదిదిక్కుల, నిండ=వ్యాపించగా, నడచుచున్న

సమయంబున=ప్రయాణిస్తున్న వేళలో, అంతకుముందు, జనక భూవల్లభుండు= జనకమహారాజు, దశరథమహీపాలున్=దశరథ మహారాజును, ఎదుర్కొని=స్వాగతము చెప్పి, తోడితెచ్చి= వెంట తీసుకొనివచ్చి, అడుగులుకడిగి=పాదములు కడిగి, అర్ఘ్యపాద్యాది విధులన్=అర్ఘ్యము పాద్యము మొదలగు, పూజావిధానములతో, విధ్యుక్తంబుగా= పద్ధతిప్రకారముగా, పూజించి, మానితంబుగ=గౌరవముగ, కానుకలొసంగి=కానుకలు ఇచ్చి, సకల సంప త్సంపూర్ణమయిన=అన్ని సంవదలతో నిండిన, నివేశనంబులు= విడుదులు, కల్పించి=ఏర్పరిచి, అందు, పెండ్లివారిని, విడియించె=విశ్రమింపచేసె, అంత, అక్కడ, కనక వికారమైన=బంగారముతో చేసిన, పీఠమ్ముపైన్=ఆసనముమీద, కూర్చున్న సమయమ్మున, దేవా!, శుభముహూర్తంబు, ఆసన్నమగుచున్నది=సమీపిస్తున్నది, రమ్మని, వశిష్ఠుండు, చనుదేర=బయలుదేరగా, అతడు, చని, రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు, మంగళస్నానమ్ము చేయించి, నిర్మలాంబర+ఆభరణంబులు= స్వచ్ఛమైన బట్టలు, ఆభరణములు, ఒసంగి=ఇచ్చి, వేర్వేఱన్=ప్రత్యేకముగ, ఒక ముహూర్తమున, తనకూతురు సీతను, శ్రీరామచంద్రునకును, తన తమ్ముడు, కుశధ్వజుని, కూతులగు, మాండవ్యూర్మికాశ్రుతకీర్తులను= మాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తులను, వరుసగా భరత లక్ష్మణ శత్రుఘ్నులకును, ఇచ్చి వివాహముంజేసి, తన ప్రియ తనయలకు=తన ముద్దుల కూతుళ్లకు, ఒక్కొకతెకు=ఒకొక్కరికి, నూఱేసి, భద్రగజమ్ములను= మదపుటేనుగులను, వేయేసి, తురంగంబులును=గుఱ్ఱాలను, పదివేలు దాసీజనమ్మును, లక్ష, ధేనువులును= గోవులను, అరణంబు=కానుకలుగా సారెగా,ఇచ్చి, దశరథాదిరాజలోకమ్మునకు=దశరథుడుమొదలయిన రాజులకు, బహుమానముగా, నవరత్నఖచిత=నవరత్నాలుపొదిగిన, భూషణమ్ములును=ఆభరణాలున్ను, చీనిబీనాంబరమ్ములును=మేలైన పట్టుబట్టలు, (చీని=చైనా నుండి వచ్చిన చైనాసిల్కు), ఒసంగి=ఇచ్చి, సుగంధద్రవ్యములను=సువాసన గల వస్తువులు కర్పూరము, కస్తూరి, అత్తరు, చందనము మొదలయినవి, అర్పించి= ఇచ్చి, పూజించి, అంపె=పంపెను, దశరథమహారాజు, మరలి=తిరిగి, అయోధ్యా పట్టణంబునకు వచ్చుచుండగా, మధ్యేమార్గంబున=మార్గమధ్యంలో–

**తా :** ఈ విధంగా శ్రీరామచంద్రుని సత్త్వసంపదకు మెచ్చి, సంతోషించిన జనకమహారాజు వివాహం చేయుటకై రమ్మని దశరథుని పేరిట శుభలేఖలు వ్రాయించి పంపాడు. దశరథమహారాజు ఆ శుభలేఖలు చదివించి, సంతోషంతో ఆనందబాష్పాలు వెలువడగా, మంత్రిముఖ్యుడైన సుమంత్రుని పిలిపించి, "సుమంత్రా! ఇపుడు మనమంతా బయలుదేరి మిథిలా పట్టణానికి వెళ్ళి, అక్కడ జనక మహారాజుఇంటిలో మన రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు వివాహం జరిపించాలి. కాబట్టి వసిష్ఠాది బ్రాహ్మణశ్రేష్ఠులను, కౌసల్యాది కాంతాజనమును, అరుంధతి మున్నగు బ్రాహ్మణ ముత్తయిదువులను, ఇంకా బంధుజనములందరిని రప్పించాలి. బంగారు రథాలను ఎక్కించి తీసుకొని రావాలి" అని పంపాడు. అతడు 'మహాప్రసాద'మని ఆ క్షణమే అంతఃపురానికి వెళ్ళి కౌసల్య కైకసుమిత్ర మున్నగు కాంతలను, మిగిలిన బంధువులను రప్పించి తగిన విధంగా బంగారు రథాలమీదకు ఎక్కించి దశరథ మహారాజు వద్దకు తీసికొనివచ్చెను. అనంతరం దశరథ మహారాజు ఇద్దరి కొడుకులతోపాటుగ రథంఎక్కి, సేనలన్నింటితో కూడి, వాద్యఘోషములు పది

దిక్కులనిండగా, వెళ్ళుచున్న సమయంలో, అంతకుముందుగా జనకమహారాజు దశరథ మహారాజునకు ఎదురేగి, ఆహ్వానించి తీసికొనివచ్చి, పాదములు కడిగి, అర్ఘ్యపాద్యాదుల విధులతో శాస్త్రోక్తంగా పూజించి, గొప్ప కానుకలిచ్చి, సమస్త సంపదలతోనున్న నివాసమును కల్పించి, అందు పెండ్లివారిని విడిది చేయించెను. పిమ్మట అక్కడ బంగారు సింహాసనంపై కూర్చున్న సమయంలో, 'దేవా!' శుభముహూర్తం సమీపిస్తున్నది. రమ్మ'ని వసిష్ఠుడు రాగా, ఆతడు వెళ్ళి రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు మంగళస్నానం చేయించి, స్వచ్ఛమైన వస్త్రాభరణాలు ఇచ్చి, వేర్వేరుగా, ఒక్క ముహూర్తంలో తన కూతురు సీతను శ్రీరామచంద్రునకు, తన తమ్ముడు కుశధ్వజుని కూతులగు మాండవ్య, ఊర్మిళ, శ్రుతకీర్తులను భరతలక్ష్మణశత్రుఘ్నులకు ఇచ్చి వివాహంచేసి, తన ప్రియమైన కూతులకు ఒక్కొక్కతెకు వందేసి భద్రగజాలను, వేయేసి గుర్రాలను, పదివేలు దాసీజనాన్ని లక్షగోవులను అరణంగా ఇచ్చి, దశరథుడు మున్నగు రాజలోకానికి బహుమానంగా నవరత్నాలు పొదగబడిన అలంకారాలను, చీనిచీనాంబరాలను ఇచ్చి, సుగంధద్రవ్యాలను సమర్పించి, పూజించి పంపాడు. పిమ్మట దశరథ మహారాజు తిరిగి అయోధ్యాపట్టణానికి వస్తూండగా, మార్గమధ్యంలో –

**విశే :** వివాహ సన్నాహమంతా సుదీర్ఘమయిన వచనంలో వర్ణించింది మొల్ల. ఇదే ఈ కావ్యంలో మొదటి పెద్ద వచనము.

## దశరథరాముని గని పరశురాముని యధిక్షేపము

**ఆ. పరశురాముఁడడ్డుపడి వచ్చి, మీ నామ**
**మెవ్వ, రనిన, మొలక నవ్వుతోడ**
**నేను దశరథుండ, నితఁడు నా పుత్రుండు,**
**రాముఁ డంద్రు పేరు, భీమ బలుఁడు. 108**

**ప్రతి :** పరశురాముఁడు, అడ్డుపడి=దారికి అడ్డంగా నిలిచి, వచ్చి=దగ్గరకువచ్చి, మీ నామము=మీ పేరు, ఎవ్వరు+అనిన–ఎవ్వరనిన=ఎవరుఅని అడుగగా, మొలక నవ్వుతోడ=చిరునవ్వుతో, నేను, దశరథుండ, ఇతడు, నా, పుత్రుండు=కొడుకు,పేరు, రాముఁ డంద్రు=రాముడు అని అంటారు, భీమబలుఁడు=గొప్పబలము కలవాడు.

**తా :** దశరథుడు మున్నగువారు వెళ్ళుచున్న దారికి అడ్డంగా పరశురాముడు వచ్చి, 'మీ పేరేమిటి?' అని అడిగాడు. అపుడు దశరథుడు చిరునవ్వుతో 'నేను దశరథుడను, ఇతడు నా కుమారుడు రాముడు అంటారు. భీమబలుడు' అని చెప్పాడు.

**విశే :** పరశురాముడు పేరుమాత్రమే అడిగాడు. దశరథుడు పేరుతోపాటు 'భీమబలుడు' అనే విషయం కూడా చెప్పాడు. తాటకను చంపి, మారీచసుబాహులను అడ్డుకొని సుబాహుణ్ణి చంపి విశ్వామిత్రుని యాగం రక్షించాడు. అదికాక శివుని విల్లు అవలీలగా విరిచాడు. జనకరాజపుత్రి సీతనుపెళ్లాడాడు. తండ్రి

హృదయం గర్వంతో నిండి ఉంది. అందువల్ల రాముడు సామాన్యుడు కాదు భీమబలుడు అని పరిచయం చెయ్యకుండా ఉండలేకపోయాడు, పుత్రోత్సాహము తండ్రికి - అంటే ఇదే.

**వ. అని వినిపించినఁ గ్రోధావేశ వశంవదుండై యప్పు డప్పరశు రాముండు రాముం గనుంగొని యిట్లనియె. 109**

**ప్రతి :** అని, వినిపించినన్=చెప్పగా, క్రోధావేశ వశంవదుండై=కోపతీవ్రతకు లోబడినవాడై, ఆ పరశరాముండు, రామున్, కనుంగొని, ఇట్లనియె.

**తా :** దశరథుడు వివరాలు అలా చెప్పగావిని పరశురాముడు పట్టరాని కోపావేశంతో రాముణ్ణి చూసి. ఇలా అన్నాడు.

**క. రాముఁడు నేనై యుండఁగ**
**నామీఁద నొకండు గలిగెనా మఱి? యౌఁగా**
**కేమాయె, రణ మొనర్పఁగ**
**రామా! రమ్మనుచుఁ బరశురాముఁడు పిలిచెన్. 110**

**ప్రతి :** రాముఁడు, నేనై-నేను+ఐ=నేను ఒకడను, ఉండగ=ఉండగా, నామీఁదన్=నామీద పోటీకి, ఒకండు, కలిగెనామఱి=మఱొకడు పుట్టాడా?, ఔగాక!=కానిమ్ము, ఏమాయె=ఏమి మించిపోయింది, రణమొనర్పఁగ= యుద్ధం చేయడానికి, రామా!=ఓరామా, రమ్ము+అనుచున్=రమ్మనుచున్, పరశురాముడు, పిలిచెన్.

**తా :** రాముడను నేను ఒకడను ఉండగా, నాపై పోటీగా మరొక రాముడు పుట్టాడా? సరేకానిమ్ము, ఓ రామా! ఇప్పుడు నాతో యుద్ధం చేయడానికి రమ్ము అని పరశురాముడు పిలిచాడు.

**విశే :** పరశురాముడు కూడా విష్ణువు అవతారమే దశావతారాలలో ఆరవ అవతారం పరశురాముడు.

**వ. పిలిచినతోడనే రామచంద్రుం డతని కిట్లనియె. 111**

**తా :** యుద్ధానికి పిలిచిన వెంటనే రామచంద్రుడు అతనితో ఇలా అన్నాడు.

**ఆ. బ్రాహ్మణుండ వీవు పరమ పవిత్రుండ**
**వదియుఁ గాక భార్గవాన్వయుండ**
**వైన నిన్నుఁ దొడరి యాహవ స్థలమున**
**జగడ మాడ నాకుఁ దగునె చెపుమ? 112**

**ప్రతి :** బ్రాహ్మణుండవు, ఈవు=నీవు, పరమపవిత్రుండవు=మిక్కిలి పవిత్రమయినవాడవు, అదియున్+ కాక=అంతమాత్రమేకాక, భార్గవాన్వయుండవు=భృగుమహర్షి వంశములోనివాడవు, ఐన నిన్ను=అట్టినిన్ను, తొడరి=పూనుకొని, ఆహవస్థలమున=యుద్ధరంగములో, జగడ మాడన్=పోరుసల్పుట, నాకున్, తగునె, చెపుమ?

**తా :** నీవు పరమ పవిత్రుడవయిన బ్రాహ్మణుడవు, భృగుమహర్షి వంశంలో పుట్టావు. అటువంటి నీతో పూనుకుని యుద్ధరంగంలో జగడమాడడం నాకు తగునా చెప్పుము.

**వ. అనిన విని పరశురాముం డిట్లనియె. 113**

**ప్రతి :** అనిన విని = అనగా విని, పరశురాముడు, ఇట్లనియె= ఇలా అన్నాడు.

**తా :** అనగా విని పరశురాముడు ఇలా అన్నాడు.

**ఉ. శస్త్రము దాల్చినం దగనె? సన్నుతి కెక్కిన భార్గవుం డనన్**
**శాస్త్రముగాదు, నా కెదిరి సంగర భూమిని నిల్చినంతనే**
**శాస్త్రముఖంబులన్ నృపులఁ జక్కుగఁ జేయుఁదు గాఁన నిప్పుడున్**
**శస్త్రము శాస్త్రముం గలవు సాహస వృత్తిని రమ్ము పోరఁగన్. 114**

**ప్రతి :** శస్త్రము దాల్చినన్=ఆయుధము ధరించుటచే, సన్నుతికెక్కిన=పొగడ్తకెక్కిన, భార్గవుం డనన్=పరశు రాముడ ననగా, తగనె=తగనా, శాస్త్రముగాదు=ధర్మశాస్త్రము ముఖ్యము కాదు, నాకున్+ఎదిరి=నాకు ఎదురుగా, సంగరభూమిని=యుద్ధభూమిలో, నిల్చినంతనే=నిలబడగానే, నృపులన్=రాజులను, శస్త్రముఖంబులన్=ఆయుధాల మొనలతో, చక్కుగ జేయుదున్=ముక్కలుగా చేస్తాను, కానన్=అందువల్ల, ఇప్పుదున్=ఇప్పుడు కూడా, శస్త్రము=ఆయుధము, శాస్త్రమున్=శాస్త్రవిద్యయు, కలవు, సాహసవృత్తిని= ధైర్యంతో, పోరగన్=యుద్ధం చేయడానికి, రమ్ము.

**తా :** నేను ప్రసిద్ధి గాంచిన, భృగువంశ బ్రాహ్మణుడనే. అయితే ఆయుధంపట్టి పోరాడడానికి తగనా? ప్రస్తుతము శాస్త్రచర్చకాదు ముఖ్యం. నాకు ఎదురుగా యుద్ధరంగంలో నిలిచిన రాజులను ముక్కలుగా ఖండిస్తాను. నా దగ్గర ఇప్పుడు శస్త్రము శాస్త్రము రెండూ ఉన్నాయి. ధైర్యంచేసి నాతో యుద్ధానికిరా!

**వ. అనిన రామచంద్రుం డిట్లనియె. 115**

**తా :** శ్రీరాముడు ఇలా అన్నాడు.

**మ. విను, మావంటి నృపాలురైనఁ గలనన్ వీరత్వముం జూపఁగా**
**ననువౌఁగాక, మహానుభావుఁడవు, ని న్నాలంబులో మీఱఁగా**
**నెనయన్ ధర్మువె మాకుఁ జూడ? మఱి నీ వేమన్న నీ మాటకుం**
**గనలన్, బంతము కాదు మాకెపుడు దోర్గర్వంబు మీ పట్టునన్. 116**

**ప్రతి :** విను=వినుము, మావంటి=మా క్షత్రియులవంటి, నృపాలురైనన్=రాజులైనచో, కలనన్=యుద్ధములో, వీరత్వమున్=ప్రతాపాన్ని, చూపఁగా=చూపుటకు, అనువౌగాక=యుక్తంగా ఉంటుందికాని, మహానుభావుఁడవు=గొప్పవాడవు, నిన్ను, ఆలంబులో=యుద్ధంలో, మీఱఁగాన్=ఎదిరించుటకు, ఎనయన్= పూనుకొనుట, ధర్మువె=ధర్మమా?, మాకున్, చూడన్, మఱి, నీవు, ఏమన్నన్, నీమాటకున్=నీ మాటలకు,

కనలన్=బాధపడను, మాకు, ఎప్పుడు=ఎప్పుడు కూడా, దోర్గర్వంబు=భుజబలగర్వము, మీపట్టునన్=మీ విషయంలో, పంతముకాదు=పట్టుదలకాదు.

**తా :** ఓ భార్గవా! మావంటి క్షత్రియులైతే యుద్ధంలో ఎదుర్కోవడం పద్ధతే గానీ, నీవు మహానుభావుడవు. మీతో యుద్ధం చేయడం మాకు ధర్మమా? నువ్వు నన్ను ఎన్ని మాటలన్నా నేను బాధపడను. మీ విషయంలో భుజబలగర్వాన్ని ప్రదర్శించడం మాకు పంతం కాదు. నీతో యుద్ధం చేయడం మర్యాదకాదు.

**వ. అనిన విని యెంతయు సంతోషించి భార్గవరాముం డా రఘురామునితో నిట్లనియె. 117**

**ప్రతి** : అనిన విని = అనగా విని, యెంతయు సంతోషించి = ఎంతగానో ఆనందంతో, భార్గవ రాముండు = పరశురాముడు, ఆ రఘురామునితో= ఆ రఘువంశజుడైన శ్రీరామునితో, ఇట్లనియె= ఇలా అన్నాడు.

**తా :** ఇలా పలికిన పలుకులు విని ఎంతో సంతోషించి భార్గవరాముడు శ్రీరామునితో ఇలా అన్నాడు.

**ఆ. శివుని చివుకు విల్లు శీఘ్రంబె యలనాఁడు**
**విఱిచినాఁడ ననుచు విఱ్ఱవీఁగ**
**వలదు, నేఁడు నాకు వశమైన యీ చాప**
**మెక్కుపెట్టి తివియు మింతె చాలు. 118**

**ప్రతి** : శివుని, చివుకువిల్లు=పాతది సారంలేనిది ఏనాటిదో విల్లు, శీఘ్రంబె=వేగంగా, అలనాఁడు=ఆ రోజు, విఱిచినాడన్, అనుచు=విరిచానంటూ, విఱ్ఱవీగవలదు=గర్వపడవద్దు, నేడు, నాకు వశమైన=నా స్వాధీనంలో ఉన్న, ఈ చాపము=ఈ విల్లు, ఎక్కుపెట్టి, తివియుము=లాగుము, ఇంతె, చాలు= అంతచాలు.

**తా :** సారంలేని పాత శివుని విల్లు ఆనాడు శీఘ్రంగా విరిచానని గర్వపడకు. ఈ రోజు నా అధీనంలో ఉన్న ఈ చాపాన్ని ఎక్కుపెట్టి లాగు. అంతేచాలు.

**ఉ. రాముఁడు గీముఁ డంచును ధరా జనులెల్ల నుతింప దిట్టవై**
**భీముని చాపమున్ విఱిచి ప్రేలెద వందుల కేమిగాని, యీ**
**శ్రీమహిళేశు కార్ముకముఁ జేకొని యెక్కిడుదేని నేఁడు నీ**
**తో మఱి పోరు సల్పి పడఁద్రోతు రణస్థలి నీ శరీరమున్. 119**

**ప్రతి :** రాముఁడు గీముఁడు, అంచును=అంటూ, ధరాజనులెల్ల=భూమి మీది జనులందరు, నుతింపన్= పొగడగా, దిట్టవై=నేర్పరివై, భీముని=శివుని, చాపమున్=వింటిని, విఱిచి=ముక్కలు చేసి, ప్రేలెదవు=ఏవేవో మాట్లాడుతున్నావు, అందులకున్=దానికి, ఏమిగాని=ఏముందిగాని, ఈ, శ్రీమహిళేశు=లక్ష్మీదేవి యొక్క విభుడైన నారాయణుని, కార్ముకము=విల్లు, చేకొని=తీసుకుని, ఎక్కిడుదేని=ఎక్కుపెట్టినట్లయితే, నేడు=ఈనాడు, నీతో, మఱి, పోరుసల్పి=యుద్ధము చేసి, రణస్థలి=యుద్ధభూమిలో, పడఁద్రోతు=పడవేస్తాను, నీశరీరమున్=నీ శరీరాన్ని.

**తా** : రాముడు గీముడు అంటూ ప్రజలందరూ నిన్ను పొగుడుతూఉంటే నువ్వు మంచి నేర్పరివై శివుని విల్లు విరిచావు. అందుకు గర్వపడుతూ ఏవేవోమాట్లాడు తున్నావు. దానికేంగాని. ఈనాడు ఈనారాయణుని విల్లును ఎక్కుపెట్టినయితే నీతో యుద్ధం చేసి యుద్ధ భూమిలో నిన్ను పడవేస్తాను.

**విశే :** రాముఁడు గీముఁడు. తెలుగుభాషలో నిందార్థంలో 'గిగీలు' వస్తాయి. రాముడుచేసిన శివధనుర్భంగాన్ని ప్రజలు గౌరవంతో చూశారుకానీ, పరశురాముడు–రాముఁడు గీముఁడు అని తేలిక చేసి మాట్లాడిన సందర్భమిది.

## శ్రీరాముఁడు పరశురాముని నారాయణ చాపముతోఁ గూడ విష్ణు తేజము నందికొనుట

**చ. అని తన చేతి విల్లు నృపు లందఱుఁ జూడగ నంది యాయ, నా**
**ధనువును గూడి తేజముఁ బ్రతాపము రాముని జెందె, నంతనే**
**జనవరుఁడా శరాసనముఁ జక్కఁగ నెక్కిడి వాఁడి బాణ మం**
**దున నిడి యేది లక్ష్యమనఁ ద్రోవలు సూపినఁ ద్రుంచె గ్రక్కునన్. 120**

**ప్రతి :** అని, తనచేతి విల్లు=తన చేతిలోని విల్లు, నృపులందఱు=రాజులందరు, చూడగన్=చూస్తూ ఉండగా, అందియాయ=అందించగా, ఆధనువును గూడి=ఆవిల్లుతో పాటుగా, తేజమున్=ప్రభావము, ప్రతాపము=పరాక్రమము, రాముని చెందెన్=రామునికి వచ్చిచేరాయి, అంతనే=వెంటనే, జనవరుఁడు=రాజయిన రాముడు, ఆ శరాసనము=ఆ వింటిని, చక్కగన్, ఎక్కిడి=ఎక్కుపెట్టి, వాఁడిబాణము=పదునైన బాణము, అందునన్=వింటిలో, ఇడి=పెట్టి, ఏదిలక్ష్యము=దేనిని గుఱిపెట్టాలి, అనన్=అని అడుగగా, త్రోవలు చూపినన్=ఏమార్గంలో వెళ్లాలో దేన్నికొట్టాలో చూపిన, గ్రక్కునన్=వేగముగా, త్రుంచె=కొట్టెను.

**తా :** పరాశురాముడు తన చేతిలోని వింటిని రాజులందరు చూస్తూ ఉండగా రామునికి అందించగా, ఆ వింటితో పాటుగా పరశురాముని తేజస్సూ, పరాక్రమమూ కూడా రామునిలో చేరాయి. అప్పుడా ధనస్సును చక్కగా ఎక్కుపెట్టి, పదునైన బాణంతొడిగి దేన్నికొట్టాలి అని అడిగాడు. పరశురాముడు చూపిన లక్ష్యాన్ని రాముడు వేగంగా పడగొట్టాడు.

**వ. ఇట్లు మహా ప్రతాపంబున నా విలు ద్రుంచి, యనర్గళ ప్రతాపమ్మున భార్గవ రాము దోర్గర్వంబు నిర్గర్వంబు గావించి, జయమ్ముఁ గైకొన్న కుమారునిం గౌఁగిలించుకొని, దశరథుండు కుమార చతుష్టయమ్ముతో నయోధ్యానగరంబుఁ బ్రవేశించి సుఖోన్నతి రాజ్యంబు నేలుచున్న సమయంబున. 121**

**ప్రతి :** ఇట్లు, మహాప్రతాపంబున=గొప్పపరాక్రమముతో, ఆ విలుద్రుంచి, అనర్గళ= అడ్డులేని, ప్రతాపమ్మున=పరాక్రమముతో, భార్గవరాము=పరశురాముని, దోర్గర్వంబు=భుజగర్వము, నిర్గర్వంబు=గర్వంలేకుండా, కావించి=చేసి, జయమ్మున్=జయమును. కైకొన్న=సాధించిన, కుమారునిన్, కౌఁగిలించుకొని, దశరథుండు, కుమార చతుష్టయమ్ముతో=నలుగురు కొడుకులతో, అయోధ్యానగరంబు, ప్రవేశించి. సుఖోన్నతిన్=గొప్ప సుఖముతో, రాజ్యంబున్, ఏలుచున్న సమయంబున.

**తా :** గొప్ప పరాక్రమంతో ఆ విల్లునువిరిచి సాటిలేని ప్రతాపంతో పరశురాముని బలగర్వాన్ని పోగొట్టి గెలిచిన కుమారుని కౌగిలించుకొని, దశరథుడు తన నలుగురు కుమారులతో అయోధ్యానగరముచేరి సుఖముగా రాజ్యపరిపాలన చేయుచున్న సమయమున-

**శా. పారావార గభీరికిన్, ద్యుతిలసత్పద్మారికిన్, నిత్య వి**
**స్ఫారోదార విహారికిన్, సుజన రక్షాదక్ష దక్షారికిన్,**
**సారాచార విచారికిన్, మద రిపు క్ష్మాపాల సంహారికిన్,**
**వీరా సాటి నృపాలకుల్? దశరథోర్వీనాథ జంభారికిన్. 122**

**ప్రతి :** పారావారగభీరికిన్=సముద్రమువలె గాంభీర్యముకలవానికి, ద్యుతిలసత్=కాంతితో ప్రకాశించు, పద్మారికిన్=పద్మాలకు శత్రువైనచంద్రుని వంటివానికి, నిత్య=ఎల్లప్పుడు, విస్ఫార=వ్యాపించిన, ఉదార=గొప్పదైన, విహారికిన్=విహరించువానికి, సుజన రక్షాదక్ష=మంచివారిని రక్షించుటలో నేర్పరి అయిన, దక్షారికిన్=దక్షుని శత్రువైన శివునివంటివానికి, సారాచారవిచారికిన్=శ్రేష్ఠములైన సంప్రదాయాలను గురించి ఆలోచించేవానికి, మదరిపు క్ష్మాపాల=గర్వించిన శత్రురాజులను, సంహారికిన్=సంహరించువానికి, దశరథోర్వీనాథ=జంభారికిన్=ఇంద్రునివంటి దశరథుడనే భూనాథునికి, నృపాలకుల్=రాజులు, వీరా సాటి=వీరు సమానులా?

**తా :** సముద్రునివలె గంభీరుడు, చంద్రునివలె కాంతిమంతుడు, నిత్యం సంతోషాంతరంగుడై విహరించేవాడు, సజ్జనులను రక్షించుటలో శివుని వంటివాడు, మంచి ఆచారాలను గురించి ఆలోచించేవాడు, గర్వించిన శత్రురాజులను సంహరించేవాడు అయిన ఇంద్రుని వంటి దశరథ మహారాజుకు ఈ రాజులు సాటిరాగలరా? రాలేరు అని భావము,

**విశే :** ఈ పద్యం షష్ఠీవిభక్త్యంతంగా వ్రాసినది, సాధారణంగా కృతియిచ్చే పద్యాలు ఇలా షష్ఠీవిభక్తితో వ్రాస్తారు, వాటిని షష్ఠ్యంతాలు అంటారు. కావ్యారంభంలో ఇలాంటి పద్యరచన చేస్తారు. మొల్ల వినూత్నంగా ఆశ్వాసాంతంలో ఈ షష్ఠ్యంత పద్యం వ్రాసింది. 'కిన్' షష్ఠీవిభక్తి ప్రత్యయము.

**వ. అని కొనియాడఁ దగిన నృపాలశేఖరుఁడు ధర్మమార్గంబు నొక్కింత యేనిఁ దప్పకుండ రాజ్యంబు సేయుచుండె ననుట విని నారదుని వాల్మీకి మహామునీశ్వరుం డట మీఁది కథా విధానం బెట్టిదని యడుగుటయు. 123**

**ప్రతి :** అని, కొనియాడఁదగిన=పొగడదగిన, నృపాలశేఖరుఁడు=రాజశ్రేష్ఠుడు, ధర్మమార్గంబున్=ధర్మపుబాటను, ఒకింతయేనిన్=కొంచమైనా, తప్పకుండ, రాజ్యంబు సేయుచుండెన్, అనుట, విని, నారదుని, వాల్మీకి మహామునీశ్వరుండు, అటమీది=దాని తరువాత, కథావిధానంబు=కథాపద్ధతి, ఎట్టిదని=ఎటువంటిది అని, అడుగుటయు-

**తా :** అని పొగడ దగిన దశరథమహారాజు ధర్మవిషయంలో ఒకింత కూడా తప్పకుండ రాజ్యపాలన చేస్తున్నాడని చెప్పగావిని, వాల్మీకి మహర్షి నారదునితో– ఆతరువాత జరిగిన కథ ఏమిటి అని ప్రశ్నించాడు.

**ఆశ్వాసాంత పద్య గద్యములు**

క. **జలజాక్ష! భక్త వత్సల!**
**జలజాసన వినుత పాద జలజాత! సుధా**
**జలరాశి భవ్య మందిర**
**జలజాకర చారు హంస! జానకి నాథా!** **124**

**ప్రతి :** జలజాక్ష=తామరలవంటి కన్నులు గలవాడా!,భక్తవత్సల=భక్తుల ఎడల వాత్సల్యభావం కలవాడా!, జలజాసన వినుత పాదజలజాత!=బ్రహ్మగారిచే స్తుతింపబడిన పాదపద్మములు గలావాడా, సుధాజలరాశి భవ్యమందిర=పాలసముద్రమే మందిరముగా గలవాడా!, జలజాకరచారుహంస!=తామర కొలనులో విహరించే హంస, జానకి నాథా!=జానకీదేవి భర్త!.

**తా :** జలజాక్షా, భక్తవత్సలా, బ్రహ్మచేత స్తుతింపబడిన పాదపద్మములు గలవాడా, పాలసముద్రమే ఇల్లుగా గలవాడా, తామరకొలనులో విహరించే అందమైన హంసవంటివాడా! జానకీనాథా!

**విశే :** ఈ పద్యం ఆశ్వాసాంత పద్యం. రాముని స్తుతించిన పద్యం.

**గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజన వినుతకవితా చమత్కారాతుకూరి కేసనసెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహాకావ్యంబునందు బాలకాండము సర్వము నేకాశ్వాసము.**

**ప్రతి :** ఇది=ఈ బాలకాండము, శ్రీ గౌరీశ్వర వరప్రసాదలబ్ధ=శ్రీ పార్వతీ పతి అయిన శంకరుని వరముచేత లభించిన, గురు జంగమార్చన వినోద= గురువులను, జంగములను పూజించుట యందు ఆసక్తిగల, సూరిజనవినుత కవితాచమత్కార=పండితులచే పొగడబడిన కవితాచమత్కారము కలిగినట్టి, ఆతుకూరి కేసనసెట్టి, తనయ=పుత్రిక, మొల్ల నామధేయ=మొల్ల అనుపేరుగల కవయిత్రి చేత, విరచితంబైన= రచింపబడిన, శ్రీరామాయణ మహాకావ్యంబు నందు– బాలకాండ సర్వమున్=బాల కాండము మొత్తం ఏకాశ్వాసము=ఒకే ఆశ్వాసము కలిగినట్టిది.

**తా :** ఈ బాలకాండము శ్రీ పార్వతీపతి అయిన శంకరుని వరముచేత లభించినట్టి, గురువులను జంగములను పూజించుటలో ఆసక్తిగలిగినట్టి, పండితులచేత నుతింపబడే కవితా చమత్కారముగలిగినట్టి, ఆతుకూరి కేసయసెట్టి తనయ - మొల్ల అనేపేరుగలిగిన ఆమెచే రచింపబడిన శ్రీరామాయణ మహాకావ్యములో బాలకాండ సర్వము ఏకాశ్వాసము.

* * *

# అయోధ్యాకాండ

**క. కందర్పరూప! ఖండిత**
**కందర్పవిరోధిచాప! కరుణాద్వీపా!**
**వందిత శుభనామా! ముని**
**సందోహస్తుత్యభూమ! జానకిరామా! 1**

**ప్రతి :** కందర్పరూప=మన్మథుని వంటి రూపము గలవాడా! ఖండిత=త్రుంపబడిన, కందర్పవిరోధిచాప= మన్మథునికి శత్రువయిన శివుని విల్లుగలవాడా! కరుణాద్వీపా=కరుణకు ద్వీపము వంటివాడా! వందితశుభనామా=నమస్కరింపబడిన శుభకరమైన పేరు గలవాడా! మునిసందోహస్తుత్యభూమ!=ముని గణములందరిచేతా స్తుతింపదగిన స్థితికలవాడా!, జానకిరామా!=జానకి పతి అయిన జానకిరామ.

**తా :** మన్మథునివంటి మనోహరమైన రూపం గలవాడా, శివుని విల్లు విరిచినవాడా, కరుణాద్వీపా!, ఆనందం కలిగించే శ్రీరామ అనే పేరు గలవాడా! మునిగణములచే స్తుతింపబడేవాడా! జానకిరామా! అని రాముని సంబోధిస్తూ చెప్పిన - ఆశ్వాసాది పద్యం ఇది.

**విశే :** కరుణాసముద్రుడు-అనే సమాసం అధికంగా ప్రయోగాలలో కనిపిస్తుంది. మొల్ల 'కరుణాద్వీపా!' - అంది. కరుణాద్వీపా! అంటే సర్వాంగీణమైన కరుణకు నెలవు అయినవాడా! అని అర్థం చెప్పుకోవచ్చు. ద్వీపం అంటే - భూభాగానికి నాలుగువైపులా నీరు ఉంటే - దాన్ని ద్వీపం అంటారు. **శ్రీలంక-ద్వీపం.** మూడువైపులనీరు ఉంటే ద్వీపకల్పం అంటారు. **భారతదేశం-ద్వీపకల్పము.**

మొల్ల ఈ పద్యంలో బాలకాండలోని కథాంశాలను సూచించింది. బాలకాండలో దశరథరాముడు శివచాపాన్ని విరిచి జానకిని వివాహమాడి జానకి రాముడయ్యాడు. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, శతానందుడు వంటి మునీశ్వరులచేత బాలకాండలో స్తుతింపబడ్డాడు. గురుకులంలో వశిష్ఠుని శిష్యుడుగా గురువుగారి మెప్పుపొందాడు. విశ్వామిత్రుని యాగం రక్షించాడు. గౌతముని భార్య అహల్య శాపవిమోచనం గావించాడు. శతానందుడు - అహల్య గౌతముల తనయుడు. సీతాకల్యాణ సందర్భంలో రాముని కీర్తించాడు.

శ్రీరాముడు= దశరథరాముడు, కోదండరాముడు, అయోధ్యరాముడు, పట్టాభిరాముడు - మాత్రమేకాదు - 'జానకి రాముడు' కూడా!

**వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహాముని కెఱింగించిన తెఱంగు వినిపించెద నాకర్ణింపుము. 2**

**ప్రతి :** శ్రీనారదమునీశ్వరుండు= శ్రీనారదమహాముని, వాల్మికి మహామునికి, ఎఱింగించిన= తెలియజేసిన, తెఱంగు= విధమును(కథను), వినిపించెద= వినిపిస్తాను, ఆకర్ణింపుము= వినుము.

**తా :** నారద మునీశ్వరుడు వాల్మీకి మహామునికి చెప్పిన కథ చెప్తాను. వినండి.

సీ. తన సుమంత్రాది ప్రధానులతోఁ గూడి
సుఖగోష్ఠి నుండంగ నఖిలజనులఁ
జక్కఁగా రావించి సమ్మదంబున వంశ
గురునితో దశరథధరణినాథుఁ
డనియె నీ భూభార మంతయు నొక్కట
నేలితిఁ జాలదే యేకహేళి
నటుగాక పగతుర నవలీల గెల్చితి
నిల్పితి ధర్మమ్ము నిష్ఠతోడ

గీ. నింత చాలదె యాశకు నెంత కెంత
రామచంద్రుని ధరణికి రాజుగాఁగ
మీరె సూడంగఁ బట్టంబు భూరిమహిమఁ
గట్టవలయును మంచి లగ్నమునఁ జెలఁగి. 3

**ప్రతి :** తన సుమంత్రాది ప్రధానులతోఁ గూడి=సుమంత్రుడు మొదలయిన ముఖ్యులతో కూడి, సుఖగోష్ఠి నుండంగ=ఆనందంగా మాట్లాడుకుంటూ ఉండగా, అఖిల జనులన్=జనులందరిని, చక్కఁగా రావించి=ప్రేమతో రప్పించి, సమ్మదంబునన్=మిక్కిలి ఆనందంతో, వంశగురునితో=రఘువంశానికి గురువైన వశిష్ఠునితో, దశరథధరణి నాథుఁడు+అనియెన్=దశరథ మహారాజు అనెను, ఏకహేళిన్=ఒక విలాసంగా, ఈ భూభార మంతయున్=ఈ రాజ్యాన్ని పరిపాలించే బాధ్యతనంతటిని, ఒక్కటన్=ఒంటరిగా, ఏలితిన్= పాలించాను, చాలదే=చాలదా?, అటుగాక=అదీకాక, పగతురన్=శత్రువులను, అవలీలన్= తేలికగా= శ్రమలేకుండా – ఆడుతూ పాడుతూ, గెల్చితిన్=గెల్చాను, నిల్పితి ధర్మమ్ము నిష్ఠతోడన్= ధర్మాన్ని నిష్ఠగా స్థాపించాను, ఇంతచాలదె= ఇది చాలదా? ఆశకు నెంతకెంత=ఎంతచేస్తే ఆశకు అంతం ఉంటుంది. రామచంద్రుని= శ్రీరాముణ్ణి, ధరణికి రాజు గాఁగన్=ఈ భూమికి రాజు అయ్యేలా, మీరె సూడంగన్=మీరే పూనుకుని పర్యవేక్షిస్తుండగ, భూరిమహిమన్=అధికమైన మహిమతో, మంచిలగ్నమున= మంచిముహూర్తంలో, చెలఁగి=ఆనందంతో, పట్టంబు కట్టవలయు=పట్టాభిషేకం చేయాలి.

**తా :** దశరథమహారాజు తన ప్రధానమంత్రులయిన సుమంత్రుడు మొదలయిన వారితో ఇష్టాగోష్ఠి జరుపుకుంటూ తన రాజ్యంలోని ప్రజలందరిని పిలిపించాడు. ఎంతో ఆనందంతో తమ కుల గురువులయిన వశిష్ఠమహామునితో – ఆర్యా! నేను ఈ భూభారాన్నంతా ఒంటరిగా ఇంతకాలంగా ఏలాను, ఇది చాలదా? అదీకాక శత్రువులనందరినీ అవలీలగా గెల్చాను. నా రాజ్యంలో ధర్మాన్ని నిష్ఠగా శ్రద్ధగా నిలిపాను. ఇది చాలదా! ఆశకు అంతెక్కడ. ఇంకా ఇంకా ఏదో చేయాలనే ఉంటుంది. ఇప్పుడు మీరు పూనుకుని మంచి లగ్నంలో రామచంద్రుణ్ణి ఈ రాజ్యానికి ఆనందంతో పట్టాభిషిక్తుణ్ణి చేయాలి అని చెప్పాడు.

**గీ. అనుచు గురునకుఁ దెల్పి తానతని సమ్మ**
**తమున సౌభాగ్య మంగళద్రవ్య సమితిఁ**
**గూర్చుఁ డనుచును మంత్రులకును నెఱుంగఁ**
**జెప్పి శృంగార మీపురిఁ జేయుఁ డనియె. 4**

**ప్రతి :** అనుచు=అంటూ, గురునకున్=గురువైన వశిష్ఠ మహర్షికి, తెల్పి=చెప్పి, తాను=దశరథుడు, అతని సమ్మతమున=వశిష్ఠుని అనుమతితో, సౌభాగ్య మంగళ ద్రవ్య సమితిన్=చక్కనిభాగ్యాన్ని శుభాలను కలిగించు ద్రవ్యాలను, కూర్చుండు+అనుచును=సమకూర్చండి, ఏర్పాటు చేయండి అంటూ, మంత్రులకును= మంత్రులకు, ఎఱుంగ చెప్పి=తెలియచెప్పి, ఈపురిన్=ఈ పట్టణాన్ని శృంగారము చేయుఁ దనియె=చక్కగా అలంకరించండి అని చెప్పాడు.

**తా :** రామునకు మీరు పూనుకుని పట్టాభిషేకం చెయ్యాలని వశిష్ఠమహర్షితో చెప్పి అతని ఆజ్ఞతో మంత్రులతో –పట్టాభిషేకానికి అవసరమైన మంగళద్రవ్యాలను సమకూర్చండి, ఈ అయోధ్యాపట్టణాన్ని చక్కగా అలంకరింప చేయండి– అని తెలియచెప్పాడు.

**వ. అట్టి సమయంబున. 5**

**తా :** అటువంటి సమయమున –

**గీ. పగలు ప్రాగ్భాగమున నుండి గగనవీథిఁ**
**జరమదిక్కున కేఁగఁగా శ్రమము దోఁచి**
**చెమట పట్టిన స్నానంబుఁ జేయ నరుగు**
**కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె. 6**

**ప్రతి :** పగలు=పగటిపూట, ప్రాగ్భాగమున నుండి=తూర్పుదిక్కు నుండి, గగనవీథిన్=ఆకాశ మార్గములో, చరమదిక్కునకు=పడమటి దిక్కుకు (చరమ అంటే చివర, సూర్యుని ప్రయాణం తూర్పున ప్రారంభమై – చివరగా పడమట దిక్కున ముగుస్తుంది.) ఏఁగఁగాన్=ప్రయాణించగా, శ్రమము దోఁచి=అలసట అనిపించి, చెమటపట్టిన= చెమటపట్టడంవల్ల, స్నానంబున్=స్నానాన్ని, చేయనరుగు కరణి=చెయ్యడానికి వెళుతున్న విధంగా, దివాకరుఁడు= సూర్యుడు (పగటిని చేయువాడు), అపరాబ్ధిలోన్= పశ్చిమసముద్రంలో, క్రుంకె= మునిగాడు.

**తా :** సూర్యుడు పగలంతా తూర్పుదిక్కు నుండి పడమటిదిక్కు దాకా ప్రయాణం చేసి అలసినట్లనిపించి, పగటి ప్రయాణంవల్ల చెమట కూడా పట్టడం వల్ల స్నానం చేస్తే బాగుంటుంది అనుకుని పశ్చిమ సముద్రంలోకి క్రుంకాడు.

**విశే :** సూర్యాస్తమయ వర్ణన ఇది. సూర్యబింబం పశ్చిమ సముద్రంలో మునిగి అస్తమిస్తుంది. దాన్ని మొల్ల ఒక ఊహతో రమణీయంగా వర్ణించింది. పగలంతా నిర్విరామంగా శ్రమించడం వల్ల–అలసటతో చెమటతో ఉండడం వల్ల స్నానం చేస్తే బాగుంటుంది అని సూర్యుడు సముద్రంలో మునిగాడా! అన్నట్లుగా ఉంది.

సాధారణంగా పగలంతా కష్టపడిన పనిచేసి ఇంటికి వచ్చిన శ్రామికులు – సాయంత్రం తప్పక స్నానం చేస్తారు. శ్రామిక జీవన సౌభాగ్యంలోని నిత్యకృత్యాన్ని ఇక్కడ కవయిత్రి సూచన చేసింది. ఉత్ప్రేక్షాలంకారం.

**క. మేలిమి సంధ్యారాగము**
**ప్రాలిన చీఁకటియు గలిసి వరుణనివంకన్**
**నీలముఁ గెంపును నతికిన**
**పోలికఁ జూపట్టె నట నభోమణి తలఁగన్.** 7

**ప్రతి :** మేలిమి=స్వచ్ఛమయిన, గొప్పదైన, సంధ్యారాగము=సంధ్యాకాలములోని ఎరుపురంగు, ప్రాలిన= వ్యాపించిన–వచ్చి చేరిన, చీఁకటియున్=చీఁకటియును (నలుపురుంగు), కలిసి=ఎరుపురంగు, నలుపురంగు కలిసి, వరుణుని వంకన్=పశ్చిమదిశను, నీలము=నీలమనే మణి, కెంపును=ఎరుపురంగులో ఉండే కెంపు అనే రత్నం, అతికిన పోలికన్=రెంటిని కలిపి అతికించినట్లుగా, చూపట్టెన్=కబనడినది, నభోమణి=సూర్యుడు, ఆకాశానికి మణివంటి వాడు, తలఁగన్=అస్తమించగా, సూర్యుడు అస్తమించగానే.

**తా :** సూర్యుడు అస్తమించగానే గొప్పదయిన స్వచ్ఛమైన సంధ్యాకాలపు ఎరుపురంగు అప్పుడే ప్రవేశించిన నల్లని చీకటి కలిసి పశ్చిమదిక్కున – నీలాలు కెంపులు కలిపి అతికినట్లుగా కనబడింది.

**విశే :** ఇది చక్కని ఉపమాలంకారం.

**క. వారక కల్పద్రుమమునఁ**
**గోరకములు పుట్టినట్లు గురుతరకాంతిన్**
**దారకములు తల సూపెన్**
**జోరానీకమ్ము మిగుల స్రుక్కుచునుండన్.** 8

**ప్రతి :** వారక=అడ్డులేకుండా, కల్పద్రుమమునన్=కల్పవృక్షానికి, కోరకములు=మొగ్గలు, పుట్టినట్లు=పుట్టినట్లు, గురుతరకాంతిన్=అతిశయించిన కాంతితో, తారకములు=నక్షత్రాలు, చోరానీకమ్ము=దొంగల సమూహం, మిగుల=ఎక్కువగా, స్రుక్కుచునుండన్=సంకోచిస్తూ ఉండగా, తలసూపెన్=ఉదయించాయి.

**తా :** ఏ అడ్డులేకుండా కల్పవృక్షానికి మొగ్గలు మొలచినట్లుగా మిక్కిలి కాంతితో నక్షత్రాలు ఉదయించాయి. నక్షత్రాలు కాంతితో ప్రకాశించడంవల్ల దొంగలు చాలా సంకోచిస్తున్నారట. ఎందుకంటే దొంగతనం చేద్దామంటే ఈ నక్షత్రాలకాంతిలో దొరికిపోతామేమో? అనే సంకోచస్థితిలో ఉన్నారట.

**ఆ.వె. కారుమొగులురీతిఁ గాటుకచందాన**
**నీటిభాతి నింద్రనీలమహిమ**
**మాషరాశిపోల్కి మఱిమఱి యపు డంధ**
**కార మవనియెల్లఁ గలయఁబర్వె. 9**

**ప్రతి :** కారుమొగులురీతిన్=నల్లనిమేఘాలలాగ, కాటుకచందాన=కాటుకవలె, నీటి భాతిన్=నీరులాగ, ఇంద్రనీలమహిమ=ఇంద్రనీలాలనే రత్నాల మహిమవలె, మాషరాశిపోల్కి=మినుముల పోగువలె, మఱిమఱి= అతిశయించి–ఎక్కువగా, అప్పుడు=ఆ సమయంలో, అంధకారము=చీకటి, అవనిఎల్లన్=భూమిమీద అంతటా, కలయన్=అన్ని వైపులను, పర్వె=వ్యాపించింది.

**తా :** నల్లని మబ్బుల్లా, కాటుకలా, నీరులా, ఇంద్రనీలమణులవలె, మినుగులపోగులా చీకటి భూమి అంతటా వ్యాపించింది.

**విశే :** ఇది చీకటి వర్ణన. ఆ సమయంలో భూమిమీద అన్నదిశలా వ్యాపించిన చీకటి ఎలా ఉందో కవయిత్రి వర్ణిస్తున్నది. పాఠకులకు తెలిసిన ప్రసిద్ధమయిన నల్లని వస్తువులన్నిటితో చీకటిని పోల్చిన పద్యమిది. ఇది చక్కని ఉపమాలంకారం. ఇందులో ఉపమేయం చీకటి. ఉపమానాలు – నల్లమబ్బు, కాటుక, నీరు, ఇంద్రనీలము, మినుగుల పోగు. సమానధర్మం – నలుపు, ఉపమావాచకాలు – రీతి, చందము, భాతి, మహిమ, పోల్కి.

ఒక వస్తువును వర్ణించేటప్పుడు ఒకే ఉపమానం చెప్తే అది ఉపమాలంకారము. ఒకటి కంటె ఎక్కువ ఉపమానాలు చెప్తే దాన్ని మాలోపమ అంటారు.

ఉపమానసామాగ్రిగా చెప్తున్న నల్లని వస్తువుల జాబితాలో 'మినుములరాశి' ఉండటం విశేషం. సాధారణంగా కవులకు స్ఫురించే పోలిక కాదది. కవయిత్రి ఊహలోని ప్రత్యేకత ఇది.

ఉపమావాచకం 'వలె' అనేది. ఇక్కడ అయిదు ఉపమానాలు ఉన్నాయి. అయిదు భిన్నమయిన ఉపమావాచకాలు ప్రయోగించింది మొల్ల.

**వ. అట్టిసమయంబున. 10**

**తా :** అలాంటి సమయంలో

**చ. తలవరులర్థ నిజాధిపుల దర్పకునేర్పునఁ గన్నుఁబ్రామి య**
**త్తలఁ దమపిన్న పాపల నుదారత నేర్పడ నిద్రపుచ్చి ని**
**ర్మల కర కంకణావళులు రట్టుగఁ దామటు మ్రోఁగనీక వి**
**చ్చలవిడిగాఁ జరించి రొగి జారలతాంగులు మధ్యరాత్రులన్. 11**

**ప్రతి :** తలవరులన్=కాపలాదారులను, నిజాధిపులన్=తమ భర్తలను, దర్పకు=మన్మథుని, నేర్పునన్=నేర్పుతో (మన్మథుడు పుట్టించిన కోరిక నేర్పుతో), కన్నున్=వారి కన్నులు, ప్రామి=కప్పి, అత్తలన్=అత్తలను, తమ పిన్నపాపలన్=తమ సంతానాన్ని (చిన్నపిల్లల్ని), ఉదారతన్=ప్రేమతో, ఏర్పడ=ప్రదర్శిస్తూ, నిద్రపుచ్చి= నిద్రపోయేటట్లుగా చేసి, నిర్మల కర కంకణావళులు=స్వచ్ఛంగా ప్రకాశిస్తూ ఉండే చేతికంకణాల గాజుల సమూహాలు, రట్టుగన్=శబ్దము చేసేలా, తామటు మ్రోగనీక=చప్పుడు చేయకుండా, విచ్చలవిడిగా= అడ్డులేకుండా, జారలతాంగులు=జారస్త్రీలు, క్రమంగా, మధ్యరాత్రులన్=అర్ధరాత్రివేళలో, చరించిరి+ఒగి= తిరుగసాగిరి, ఒగి = బాగుగా,

**తా :** అర్ధరాత్రివేళ జారకాంతలు అత్తలని, చిన్నపిల్లలని నిద్రపుచ్చి తలవరుల, భర్తల కంటపడకుండా, చేతి గాజులు కంకణాలు చప్పుడు కాకుండా చూసుకుని విచ్చలవిడిగా చక్కగా తిరుగసాగారు.

**చ. సురతము లేక యుస్సురను బోటి మగండుడికించు కాంతయున్**
**సరస మెఱుంగు చంద్రముఖి సావడిదంటయు బేరకత్తెయున్**
**బరపురుషాభిలాషమును బాయనిభామిని పోరుకట్టునన్**
**బరఁగిన భామలాది యుపభర్తలఁగూడి చరించి రత్తఱిన్. 12**

**ప్రతి :** అత్తఱిన్=ఆ సమయమున, సురతము లేక యుస్సురను బోటి=సంభోగ సుఖంలేక నిట్టూర్చే స్త్రీ, మగడుడికించు కాంతయున్=విరహవేదనకు గురిచేసే భర్త గల స్త్రీ, సరసమెఱుంగు చంద్రముఖి=సరసము తెలిసిన స్త్రీ, సావడిదంటయు=ధైర్యముగల వారకాంత, బేరకత్తెయున్=ధనముపుచ్చుకొని ప్రియుని సుఖపెట్టునది, పరపురుషాభిలాషమును=భర్తకాక వేరొక పురుషుడు కావాలనే కోరికను, పాయని భామిని=వీడలేని స్త్రీ, పోరుకట్టునన్=కలహములాడు, పరగిన భామలాది=స్వభావముగల స్త్రీలు, ఉపభర్తలన్=వేరొకభర్తలను, కూడిచరించిరి=కలసి ఆనందించారు.

**తా :** ఆ రాత్రివేళలో, సంభోగ సుఖములేని స్త్రీ, భర్త చేరదీయని కాంత, సరసం తెలిసిన అందకత్తె, నేర్పరితనంతో ధైర్యంగా బేరం చేయగల బేరకత్తెలు, పరపురుష వాంఛగల స్త్రీలు కలహమాడు స్వభావము గల స్త్రీలు – ఉపభర్తలను కూడి ఆనందించారు.

**ఉ. భానుసహస్ర సత్కిరణపంక్తుల నుద్భవమైన యా బృహ**
**ద్భానుని వెట్టఁ బెల్లుడకఁబడ్డ సుధాంబుధిమీఁది మీఁగడల్**
**పూని సమీరుచేఁ దెరల పూర్వదిశం గనుపట్ట దానిపై**
**ఫేన మనంగ నొప్పె శశిబింబము తూరుపుకొండపైఁ దగన్. 13**

**ప్రతి :** భానుసహస్ర సత్కిరణ పంక్తులన్=సూర్యుని కాంతిమంతమయిన వేయి కిరణాలపంక్తుల నుండి, ఉద్భవమైన=పుట్టిన, ఆ బృహద్భానుని వెట్టన్=ఆ గొప్ప సూర్యునివేడితో, పెల్లుడకఁబడ్డ=బాగా ఎక్కువగా

ఉడికిన, సుధాంబుధి మీఁది=పాల సముద్రముమీది, మీఁగడల్=మీగడలు, పూని=పూనుకొని, మీగడకట్టి, సమీరుచేన్=వాయువు చేత, తెరలన్=చెదరగా, పూర్వదిశన్=తూర్పుదిక్కున, కనుపట్ట=కనబడగా, దానిపై ఫేనమనం గనొప్పె=దానిమీద నురుగులాగ ఒప్పింది, శశిబింబము=చంద్రబింబము, తూరుపు కొండపై దగన్=తూర్పు కొండమీద అందంగా.

**తా :** పగలల్లా సూర్యుని తీక్షణమయిన కిరణాల వేడికి పాలసముద్రంలోని పాలు బాగా ఉడికినట్లు కాగిపోయాయి. ఆ పాలమీద దట్టంగా మీగడకట్టింది. ఆ మీద గాలి వీచడం వల్ల మీగడ చెదిరింది ఆమీగడ మీద బుడగలా కట్టిన నురుగు అన్నట్లుగా తూరుపుకొండ మీద చంద్రుడు ఉదయంచి ప్రకాశిస్తున్నాడు.

**విశే :** ఈ వర్ణన చేసినది కవయిత్రి. కాబట్టే-మరగకాగినపాలు, దానిమీద దట్టమయిన మీగడ, మీగడ మీద బుడగకట్టినట్టి నురుగు - వీటిలో చంద్రబింబాన్ని చూపించింది.

**చ.** **కుముదములుం జకోరములు గోమలసస్యముఁ జంద్రకాంతముల్**
**రమణఁ జెలంగ వెన్నెల తిరంబుగఁ జేసె జగంబు లుబ్బఁగాఁ**
**గమలములుఙ వియోగు లధికంబుగఁ జోరులుఁ జక్రవాకముల్**
**రమణఁ గలంగ వెన్నెల తిరంబుగఁ గాచె జగంబు లుబ్బఁగాన్.** **14**

**ప్రతి :** కుముదములున్=కలువ పువ్వులు, చకోరములు=చకోర పక్షులు (వీటికి వెన్నెల ఆహారం అని కవిసమయం) వెన్నెట్లో. కోమల సస్యమున్=లేత చేలు, చంద్రకాంతముల్=చంద్రకాంత పుష్పాలు (ఇవి రాత్రే విచ్చుకుంటాయి, తెల్లవారేసరికి ముడుచుకుపోతాయి), రమణన్=ఆనందంగా, అందంగా, చెలంగ=అతిశయించగా, జగంబులు=లోకాలన్నీ, ఉబ్బగా=సంతోషించగా, వెన్నెల తిరంబుగఁజేసి=వెన్నెల స్థిరంగా ఉండేలా చేసింది, కలువలు విచ్చుకున్నాయి, చకోరపక్షులు వెన్నెలవిందులు, లేతచేలు చంద్రకిరణాలలో చక్కగా పెరుగుతున్నాయి, కమలములున్=తామరపువ్వులు, వియోగులు=భార్యాభర్తలు ఒకచోట లేక వేరువేరుగా ఉన్నవారు, అధికంబుగన్=ఎక్కువగా, చోరులున్=దొంగలు, చక్రవాకముల్= చక్రవాకపక్షులు, (ఈ పక్షి దంపతులకు రాత్రిపూట వియోగం), రమణ గలంగ=అధికంగా మనస్సులో బాధపడే విధంగా, జగంబు లుబ్బఁగాన్= లోకాలన్నీ అధికంగా సంతోషించేలా, వెన్నెల తిరంబుగ గాచె=వెన్నెల స్థిరంగా కాసింది.

**తా :** చంద్రోదయం అయింది వెన్నెల లోకాలు సంతోషించేలా కాస్తోంది. అయితే ఈ వెన్నెల-కలువలకు, చకోరాలకు, లేతపైరుకు, చంద్రకాంతాలకు ఎంతో సంతోషాన్ని కలగజేస్తోంది. తామరపూలకు, ఎడబాటుగల దంపతులకు, దొంగలకు, చక్రవాక పక్షులకు, బాధకలిగించేలా, వెన్నెల కాస్తోంది. వెన్నెలకొందరికి ఆనందాన్ని కొందరికి బాధను కలిగిస్తోంది.

ఉ. **నారదులైరి సన్మునులు నాకమహీజములయ్యె భూజముల్**
**శారద లైరి భామినులు శంకర శైలములయ్యె గోత్రముల్**
**పారద మయ్యె నీరధులు పన్నగనాయకులయ్యె నాగముల్**
**వారిదవర్గ మెల్ల సితవర్ణము లయ్యెను బండు వెన్నెలన్.** **15**

**ప్రతి :** పండువెన్నెలన్=చక్కగా ప్రకాశించిన ఆ వెన్నెల్లో, సన్మునులు=ఉత్తములయిన మునులందరూ, నారదులైరి=నారదులవలె మారిపోయారు, భూజముల్= చెట్లన్నీ, నాకమహీజములయ్యె=కల్పవృక్షాలవలె కనబడుతున్నాయి, భామినులు=స్త్రీలందరూ, శారదలైరి=సరస్వతీ దేవివలె భాసిల్లుతున్నారు, గోత్రముల్= పర్వతాలన్నీ, శంకరశైలములయ్యె=ఈశ్వరుని కొండ అయిన కైలాస పర్వతాలవలె అయ్యాయి, నీరధులు= సముద్రాలు, పారదమయ్యె=పాదరసంలా అయ్యాయి, నాగముల్=పాములు, పన్నగ నాయకులయ్యె=పాముల రాజు అయిన శేషునివలె మారిపోయాయి, వారిదవర్గమెల్ల – నల్లమబ్బులన్నీ, సితవర్ణములయ్యెను తెల్లగా అయిపోయాయి.

**తా :** పండువెన్నెల బాగా ప్రకాశిస్తోంది. మునులలో నారదుడు తెల్లనివాడు. ఈ వెన్నెలలో మునులందరూ నారదులయిపోయారట. దేవలోకంలోని కల్పవృక్షము–తెల్లగా ఉంటుంది. ఈ వెన్నెల ప్రకాశంలో భూమిమీది వృక్షాలన్నీ కల్పవృక్షాలవలె భాసిస్తున్నాయి. శారదాదేవి తెల్లగా ఉంటుంది. సర్వశుక్లా సరస్వతీ! అని ఆ చదువుల తల్లి తెల్లనిది. ఈనాడు ఈ వెన్నెలలో స్త్రీలందరూ శారదలయ్యారు. శంకరుని కొండకైలాసం. అది వెండికొండ. కాగా తెల్లగా మెరిసిపోతూ ఉంటుంది. ఈ వెన్నెల వెలుగులో పర్వతాలన్నీ వెండి కొండలయ్యాయి. పాదరసం తెల్లగా మెరిసిపోతూ ఉంటుంది. ఈ వెన్నెల ప్రభావంతో సముద్రాలన్నీ పాదరసం అయ్యాయి. నాగరాజు శేషుడు తెల్లగా ఉంటాడు. ఈ వెన్నెల వెలుగులో పాములన్నీ శేషనాగులయ్యాయి. నల్లని మేఘాలన్నీ వెన్నెట్లో తెల్లగా కనబడుతున్నాయి. అంటూ ప్రపంచమంతా వెన్నెల ప్రభావంతో ఎలా తెల్లగా మారిపోయిందో అందంగా వర్ణించింది మొల్ల.

**విశే :** వెన్నెల తీవ్రతను ఇంతటి భావసాంద్రతతో వర్ణించి మొల్ల మహాకవుల సరసన నిలవ గలిగింది. కవయిత్రి మొల్ల కవితాత్మ జాలువార్చిన కమనీయమైన పద్యాల్లో ఇది ఒకటి.

ఇదే పద్ధతిలో వ్యాకరణ విషయ ప్రధానంగా భాస్కర రామాయణంలో లోకమంతా నల్లగా అయిపోయింది అని చెప్పే పద్యం ఒకటి మల్లికార్జున భట్టు వ్రాసాడు. మొల్ల ఆ పద్యాన్ని ఒరవడిగా గ్రహించి ఉండవచ్చు. అది 'యమునద్గంగము' అనే పద్యము.

చ. **కొదు కుదయించెనం చలరి కోరి సుధాంబుధి మిన్నుముట్టి య**
**ప్పుడు జగ మెల్లఁగప్పెననఁబూర్ణతనొందెను సాంద్రచంద్రికల్**
**పుడమికిఁ బాలవెల్లి గతిఁ బొల్పెసలారఁగఁ జంద్రుఁ డొప్పె న**
**య్యుడుపతి మేనిమచ్చయును నొప్పెఁబయోనిధి పద్మనాభుఁడై.** **16**

**ప్రతి :** కొడుకు=పుత్రుడు, ఉదయించెనంచు=పుట్టాడని, అలరి=ఆనందంతో, కోరి=కావాలని, సుధాంబుధి= పాలసముద్రము, మిన్నుముట్టి=ఆకాశం అందుకుందా అన్నట్టు పొంగిపోయింది, అప్పుడు=ఆ సమయంలో, సాంద్రచంద్రికల్=దట్టమయిన వెన్నెలలు, జగమెల్ల=ఈ లోకమంతా, కప్పెనన=కప్పేసిందా అన్నట్లు, పూర్ణతనొందెను=పూర్తిగా వ్యాపించాయి, పుడమికిన్=భూమికి, పాలవెల్లిగతిన్=పాలసముద్రంలా, పొల్పు= అందం, ఎసలారగన్=అధికంకాగ, చంద్రుఁడు=చంద్రుడు, ఒప్పె=ప్రకాశిస్తున్నాడు, కనబడుతున్నాడు, ఆ+ఉ డుపతి=అయ్యుడుపతి=ఆ నక్షత్ర ప్రభువు, (ఉడు=నక్షత్రము, ఉడుపతి= నక్షత్రములపతి చంద్రుడు,) చంద్రునియొక్క, మేనిమచ్చయును=శరీరంమీది మచ్చకూడ, పయోనిధి= పాలసముద్రము నందలి, పద్మనాభుఁడై= విష్ణుమూర్తియై, ఒప్పె=ప్రకాశించాడు.

**తా :** చంద్రుడు దట్టమయిన వెన్నెలతో జగత్తుని పూర్తిగా కప్పేస్తున్నాడు. ఆ దృశ్యం-ఎలాఉంది? చంద్రుడు పాలసముద్రం నుండి పుట్టాడు. కాగా సముద్రానికి చంద్రుడు కొడుకు. ఆకాశంలో చంద్రుడు ఉదయించగానే కొడుకు పుట్టాడనే ఆనందంతో సముద్రుడు ఆకాశమంత ఎత్తుకి పొంగి పోయాడు. పొంగిన ఆ పొంగు జగత్తును కప్పేసినట్లుంది. ఇక భూమికి చంద్రుడు ఎలా కనిపిస్తున్నాడు అంటే పాలసముద్రంలా కనిపిస్తున్నాడు. ఆ చంద్రునిలోని నల్లని మచ్చ పాలసముద్రంలో పవళించిన నీలమేఘశ్యాముడయిన విష్ణుమూర్తిలా ప్రకాశిస్తున్నాడు. చంద్రునిలోని మచ్చను మొల్ల విష్ణువులా భావించింది. కవులందరూ చంద్రునిలోని మచ్చను రకరకాలుగా భావించి వర్ణించారు.

నృసింహపురాణంలో ఎర్రన కూడ చంద్రునిలోని మచ్చను విష్ణువుతో పోల్చాడు.

**వ. అట్టి సమయంబున. 17**

**తా :** ఆ సమయంలో, (వెన్నెల గొప్పగా ప్రకాశిస్తూ జగత్తుంతా కప్పివేస్తున్న సమయంలో)

**ఉ. కోరి చకోరదంపతులు గుంపులుగుంపులు గూడి రంతులన్**
**చేరిన చంద్రికారవముఁ బేర్కొని మార్కొని పొట్టనిండఁగాఁ**
**బారణసేసి పెన్బయలఁ బ్రాఁకుచుఁ జంచుపుటంబు లెత్తుచున్**
**బేరము వారుచుండె మదిఁ బ్రేమజనింప వధూటికోటికిన్. 18**

**ప్రతి :** చకోరదంపతులు=చకోర పక్షిదంపతులు, కోరి=కోరుకొని, గుంపులు గుంపులు గూడి=గుంపులు గుంపులుగా కూడుకొని, రంతులన్=ఆనందముతో, ఆటలతో, పేరిన=గడ్డకట్టిన, చంద్రికారసమున్=వెన్నెల రసము, పేర్కొని=ఇది లేతవెన్నెల, ఇది తీగవెన్నెల ఇది ముదురువెన్నెల అనుకుంటూ, మార్కొని=ఎదురుపడి, ఒక జంటతో ఒక జంట వెన్నెలకోసం పోరాడుతూ, పొట్టనిండగా=కడుపునిండేలా, పారణచేసి= ఆరగించి, త్రాగి, పెన్బయలన్=విశాలమయిన స్థలంలో, ప్రాఁకుచు=దొర్లుతూ, (చకోరాలు పొట్టిగా కోడిపెట్టలా ఉంటాయి, గట్టిగా ఎగరలేవు, ఇప్పుడు వెన్నెల కడుపునిండాతాగి భుక్తాయాసంతో ఉండడంవల్ల కొంచెం

కూడా ఎగరలేక దొర్లుతున్నాయి), చంచుపుటంబు లెత్తుచున్=ముక్కుపుటాలు పైకెత్తుచూ, మదిన్=మనసులో, వధూటికోటికిన్=ఆడచకోరాల సమూహానికి, ప్రేమజనింప=వలపుపుట్టేలా, పేరమువారుచుండె= పరుగెత్తుతున్నాయి.

**తా :** ఈ వెన్నెలలో చకోరాలు జంట జంటలుగా గుంపులు గుంపులుగా కూడి పేరిన వెన్నెల రసాన్ని మెచ్చుకుంటూ, దానికోసం పరస్పరం పోరాడుతూ కడుపునిండా తాగాయి. ఆ భుక్తాయాసంతో అక్కడి విశాలమైన స్థలంలో దొర్లుతూ, ముక్కుపుటాలను పైకి ఎత్తుతూ ఆడచకోరాలకు మనస్సులో తమపై ప్రేమ పుట్టేలా ఇటూ అటూ పరిగెత్తుతూ ఆనందిస్తున్నాయి.

**విశే :** చకోరాలకు వెన్నెలే ఆహారమని కవి సమయం.

**ఉ. వెన్నెలతీఁగలన్ గొనలు వేడుక ముక్కులఁ ద్రుంచి తెచ్చి దా**
**రొన్న ప్రియాంగనాతతికి గూరిమి నోరికి నిచ్చి కేళికిన్**
**సన్నపుఁ గంఠనాళముల సన్నలు నేసి సుఖించె నింపుగన్**
**దిన్ననిచంద్ర కాంతమణితిన్నెల మీఁదఁ జకోరదంపతుల్. 19**

**ప్రతి :** వెన్నెలతీఁగలన్ గొనలు=తీగలు సాగిన వెన్నెలల చివరి భాగాలు, వేడుక=ప్రేమతో, ముక్కులఁద్రుంచి= ముక్కులతో తుంచి (విరిచి), తెచ్చి=తీసుకునివచ్చి, తారొన్న=సమీపంలో మెలగుచున్న, ప్రియాంగనాతతికి= ప్రియురాళ్ల సమూహానికి, కూరిమి=ప్రేమతో, నోరికిన్=నోటికి, ఇచ్చి=అందించి, కేళికిన్=సంభోగానికి, సన్నపున్=సన్నని, కంఠనాళముల=గొంతుతో, సన్నలు చేసి=సైగలు చేసి, తిన్నని=చక్కని, చంద్రకాంతమణి తిన్నెల మీదన్= చంద్రకాంతమణులుతాపి తయారు చేసిన అరుగుల మీద, చకోరదంపతుల్=చకోరపక్షుల జంటలు, సుఖించె నింపుగన్=ఎంతో ఆనందంగా సుఖించాయి.

**తా :** తీగెలు సాగిన వెన్నెలచిగుళ్లు ముక్కులతో త్రుంచి, ప్రేమగా తెచ్చి సమీపంలో తిరుగుతున్న, ప్రియాంగనా సమూహానికి ప్రేమతో నోటికి అందించి, రతిక్రీడకు పురిగొల్పుతూ సన్నని గొంతుతో సూచనలు చేస్తూ చంద్రకాంత శిలలు పొదిగి కట్టిన తిన్నెలమీద చకోర దంపతులు సుఖించాయి.

**గీ. పాకశాసని సేవంతిబంతి దివికి**
**నెగుర వైచిన కైవడి నేమి సెప్పఁ**
**బాండువర్ణంబుతోఁ బూర్వభాగమందు**
**సొంపు మీఱంగ వేగురు జుక్క వొడిచె. 20**

**ప్రతి :** పాకశాసని=జయంతుని, సేవంతిబంతి=చేమంతి పూలతో చేసి బంతి, దివికిన్=ఆకాశానికి,ఎగుర వైచిన=ఎగురవేసిన, కైవడిన్=విధంగా, ఏమిసెప్పన్=ఏమనిచెప్పేది, పూర్వభాగమందు=తూర్పు దిక్కునందు, పాండువర్ణంబుతో= తెల్లనిరంగుతో, సొంపుమీఱంగ=అందం అతిశయించగా, వేగురుజుక్క=తెల్లవారు జామున ఉదయించే నక్షత్రం, పొడిచె=పొడిచింది-ఉదయించింది.

**తా :** ఇంద్రుడి కొడుకు చేమంతులతో చేసిన బంతితో ఆట ఆడుకుంటూ ఆకాశానికి ఎగరవేసిన చేమంతి బంతివలె తూర్పుదిక్కున వేగుచుక్క పొడిచింది.

**విశే :** తెల్లవారుతోంది అని తెలియచెప్పే నక్షత్రానికి వేగుచుక్క అని పేరు. ఆ వేగురు చుక్క ఎలా ఉంది అంటే తూర్పుదిక్కుకు అధిపతి ఇంద్రుడు. పాకశాసని=పాకశాసనుని కొడుకు,పాకుడు అనే రాక్షసుణ్ణి సంహరించడం వల్ల, ఇంద్రునికి పాకశాసనుడు అని పేరు వచ్చింది. పాకశాసనుని కొడుకు-పాకశాసని అయ్యాడు, మహాభారతంలో అర్జునుడు ఇంద్రుని కొడుకు అని చెప్పడానికి నన్నయ్యగారు 'పాయక పాకశాసని'కి అని ప్రయోగించారు. శ్రీకృష్ణుడు కురుక్షేత్ర యుద్ధంలో అర్జునుణ్ణి ఒక్కక్షణం కూడా వదలకుండా కాపాడాడు.

**వ. అట్టి సమయంబున. 21**

**తా :** అటువంటి సమయంలో -

**క. రవి యదయించెను జనుఁడీ**
**దివియలు నక్షత్రసమితి తిమిరము శశియున్**
**బవ లేమిటి కనురీతిని**
**గువలయమున గూళ్ళఁ గోళ్ళు గూయ మొదలిడెన్. 22**

**ప్రతి :** రవి=సూర్యుడు, ఉదయించెను=ఉదయించాడు, దివియలు=దీపాలు, నక్షత్ర సమితి=నక్షత్ర సమూహాలు, తిమిరము=చీకటి, శశియున్=చంద్రుడు కూడా, పవలేమిటికి=పగలు మీకేమి పని, చనుఁడీ=వెళ్ళిపొండి, అనే రీతిని=అని చెప్తోందా అన్నట్లు, కువలయమున=భూమిమీద, గూళ్ళన్=గూళ్ళలో ఉన్న, కోళ్ళు=కోళ్ళు, కూయ మొదలిడెన్=కూయడం మొదలు పెట్టాయి.

**తా :** సూర్యుడు ఉదయించాడు-ఓ దీపాల్లారా! నక్షత్రాల్లారా! చీకటీ! చంద్రుడా! ఈ పగటివేళ మీకేమి పని వెళ్ళిపొండి-అని చెప్తున్నట్లుగా భూమి మీద గూళ్ళలోని కోళ్ళన్నీ కూయడం మొదలుపెట్టాయి.

**చ. వదలక పద్మరాగమణి వట్రువఁ గ్రాలఁగ బట్టి నేర్పు పెం**
**పొదవఁగఁ దూర్పుకొండపయి కొప్పుగఁ దెచ్చి జగద్గురుండు దాఁ**
**ద్రిదశవరేణ్యు కట్టెదురఁ దేఁకువ నిల్పినదర్పణంబు నా**
**నుదయము నొందె భానుఁడు సముజ్జ్వల కోకనద ప్రదీప్తులన్. 23**

**ప్రతి :** పద్మరాగమణి=పద్మమువలె ఎఱ్ఱగా ఉండే మణిని, వట్రువన్=గుండ్రంగా ఉండేలా, క్రాలఁగ బట్టి=చక్కగా పట్టుకొని, నేర్పు=నేర్పరితనం, పెంపొదవఁగన్=బాగా కనబడేలా, తూర్పుకొండపయికి=తూర్పు దిక్కున గల కొండమీదికి, ఒప్పగ=అందంగా, తెచ్చి=తీసుకుని వచ్చి, జగద్గురుండు=ఈ జగత్తునకు ప్రభువు తండ్రి అయిన పరమాత్మ, తా=తాను, త్రిదశవరేణ్యు=దేవతలలో శ్రేష్ఠుని, కట్టెదురన్=మిక్కిలి ఎదురుగా,

తేఁకువ=ఉత్సాహముతో, నిల్పిన=పెట్టిన, దర్పణంబునాన్=అద్దమా అనేటట్లు, భానుఁడు=సూర్యుడు, సముజ్జ్వల= అత్యధికమయిన, కోకనద=ఎఱ్ఱ తామరల, ప్రదీప్తులన్=కాంతితో, ఉదయమునొందె= ఉదయించాడు.

**తా :** ఎఱ్ఱతామరల కాంతివలె ఎఱ్ఱగా సూర్యుడు ఉదయించాడు. ఆ దృశ్యం-ఎలా ఉంది అంటే జగద్గురుడు (పరమాత్మ) పద్మరాగమణిని గుండ్రంగా ఉండేలా పట్టుకుని తూర్పుకొండ మీదకు తెచ్చి నేర్పుగా ఇంద్రుని ఎదుట పెట్టిన అద్దంలా ఎఱ్ఱగా సూర్యుఁడు ప్రకాశించాడు.

**విశే :** ఇందులో ఒక ఆచారం కూడా సూచన చేయబడింది. ప్రభువులు నిద్రమేల్కోగానే వారు వారి ముఖాన్ని అద్దంలో చూసుకుంటారు. ఆ మర్యాద ఇంద్రునికి కూడా జరిపించారా అన్నట్లు గుండ్రని సూర్యబింబం – పద్మరాగ మణి అనే అద్దాన్ని ఇంద్రుని ఎదుట నిలబెట్టారా అన్నట్లు ఎఱ్ఱగా ఉదయించిందట.

లోకంలో ఒకమాట ఉంది. ఏదైనా చెడు జరిగితే పొద్దున్నే లేచి ఎవరి ముఖం చూశామో అని. ప్రభువు వారి విషయంలో ఇలా జరిగితే-పొద్దున్నే ఎవరి ముఖం చూశాడో తెలుసుకుని అతన్ని శిక్షించే అవకాశం ఉంది. అందువల్ల – ప్రభువు తన ముఖమే తాను చూసుకునే ఏర్పాటు చేసారు.

**వ. ఆ రాత్రి రాజశేఖరుని చిత్తంబు వచ్చునట్లుగా మెలంగి యాతండు దన్ను మెచ్చు టెఱింగి కైక యిట్లనియె.** **24**

**ప్రతి :** ఆ రాత్రి=ఆనాటి రాత్రి, రాజశేఖరుని చిత్తంబు=రాజశ్రేష్ఠుడైన దశరథుని మనస్సు, వచ్చునట్లుగాన్= ఇష్టపడునట్లుగా, మెలంగి=ప్రవర్తించి, ఆతండు= అతవడు, తన్ను= తనను, మెచ్చుట=ప్రశంసించుట, ఎఱింగి= గ్రహించి, ఇట్లు+అనియె = ఇలా అనెను.

**తా :** ఆ రాత్రి కైక రాజశేఖరుడయిన దశరథుని మనస్సు ఆనందపడేలా ప్రవర్తించింది. దశరథుడు తనను మెచ్చుకోవడంతో కైక ఇలా అన్నది.

**ఆ. వసుమతీశ! నాకు వర మిచ్చి తప్పుట**
**తగవు గాదు మీకుఁ దలఁపులోన**
**మఱచినా రదేమొ మన్నించి తొల్లింటి**
**యీవు లీయవలయు నీక్షణంబ.** **25**

**ప్రతి :** వసుమతీశ!=ఓ రాజా! వసుమతి=భూమికి, ఈశ=ప్రభువా! నాకు వరమిచ్చి తప్పుట=నాకు వరము ఇచ్చావు, ఇప్పుడు తప్పుట, తగవు గాదు మీకు=మీకు మర్యాద కాదు, తలపులోన=మనసులో, ఆలోచనల్లో, మఱచినారు=మఱిచి పోయారు, అదేమొ=ఆ వరం సంగతి ఏమిటో, మన్నించి=గమనించి, మీమఱపు సంగతి గమనించి, తొల్లింటి=పూర్వము, ఈవులు=ఇస్తానన్నవి, ఈవి=దానము, ఈ క్షణంబ=ఇప్పుడే – ఈ క్షణంలోనే, ఈయవలయు=ఇవ్వాలి, తప్పక ఈయాలి.

**తా :** రాజా! నాకు వరమిచ్చారు. ఆ మాట తప్పడం మర్యాదకాదు. మీరు రకరకాల ఆలోచనలో పడి మరచిపోయినట్లున్నారు. ఇప్పుడు వాటిని గుర్తుకు తెచ్చుకుని పూర్వం మీరు ఇచ్చిన వరాలు ఇప్పుడే ఇవ్వాలి అని కైక దశరథ మహారాజును కోరింది.

**క. జననాథ! నాకుమారుని**
**వినుఁడీ పట్టంబు గట్టి వేవేగమ రా**
**ముని మునిఁగా ననుపుఁడు మఱి**
**వనమునఁ బదునాలు గేండ్లు వర్తింపంగన్. 26**

**ప్రతి :** జననాథ!=ఓ మహారాజా!వినుఁడీ=వినండి, నాకుమారుని=నాకొడుకు భరతునికి, పట్టంబు గట్టి=పట్టాభిషేకం చేసి, మఱి=ఇంక, వేవేగమ=అతితొందరగా, రాముని=శ్రీరాముణ్ణి, మునిఁగాన్= మునివృత్తిలో జీవించే విధంగా, వనమునన్=అడవిలో, పదునాలుగేండ్లు=పదునాలుగు సంవత్సరాలు, వర్తింపంగన్=సంచరించేలా!, అనుపుఁడు=పంపుడు.

**తా :** మహారాజా! వినండి నా కుమారడయిన భరతునకు పట్టాభిషేకం చేయండి. రాముని పదునాలుగేళ్లు ముని వృత్తి స్వీకరించి అరణ్యాల్లో తిరుగుతూ జీవించేలా అడవికి పంపించండి.

**వ. అని ప్రార్థించిన విని పార్థివేంద్రుండు డిల్లపడి తల్ల డిల్లుచు నుల్లంబు గలంగి ముసుంగిడి యచ్చేడియ పలికిన పలుకు లకు మాఱాడ నోడి మిన్నక యున్న సమయంబున సుమంత్రుం డేతెంచి స్వామీ! రామచంద్రునిఁ బట్టంబు గట్ట సుముహూర్తం బాసన్నం బయ్యెఁ గావున మిమ్ము నచ్చుటికి విచ్చేయ నవధరింపు డని వసిష్ఠభగవానుండు విన్నవించు మని పంపె నని చెప్పిన విని కైక యిట్లనియె 27**

**ప్రతి :** అని ప్రార్థించినవిని=ఆ విధంగా కైక ప్రార్థించగ విని, పార్థివేంద్రుండు= మహారాజు, డిల్లపడి=నీరసపడి, తల్లడిల్లుచు=ఆందోళన చెందుతూ, ఉల్లంబు=మనస్సు, కలంగి=కలత చెందగ, ముసుంగిడి=ముసుగు పెట్టుకుని, అచ్చేడియ=ఆ స్త్రీ, ఆ ప్రియురాలు, పలికిన పలుకులకు=మాట్లాడిన మాటలకు, మాఱాడ నోడి=బదులు చెప్పలేక, మిన్నక=ఏమీచేయక మౌనంగా, ఉన్న సమయంబున – సుమంత్రుం డేతెంచి, స్వామీ! రామచంద్రుని, పట్టంబుగట్ట, సుముహూర్తంబు, ఆసన్నంబయ్యె=సమీపించింది. కావున, మిమ్ము, అచ్చటకి, విచ్చేయ నవధరింపుండని=రావలసినదిగా చెప్పమని వసిష్ఠ భగవానుండు, విన్నవించుమని పంపెనని, చెప్పిన, విని, కైక యిట్లనియె.

**తా :** కైక కోరిన కోరికలు విని దశరథుడు మాఱు చెప్పలేక ఉన్న సమయంలో సుమంత్రుడు వచ్చి, స్వామి! రామచంద్రుని పట్టాభిషేక ముహూర్తం దగ్గరపడింది. మిమ్ము రావలసిందిగా చెప్పమని వసిష్ఠభగవానుడు మీకు విన్నవించుమని చెప్పారు అని చెప్పగా ఆ విషయం విన్న కైక –

**మ. అనిలో మున్ను నృపాలుచిత్తమున కే నాహ్లాదముంగూర్చి నా**
**తనయున్ బట్టముగట్టి రాఘవునిఁ బద్నాల్గేండ్లు కాంతారమం**

**దనువర్తిల్లఁగ పంపఁ గొన్న వరమున్ ద్రోయంగ రాదెంతయున్**
**వ్వనసీమన్ మునివృత్తి నుండు మనుఁడీ వైళంబ యా రామునిన్.** **28**

**ప్రతి :** అనిలో=యుద్ధములో, మున్ను=పూర్వం, నృపాలునిచిత్తమునకున్=రాజుగారి మనస్సుకు, ఏను=నేను, ఆహ్లాదముంగూర్చి=ఆనందాన్ని కలిగించి, నా తనయున్=నా కొడుకునకు, పట్టముగట్టి=పట్టాభిషేకంచేసి, రాఘవుని= శ్రీరాముని, పద్నాల్గేండ్లు=పదునాలుగేండ్లు, కాంతారమందును=అడవిలో, అనువర్తిల్లగ = వినయముతో చరించగ, పంప=పంపించేందుకు. కొన్న వరమున్= పొందినవరము, ఎంతయున్=ఏ మాత్రమూ, ద్రోయంగరాదు=త్రోసిపుచ్చరాదు, ఒప్పను అనరాదు, ఆ రామునిన్=ఆ రాముని, వనసీమన్= అరణ్యాలలో, మునివృత్తిన్ ఉండు మనుఁడీ=మునులవలె జీవించమని చెప్పండి, వైళంబ=వేగంగా.

**తా :** పూర్వం ఒకసారి యుద్ధంలో మీ (రాజుగారి) హృదయం ఆనందపడేలా ప్రవర్తించి రెండు వరాలు పొందాను. ఆ వరాలు ఇప్పుడు కాదనరాదు. మొదటివరం నా పుత్రుడు భరతునికి పట్టం కట్టాలి. రెండవది రాముడు అరణ్యాలలో ముని వృత్తితో పదునాలుగేండ్లు గడపాలి. వెంటనే వేగంగా రాముణ్ణి అరణ్యానికి పంపండి.

**క. అని పలుకు కైక పలుకులు**
**విని వేగము మరలి వచ్చి విన్నఁదనంబున్**
**దనుక వసిష్ఠునితోడన్**
**వినుపించె సుమంత్రు డట్టి విధ మేర్పడగన్** **29**

**ప్రతి :** అని పలుకు=ఆ విధంగా మాట్లాడుతున్న, కైకపలుకులు విని=కైకమాటలు విని, వేగమ మరలివచ్చి= వేగంగా తిరిగివచ్చి, విన్నదనంబున్ దనుకన్=వెలవెలపోగా, వశిష్ఠుని తోడన్=వశిష్ఠునితో, సుమంత్రుఁడు అట్టి విధ మేర్పడఁగన్=కైక చెప్పిన రెండు వరాల సంగతి భరతునికి పట్టము, రామునికి వనవాసము, వినుపించె=వినిపించాడు, చెప్పాడు.

**తా :** కైక చెప్పిన మాటలు విని అతివేగంగా మరలి వచ్చి విచారంతో వసిష్ఠునితో కైక కోరికల విషయమంతా సుమంత్రుడు వివరంగా చెప్పాడు.

**వ. అనిన విని వసిష్ఠాది ప్రముఖులును సుమంత్రాది ప్రధానజనంబులును సైన్యంబును బరివారంబులు విన్ననైయున్న నా సన్న యెఱింగి రామచంద్రుండు రాజచిహ్నంబులు త్యజించి జటావిభూతి వల్కలంబులు దాల్చి ధనుర్ధరుండై యున్నంత లక్ష్మణుండును భూపుత్త్రికయును దోడం జనుదేరం దల్లులకు నమస్కరించి వసిష్ఠానుమతంబున నాశీర్వచనంబులు గైకొని యాస్థానంబు వెలువడి యరణ్యంబున కరుగునప్పుడు పురజను లండఱును బురపురం బొక్కుచు దశరథ మహారాజును దూషింపుచుఁ గైకను నిందింపుచు మూఁకలై శోకింపుచుండ నది యంతయు విని దశరథుండు పురోహితామాత్యబంధువర్గంబులతో శ్రీరామచంద్రుం దేఁగిన త్రోవం జన్నంత నా రాముఁడు దూరంబునం జనియె. దశరథుండును మరలి వచ్చి పుత్రశోకంబున నాకపురంబునకుం జనియెఁ దదనంతరంబు.** **30**

**ప్రతి :** అనినన్=అట్లు పలుకగా, విని, వసిష్ఠాదిప్రముఖులును=వసిష్ఠుడు మున్నగు ముఖ్యులును, సుమంత్రాది ప్రధాన జనంబులును=సుమంత్రుడు మొదలగు ప్రధాన వ్యక్తులును, సైన్యంబును, పరివారంబులు= అనుచరులు, విన్ననై యున్న నా సన్న=తెల్లబోయి ఉన్న ఆ సంగతి, ఎఱింగి=తెలిసి, రామచంద్రుడు, రాజచిహ్నంబులు=రాజలాంఛనములు, త్యజించి=విడిచి, జటావిభూతి వల్కలంబులు=జడలను, విభూతిని, నారబట్టలను, తాల్చి=ధరించి, ధనుర్ధరుండై=విల్లు ధరించినవాడై, ఉన్నంత=ఉండగా, లక్ష్మణుండును, భూపుత్రికయును=సీతయును, తోడన్=కూడా, చనుదేరన్=రాగా, తల్లులకు, నమస్కరించి, వసిష్ఠానుమతంబునన్=వసిష్ఠుని అంగీకారముతో, ఆశీర్వచనంబులు, కైకొని=స్వీకరించి, ఆస్థానంబు=ఆ రాజాస్థానము, వెలువడి=వదిలిపెట్టి, బయల్పడి, అరణ్యంబునకున్, అరుగునప్పుడు=వెళ్ళునప్పుడు, పురజనులందరును=నగరంలోని వారంతా, పురపురన్=బోరుబోరున, పొక్కుచు=దుఃఖించుచు, దశరథ మహారాజును, దూషింపుచున్=నిందించుచు, కైకను, నిందింపుచు, మూఁకలై=మూగవారై, శోకింపుచుండన్= ఏడ్చుచుండగా, అది అంతయు, విని, దశరథుండు, పురోహితామాత్యబంధువర్గంబులతో=పురోహితులతో, మంత్రులతో, బంధువర్గాలతో, శ్రీరామచంద్రుండు, ఏఁగిన త్రోవన్=వెళ్ళినబాటలో, చన్నంతన్=వెళ్ళగా, ఆ రాముఁడు, దూరంబునన్=దూరముగా, చనియె=వెళ్ళెను, దశరథుండును, మరలివచ్చి=తిరిగివచ్చి, పుత్రశోకంబునన్=పుత్రుని కొరకు దుఃఖముతో, నాకపురంబునకున్=స్వర్గపురమునకు, చనియెన్=వెళ్ళెను, తదనంతరంబు=ఆ తర్వాత.

**తా :** సుమంత్రుడు చెప్పిన మాటలు విన్న వసిష్ఠాది ప్రముఖులు, ప్రధానులు, సైన్యము, పరివారము తెల్లబోయి కంగారుపడుతుండగా చూసి విషయం గ్రహించిన శ్రీరాముడు రాజచిహ్నాలన్నీ వదిలేసి, జడలు కట్టుకుని నారచీరలు కట్టుకుని, ధనుస్సు పట్టుకుని అరణ్యానికి సిద్ధంగా ఉండగా – లక్ష్మణుడు, భూపుత్రిక అయిన సీత కూడా బయలుదేరారు. అప్పుడు వారు తల్లులకు నమస్కరించి, వశిష్ఠుని అనుమతి, ఆశీర్వాదంతీసుకుని రాజాస్థానం నుండి అడవికి బయలుదేరారు. ఆ దృశ్యం చూసిన పురజనులు అందరూ ఒక్కపెట్టున దుఃఖపడుతూ దశరథమహా రాజును, కైకను నిందిస్తూ, గుంపులు గుంపులుగా శోకిస్తుండగా – అది విన్న దశరథుడు లేచి పురోహితులతో మంత్రులతో బంధువులతో కలిసి రాముడు వెళ్లిన మార్గంపట్టి వెళ్లాడు. కాని అప్పటికే రామాదులు చాలాదూరం వెళ్లిపోవడంతో నిరాశతో తిరిగి వచ్చి పుత్రశోకాన్ని తట్టుకోలేక స్వర్గస్థుడయ్యాడు. ఆ తరువాత–

**ఆ. చనుచు రాఘవుండు స్వర్ణది యొడ్డున**
**గుహుని గాంచి యతని గుస్తరించి**
**తడయ కోడఁ బెట్టి దాఁటింపు మనవుడు**
**నట్ల చేయఁ దలఁచి యాత్మలోన. 31**

**ప్రతి :** రాఘవుండు=శ్రీరాముడు, చనుచు=వెళుతూ, స్వర్ణది యొడ్డున=గంగానది ఒడ్డున, గుహునిఁగాంచి=గుహుణ్ణిచూసి, అతని కుస్తరించి=ఆప్యాయంగా పలకరించి, ఆదరించి, తడయక=ఆలస్యం

చెయ్యకుండా, ఓడఁబెట్టి=ఓడకట్టి, దాఁటింపుము అనవుడు=దాటించవలసినదని కోరగా, అట్ల చేయన్=ఆ విధంగానే చేయాలని, తలచి=నిశ్చయించి, ఆత్మలోన=మనస్సులో.

**తా :** రాముడు అరణ్యావాసానికి వెళుతూ మార్గంలో గంగానది ఒడ్డున గుహుణ్ణి చూసి, అతనిని ఆదరించి – ఆలస్యం చెయ్యకుండా ఓడకట్టి నదిని దాటించమని కోరాడు. అలాగే చేయాలని నిశ్చయించి గుహుడు మనస్సులో – ఇలా భావించాడు.

**చ. సుడిగొని రాముపాదములు సోఁకినధూళి వహించి ఱాయి యే**
**ర్పడ నొక కాంత యయ్యెనఁట పన్నుగ నీతని పాద రేణు వి**
**య్యెడ వడి నోడసోఁక నిది యేమగునోయని సంశయాత్ముఁడై**
**కడిగె గుహుండు రామపదకంజయుగంబు భయమ్ము పెంపునన్. 32**

**ప్రతి :** సుడిగొని=అదృష్టముఫలించగా, రాముపాదములు=శ్రీరాముని పాదములు, సోఁకిన=ముట్టిన, ధూళివహించి=మట్టిరేణువులు పడగా, ఱాయి=రాయి, ఏర్పడన్=విచిత్రముగా, ఒకకాంత=ఒకఆడుదానిగా, అయ్యెనఁట=మారినదట, పన్నుగన్=పూనికతో, ఈతని=ఈరాముని, పాదరేణువు=పాదధూళి, కాళ్ళకుగల ధూళి, ఇయ్యెడవడి=ఈ ప్రదేశంలోపడి, ఇది యేమగునో=ఈ ఓడ ఏమవుతుందో (స్త్రీగామారి పోతుందేమో), అని=అనుకుని, సంశయాత్ముఁడై=అనుమానంతో కూడినవాడై, భయమ్ము పెంపునన్=అధికమయిన భయంతో, రామపదకంజయుగంబు=రాముని పాదపద్మాలు రెండింటిని, గుహుండు కడిగె=గుహుడు కడిగాడు.

**తా :** శ్రీరాముని పాదధూళి సోకడం వల్ల ఒకఱాయి స్త్రీగా మారిందట. ఇప్పుడు రాముని పాదాల ధూళి నా ఓడకి సోకితే ఈ ఓడ కూడా స్త్రీ అవుతుందేమో అని మనస్సులో సందేహం కలిగింది. ఓడ స్త్రీ అయితే నాకు జీవనోపాధి పోతుందేమో అనే భయంతో రాముని పాదాలు ముందుగా గంగ నీటితో కడిగి అప్పుడు ఓడ ఎక్కేలా చేసాడు.

**విశే :** శ్రీరాముని పాదాలు గుహుడు కడిగి మరీ ఓడ ఎక్కించాడు.

గుహుని పాత్రమాటున ఉండి కవయిత్రి మొల్ల తన కవితా జలాలతో శ్రీరామపాదాలు కడిగి ధన్యురాలయింది. మొల్లకు పేరుతెచ్చిన పద్యాలలో ఈ పద్యం కూడా ఒకటి. ఈ భావన వాల్మీకి రామాయణంలో లేదు. ఆధ్యాత్మ రామాయణంలో ఉన్న భావాన్ని స్వీకరించి మొల్ల చక్కని పద్యం చెప్పింది.

**క్షాలయామి తవ పాదపంకజమ్ నాథ దారు దృషతో కిమంతరమ్**
**మానుషీకరణ చూర్ణమస్తి తే పాదయోరితి కథాప్రథీయసి – (అధ్యాత్మ 6.3)**

**వ. ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీ పాదంబులనీటఁగడిగి యోడపై నెక్కించి యమ్మువ్వుర నవ్వలికిఁ దాటించిన నాక్షణంబు. 33**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా, శ్రీరామచంద్రుని, శ్రీపాదంబులన్= మంగళకరమైన పాదాలను, నీటన్+కడిగి= నీటితో కడిగి, ఓడపై నెక్కించి= ఓడలో ఎక్కించి, ఆ+మువ్వురన్= ఆ ముగ్గురిని, అ+వలికి= అవతలితీరానికి, దాటించి, ఆ క్షణంబు= ఆ క్షణంలో

**తా :** ఈ విధంగా శ్రీరాముని శ్రీపాదాలను నీటితో కడిగి ఓడపైకి ఎక్కించి ఆ ముగ్గురుని అవతలి తీరానికి దాటించిన ఆ సమయంలో –

**ఉ. రాజకులావతంసుఁ డగు రాముఁడు తమ్ముఁడుఁ దాను నా భర**
**ద్వాజ మహామునీంద్రు పదవారిజముల్ గని మ్రొక్క నాతఁ డం**
**భోజహితాన్వయాబ్ధి పరిపూర్ణ సుధాకరుఁడైన రామునిం**
**బూజలొనర్చి కందఫలమూలములన్ బరితృప్తిఁ జేసినన్. 34**

**ప్రతి :** రాజకులావతంసుఁడగు=రాజ కులములో శ్రేష్ఠుడయిన, రాముఁడు=రాముడు, తమ్ముఁడున్=తమ్ముడు, తానున్=తానుకూడ, ఆ భరద్వాజ మహామునీంద్రు పదవారిజముల్=ఆ భరద్వాజ మహామునీంద్రుని పాదపద్మాలు, కని=దర్శించి, మ్రొక్కన్=నమస్కరించగా, ఆతండు=ఆ భరద్వాజమహాముని, అంభోజహితాన్వ యాబ్ధి=తామర పూవులకు మిత్రుడయిన సూర్యవంశమనే సముద్రానికి, పరిపూర్ణ సుధాకరుఁడైన=పూర్ణిమనాటి చంద్రుడైన, రామునిం బూజలొనర్చి=రామునికి పూజలు చేసి, కందఫలమూలములన్=కంద దుంపలతో, ఫలాలతో, పరితృప్తిన్=తృప్తిపడేలా, చేసినన్=చేయగా.

**తా :** రాజకులశ్రేష్ఠుడయిన రాముడు, తన తమ్ముడు లక్ష్మణునితో భరద్వాజమహామునీంద్రుని పాదపద్మాలకు నమస్కరించాడు. సూర్యవంశమనే సముద్రానికి పున్నమినాటి చంద్రునివంటివాడైన రామునికి పూజచేసి కందమూలఫలాలతో భరద్వాజమహర్షి వారిని సంతృప్తిపరచారు.

**వ. సంతసింపుచు నారాత్రి యచ్చట నివసించి మఱుసటి దిన మర్కోదయమ్మున. 35**

**ప్రతి :** సంతసింపుచు= సంతోషంతో, ఆ రాత్రి= ఆనాటి రాత్రి, యచట నిసించి= అక్కడే విశ్రాంతితీసుకొని, మఱుసటిదినము= మరునాడు, అర్కోదయమ్మున,= సూర్యోదయ సమయంలో

**తా :** రామాదులు ఆనందించి ఆ రాత్రి అక్కడేఉండి మరునాటి సూర్యోదయ సమయంలో –

**ఆ. ముదముదోడఁ దమ్ము ముని భరద్వాజుండు**
**భక్తి ననుప రామభద్రుఁ డపుడు**
**చనియె భ్రాతృ దార సహితుఁడై సన్ముని**
**కూటమునకుఁ జిత్రకూటమునకు. 36**

**ప్రతి :** ముదముదోడన్=ఆనందంతో, తమ్ము=తమను, మునిభరద్వాజుండు=భరద్వాజ మహర్షి, భక్తిన్ అనుపన్=భక్తితో సాగనంపగా, రామభద్రుఁ డపుడు=ఆ సమయంలో రామభద్రుడు, భాతృదారసహితుఁడై=

తమ్మునితో, భార్యతో కూడినవాడై, సన్మునికూటమునకున్=ఉత్తమమునులకు నిలయమైన, చిత్రకూటమునకు= చిత్రకూటము అనే ప్రదేశానికి, చనియె=వెళ్లాడు.

**తా :** భరద్వాజ మహర్షి తమకు ఆనందంతో వీడ్కోలు పలికి పంపగా రామచంద్రుడు తమ్మునితో, భార్యతో కలసి ఉత్తములైన మునులకు నిలయమైన చిత్రకూటానికి వెళ్లాడు.

**మ. ఘనుఁడా రాముఁడు చిత్రకూటమున వేడ్కంజేరి యున్నంతలో**
**నన దంతావళవాజిరత్న రథ నానాయోధ సంఘంబుతో**
**డ నమాత్యద్విజబంధు వర్గములతోడం గూడి వాద్యంబులన్**
**జనుదెంచెఁ భరతుండు రాముకడకున్ సద్భక్తి యేపారఁగన్. 37**

**ప్రతి :** ఘనుఁడు ఆరాముఁడు=గొప్పవాడైన ఆ రాముడు, చిత్రకూటమునన్= చిత్రకూటము అనేప్రదేశానికి, వేడ్కంచేరి యున్నంతలోనన=ప్రేమతోచేరి అక్కడ స్థిరపడి ఉండగానే, దంతావళ=ఏనుగులు, వాజిరత్నరథ= శ్రేష్ఠమయిన గుఱ్ఱాలు, రథములు, నానా యోధ సంఘంబుతోడన్=అనేకమంది వీరుల సమూహంతోడను, అమాత్యద్విజబంధు వర్గములతో= మంత్రులు, బ్రాహ్మణులు చుట్టాలసమూహాలతోకూడి, వాద్యంబులన్= మంగళ వాద్యములతో, రాముకడకున్=శ్రీరామునివద్దకు, సద్భక్తియేపారగన్=ఉత్తమమయిన భక్తి పొంగుతూ ఉండగా, భరతుండు=భరతుడు, చనుదెంచెన్=వచ్చెను.

**తా :** గొప్పవాడయిన రాముడు చిత్రకూటానికి చేరి ఉన్నంతలో భరతుడు ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, వీరుల సమూహంతో, మంత్రులు, బ్రాహ్మణులు, బంధువులతో కూడి వాద్యంబులతో (సంగీత సాధనములతో) సద్భక్తి పొంగారుతూ ఉండగా రాముని చెంతకు వచ్చాడు.

**సీ. చనుదెంచి రాముని చరణంబులకు మ్రొక్కి**
**కై కేయి చేసిన కపటమునకు**
**నగరంబు విడిచి యాపగిది ఘోరారణ్య**
**మున కిట్లు రా నేల మునులపగిది**
**నది గాక మనతండ్రి యత్యంతమైనట్టి**
**పుత్త్రశోకంబునఁ జొక్కి పొక్కి**
**త్రిదశాలయమ్మున దేవేంద్రుఁ గనఁబోయె**
**నని చెప్ప విని రాముఁ డంతలోన**

**తే. భరత లక్ష్మణ శత్రుఘ్న ధరణిసుతలఁ**
**గూడి దుఃఖించి, దుఃఖించి కొంతవడికి**
**నాప్తవర్గంబుచే మానె నంత మీఁద**
**భరతుఁ డిట్లనె శ్రీరామభద్రుతోడ. 38**

**ప్రతి :** చనుదెంచి=వచ్చి, రాముని చరణంబులకు మ్రొక్కి=శ్రీరాముని పాదాలకు మ్రొక్కి, కైకేయి చేసిన కపటమునకు=కైక చేసిన మోసానికి, నగరంబు విడిచి= అయోధ్యానగరాన్ని విడిచిపెట్టి, ఈ పగది=ఈ విధంగా, ఘోరారణ్యమునకు=ఈ భయంకరమయిన అడవికి, మునులపగిది=మునులవలె, ఇట్లురానేల=ఇలా రావడమెందుకు, అదిగాక=అదీకాక, మన తండ్రి=మననాన్నగారు, అత్యంతమైనట్టి=అధికమైన, పుత్రశోకంబునన్=పుత్రుడు దూరమైన దుఃఖానికి, చొక్కిపొక్కి=వశుడై దుఃఖించినవాడై, త్రిదశాలయమ్మున= దేవతల ఆలయమైన స్వర్గానికి, దేవేంద్రున్=ఇంద్రుణ్ణి, కనఁబోయెనని చెప్పవిని=చూడడానికి వెళ్లాడని చెప్పగా విని, రాముఁడు అంతలోన=రాముడు అంతలోనే, భరతలక్ష్మణ శత్రుఘ్న ధరణి సుతల=తమ్ములు ముగ్గురితో, సీతతో దుఃఖించి, దుఃఖించి=బాధపడి, బాధపడి, కొంతవడికి=కొంత సేపటికి, ఆప్తవర్గంబుచే= ఆప్తులైన వారి మాటతో, మానె=కాస్త దుఃఖించడం మానాడు, అంతమీద=ఆ తరువాత, శ్రీరామభద్రుతోడన్= శ్రీరామ చంద్రునితోడ, భరతుఁడు ఇట్లనె=భరతుడు ఇలా అన్నాడు.

**తా :** భరతుడు సపరివారంగా చిత్రకూటానికి వచ్చి రాముని పాదాలకు నమస్కరించి కైక చేసిన మోసానికి నీవు ఇలా మునులవలె యీ భయంకరమయిన అడవులకు ఎందుకు వచ్చావు. నీ ఎడబాటుతో మన తండ్రిగారు దుఃఖభారం తట్టుకోలేక స్వర్గస్థులయ్యారు అని చెప్పాడు. ఆ మాట విని రాముడు సీతతో తమ్ములతో ఎంతగానో దుఃఖించసాగాడు. ఆప్తులు ఓదార్చిన మీదట కొంత తేరుకున్నాడు. అప్పుడు భరతుడు శ్రీరామునితో ఇలా అన్నాడు.

**తే.** **రాజు లేకున్నచో మఱి రాష్ట్రమందు**
**గార్య మెట్లౌను మీ రెఱుంగనిది గలదె!**
**నేఁటి సమయానఁ బట్టంబు నిలుపుకొనఁగఁ**
**దిరిగి విచ్చేయుఁ దనుదు నా భరతుతోడ.** **39**

**ప్రతి :** రాజులేకున్నచో=రాజుగారు లేకపోయినట్లయితే, మఱి రాష్ట్రమందు=రాష్ట్రంలో-దేశంలో, కార్యము= పని, ఎట్లౌను=ఎలా జరుగుతుంది, మీరెఱుంగనిది గలదె!=ఈ విషయం మీకు తెలియనిది ఏముంది, నేటి సమయానన్=ఈ రోజున, పట్టంబు నిలుపుకొనగ=పట్టము నిలబడేలా, తిరిగి విచ్చేయు దనుడు=మీరు అయోధ్యకు తిరిగి రండి అనిన, ఆ భరతుతోడ=ఆ భరతుతోడ.

**తా :** రాజులేకున్నచో రాష్ట్రంలో పనులెలా జరుగుతాయి. ఈ విషయం మీరు ఎఱుంగనిదికాదు. మీరు అయోధ్యకు తిరిగివచ్చి పట్టంబు కట్టుకోండి అన్న భరతునితో శ్రీరాముడు-

**వ.** **శ్రీరామచంద్రుం డిట్లనియె.** **40**

**తా :** శ్రీరామచంద్రుదు ఇలా అన్నాడు -

**చ.** **జనకుఁడు చేసినట్టి మితిఁ జక్కగఁ దీర్చి కడంక నేను వ**
**చ్చిన గుఱిదాఁక భూతలము జేకొని రాజ్యము జేయు మాట గా**

**దనకు మటన్న నొల్ల నన నాతనికిం దన పాదుకాయుగం**
**బొనరఁగ నిచ్చి పొమ్మనుచు నుర్వికి రాజుగఁ బంపె సొంపుగన్.** **41**

**ప్రతి :** జనకుడు=మన తండ్రి దశరథుడు,చేసినట్టి మితిన్=చేసినట్టి ఏర్పాటు, చక్కఁగఁ దీర్చి=చక్కగా ఏమార్పు లేకుండా నిర్వహించి, కడంక=పూనికతో,నేను వచ్చిన గుతిదాఁక=నేను వచ్చిన ఈ పదునాలుగేళ్ల కాలం తీరేదాక, భూతలము చేకొని=ఈ రాజ్యాన్ని స్వీకరించి, రాజ్యముజేయు=పరిపాలన చేయుము, మాట గాదనకుము=నామాట కాదు అనకుము, అటన్నన్=అని అనగా, ఒల్లననన్= నేను ఒప్పుకోను అని భరతుడు అనగా, ఆతనికిన్=భరతునికి, తన పాదుకాయుగంబు=తన పాదరక్షలు (చెప్పులు), ఒనరగ నిచ్చి= సిద్ధముచేసి ఇచ్చి, పొమ్మనుచు=వెళ్లుము అని, ఉర్వికి రాజుగన్=ఉర్వికి=భూమికి (అయోధ్యానగరానికి) రాజుగా, పంపె సొంపుగన్=ఆనందంగా పంపించాడు.

**తా :** మన తండ్రిగారు నిర్ణయించిన ప్రకారం నేను అరణ్యవాసం పూర్తి చేసుకుని వచ్చేదాకా నువ్వు రాజ్యపాలన చెయ్యి, కాదనకు- అని శ్రీరాముడు భరతునికి చెప్పాడు. కాని భరతుడు నేను రాజ్యాన్ని స్వీకరించను అన్నాడు. రాముడు అప్పుడు తన పాదుకలను ఇచ్చి వీటిని పెట్టుకుని రాజకార్యాలు నిర్వహించమని భరతుడు ఆనందిచేలా పంపించాడు.

**వ. ఇట్లు భరతుని భరతాగ్రజుఁ డనునయించి మరలించి నాకలోకవాటం బగుచిత్రకూటంబు కదలి సౌమిత్రి భూపుత్రులంగూడి పోవునెడ, నటవీమధ్యంబున విరాధుండను దైత్యాధముం డపరాధంబుచేసి దిగ్గన డగ్గఱి జగతీతనూభవ నెత్తుకొని గగనమార్గంబున కెగిరి పోవునెడ వాఁడిబాణంబున వానికంఠంబును ద్రుంచి గారుడాస్త్రంబున మరల నొయ్యన జనకనందనం డించి భయంబు వాపి ప్రియంబుసూపి యొయ్య నొయ్యన నయ్యెడ నున్న యత్రిమహాముని యాశ్రమంబునకుం జని ఘనంబుగ నా ఘనుండు సేయుపూజలం గైకొని రామచంద్రుం డచ్చటి మునీంద్రులకు దైత్యులవలని భయంబు లేకుండ నభయం బిచ్చి మన్ననం గొన్ని దినంబు లాయా మునుల యాశ్రమంబుల నిలుచుచు వార లనుప శరభాది మృగోత్కర శరణ్యంబగు నరణ్యంబుఁ జొచ్చిపోయెనని చెప్పిన విని నారదుని వాల్మీకి మునీంద్రు డట మీది కథావిధానం బెట్టిదని యడుగుటయు.** **42**

**ప్రతి :** ఇట్లు, భరతుని, భరతాగ్రజుఁడు=రాముడు, అనునయించి=సముదాయించి, మరలించి=వెనుకకు పంపి, నాకలోకవాటంబు+అగు=స్వర్గద్వారమగు, చిత్రకూటంబు, కదలి=బయలుదేరి, సౌమిత్రి భూపుత్రులన్ కూడి=సీతాలక్ష్మణులతో కూడి, పోవునెడన్, అటవీమధ్యంబునన్=అడవిమధ్యలో, విరాధుండు అను, దైత్యాధముండు=అధముడైన రాక్షసుడు, అపరాధంబు+చేసి=తప్పుచేసి, దిగ్గన=హఠాత్తుగా, దగ్గఱి=సమీపించి, జగతీతనూభవను=సీతను, ఎత్తుకొని, గగనమార్గంబునకున్=ఆకాశమార్గమునకు, ఎగిరి, పోవునెడన్= వెళ్ళుచుండగా, వాఁడిబాణంబునన్=పదునైన బాణముతో, వానికంఠంబును, త్రుంచి=త్రెంచి, గారుడాస్త్రంబునన్=గరుత్మంతుని పేరుగల అస్త్రముతో, మరలన్, ఒయ్యనన్=నెమ్మదిగా, జనకనందనన్= సీతను, డించి, భయంబు, వాపి=పోగొట్టి, ప్రియంబు చూపి=ప్రేమ చూపించి, ఒయ్యనొయ్యనన్=మెల్లమెల్లగా,

అయ్యెడన్ (ఆ+ఎడన్)=ఆ ప్రదేశమున, ఉన్న, అత్రిమహాముని యాశ్రమంబునకున్, చని=వెళ్ళి, ఘనంబుగన్= గొప్పగా, ఆ ఘనుండు=ఆ గొప్పవాడు, చేయుపూజలన్, కైకొని=స్వీకరించి, రామచంద్రుడు, అచ్చటి, మునీంద్రులకున్=శ్రేష్ఠులగు మునులకు, దైత్యులవలని భయంబులేకుండన్=రాక్షసుల వల్ల భయం లేకుండా, అభయంబు ఇచ్చి, మన్ననన్=గౌరవముగా, కొన్ని దినంబులు, ఆయా మునుల యాశ్రమంబులన్, నిలుచుచు, వారలు, అనుపన్=అనుమతించగా, శరభాది మృగోత్కర శరణ్యంబు అగున్ అరణ్యంబున్=శరభము మున్నగు క్రూర/గొప్ప మృగములకు నివాసమగు అరణ్యమును, చొచ్చి=ప్రవేశించి, పోయెను=వెళ్ళెను, అని చెప్పిన విని, నారదుని వాల్మీకి మునీంద్రుడు, అటమీది=ఆ తరువాతి, కథావిధానంబు=కథాక్రమము, ఎట్టిది అని=ఎటువంటిది అని, అడుగుటయు...

**తా :** ఈ విధంగా భరతుణ్ణి భరతునికంటె పెద్దవాడయిన శ్రీరాముడు ఒప్పించి అయోధ్యకు మరలించి తాను లక్ష్మణునితో భూపుత్రి అయిన సీతతో కలసి స్వర్గలోకానికి ద్వారం వలె ఉన్న చిత్రకూటానికి వెళుతూ ఉండగా, అడవిమధ్యలో విరాధుడనే రాక్షసాధముడు, వీరియెడల తప్పుగా ప్రవర్తించి – దగ్గరగా వచ్చి జగతీతనూభవ (భూపుత్రి) అయిన సీతను ఎత్తుకుని ఆకాశమార్గాన పోసాగాడు. రాముడు వాడి కంఠం తెగగొట్టి, గారుడాస్త్రం వేసి సీతను నెమ్మదిగా ఆతడి భుజాలనుండి దింపి, భయం పోగొట్టి, ప్రియమైన మాటలు చెప్తూ నెమ్మది నెమ్మదిగా నడిపిస్తూ అత్రిమహాముని ఆశ్రమానికి వచ్చాడు. ఆ ఘనుడయిన మహర్షి ఎంతో విశేషంగా చేసే పూజలు స్వీకరించాడు. ఆ తరువాత అక్కడి మునీంద్రులకు రాక్షసులవల్ల మీకు ఏ భయమూలేకుండా రక్షిస్తాను అని అభయం ఇచ్చాడు. అత్రిమహర్షి ఆశ్రమం నుండి బయలుదేరి ఆయా మునుల ఆశ్రమాల్లో కొద్ది రోజులు ఉంటూ వారివద్ద వీడ్కోలు తీసుకుని శరభము మొదలయిన భయంకరమైన మృగాలకు నివాసమైన అరణ్యాలలోకి ప్రవేశించాడు అని నారదుడు చెప్పగా విని వాల్మీకి మునీంద్రుడు ఆ తరువాత కథ ఏవిధంగా నడిచింది అని అడుగగా...

**విశే :** కథను వేంగా నడిపించే లక్ష్యంతో, సంక్షిప్త రచనగా తీర్చింది మొల్లమాంబ. వాల్మీకి రచనకు, మొల్ల రామాయణానికి కథాక్రమంలో స్వల్ప భేదం ఇక్కడ కనిపిస్తుంది. వాల్మీకం ప్రకారం భరతునికి పాదుకనిచ్చిపంపిన తరువాత సీతాలక్ష్మణులతో కలిసి అత్రిమహాముని ఆశ్రమానికి వెళ్ళి, అనసూయ అత్రి దంపతుల దీవనలందుకొని, రాముడు ఆ పిమ్మట దండకారణ్యం చేరాడు. అక్కడ విరాధ రాక్షససంహారం జరిగింది. అది వాల్మీకంలో అరణ్యకాండ ఆరంభంలో కనిపిస్తుంది. విరాధ రాక్షసుణ్ణి సంహరించి, ఆతరువాత శ్రీరాముడు శరభంగ మహర్షిని, సుతీక్ష్ణ మహామునిని కలుసుకున్నాడు. సుతీక్ష్ణుని ఆశ్రమంలో రాక్షసులవల్ల మునులకు బాధలేకుండా అభయ ప్రదానం చేశాడు. సంక్షిప్తం చేసే ఉద్దేశంతో కాబోలు మొల్లమాంబ ఈ కథాక్రమాన్ని కొద్దిగా మార్చింది.

**క.** **జలజాక్ష! భక్తవత్సల!**
**జలజాసనవినుత పాదజలజాత! సుధా**

**జలరాశిభవ్యమందిర**
**జలజాకరచారుహంస! జానకినాథా!** **43**

**ప్రతి :** జలజాక్ష=తామరలవంటి కన్నులు గలవాడా!, భక్తవత్సల=భక్తుల ఎడల వాత్సల్యభావం కలవాడా!, జలజాసన వినుతపాదజలజాత!=బ్రహ్మగారిచే స్తుతింపబడిన పాదపద్మములు గలావాడా, సుధాజలరాశి భవ్యమందిర= పాలసముద్రమే మందిరముగా గలవాడా!, జలజాకరచారుహంస!=తామర కొలనులో విహరించే హంస, జానకినాథా!=జానకీదేవి భర్త!

ఈ పద్యం ఆశ్వాసాంత పద్యం. రాముని స్తుతించిన పద్యం.

**తా :** జలజాక్షా, భక్తవత్సలా, బ్రహ్మచేత స్తుతింపబడిన పాదపద్మములు గలవాడా, పాలసముద్రమే ఇల్లుగా గలవాడా, తామరకొలనులో విహరించే అందమైన హంసవంటివాడా! జానకీనాథా!

**గద్యము : ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజన వినుత కవితాచమత్కా రాతుకూరి కేసన సెట్టితనయ మొల్లనామధేయవిరచితంబైన శ్రీరామాయణమహాకావ్యంబునం దయోధ్యాకాండము సర్వము నేకాశ్వాసము.**

* * *

# అరణ్యకాండ

క. **మునిదత్త ధనుర్వేదా!**
**మునినాథ ప్రియసతీ సుపూజిత పాదా!**
**జనకార్చిత గుణధామా!**
**సనకాది స్తవ్య నామ! జానకిరామా!** **1**

**ప్రతి :** మునిదత్త=విశ్వామిత్ర మహర్షిచే ఇవ్వబడిన, ధనుర్వేదా!=ధనుర్వేదము కలవాడా!, అస్త్రాలుశస్త్రాలు విశ్వామిత్రుడు రామునకుఉపదేశించాడు, మునినాథ=మునులలో శ్రేష్ఠుడయిన గౌతముని, ప్రియసతీసు పూజితపాదా=ఇష్టురాలైన భార్య అహల్యచేత పూజింపబడిన మంచిపాదములు కలవాడా, జనకార్చిత= జనకమహారాజుచేత పూజింపబడిన, గుణధామా=ఉత్తమగుణములకు నెలవైనవాడా!, సనకాది= సనకుడుసనందుడు మొదలగు మహర్షులచేత, స్తవ్యనామ=స్తుతింపబడినపేరుగలవాడా!, జానకిరామా!= జానకీపతి అయిన ఓ శ్రీరామాచంద్రా!

**తా :** విశ్వామిత్రుడు తనతోపాటు యజ్ఞరక్షణకు తీసుకువెళ్ళిన శ్రీరామునికి ఎనెన్నో అస్త్రాలు, శస్త్రాలు ఉపదేశించాడు. గౌతమ పత్ని అహల్యకు శాపవిమోచనం చేసి ఆమెచేత పూజింపబడ్డాడు. తనకు శాపవిమోచన చేసిన రామ పాదాలను ఆమె భక్తితో పూజించింది. పవిత్రమయిన మహత్త్వపూర్వకమైన ఆ పాదాలు కడిగి జనక మహారాజు సీతనిచ్చి వివాహం చేశాడు - సనకాది మహర్షులచేత పొగడబడుతూ జానకి రాముడయ్యాడు. జానకిరామా! అని సంబోధిస్తూ తరువాతి కథ.

**విశే :** అరణ్యకాండ ఆరంభంలో చెప్పిన ఈ పద్యంలో బాలకాండలోని విశేషాలు కొన్ని వరుసగా చెప్పబడ్డాయి.

వ. **శ్రీనారదమహామునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెఱంగువినిపించెద** **2**

**తా :** శ్రీ నారద మహామునీశ్వరుడు వాల్మీకికి తెలిపిన విధమును వినిపించెదను.

## పంచవటిలో సీతారాముల మధుర జీవనము

చ. **"ఇతనికిఁ బాదచారితన మేటికి వచ్చెనో? పట్టభద్రుఁ డీ**
**సతి నవరూప రేఖలను జక్కని దయ్యును నిట్టి దుర్దశల్**
**ప్రతివసియించు టెట్లొ? రతిరాజ సమానుల వీరి నేల యీ**
**గతిఁ బడఁద్రోచె బ్రహ్మ"యని కాంతురు చెంచెత లమ్మహాత్ములన్.** **3**

**ప్రతి :** పట్టభద్రుఁడు=పట్టాభిషేకం పొందదగిన, ఇతనికిన్=ఈతనికి, పాదచారి తనము=కాలినడకను వెళ్లవసిన అవస్థ, ఏటికి వచ్చెనో?=ఎందుకు వచ్చిందో? ఈ సతి=ఈ స్త్రీ, నవరూపరేఖలను=కొత్తదైనరూపంతో కాంతిరేఖలలో, చక్కని దయ్యును=ఎంతోచక్కనిది అయికూడా, ఇట్టి=ఇలాంటి, దుర్దశల్=కష్టకాలాల్లో,

ప్రతివసియించుటెట్లొ?=ఎలా నివసిస్తారో?, రతిరాజసమానులన్=మన్మథులతో సమానులయిన, వీరిని= ఈ దంపతులను, బ్రహ్మ=సృష్టికర్త, ఏల=ఎందుకు, ఈ గతిన్=ఈస్థితిలో, పడఁద్రోచెన్=పడేసాడు?, అని=అని ఆశ్చర్యంతో, చెంచెతలు=చెంచుకాంతలు, అమ్మహాత్ములన్=ఆ గొప్పవారిని, కాంతురు= చూస్తున్నారు.

**తా :** సీతారామలక్ష్మణులు అరణ్యంలో కాలినడకను తిరుగాడుతున్నారు. ముందుగా అక్కడి చెంచువనితలకు రాముడు కనబడ్డాడు. పట్టాభిషేక కళతో ఒప్పెడి అతన్ని చూసి–ఈతనికి ఇలా కాలినడకను తిరిగే అవస్థ ఎందుకు వచ్చిందో కదా! అనుకున్నారు. చక్కని రూపలావణ్యాలతో కూడి ఉన్న ఈ స్త్రీకి ఈ దుర్దశ ఏమిటో? ఈ కాలాన్ని వీళ్లు ఎలా గడుపుతారో? రతీమన్మథులవంటి ఈ ఆలుమగలను బ్రహ్మగారు ఇలాంటి దుస్థితిలో ఎందుకు పడేసాడో! అనుకుంటూ ఆమహాత్ముల్ని చెంచెతలు చూస్తున్నారు ఆశ్చర్యంతో.

**సీ.** **నడువనేరని కొమ్మ యడుగులు పొక్కులై**
**శర్కర స్థలముల శ్రమముఁజెందె**
**వీచిన చేతుల వ్రేళ్ళు నెత్తురు గ్రమ్మి**
**పొటమర్లు కెంపుల పోల్కి నమరె**
**వడి గాలి సుడివడి వాడిన లేఁదీఁగ**
**భావంబునను మేని చేవ తఱిగెఁ,**
**బూర్ణ చంద్రుని కాంతి పున్నమ వేకువఁ**
**గనుపట్టు గతి మోము కళల విడిచె**

**తే.** **ధవుని నడుగడుగునకుఁ గైదండఁ గొనుచు**
**నెగడు దప్పిని నిట్టూర్పు లెగసి చిగురుఁ**
**బెదవు లెండఁగ, నీడకు నుదిలగొనుచు**
**మనసులోఁజేవ యూఁతగఁ జనెడు వేళ.** **4**

**ప్రతి :** నడువనేరని=చాలాదూరం నడవడంరాని, కొమ్మ=స్త్రీ, సీత, అడుగులు=పాదాలు, పొక్కులై=పొక్కులెక్కి, శర్కర=గులకరాళ్లు, స్థలముల=నేలలమీద, శ్రమమున్‌చెందె=కష్టపడ్డాయి, వీచిన చేతుల వ్రేళ్లు=నడిచేటప్పుడు చేతులు కూడా కదుల్తాయి, అలావీచిన చేతుల వ్రేళ్లు. నెత్తురుగ్రమ్మి=నెత్తురుజిమ్మి, పొటమర్లు=బొబ్బలు ఎక్కాయి, కెంపుల పోల్కి నమరె=ఆ బొబ్బలు కెంపుల్లా ఎఱ్ఱగా ప్రకాశిస్తున్నవి, వడిగాలి సుడివడి= గాలివేగంగా వీచి చుట్టుముట్టడంవల్ల, వాడిన లేఁదీఁగ=వాడిపోయిన లేతతీగ, భావంబునను= అనిపించెడి, మేని చేవ తఱిగె= శరీరంలోని శక్తితగ్గిపోయింది, పూర్ణచంద్రుని కాంతి=పూర్ణచంద్రుని వెన్నెల, పున్నమివేకువ= పున్నమి నాటి ఉదయకాలంలో, కనుపట్టుగతి=కనిపించేరీతిగా, మోము కళలవిడిచి=ముఖంలోని కళలన్నీపోయి, అడుగడునకున్=అడుగడుక్కి, ధవుని=భర్తయొక్క, కైదండన్=భుజమును, కొనుచు=ఆసరాగా

చేసుకుంటూ!, నెగడు=ఎక్కువవుతున్న, దప్పిని=దాహంవల్ల, నిట్టూర్పులెగసి=నిట్టూర్పులురావడం వల్ల, చిగురుపెదవులు= చివుళ్లవంటి సుకుమారమయిన పెదవులు, ఎండగ=ఎండిపోగా, నీడకున్=నీడకోసం, ఉదిలగొనుచు= తొందరపడుతూ, మనసులోన్=మనస్సులో, చేవ=శక్తిని, ఊఁతగన్=ఊతగా, చనెడు వేళ=వెళ్లేసమయంలో,

**తా :** ఎక్కువ దూరం నడిచే అలవాటులేని సీతాదేవి పాదాలు పొక్కులెక్కాయి. సన్నని గులకరాళ్లమీద ఆ పొక్కులతో నడవలేక అవస్థపడుతోంది. నడిచేటప్పుడు ఊగే చేతివ్రేళ్లు కొద్దిగా చిట్లి రక్తం చిమ్మాయి. బొబ్బలెక్కాయి. ఆ బొబ్బలు రక్తంతో కలిసి రత్నాల్లా ఉన్నాయి. గట్టిగా వీచిన గాలికి వడలిపోయిన లేత తీగలా సీతాదేవి శరీరంలో శక్తిసన్నగల్లింది, పూర్ణచంద్రుడు రాత్రంతా చక్కని వెన్నెల కాస్తాడు కాని, తెల్లవారే వేళకు వెలవెలబోతాడు. సీతమ్మ నడిచినడిచి అలసిపోవడంతో ఆమె ముఖం ఆ ఉదయ చంద్రునిలా కళ తప్పింది. అడుగడుక్కీ భర్తభుజాన్ని అండగా చేసుకుని, ఎండకు నోరెండిపోగా, నిట్టూర్పులతో పెదవులు ఎండిపోగా నీడ ఎక్కడ దొరుకుతుందా అని త్వరపడుతూ శరీరంలో శక్తిలేకున్నా, మనస్సులోని ఉత్సాహాన్ని శక్తిగా చేసుకుని నడిచి వెళుతున్నప్పుడు...

**విశే :** అతిసుకుమారి, రాజపుత్రి అయిన సీత అడవులలో నడిచే సమయంలో పడే అవస్థను మొల్ల అలతి అలతి తెలుగుపదాలతో-స్వభావోక్తిరమ్యంగా వర్ణించింది.

**వ. ఇట్లు సీతయు రాముండును సత్యఋషిం బోని సౌమిత్రియుఁగతిపయ ప్రయాణంబులఁ బంచవటికిం జని, సంతోష భరితాంతరంగులై. 5**

**ప్రతి :** ఇట్లు=ఈ విధంగా, సీతయు, రాముండును, సత్యఋషిన్‌పోని=సత్యఋషిని పోలిన, సౌమిత్రియున్= లక్ష్మణుడును, కతిపయ ప్రయాణంబులన్=కొన్ని ప్రయాణములతో, పంచవటికిన్, చని, సంతోష భరితాంతరంగులై=ఆనందముతో నిండిన మనస్సులు కలవారై...

**తా :** ఇలా సీత రాముడు సత్యఋషివంటి సౌమిత్రి కొన్నిప్రయాణాలు చేసి పంచవటికి చేరుకుని ఆనందంతో నిండిన మనస్సులు కలవారయ్యారు.

**విశే :** లక్ష్మణుడు నిజమైన ఋషివంటివాడు అని మొల్ల ప్రత్యేకంగా చెప్పింది.

**క. అచ్చటఁ గొన్ని దినంబులు**
**ముచ్చటపడి యుండఁదలఁచి ముని ముఖ్యులచే**
**మచ్చికఁ దమ్ముఁడుఁ దానును**
**గ్రచ్చుఱ నొక పర్ణశాలఁ గావించి తగన్. 6**

**ప్రతి :** అచ్చటన్=ఆ పంచవటిలో, కొన్నిదినంబులు=కొన్నిరోజులు, ముచ్చటపడి=కోరికతో, ఉండదలఁచి= ఉండాలనుకొని, మునిముఖ్యులచే=మునిశ్రేష్ఠులచే, మచ్చికన్=ప్రేమతో, తమ్ముఁడున్=తమ్ముడును, తానును= తానును, క్రచ్చుఱన్=వేగముగా, ఒక పర్ణశాలన్, ఆకులతో ఇల్లును, తగన్=బాగుగ, కావించి=కట్టి.

**తా :** ఆ పంచవటీ ప్రదేశం నచ్చడంతో ఆ ప్రదేశంలో కొన్ని రోజులు ఉండాలనుకున్నారు, ఆ ప్రాంతంలోని మునిముఖ్యుల ఆదరణ కూడా ఉంది. తాను, తమ్ముడు కలిసి వేగంగా ఒక పర్ణశాలను నిర్మించారు.

**ఆ. అందు రామచంద్రుఁ డనుజన్ముఁడును దాను**
**గొన్ని వాసరంబు లున్నవేళ**
**వికృత వేషధారి వేవేగ నట శూర్ప**
**ణఖ యనంగ దైత్య నారి యోర్తు. 7**

**ప్రతి :** అందు=ఆ పర్ణశాలలో, రామచంద్రుడు, అనుజన్ముడు=తమ్ముడును, తాను=తాను, కొన్నివాసరంబులు=కొన్నిరోజులు, ఉన్నవేళ=ఉండగా, వికృత వేషధారి=విరూపమైన వేషం ధరించిన, శూర్పణఖయనంగ=శూర్పణఖ అనే, దైత్యనారి=రాక్షసస్త్రీ, ఓర్తు=ఒకతె, వేవేగన్=అతివేగంతో, అట=అక్కడకు..(వచ్చెను.)

**తా :** ఆ పర్ణశాలలో సీతారామలక్ష్మణులు కొన్ని రోజులుండగా, వికారమగు వేషము ధరించిన శూర్పణఖ అను ఒకానొక రాక్షస స్త్రీ అక్కడకు మిక్కిలి వేగముగా...

## చుప్పనాక రామలక్ష్మణుల మోహించి పరాభూతురాలగుట

**వ. రాముని గని ప్రేమాభిరామం బగు మనంబునఁ దన్నుఁ గామించి రమ్మనిన, రామచంద్రుండు సౌమిత్రిం జూప, నతఁడు మున్ను మా యన్న నభిలషించుటంజేసి నాకు దోషంబు గాన నీ వా రాముని కడకు మరలఁ జనుమన్న నది యట్లచేసిన, రామచంద్రుండు తిరుగ లక్ష్మణుం జూపినఁ గోపించి యా రాక్షసి మనుజేంద్ర సూనుల దండింప దలంచిన నెఱింగి, భరతానుజుండు దాని నాసికా కర్ణంబులు గోసివైచిన నది నెత్తురు జొత్తిల్లఁ బసిపాపయుం బోలి యేడ్చుచు ఖర దూషణాది సోదరులకుం జెప్పిన వారు గనలి రా క్షణంబున. 8**

**ప్రతి :** రామునిన్, కని=చూచి, ప్రేమాభిరామంబు అగు=ప్రేమచే సుందరమైన, మనంబునన్=మనస్సుతో, తన్నున్, కామించి=కోరి, రమ్ము, అనినన్=అనగా, రామచంద్రుండు, సౌమిత్రిన్, చూపన్, అతఁడు, మున్ను=ముందుగా, మా యన్నన్, అభిలషించుటన్+చేసి=కోరుకొనుట చేత, నాకున్, దోషంబు, కానన్, నీవు, ఆ రాముని కడకు, మరలన్, చనుము=వెళ్ళుము, అన్నన్=అనగా, అది, అట్ల=అదేవిధంగా, చేసినన్=చేయగా, రామచంద్రుండు, తిరుగన్=మరల, లక్ష్మణున్, చూపినన్=చూపించగా, కోపించి, ఆ రాక్షసి, మనుజేంద్ర సూనులన్=రాజకుమారులను, దండింపన్=శిక్షింపగా, తలంచినన్=భావింపగా, ఎఱింగి=తెలిసికొని, భరతానుజుండు=భరతుని తమ్ముడగు లక్ష్మణుడు, దానినాసికా కర్ణంబులున్=ఆమె యొక్క ముక్కు చెవులను, కోసివైచినన్, అది, నెత్తురు, జొత్తిల్లన్=కారుతుండగా, పసిపాపయున్ పోలి=పసిపాపవలె, ఏడ్చుచు, ఖరదూషణాదిసోదరులకున్, చెప్పినన్, వారు, కనలిరి=బాధపడిరి, ఆ క్షణంబునన్=ఆ సమయంలో–

**తా :** అలావచ్చిన శూర్పణఖ రాముణ్ణి చూసి అతని సౌందర్యానికి కామించి రాముని తనతో రమ్మంది. రాముడు నేను కాదు అని సౌమిత్రిని చూపించాడు, శూర్పణఖ సౌమిత్రి వద్దకు వెళ్ళింది. సౌమిత్రి నువ్వు

ముందు మా అన్నను కోరుకున్నావు. అందువల్ల నేను స్వీకరించడం దోషం కాబట్టి నువ్వు ఆ రాముని దగ్గరకే మళ్లీ వెళ్లు అన్నాడు. శూర్పణఖ అలాగే రాముని వద్దకు వెళ్లింది. రాముడు మళ్లీ లక్ష్మణుని చూపించాడు. ఆమె కోపంతో ఆ రాజకుమారుల్ని దండించాలనుకుంది. అది గ్రహించిన లక్ష్మణుడు ఆమె ముక్కుచెవులు కోసేసాడు. నెత్తురు కారుతూ ఉండగా పసిపిల్లలా ఏడుస్తూ ఖరుడు, దూషణుడు అనే తన సోదరులకు చెప్పింది. శూర్పణఖ స్థితి చూచిన రాక్షసులకు చాలా కోపం వచ్చింది. వెంటనే... వారు.

**విశే :** చుప్పనాక – శూర్పణఖా శబ్దభవము. ఓర్వలేనితనము గల స్త్రీని చుప్పనాతి అని వాడుకలో ఉంది. బహుశః అది చుప్పనాక శబ్దానికి మార్పు కావచ్చు.

**క. పదునాల్గు వేల దైత్యులు**
**మదమున సోదరులు గొల్వ మండుచు శూరా**
**స్పద మగు రథ నికరముతోఁ**
**గదనంబున రాము కడకు ఖరుఁ దేతెంచెన్. 9**

**ప్రతి :** పదునాల్గువేల=పదునాల్గువేల, దైత్యులు=రాక్షసులు, మదమున=మదముతో, సోదరులు=తోడబుట్టిన వాళ్లు, కొల్వ=సేవించగా, మండుచు=మండిపడుతూ, శూరాస్పదమగు=శూరులకుతగిన, రథనికరముతోన్= రథసమూహముతో, కదనంబునన్=యుద్ధానికి, రాముకడకున్=రాముచెంతకు, ఖరుఁడు=ఖరుడు అనే రాక్షసుడు, ఏతెంచెన్=వచ్చెను.

**తా :** మదించిన పదునాల్గు వేల రాక్షస సోదరులు సేవిస్తూ ఉండగా శూరులకు తగిన రథాలతో మండిపడుతూ ఖరుడు యుద్ధసన్నద్ధుడై రాముని వద్దకు వచ్చాడు.

## ఖర దూషణాది రాక్షస సంహారము

**ఆ. ఖరుఁడు వచ్చినట్టి కలకలం బాలించి**
**రాఘవుండు తనదు రమణియొద్దఁ**
**దొలఁగ కుండ ననుజుఁ దోడుగాఁ గాపుంచి,**
**బెదర కంతఁ గలని కెదిరి నిలిచె. 10**

**ప్రతి :** ఖరుఁడువచ్చినట్టి, కలకలంబు=సందడి, ఆలించి=విని, రాఘవుండు=శ్రీరాముడు, తనదు=తనయొక్క, రమణియొద్దన్=స్త్రీ అయిన సీత దగ్గర, తొలఁగకుండ=అటూ ఇటూ వెళ్లకుండ, అనుజున్=తమ్ముని, తోడుగాన్=తోడు ఉండేలా, కాపుంచి=కాపలాపెట్టి, బెదరక=భయపడక, అంతన్=అప్పుడు, కలనికి= యుద్ధానికి, ఎదిరినిలిచె=ఎదురుగానిలచాడు. సన్నద్ధమయ్యాడు.

**తా :** ఖరుడు వచ్చిన సందడివిని రాముడు సీతకు రక్షణగా తమ్ముడు లక్ష్మణుని ఉంచి, ఏమాత్రం బెదరకుండా ఖరునితో యుద్ధానికి సిద్ధపడ్డాడు.

**శా. ఆ వేళన్ ఖరుఁ డుగ్రవృత్తి లయకాలాభీల ఘోరాకృతుల్**
**దైవారన్, గజవాజి సంఘములతో, దైత్యాళితో, భూరి రో**
**షావిర్భూత మనస్కుఁడై నడిచె గర్వారంభ సంరంభుఁడై**
**దేవవ్రాతము భీతి నొంది కలఁగన్ తేజంబు సొంపారఁగన్. 11**

**ప్రతి :** ఆవేళన్=ఆసమయంలో, ఖరుడు, ఉగ్రవృత్తి=భయంకరమైన ప్రవర్తనతో, లయకాల+ఆభీల= ప్రళయకాలమువలె భయంకరమైన, ఘోరాకృతుల్=ఘోరమైన రూపములు, దైవారన్=అతిశయించగ, గజవాజి సంఘములతో=ఏనుగుల గుఱ్ఱముల సమూహాలతో, దైత్యాళితో=రాక్షసుల మూకతో, రోషావిర్భూతమనస్కుఁడై= రోషము పుట్టిన మనస్సుకలవాడై, మనస్సులో కోపము కలవాడై, గర్వారంభసంరంభుఁడై=గర్వముతో ఉద్రేకించినవాడై, దేవవ్రాతము=దేవతల సమూహము, భీతినొంది కలగన్=భయపడి కలతచెందగా, నడిచె=యుద్ధానికి నడిచాడు, తేజంబు=తన తేజస్సు, సొంపారగన్= అందగించగా.

**తా :** ఆ సమయంలో ఖరుడు భయంకరుడై, ప్రళయకాలంలో వలె ఘోరమైన రూపాలు విజృంభించగా, ఏనుగుల గుఱ్ఱాల సమూహంతో, రాక్షసులమూకతో మనస్సునిండా కోపంతో గర్వం తోడుకాగా దేవతలు భయపడి కలతచెందగా తన తేజస్సు ప్రకాశింపగా యుద్ధానికి నడిచాడు (వచ్చాడు).

**వ. ఇట్లు ఖరుండు సనుదెంచి భయంకరంబుగా రణంబు సేయు సమయంబున. 12**

**ప్రతి :** ఇట్లు = ఈ విధంగా, ఖరుండు= ఖరుడు, భయంకరంబుగా= భయంకరంగా, రణంబు= యుద్ధం, సేయు సమయంబున= చేసే సమయంలో..

**తా :** ఖరుడు ఈవిధంగా వచ్చి భయంకరంగా యుద్ధంచేసే వేళలో

**ఉ. అప్పుడు రామచంద్రుఁడు భయంకర రౌద్ర రసంబు కన్నులన్**
**నిప్పులు రాల్చుచున్ నెరయ, నిర్జరు లార్వ, విచిత్ర శస్త్రముల్**
**కుప్పలుగాఁగ నేయుచును, గుంజరవాజి రథావళుల్ ధరన్**
**దప్పక కూల్చుచున్, రుధిరధారలఁ దేల్చె సురారి సంఘమున్. 13**

**ప్రతి :** అప్పుడు=ఆ సమయంలో, రామచంద్రుఁడు, భయంకర రౌద్రరసంబు=భయంకరమయిన రౌద్రరసము, కన్నులన్=కన్నులనుండి, నిప్పులు రాల్చుచున్=నిప్పులవలెరాలుస్తూ, నెరయ=ప్రసరిపంగా, నిర్జరులు= దేవతలు, ఆర్వన్=అరవగా, విచిత్రశస్త్రముల్=విచిత్రమైన బాణాలు, కుప్పలుగాఁగ నేయుచున్=కుప్పలు కుప్పలుగాపడేలా ప్రయోగిస్తూ, కుంజరవాజిరథావళుల్=ఏనుగుల, గుఱ్ఱాల, రథాల వరుసలు, ధరన్= భూమిమీద, తప్పక, కూల్చుచున్=పడగొడుతూ, రుధిరధారలన్=నెత్తుటి ప్రవాహాలలో, సురారిసంఘమున్= రాక్షససమూహాన్ని, తేల్చె=తేలేలా చేసాడు.

**తా :** ఆ వేళలో రాముడు భయంకరమైన కోపంతో కళ్లనుండి నిప్పులు కురిపిస్తున్నాడా అన్నట్లు బాణాలు ప్రయోగించాడు. దేవతలు భయంతో కేకలు పెట్టారు. చిత్రవిచిత్రాలయిన బాణాలు కుప్పలుకుప్పలుగా పడేలా ప్రయోగించి ఏనుగుల్ని, గుఱ్ఱాలి, రథాల్ని కూల్చేసాడు. యుద్ధభూమిలో రక్తం ఏరులై ప్రవహిస్తూ ఉంటే రాక్షసులు – ఆ ప్రవాహంలో తేలేలా చేసాడు.

**వ. అట్టి సమయంబున. 14**

**తా :** అలాంటి వేళలో

**క. కరితురగ స్యందనములుఁ**
**బరివారముఁ దెగిన పిదపఁ బటు రోషమునన్**
**గరకర పడుచును నెదిరిన**
**ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరుని శిరంబున్. 15**

**ప్రతి :** కరితురగస్యందనములున్=ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు; పరివారమున్=యుద్ధం చేయడానికి వచ్చిన సైనికులు, తెగిన=చనిపోయిన, పిదపన్=తరువాత, పటురోషమునన్=అధికమయిన కోపంతో, కరకరపడుచును= మండిపడుతూ, ఎదిరిన=యుద్ధానికి తలపడగా, ఖరుని శిరంబున్=ఆ ఖరుని తలను, ఖరకర వంశజుడు= తీక్ష్ణమైన కిరణములు గల సూర్యుని వంశమువాడైన రాముడు, త్రుంచె=ఖండించాడు.

**తా :** ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, సైనికులు చనిపోయిన తరువాత పట్టరాని కోపంతో మండిపడుతూ యుద్ధానికి తలపడిన ఖరుని శిరస్సును సూర్యవంశపు రాజయిన శ్రీరాముడు ఖండించాడు.

**వ. త్రుంచినం గని తీంద్రంబుగా. 16**

**తా :** త్రుంచగా చూసి కోపముతో –

**క. ఘోషించి, రామచంద్రుని**
**దూషించుచు వచ్చినట్టి దూషణు మీఁదన్**
**రోషించి, సురలు కదు సం**
**తోషింపఁగ వానిశిరముఁ ద్రుంచెఁ గడంకన్. 17**

**ప్రతి :** ఘోషించి=అరిచి, రామచంద్రుని, దూషించుచు=నిందిస్తూ వచ్చినట్టి, దూషణు మీఁదన్=దూషణుడనే రాక్షసుని మీద, రోషించి=కోపించి, సురలు=దేవతలు, కదు=మిక్కిలి, సంతోషింపగన్=సంతోషించేటట్లు, కడంకన్=పూనికతో, శిరమున్=తలను, త్రుంచెన్=ఖండించాడు,

**తా :** ఖరుని చంపిన విషయం చూచి కోపంతో అరచి, రామచంద్రుణ్ణి నిందిస్తూ వచ్చిన దూషణుని మీద కోపంతో దేవతలు ఆనందించేలా దూషణుని శిరస్సును శ్రీరాముడు ఖండించాడు.

ఆ. త్రిశిరుఁ డంతఁ గనలి దివ్యాస్త్ర సంపద
రాముమీఁద జూపి రణ మొనర్చె,
మూఁడు శరము లతఁడు ముదలించి యట వాని
మూఁడు తలలఁ ద్రుంచె మొగ్గరముల. **18**

ప్రతి : త్రిశిరుఁ డంతన్=ఈవార్త విన్న త్రిశిరుడు అనే 'మూడుతలలుగల' రాక్షసుడు, కనలి=కోపించి, దివ్యాస్త్రసంపద=తాను తపస్సుద్వారా సంపాదించిన దివ్యములయిన అస్త్రముల సంపదను, రాముమీఁద=శ్రీరామునిమీద, చూపి=ప్రయోగించి, రణమొనర్చె=యుద్ధము చేసాడు, అతడు=శ్రీరాముడు, మూఁడుశరములు=మూడుబాణాలు, ముదలించి=ప్రయోగించి, అటన్=అక్కడ, వాని=త్రిశిరుని, మూఁడుతలలన్=మూడుతలలను, మొగ్గరములన్=యుద్ధవ్యూహాలలో, త్రుంచెన్=ఖండించెను.

తా : దూషణుడు ఖండింపబడ్డాడు అనే వార్త విన్న త్రిశిరుడు కోపంతో వచ్చి తన దివ్యాస్త్రాలను రామునిపై ప్రయోగించి యుద్ధం చేయసాగాడు. శ్రీరాముడు యుద్ధవ్యూహానికి తగినవిధంగా ఆ త్రిశిరుని– మూడుతలలు మూడు బాణాలు ప్రయోగించి ఖండించాడు.

**వ. ఇట్లు ఖరాది రాక్షసుల శిక్షించి, జయంబు గొని, ధను వెక్కుడించి, మరలి పర్ణశాల కేతెంచి, తమ్ముఁడును దానును సమ్మదంబునం గలసియున్న సమయంబున. 19**

ప్రతి : ఇట్లు=ఈ విధంగా, ఖరాదిరాక్షసులన్=ఖరుడు మున్నగు రాక్షసులను, శిక్షించి=దండించి, జయంబున్ కొని=విజయమును పొంది, ధనువు=విల్లు, ఎక్కుడించి=దించి, మరలి, పర్ణశాలకు, ఏతెంచి=వచ్చి, తమ్ముఁడును, తానును, సమ్మదంబునన్=ఆనందముతో, కలసియున్న సమయంబునన్.

తా : ఇలా ఖరుడు మొదలయిన రాక్షసులను జయించి, ధనుస్సుదింపి. పర్ణశాలకు వచ్చి, తమ్ముడు తాను ఆనందంగా ఉన్న సమయంలో.

## శూర్పణఖ వలన సీతా సౌందర్యమును విన్న రావణుని కామాంధత

చ. చలమున నంత శూర్పణఖ సయ్యన లంకకు నేఁగి, రావణుం
గొలువునఁ గాంచి మ్రొక్కి, తనకున్ నృపసూనులు సేసినట్టి చేఁ
తలు వినుపించి, వారు తమ తండ్రి యనుజ్ఞను వచ్చి, కానలో
పలఁ దిరుగాడు చందములుఁ బన్నుగ నేర్పడఁ జెప్పి పిమ్మటన్. **20**

ప్రతి : అంత=అంతట, చలమునన్=పట్టుదలతో, శూర్పణఖ, చయ్యన=వేగముగ, లంకకున్=లంకకు, ఏఁగి=వెళ్లి, రావణున్, కొలువునన్=కొలువులో, కాంచి=చూసి, మ్రొక్కి=నమస్కరించి, నృపసూనులు=రాజకుమారులు, తనకున్=తనకు, సేసినట్టి=చేసిన, చేతలు=పనులు, వినుపించి=చెప్పి, వారు=ఆ రామలక్ష్మణులు, తమ తండ్రి యనుజ్ఞను=తమ తండ్రిగారి ఆనతితో, వచ్చి=అరణ్యానికి వచ్చి, కానలోపలన్=

అడవిలో, తిరుగాడు చందములున్=విహరిస్తున్న విధానాలను, పన్నుగ నేర్పడన్=చక్కగా వివరంగా, చెప్పి, పిమ్మటన్= ఆ తరువాత.

**తా :** అప్పుడు శూర్పణఖ ఈ రాజకుమారులను ఎలాగయినా శిక్షించాలి అనే పట్టుదలతో లంకకువచ్చి, కొలువుదీరిన అన్న రావణునికి రామలక్ష్మణులు తన ఎడల ప్రవర్తించిన తీరు, చేసిన చేతలు వివరించింది. ఆ రాజకుమారులు వారి తండ్రిగారి ఆజ్ఞతో ఆడవికి వచ్చి సంచరించే విధానాలన్నీ చెప్పింది. ఆ తరువాత.

**క.** **ఆ రాము భార్య విభ్రమ**
**మే రాజకుమార్తెలందు నెఱుఁగము విని మున్**
**ధారుణిలోపలఁ గామిను**
**లా రమణికి సాటి పోల రభినుతి సేయన్.** **21**

**ప్రతి :** ఆ రాము భార్య=ఆ రాముని భార్య, విభ్రమము=విలాసము, ఏ రాజకుమార్తె లందున్=ఏ రాజకుమారి కలలోనూ, మున్=ఇంతకు పూర్వము, వినిఎఱుఁగము=వినలేదు, ధారుణిలోపలన్=భూమిలో, కామినులు=స్త్రీలు, ఆ రమణికిన్=ఆ మనోహరికి, అభినుతిసేయన్=కొనియాడాలి అనుకుంటే, సాటిపోలరు=సాటిరారు.

**తా :** ఆ రాముని భార్య సౌందర్యం, విలాసం ఏ రాజకుమారికలకు లేదు ఉన్నట్లు వినలేదు. ఆమెను కొనియాడాలి అంటే ఆమెకు సాటియైన స్త్రీలు ఎక్కడా కానరారు. లేరు.

**సీ.** **కన్నులు కలువలో? కాము బాణంబులో?**
**తెలివిగా నింతికిఁ దెలియరాదు**
**పలుకులు కిన్నెర పలుకులో? చిలుకల**
**పలుకులో? నాతి కేర్పఱుపరాదు**
**అమృతాంశు బింబమో? యద్దమో? నెమ్మోము**
**తెంపుతో సతికి భావింపరాదు**
**కుచములు బంగారు కుండలో? చక్రవా**
**కమ్ములో? చెలి కెఱుఁగంగరాదు**

**తే.** **కురులు నీలంబులో? తేఁటి గుంపు లొక్కొ**
**పిఱుఁదు పులినంబొ? మన్మథు పెండ్లి యరుఁగొ?**
**యనుచుఁ గొందఱు సంశయం బందుచుండ**
**వెలఁది యొప్పారు లావణ్య విభ్రమముల.** **22**

**ప్రతి :** ఇంతికిన్=ఆ స్త్రీకి, కన్నులు, కలువలో?=కలువపువ్వులో, కాము బాణంబులో=మన్మథుని బాణాలో (పువ్వులో) తెలివిగాన్=స్పష్టముగా, తెలియరాదు=తెలియవచ్చుటలేదు. నాతికి=ఆ స్త్రీకి, పలుకులు=మాట్లాడిన

మాటలు, కిన్నెరపలుకులో=కిన్నెర అనే వాద్యపు ధ్వనిలో, చిలుకలపలుకులో=చిలకపలుకులో, ఏర్పఱుపరాదు= విడదీసి చెప్పడానికి వీలుకావడం లేదు, సతికి=ఆమెకు, నెమ్మోము=నిండుముఖము, అమృతాంశుబింబమో= చంద్రబింబమో, అద్దమో=అద్దమో, తెంపుతో=సాహసంచేసి, భావింపరాదు=ఇది అని అనుకోవడానికి లేదు, చెలికిన్=ఆ చెలికి, కుచములు=చన్నులు, బంగారుకుండలో, చక్రవాకమ్ములో=చక్రవాకపక్షులో, ఎఱుగంగరాదు= తెలుసుకోలేకపోతున్నారు, కురులు=జుట్టు, నీలంబులో=నీలాలో, తేటిగుంపులు ఒక్కొ=తుమ్మెదగుంపులో, పిఱుదు=పిఱ్ఱ, పులినంబొ=ఇసుకదిబ్బొ, మన్మథుని పెండ్లి అరుగొ= మన్మథుని పెళ్ళికి సిద్ధం చేసిన వేదికయేమో, అనుచు, కొందఱు, సంశయంబందుచుండ=సందేహపడుచుండ, వెలది=స్త్రీ, లావణ్యవిభ్రమముల= లావణ్యంతో విలాసంతో కూడిన సౌందర్యంతో, ఒప్పారు=ప్రకాశిస్తున్నది.

**తా :** సీతాదేవి కన్నులు కలువలో, మన్మథుని బాణాలో తెలియటం లేదు. ఆమె పలుకులు కిన్నెరనాదమా, చిలుకపలుకులా విడదీసి చెప్పలేము. ఆమె ముఖము చంద్రబింబమా, అద్దమా? ఆమె స్తనములు బంగారు కుండలా? చక్రవాకపిట్టలా? ఆమె తలకట్టు నీలాలా? తుమ్మెదల గుంపా? ఆమె పిఱుదు ఇసుకదిబ్బా? మన్మథుని పెళ్లివేదికా? అనుకుంటూ కొందఱు సంశయపడుతుండగా ఆమె లావణ్యంతో, విలాసంతో కూడిన సౌందర్యంతో ప్రకాశిస్తోంది.

**విశే :** కావ్యాలలో అంగాంగవర్ణన చేసేటప్పుడు - కొన్ని కొన్ని శరీర భాగాలను కొన్నికొన్నిటితో పోలుస్తారు. ఆ పోలికగా గ్రహించే ఉపమానాలను - కవిసమయం అంటారు. ఉదాహరణకు కళ్లను పోల్చే సందర్భంలో తామరలతో, కలువలతో, చేపలతో పోలుస్తూ ఉంటారు. అలాంటి కవితాసామగ్రిని తీసుకుని మొల్ల ఈ పద్యం వ్రాసింది. సీతాదేవి సౌందర్యాన్ని శూర్పణఖ రావణునికి వర్ణించి చెప్తున్న సందర్భమిది.

ఇక్కడ పిఱుదును - మన్మథుని పెండ్లి అరుగుగా సంభావించడం మొల్ల చేసిన వినూత్నమైన స్వతంత్రకల్పన.

క. **కలదో! లేదో! యనుచును**
**బలుమఱు నెన్నడుముఁ జూచి పలుకుదు రితరుల్.**
**బలిమో! కలిమో! యనుచును**
**బలుమఱు జఘనంబుఁ జూచి పలుకుదు రితరుల్.** **23**

**ప్రతి :** కలదో!=ఉందో!, లేదో=లేదో!, అనుచును=అంటూ, పలుమఱు=అనేక పర్యాయాలు, నెన్నడుమున్- నెఱ+నడుము=మనోహరమైన నిండు నడుమును, చూచి=చూచి, పలుకుదురు=అంటారు, ఇతరులు= కొందరు, బలిమో=బలమో!, కలిమో=సంపదో! అనుచును=అంటూ, పలుమఱు, జఘనంబుల్=పిఱుదులను చూచి, పలుకుదురు, ఇతరుల్=ఇతరులు.

**తా :** నడుమును చూచి ఉందో! లేదో! నడుము అంటారుట కొందరు. జఘనాన్ని చూచి బలిమో కలిమో అంటారట కొందరు.

**విశే :** నడుము సన్నగా ఉంటే అందం, పిరుదులు ఎత్తుగా ఉంటే అందం. ఆ విషయాన్ని చెప్పే విధానంలో మొల్లనేర్పు ఇది.

**సీ. షట్పదంబుల పైకి సంపెంగ పువ్వుల**
**జలజాతముల పైకిఁ జందమామఁ**
**గిసలయంబుల పైకి వెసఁ గలకంఠముల్**
**సింధురమ్ములపైకి సింహములును**
**దొండపండుల పైకి దొడ్డ రాచిలకల**
**నలరుఁ దూఁడుల పైకి హంసవితతిఁ**
**బండు వెన్నెల నిగ్గు పైకిఁ జకోరముల్**
**పవనంబు మీఁదికి బాపతేని**

**తే. మరుఁడు వైరంబు చేసిన మాడ్కి, నలక**
**నాసికా కరానన చరణ స్వనములు**
**వర పయోధర మధ్యోష్ఠ వచన బాహు**
**గమన హాసాక్షు లూర్పారు రమణి కమరె. 24**

**ప్రతి :** షట్పదంబులపైకి=తుమ్మెదల మీదకి, సంపెంగ పువ్వులను, జలజాతముల పైకి=తామరపూల మీదకి, చందమామన్, కిసలయంబులపైకి=చిగురులమీదికి, వెసన్=వేగముగ, కలకంఠముల్=కోకిలలు, సింధురమ్ములపైకి=ఏనుగుల మీదికి, సింహములను, దొండపండులపైకి, దొడ్డరాచిలకల=శ్రేష్ఠమైన రామచిలుకల్ని, అలరు=అందమైన, తూఁడులపైకి=తామరతూడులమీదికి, హంసవితతి=హంసల గుంపును, పండువెన్నెలనిగ్గుపైకిన్=పండువెన్నెల తెట్టుమీదికి, చకోరముల్=చకోర పక్షుల్ని, పవనంబుమీదికి= గాలిమీదికి, పాపతేని=నాగరాజుని, మరుఁడు=మన్మథుఁడు, వైరంబు చేసిన మాడ్కి=యుద్ధానికి పురికొల్పినట్లుగా, అలక=ముంగురులు, నాసిక=ముక్కు, కర=చేయి, ఆనన=ముఖము, చరణ=పాదములు, స్వనములు=స్వరములు, వర పయోధరములు=శ్రేష్ఠమైన చన్నులు, మధ్య=నడుము, ఓష్ఠ=పెదవి, వచన= మాటలు, బాహు=భుజములు, గమన=నడక, హాస=నవ్వు, అక్షులు=కన్నులు, ఊర్పు=శ్వాస, ఆరు=నూగారు, రమణికి=ఆసీతాదేవికి, అమరె=కుదిరినవి.

**తా :** తుమ్మెదలకు సంపెంగలకు పడదు. తుమ్మెద సంపెంగపూల వద్దకు వెళ్లదు. అందువల్ల మన్మథుడు ఈ రోజు – తుమ్మెదల మీదకు సంపెంగలనే పంపాడట, తామరపువ్వులకు చంద్రునికి పడదు – తామరలమీదికి చంద్రుణ్ణి పంపాడు. చంద్రోదయంకాగానే తామరపువ్వులు ముడుచుకుపోతాయి, చివుళ్ల మీదకు కోకిలలను పంపాడు – కోకిలలు చివుళ్లను తినేస్తాయి. ఏనుగుల మీదకి సింహాల్ని పంపాడుట=సింహం ఏనుగుని చంపేస్తుంది, దొండపళ్ల మీదికి రామచిలుకలు – రాచిలుక – దొండపండును

తినేస్తుంది. తామరతూళ్ల మీదికి హంసల్ని, హంసలు తామరతూళ్లను తినేస్తాయి. పండువెన్నెల మీదికి చకోరాలు, చకోరాలకు వెన్నెలే భోజనం, వాయువు మీదికి నాగరాజుని – పాములు పవనభుక్కులు, వాయువును తింటాయి. అలా మన్మథుడు పంపాడు, అయితే ఇందులో ప్రస్తావించబడిన – పువ్వులు, పక్షులు, జంతువులు ఒకటేమిటి అన్నీ సీతమ్మ అవయవాలే, పైపద్యంలోని వరుసక్రమాన్ని పాటించి ఆయా అంగాలన్నీ ఎత్తుగీతిలో ప్రస్తావించింది మొల్ల, క్రమంగా వాటిని అనుసంధించుకోవాలి, ఇది క్రమాలంకారం.

**విశే :** ఈ పద్యం పూర్తిగా కవిసమయాలను ఆశ్రయించి వ్రాసినది. మన్మథుని పరివారమంతా ఇందులో ప్రస్తావింపబడ్డారు. మన్మథుని సేనలో ఒకరంటే ఒకరికి పడదు. నిత్యం యుద్ధానికి సిద్ధంగా ఉంటారు అనే చమత్కారభావనతో ఈ పద్యం నడిచింది.

అలకనాసికాకరానన చరణస్వనములు–షట్పదులు=అలకలు, సపెంగపువ్వులు=ముక్కు, తామరలు=కరములు, చంద్రుడు=ముఖము, కిసలయములు=చరణములు, కలకంఠములు=స్వనములు, పరపయోధరమధ్యోష్ఠవచనబాహుగమనహాసాక్షులూర్పారు–సింధురములు=వరపయోధరములు, మత్తేభకుంభంతో స్తనాలు పోలుస్తారు, సింహములు=మధ్యము, ఓష్ఠ=దొండపండు, వచన=చిలుకపలుకులు, తామరతూడులు=బాహువులు, హంసతతి=గమనము, వెన్నెలనిగ్గు=హాసము, చకోరములు= అక్షులు,పవనము=ఊర్పు, పాపఱేడు=నూగారు. సీతాదేవి ముంగురులు తుమ్మెదలవలె, చేతులు పద్మములవలె, ముఖము చంద్రునివలె, పాదాలు చివుళ్లవలె, ఆమె కంఠస్వరము కోకిల గానమువలె, స్తనములు మత్తేభ కుంభస్థలములవలె, నడుము సింహము నడుమువలె, పెదవులు దొండపండువలె, పలుకులు చిలుకపలుకులవలె, బాహువులు తామరతూడులవలె, నడక హంసనడకవలె, నవ్వు వెన్నెల వలె, కన్నులు చకోరాలవలె, ఊర్పు గాలివలె, నూగారు పాముVలె ఉన్నవి అని తాత్పర్యము. కవిసమయ పరిజ్ఞాన పరిపూర్ణమయిన పద్యమిది.

**క. బంగారు నీరు నిలువునఁ**
**బొంగారుచు నుండ నజుఁడు వోసిన మాడ్కిన్,**
**శృంగార మెల్ల నిలువునఁ**
**బొంగారుచు నుండుఁ గరఁగి పోసిన మాడ్కిన్. 25**

**ప్రతి :** బంగారునీరు=బంగారు ద్రవం, వెండి, కంచు మొదలయిన లోహాలమీద బంగారం కరిగించి పోస్తారు, ఆ వస్తువులు అప్పుడు బంగారపు వస్తువులవలె ప్రకాశిస్తాయి. ఆ పనిని బంగారు నీరుపోయుట అంటారు, నిలువునన్=పూర్తిగా, పొంగారు చునుండన్=ఉబ్బి అందంగా ప్రకాశిస్తూ ఉండేలా, అజుఁడు= బ్రహ్మగారు, పోసినమాడ్కిన్=పోసిన విధముగా, శృంగార మెల్ల=శృంగారాన్ని కరిగించి, నిలువునన్=పూర్తిగా!, కరఁగిపోసిన=కరిగించిపోసిన, మాడ్కిన్=వలె, పొంగారుచునుండున్=ప్రకాశిస్తూ ఉంటుంది.

**తా :** సామాన్యమైన కంచు, వెండి మొ॥ లోహాల మీద బంగారు నీరుపోస్తే ఎలా ప్రకాశిస్తాయో అలా సీతాదేవి మీద శృంగారాన్ని కరిగించి పోసాడా బ్రహ్మ అన్నట్లు ప్రకాశిస్తూ ఉంది.

**విశే :** నాయిక సౌందర్య వర్ణనలో ఇది ఒక వినూత్న కల్పన.

**వ. అట్టి వయో రూపంబులను గనుపట్టునట్టి య క్కాంతా రత్నంబు నీకు సిద్ధించెనేని నీవు త్రిభువనంబులు విజయంబు చేసిన యంతకన్నను సంతసింతువన్న విని, కామాశుగంబులం దగిలి, కామాంధుండై కన్నులు గానక యన్నుకొని తన్నుఁదా మఱచి, యొడ్డోలగంబు సాలించి, పుష్పకం బను విమాన రత్నంబుపై నధిష్ఠించి, మారీచు కడకుం జని, ప్రార్థించి, "నీవు కనక మృగంబవై జనస్థానం బునకుం జని, దశరథ నందనుండగు శ్రీరాముం డున్న పర్ణశాల కడం బొడకట్టిన, నతండును నిన్ను వెనుకొను, నీవు నతిని నతి దూరంబుగాఁ గొనిపోయి మాయంబైన, నేను రాముని భార్యం గొనివత్తు" ననిన విని సమ్మతిలక మాఱుత్తరం బిచ్చిన, రావణుం డుగ్రుండై మండిపడ, నతం దా సన్న యెఱింగి, కనక మృగ రూపంబును దాల్చె నాక్షణంబున. 26**

**ప్రతి :** అట్టి, వయోరూపంబులను=వయస్సు రూపములతో, కనుపట్టునట్టి=కనుబడుచున్నటువంటి, ఆ+కాంతారత్నంబు=రత్నము వంటి ఆ కాంత, నీకు సిద్ధించెనేని=నీకు లభించినట్లయితే, నీవు, త్రిభువనంబులు=మూడు లోకములు, విజయంబు, చేసినయంతకన్నను, సంతసింతువు=సంతోషించెదవు, అన్నన్, విని, కామాశుగంబులన్=మన్మథ బాణంబులయందు, తగిలి=చిక్కుకొని, కామాంధుండై=కామముచే గ్రుడ్డివాడై, కన్నులుగానక=కన్నులు కనబడక (కళ్ళు మూసుకుపోయి), అన్నుకొని=మత్తిల్లి, తన్నున్ తామఱచి, ఒడ్డోలగంబు=సభను, చాలించి=ముగించి, పుష్పకంబు అను, విమానరత్నంబుపై=శ్రేష్ఠమగు విమానం మీద, అధిష్ఠించి=ఎక్కి, మారీచుకడకున్, చని, ప్రార్థించి, 'నీవు, కనకమృగంబవు+ఐ=బంగారు జింకవై, జనస్థానంబునకున్, చని, దశరథనందనుండు, అగు, శ్రీరాముండు, ఉన్న, పర్ణశాలకడకు, పొడకట్టినన్= కనబడినచో, అతండును, నిన్ను, వెనుకొనిన్=వెంటబడిన, నీవున్, అతనిన్, అతిదూరంబుగాన్=మిక్కిలి దూరంగా, కొనిపోయి= తీసికొనిపోయి, మాయంబైన, నేను, రాముని భార్యన్, కొనివత్తున్=తీసికొనివత్తును, అనినన్, విని, సమ్మతిలక=అంగీకరింపక, మాఱు ఉత్తరంబు ఇచ్చినన్=తిరిగి సమాధానం ఈయగా, రావణుండు, ఉగ్రుండై=కోపోద్రిక్తుడై, మండిపడన్=రగిలిపోగా, అతండు, సన్న ఎఱింగి=అభిప్రాయం గ్రహించి, ఆ క్షణంబునన్=ఆ సమయంలోనే, కనకమృగరూపంబును=బంగారులేడి రూపమును, తాల్చెన్=ధరించెను.

**తా :** చక్కని వయస్సు రూపము గల ఆ కాంతారత్నం నీకు లభించినట్లయితే, నీవు మూడులోకాలు జయించిన దానికంటె ఎక్కువ ఆనందాన్ని పొందుతావు అని చెప్పగా విని, మన్మథబాణాలకు వశుడై కామాంధుడై, కన్నులు కానక తనను తాను మఱచి, సభచాలించి పుష్పకము అనే విమానం మీద ఎక్కి, మారీచుని దగ్గరకు వెళ్లి అతడిని ప్రార్థించాడు. "నువ్వు బంగారు లేడిరూపంలో జనస్థానానికి వెళ్లి, శ్రీరాముడు నివసిస్తున్న పర్ణశాల ప్రాంతంలో వారికి కనబడేలా తిరిగితే, రాముడు నిన్ను వెంబడిస్తాడు. నువ్వు అతడిని చాలాదూరం వరకు తీసుకొని పోయి మాయమైనట్లయితే నేను రాముని భార్యను తీసుకొని వస్తాను"

అన్నాడు. ఆ మాటలు విన్న మారీచుడు ఆ పనికి సమ్మతించలేదు. అలా చేయవద్దు అని చెప్పినా రావణుడు ఉగ్రుడై మండిపడడంతో మారీచుడు ఇతనిని మార్చలేము అనుకుని వెంటనే బంగారు లేడిగా మారిపోయాడు.

**క. ఒడ లెల్లను బంగారము,**
**పొడ లెల్లను రత్న సమితిఁ బోలిన మెఱపుల్**
**నడ లెల్ల నెఱపి మెలఁగెడు**
**కడ లెల్ల విలాస రేఖ కళలం దొప్పెన్. 27**

**ప్రతి :** ఒడలెల్లను=శరీరమంతా, బంగారము=బంగారము, పొడలెల్లను=దానిమీది చుక్కలన్నీ, రత్నసమితిన్=రత్నముల సమూహమును, పోలిన మెఱపుల్=పోలినట్లుండి మెఱవగా, నడలెల్ల నెఱపి=నడకలన్నీ ఆవిధంగా చేసి, మెలఁగెడు=తిరుగాడెను, కడలెల్లన్=అన్ని దిక్కులు, విలాసరేఖ=సౌందర్యరేఖ, కళలం దొప్పెన్=కళలలో ఒప్పెను.

**తా :** శరీరమంతా బంగారంలా, దానిమీది చుక్కలన్నీ రత్నాల్లా కాంతులను ప్రసరిస్తూ మెఱిసిపోగా, దాని నడకలో, చూపులో, తిరుగాడే విధానంలో ఆ బంగారు లేడి. సౌందర్యం ప్రకటిస్తూ తన నేర్పునంతా ప్రకాశింపచేసింది.

**వ. ఇట్లు కనక మృగాకారంబు గైకొని పర్ణశాల కడకుం బోయి మెలంగునప్పుడు. 28**

**ప్రతి :** ఇట్లు= ఈవిధంగా, కనకమృగాకారంబు= బంగారు లేడి ఆకారాన్ని, గైకొని= పొంది, పర్ణశాలకడకుంబోయి= పర్ణశాల వద్దకు వెళ్ళి, మెలంగునపుడు= తిరుగుతున్న సమయంలో.

**తా :** ఈ విధంగా బంగారులేడిగామారి పర్ణశాలదగ్గరగావెళ్ళి తిరుగాడు చుండగా–

**క. కనియును వినియును నెఱుఁగము**
**కనక మృగం బనుచు వేడ్క గడలుకొనంగన్**
**గనఁగ మృగం బద్భుత మిది**
**కనక మృగం బేమి సేయఁగలదో మీఁదన్. 29**

**ప్రతి :** కనియును=చూచియు, వినియును=వినియు, ఎఱుఁగము=ఎరుగము, కనకమృగంబు=బంగారులేడి, అనుచు=అంటూ, వేడ్క=కుతూహలం, కడలు కొనంగన్=ఎక్కువ కాగా, కనఁగ=చూచి, మృగంబిది=ఈ లేడి, అద్భుతము=చాలా వింత అయినది, కనకమృగంబు=ఈ బంగారులేడి, ఏమి సేయగలదో=ఏమి చేయగలదో (చేస్తుందో), మీఁదన్=ఇక మీాదట.

**తా :** బంగారులేడి గురించి చూసిగాని వినిగాని ఎరుగము అనుకొంటూ బంగారులేడిని చూడాలనే కుతూహలం అధికం కావడంతో చూసి, ఇది నిజంగా అద్భుతంగా ఉంది. ఈ బంగారులేడి ముందుముందు ఏమి చేస్తుందో ఏమో (అని అనుకొన్నారు).

**వ. అని కనుఁగొన్న మునిజనంబులు మనంబులం దలంకునెడ నా మృగంబును మృగనేత్ర యగు ధాత్రీపుత్రి గని దాని నభిలషించిన నా సన్న యెఱింగి సౌమిత్రిని భూమిజకుం దోడిడి, శ్రీరామ చంద్రుండు దాని వెనుకొని చనుచున్న యవసరమ్మున. 30**

**ప్రతి :** అని, కనుఁగొన్న మునిజనంబులు=చూసిన మునిజనులు, మనంబులన్=మనస్సులందు, తలంకునెడన్=బాధపడుచుండగా, ఆ మృగంబును, మృగనేత్రయగు=లేడికన్నుల వంటి కన్నులు గల, ధాత్రీపుత్రిన్=భూమిపుత్రిక సీతను, కని, దానిన్, అభిలషించినన్=కోరుకొనగా, ఆ సన్న=ఆ విషయము, ఎఱింగి, సౌమిత్రిని, భూమిజకున్=సీతకు, తోడుఇడి=సహాయునిగా ఉంచి, శ్రీరామచంద్రుండు, దానివెనుకొని=దానిని వెంబడించి, చనుచున్న యవసరమ్మున=వెళ్తున్న సమయంలో –

**తా :** అని ఆ లేడిని చూచిన మునిజనులు మనస్సుల్లో భయపడుతుండగా, ఆ లేడిని లేడికళ్లవంటి కన్నులు గల సీతచూసి దానిని కావాలనుకుంది. సీత కోరుకున్న విషయం తెలుసుకుని శ్రీరామచంద్రుడు, సీతాదేవికి సౌమిత్రిని తోడుగా ఉంచి, ఆ లేడిని వెంబడించి వెళ్తున్న సమయంలో.

## రాముఁడు బంగారు జింకను వెన్నంటి తరుముట

**సీ. తనుఁ బట్ట నొయ్యన వెనుకొని చనుదెంచు**
**నిల ఱేని తలఁపుఁ దాఁ దెలిసి తెలిసి**
**చేరువ మెలఁగుచుఁ బూరి మేయుచు డాసి**
**మెల్లన యంతంత మెలఁగి మెలఁగి**
**తన నీడఁ గనుఁగొని తానె దిగ్గన దాఁటి**
**భయమునఁ బరువెత్తి పఱచి పఱచి**
**యెదరైనఁ బోవక యెలయించి కనుఁగొన్నఁ**
**దరువుల నొయ్యన నొరసి యొరసి**

**తే. చెవులు నిక్కించి చూచుచుఁ జెలఁగిఁ చెలఁగి**
**పోవ, రాముండు దవ్వుగాఁ బోయి పోయి**
**యెలమి మాయా మృగం బని యెఱిఁగి మదిని**
**దీనిఁ జంపుదుఁగా కని తెగువ చేసి. 31**

**ప్రతి :** తనున్=తనను, పట్టన్=పట్టుకొనుటకు, ఒయ్యన=మెల్లగా, వెనుకొని=వెంబడించి, చనుదెంచు= వచ్చుచున్న, ఇలఱేని=భూపతి, తలపున్=ఆలోచనను, తాను=తాను, తెలిసి తెలిసి=ఎరిగి ఎరిగి, చేరువ= దగ్గఱలో, మెలఁగుచున్=తిరుగాడుచు, పూరి=గడ్డి, మేయుచు=మేస్తూ, డాసి=సమీపించి, మెల్లన, అంతంత= అక్కడక్కడ, మెలఁగిమెలఁగి=తచ్చాడుతూ, తననీడన్=తనయొక్క, నీడను, కనుగొని=చూసి, తానె దిగ్గన

దాటి=ఒక్కసారిగా ఆ నీడను తానెదాటి, భయమునన్, పరువెత్తి=పరుగుపెట్టి, పఱచిపఱచి=పారిపోయి పారిపోయి, ఎడరైనన్=దూరమైతే, పోవక=వెళ్లక, ఎలయించి=తీసుకొనిపోయి, కనుగొన్నన్=చూస్తే, తరువులన్=చెట్లవద్ద, ఒయ్యన=మెల్లగా, ఒరసియొరసి=చెట్లకాండాలకు శరీరాన్ని రాసుకుని, చెవులు, నిక్కించి=నిలువుగాపెట్టి, చూచుచున్, చెలఁగి చెలఁగి పోవన్=ఉత్సాహంతో వెళ్లగా, రాముడు, దవ్వుగాన్=దూరముగా, పోయిపోయి, వెళ్లి, ఎలమి=వివేకముతో, మదిని=మనస్సున, మాయామృగంబని=మాయలేడి అని, ఎఱిగి=తెలుసుకుని, దీని, చంపుదుగాకని, తెగువచేసి=సాహసము చేసి –

**తా :** తనను పట్టుకోవడానికి వెంబడించి వస్తున్న రాముని ఆలోచనను తెలిసుకొని, దగ్గఱలో తిరుగుతూ, పచ్చగడ్డి మేస్తూ, దగ్గరగా వచ్చి అక్కడక్కడే తచ్చాడుతూ, తన నీడచూసి భయపడి గెంతుతూ, దూరంగా వెళ్లినట్లనిపిస్తే – చెట్లచాటున ఉండి చెట్లకు తన శరీరం రాసుకుని, చెవులు నిక్కించి చూస్తూ ఉత్సాహంగా పరిగెత్తడం చూసి రాముడు చాలా దూరం వచ్చేసాను, ఇది తప్పకుండా మాయలేడే. దీన్ని చంపుదునుగాక అని సాహసించి –

**క. ఏచిన కినుకను బలు నా**
**రాచము సంధించి డాసి రాఘవుఁ డా మా**
**రీచుని దైత్యాధముఁ గుల**
**నీచునిఁ గూలంగ నేసె నిర్జరు లలరన్. 32**

**ప్రతి :** ఏచిన=అతిశయించిన, కినుకను=కోపముతో, బలునారాచము=తీక్షణమైన బాణము, సంధించి=వింటిలో కూర్చి, డాసి=సమీపించి, రాఘవుఁడు, దైత్యాధమున్=నీచరాక్షసుని, కులనీచునిన్=రాక్షస కులములో నీచుడయిన వానిని, ఆ మారీచుని, నిర్జరులు=దేవతలు, అలరన్=సంతోషింపగా, కూలంగనేసె=పడవేసాడు.

**తా :** అధికమయిన కోపంతో రాముడు తీక్షణమైన బాణం సంధించి దగ్గరగా వెళ్ళి నీచుడైన మారీచుడనే ఆ రాక్షసుణ్ణి దేవతలు సంతోషపడే విధంగా కూలవేసాడు. సంహరించాడు.

**వ. వాఁడునుం గూలు నవ్వేళ "హా! లక్ష్మణా" యను రవంబుం జేసిన నా ధ్వని విని జనక నందన మనంబున నులికి లక్ష్మణుం బిలిచి "మీ యన్న కేమి కీడు వాటిల్లెనోకాని నిన్నుఁ దలంచె. నీవునుం బోయి మీ యన్న కుశల స్థితిం దెలిసికొని ర" మ్మనిన నతండు తలంకక నామెతో నిట్లనియె. 33**

**ప్రతి :** వాఁడునున్=ఆ మారీచుడును, కూలునవ్వేళన్=చనిపోవు సమయమున, హా! లక్ష్మణా, అనురవంబున్=అను శబ్దమును, చేసినన్=చేయగా, ఆ ధ్వని, విని, జనకనందన=జనకుని కూతురగు సీత, మనంబునన్=మనస్సులో, ఉలికి=భయపడి, లక్ష్మణున్, పిలిచి, మీయన్నకున్, ఏమికీడు=ఎటువంటి అపాయము/చెడు, వాటిల్లెనో కాని=కలిగెనో కాని, నిన్నున్, తలంచె, నీవునున్, పోయి, మీ యన్న కుశలస్థితిన్=మీ అన్న క్షేమస్థితిని, తెలిసికొని, రమ్ము, అనినన్=అని పలుకగా, అతండు, తలంకకన్=కంగారుపడక/భయపడక, ఆమెతోన్, ఇట్లనియె.

**తా :** ఆ మారీచుడు చనిపోయే సమయంలో "హా! లక్ష్మణా!" అని అరిచాడు. ఆ కేకవిని సీతాదేవి మనస్సులో ఉలిక్కిపడింది. లక్ష్మణుని పిలిచి – "మీ అన్నగారికి ఏమి కీడు సంభవించిందో ఏమో నిన్ను తలచుకుని కేక పెట్టాడు. నువ్వు వెళ్ళి మీ అన్న క్షేమాన్ని తెలిసికొని రమ్ము అన్నది. లక్ష్మణుడు భయపడక సీతతో ఇలా అన్నాడు.

**ఉ. ఏమిటి కింత భీతి మది? నీ వగ తోఁచుట యేమి నీకు? నో**
**భామిని! రామునందు నొక భారము చెందదు, చెందెనేనియున్**
**భూమి వడంకదే? నభము బోరన మ్రోయదె? వార్ధు లింకవే?**
**తామరసాప్త సోమ గ్రహ తారకలెల్లను నేల దుల్లవే?. 34**

**ప్రతి :** ఓభామిని!=ఓరమణీ సీతా!, ఏమిటికింత భీతిమదిన్=నీమనస్సులో ఇంతటి భయము, ఎందుకు?, ఈ వగ తోఁచుటయేమి=ఇంత దుఃఖం కలగడమేమిటి, నీకు, రామునందున్=రాముని ఎడల, ఒక భారము చెందదు=ఒకకష్టం కూడారాదు, చెందెనేనియున్=ఒకవేళ కష్టమే వచ్చినట్లయితే, భూమివడంకదే= ఈ భూమివణికి పోదా?, నభము=ఆకాశము, బోరనమ్రోయదె?=పెద్దపెట్టున చప్పుడు చేయదా?, వార్ధులు= సముద్రాలు, ఇంకవే=ఇంకిపోవా?, తామరసాప్త=తామరలకు మిత్రుడయిన, సూర్యుడు, సోమ=చంద్రుడు, గ్రహ=తక్కిన గ్రహాలు శుక్ర గురు బుధ మొదలైనవి, తారకలు=నక్షత్రాలు, ఎల్లన్=అన్ని, నేల=నేలమీదకు, దుల్లవే=రాలిపోవా?

**తా :** ఓ సీతా! నీ మనస్సులో ఇంత భయమెందుకు? నీకు ఇంత దుఃఖం కలగుతున్న దేమిటి? రామునికి ఎలాంటి కష్టమూ రాదు. నిజంగా కష్టమే వస్తే ఈ భూమి కంపించదా? ఆకాశం పెద్దచప్పుడు చేయదా? సముద్రాలు ఇంకిపోవా? సూర్య, చంద్రాది, గ్రహాలు, నక్షత్రమండలాలు అన్నీ నేలమీదకు రాలిపోవా?

**విశే :** రామునికి ఏదైనా కీడు జరిగితే ప్రకృతిలో ఈ మార్పులు రావా? అలా కాలేదు కనుక రాముడు క్షేమంగానే ఉన్నాడు అని తాత్పర్యము.

**ఉ. అంత పనయ్యేనేని, దనుజాంతకు, నంతకు, మన్మథాంతకున్**
**బంతము మీఱఁగా గలఁచి, పన్నగ మర్త్య సురేంద్ర లోకముల్**
**బంతులు గట్టియూడ్చి, రిపు భంజను రామునిఁ గందకుండ న**
**ర్పింతును నీకుఁ దెచ్చి, మది భీతిని బొందకు మమ్మ జానకీ! 35**

**ప్రతి :** జానకీ!=ఓ సీతామాతా!, అంతపనయ్యేనేని=ఒకవేళ నిజంగా రామునికి ఏదయినా కీడుజరిగి ఉంటే, దనుజాంతకు=రాక్షస సంహారకుడైన విష్ణువుని, అంతకున్=యముణ్ణి, మన్మథాంతకున్=శివుణ్ణి, పన్నగ=నాగ, మర్త్య=మానవ, సురేంద్ర=ఇంద్ర, లోకముల్=లోకాలు, బంతులు గట్టి యూడ్చి=వరుసగా పెకలించి, రిపుభంజను=శత్రువులను సంహరించే శీలముగల, రాముని, కందకుండ=కంది పోకుండా,

అలసిపోకుండ, తెచ్చి=తీసుకొనివచ్చి నీకు, అర్పింతును=సమర్పిస్తాను, మదిభీతిని=మనస్సులో భయాన్ని, పొందకుమమ్మ=పొందకమ్మా! భయపడకమ్మా!

**తా :** అమ్మా! సీతా! నిజంగా రామునికి కీడే గనుక కలిగితే, విష్ణువుని, యముణ్ణి, శివుణ్ణి పంతంపట్టి చికాకుచేసి, నాగలోక, మానవలోక, స్వర్గలోకాల్ని వరుసగా పెకిలించి – రిపుభంజనుడయిన శ్రీరాముణ్ణి– కందిపోకుండా తీసుకువచ్చి నీకు సమర్పిస్తాను. నువ్వుమాత్రం మనసులో ఎలాంటి భయం పడవద్దు. అని లక్ష్మణుడు ఆమెకు ధైర్యం చెప్పాడు.

**వ. అని లక్ష్మణుండు పలికిన విని, జనకరాజనందన కినిసి, వినరాని మాటలం దూలనాడిన, మనంబునం గంది కుందుచు, శ్రీరామచంద్రుం డేఁగిన మార్గంబున చనియె, నంత నిక్కడ. 36**

**ప్రతి :** అని లక్ష్మణుడు పలికిన, విని, జనకరాజనందన=సీతాదేవి, కినిసి=కోపగించి, వినరానిమాటలు తూలనాడిన=వినకూడనిమాటలతో నిందించిన, మనంబున=మనస్సులో, కంది=నొచ్చుకుని, కుందుచు= బాధపడుతూ, శ్రీరామచంద్రుండు, యేగిన= వెళ్ళిన, మార్గంబున=మార్గంలో చనియె=వెళ్ళాడు, అంత=అప్పుడు, ఇక్కడ,

**తా :** లక్ష్మణుడు అలా ధైర్యవచనాలు చెప్పగా విని, సీతాదేవి కోపగించి వినరాని మాటలతో నిందించింది. ఆ మాటలకు మనస్సు కష్టపడగా దుఃఖపడుతూ లక్ష్మణుడు శ్రీరాముడు వెళ్లిన మార్గాన్ని పట్టుకుని వెళ్ళాడు. అంతట ఇక్కడ.

## రావణుఁడు సన్యాసి వేషమున సీత నపహరించుట

**క. సన్యాసి వేష మలరఁగ**
**నన్యాయము తలఁచుకొనుచు నసురేంద్రుఁడు దాఁ**
**గన్యారత్నముఁగని సౌ**
**జన్యమునన దీవన లిడె శాంతము దోఁపన్. 37**

**ప్రతి :** సన్యాసి వేష మలరఁగన్=సన్యాసి వేషము వేసుకొని, అన్యాయము=న్యాయము కానివిషయాన్ని, తలచుకొనుచున్=ఆలోచించుకుంటూ, అసురేంద్రుఁడు=రాక్షసాధిపతి అయిన రావణుడు, తాన్=తాను, కన్యారత్నమున్=శ్రేష్ఠురాలయిన సీతను, కని=చూచి, సౌజన్యమునన=మంచితనం ఉట్టిపడేలా, శాంతముదోఁపన్=శాంతముప్రదర్శిస్తూ, దీవెనలిడె (దీవెనలు+ఇడె,)=దీవెనలు ఇచ్చాడు.

**తా :** రాక్షసాధిపతి అయిన రావణుడు సన్యాసివేషంవేసుకుని, మోసగించే అన్యాయవిషయాన్ని గురించి ఆలోచిస్తూ వచ్చి, కన్యారత్నమయిన సీతను చూసి, మంచితనం ఉట్టిపడేలా శాంత భావనతో దీవించాడు.

**క. దీవించుడు, మునియే యని**
**భావింపుచుఁ జేర వచ్చు భామిని, నపు డా**

**రావణుఁడు రథము మీఁదికి**
**వే వేగమ తిగిచి గగన వీథిని జనియెన్.** **38**

**ప్రతి :** దీవించుఁడున్=అలాదీవించగా, మునియే యని, భావింపుచున్=అనుకుంటూ, చేరవచ్చు=దగ్గరగా వస్తున్న, భామినిన్=సీతను (భామిని=అందమయినది), అపుడు, ఆ రావణుఁడు, రథముమీదికి, వేవేగమ= చాలావేగంగా, తిగిచి=లాగి, గగనవీథిని=ఆకాశమార్గంలో, చనియెన్=వెళ్లెను.

**తా :** దీవెనలు విని, వచ్చినది మునియే అనుకొని సమీపానికి వస్తున్న సీతను ఆ రావణుడు తన రథం మీదికి వేగంగాలాగి ఆకాశమార్గాన వెళ్లాడు.

**వ. అయ్యవసరంబున.** **39**

**తా : అప్పుడు**

**ఆ. అసుర గొంచుఁ బోవ నవనీ తనూభవ**
**వెఱచి పలికె దిశలు వినఁగ నంత**
**"సీత నాదు పేరు, శ్రీరాము భార్యను**
**నన్నుఁ గావరయ్య మిన్న కిపుడు".** **40**

**ప్రతి :** అసుర=రాక్షసుడు, కొంచున్=తీసుకొని, పోవన్=పోతుండగా, అవనీతనూభవ=భూమికూతురయిన సీత, వెఱచి=భయపడి, "సీత నాదుపేరు, శ్రీరాము భార్యను, నన్నున్, కావరయ్య!, అని, దిశలువినగన్= అన్నిదిక్కులు వినేలా, మిన్నకిపుడు=ఇప్పుడు ఊరుకోక పలికె.

**తా :** రాక్షసుడు అలా ఆకాశమార్గాన పట్టుకుపోతూ ఉంటే సీత భయపడి, నా పేరు సీత, నేను రాముని భార్యను. నన్ను రక్షించండి అంటూ అన్ని దిక్కులకూ వినబడేలా అరుస్తూ – నన్ను పట్టించుకోండి. ఊరుకోకండి అంటూ ఆక్రోశించింది.

**వ. అని మఱియును.** **41**

**తా : అని మరియు**

**ఆ. "దేవ గణములార! దిక్పాల వరులార!**
**వృక్ష జాతులార! పక్షులార!**
**కుటిల దానవుండు గొంపోవుచున్నాఁడు**
**కరుణతోడ నన్నుఁ గావరయ్య!.** **42**

**ప్రతి :** దేవగణములార!=దేవతా సమూహములారా! దిక్పాల వరులారా!=శ్రేష్ఠులయిన దిక్పాలకులారా, వృక్షజాతులారా!=వివిధజాతుల వృక్షాల్లారా!, పక్షులారా!, కుటిల దానవుండు=మోసగాడయిన రాక్షసుడు, కొంపోవుచున్నాఁడు=ఎత్తుకుపోతున్నాడు, కరుణతోడ=దయతో, నన్నుకావరయ్య=నన్నురక్షించండి.

**తా :** ఓ దేవతల్లారా! దిక్పాలకులారా! వృక్షాల్లారా! పక్షుల్లారా! ఓ మోసగాడయిన రాక్షసుడు నన్ను ఎత్తుకుపోతున్నాడు, దయతో నన్ను రక్షించండి.

## రావణుని నిరోధించిన జటాయువు

ఆ. **అనుచుఁ బలుకుచున్న నా యార్తనాదంబు**
**విని జటాయు వనెడి విహగ నాథుఁ**
**డరుగుదెంచి, కలహ మత్యుగ్రముగఁ జేయ**
**రావణుండుఁ బక్షిరాజుఁ దాకె!.** **43**

**ప్రతి :** అనుచున్=రక్షించండి అంటూ, పలుకుచున్న, ఆ, ఆర్తనాదంబు విని=ఆ దీనమైన పలుకువిని, జటాయువు, అనెడి, విహగనాథుఁడు=పక్షిరాజు, అరుగుదెంచి=వచ్చి, కలహము=యుద్ధము, అతి+ ఉగ్రము – అత్యుగ్రముగన్=మిక్కిలి ఘోరముగా చేయ, రావణుండు, పక్షిరాజున్=జటాయువును, తాకెన్= ఎదుర్కొనెను.

**తా :** సీత రక్షించమంటూ పిలిచిన దీనమైన పలుకులు విని జటాయువు అనే పక్షిరాజు వచ్చి రావణునితో ఘోరంగా యుద్ధం చేసాడు. అప్పుడు రావణుడు జటాయువును ఎదుర్కొన్నాడు.

చ. **అసుర విభుండు వైచు నిశితాస్త్ర ముఖంబుల నొచ్చి, పక్షియున్**
**గొసరక దైత్య నాయకుని గుండెను నొవ్వఁగ దన్న నంతలోఁ**
**గసరి నిశాచరుండు కరఖడ్గముఁ ద్రిప్పుచు బక్షయుగ్మమున్**
**వసుధ బడంగఁ ద్రుంచి, కదు వైళమ లంకకు నేఁగు నత్తఱిన్.** **44**

**ప్రతి :** అసురవిభుండు=రాక్షసరాజు, వైచు=ప్రయోగించే, నిశిత=వాడియైన, అస్త్రముఖంబులనొచ్చి= బాణాగ్రములచేత బాధపడి, పక్షియున్=పక్షికూడ, కొసరక=సంకోచించక, దైత్యనాయకుని=రాక్షసప్రభువుని, గుండెను, నొవ్వగ=నొప్పిపుట్టే విధంగా, తన్నన్=తన్నగా, అంతలోన్=వెంటనే, కసరి=కోపగించి, నిశాచరుండు= రాక్షసుడు, కరఖడ్గమున్=చేతికత్తిని, త్రిప్పుచు=తిప్పుతూ, పక్షయుగ్మమున్=రెక్కలు రెండింటిని, వసుధన్= భూమియందు, పడంగన్=పడిపోవునట్లుగా, త్రుంచి=ఖండించి, కదువైళము=మిక్కిలి వేగముగా, లంకకున్, ఏఁగున్=వెళ్లుచుండగా, అత్తఱిన్=ఆసమయంలో–

**తా :** రాక్షసుడు ప్రయోగించే వాడి అయిన అస్త్రములచేత దెబ్బలుతిని కూడ జటాయువు ఆ రాక్షసుని గుండెమీద నొప్పిపుట్టేలా తన్నాడు. ఆ దెబ్బకు కోపం వచ్చిన రావణుడు తన చేతి కత్తితో జటాయువు రెక్కలు రెండూ భూమిమీద పడేలా కోసేసాడు. తాను వేగంగా లంకకు వెళుతున్న సమయంలో....

క. **వనచరు లొక గిరి చేరువ**
**వనమునఁజరియింపఁ జూచి వసుధా సుతయున్**

**దన చీర కొంగు తునుకను**
**దన సొమ్ములు మూట గట్టి ధరపై వైచెన్. 45**

**ప్రతి :** వనచరులు=కోతులు, ఒక గిరిచేరువ=ఒక కొండదగ్గర, వనమునన్=అడవిలో, చరియింపన్=తిరుగుతూ ఉండగా, చూచి, వసుధాసుతయున్=భూపుత్రి అయిన సీత, తనచీరకొంగు తునుకను=తాను కట్టుకొన్న చీరకొంగు ముక్కలో, తనసొమ్ములు=తననగలు, మూటగట్టి, ధరపై=భూమిమీద, వైచెన్=పడవేసింది.

**తా :** అలా రావణుడు తీసుకొనిపోతూ ఉండగా ఒక కొండదగ్గర అడవిలో కొన్ని కోతులు తిరుగాడడం చూసి, సీత తనచీరకొంగు చింపి, అందులో తన నగలు మూటకట్టి భూమిమీద పడేసింది.

**క. అంతట దైత్యుఁడు లంకకుఁ**
**బంతముతో నేఁగి శింశుపా తరు క్రిందన్**
**సంతసమున నిడి, దానవ**
**కాంతల నవనిజకుఁ దోడు కావలి యుంచెన్. 46**

**ప్రతి :** అంతట, దైత్యుడు=రాక్షసుడు, పంతముతో=పట్టుదలతో, లంకకున్, ఏగి= వెళ్ళి, శింశుపాతరు=శింశుపావృక్షము, క్రిందన్, సంతసమునన్=ఆనందంతో, ఇడి=పెట్టి, దానవకాంతలన్=రాక్షసస్త్రీలను, అవనిజకు=భూపుత్రిసీతకు, తోడు=తోడుగా, కావలియుంచెన్=కాపలాగాఉంచాడు.

**తా :** సీతాదేవిని అలా పంతంతో లంకకుతెచ్చి శింశుపావృక్షం క్రిందపెట్టి, రాక్షస స్త్రీలను ఆమెకు తోడుగా, కాపలాగా నియమించాడు.

**ఉ. అత్తఱి రాఘవుండు తను నాసలఁ బెట్టుచుఁ గొంచుఁ బోవఁగాఁ**
**జిత్తము నొచ్చి, యా మృగము శీఘ్రమునం బడనేసి, దాని మై**
**తిత్తినిఁ దీసి వింటి కొనఁ దెచ్చెడి వేళఁ, బయోజమిత్ర వం**
**శోత్తముఁ డుల్కఁ, గానఁబడె నొక్కెడ లక్ష్మణుఁ డన్న దృష్టికిన్. 47**

**ప్రతి :** అత్తఱి=ఆ సమయమున, రాఘవుండు=శ్రీరాముడు, తను=తనను, ఆసలబెట్టుచున్=ఆసపెడుతూ, కొంచుఁబోవఁగా=తీసుకొనిపోగా, చిత్తమునొచ్చి=మనస్సునొప్పి కలిగి, ఆ మృగమున్=ఆ లేడిని, శీఘ్రమునన్=వేగంగా, పడనేసి=చంపివేసి, దాని=దానియొక్క మై తిత్తినిన్=శరీరముమీదితోలు, తీసి=ఒలిచి, వింటికొనన్=విల్లుకొనకు తగిలించి, తెచ్చెడివేళ=తెస్తున్న సమయంలో, పయోజమిత్ర వంశోత్తముడు=తామరలకు మిత్రుడయిన సూర్యునివంశములో ఉత్తముడయిన శ్రీరాముడు, ఉల్కన్=ఉలిక్కిపడేలా, ఒక్కెడ=ఒకచోట, లక్ష్మణుడు, అన్నదృష్టికిన్=రాముని కంటికి, కానఁబడెన్=కనిపించాడు.

**తా :** ఆ సమయానికి రాముడు తనను ఆశపెడుతూ దూరదూరంగా తీసుకుపోతున్న మాయలేడి మీద మనస్సులో బాధపడి, ఆ లేడిని తొందరగా చంపి, దాని చర్మం ఒలిచి, వింటిచివర తగిలించుకుని వస్తూ ఉండగా ఉలిక్కిపడేలా ఒకచోట లక్ష్మణుడు కంటబడ్డాడు.

సీతను ఒంటరిగా వదిలి లక్ష్మణుడు అలా రావడం చూసి సీతకేమైనా అయిందేమో అని రాముడు ఉలిక్కిపడ్డాడు అని తాత్పర్యం.

**చ. పొడగని గుండె ఝల్లుమన బుద్ధిఁ గలంగుచు రామచంద్రుఁ డ**
**య్యెడఁ గడు నుగ్రుఁడై పలికె "నీ విటు నా కడ కేల వచ్చి? త**
**క్కడ నినుఁ బర్ణశాల కడఁ గావలి యుంచిన చోట, నొంటిమైఁ**
**బడఁతుక డించి రాఁదగునె వన్య మృగోత్కర మధ్య సీమకున్". 48**

**ప్రతి :** పొడగని=చూచి, గండెఝల్లుమన, బుద్ధిన్=మనస్సులో, కలంగుచు= భయపడుచు, రామచంద్రుఁడు, అయ్యెడ=ఆ సమయయున, కడు=ఎక్కువగా, ఉగ్రుఁడై=కోపముగలవాడై, పలికె, నీవిటు=నీవు ఇలా, నా కడకు=నా దగ్గఱకు, ఏల వచ్చితి?=ఎందుకు వచ్చావు?, అక్కడ, నినున్, పర్ణశాలకడ=పర్ణశాలదగ్గఱ, కావలి=కాపలా, ఉంచినచోట, పడతుకన్=(స్త్రీని) సీతని, ఒంటిమై=ఒంటరిగా, డించి=వదిలి, వన్యమృగోత్కర మధ్యసీమకున్=భయం కరమైన అడవిమృగాలతో కూడిన అరణ్యమధ్య ప్రాంతానికి, రాఁదగుఁనె= రావడం, సరియైన పనేనా?

**తా :** లక్ష్మణుని చూడగానే రాముని గుండెఝల్లుమంది, మనస్సులో భయపడుతు, నిన్ను పర్ణశాల దగ్గఱ సీతకు రక్షణగా పెట్టివస్తే నువ్వు ఇలా ఆవిడను ఒంటరిగా వదలి రావడం పద్ధతేనా? భయంకరమైన క్రూరమృగాలు తిరిగే ఈ అరణ్యమధ్యానికి ఎందుకు వచ్చావు. అని కోపంతో అడిగాడు.

**ఆ. అనుచుఁ బలుకుచున్న యన్నకుఁ బ్రణమిల్లి**
**వినయ వాక్య ఫణితి విన్నవించె,**
**జనకతనయ పలుకు చందంబు మొదలెత్తి**
**లవముఁ దప్పకుండ లక్ష్మణుండు. 49**

**ప్రతి :** అనుచు, పలుకుచున్న, అన్నకున్, ప్రణమిల్లి=నమస్కరించి, వినయ వాక్యఫణితి=వినయముతో కూడిన మాటలతో, విన్నవించె=చెప్పెను, జనకతనయ=జనకుని కూతురు జానకి, పలుకు చందంబు=మాట్లాడిన మాటల విధానమంతా, మొదలెత్తి=మొదటినుండి, లవము=కొంచమైన, తప్పకుండా=వదలకుండా, లక్ష్మణుండు=లక్ష్మణుడు.

**తా :** కోపంతో ప్రశ్నిస్తున్న అన్నకునమస్కరించి లక్ష్మణుడు-వినయంతో జానకీదేవి మాట్లాడిన విధానమంతా మొదటి నుండి కొంచెంకూడా వదలకుండా విన్నవించాడు.

**వ. చెప్పిన మాటలు విని, విన్నఁ దనంబునఁ జిన్నఁ బోవుచు దుర్ని మిత్తంబులం గనుచుఁ దత్తరంబున నాశ్రమంబునకుఁ జని యక్కడ. 50**

ప్రతి : చెప్పిన మాటలు విని, విన్నఁదనంబునన్=తెల్లబోవుటతో, చిన్నఁబోవుచు=చిన్నపుచ్చుకొనుచు, దుర్నిమిత్తంబులన్=చెడు సూచనములను, కనుచున్, తత్తరంబునన్=తత్తరపాటుతో, ఆశ్రమంబునకున్, జని, అక్కడ...

తా : లక్ష్మణుడు చెప్పిన మాటలు విని, తెల్లబోయి, చిన్నబుచ్చుకుని అపశకునాలు కనబడగా, కంగారుపడుతూ, ఆశ్రమానికి వెళ్లి, అక్కడ.

**సీతను గనని శ్రీరామచంద్రుని విరహాతిశయము**

**ఆ. పర్ణశాలలోనఁ బరికించి పరికించి,**
**సీత కానఁబడమిఁ జిన్న వోయి,**
**చిత్తమంతఁ గలఁగి, శ్రీరామచంద్రుండు**
**పలవరింపఁ జొచ్చె భ్రమసి భ్రమసి. 51**

ప్రతి : పర్ణశాలలోనన్=పర్ణశాలలో ఆకులతో కట్టినశాలలో, పరికించి, పరికించి=జాగ్రత్తగా వెదకి వెదకి, సీత, కానఁబడమిఁ=కనబడక పోవుటచే, చిన్నవోయి=దిగులుపడి, చిత్తము+అంతన్=మనస్సంతా, కలఁగి=చెదరి, శ్రీరామచంద్రుండు, భ్రమసి భ్రమసి=దిక్కుతోచక దిగులుపడి, పలవరింపన్=ఆమె గురించే విలపించ, చొచ్చె=ప్రారంభించాడు.

తా : లక్ష్మణుని మాటలకు కలవరపడుతూ, రాముడు పర్ణశాలలో వెదికి వెదికి, సీతాదేవి కనబడక పోయేసరికి దిగులుపడి, మనస్సు కలత చెందగా, శ్రీరాముడు దిక్కుతోచని స్థితిలో సీతను గురించి విలపించాడు.

**సీ. నీ దృగ్విలాసంబు నెఱి నభ్యసించెడు**
**గురు కుచఁ గానవే హరిణ విభుఁడ!**
**నీ మంజులాలాప నిచయంబుఁ గైకొన్న**
**సుకుమారిఁ గానవే పిక కులేంద్ర!**
**నీ నిండు సత్కాంతి నెమ్మోము గలయట్టి**
**రుచిరాంగిఁ గానవే రోహిణీశ!**
**నీ పక్ష విస్ఫూర్తి నెనయు ధమ్మిల్లంబు**
**గల యింతిఁ గానవే యళి కులేశ!**

**తే. స్తన భరంబున నీ పోల్కిఁ దనరినట్టి**
**యతివఁ గానవె చక్రవాకాధినాథ!**
**నెఱయ నినుఁబోలు నెన్నడ నేర్చినట్టి**
**రమణిఁగానవె నీవు మరాళ రాజ! 52**

**ప్రతి :** హరిణ విభుండ!=లేడిరాజా, నీ=యొక్క, దృగ్విలాసంబు=చూపుల అందము, నెఱిన్=బాగా, అభ్యసించెడు=పదేపదే ప్రయత్నించే, గురుకుచన్=పెద్దస్తనములు గల సీతను, కానవే=చూడలేదా? పికకులేంద్ర=కోకిల కులశ్రేష్ఠుడా!, నీ మంజులాలాప=నీ మధురమైన పలుకుల, నిచయంబున్= సమూహాన్ని, కైకొన్న=తనవిగా చేసుకున్న, సుకుమారిన్=సీతను, కానవే=చూడలేదా?, రోహిణీశ=రోహిణీపతియైన చంద్రుడా!, నీ, నిండు సత్కాంతి=పరిపూర్ణమైన చక్కని కాంతిగల, నెమ్మోము=ముఖము, కలయట్టి= కలిగియున్న, రుచిరాంగి=కాంతిమంతమైన అంగములు గల సీతను, కానవే=చూడలేదా?, అళికులేశ= తుమ్మెదల ప్రభూ, నీ పక్షవిస్ఫూర్తి=నీ రెక్కల కాంతిని, ఎనయు=పోలిన, ధమ్మిల్లంబు=కొప్పు, కల=కలిగిన, ఇంతి=స్త్రీని-సీతని, కానవే=చూడలేదా?, చక్రవాకాధినాథ=చక్రవాకముల అధిపతి, స్తనభరంబున=కుచముల ఆకారము, నీ పోల్కిన్=నీ వలె, తనరినట్టి=ఒప్పినట్టి, అతివన్=స్త్రీని, కానవె=చూడలేదా, మరాళరాజ!= హంసరాజ!, నెఱయ= పూర్తిగా, నినున్, పోలు, నెన్నడ=అందమయిన నడక, నేర్చినట్టి=నేర్చుకున్నట్టి, రమణిన్=స్త్రీని-సీతని, కానవె?=చూడలేదా?.

**తా :** ఓ లేడిరాజా! నీ చూపుల అందాన్ని పొందాలని ప్రయత్నించే - పెద్దచన్నులు గల సీతను చూడలేదా, కోకిలకుల శ్రేష్ఠుడా! నీ పలుకుల వంటి మధురమైన వాక్కులు గల సుకుమారి సీతను చూడలేదా? ఓ చంద్రుడా! నీ కాంతివంటి ముఖము గలసీతను చూడలేదా? ఓ తుమ్మెదా! నీ ఱెక్కలకాంతి వంటి కాంతితో నల్లని కొప్పుగల సీతను చూడలేదా?! ఓ చక్రవాకమా! నీతో పోల్చదగిన స్తనములు గల రమణిని చూడలేదా?, ఓ హంసరాజా! అందమైన నీ నడకలవంటి నడకలు గల సీతను చూడలేదా?

**విశే :** శ్రీరాముడు సీత అంగాంగాలతో పోలిక గలిగినట్టి - లేడి, కోకిల, చంద్రుడు, తుమ్మెద, చక్రవాకము, మరాళములతో సీతకు వాటితో గల సంబంధాన్ని వివరిస్తూ సీతను చూసావా? చూడలేదా! అంటూ - దుఃఖావేశంలో ప్రశ్నిస్తున్నాడు. కవి సమయాలు పాటించి వ్రాసిన పద్యమిది.

**సీ. ఘనసార భూజంబ! కానవే నీ వంటి**
**గంధంబు గలయట్టి కరిటియానఁ?**
**గదళికా తరురాజ! కానవే నీ యట్టి**
**మెఱుఁగుఁ బెందొడల మా మీననేత్ర?**
**విలసిల్లు చంపక వృక్షంబ! కానవే**
**లలి నీదు పుష్ప విలాస నాసఁ?**
**గమనీయ లత! నీవు కానవే నీయట్టి**
**కరములు శోభిల్లు కంబుకంఠిఁ?**

**తే. గ్రముక ధరణీరుహాధీశ! కానవయ్య**
**నీ ఫల స్ఫూర్తి కంఠంబు నీలవేణిఁ**

**గళికలను మించు నవకుంద! కానవమ్మ**
**నీదు కోరకనిభ దంత నీరజాస్య? 53**

**ప్రతి :** ఘనసారభూజంబ!=కర్పూరవృక్షమా! నీ వంటి=నీ వలె, గంధంబు=సువాసన, కలయట్టి=కలిగినట్టి, కరటియానన్=ఏనుగు నడకల వంటి నడకలు గల ఆమెను, కానవే=చూడలేదా? కదళికాతరురాజ=శ్రేష్ఠమైన ఓ అరటిచెట్టా, నీ యట్టి, మెఱుఁగు=మెరయునట్టి, పెందొడల=పెద్ద తొడలు గల, మా, మీననేత్ర=చేపలవంటి కన్నులు గల సీతను, కానవే=చూడలేదా? చంపక వృక్షంబ!=ఓ సంపెంగచెట్టు! విలసిల్లు=బాగుగా ఎదిగి, లలి=ప్రేమతో, నీదు=నీయొక్క పుష్ప విలాసనాసన్=పువ్వువంటి అందమైన ముక్కుగల, సీతను, కానవే= చూడలేదా! కమనీయలత!=అందమైన ఓ లతా! నీయట్టి=నీవంటి, కరములు=చేతులు, శోభిల్లు= ప్రకాశించు, కంబుకంఠి=శంఖమువంటి కంఠము గల సీతను, నీవు, కానవే!, క్రముక=పోక, ధరణీరుహము= చెట్టు, అధీశ=రాజ!, నీ, ఫలస్ఫూర్తి=పండ్ల ప్రకాశమువంటి, కంఠంబు, నీలవేణి=నల్లని కురులుగల సీతను, కానవయ్య!=చూడలేదటయ్యా!, కళికలమించు=మొగ్గల విషయంలో అతిశయించిన, నవకుంద=విరజాజి మల్లెలలో ఒక రకము, నవమల్లిక – అనే వ్యవహారం కూడా ఉంది, నీదు=నీ యొక్క కోరకనిభ దంత=మొగ్గల వంటి దంతములు గలిగిన, నీరజాస్య=పద్మముఖి సీతను, కానవమ్మ=చూడలేదా అమ్మా!

**తా :** ఓ కర్పూర వృక్షమా! నీ పరిమళమువంటి పరిమళముగల గజగమనను చూడలేదా, ఓ అరటిచెట్టా! నీ కాండముతో సరియైన తొడలు గల మీననేత్రను చూడలేదా, చంపకవృక్షమా! నీ పువ్వువంటి అందమైన ముక్కుగల ఆమెను చూడలేదా! ఓ అందమైన లతా! నీవంటి సుకుమారమైన చేతులుగల కంబుకంఠిని చూడలేదా?, ఓ పోకవృక్ష రాజమా! నీ ఫలములవలె ఒప్పు కంఠముగల నీలవేణిని చూడలేదా! మొగ్గల విషయంలో పేరుపొందిన నవమల్లికా! నీ మొగ్గలవంటి పలువరుస గల పద్మముఖిని సీతని చూడలేదా?

**విశే :** ఈ పద్యంలో పర్ణశాల చుట్టుపక్కల గల వివిధవృక్షాలను, సీతను చూడలేదా? అని రాముడు ప్రశ్నిస్తున్నాడు. ఆయా వృక్షాలతో సీతకు గల సామ్యాన్ని చక్కగా వివరించింది మొల్ల. ఇదికూడా కవిసమయాలతో కూర్చిన పద్యమే.

**సీ. వనజాస్య! నినుఁగూడి వర్తించు నతిఘోర**
**వనములు శృంగార వనము లగును,**
**పడఁతి! నీతోఁగూడి పవళించు కర్కశ**
**శయ్యలు పూవుల శయ్య లగును**
**గలకంఠి! నీచేతి కందమూలాది భో**
**జనములు మధుర భోజనము లగును,**
**హరిమధ్య! నినుఁగూడి చరియించు నటువంటి**
**తపములు సత్పుణ్య తపము లగును,**

తే. ఇంతి! నీతోడఁ గూడి భోగించునట్టి
భోగమంతయు దేవేంద్ర భోగ మగును
సుదతి! పొడకట్టఁగదె నాకుఁ జూడవలయుఁ
గన్నులకుఁగానఁబడ వేమి కమల నయన!. 54

**ప్రతి :** వనజాస్య!=పద్మముఖీ!, నినుఁగూడి=నీతో కలిసి, వర్తించు=తిరుగాడు, అతి ఘోరవనములు=మిక్కిలి భయంకరమయిన అడవులు, శృంగారవనములు=చక్కటి ఉద్యానవనాలు, అగును, పడతి=స్త్రీ, నీతోఁగూడి, పవళించు=శయనించు, కర్కశ శయ్యలు=గట్టిగా ఉండేశయ్యలు, పూవుల శయ్యలగును=పూలతో ఏర్పాటు చేసిన పరుపులు అగును, కలకంఠి!=మధురమయిన కంఠస్వరముగలదానా, నీచేతి=నీచేతితో తయారుచేసిన, కంద=కంద, మూలాది=ముల్లంగి మొదలయిన దుంపకూరలు, భోజనములు, మధుర భోజనములగును= తీపిపదార్థాలతో కూడిన కమ్మని భోజనములవుతాయి, హరిమధ్య=సింహము నడుమువంటి నడుము గలదానా, నినుఁగూడి=నీతోకలసి, చరియించున్=ఆచరించు, అటువంటి తపములు, సత్పుణ్యతపములు= మంచి పుణ్యతపములు, అగును, ఇంతి=మనోహరీ!, నీతోడఁగూడి, భోగించునట్టి=అనుభవించునట్టి, భోగమంతయు=వివిధ సుఖములన్నీ, దేవేంద్ర భోగమగును=ఇంద్రభోగాలుగా అవుతాయి, సుదతి=చక్కని పలువరుస గలదాన, పొడకట్టగఁదె=కనిపించవచ్చు గదా!, నాకున్=నాకు, చూడవలయు=చూడాలి అని ఉంది, కన్నులకు, కానబడవేమి=కనబడకుండా ఉన్నావేమి? కమలనయన=కమలములవంటి కన్నులు గలదానా!

**తా :** పద్మముఖీ! సీతా! నీతో కలిసి సంచరిస్తే ఘోరారణ్యాలు కూడా ఉద్యానవనాలుగా భాసిస్తాయి. నీతో కలిసి నిద్రించే గట్టిశయ్యలు పూలపాన్పులవుతాయి, నీ చేతితో పెట్టిన కందమూలాలు మధురభోజనం అవుతుంది, నీతో కలిసి చేసిన తపస్సులు పుణ్య తపస్సులవుతాయి, నీతో కలిసి అనుభవించే సుఖాలన్నీ ఇంద్ర భోగాలవుతాయి. నిన్ను చూడాలని ఉంది. నాకన్నులకు కనబడవేమి? కమలనయన! సీతతో కలిసి జీవిస్తే అది ఎంత మధురంగా ఉంటుందో రాముడు ఆర్తితో వ్యక్తీకరించాడు.

వ. అని మఱియును. 55

**తా :** అని ఇంకనూ

సీ. ఏ మృగంబును గన్న నేణాక్షిఁ గానవే?
యని పెక్కు భంగుల నడిగి యడిగి,
యే పక్షిఁ గనుఁగొన్న నెలనాఁగఁ గానవే?
యని పెక్కు భంగుల నడిగి యడిగి,
యే ద్రుమానుఁ బొడగన్న వామాక్షిఁ గానవే?
యని పెక్కు భంగుల నడిగి యడిగి.

**యే గట్టుఁ బొడగన్న నిభయానఁ గానవే?**
**యని పెక్కు భంగుల నడిగి యడిగి,**

**ఆ. కలఁగు, భీతి నొందుఁ, దలఁకుఁ జిత్తములోన,**
**సొలయు, మూర్ఛఁ బోవు నలయు, నలఁగు,**
**సీతఁ గానఁబడమి శ్రీరామచంద్రుండు**
**విరహ తాప వహ్ని వేఁగి వేఁగి. 56**

ప్రతి : ఏమృగంబును గన్న=ఏ జంతువు కనబడినా, ఏణాక్షిన్=లేడికన్నులువంటి కన్నులగల స్త్రీని, కానవే?, అని పెక్కుభంగులన్=అనేకవిధాలుగా, అడిగిఅడిగి=పదేపదే అడిగి, ఏపక్షిన్, కనుగొన్నన్=చూసినా, ఎలనాగన్=స్త్రీని, కానవే అని, పెక్కు భంగులన్=అనేక విధాలుగా అడిగిఅడిగి, ఏద్రుమానున్=చెట్టును, పొడగన్న= చూచినా, వామాక్షిన్=అందమయిన కన్నులుగల సీతనుకానవే? అని, అడిగి అడిగి ఏ, గట్టున్= కొండను, పొడగన్నన్, ఇభయానన్=ఏనుగునడకవంటి నడకగల సీతను, కానవే-అని, పెక్కుభంగులన్, అడిగిఅడిగి, కలఁగు=చలించిపోవును, భీతినొందు=భయపడును, తలఁకు చిత్తములోనన్=మనస్సులో బాధపడును, సీత కానఁబడమి=సీత కనబడక పోవుటచే, శ్రీరామచంద్రుండు, విరహతాప వహ్ని=వియోగము చేత ఏర్పడిన అగ్నిచే, వేఁగివేఁగి=కాలి కాలి.

**తా :** ఏ జంతువు కనబడినా సీతను చూసావా? అని అనేకవిధాలుగా అడిగి అడిగి, ఏ పక్షి కనబడినా, ఏ చెట్టునుచూసినా, ఏ కొండని చూసినా సీతను చూసావా? అని అనేక విధాలుగా అడిగి అడిగి ఏసమాధానం రాకపోయేసరికి, సీత కనబడకపోవడంతో విరహాగ్నిలో వేగి వేగి శ్రీరామచంద్రుడు - చలించిపోతున్నాడు, మిక్కిలి అలిసిపోతున్నాడు, మూర్ఛపోతున్నాడు, పర్ణశాలచుట్టూ తిరుగుతూ బాధపడుతున్నాడు.

**వ. ఇట్లు సీతా వియోగంబునకుఁ బలవరించుచున్న యన్నం గని సౌమిత్రి యిట్లనియె. 57**

ప్రతి : ఇట్లు=ఈ విధంగా, సీతావియోగంబునకున్=సీత ఎడబాటునకు, పలవరించుచున్న యన్నన్=బాధతో పలుకుచున్న అన్నను, కని, సౌమిత్రి, ఇట్లు, అనియె.

**తా :** ఇలా సీతావియోగంలో విలపిస్తున్న అన్నను చూచి సౌమిత్రి ఇట్లనియె

## శ్రీరామునికి లక్ష్మణుని స్వాంతనము

**క. దీనుని కైవడి నూరక**
**మానము సెడి వగవ నేల మనుజేశ్వర! యీ**
**కానన భూముల వెదకఁగఁ**
**గానని మీఁదటను వగవఁగాఁ దగు మనకున్. 58**

**ప్రతి :** దీనునికైవడి=భయపడినవానివలె, ఊరక=ప్రయత్నించకుండా, మానము సెడి=ధీరత లేకుండా, వగవనేల=దుఃఖపడడం ఎందుకు? మనుజేశ్వర!=రాజా, ఈ కాననభూముల=ఈ అరణ్య ప్రాంతమంతా, వెదకఁగన్=వెదకి, కానని మీఁదటను=కనబడకపోతే, వగవఁగాన్=దుఃఖపడడం, మనకున్, తగు=తగినది.

**తా :** ఓ రాజా! పూర్తిగా ప్రయత్నం చేయకుండా భయపడి, పౌరుషం లేకుండా దుఃఖపడడం ఎందుకు? ఈ అరణ్య భూములన్నీ వెదికి సీతకనబడపోతే మనం దుఃఖపడవచ్చు.

**వ. అని ప్రతాపించి, కోప మాఁపుకోఁ జాలక కన్నులు జేగురింప నన్నతో నిట్లనియె. 59**

**ప్రతి :** ప్రతాపించి=ప్రతాపము ప్రదర్శించి, కోపము, ఆపుకోజాలక=నిగ్రహించుకోలేక, కన్నులు, జేగురింప=ఎఱ్ఱగా అవగా, అన్నతో, ఇట్లనియె.

**తా :** ప్రతాపం ప్రదర్శిస్తూ కోపం ఆపుకోలేక కళ్లు ఎఱ్ఱగా కాగా లక్ష్మణుడు అన్నతో ఇలా అన్నాడు,

**ఉ. వ్రచ్చెద నాక లోకమున వారల గుండెలు, నాగ లోకమున్**
**గ్రొచ్చి యహీంద్ర వర్గమును గూల్చెదఁ, గవ్వపుఁ గొండకైవడిన్**
**ద్రచ్చెద మర్త్యలోకము, నుదారత నే గతి నైనఁ గ్రమ్మఱన్**
**దెచ్చెద సీత, నీ క్షణమ దేవర చిత్తము మెచ్చునట్లుగన్. 60**

**ప్రతి :** వ్రచ్చెద=పెకలించుదును,నాకలోకమునవారల=స్వర్గంలోకంలోఉండే వారి, గుండెలు, నాగలోకమున్=నాగులు ఉండే పాతాళలోకం, గ్రొచ్చి=త్రవ్వి, అహీంద్రవర్గమును=నాగురాజుల సమూహాన్ని, కూల్చెదన్, కవ్వపున్ కొండ=కవ్వముగా చేయబడినకొండ, మందరపర్వతము, కైవడిన్=వలె, త్రచ్చెద=చిలుకుతాను, మర్త్యలోకమున్=మానవలోకమును, ఉదారత=ఘనముగ, ఏగతినైనన్=ఏమార్గంలోనైనా, సీతను, క్రమ్మఱన్=మరల, తెచ్చెద, ఈ క్షణము=ఇప్పుడే, దేవరచిత్తము=ప్రభువుల మనస్సు, మెచ్చునట్లుగన్.

**తా :** స్వర్గలోకంలోని వారి గుండెలు పీకేస్తాను, పాతాళలోకం దాకా త్రవ్వి నాగరాజులను చంపేస్తాను, మానవలోకాన్ని మందర పర్వతంలా చిలికేస్తాను, ఘనంగా ఏదో మార్గంలో సీతను ఇప్పుడే తీసుకువస్తాను మీమనస్సు మెచ్చేటట్లుగా.

**వ. అని యట్లు పలికి మఱియును. 61**

**తా :** అని ఆ విధంగా పలికి, ఇంకా –

**ఉ. చించెద దైత్య సంఘములఁ జిందఱవందఱఁ జేసి, బ్రహ్మ బా**
**ధించెద, లోక పాలకులఁ ద్రెళ్ళఁగ నేసెద, భూతలమ్ము గ్ర**
**క్కించెద, శైల జాలము గీటడఁగించెద, భూమినందనన్**
**గాంచెదఁ దల్లడిల్లకుము కంజహితాన్వయవార్ధిచంద్రమా! 62**

**ప్రతి :** చించెద=చింపేస్తాను, దైత్యసంఘముల్=రాక్షస సమూహాలను, చిందఱ వందఱన్ చేసి, బ్రహ్మ=బ్రహ్మ గారిని, బాధించెద=బాధపెడతాను, లోకపాలకులన్=ఆయాలోకాలను పాలించే రాజులను, త్రెళ్లగనే సెద= చనిపోవునట్లుగా, కొట్టెదను, భూతలమ్ము=భూమిని, క్రక్కించెద=కడుపులోనిదంతా బయటకు వచ్చేలా చేస్తాను, శైలజాలము=పర్వతసమూహాల, గీటడగించెద=గర్వము పోగొట్టెదను, భూమినందనన్=భూపుత్రి అయిన సీతను, కాంచెదన్=కనిపెడతాను చూస్తాను, తల్లడిల్లకుము=కంగారుపడకుము, కంజహితాన్వయ వార్ధిచంద్రమా!=తామర పూలకుహితుడైన సూర్యవంశ సముద్రానికి చంద్రుని వంటివాడా! శ్రీరామచంద్రా!

**తా :** రాక్షసుల మూకలను చిందఱవందఱ చేసి చంపేస్తాను, బ్రహ్మను బాధపెడతాను, ఆయా లోకపాలకుల్ని చంపేస్తాను, భూమి కక్కేలా చేస్తాను, పర్వతాల గర్వం పోగొడతాను. సీతను తప్పకుండా కనుగొంటాను. ఓ శ్రీరామచంద్రా! కలతపడకు.

**క. భూతలమును, నాకసమును,**
**బాతాళంబును నెమకియొ బాధించియొ నే**
**సీతను దెచ్చిన పిమ్మట**
**నీ తమ్ముఁడ ననుచు మెచ్చు నిఖిలోర్వీశా! 63**

**ప్రతి :** భూతలమును=భూమిని, ఆకసమును=ఆకాశాన్ని, పాతాళంబును=పాతాళలోకమును, నెమకియు=పూర్తిగా వెదకిగానీ, బాధించియొ=ఆలోకాల్లోని వారిని బాధపెట్టో, నే=నేను, సీతను, తెచ్చిన పిమ్మట=తీసుకువచ్చిన తరువాత, నీతమ్ముఁడను అనుచు, మెచ్చు=మెచ్చుకో, నిఖిలోర్వీశా!=భూనాయకుడా!

**తా :** భూపాలకుడవయిన శ్రీరామా! భూమి, ఆకాశం, పాతాళాలలో వెతికిగానీ, ఈలోకాల్లోవారిని బాధించిగాని నేను సీతను తీసుకొని వస్తాను, అప్పుడు నువ్వు నన్ను నీ తమ్ముడనని మెచ్చుకో!

**వ. అని పలుకుచున్న తమ్ముని శౌర్య ధైర్యాది గుణంబులకు సంతోషించుచు. జనస్థానంబు వెడలి, జనక నందన నన్వేషించుచు దక్షిణాభిముఖులై చనుచు ముందట. 64**

**ప్రతి :** అని=ఈ విధంగా, పలుకుచున్న=మాట్లాడుచున్న, తమ్ముని శౌర్య ధైర్యాది గుణంబులకున్=తమ్ముడగు లక్ష్మణుని యొక్క శౌర్యము, ధైర్యము మున్నగు గుణములకు, సంతోషించుచు, జనస్థానంబు వెడలి=తమ నివాసమగు జనస్థానమునకు వెళ్ళి, జనకనందనన్=జనకుని కూతురగు సీతను, అన్వేషించుచు=వెదుకుచూ, దక్షిణాభిముఖులై చనుచు=దక్షిణ దిశకు అభిముఖముగా వెళ్ళుచు, ముందట=ఎదురుగా...

**తా :** అని పలుకుచున్న తమ్ముని శౌర్యానికి ధైర్యానికి ఆనందిస్తూ, జనస్థానం నుండి సీతాదేవిని వెదకుచు దక్షిణదిశగా వెళ్లుచుండగా – ఎదుట.

## జటాయువు రామునకు రావణుని దుశ్చేష్టను దెలుపుట

**క. పక్షములుఁ గాళ్ళుఁ దునిఁగిన**
**పక్షీంద్రునిఁ జూచి రామభద్రుఁడు మదిలో**

**రాక్షస మాయయొ? యనుచును**
**శిక్షింపదలంచు నంత శీఘ్రమె పలికెన్.** **65**

**ప్రతి :** పక్షములున్=రెక్కలు, కాళ్లున్=కాళ్లను, తునిఁగిన=విరిగిన, పక్షీంద్రునిన్= పక్షిరాజుని, చూచి, రామభద్రుఁడు, మదిలో=మనస్సులో, రాక్షసమాయయొ?=రాక్షసమాయా?, అనుచును=అనుకుంటూ, శిక్షింపన్=దండింప, తలంచునంత=అనుకునేటంతలో, శీఘ్రమె=వేగంగా, పలికెన్=పలికెను.

**తా :** రెక్కలు, కాళ్లు తెగిపడిన పక్షిరాజును చూచి శ్రీరాముడు రాక్షసమాయలా ఉంది, వీనిని దండించాలని తలంచేసరికి ఆ పక్షి వెంటనే పలికింది.

**క.** **నీ తండ్రికి నతి మిత్రుఁడ**
**నో తండ్రీ! నన్ను నేయ నుచితమె నీకున్?**
**నా తగు పేరు జటాయువు**
**సీతాధిప! నన్ను నెఱుఁగు చిత్తములోనన్.** **66**

**ప్రతి :** నీ తండ్రికిన్=నీ తండ్రికి, అతి మిత్రుఁడను=చాలా మంచి స్నేహితుడను, ఓ తండ్రీ=నాయనా! వాత్సల్యంతో పిలిచే పిలుపు, నన్నున్, ఏయన్=చంపడం,నీకున్, ఉచితమె=న్యాయమా? నా, తగుపేరు జటాయువు=నాకుగల పేరు జటాయువు, సీతాధిప!=సీతాపతి! నన్ను, ఎఱుఁగు=గుర్తుకుతెచ్చుకో, చిత్తములోనన్=మనస్సులో–

**తా :** ఓ సీతాపతి రామా! నీ తండ్రికి నేను అత్యంత సన్నిహితుడయిన మంచి మిత్రుణ్ణి, నన్ను చంపాలనుకోవడం నీకు తగునా? నా పేరు జటాయువు, నన్ను గుర్తుపట్టు, మనసులో ఒకసారి ఆలోచించుకో.

**వ.** **అని చెప్పి వెండియు నా జటాయు విట్లనియె.** **67**

**ప్రతి :** అనిచెప్పి=ఆ విధంగా పలికి, వెండియున్=మరల, ఆ జటాయువు, ఇట్లు=ఈ విధంగా, అనియె= పలికెను.

**తా :** 'నీ తండ్రి మిత్రుడను నన్ను గుర్తుపట్టు' అని పలికి, మరల ఆ జటాయువు ఈ విధంగా పలికెను.

**మ.** **వినుమో రాఘవ! పంక్తి కంధరుఁడు దోర్వీర్యంబు సంధిల్లఁగా**
**జనక క్ష్మాపతి నందనన్ గొనుచు స్వేచ్ఛా వృత్తితో నేఁగుచో**
**వనితా రత్నము దీనయై పలుకు తద్వాక్యంబు లేర్పాటుగా**
**విని పోరాడఁగఁ బ్రాప్తమయ్యె మఱి యీ వేషంబు భూమీశ్వరా!.** **68**

**ప్రతి :** ఓ రాఘవ!=ఓరామా! వినుము, పంక్తికంధరుడు=రావణుడు, పది కంఠములు గలవాడు, దోర్వీర్యంబు=భుజబలము, సంధిల్లగా=సమకూడగా, జనకక్ష్మాపతినందనన్=జనకమహారాజు కూతురను, కొనుచు=పట్టుకొని, స్వేచ్ఛావృత్తితోన్=అడ్డు ఆపులేకుండా, ఏఁగుచో=పోతూ ఉండగా, వనితారత్నము=

స్త్రీ రత్నమయిన సీత, దీనయై=దిక్కులేనిదై, పలుకు తద్వాక్యంబులు=ఆమెమాటలు, ఏర్పాటుగావిని= స్పష్టంగా విని, పోరాడగా=రావణునితో యుద్ధం చేయగా, మఱి ఈ వేషము=ఈ స్థితి, ప్రాప్తమయ్యె=సమకూడింది, భూమీశ్వరా!=రాజా!

**తా :** ఓ రాజా! ఓ రాఘవా! వినుము. రావణాసురుడు తన బాహుబలంతో జనకమహారాజు కూతురగు సీతను తీసికొని స్వేచ్ఛగా వెళుచుండగా, స్త్రీరత్నమగు సీత దీనురాలై పలికెడి ఆ మాటలను విని, ఆతనితో పోరాడగా నాకీవేషము ప్రాప్తమయ్యింది.

**క.** **అని సీత తెఱఁగుఁ దన పని**
**జననాయకుఁడైన రామచంద్రునితోడన్**
**వినిపించి, యా జటాయువు**
**తను వెరియఁగ నంతఁ గాలధర్మము నొందెన్. 69**

**ప్రతి :** అని, సీత, తెఱంగున్=స్థితిని, తనపని=తానుచేసినపని, జననాయకుఁడైన=జననాయకుఁడైన, రామచంద్రునితోడన్, వినిపించి=చెప్పి, ఆ, జటాయువు, తనువు=శరీరము, ఎరియగన్=బాధపడగా, అంతన్=అంతట, కాలధర్మము నొందెన్=మరణించెను.

**తా :** జటాయువు సీతను రావణుడు ఎత్తుకునిపోతుండగా, విలపించిన విధానమంతా చెప్పాడు. తాను ఏ విధంగా రావణునితో యుద్ధం చేసాడో, రావణుడు తన రెక్కలు ఖండించడం మొదలయిన విషయాలన్నీ జననాయకుడైన రామచంద్రునితో చెప్పి, బాధపెడుతున్న శరీరాన్ని విడిచి కాలధర్మం చెందాడు.

**వ. ఇట్లు రామచంద్రునకు సకల వృత్తాంతమును నెఱింగించి శరీరంబు విడిచిన యప్పక్షిరాజునకు భక్తి పూర్వకంబుగా నగ్ని సంస్కారాది విధులు దీర్చి, దక్షిణాభిముఖులై చనుచుఁజిత్ర రూపంబున నున్న కబంధుని వధియించి, ముందట. 70**

**ప్రతి :** ఇట్లు=ఈ విధంగా, రామచంద్రునకున్, సకల వృత్తాంతమును=జరిగినదానినంతనూ, ఎఱింగించి= తెలియజేసి, శరీరంబు విడిచిన, ఆ+పక్షిరాజునకున్=పక్షిరాజగు ఆ జటాయువునకు, భక్తిపూర్వకంబుగాన్, అగ్నిసంస్కారాదివిధులు=అగ్నిసంస్కారము మొదలగు కర్తవ్యములు, తీర్చి=పూర్తిచేసి, దక్షిణాభిముఖులై=దక్షిణ దిక్కునకు అభిముఖంగా, చనుచున్, చిత్రరూపంబునన్=ఆశ్చర్యకరమగు రూపముతో, ఉన్న, కబంధుని, వధియించి, ముందట=ఎదురుగా...

**తా :** ఇలా రామచంద్రునకు విషయాలన్నీ చెప్పి, శరీరం విడిచిపెట్టిన ఆ పక్షిరాజు జటాయువుకి, భక్తితో అగ్నిసంస్కారం చేసి దక్షిణదిక్కుగా వెళుచుండంగా, చిత్రమైన ఆకారంలో ఉన్న కబంధుని వధియించి, ముందుకు వెళ్తూ ఉండగా!

## శబరి మధురభక్తి

క. **చని చని, యెదుటను రాముఁడు**
**గనుఁగొనియె మహీజనోగ్ర కలుషాద్రి మహా**
**శని రూపం బనఁ దగు, నా**
**ఘన ముక్తివధూవిలాస కబరిన్, శబరిన్.** **71**

**ప్రతి :** చనిచని=వెళ్లివెళ్లి, ఎదుటను=ఎదురుగా, రాముఁడు, మహీజనోగ్ర=మహీజన+ఉగ్ర, మహీజన=భూమిమీది జనుల, ఉగ్ర=భయంకరమైన, కలుష+అద్రి, కలుష=పాపములనెడు, అద్రి=పర్వతమునకు, మహాశని, మహ+అశని=గొప్ప పిడుగు వంటి–రూపంబు=ఆకారము, అనదగు, ఆ ఘన=గొప్ప, ముక్తివధూ విలాస కబరిన్=ముక్తికాంత యొక్క మనోహరమైన కొప్పువంటి, శబరిన్=శబరిని, కనుగొనియె=చూశాడు.

**తా :** అలా వెళ్లి వెళ్లి రాముడు లోకంలోని జనులు చేసిన భయంకరమైన పాపాల కొండకు పిడుగువంటి ఆకారము అనదగిన, ముక్తికాంత యొక్క మనోహరమైన కొప్పువలె ఒప్పుచున్న శబరిని చూశాడు.

**విశే :** లోకంలో కొందరిని దర్శించిన మాత్రంలోనే పాపాలన్నీ నశిస్తాయి అంటారు. ఇక్కడ పవిత్ర జీవని, వృద్ధురాలు, భక్తితత్పరురాలు అయిన శబరి లోకంలోని ప్రజలు చేసిన పాపాలనే కొండను నాశనం చేయగల పిడుగులా ఉంది అని వర్ణన. అలాగే సాక్షాత్తు ఆమె ముక్తికాంత యొక్క కొప్పులా ఉంది అని శబరి పవిత్రరూపాన్ని వర్ణించింది మొల్ల.

'ముక్తి వధూవిలాస కబరిన్ శబరిన్' – శబ్దాలంకారము.

తే. **కాంచినను మ్రొక్కి యా భూమికాంతునకును**
**మించి సద్భక్తిఁ బూజ గావించినంత**
**శబరితోడను దమ కార్యసరణిఁ దెలియ**
**వినయమునఁ జెప్ప నా కాంత విన్నవించె.** **72**

**ప్రతి :** కాంచినను=చూడగా, మ్రొక్కి=నమస్కరించి, ఆ, భూమి కాంతునకును=ఆ రాజునకు, మించి=అతిశయించిన, సద్భక్తిన్=ఉత్తమమయిన భక్తితో, పూజ, కావించినంత=చేయగా అప్పుడు, శబరితోడను, తమకార్యసరణి=తాము సీతాన్వేషణ అనే పనిలో ఉన్నామనే విషయాన్ని, తెలియన్=తెలియునట్లు, వినయమునన్, చెప్పన్, ఆ కాంత=ఆ స్త్రీ, విన్నవించె=ఈ విధముగా చెప్పింది.

**తా :** శబరి భూకాంతుడగు రాముని చూచి, మ్రొక్కి, మిక్కిలి భక్తితో పూజ కావించెను. పిమ్మట వారు శబరితో తమ కార్యవిధానమును వినయముతో తెలియజెప్పారు. అంతట ఆమె ఇలా విన్నవించింది.

తే. **ఇనకులాధీశ! సుగ్రీవుఁ డనెడువాఁడు**
**కపికులశ్రేష్ఠుఁ డత్యంత ఘనుఁడు తలఁప**

**నతనితోఁ బొత్తు గావింపు మన్ని పనులుఁ**
**జక్క నౌటకు నాత్మ నిస్సంశయంబు.** **73**

**ప్రతి :** ఇనకులాధీశ!=సూర్యవంశాధిప!, సుగ్రీవుఁడు, అనెడు వాడు కపికుల శ్రేష్ఠుఁడు=వానరకులంలో గొప్పవాడు, అత్యంతఘనుడు=మిక్కిలి గొప్పవాడు, తలఁప=ఆలోచించగ, అతనితోన్, పొత్తు=స్నేహము, కావింపుము=చేసుకొనుము, అన్నిపనులు, చక్కన్=బాగుగ, ఔటకు=నెరవేరుటకు, ఆత్మన్=మనస్సులో, నిస్సంశయంబు=సంశయము లేకుండా.

**తా :** ఓ రామచంద్రా! వానరకుల శ్రేష్ఠుడయిన సుగ్రీవుడనే వాడు చాల గొప్పవాడు. మనస్సులో ఏ సంశయము లేకుండా అతనితో స్నేహం చేసుకో, నీ పనులన్నీ చక్కబడతాయి.

**వ. అని చెప్పి వీడ్కొలిపిన నమ్మనుజేంద్ర నందను లటమీఁదఁ బంపాతటంబునకుం జని, రని చెప్ప నారదుని వాల్మీకి మునీశ్వరుం డటమీఁద విధానం బెట్టి దని యడుగుటయు.** **74**

**ప్రతి :** అని చెప్పి, వీడ్కొలిపినన్=సాగనంపగా, అమ్మనుజేంద్ర నందనులు=ఆ రాజకుమారులు, అటమీదన్=ఆ తరువాత, పంపాతటంబునకున్=పంప అనే సరోవరతీరానికి, చనిరి, అని, చెప్ప నారదుని, వాల్మీకి మునీశ్వరుండు, అట మీఁది, కథావిధానంబు, ఎట్టిది, అని, అడుగుటయు.

**తా :** శబరి అలా చెప్పి సాగనంపగా ఆ రాజకుమారులు పంపాతీరానికి వెళ్లారు. అని నారదుడు చెప్పగా, ఆ తరువాత కథావిధానం ఎట్టిది అని వాల్మీకి మహర్షి అడిగాడు.

## ఆశ్వాసాంత పద్య గద్యములు

**క. జలజాక్ష! భక్త వత్సల!**
**జలజాసన వినుత పాద జలజాత! సుధా**
**జలరాశి భవ్య మందిర**
**జలజాకర చారు హంస! జానకి నాథా!**

**గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజన వినుత కవితా చమత్కారాతుకూరి కేసనసెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునం దరణ్యకాండము సర్వము నేకాశ్వాసము.**

* * *

# కిష్కింధాకాండ

క. పక్షీంద్రవాహా! గిరిజా
త్ర్యక్ష మనోబ్జాత గేహా! యపహృత మోహా!
రాక్షస భీమా! ముని జన
సాక్షాత్కృత నైజ ధామ! జానకి రామా! 1

**ప్రతి :** పక్షీంద్రవాహా!=పక్షీంద్రుడయిన గరుడుడు వాహనముగా గలవాడా! గిరిజాత్ర్యక్ష=పార్వతీపరమేశ్వరుల, మనోబ్జాతగేహా!=మనస్సనే పద్మమే నివాసమైనవాడా, రాక్షసభీమా!=రాక్షసులకు భయంకరమైనవాడా! అపహృతమోహ=మోహమునుపోగొట్టువాడా, మునిజనసాక్షాత్కృత నైజధామ=మునిజనముచేత సాక్షాత్కరింప చేయబడిన తన నివాసము కలవాడా, జానకిరామా!

**తా :** గరుడవాహనా! పార్వతీ పరమేశ్వరుల హృదయమే గృహముగా గలవాడా! మోహమును పోగొట్టువాడా! మునిజనుల హృదయములో సాక్షాత్కరించిన స్వనివాసము కలవాడా! జానకిరామా!

**వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహామునీశ్వరున కెఱిగించిన తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 2**

**తా :** శ్రీ నారదమునీశ్వరుడు వాల్మీకి మహామునీశ్వరునకు చెప్పిన విధముగ చెప్పెదను వినుము.

### సుగ్రీవుని పంపున రామలక్ష్మణుల సన్నిధికి హనుమంతుని రాక

సీ. పంపా తటమ్మున బాణాసనాయుధ
పాణులై యున్న భూపాల సుతులఁ
గనుఁగొని భీతిల్లి, కమలాప్తసూనుండు
వాలిపంపునఁవీరు వచ్చిరనుచుఁ
గలఁగి,తా ఋష్యమూకంబుననుండగ
వెఱచి,మలయశైల విపినసీమఁ
దిరిగి, వారల రాక తెఱఁగెల్లఁ దెలిసిరాఁ
బవనాత్మజుని వేగఁబంప, నతఁడు

తే. వచ్చి రఘురాము శ్రీపాదవారిజముల
కర్థిఁబ్రణమిల్లిమీరెవ్వరయ్య?యిటకు
నేమికతమున వచ్చితి? రేదినామ?
మనుచు నడిగిన సౌమిత్రి యతని కనియె. 3

**ప్రతి :** పంపాతటమ్మున=పంపాసరస్సు ఒడ్డున, బాణాసనాయుధ పాణులై=విల్లు ఆయుధముగా ధరించి, ఉన్న, భూపాల సుతులన్=రాజకుమారులను, కనుగొని=చూచి, భీతిల్లి=భయపడి, కమలాప్త సూనుండు= సూర్యపుత్రుడు సుగ్రీవుడు, వాలిపంపున=వాలి పంపడంవల్ల, వారు, వచ్చిరి, అనుచు, కలఁగి=క్షోభపడి, తా=తాము, ఋష్యమూకంబునన్=ఋష్యమూక పర్వతము మీద, ఉండగన్=నివసించుటకు, వెఱచి=భయపడి, మలయశైల=మలయపర్వత, విపిన సీమన్=అడవులలో, తిరిగి=సంచరించి, వారల=ఆ రాజకుమారుల, రాక తెలఁగెల్లన్=వారు ఎందుకు వచ్చారో, తెలిసిరాన్=తెలుసుకొని వచ్చుటకు, పవనాత్మజుని=వాయు పుత్రుడయిన హనుమంతుని, వేగపంప=వేగముగా పంపగా, అతడు, వచ్చి, రఘురాము=శ్రీరాముని, శ్రీపాదవారిజములకు=శ్రీపాదపద్మాలకు, అర్థిన్=ప్రీతితో, ప్రణమిల్లి=నమస్కరించి, మీరు, ఎవ్వరయ్య?, ఇటకున్, ఏమి, కతమున=కారణంగా, వచ్చితిరి?, ఏది నామము=మీ పేరేమి, అనుచున్, అడిగిన=అడుగగా, సౌమిత్రి, అతనికి, అనియె.

**తా :** సుగ్రీవుడు పంపాతీరంలో విల్లంబులు ఆయుధాలు ధరించి ఉన్న రాకుమారులను చూచి భయపడ్డాడు. ఈ వీరులు వాలి పంపితే వచ్చారేమో అని భయంతో ఋష్యమూక పర్వతంమీద ఉండలేక, మలయపర్వతారణ్య ప్రాంతాలలో తిరుగుతూ – హనుమంతుణ్ణి పిలిచి – ఆ రాజుకుమారులు ఎవరో, ఎందుకు వచ్చారో తెలుసుకుని రమ్మని పంపాడు. హనుమ వేగంగా వచ్చి శ్రీరాముని పాదపద్మాలకు, ప్రీతితో నమస్కరించి, మీరు ఎవరు? ఈ ప్రాంతాలకు ఎందుకు వచ్చారు? మీ పేరేమి అని అడిగాడు. ఆ హనుమతో సౌమిత్రి ఇలా అన్నాడు.

**సీ. దశరథుండను రాజు తనయుల, మాతని**
**పంపునఁ దప మాచరింపఁగోరి**
**వచ్చి,కాననభూమి వర్తించుచుండ, నీ**
**రాజు దేవిని దుష్ట రావణుండు**
**కుటిలవృత్తిని నెత్తుకొని పోవ, నా జాడ**
**వదలక దిక్కులు వెదకి వచ్చి,**
**శబరికి మా రాక చందంబుఁ దెలియంగఁ**
**జెప్పిన, "నర్కజుచేతఁ గాని**

**తే. మీదు కార్యంబు నెగ్గదు, మీర లరిగి**
**వేగ సుగ్రీవుచెల్మి గావింపుఁ"డనిన**
**వచ్చినారము గనుఁగొనవలసి యతని**
**నతఁడు రాముండు లక్ష్మణుం డంద్రు నన్ను** 4

**ప్రతి :** దశరథుండు, అను, రాజు, తనయులము=కొడుకులము, ఆతని=ఆ దశరథుని, పంపునన్=ఆజ్ఞమేరకు, తపము, ఆచరింపన్, కోరి, వచ్చి, కానన భూమి=అరణ్యములో, వర్తించుచుండన్=ఉంటూ ఉండగ, ఈ

రాజు=ఈ రాముని, దేవిని=భార్యను, దుష్ట రావణుండు=దుష్టుడయిన రావణుడు, కుటిలవృత్తినిన్=మోసముతో, ఎత్తుకొని పోవన్, ఆ జాడ వదలక=ఆ మార్గాన్ని వదలక, దిక్కులు=అన్ని దిక్కుల, వెదకివచ్చి, శబరికి, మా రాకచందంబున్=మేము ఎందుకు వచ్చినదీ, తెలియంగన్=పూర్తిగా తెలియునట్లుగా, చెప్పిన, అర్కజు=సూర్యుని కొడుకైన సుగ్రీవుని, చేతన్‌గాని, మీదు కార్యంబున్=మీపని, నెగ్గదు=ఫలించదు, మీరలు=మీరు, అరిగి=వెళ్లి, వేగ=తొందరగ, సుగ్రీవు చెల్మిన్=సుగ్రీవునితో స్నేహాన్ని, కావింపుడు=చేసుకోండి, అనిన, కనుగొనవలసి యతని=ఆ సుగ్రీవుని కలుసుకోవాలని వచ్చినారము, అతఁడు, రాముడు, నన్ను లక్ష్మణుండు, అంద్రు=అంటారు.

**తా :** మేము దశరథ మహారాజు పుత్రులము. అతని ఆజ్ఞమేరకు అరణ్యంలో తపస్సు చేసుకోవటానికి వచ్చి నివసిస్తూ ఉండగా, ఈ రాముని భార్యను దుష్టుడైన రావణుడు మోసంతో ఎత్తుకునిపోయాడు. మేము ఆమె జాడని వెదకుతూ అన్నిదిశలు తిరిగి శబరి దగ్గరకు వచ్చి మా విషయాలన్నీ ఆమెతో చెప్పగా ఆమె విని – మీ ఈ కార్యం సఫలం కావాలంటే సుగ్రీవునితో స్నేహం చేసుకోండి. అతనివల్ల తప్ప ఈ కార్యం నెరవేరదు అని చెప్పింది. ఆ సుగ్రీవుని కలుసుకోవడానికని వచ్చాము – అతడు రాముడు. నన్ను లక్ష్మణుడు అంటారు.

**తే.** **తలఁప నీ రాజునకు నెందు ధాత్రిలోన**
**విను మసాధ్యంబు లైనట్టి పనులు లేవు,**
**సూర్య వంశోత్తముఁడు మహా శూరుఁ డితఁడు.**
**నీకుఁ బేరేమి చెప్పుమా మాకు ననిన.** **5**

**ప్రతి :** తలఁపన్=ఆలోచించగా, ఈ రాజునకు=ఈ రామునకు, ధాత్రిలోన=భూలోకంలో, వినుము, అసాధ్యంబులైనట్టి=చేయలేని, పనులు, లేవు, సూర్య వంశోత్తముఁడు=సూర్యవంశములో ఉత్తముడు, మహాశూరుడు=గొప్పశౌర్యము గలవాడు, ఇతడు, నీకున్, పేరేమి–పేరు+ఏమి, చెప్పుమా, మాకున్, అనిన.

**తా :** ఆలోచిస్తే ఈ రామునకు భూలోకంలో చేయలేని కార్యంలేదు. ఇతడు సూర్యవంశోత్తముడు, శౌర్యవంతుడు. మాకు నీ పేరేమిటో చెప్పు.

**తే.** **వాయు దేవునిఁ బ్రార్థించి, వేయి గతుల**
**నంజనాదేవి గాంచిన యాత్మజుండ,**
**నర్కజుని మంత్రినై యుందు ననుదినంబు,**
**వినుఁడు నా పేరు హనుమంతుఁ డనుదు రిలను.** **6**

**ప్రతి :** వేయిగతులన్=వేయి విధాల, వాయుదేవునిన్, ప్రార్థించి, అంజనాదేవి, కాంచిన=కనిన, ఆత్మజుండన్=కొడుకును, అనుదినంబు=ప్రతిరోజు (ఎల్లప్పుడు), అర్కజుని=సూర్యపుత్రుడైన సుగ్రీవుని, మంత్రినై=మంత్రిగా, ఉందున్, వినుడు, నా పేరు, హనుమంతుఁడు, అనుదురు, ఇలను=భువిలో.

**తా :** వాయుదేవుని వేయివిధాల ప్రార్థించి అంజనాదేవి కన్నకొడుకును నేను. సుగ్రీవుని మంత్రిని. అతనితో నిత్యము ఉంటాను. నన్ను భూలోకంలో హనుమంతుడు అంటారు.

**విశే :** తనపేరు చెప్పేటప్పుడు, అంటారండి అని చెప్పాలి. హనుమంతుడు అంటారు అని చెప్పడం సంప్రదాయం. అందుకే లక్ష్మణుడు, హనుమ - ఇద్దరూ తమపేరు ఆ విధంగా చెప్పినట్లు వర్ణించి, సంప్రదాయాన్ని పరిచయం చేసింది మొల్ల.

**వ. అని చెప్పి మఱియు నిట్లని విన్నవించె. 7**

**తా :** అని చెప్పి ఇంకా ఈ విధంగా చెప్పాడు.

**చ. వినుఁడు మహాత్ములార! యరవింద హితాత్మజుఁ దోడితెచ్చి మి**
**మ్మును బొడఁ గానుపింతు నని మ్రొక్కుచు నేఁగి, కపీంద్రుఁ జేరి తాఁ**
**జనిన తెఱంగు, వారిఁ గను చందము నేర్పడఁ జెప్పి గొబ్బునన్**
**బనిగొనివచ్చి, రాము పదపంకజముల్ గనిపించె నంతటన్. 8**

**ప్రతి :** వినుఁడు, మహాత్ములార!, అరవిందహితాత్మజున్=తామర పువ్వులకు మిత్రుడయిన సూర్యుని తనయుడయిన సుగ్రీవుని, తోడి తెచ్చి=వెంట తీసుకువచ్చి, మిమ్మును, పొడన్=రూపమును, కానుపింతున్= చూపింతును, అని, మ్రొక్కుచున్=నమస్కరించుచు, ఏఁగి=వెళ్ళి, కపీంద్రున్=సుగ్రీవుని, చేరి=సమీపించి, తాన్=తాను, చనిన తెఱంగు=వెళ్లిన సంగతి, వారిన్=రామలక్ష్మణులను, కను చందమున్= చూసిన విధానమును, ఏర్పడన్=వివరంగా, చెప్పి, గొబ్బునన్=వేగముగా, పనిగొని వచ్చి=పనిగట్టుకొని వచ్చి, రాము పదపంకజముల్= శ్రీరాముని పాదపద్మాలు, కనిపించెన్=చూపించెను, అంతటన్=అప్పుడు.

**తా :** ఓ మహాత్ములారా! వినండి. సుగ్రీవుణ్ణి నావెంట తీసుకువచ్చి మిమ్మల్ని చూపిస్తాను అనిచెప్పి రామునికి నమస్కరించి సుగ్రీవుని దగ్గరకు వెళ్ళి రామలక్ష్మణుల వివరాలన్నీ చెప్పి అతివేగంగా సుగ్రీవుణ్ణి తీసుకొని వచ్చి రామచంద్రుణ్ణి చూపించాడు హనుమంతుడు, అప్పుడు.

## శ్రీరామ సుగ్రీవుల మైత్రి

**వ. సుగ్రీవుండు శ్రీరామచంద్రుని పగ తీర్పఁ దా భారంబు వహించి తనకుఁ బగవాఁడైన వాలిని జంపింపం దలంచి. వానితోఁ దనకుఁ గలిగిన పూర్వ వైరంబు తెఱంగు శ్రీరామునకుఁ దెలియ విన్నవించి, వాలి మహా సత్త్వశాలి యతండు రాముని చేతం దెగుట తెల్లంబుగా, దుందుభి కళేబరంబును బది యోజనంబుల దూర మెగురఁ జిమ్ముటయును జూచి, సప్త తాళంబు లొక్క బాణంబునఁ దెగ వ్రేయుటయును జూచి, సుగ్రీవుండు భయకంపిత హృదయుండై రాఘవేశ్వరుల పాదారవిందంబులకు వందనం బాచరించి జనక నందన మున్ను జాఱవిడిచిన యాభరణంబు మూటఁ దెప్పించి, చూపినం జూచి మూర్ఛిల్లి గొబ్బునం దెలిసి యర్క కులేశ్వరుండైన శ్రీరామచంద్రుం డర్క సంభవుండైన సుగ్రీవునితో నిట్లనియె. 9**

**ప్రతి :** సుగ్రీవుండు, శ్రీరామచంద్రుని, పగతీర్పన్=విరోధిని సంహరించుటకు. తాన్=తాను, భారంబు=బాధ్యతను, వహించి=తాల్చి, తనకున్, పగవాడైన=శత్రువయిన, వాలిన్=వాలిని, చంపింపన్, తలంచి, వానితోన్=వాలితో, తనకున్, కలిగిన=ఏర్పడిన, పూర్వవైరంబు=పూర్వపు శత్రుత్వము, తెఱంగు=విధము, శ్రీరామునకున్, తెలియ, విన్నవించి=వివరించి, చెప్పి, వాలి, మహాసత్త్వశాలి=గొప్ప బలవంతుడు, అతండు, రాముని, చేతన్, తెగుట=చచ్చుట, తెల్లంబుగా=నిశ్చయమే అనునట్లుగా, దుందుభి=దుందుభి, అను రాక్షసుని, కళేబరంబును=శరీరము (చనిపోగాపడి ఉన్న శవమును), పదియోజనంబుల=ఎనభై మైళ్లు, (యోజనము=నాలుగుక్రోసులు. క్రోసుకు రెండుమైళ్లు. ఆ లెక్కను ఎనిమిదిమైళ్లు ఒక యోజనము) దూరము, ఎగుర జిమ్ముటయు=ఎగిరిపడేలా విసరుట (తన కాలిబొటన వ్రేలితో ఎగిరిపడేలా విసిరాడు), సప్తతాళంబులు=ఏడు తాటిచెట్లు, ఒక్క బాణంబునన్, తెగవ్రేయుటయును=నరకుటయును, చూచి, సుగ్రీవుండు, భయకంపిత హృదయుండై=భయముతో వణికిన హృదయము గలవాడై, రాఘవేశ్వరుల=శ్రీరామచంద్రుని, పాదారవిందములకు=పాదపద్మాలకు, వందనంబు=నమస్కారము, ఆచరించి=చేసి, జనకనందన=సీత, మున్ను=పూర్వము, జాఱవిడిచిన=పైనుండి పడవేసిన, ఆభరణంబుల మూటన్=నగలమూటను, తెప్పించి, చూపినన్, చూచి, మూర్ఛిల్లి, గొబ్బునన్=శీఘ్రముగా, తెలిసి=తెలివిపొంది, అర్కకులేశ్వరుండయిన=సూర్యవంశజుడయిన, శ్రీరామచంద్రుడు, అర్కసంభవుండైన=సూర్యుని కొడుకైన సుగ్రీవునితో, ఇట్లు, అనియె.

**తా :** సుగ్రీవుడు శ్రీరాముని విరోధిని పట్టుకునే బాధ్యత స్వీకరించాడు. తనకు పగవాడైన వాలిని రాముని చేత చంపింపదలచాడు. వాలితో తనకు ఏర్పడిన శత్రుత్వం గురించి రామునికి వివరంగా చెప్పాడు. వాలి మహాబలశాలి. రామునిచేత చంపబడతాడా అని సందేహించాడు. కానీ శ్రీరాముడు వాలి చంపిన దుందుభి అనే రాక్షసుని కళేబరాన్ని కాలితో పదియోజనాలు ఎగరగొట్టడం, ఏడుతాటిచెట్లను ఒక్క బాణంతో కూలవేయడం చూసి – సుగ్రీవుడికి గుండెల్లో వణుకు పుట్టింది. శ్రీరాముని పాదారవిందాలకు నమస్కరించాడు. అప్పుడు రావణుడు తనను ఎత్తుకుపోతుండగా సీతాదేవి తన నగలు మూటకట్టి పడవేసినవి తెప్పించి శ్రీరామునికి చూపించాడు. అవి చూచిన రాముడు మూర్ఛపోయాడు కానీ. వెంటనే తెలివి తెచ్చుకున్నాడు. సుగ్రీవునితో ఇలా చెప్పాడు.

**విశే :** శబ్దాలంకారప్రియ అయిన మొల్ల సుగ్రీవుణ్ణి – అర్కసంభవుడనీ, శ్రీరాముణ్ణి అర్కకులేశ్వరుండనీ పేర్కొని 'అర్క' శబ్దాన్ని అందంగా ప్రయోగించింది.

**క. పగ నీ కెక్కడి దింకను**
**నగచర! నగభేదిసుతుని నా యస్త్రమునన్**
**దగ నేయుదు నమ్ము మనుచు**
**జగదీశుఁడు పలుక నతఁడు సంతోషించెన్. 10**

**ప్రతి :** పగ=శత్రువు, నీకు, ఎక్కడిదింకను=ఎక్కడ ఉంది ఇంక, నగచర=కొండలలో చరించేవాడా! ఓ సుగ్రీవా!, నగభేది=కొండల రెక్కలు ఖండించిన ఇంద్రుని, సుతునిన్=వాలిని, నా=నా యొక్క, అస్త్రమునన్=

మంత్రశక్తితో ప్రయోగించే బాణముతో, తెగనేయుదు=చంపుతాను, నమ్ముము, అనుచు, జగదీశుఁడు= శ్రీరాముడు, పలుకన్=పలుకగా, అతఁడు=సుగ్రీవుడు, సంతోషించెన్.

**తా :** ఓ సుగ్రీవా! ఇంద్రుని కొడుకయిన వాలిని నా అస్త్ర ప్రయోగంతో చంపేస్తాను. ఇక నీకు శత్రువు అనేవాడు లేడు. నామాట నమ్ము అని శ్రీరాముడు పలుకగా సుగ్రీవుడు సంతోషించాడు.

**వ. ఇట్లు ప్రమాణ వచనంబుల నయ్యచలచరాగ్రణి స్వాంతంబును, సంతోషింపఁ జేసిన, నతండును శ్రీరామచంద్రుని కార్యంబునకు సహాయుండై యుండ నొడంబడి, యమ్మహానాయకుని యనుమతంబున యుద్ధ సన్నద్ధుండై, కిష్కింధా నగరంబునకుం జని, తద్వారంబున నిలిచి సింహనాదంబుఁ జేసినం గనలి యా దేవేంద్ర తనూభవుండు సనుదెంచె నంత నయ్యిరువురుం గదిసి, భుజంబు లప్పళించుచు గర్వాలాపంబు లాడుచు నొండొరు మార్కొని. 11**

**ప్రతి :** ఇట్లు, ప్రమాణవచనంబులన్=నమ్మదగిన వచనములతో, ఒట్టువేసి చెప్పుట, ఆ, అచలచరాగ్రణి= కొండలపై చరించువారిలో శ్రేష్ఠుని, స్వాంతంబును=మనస్సును, సంతోషింపన్, చేసిన, అతండును, శ్రీరామచంద్రుని, కార్యంబునకు= పనికి, సహాయుండై యుండన్=తోడుగా ఉండడానికి, ఒడంబడి= ఒప్పుకొని, ఆ+మహానాయకుని-అమ్మహానాయకుని=ఆ గొప్ప నాయకుని, అనుమతంబునన్= అంగీకారముతో, యుద్ధసన్నద్ధుండై=యుద్ధమునకు సిద్ధపడినవాడై, కిష్కింధా నగరంబుకున్, చని, తద్వారంబున=ఆ నగర దార్వంవద్ద, నిలిచి, సింహనాదంబు=సింహగర్జనవంటి నాదం, చేసినన్=చేయగా, కనలి=కోపగించి, ఆ, దేవేంద్ర తనూభవుండు=దేవేంద్రుని కొడుకయిన వాలి, చనుదెంచె=వచ్చెను, అంత= అప్పుడు, ఆ+ఇరువురున్-అయ్యిరువురున్=ఆ ఇద్దరు, కదిసి=సమీపించి, భుజంబులు, అప్పళించుచున్= చరుచుకొనుచు, గర్వాలాపములు=గర్వముతో కూడిన మాటలు, ఆడుచు=పలుకుచు, ఒండొరులు= ఒకరినొకరు, మార్కొని= ఎదుర్కొని.

**తా :** ఈ విధంగా నమ్మదగిన మాటలతో సుగ్రీవుని మనస్సును శ్రీరాముడు సంతోషింప చేసాడు. సుగ్రీవుడు కూడా శ్రీరాముని కార్యం సానుకూలం చేయడానికి తోడుగా ఉంటానని ఒడంబడిక చేసుకున్నాడు. శ్రీరాముని అంగీకారంతో సుగ్రీవుడు వాలితో యుద్ధానికి సిద్ధపడ్డాడు. కిష్కింధానగర ద్వారం దగ్గర నిలిచి సింహగర్జన చేసాడు. అది విన్న వాలి కోపంతో యుద్ధానికి వచ్చాడు. ఆ ఇద్దరూ భుజాలు చరుచుకుంటూ, గర్వంతో మాట్లాడుతూ ఒకరినొకరు ఎదుర్కొని యుద్ధం ప్రారంభించారు.

## వాలి సుగ్రీవుల కయ్యము

**శా. శైలంబుల్ కదు వేగ ఱువ్వుచు, మహా ఝుంకార హుంకారముల్**
**చాలం జేయుచు భీకరోద్ధతులచే సాలంబులన్ వ్రేయుచున్,**
**వాలాగ్రంబుల మోదుచున్, వడివడిన్ వక్త్రంబులన్ రక్తముల్**
**కూలన్, వాలియు సూర్య సూతియు వడిం గోపాత్ములై పోరఁగన్ 12**

**ప్రతి :** శైలంబుల్=కొండలు, కడువేగ=మిక్కిలి వేగంగా, ఉవ్వుచు=విసురుతూ, మహోఝుంకార=గొప్ప ధ్వనులతో, హుంకారముల్=హుమ్మని ధ్వనులు, చాలన్, చేయుచు=అధికంగా చేస్తూ, భీకరోద్ధతులచే=భయంకరమైన పెద్ద దెబ్బలతో, సాలంబులన్=మద్దిచెట్లతో, వ్రేయుచున్=ప్రయోగించుచు, వాలాగ్రంబుల=తోక చివరలతో, మోదుచున్=బాదుతూ, వడివడిన్=అతి వేగముగా, వక్త్రంబులన్=ముఖములనుండి, రక్తముల్=రక్తములు, కూలన్=పడుతుండగా, వాలియు, సూర్యసూతియు=సుగ్రీవుడును, వడిన్=వేగముగా, కోపాత్ములై=కోపం నిండిన మనస్సులతో, పోరఁగన్=యుద్ధము చేయగా–

**తా :** ఆ వాలి సుగ్రీవులు, కొండలు వేగంగా ఒకరిపై ఒకరు విసురుకుంటూ, పెద్దపెద్దగా అరుస్తూ, భయంకరమైన పెద్ద దెబ్బలతో, మద్దిచెట్లతో కొట్టుకుంటూ, తోక చివరలతో బాదుకుంటూ యుద్ధం చేస్తున్నారు. కొండరాళ్ల దెబ్బలకీ, చెట్లదెబ్బలకీ వాళ్ల ముఖాల నుండి రక్తం పడుతూ ఉంది. ఇద్దరూ కోపంతో మండిపడుతూ యుద్ధం చేయగా –

**వ. అట్టి సమయుంబున. 13**

**తా :** వాలి సుగ్రీవులిద్దరూ అలా భయంకరంగా యుద్ధం చేస్తున్న వేళ–

### రాముఁడొక్క కోలతో వాలిని గూలనేయుట

**ఉ. సాలము పొంత నిల్చి రఘుసత్తముఁ డమ్మరివోసి, శబ్ద వి**
**న్మూలముగాఁగ విల్ దివిచి, ముష్టియుఁ దృష్టియు గూర్చి, గోత్రభృ**
**త్కూలము వజ్రపాత హతిఁ గూలు విధంబునఁ గూల నేసె న**
**వ్వాలిఁ, బ్రతాపశాలి మృడ వందనశీలి సురాలి మెచ్చఁగన్. 14**

**ప్రతి :** సాలము=మద్దిచెట్టు, పొంత=సమీపమున, నిల్చి=నిలబడి, రఘూత్తముఁడు= రాముడు, అమ్ము=బాణము, అరివోసి=ఎక్కుపెట్టి, శబ్ద విన్మూలముగాఁగన్=ఎక్కువచప్పుడు, కాకుండ, తా=తను, విల్ దివిచి=విల్లుపైకి తీసి, ముష్టియున్=పిడికిలియు, దృష్టియు=చూపును, కూర్చి=కలిపి, గోత్రభృత్కూలము=పర్వత సానువులు, వజ్రపాతహతిన్=పిడుగుపడిన దెబ్బకి కూలువిధంబున కూలునట్లుగ, పత్రాపశీలి=ప్రతాపవంతుని, మృడవందనశీలి=శివునికి నమస్కరించు శీలము కలవానిని, ఆ+వాలి=అవ్వాలిన్=ఆ వాలిని, సురాలి=దేవతల సమూహము, మెచ్చగన్, కూలనేసె=సంహరించెను.

**తా :** మద్దిచెట్టు దగ్గఱగా నిలబడి రాముడు విల్లు ఎక్కుపెట్టి బాణం సంధించి ఎక్కుడుగచప్పుడు రాకుండ తన పిడికిలి చూపు రెండూ కలిపి పర్వతసానువులు పిడుగుపడిన దెబ్బకి కూలినట్లుగా ప్రతాపశాలి శివభక్తుడు అయిన వాలిని, దేవతలు మెచ్చేలా సంహరించాడు.

**విశే :** సాలముపొంత : అనే ప్రారంభం దగ్గర ఓలము వంచి – అనే పాఠాంతరం ఉంది – ఆంధ్రవాచస్పత్య నిఘంటువు – కొట్ర శ్యామశాస్త్రిగారిది – ఓలము అనే పదానికి అర్థం ఇచ్చినచోట – మొల్ల ప్రయోగము అని – 'ఓలము వంచి యొయ్యన రఘూద్వహుడమ్మరివోసి' అని ఈ పాఠం ఇచ్చారు.

**క. ఓలిమిఁ బొంచియు రఘుపతి**
**పాలిత కపిరాజ్యశాలిఁ బ్రస్ఫుట కీర్తిన్**
**శూలి పద భక్తి శీలిని**
**వాలి న్నొక కోల నేలఁ గూలఁగ నేసెన్.** **15**

**ప్రతి :** ఓలిమిన్=చాటుగా, పొంచియు=కనబడకుండ సమయమునకై దాగియుండి, రఘుపతి=రాముడు, పాలితకపిరాజ్యశాలి=పాలింపబడుతున్న వానరరాజ్యము కలవానిని, ప్రస్ఫుట కీర్తిన్=విశేషవ్యాప్తి కలిగన కీర్తిగలవానిని, శూలిపద భక్తిశీలిని=శివుని పదభక్తి శీలముగ గలవానిని, వాలిన్=వాలిని, ఒక కోలన్= ఒక బాణముతో, నేలఁగూలఁగన్=చనిపోవునట్లుగ, ఏసెన్=వేసెను.

**తా :** రఘుపతి చాటుగా పొంచి ఉండి వానరరాజ్య పాలకుని విశేషమయిన కీర్తిగలవానిని, శివభక్తి రతుని వాలిని నేలకూలే విధంగా ఒక బాణముతో కొట్టాడు.

**వ. తదనంతరంబున.** **16**

**తా :** ఆ తరువాత

**క. నిగ్రహము మాని నృపతి శు**
**భగ్రహ లగ్నంబునందుఁ బట్టము గట్టెన్**
**నిగ్రహ రాజోపగ్రహు**
**సుగ్రీవుని, హేమదామ సుగ్రీవుఁ దగన్.** **17**

**ప్రతి :** నిగ్రహము=దండించుట, మాని=మానేసి, నృపతి=రాజు, శుభగ్రహ లగ్నంబునందున్=శుభగ్రహాలు గల ముహూర్తములో, నిగ్రహ రాజోపగ్రహు=తనను ఎదుర్కొన్న రాజచంద్రులకు రాహువువంటివాడు – హేమదామ సుగ్రీవున్=బంగారుహారము ధరించిన మంచి మెడగల, సుగ్రీవుని, పట్టము గట్టెన్=పట్టాభిషేకము చేసెను.

**తా :** యుద్ధం మాని శ్రీరాముడు మంచిముహూర్తంలో, శత్రురాజచంద్రులకు రాహువువంటివాడు, హేమదామము మెడలో అలంకరించుకున్నవాడు సుగ్రీవునికి పట్టాభిషేకము చేసాడు.

**విశే :** హేమదామము – బంగారుమాల వాలిమెడలో ఉండేది. వాలి తన ప్రాణాలు పోయేవేళలో ఆ మాలను సుగ్రీవుని మెడలో అలంకరించాడు. అప్పుడు సుగ్రీవుడు హేమదామ సుగ్రీవుడయ్యాడు.

(చంద్రుని రాహుగ్రహము మింగుతుంది. అదే చంద్రగ్రహణము.)

**క. తారాపతి శిక్షింపుచుఁ**
**దారాపతి ధవళ కీర్తిఁ దగు నర్కజునిన్**
**దారా దేవికిఁ బురి కా**
**తారార్కము గాఁగ రాజ తనయుఁడు నిల్పెన్.** **18**

**ప్రతి :** ఆ తారాపతి=తారకు భర్త అయిన వాలిని, శిక్షింపుచున్=సంహరించి, తారాపతి=నక్షత్రములకు పతియయిన చంద్రుని, ధవళ కీర్తిన్=తెల్లని కీర్తికి, తగు=తగిన, అర్కజునిన్=సుగ్రీవుని, తారాదేవికిన్=వాలిభార్య అయిన తారాదేవికి, పురికి=కిష్కింధాపురానికి, ఆతారార్కము కాగన్=చుక్కలు, సూర్యుడు, ఉన్నంత కాలము ఉండునట్లు, రాజ తనయుఁడు=శ్రీరాముడు, నిల్పెన్=పట్టముగట్టెను, సింహాసనముపై నిలిపెను.

**తా :** వాలిని సంహరించి, చంద్రుని వంటి తెల్లని కీర్తిమంతుడయిన సుగ్రీవుని తారకు, కిష్కింధాపురానికి, ఆతారార్కముగా శ్రీరాముడు పట్టము కట్టాడు. తారాదేవిని భార్యగా చేసాడు.

**వ. ఇట్లు సుగ్రీవుని గపి రాజ్య పట్టభద్రునిం జేసి వాలి తనూసంభవుని నంగద కుమారుని యువరాజ పదంబున నిలిపె, నంత, వర్షాకాలము గడుచునంత దనుక శ్రీరాముని మాల్యవంతంబుపై నుండ నియమించి వారు సని రయ్యవసరంబున. 19**

**ప్రతి :** ఇట్లు, సుగ్రీవుని, కపిరాజ్యపట్టభద్రునింజేసి=వానరరాజ్యానికి పట్టాభిషిక్తునిగా చేసి, వాలితనూసంభవుని=వాలితనయుని, అంగదకుమారుని, యువరాజ పదంబున=యువరాజపదవిలో, నిలిపె=నియమించాడు, అంత=అటుపై, వర్షాకాలము, గడుచునంత దనుక=వెళ్లేవరకు, శ్రీరాముని, మాల్యవంతంబుపైన్=మాల్యవంతము అనే పర్వతముమీద, ఉండ నియమించి=ఉండుడని చెప్పి,వారు=వారు, చనిరి=వెళ్లిరి, ఆ+అవసరంబున, అయ్యవసరంబున=అప్పుడు.

**తా :** ఈ విధంగా శ్రీరాముడు సుగ్రీవుని కపిరాజ్యానికి పట్టాభిషిక్తుని చేసి, వాలికొడుకు అంగదకుమారుణ్ణి యువరాజుగా నిలిపాడు. ఈ వర్షాకాలము గడిచేవరకు మాల్యవంత పర్వతం మీద గడపండి అని శ్రీరామునికి సుగ్రీవుడు చెప్పగా వారు ఆ పర్వతం మీదకు వెళ్లారు అప్పుడు.

## వర్షా వేళ శ్రీరామ సీతా వియోగ పరితాపము

**సీ. బ్రహ్మాండ మగలంగఁ బటపటధ్వనులతో**
**నుఱుము లంతంతకు నుఱుము చుండఁ**
**గడు భయంకరముగా వడ్రమోగు మ్రోతలఁ**
**బిడుగు లాడాడ గుభిల్లు మనఁగఁ**
**గ్రముకంబులంతేసి కణములతోఁ గూడఁ**
**గరుడుగట్టిన వడగండ్లు రాలఁ**
**గొఱవి దయ్యంబుల మఱిపించు తెఱఁగున**
**విద్యుత్ప్రకాశమ్ము విస్తరిల్ల**

**తే. ముసుఁగువేసిన చందాన మొగులుగప్పి**
**మీఱ నలుపెక్కి చీఁకట్లు కాఱుకొనఁగ,**

**మించి కడవల నుదకంబు ముంచి తెచ్చి**
**క్రుమ్మరించిన గతి వాన కురిసె నపుడు. 20**

**ప్రతి :** బ్రహ్మాండము=భువనగోళము, అగలంగన్=పగిలిపోవునట్లు, పటపట ధ్వనులతోన్= పటపటమనే శబ్దాలతో, ఉఱుములు, అంతంతకు=మరీమరీ, ఉఱుము చుండన్=చప్పుడు చేస్తూ ఉండగా, కదు భయంకరముగా=మిక్కిలి భయం కలిగిస్తూ, వడ=వేడిగాలులు, మ్రోఁగ మ్రోత్రలన్=మ్రోగించే శబ్దాలు, పిడుగులు, అడాడ=అక్కడక్కడ. గుభిల్లు మనఁగన్=గుభిల్లు అంటూఉండగా (గుభిల్లు=ధ్వన్యను కరణము), క్రముకంబులు=పోకకాయల, అంతేసి, కణములతోన్=సీటకణములతో. కూడన్=కూడి. దరమగట్టిన= గట్టిపడిన, వడగండ్లురాలన్=వడగళ్ళురాలగా. కొఱవి దెయ్యంబులన్=మంటతో నడిచే దెయ్యములను, మఱపించు= మరపిపోవు, తెఱంగున=విధముగా, విద్యుత్ప్రకాశమ్ము=మెఱుపుల కాంతి. విస్తరిల్ల=వ్యాపించగా, ముసుగు వేసిన చందాన=తలమీదనుండి గుడ్డకప్పు సదానిని ముసుగు అంటారు. ఇప్పుడు లోకాన కంతటికి ముసుగు వేసినట్లు, మొగులు=మేఘాలు, కప్పి=కప్పినవి, మీఱి=అధికమై, నలుపెక్కి=నల్లగా మారి, చీకట్లు, కాఱుకొనఁగన్=దట్టముకాగా, మించి=అధికముగా, కడవలన్=కుండలతో, ఉదకంబు=నీరు, ముంచి, తెచ్చి, క్రుమ్మరించినగతి=ఒక్కసారిగా పోసినట్లు, వాన కురిసెనపుడు.

**తా :** ఈ భువనభాండమంతా పగిలిపోయేరీతిలో పటపట ధ్వనులతో, ఉఱుములు అధికంగా ఉఱుము తుండగా, చాలా భయంకరంగా వడగాలి మ్రోతలుమ్రోసేవిధంగా పిడుగులు అక్కడక్కడ గుభిల్లుమని పడుతుండగా, చాల గట్టిగా ఉన్న పోకకాయలంత వడగళ్లు రాలుతుండగా, కొఱవి దెయ్యాల్ని మరిపించే మెఱుపుల కాంతి వ్యాపిస్తుండగా, ముసుగు వేసినట్లు మబ్బులు క్రమ్మిక్రమంగా నల్లగామారి చీకటి దట్టంగా వ్యాపించగా కుండలతో నీళ్లు ముంచి తెచ్చి కుమ్మరించినట్లుగా వానకురిసింది.

**క. ఏఱులు కాల్నడ తప్పఁగఁ**
**బాఱెను, సస్యములు పండె, ఫల వృక్షములున్**
**మీఱి ఫలించెను, ధరఁబా**
**లేఱులుగా సురభు లెల్ల నెప్పుడుఁ బితికెన్. 21**

**ప్రతి :** ఏఱులు=నదులు, కాల్నడ తప్పగన్=కాలితోనడిచి దాటే అవకాశం లేకుండా, పాఱెను=ప్రవహించినవి, సస్యములు=పంటలు, పండె=పండాయి, ఫలవృక్షములున్=పండ్లచెట్లు, మీఱిఫలించెను=ఎక్కువగా పండినవి, ధరన్= భూమిలో, పాలు=పాలు, ఏఱులుగా=నదులవలె, సురభులెల్లన్=ఆవులన్నీ, ఎప్పుడున్=అన్ని సమయములలో, పితికెన్=వర్షించినవి, (ఇచ్చినవి).

**తా :** నదులన్నీ కాలితో నడిచివెళ్లే అవకాశం లేకుండా ప్రవహించాయి. పంటలన్నీపండాయి, పళ్లచెట్లు ఎక్కువగా పళ్లను ఇచ్చాయి, భూమి మీది ఆవులన్నీ పాలు ఏఱులుగా కురిపించాయి.

**వ. అంత వర్షాకాలాంతంబు గాఁగ నమ్మహీకాంతుండు ప్రేయసీ వియోగ పరితాపానలంబునఁ బొరలుచు నోర్వలేక విభ్రాంత స్వాంతుండై యుండ. 22**

**ప్రతి :** అంత, వర్షాకాలాంతంబుగాఁగన్=వర్షాకాలము పూర్తి అవగా, అమ్మహీకాంతుండు, ఆ+మహీ కాంతుండు=ఆరాజు, ప్రేయసీవియోగ=ప్రియురాలి వియోగమువలన, పరితాపానలంబునన్=దుఃఖాగ్ని చేత, పొరలుచున్=విరహముచే దొర్లుచు, ఓర్వలేక=తట్టుకోలేక, విభ్రాంతస్వాంతుండై=కలవరపడిన మనస్సు కలవాడై, ఉండి–ఉండగా!

**తా :** వర్షాకాలం గడిచింది. రాముడు ప్రియురాలి వియోగ దుఃఖాగ్నితో దొర్లుతూ, తట్టుకోలేక కలవరపడిన మనస్సుతో ఉండగా.

**సీ. పలుమాఱు నీ హస్త పల్లవంబులచేత**
**నలివేణి! నా తాప మార్ప వేల?**
**నళనాక్షి! పరిరంభణ క్రీడఁదేల్చు నీ**
**మదినొప్పి నా నొప్పి మాన్ప వేల?**
**చెలియ! యోష్ఠామృత సేవకై నీ యల్క**
**వడిఁదప్పి నా దప్పి గడప వేల?**
**భామ! తాపానల పరితాప ముడుప నీ**
**తనువు నా తనువునఁ బెనచ వేల?**

**ఆ. యనుచు సీతఁ బిలుచు, నందంద పరికించు,**
**దిక్కు లాలకించు, నిక్కి చూచు,**
**దశరథాత్మజుండు తన్నుఁదా మఱచుచు**
**బయలు కౌఁగిలించుఁ బలువరించు.** **23**

**ప్రతి :** పలుమాఱు=చాలాసార్లు, నీ, హస్తపల్లవంబుల చేతన్=చిగుళ్లవంటి నీ చేతులతో, అలివేణి!=తుమ్మెదలవంటి నల్లని కురులు గలదానా!, నా, తాపము=విరహతాపము, ఆర్పవేల=ఎందుకు ఆర్పవు, నళినాక్షి!=తామరపువ్వులవంటి కన్నులు గలదానా! పరిరంభణక్రీడన్=కౌగిలింత అను ఆటలో, తేల్చు=ఆనంద పరచు, నీ మదిన్ ఒప్పి=నీ మనస్సులో భావించి, నా నొప్పి=నా యీ బాధను, మాన్పవేల, చెలియ=ప్రియురాలా!, ఓష్ఠామృత సేవకై=ముద్దుపెట్టుకొనే సేవకు, నీ అల్క=అలుక, వడిన్=వేగంగా, తప్పి=మాని, నాదప్పి=నా దప్పిక, కడపవేల=పోగొట్టవేల, భామ!, తాపానల పరితాపము=తాపాగ్నిదుఃఖాన్ని, ఉ డుపన్=పోగొట్టుటకు, నీతనువు=నీ శరీరము, నా తనువునన్=నా శరీరముతో, పెనచవేల=పెనయవేయ వేమి? అనుచు, సీతన్, పిలుచు, అందంద=అక్కడ అక్కడ, పరికించుచు, దిక్కులాలకించు=అన్ని దిక్కుల నుండి వచ్చు ధ్వనులను వినును, నిక్కిచూచు=తేఱిపాఱచూచు, దశరథాత్మజుండు=శ్రీరాముడు, తన్నుదామఱచుచు=తనను తాను మఱచిపోవును, బయలు కౌగిలించు=శూన్యాన్ని కౌగలించు, పలువరించు=ఏవేవో మాట్లాడును.

**తా :** ఓ సీతా! మెత్తని నీ చేతులతో నన్ను తాకి నా తాపాన్ని తగ్గించవేల, కౌగిలింతతో నా హృదయభారాన్ని నొప్పిని పోగొట్టవేల, ఓ చెలి నీ అలకమాని నీ అధరామృతముతో నాదప్పి తీర్చవేమి? నా ఈ విరహతాపం పోగొట్టవేల? నీ తనువు నా తనువుతో చేర్చవేమి? అంటూ సీతను పిలుస్తూ, అక్కడయిక్కడ చూస్తూ నలుదిక్కుల వినబడే శబ్దాలు వింటూ, తేఱిపాఱ చూస్తూ శ్రీరాముడు తనను తాను మఱచిన స్థితిలో శూన్యాన్ని కౌగలించుకుని పలవరిస్తున్నాడు.

**వ. అని మఱియును, 24**

**తా :** అని ఇంకా –

**ఉ. కూరలు నోటికిన్ రుచులు గూడుట దప్పెను, దుంపదూఁడులుం**
**గారము తోఁచె. జిహ్వకును గమ్మని తేనెలు చేఁదు లయ్యెఁ, గం**
**గారయెఁ జిత్తమంతయును, గంటికి నిద్ర రహింపదయ్యె శృం**
**గార మెలర్ప సీతఁ బొడఁగానమి రామనృపాల మౌళికిన్. 25**

**ప్రతి :** రామనృపాలమౌళికిన్=రాజశ్రేష్ఠుడయిన శ్రీరామునికి, శృంగారమెలర్ప=చక్కని అలంకారముతో, సీత, పొడగానమి=కనబడకపోవుటచే, కూరలు నోటికిన్, రుచులు కూడుటన్=రుచిగా ఉండుట, తప్పెను= తప్పెను, దుంపదూఁడులున్=దుంప+తూఁడులున్=దుంపకూరలు, తామర తూళ్లు, కారము తోఁచెన్= కారంగా అనిపిస్తున్నవి, కమ్మని తేనెలు, జిహ్వకును=నాలికకు, చేదులయ్యె=చేదుగా అయ్యాయి, కంగా రయినది, కంటికి, నిద్ర, రహింపదయ్యె, రహింపదు=ఆనందాన్ని కలిగించనిది, అయ్యె=అయ్యెను.

**తా :** శ్రీరామునికి చక్కని అలంకారాలతో ఎదుట సీత కనబడకపోవడంవల్ల కూరలేవీ నోటికి రుచించడం లేదు, దుంపలు తూళ్లు కారంగా అనిపిస్తున్నాయి, కమ్మని తియ్యని తేనెలు చేదుగా అయ్యాయి, చిత్తమంతా కంగారయి కంటికి నిద్ర ఆనందాన్ని కలిగించకూడా ఉంది. సీతలేని రామునికి భోజనం రుచించడంలేదు, నిద్ర సేదతీర్చడం లేదు అని.

**ఉ. తాలిమి తూలిపోయి పరితాపమునం దిరుగాడు, నొక్కచోఁ**
**గాలును నిల్వఁద్రొక్క నధికారము చాలక యెప్పుడుం గడున్**
**జాలి వహించు, జిత్తమునఁ జంచలతం గను, భూమిపుత్రిపై**
**మేలిమిఁ జేసి రాముఁడట మిన్నక వేదురు గొన్న కైవడిన్. 26**

**ప్రతి :** తాలిమి=ఓర్పు, తూలిపోయి=నశింపగా, పరితాపమునన్=దుఃఖములో, తిరుగాడున్=సంచరించును, ఒక్కచోన్=ఒక ప్రదేశంలో, కాలును నిల్వ త్రొక్కన్=కాలును నిలబెట్టి, స్థిరంగా ఉండే, అధికారము చాలక= శక్తిచాలక, ఎప్పుడున్=ఎల్లప్పుడు, కదున్=మిక్కిలి, జాలివహించు=జాలితోకూడిన, చిత్తమునన్=మనస్సులో, చంచలతన్=చలించే ఆలోచనలను, కనున్=చూచును, భూమిపుత్రిపై=సీతాదేవి మీద, మేలిమిన్=వలపును, చేసి=కారణంగా, మిన్నక=మాటాడక, వేదురుగొన్న=దుస్సహమైన బాధను పొందినవాని, కైవడిన్=వలె, రాముఁడట=రాముడు అక్కడ.

**తా :** రామునిలో ఓర్పు నశించింది. దుఃఖతీవ్రతలో ఒక్కచోట స్థిరంగా ఉండే శక్తిలేకుండాపోయింది. మానసికమైన ఆందోళనతో చలించిపోతున్నాడు. సీతపై గల వలపువల్ల భరించరాని బాధతో ఏమీ మాట్లాడలేక పోతున్నాడు.

## సుగ్రీవుఁడు సీత నన్వేషింప వానర వీరులను నలు దెసలకుఁ బంపుట

**వ.** **ఇట్లు విరహ తాపంబునఁ బొరలుచున్న సమయంబునఁ గార్తిక మాసంబు సనుదెంచిన, శ్రీరామచంద్రుండు బలంబులం గూర్చు కొని రమ్మని సుగ్రీవు పాలికి సౌమిత్రి ననుప, నా రాము తమ్ముని గూడి యినజుండు తారా సమేతుండై చనుదెంచి, రాఘవేశ్వరుల చరణారవిందమ్ములకు నమస్కరించి, తన బలంబులఁదోడు సూప దొడంగె నెట్లనినఁ బదులును, నూఱులును, వేలును, బదివేలును, లక్షలును, బది లక్షలును, గోట్లును, శత కోట్లును, నర్బుదంబులును, న్యర్బుదంబులును, ఖర్వంబులును, మహా ఖర్వంబులును, బద్మంబులును, మహా పద్మంబులును, క్షోణులును, మహాక్షోణులును, శంఖంబులును, మహా శంఖంబులును, క్షితులును, మహా క్షితులను, క్షోభంబులును, మహా క్షోభంబులును, నిధులును, మహా నిధులును, సాగరంబులును, మహా సాగరంబులును, బరిమితంబులును, మహా పరిమితంబులును, ననంతంబులును, మహానం తంబులును గడచి లెక్కకు మిక్కిలి యెక్కువయై డెబ్బదిరెండు వెల్లువలు గల కపి బలంబుతోడఁదోడు సూపినంజూచి, రాఘవేశ్వరుండు సంతోషించి, సవితృనందను గారవించి కౌఁగిలించుకొని, సీతాన్వేషణంబుఁజేయఁగల వానరోత్తముల నధిక బలయుతుల నేర్పఱిచి దిశలకుం బంపు మనవుడుఁ దూర్పునకు మైందుండును, బశ్చిమంబునకు సుషేణుండును, నుత్తరంబునకు శతబలియు నునువారిని నేర్పఱించి వారలకుఁ దోడుగా వానరవీరులను లక్ష లక్ష సంఖ్యాకుల నేర్పఱించి యిచ్చి, జానకి యున్న చొప్పును దెలిసి, యొక్క నెలలో రండని యనిపి, హనుమంతునిం బిలిచి, "నీవు దక్షిణమ్మునకుం బొ"మ్మని యనుపునపుడు శ్రీరామ భూపాలుండు వాని విశ్వాసాది గుణమ్ములకు మెచ్చినవాఁడై దగ్గఱగాఁబిలిచి, నీవు శౌర్యవంతుండవు, హితుండవును గావున నీచేత మత్ప్రయోజనం బీడేఱు నని పలికి, తన చేతి యంగుళీయకం బతని చేతి కిచ్చి, యీ ముద్రిక జనకరాజ నందనకు సమర్పించి, యా జానకీశిరోరత్నంబు మా కానవాలుగాఁ దెమ్మని యనుప, నతం డియ్యకొని మ్రొక్కిన నాతనికిఁ దోడుగా నంగద జాంబవదాదులం గూర్చి యనిపె, ననుటయు విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుం డటమీఁది కథా విధానం బెట్టిదని యడుగుటయును.** **27**

**ప్రతి :** ఇట్లు=ఈ విధంగా, విరహతాపంబునన్=వియోగతాపముతో, పొరలుచున్న=దొర్లుచున్న, సమయంబునన్, కార్తికమాసంబు, చనుదెంచెను=వచ్చెను, శ్రీరామచంద్రుండు, బలంబలన్=సైనిక బలములను, కూర్చుకొని రమ్ము. అని. సుగ్రీవు పాలికిన్=సుగ్రీవుని దగ్గరకు సౌమిత్రున్, అనుపన్=పంపగా, ఆరాము తమ్మునింగూడి=లక్ష్మణునితో పాటుగా. ఇనజుండు=సూర్యుని కొడుకు సుగ్రీవుడు. తారాసమేతుండై, చనుదెంచి వచ్చి, రాఘవేశ్వరుల చరణావిందమ్ములకు=రామచంద్రుని పాదపద్మములకు, నమస్కరించి, తనబలంబులఁదోడు=తన సైనిక బలముల సహాయము, చూపఁదొడంగెన్=చూపుట మొదలుపెట్టెను, ఎట్లనినన్=ఏ విధంగా అంటే, పదులును, నూఱులును, వేలును, పదివేలును, లక్షలును, పదిలక్షలును,

కోట్లును, శతకోట్లును, అర్బుదంబులును, న్యర్బుదంబులును, ఖర్వంబులును, మహాఖరంబులును, పద్మంబులును, మహాపద్మంబులును, క్షోణులును, మహాక్షోణులును, శంఖంబులును, మహాశంఖంబులును, క్షితులను, మహాక్షితులను, క్షోభంబులును, మహాక్షోభంబులును, నిధులును, మహానిధులును, సాగరంబులును, మహాసాగరంబులును, పరిమితంబులను, మహాపరిమితంబులును, అనంతంబులును, మహానంతంబులును, కడచి=దాటి, మిక్కిలి ఎక్కువయై, డెబ్బది రెండు వెల్లువలు గల=72 సమూహములుగా గల, కపిబలంబుతోడన్, తోడుచూపినన్=సహాయముగా చూపగా, చూచి, రాఘవేశ్వరుండు, సంతోషించి, సవితృనందనున్=సుగ్రీవుని, గారవించి=గౌరవించి, కౌఁగిలించుకొని, సీతాన్వేషణంబున్=సీతను వెదుకుటను, జేయఁగల, వానరోత్తములన్=వానరశ్రేష్ఠులను, అధికబలయుతులన్= మిక్కిలి బలవంతులను, ఏర్పఱిచి= సిద్ధంచేసి, దిశలకు, పంపుము, అనవుడున్=అనినపిమ్మట, తూర్పునకు మైందుండును, పశ్చిమంబునకు సుషేణుండును, ఉత్తరంబునకు, శతబలియును, అనువారిని=అను వానరవీరులను, ఏర్పఱించి=ఏర్పాటుచేసి, వారలకున్, తోడుగా, వానరవీరులను, లక్షలక్ష సంఖ్యాకులన్, ఏర్పఱిచి=ఏర్పాటుచేసి, ఇచ్చి, జానకియున్న చొప్పును=జానకి ఉన్నచోటును, తెలిసి, ఒక్కనెలలో రండు అని, అనిపి=పంపి, హనుమంతునిన్, పిలిచి, 'నీవు దక్షిణమ్మునకున్ పొమ్ము'=నీవు దక్షిణదిక్కునకు వెళ్ళుము, అని, అనుపునపుడు=పంపునపుడు, శ్రీరామభూపాలుండు, వాని విశ్వాసాదిగుణమ్ములకున్=అతనియొక్క విశ్వాసము మున్నగు గుణములకు, మెచ్చినవాఁడై=ప్రశంసించినవాడై, దగ్గరగాన్ పిలిచి=సమీపమునకు పిలిచి, నీవు, శౌర్యవంతుడవు=శౌర్యము కలవాడవు, హితుండవును=మేలుకోరువాడవు, కావున, నీచేతన్, మత్ప్రయోజనంబు=నా ప్రయోజనము, ఈడేఱున్=సిద్ధించును, అనిపలికి, తనచేతి యంగుళీయకంబు=తనచేతి ఉంగరమును, అతనిచేతికిన్, ఇచ్చి, ఈముద్రిక=ఈ ఉంగరము, జనకరాజనందనకున్=జనకుని కూతునకు, సమర్పించి= ఇచ్చి, ఆ జానకీశిరోరత్నంబు=ఆ జానకియొక్క శిరస్సునందలి రత్నమును, మారున్, ఆనవాలుగాన్=గుర్తుగా, తెమ్ము అని, అనుపన్=పంపగా, అతండు, ఇయ్యకొని=స్వీకరించి, మ్రొక్కినన్=నమస్కరింపగా, ఆతనికిన్, తోడుగాన్,అంగదజాంబవదాదులన్= అంగదుడు, జాంబవంతుడు మున్నగువారిని, కూర్చి=ఏర్పరిచి, అనిపెన్= పంపెను, అనుటయు, విని, నారదుని, వాల్మీకి మహామునీశ్వరుండు, అటుమీది కథావిందానంబు, ఎట్టిదని అడుగుటయును...

**తా :** ఇలా విరహతాపంతో ఇబ్బందిపడుతున్న సమయంలో కార్తీకమాసం రాగా, శ్రీరామచంద్రుడు, వానర బలాన్ని కూడగట్టుకుని రమ్మని సుగ్రీవుని వద్దకు సౌమిత్రిని పంపాడు. ఆ రాముని తమ్మునితో కలిసి సూర్యపుత్రుడైన సుగ్రీవుడు, తారతో కలిసివచ్చి, శ్రీరాముని పాదపద్మాలకు నమస్కరించి, తనబలం ఎందరు తమకు తోడుగా ఉన్నారో చూపించసాగాడు. ఎట్లనిన – పదులును, నూఱులును, వేలును, పదివేలును, లక్షలును, పదిలక్షలును, కోట్లును, శతకోట్లును, అర్బుదంబులును, న్యర్బుదంబులును, ఖర్వంబులును, మహాఖర్వంబులును, పద్మంబులును, మహాపద్మంబులును, క్షోణలును, మహాక్షోణులును, శంఖంబులును, మహాశంఖంబులును, క్షితులును, మహాక్షితులును, క్షోభంబులును, మహాక్షోభంబులును, నిధులును, మహానిధులును, సాగరంబులును, మహాసాగరంబులును, పరిమితంబులును, మహాపరిమితంబులును,

మహాసాగరంబును, అనంతంబులును, మహానంతం బులును, దాటి – లెక్కించడానికి ఎక్కువై డెబ్బదిరెండు సేనావిభాగాలు గల కపిసేన మనకు తోడ్పడుతుంది అని చూపించగా, శ్రీరాముడు సంతోషించి, ప్రేమతో సుగ్రీవుని కౌగలించుకొన్నాడు. ఆసైన్యంలో సీతాన్వేషణ చేయగల వానరోత్తములను, అధికబలసంపన్నులను– గుర్తించి – ఆయా దిక్కులకు పంపమని రాముడు చెప్పగా, తూర్పుదిక్కుకు మైందుని, పడమటిదిక్కుకు సుషేణుని ఉత్తరదిశకు శతబలిని పంపడానికి నిర్ణయించారు. వారికి తోడుగా లక్ష లక్ష చొప్పున వానర వీరుల్ని ఏర్పరిచారు – వారితో – మీరు జానకి జాడను తెలుసుకుని ఒక్కనెల రోజులలో తిరిగి రండి అని సుగ్రీవుడు చెప్పి పంపి, హనుమంతుణ్ణి పిలిచి నువ్వు దక్షిణదిక్కుకు వెళ్లు అని చెప్తుండగా, శ్రీరాముడు హనుమంతునిలోని విశ్వాసాది గుణమ్ములకు మెచ్చినవాడై దగ్గఱగా పిలిచి, నువ్వు శౌర్యవంతుడవు, హితుడవు కాబట్టి నీచేత, నా కోరిక, ప్రయత్నము సఫలమవుతాయని పలికి, తన చేతినున్న ఉంగరాన్ని హనుమచేతికి ఇచ్చి, ఈ ముద్రిక సీతకిచ్చి, ఆ జానకీదేవి శిరోరత్నాన్ని – చూడామణిని మాకు ఆనవాలుగా తీసుకుని రా అని చెప్పగా, హనుమ శ్రీరాముని ఆజ్ఞను శిరసా వహించి రామునికి నమస్కరించాడు. అతనికి తోడుగా అంగదుని, జాంబవంతుడు మొదలయిన వారిని పంపాడు. ఈ విషయం విన్న వాల్మీకి మహర్షి నారదునితో ఆ తరువాత కథావిధానం ఎట్టిది అని అడుగగా....

**విశే :** మొల్ల ఈ వచనంలో ఒక సంఖ్యామానాన్ని ఇచ్చింది. ఇంత అధికంగా సంఖ్యామానం భారతీయుల దగ్గరే ఉంది. పదులును అని ప్రారంభించి మహానంతంబులును వరకు గలవన్నీ సంఖ్యామానాలు, భారతీయుల గొప్పతనమిది.

సంఖ్యామానంలోని కొన్ని పదాలు నిఘంటువులలో లభించలేదు.

వాల్మీకం ప్రకారం తూర్పుదిక్కున సీతాన్వేషణకు బయలుదేరిన వానరసేనా సమూహానికి నాయకుడు వినతుడు. అలాగే దక్షిణదిక్కున సీతాన్వేషణకు బయలుదేరిన సేనకు నాయకుడు అంగదుడు. ఆ బృందంలో ఒకడు ఆంజనేయుడు. మొల్లమాంబ రచనలో స్వల్పమైన మార్పు కనిపిస్తోంది.

## ఆశ్వాసాంత పద్య గద్యములు

క. **జలజాక్ష! భక్త వత్సల!**
**జలజాసన వినుత పాద జలజాత! సుధా**
**జలరాశి భవ్య మందిర**
**జలజాకర చారు హంస! జానకి నాథా!** **28**

**గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురుజంగమార్చన వినోద సూరిజన వినుత కవితా చమత్కారాతుకూరి కేసనసెట్టి తనయమొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణమహాకావ్యంబునం గిష్కింధా కాండము సర్వము నేకాశ్వాసము.**

* * *

# సుందరకాండ

**క. సూర్యకుల రత్నదీపా!**
**సూర్య సహస్ర ప్రతాప! సుందర రూపా!**
**ఆర్యారాధిత నామా!**
**శౌర్యాధిక సుగుణ సీమ! జానకి రామా! 1**

**ప్రతి :** సూర్యకుల రత్నదీపా! = సూర్యవంశానికి రత్నదీపము వంటివాడా!, సూర్యసహస్ర ప్రతాప!=వేయి సూర్యుల ప్రతాపము కలవాడా!, సుందరరూపా!=అందమైన రూపము కలవాడా!, ఆర్యారాధితనామా! = పార్వతీదేవి చేత ఆరాధింపబడే పేరు కలవాడా!, పెద్దలు ఆరాధించే 'రామ' నామము కలవాడా!, శౌర్యాధిక సుగుణసీమ!=శౌర్యము సుగణములు అధికముగా గలవాడా! జానకిరామా!

**తా :** సూర్యవంశ రత్నదీపా! వేయిసూర్యుల ప్రతాపం కలవాడా! సుందరుడా! పార్వతీదేవి ఆరాధించే 'రామ' నామము పేరుగా గలవాడా, శౌర్యము సుగుణముల విషయంలో పారము ముట్టినవాడా! జానకిరామా!

**వ. శ్రీనారద మహాముని వాల్మీకికి కెఱింగించిన తెఱంగు విన్న వించెద నవధరింపుము. 2**

**తా :** శ్రీనారదమహర్షి వాల్మీకికి తెలియపరచిన విధమును విన్నవిస్తాను, ఏకాగ్రతగా గ్రహించండి.

**తే. రామునకు మొక్కి యక్కపిరాజుకరుణం**
**దత్క్షణంబున వెడలిరి దక్షిణంబు**
**వెదకువారగు వానర వీరవరులు**
**పంతముతోడ నెంతయు సంతసమున. 3**

**ప్రతి :** రామునకుమ్రొక్కి=రామునికి నమస్కరించి, అక్కపిరాజుకరుణన్=ఆ కపిరాజు సుగ్రీవునిదయతో, తత్క్షణంబున=వెంటనే, దక్షిణంబు వెదకువారగు=దక్షిణదిశలో వెదకేవారయిన, వానరవీరవరులు= వానరవీరులలో శ్రేష్ఠులు, పంతముతోడన్=కార్యం సాధించి తీరాలనే పట్టుదలతో, ఎంతయు=మిక్కిలి, సంతసమునన్=సంతోషముతో, వెడలిరి=వెళ్లిరి.

**తా :** శ్రీరామునికి నమస్కరించి, సుగ్రీవుని కరుణతో దక్షిణదిశలో వెదకడానికి వెళ్లే వానరశ్రేష్ఠులు కార్యం సాధించాలనే పట్టుదలతో ఆ క్షణంలోనే, ఆనందంతో బయలుదేరి వెళ్లారు.

**క. మును తా మేఁగిన దిక్కులు**
**పనివడి వెదకంగఁ జనిన బలిముఖు లెల్లన్**
**జనకజఁ గానక వచ్చిరి**
**మనుజేశుని కడకు చనిన మార్గంబుననే. 4**

ప్రతి : మును=ఇంతకుముందు, తామేగిన=తామువెళ్లిన, దిక్కులు, పనివడి=పనికట్టుకుని శ్రద్ధగా, వెదకంగన్, చనిన=వెళ్లిన, బలిముఖులెల్లన్=బలిముఖులు మొదలైన వానరులందరు, జనకజన్=సీతను, కానక= కనుక్కోలేక, మనుజేశునికడకు=రాజు చెంతకు, చనిన=వెళ్లిన, మార్గంబుననే=దారిలోనే, వచ్చిరి=వచ్చారు.

తా : ఇంతకుముందు సీతను వెదకడానికి వెళ్లిన కోతులందరూ తాము వెళ్లిన దిక్కుల్లో సీత కనబడక సుగ్రీవుని దగ్గరకు వెళ్లినదారినే తిరిగి వచ్చారు.

**వ. అట్టి సమయంబున. 5**

తా : ఆ సమయంలో

**క. గిరులును, నదులును, వనములుఁ**
**బరికింపుచుఁ బట్టణములు బహువిధగతులన్**
**దిరుగుచు వెదకుచుఁ గానక**
**కరువలి సుతుఁ డాది యైన కపివరు లెదుటన్. 6**

ప్రతి : గిరులును=కొండలును, నదులును, వనములున్=అరణ్యాలును, పరికింపుచున్=వెదకుచు, పట్టణములు, బహువిధగతులన్=అనేక విధాలుగా, తిరుగుచు, వెదకుచు, కానక, కరువలి సుతుండు= వాయువుకొడుకు ఆంజనేయులు, ఆదియైన=మొదలయిన, కపివరులు=వానరశ్రేష్ఠులు, ఎదుటన్=ఎదురుగా.

తా : పర్వతాలు, నదులు, అరణ్యాలు వెదికారు. పట్టణాలు అన్ని వైపుల తిరిగి వెదికారు. సీతాదేవి కనబడలేదు. ఆంజనేయుడు మొదలయిన వానరుల ఎదుట

**క. ఆ లోఁ గాంచిరి సత్కపి**
**జాలముఁ గరి శరభ సింహ శార్దూల మృగా**
**భీలముఁ బుణ్య కదంబ వి**
**శాలమునగు నమ్మహేంద్ర శైలము లీలన్. 7**

ప్రతి : ఆలోన్=అంతలో, సత్కపిజాలము=మంచివానర సమూహము, కరి=ఏనుగులు, శరభ=శరభమృగము ఎనిమిది కాళ్లు గల జంతువు, సింహ, శార్దూల=పెద్దపులులు, మొదలయిన మృగాభీలమున్ భయంకరమయిన జంతువుల కలది. పుణ్యకదంబ విశాలమున్=వివిధ పుణ్యస్థలాలతో విశాలమైనది, అగు, అమ్మహేంద్రశైలము= ఆ మహేంద్ర పర్వతాన్ని, లీలన్=ఆనందంగా, కాంచిరి=చూచిరి.

తా : అంతలో ఆ వానర సమూహం ఏనుగులు, శరభములు, సింహాలు, పెద్దపులులు వంటి భయంకరమయిన జంతువులతో, వివిధ పుణ్యస్థలాలతో ఒప్పుతున్న మహేంద్రపర్వతాన్ని చూసారు.

**వ. ఇట్లు మహేంద్ర పర్వతంబు గనుంగొని డాయంజని యచ్చట. 8**

**తా :** ఇలా మహేంద్ర పర్వతం చూసి దగ్గరగా వెళ్లి అక్కడ

**ఉ. ఆ తతి వానర ప్రవరు లా ధరణీసుతఁ గానలేక దుః**
**ఖాతురులై వగం బడఁగ నయ్యెడఁ దద్గిరినుండి వచ్చి సం**
**పాతి యనం బ్రసిద్ధుఁ డగు పక్షి కులేంద్రుఁడు రావణుండు దా**
**సీతను గొంచుఁ బోవుగతిఁ జెప్పుచుఁ దెల్పెను లంక త్రోవయున్. 9**

**ప్రతి :** ఆతతిన్=ఆ సమయంలో, వానరప్రవరులు=వానరశ్రేష్ఠులు, ఆ ధరణీ సుతన్=ఆ సీతను, కానలేక= కనుక్కోలేక, దుఃఖాతురులై=దుఃఖముతో కూడినవారై, అయ్యెడన్=ఆ సమయంలో, తద్గిరినుండి=ఆ మహేంద్ర పర్వతము నుండి, వచ్చి, సంపాతియన్ ప్రసిద్ధుఁడగు=సంపాతి అనే పేరుతో ప్రసిద్ధుడయిన, పక్షికు లేంద్రుడు=పక్షిరాజు, రావణుండు, తా, సీతను, కొంచున్, పోవుగతిన్=ఎలా తీసుకు వెళ్లిందీ, చెప్పుచున్=చెప్తూ, లంకత్రోవయున్=లంకకు వెళ్లే మార్గంకూడా, తెల్పెను=చెప్పాడు.

**తా :** ఆ సమయంలో వానరవీరులు సీత కనబడక దుఃఖపడుతూ ఆలోచనలోపడ్డారు. అప్పుడు ఆ మహేంద్రపర్వతం నుండి సంపాతి అనే సుప్రసిద్ధ పక్షిరాజు వచ్చి రావణుడు ఏ మార్గంలో సీతను ఎత్తుకు వెళ్లినదీ చెప్తూ, లంకకు వెళ్లే దారికూడా చెప్పాడు.

**క. ఆ పక్షీంద్రుని చేతను**
**జాపల శుభనేత్ర రామచంద్రుని దేవిన్**
**బాపాత్ముఁడైన దైత్యుఁడు**
**వే పట్టుక చనిన త్రోవ విని కపు లెల్లన్. 10**

**ప్రతి :** ఆ పక్షీంద్రుని చేతను, చాపల శుభనేత్ర=మెఱపు వంటి అందమయిన కన్నులుగల, రామచంద్రుని దేవిన్=సీతను, పాపాత్ముఁడైన, దైత్యుఁడు=రాక్షసుడు, వే=వేగముగా, పట్టుక చనిన=పట్టుకుని వెళ్లిన, త్రోవ, విని, కపులు, ఎల్లన్=అందరు.

**తా :** శ్రీరామచంద్రుని భార్యను పాపాత్ముడైన రావణుడు వేగంగా ఎత్తుకుపోయిన త్రోవను గురించి సంపాతి చెప్పగా విన్న కపులందరూ –

**వ. మహానందంబు నొంది యమ్మహేంద్ర పర్వతం బారోహించి పురోభాగంబున. 11**

**తా :** మహానందంతో ఆ మహేంద్ర పర్వతం ఎక్కి ముందుభాగంలో–

**క. ఆ కపివీరులు గనుగొని**
**రాకాశనదీ ప్రచుంబితార్భట భంగా**
**నీక మహాఘనరవ భయ**
**దాకార నటత్ప్రకాశు నా జలధీశున్. 12**

**ప్రతి :** ఆకాశనదీ ప్రచుంబితార్భట భంగానీక=ఆకాశనదిని విశేషంగ ముద్దు పెట్టుకోవడానికా అన్నట్లుగా అలల సమూహము యొక్క మహాఘన రవ భయదాకార=గొప్పశబ్దంతో భీకరమైన ఆకారంతో, నటత్ప్రకాశన్= నాట్యము చేస్తున్నట్లుగా ప్రకాశిస్తున్న, ఆ జలధీశున్=ఆ సముద్రుణ్ణి, ఆ కపివీరులు, కనుగొనిరి=చూసిరి.

**తా :** ఆకాశనదిని ముద్దుపెట్టుకోవడానికా అన్నట్లు ఎత్తైన అలలతో ఎగసిపడుతూ, భయంకరమైన ఆకారంతో, పెద్దపెద్ద అలలు చేసే ఘోషతో కూడి నాట్యం చేస్తున్నట్లుగా ఉన్న సముద్రుణ్ణి ఆ కపివీరులు చూసారు.

వ. **అట్లు కనుంగొని.** **13**

**తా :** ఆ విధంగా చూచి

క. **తమ తమ సత్త్వ స్థితులును**
**గమియించెడు నబ్ధి కొలఁదిఁ గనుఁగొని మదిలో**
**భ్రమయుచుఁ బలికెను గపి సం**
**ఘము లెంతయు డెందమందుఁ గళవళపడుచున్.** **14**

**ప్రతి :** తమతమ=వారివారి, సత్త్వస్థితులును=శక్తిమేరలను, గమియించెడున్= దాటవలసిన, అబ్ధి=సముద్రము యొక్క, కొలదిన్=దూరాన్ని, కనుగొని=చూచి, మదిలో=మనస్సులో, భ్రమయుచున్=దిక్కుతోచక, కపి సంఘములు=కపుల సమూహాలు, డెందమందున్=హృదయంలో, ఎంతయున్=అధికముగా, కళవళ పడుచున్=కలవరపడుతూ, పలికెను.

**తా :** కపుల సమూహమంతా తమతమ శక్తి ఎంతో దాటవలసిన సముద్రం ఎంతుందో చూచి దిక్కుతోచక గుండెల్లో గుబులుపడుతూ ఇలా పలికిరి.

## హనుమంతుని సాగర లంఘనము

క. **ఈ వార్థి దాఁట సత్త్వము**
**మా వలనం జాల దింక మారుతి! వినుమా**
**పావని వగుటం జేసియు**
**నీవలనం దక్క నొరులు నేరరు దాఁటన్.** **15**

**ప్రతి :** ఈ వార్థి=ఈ సముద్రము, దాఁటన్=దాటే, సత్త్వము=బలము, మావలనం జాలదు=మాకున్న బలం సరిపోదు, ఇంక, మారుతి!=ఓ హనుమ, వాయు పుత్రుఁడా!, పావనివి=పవనుని కుమారుడవు, అగుటం జేసియు=అగుట వలనను, నీవలనం దక్కన్=నీవల్ల తప్ప, ఒరులు=ఇతరులు, దాఁటన్=దాటడం, నేరరు=తెలియరు.

**తా :** ఈ సముద్రం దాటడం మావల్ల కాదు. మా శక్తి చాలదు. నువ్వు పావనివి (వాయుపుత్రుడవు) కాబట్టి ఈ పని నీవల్ల తప్ప అవదు. తక్కినవారు దాటలేరు వారికి రాదు.

**విశే :** ఈ పద్యంలో హనుమకు పర్యాయపదాలుగ మారుతి, పావని అని రెండు పదాలు ప్రయోగించింది మొల్ల. వేగం గురించి చెప్పే సందర్భంలో వాయువేగం అని చెప్తూ ఉంటారు. ఇక్కడ హనుమ వాయుపుత్రుడు గనుక వాయువేగంతో సముద్రం దాటగలడు అని సూచన.

మారుతి, పావని=వాయునందనుడు అని అర్థం. హనుమ 'మనోజవమ్ మారుత తుల్య వేగమ్' అని కీర్తించబడినవాడు.

**వ. అని యిట్లు ప్రార్థించిన తోడనే యుబ్బి వారి వచనంబులకు సమ్మతించి వాయు తనూజుం డిట్లనియె. 16**

**తా :** వానరులందరూ ఈ విధంగా ప్రార్థించిన వెంటనే ఉప్పొంగిపోయి వారి మాటలకు సరే అని వాయుపుత్రుడు ఇలా అన్నాడు.

**ఉ. పావనమూర్తి రామనరపాలకుపంపున నబ్ధి దాఁటెదన్,**
**దేవవిరోధి చేఁబడిన దేవిని జూచెదఁ, గానకుండినన్**
**లావున గడ్డతోఁ బెఱికి లంకయు తెచ్చెద, నట్లు గానిచో**
**రావణుఁ బట్టి తెచ్చెదను, రాముని సన్నిధి కెన్ని రీతులన్. 17**

**ప్రతి :** పావనమూర్తి=పుణ్యమూర్తి, రామనరపాలకు=రామరాజు యొక్క, పంపునన్=ఆజ్ఞమేరకు, అబ్ధిదాఁటెదన్=సముద్రముదాఁటెదను, దేవవిరోధి=దేవతలకు శత్రువయిన రావణుని, చేఁబడిన=చేతుల్లో చిక్కిన, దేవినిన్=సీతాదేవిని, చూచెదన్, కానకుండినన్=కనబడకపోతే, లావున=బలంతో, గడ్డతోన్=భూమితో, పెఱికి=పెల్లగించి, లంకయు=లంకను, తెచ్చెదన్, అట్లు కానిచో=చేయలేకపోతే, ఎన్ని రీతులన్= ఎన్నివిధాలుగానైనా ప్రయత్నించి, రామునిసన్నిధికి=రాముని ఎదుటికి, రావణున్ పట్టి తెచ్చెదను=రావణుణ్ణి పట్టి తెస్తాను.

**తా :** శ్రీరాముడు ఆజ్ఞాపించిన పనికాబట్టి సముద్రం దాటేస్తాను. రావణుని చేతచిక్కిన సీతను వెదకిచూస్తాను. ఆమె కనబడకపోతే లంకను గడ్డగా పెకలించి తెస్తాను. అట్లుకాకపోతే శ్రీరామప్రభువు సన్నిధికి రావణుణ్ణి పట్టి తెస్తాను.

**విశే :** హనుమ ఆత్మవిశ్వాసం ఎంత గొప్పదో ఈ పద్యం చెప్తోంది.

**వ. అని వారి మనంబులు సంతసిల్లునట్లుగా బిరుదులు వక్కాణించి, తనకుఁ దండ్రి యైన వాయు దేవునకును, త్రిమూర్త్యాత్మకుండైన లోకబాంధవునకును, నింద్రునకును, సంద్రమ్మునకును నమస్కరించి, శ్రీరామ లక్ష్మణులఁ దన మనఃపద్మంబునం దిడికొని మ్రొక్కి, బంధు మిత్రులం గౌఁగిలించుకొని, వారిచేత దీవనలం బొంది, గమనోన్ముఖుండై. 18**

**ప్రతి :** అని, వారిమనంబులు=వారి మనస్సులు, సంతసిల్లునట్లుగా=ఆనందపడే విధంగా, బిరుదులు=శక్తి సామర్థ్యములు, వక్కాణించి=వివరంగా చెప్పి, తనకు తండ్రియైన వాయుదేవునకును, త్రిమూర్త్యాత్మకుండైన=

బ్రహ్మావిష్ణు మహేశ్వరుల ఏకరూపుడయిన, లోకబాంధవునకును=లోకమునకంతటికీ బంధువయిన సూర్యునికి, ఇంద్రునకును, సంద్రమ్మునకును=సముద్రానికీ, నమస్కరించి, శ్రీరామలక్ష్మణులన్, తన, మనః పద్మంబునందు=మనస్సులో, ఇడుకొని=నిలుపుకొని, మ్రొక్కి, బంధుమిత్రులం కౌగిలించుకొని, వారిచేత దీవనలం, పొంది, గమనోన్ముఖుండై=వెళ్లుటకు సంసిద్ధుడై.

**తా :** వానరుల మనస్సులు ఆనందపడే విధంగా తన శక్తిసామర్థ్యాల గుఱించి వివరంగా చెప్పి, తండ్రి వాయుదేవునికి, సూర్యభగవానునికి, ఇంద్రునికి, సముద్రునికి నమస్కరించి, రామలక్ష్మణుల్ని తన మనస్సులో నిల్పుకొని మ్రొక్కి, బంధువుల్ని స్నేహితుల్ని కౌగిలించుకుని, వారిచేత దీవనలు అందుకొని ప్రయాణానికి సిద్ధమయ్యాడు.

**చ. మొగము బిగించి, పాదములు మొత్తముగా వడినూఁది త్రొక్కి, నీ**
**టుగ మొగమెత్తి, భీకర కఠోర రవంబున నార్చి, బాహు ల**
**త్యగణిత లీల నూఁచి, వలయంబుగ వాలముఁద్రిప్పి, వ్రేఁగునన్**
**నగము సగమ్ము గ్రుంగఁ గపి నాథుఁడు నింగికి దాఁటె ఱివ్వునన్. 19**

**ప్రతి :** మొగముబిగించి=ముఖము బిగబట్టి, పాదములు మొత్తముగా వడినూఁది త్రొక్కి=రెండుకాళ్లూ వేగంగా బలంగాత్రొక్కి, నీటుగ=సొగసుగా, మొగమెత్తి=ముఖము ఎత్తి, భీకర కఠోర రవంబునన్=భయంకరమైన తీక్షణమైన నాదంతో, ఆర్చి=అరిచి, బాహులు=భుజాలు, అత్యగణితలీలన్=విశేషమైన పద్ధతిలో, ఊఁచి=ఊపి, వలయంబుగ= గుండ్రంగా, వాలమున్=తోకను, త్రిప్పి=తిప్పి, వ్రేఁగునన్=బరువుచేత, నగము=పర్వతము, సగమ్ము=సగభాగము, క్రుంగ=దిగబడి పోగా, కపినాథుఁడు=హనుమ, నింగికిన్=ఆకాశములోనికి, ఱివ్వునన్=వేగంగా, దాఁటె=ఎగిరెను.

**తా :** మొగం బిగించి కాళ్లతో పర్వతాన్ని గట్టిగా తొక్కిపెట్టి, సొగసుగా ముఖం ఎత్తి, భయంకరగా అరుస్తూ, భుజాలు విశేషంగా ఊపుతూ, తోకను గుండ్రంగా త్రిప్పి, తన బరువుకు ఆ పర్వతం సగము దిగబడిపోగా మహావేగంతో ఆకాశంలోకి హనుమ దూసుకుపోయాడు.

**విశే :** హనుమ సముద్ర లంఘనం మహత్ కార్యమే కాదు, బృహత్ కార్యం కూడా. సముద్రలంఘన సమయంలో హనుమ రూపురేఖా విలాసాలను ఈ పద్యంలో సహజ సుందరంగా వర్ణించింది మొల్ల. హనుమ ఆకాశంలోకి 'ఱివ్వున' ఎగిరాడు అనడంలో తెలుగు మాటలకు గల శక్తిని కూడా చూపింది. మొల్ల చేసిన ఈ వర్ణన పలువురి ప్రశంసలను అందుకొంది.

**వ. ఇట్లు నింగి కెగిరిపోవుచుండు సమయంబునఁ బావనికి నడ్డంబుగా మానవ రూపంబున మైనాకపర్వతంబును, సురస యను నాగ జననియు, ఛాయాగ్రాహిణియైన సింహికయునుం, గనుపట్టిన నెల్లర నతిక్రమించి, సువేలాచలంబున కరిగి, యక్కడ నలయిక దీర నొక్క యిక్కువ నించుకసేపు విశ్రమించియున్న సమయంబున. 20**

**ప్రతి :** ఇట్లు, నింగికి=ఆకాశానికి, ఎగిరిపోవుచుండు, సమయంబున, పావనికిన్= హనుమకు, అడ్డంబుగా, మానవరూపంబున, మైనాక పర్వతంబును, సురస అను నాగజననియు='సురస' అను పేరుగల నాగులతల్లియు, ఛాయాగ్రాహిణియైన=నీడను పట్టుకొనగల్గిన, సింహికయునున్=సింహికయను రాక్షసియు, కనుపట్టినన్+ఎల్లరన్=కనబడిన వారినందరినీ, అతిక్రమించి=దాటుకొని, సువేలాచలంబునకున్= సువేలాచలమునకు, అరిగి=వెళ్ళి, అక్కడన్, అలయిక దీరన్=అలసట తీరగా, ఒక్క ఇక్కువన్=ఒక ప్రదేశమున, ఇంచుకసేపు=కొంత సమయము, విశ్రమించియున్న సమయంబునన్=విశ్రాంతి తీసికొనుచున్న సమయములో–

**తా :** ఇలా ఆకాశానికి ఎగిరి ప్రయాణిస్తున్న హనుమకు మానవరూపంలో మైనాకుడు అడ్డుపడ్డాడు. ఆ తరువాత నాగులకు తల్లి అయిన సురస అడ్డుపడింది. ఆ తరువాత నీడను పట్టుకుని లాగే శక్తిగల సింహిక అడ్డుపడింది. అందరినీ జయించి ముందుకు సాగిపోయాడు హనుమ. సువేలాచలం మీద తన అలసట తీరడానికి ఒకచోట కొంచెంసేపు విశ్రమించాడు. ఆ సమయంలో

**ఉ. భేరికి సాటియౌ దనుజ భీషణ భాషలు, భద్ర నాగ ఘీం**
**కార నినాదముల్, హయ నికాయపు హేషలు, కాహళ ధ్వనుల్**
**వీర మృదంగ నాదములు, విశ్వ భయంకర లీల లంకలో**
**బోరు కలంగఁగా, శ్వసన పుత్రుఁడు చాలఁగ నాలకించుచున్. 21**

**ప్రతి :** భేరికి=పెద్ద ధ్వని చేయు వాయిద్యమునకు, సాటియౌ=సరిరాగల, దనుజ భీషణభాషలు=రాక్షసుల భయం పుట్టించే మాటలు, భద్రనాగఘీంకార నినాదముల్=భద్రజాతి ఏనుగుల ఘీంకారాల శబ్దాలు, హయనికాయపు=గుఱ్ఱాలసమూహాల, హేషలు=సకిలింపులు, కాహళధ్వనుల్=పెద్ద కొమ్ముబూరావంటి వాద్యవిశేషం నుండి వచ్చే శబ్దాలు, వీరమృదంగనాదములు=వీరులు వాయించే మద్దెలనాదాలు, విశ్వభయంకరలీల=ప్రపంచాన్నే భయపెడుతున్నట్లు లంకలో, బోరుకలంగాగన్=విశేషంగా శబ్దాలు చేస్తూ ఉండగా, శ్వసనపుత్రుడు=వాయుదేవుని కొడుకు, చాలఁగ=ఎక్కువగ, ఆలకించుచున్=వింటూ–

**తా :** భేరీనాదంతో సరివచ్చే రాక్షసుల మాటలు, భద్రగజాల ఘీంకారాలు, గుఱ్ఱాల హేషారవాలు, కాహళధ్వనులు, మృదంగనాదాలు విశ్వభయంకరంగా లంకలో శబ్దాలు చేస్తూ ఉంటే–హనుమ వింటూ.

**విశే :** ఏనుగులది ఘీంకారము, గుఱ్ఱాలది–హేషారవము. సింహాలది–గర్జన. ఆయా జంతువుల అరుపులివి.

**ఉ. కోటికిఁ గోటులై పరఁగు కుంజర వర్గము, ఘోటకంబులున్**
**గోటికి నెక్కుడై పరగుఁ గోత్ర సమానములౌ రథంబులున్**
**గోటికి హెచ్చులై పరఁగు ఘోర నిశాచర కోటి కోట్లతో**
**సాటికి నెక్కు నప్పురము సాహసవంతుఁడు గాంచె ముందరన్. 22**

**ప్రతి :** కోటికిన్‌కోటులై=కోటానుకోట్లై, పరcగు=ఒప్పు, కుంజరవర్గము=ఏనుగుల సమూహము, ఘోటకంబులున్=గుఱ్ఱములు కూడా, కోటికిన్ ఎక్కుడైపరcగు=కోటికంటే ఎక్కువై ఒప్పుచున్నవి, గోత్రసమానములౌ=పర్వతాలతో సమానమైన, రథంబులున్=రథములుకూడా, కోటికిహెచ్చులైపరcగు= కోటికంటే ఎక్కువగా ఉండగా, కోట్లతో సాటికినెక్కున్=కోట్లసంఖ్యతో సాటిగా నిలబడే, ఘోర నిశాచరకోటి= భయంకరులయిన రాక్షససమూహము, అప్పురము=ఆ లంకానగరము, సాహసవంతుcడు= సాహసముతో కూడిన హనుమ, ముందరన్=ఎదుట, కాంచె=చూసెను.

**తా :** కోటికి కోటిగా ఎదుగుతున్న ఏనుగులు, కోటికంటే హెచ్చైన గుఱ్ఱాలు, పర్వతాలంతటి రథాలు కోటికి ఎక్కువగా, ఒప్పి ఉండగా, కోట్లసంఖ్యతో సాటిరాగ నిశాచరకోటి గలిగి తన ఎదురుగా ఉన్న లంకానగరాన్ని సాహసవంతుడయిన హనుమ చూసాడు.

**విశే :** సాహసవంతుడు అని హనుమకు విశేషణం. హనుమ సముద్రలఘనం అడ్డంకులు అన్నీ తొలగించుకుని విజయవంతంగా పూర్తిచేసాడు. ఆ సాహసకార్యం చేసి వచ్చాడు కాబట్టి సందర్భోచితంగా సాహసవంతుడు అనే విశేషణం మొల్ల ప్రయోగించింది. నిశాచర కోటి పక్కనే – కోట్లతో సాటికి అనే ప్రయోగం చేసి శబ్దచమత్కారాన్ని చూపింది.

**వ. ఇట్లా లంకాపుట భేదనంబును వీక్షించి తన మనంబున** **23**

**ప్ర :** పుట భేదనము=పురము

**తా :** ఇలా ఆ లంకాపురాన్ని చూసి తన మనస్సులో

**శా. ఘోరాకారులు, కామరూపులు, మహాక్రూరాత్ము, లత్యుగ్రు లీ**
**శూరుల్, వీరలc గన్నుబ్రామి పురిలో శోధించు లా గెట్లొకో?**
**యీ రూపంబునc బోవcగాc గనిన వా రెగ్గేమి గావింతురో?**
**నారీ రత్నము సీత నందుc గనcగా నా కెట్లు సిద్ధించునో?** **24**

**ప్రతి :** ఘోరాకారులు=భయంకరమైన ఆకారము గలవారు, కామరూపులు= కావలసిన రూపాన్ని ధరించగలవారు, మహాక్రూరాత్ములు=గొప్ప క్రూరులు, అత్యుగ్రులు=మిక్కిలి భయంకరులు, ఈ శూరుల్, వీరల=వీరియొక్క, కన్నుc బ్రామి= కన్నుకప్పి, పురిలో=లంకాపురిలో, శోధించు=వెదికే, లాగు=విధానము, ఎట్లో=ఎలాగో, ఈ రూపంబునన్=నేను ఈ నా రూపంతో, పోవగాన్=వెళితే, కనినవారు=చూసిన వారు. ఎగ్గేమి కావింతురో?=ఏ కీడుచేస్తారో?, నారీ రత్నము= స్త్రీరత్నమైన, సీతన్, అందున్=లంకలో, కనగాన్= చూడడం, నాకు, ఎట్లు, సిద్ధించునో=సమకూడునో?

**తా :** ఈ లంకలోని శూరులు ఘోరమైన ఆకారం కలవారు. కామరూపులు, క్రూరులు, భయంకరులు,అయిన వీళ్ల కళ్లుగప్పి ఈ లంకలో వెదికే దారి ఏది?, నేను ఈ నా రూపంతో వెళితే చూసినవాళ్లు నన్ను ఏం చేస్తారో? సీతాదేవిని దర్శించడం నాకు ఎలా సిద్ధిస్తుందో కదా?

**వ. అని తలంచుచున్న యవసరమ్మున. 25**

**తా :** అని ఆలోచిస్తున్న సమయంలో –

**ఉ. క్రుంకెఁ బయోజ బాంధవుఁడు గూండ్లకుఁ బక్షులు సేరె నెల్లెడన్**
**బొంకము తీసెఁ దామరలు, పూచెను గల్వలు, తారకావళుల్**
**బింకముఁ జూపెఁ గాంతి, నళి బృందము కూర్కెఁ, దమంబుఁబర్వె, నే**
**వంకను జార చోరకులు వ్రాలి చరించిరి కౌతుకంబునన్. 26**

**ప్రతి :** పయోజ బాంధవుఁడు=తామరవుప్వుల చుట్టమయిన సూర్యుడు, క్రుంకె=అస్తమించాడు, గూండ్లకున్=గూళ్లకు, పక్షులు, ఎల్లెడన్+చేరెన్=అన్ని దిక్కులనుండి చేరాయి, తామరలు పొంకము తీసెన్= తామరలు ముడుచుకున్నాయి, కల్వలు పూచెను=కలువలు విచ్చుకున్నాయి, తారకావళుల్=నక్షత్రాల, వరుసలు, బింకమున్+చూపెన్=గర్వము చూపాయి, కాంతిన్=కాంతితో, అళిబృందము కూర్కెన్=తుమ్మెదల సమూహం నిద్రించింది, తమంబు పర్వె=చీకట్లు వ్యాపించాయి, జారచోరకులు=వేశ్యలయిళ్లకు వెళ్లేవారు, దొంగలు, ఏ వంకను=అన్ని దిక్కుల్లో, వ్రాలి=విజృభించి, కౌతుకంబునన్= కుతూహలముతో, చరించిరి= తిరుగుతున్నారు.

**తా :** సూర్యుడు అస్తమించాడు. ఎక్కడెక్కడి పక్షులు గూళ్లకు వచ్చి చేరాయి. తామరలు ముడుచుకుపోయాయి. కలువలు విచ్చుకున్నాయి. నక్షత్రాలు కాంతిమంత మయ్యాయి. తుమ్మెదలు నిద్రించాయి. చీకటి వ్యాపించింది. ఏ వంక చూసినా ఆ నగరంలో జారులు, చోరులు కుతూహలంతో విజృంభించారు.

**విశే :** సూర్యాస్తమయం కాగానే ప్రకృతిలో జరిగే మార్పులు వరుసగా చెప్తూ జారులలో చోరులలో వచ్చే మార్పును కూడా చెప్పింది మొల్ల.

**వ. ఇట్లు నిశాసమయమునందుఁ దన మేటి గాత్రం బణు మాత్రంబుగా గుదియించి, యగ్గిరి డిగ్గిచనుచు, నల్ల నల్లనఁ బుర ద్వారంబు నొద్దకుఁజేరి, వానరపుంగవుఁడు పుర ప్రవేశంబుసేసె. 27**

**ప్రతి :** ఇట్లు, నిశాసమయమునందున్=రాత్రివేళలో, తన, మేటి గాత్రంబు=పెద్ద శరీరాన్ని, అణుమాత్రంబుగా= చాలా చిన్నదిగా, కుదియించి=చేసి, అగ్గిరి=ఆ పర్వతం, డిగ్గిచనుచున్=దిగివెళుతూ, అల్లనల్లనన్= నెమ్మదినెమ్మదిగా, పురద్వారంబు=లంకాపుర గుమ్మం, ఒద్దకున్=సమీపానికి చేరి, వానర పుంగవుండు= కపిశ్రేష్ఠుడు, పురప్రవేశంబుసేసె=పురంలోకి ప్రవేశించాడు.

**తా :** ఇలా రాత్రివేళ తన పెద్ద ఆకారాన్ని అణువంత చిన్నదిగా కుదించుకుని ఆ పర్వతం మీదనుండి దిగి మెల్లమెల్లగా హనుమ లంకాపుర ద్వారం చేరి లంకలోకి ప్రవేశించాడు.

## హనుమంతుఁడు లంకలో సీతకై కలయ వెదకుట

**ఉ. మేడలు రచ్చకొట్టములు, మిద్దెలు, మంచెలు, నాటకూటముల్**
**మాడువు, లంగళుల్, దనుజ మందిరముల్, పుర గోపురావళుల్**

**వాడలు, దేవ గేహములు, వప్ర చయంబులు, వేశ్యవాటికల్**
**గోడలు, నాదిగాఁగఁ గపి కుంజరుఁ డప్పుడు చొచ్చి చూచుచున్. 28**

**ప్రతి :** మేడలు, రచ్చకొట్టములు=సభామందిరాలు, మిద్దెలు=డాబా ఇళ్లు, మంచెలు=ఎత్తుగా కట్టినవి, ఆటకూటముల్=విహార గృహాలు, మాడువులు=ఒకవిధమైన సౌధములు, అంగళుల్=పచారీకొట్లు, దనుజమందిరముల్=రాక్షసుల గృహాలు, పురగోపురావళుల్=ఆ పురములో ఎత్తైన కట్టడాల వరుసలు, వాడలు=ఆయా వృత్తి పనివారు నివసించునవి (బెస్తవాడ, చాకలివాడ), దేవగేహములు=దేవాలయాలు, వప్రచయంబులు=అగడ్తల ప్రహారీగోడచుట్టూ వేసిన మట్టిదిబ్బలు, వేశ్యవాటికలు=వేశ్యవాడలు, గోడలు, ఆదిగాఁగన్=మొదలుగలవానిని, అప్పుడు, కపికుంజరుడు=కపిశ్రేష్ఠుడయిన హనుమ, చొచ్చి=ప్రవేశించి, చూచుచున్=చూస్తూ.

**తా :** హనుమంతుడు లంకలో ప్రవేశించి మేడలు, సభామందిరాలు, మిద్దెలు, మంచెలు, విహార గృహాలు, మాడువులు, అంగళ్లు, రాక్షసుల ఇళ్లు, గోపురాలు, వాడలు, దేవాలయాలు, వప్రచయంబులు, వేశ్యవాడలు, గోడలు మొదలయిన వాటిలో ప్రవేశించి చూస్తూ.

**విశే :** ఒక నగరంలో ఉండే వివిధ కట్టడాలు ఈ పద్యంలో పేర్కొన్నది.

క. **మఱువులు, సందులు, గొందులు,**
**నిరవులుఁ జొరరాని చోట్లు నేకాంతంపుం**
**దెరువులు, నంతఃపురములు**
**వెరవునఁ గపి కుంజరుండు వెదకం జొచ్చెన్. 29**

**ప్రతి:** మఱువులు=దాగి ఉండడానికి వీలయిన ప్రదేశాలు, సందులు, గొందులు=సందులకంటె ఇరుకైనవి, ఇరవులు=బసచేయు ప్రదేశములు (సత్రములు), చొరరానిచోట్లు=ప్రవేశించడానికి కష్టమయిన ప్రదేశాలు, ఏకాంతంపున్=రహస్యమైన, తెరువులు=త్రోవలు, అంతఃపురములు=రాణివాసపు స్త్రీలు నివసించే మందిరాలు, వెరవునన్=ఉపాయంతో, కపికుంజరుఁడు=కపిశ్రేష్ఠుడు, వెదకన్, చొచ్చెన్=ప్రారంభించాడు.

**తా :** హనుమ మఱువులు, సందులు, గొందులు, సత్రములు, చొరరాని చోట్లు, రహస్యమార్గాలు, అంతఃపురాలు ఉపాయంతో వెదకడానికి పూనుకున్నాడు.

ఆ. **గాలి లీల, శీతకరకాంతి విఖ్యాతి,**
**ధూమరేఖ రీతిఁ దూతి చొచ్చి**
**యసుర మందిరముల నక్కడ నిక్కడఁ**
**గలయఁ దిరిగి వెదకెఁ గపివరుండు. 30**

**ప్రతి :** గాలిలీల=గాలివలె,శీతకరకాంతి=వెన్నెల, విఖ్యాతి=వ్యాపించినట్లు, ధూమరేఖరీతి=పొగవలె, తూఱి=దూరి, చొచ్చి=చొచ్చుకొనిపోయి, అసుర=రాక్షసుల, మందిరములన్=ఇళ్లలో, అక్కడనిక్కడన్=అక్కడ ఇక్కడ, కలయన్ దిగిరి=పూర్తిగా తిరిగి, వెదకెన్, కపివరుండు.

**తా :** హనుమ గాలిలాగ, వెన్నెలలాగ, పొగలాగ రాక్షసుల ఇళ్లల్లో ప్రవేశించి కలయతిరిగి సీతకోసం వెదికాడు.

**విశే :** ఈ పద్యంలో హనుమ రాక్షసగృహాల్లో ఎలా ప్రవేశించాడో చెప్పడానికి గాలి, వెన్నెల, పొగ ఉపమానంగా గ్రహించింది. ఈ మూడూ చిన్నసావకాశం ఉన్నా దూరిపోగలవు. పైగా ఈ మూడూ ప్రవేశించేటప్పుడు చప్పుడు కూడా అవదు. అలా హనుమ అన్ని ప్రదేశాల్లో ప్రవేశించి కలయదిరిగి వెదికాడు అంటుంది మొల్ల. ఈ సందర్భంలో ఇంతకుమించిన ఉపమానం మరొకటి ఉండదు.

వాల్మీకి రామాయణంలో హనుమ నాలుగు అంగుళాల మేరకూడా వదలకుండా వెదికాడని వర్ణించారు. ఒక్క సెంటీమీటరు కూడా వదలకుండా వెదికాడని మొల్ల ఉపమానాలు చెప్తున్నాయి.

**వ. ఇట్లు తిరిగి తిరిగి వెదకుచుఁ దన మనంబున. 31**

**తా :** ఈ విధంగా తిరిగి తిరిగి వెదుకుచూ తన మనస్సులో –

**క. మాయా బలుండు రాక్షస**
**నాయకుఁ డిటఁ బట్టి తెచ్చినాఁ డతని మహా**
**కాయము నుగ్రాకృతిఁ గని**
**తోయలి తన తనువు నెచటఁ దొఱఁగెనొ యకటా! 32**

**ప్రతి :** మాయాబలుండు=రకరకాల మాయల బలంకలవాడు, రాక్షస నాయకుఁడు=రావణుడు, ఇటన్=ఇక్కడకు, పట్టితెచ్చినాఁడు, అతని, మహాకాయమున్=పెద్ద శరీరము, ఉగ్రాకృతిన్=భయంకరమైన ఆకారాన్ని, కని=చూచి, తోయలి= స్త్రీ–సీత, తన తనువున్=తన శరీరాన్ని, ఎచటన్=ఎక్కడ, తొఱగెనొ=వదిలి వేసినదో, అకటా!=అయ్యో!

**తా :** మాయాబలుడయిన రావణుడు సీతను ఇక్కడకు పట్టి తెచ్చాడు. అతడి పెద్ద శరీరం, భయంకరమైన ఆకారం చూసి సీత తన శరీరాన్ని ఎక్కడైనా వదిలేసిందేమో – అయ్యో!

**మ. అటుగా కీతఁడె యన్య దేశమున నా యబ్జాక్షిఁ బెట్టించెనో?**
**ఘట యంత్రస్థితి వార్ధి మధ్యమునఁ దాఁ గ్రౌర్యంబునన్ దాఁచెనో?**
**పటు బాహాబలశక్తి నాకభువన ప్రాగ్దేశమం దుంచెనో?**
**చటులోగ్రాకృతి రాము బాణములకున్ శంకించి యెందుంచెనో? 33**

**ప్రతి :** అటుగాక=అలాకాకపోతే, ఈతఁడె=ఈ రావణుడే, అన్యదేశమునన్=ఇతర ప్రదేశంలో, ఆ అబ్జాక్షిన్=తామరలవంటి కన్నులగల ఆ సీతను, పెట్టించెనో?=పెట్టించాడేమో? ఘటయంత్రస్థితి=నీటిలో దింపే యంత్రాలతో, వార్ధిమధ్యమునన్= సముద్రమధ్యంలో, తాన్, క్రౌర్యంబునన్=క్రూరతతో, దాచెనో=దాచాడేమో?, పటుబాహాబలశక్తి=అధికమయిన భుజబలంతో, నాకభువన=స్వర్గలోకపు, ప్రాగ్దేశమందుంచెనో=తూర్పుదేశంలో పెట్టాడో, చటులోగ్రాకృతి=భయంకరమయిన ఆకృతిగల, రాము బాణములకున్, శంకించి= సందేహించి, ఎందుంచెనో=ఎక్కడ దాచాడో?

**తా :** సీత బ్రతికే ఉంటే ఈ రావణుడు రాముని తీవ్రమైన బాణాలకు భయపడి లంకలో కాకుండా సీతను వేరే ప్రదేశంలో ఉంచాడేమా? నీటి యంత్రాలతో సముద్రమధ్యంలో దాచాడేమో, తన భుజశక్తితో స్వర్గలోకంలో తూర్పుదేశంలో పెట్టాడేమో అనే సందేహాలతో, ఎక్కడ దాచాడో కదా! అనుకుంటున్నాడు హనుమ.

**వ. ఈ రీతిగా సందేహించి. 34**

**తా :** అని యాగతి వితర్కించి

**ఉ. త్రుంతు విధాత జందెములు, ధూర్జటి శైలము వ్రత్తు, విష్ణు సే**
**వింతు, గ్రహంబులం దిరుగవేయుదుఁ, బూర్ణపయోధు లేదుఁగా**
**రింతు, నుడు వ్రజంబులను లెక్కలు పెట్టుదు, భూతలంబు గ్ర**
**క్కింతు, నహీంద్ర లోకమును గీడ్పడఁ జేయుదు సాహసంబునన్. 35**

**ప్రతి :** విధాతజందెములు=బ్రహ్మగారి యజ్ఞోపవీతాలు, త్రుంతు=తెంపెదను, ధూర్జటి=శివుని, శైలము=కైలాసము, వ్రత్తు=ముక్కలు చేస్తాను, విష్ణుసేవింతు=విష్ణుదేవుని సేవిస్తాను, గ్రహంబులన్=గ్రహాలను, తిరుగవేయుదున్=తిరిగేస్తాను, పూర్ణపయోధులేదున్=సప్తసాగరాలను, కారింతు=బాధిస్తాను, ఉడు వ్రజంబులను=నక్షత్ర సమూహాన్ని, లెక్కలు పెట్టుదు=లెక్కపెడతాను, భూతలము=భూమిని, క్రక్కింతు=కక్కిస్తాను, అహీంద్రలోకమును=నాగలోకాన్ని, కీడ్పడన్=లొంగివచ్చేలా, చేయుదు=చేస్తాను, సాహసంబునన్=సాహసముతో, తెగింపుతో.

**తా :** బ్రహ్మయజ్ఞోపవీతం తెంపేస్తాను, శివుని కైలాసం ముక్కలు చేస్తాను. విష్ణుదేవుని పూజిస్తాను. గ్రహాలను క్రిందా మీదా చేస్తాను సప్తసముద్రాలను బాధిస్తాను. నక్షత్రాలనన్నిటినీ లెక్కలు పెడతాను, భూతలాన్ని కక్కేలా చేస్తాను అంటే లోపల ఉన్నవన్నీ బయటపడేలా చేయడం, నాగలోకాన్ని లొంగదీస్తాను.

**విశే :** క్రియాపదంతో పద్యాన్ని ఆరంభం చేయడం మొల్ల రచనారీతిలో ఒకటి. అరణ్యకాండంలో సౌమిత్రి రామునికి ధైర్యం చెప్పే సందర్భంలో చెప్పిన పద్యం చూసాము. ఇక్కడ హనుమ కూడా తాను ఆయా లోకాలకు వెళ్లి చేసే క్రియలు ముందుగా పేర్కొంటున్నాడు. త్రుంతు అని ఆరంభం చేసాడు. శ్రీరాముడు సాక్షాత్తు విష్ణువే. కాబట్టి విష్ణువును సేవిస్తాను అంటున్నాడు హనుమ భక్తితో.

**ఉ. కొట్టుదు నింద్రుఁ బావకుని గుండెలు వ్రత్తుఁ గృతాంతుఁ జెండుదున్**
**బట్టుదు దైత్యునిన్, వరుణు మానముఁ గొందును, గాలిఁదూలఁగా**
**దట్టుదుఁ, గిన్నరేశ్వరుని ప్రాణము కల్గుదు, శూలిఁ ద్రోలుదున్**
**జట్టలు ద్రుంతు రావణుని, సారస లోచనఁ జూపకుండినన్. 36**

**ప్రతి :** సారసలోచనన్=తామరల వంటి కన్నులు గల సీతను, చూపకుండినన్=చూపకపోతే, కొట్టుదున్, ఇంద్రుని, పావకుని=అగ్నిహోత్రుని, గుండెలు వ్రత్తు=గుండెలు ముక్కలు చేస్తాను, కృతాంతున్=యముని, చెండుదున్=చంపెదను, దైత్యునిన్=రాక్షసుని (నిర్‌ృతిని), పట్టుదు=పట్టుకుంటాను, వరుణు మానము= వరుణుని గౌరవము, కొందును=తీసుకొంటాను (లాక్కుంటాను), గాలిన్=వాయువును, తూలగాన్=తూలి పడిపోవునట్లు, తట్టుదున్=చేతితో గట్టిగా కొట్టెదెను, కిన్నరేశ్వరుని=కుబేరుని, ప్రాణమును, అల్గుదు=హాని చేస్తాను, శూలిన్=శివుని, త్రోలుదున్= తఱిమివేస్తాను, రావణుని, చట్టలున్=భుజాలు, త్రుంతు=తెంపేస్తాను.

**తా :** సీతను చూపకపోతే, ఇంద్రుణ్ణి కొడతాను, అగ్నిగుండెలు ముక్కలు చేస్తాను, యముణ్ణి చంపేస్తాను, రాక్షసుణ్ణి పట్టుకుంటాను, వరుణుణ్ణి అవమానపరుస్తాను, గాలిని తూలగొడతాను, కిన్నరేశ్వరుని ప్రాణానికి హాని చేస్తాను, శివుణ్ణి తఱిమేస్తాను రావణుని భుజాలు తెంపేస్తాను.

**విశే :** కొట్టుదు, వ్రత్తు, పట్టుదు, చెండుదు, కొందును, తట్టుదు, అల్గుదు, త్రోలుదు, త్రుంతు – దేశీయపదాల ప్రయోగం మొల్లకు ప్రియము. తూర్పు, ఆగ్నేయం, దక్షిణం, నైరృతి, పడమర, వాయవ్యం, ఉత్తరం, ఈశాన్యం – ఇలా ఎనిమిది దిక్కులకు అధిపతులను పేర్కొంది. అనగా దిక్పాలురనందర్నీ ఎదిరిస్తానని భావం.

**క. ఈ మాడ్కిఁ జేయ దేవ**
**స్తోమమ్ములు చంద్ర వదనఁ జూపెద రొండెన్**
**ఏమిటికిఁ గీడు తగదని**
**రాముఁడు వల దనుచు మరలి రమ్మను నొండెన్. 37**

**ప్రతి :** ఈ మాడ్కిన్=ఈ విధముగా, చేయన్=చేయగా, దేవస్తోమమ్ములు= దేవతల సమూహము, చంద్రవదనన్=చంద్రముఖి సీతను, చూపెదరు, ఒండెన్= అలాకాక, ఏమిటికిన్=ఎందుకు, కీడుతగదని=అపకారం చెయ్యడం తగదు అని, రాముఁడు, వలదనుచు=వద్దు అంటూ, మరలి రమ్మనున్=వెనక్కిరండి అంటాడు, ఒండెన్=అది ఒక పక్షం.

**తా :** నేను ఇలా చేస్తే దేవతలు సీతను చూపిస్తారు అదిఒక పక్షం, శ్రీరాముడు అలా కీడు చెయ్యడం తగదు వెనక్కి వచ్చెయ్యమనడం ఒక పక్షం.

**వ. అని యనేక ప్రకారంబులు నాలోచించుచు నొక్క గోపురం బారోహించె నా సమయంబున. 38**

**తా :** అని అనేకవిధాల ఆలోచిస్తూ ఒకగోపురం ఎక్కాడు హనుమ. ఆ సమయంలో-

**క. పావని కనుగొనె నప్పుడు**
**పావన విఖ్యాత సుగుణ భావోపేతన్**
**సేవిత దనుజ వ్రాతన్**
**భూవనితాజాత, నిత్య పూతన్, సీతన్.** **39**

**ప్రతి :** అప్పుడు, పావని=హనుమంతుడు, పావన విఖ్యాత సుగుణ భావోపేతన్=పవిత్రమయిన ఖ్యాతి కలిగిన ఉత్తమ గుణములతో భావములతో కూడినట్టి, సేవిత దనుజ వ్రాతన్=రాక్షస సమూహముచేత సేవింపబడుతున్నట్టి, భూవనితా జాతన్=భూపుత్రిని, నిత్యపూతన్=ఎల్లప్పుడు పవిత్రురాలయిన, సీతన్= సీతను, కనుగొనెన్=చూచెను.

**తా :** అంత తీవ్రంగా ఆలోచిస్తున్న హనుమ, పావనవిఖ్యాతసుగుణ భావోపేతను, రాక్షస సమూహంచేత సేవింపబడుతున్న భూపుత్రిని, పవిత్రురాలైనసీతను చూసాడు.

**విశే :** భావోపేతన్, దనుజవ్రాతన్, నిత్యపూతన్, సీతన్ అనే అంత్యప్రాసలతో పద్యం అందంగా నడిచింది.

**వ. ఆ రామం జూచి, శ్రీరామచంద్రునిదేవిగాఁ దలంపుచు అగ్గోపురంబు నుండి డిగ్గి, సూక్ష్మ రూపంబుఁ గైకొని, శింశుపా వృక్షం బారోహించి యందు.** **40**

**ప్రతి :** ఆ రామన్=ఆ స్త్రీని, చూచి, శ్రీరామచంద్రుని దేవిగా, తలంపుచు, అగ్గోపురంబు నుండి డిగ్గి=గోపురం మీద నుండి దిగి, సూక్ష్మరూపంబున్=చిన్న రూపాన్ని, కైకొని=చేసుకొని, శింశుపావృక్షంబు, ఆరోహించి, అందు.

**తా :** ఆ స్త్రీని చూసి, శ్రీరాముని భార్యగా అనుకొని గోపురం దిగి, చిన్నరూపంతో శింశుపావృక్షం ఎక్కాడు. అక్కడ...

**సీ. పతిఁ బాసినట్టి యాపదలకంటెఁ బలుమాఱు**
**వివిధ మాయలచేత వేఁగి వేఁగి**
**వీర దానవ కోటి వికృత వేషంబులు**
**కనుగొని చిత్తంబు క్రాఁగి క్రాఁగి**
**తన దిక్కు లేమికైఁ దల్లడిల్లుచు నాత్మ**
**లోపల మిక్కిలి లోఁగి లోఁగి,**
**కర్ణ కఠోరంబుగా నాడు మాటలఁ**
**దొరఁగెడి కన్నీటఁ దోఁగి తోఁగి,**

**ఆ. రాముఁ దలఁచుకొంచు, రామునిఁ బేర్కొంచు**
**రామ!రామ! యనుచు రమణి పలుకఁ**
**గపివరుండు సూచి కామినీ రత్నంబు**
**సీత యనుచుఁ బొంగెఁ జిత్తమందు. 41**

**ప్రతి :** పతిన్=భర్తకు, పాసినట్టి=దూరమయినట్టి, ఆపదలకంటెన్, పలుమాఱు=అనేక పర్యాయాలు, వివిధ మాయలచేత=రాక్షసులు ప్రదర్శించే వివిధ మాయలచేత, వేఁగివేఁగి=పరితపించి, పరితపించి, వీరదానవకోటి= వీరులైనరాక్షస సమూహం యొక్క, వికృతవేషంబులు=వికృతమయిన వేషాలు, కనుగొని=చూచి, చిత్తంబు= మనస్సు, క్రాఁగిక్రాఁగి= తపించి, తపించి, తన దిక్కులేమికై=తనకు దిక్కులేకపోవడానికి, తల్లడిల్లుచు= భయపడుతూ, ఆత్మలోపల, మిక్కిలి=ఎక్కువగా, లోఁగిలోఁగి=క్రుంగిక్రుంగి, కర్ణకఠోరంబుగాన్=చెవులు భరించలేట్టుగా, ఆడుమాటలన్=మాట్లాడే మాటలవల్ల, తొరగెడి=కారుతున్న, కన్నీటన్, తోఁగితోఁగి=మునిగిమునిగి, రాము దలచుకొంచు=రాముడినే మనసులో తలచుకుంటూ, రామునిన్ పేర్కొంచు=రాముని స్తుతిస్తూ, రామ! రామ!, అనుచు, రమణిపలుకన్=ఆ స్త్రీపలుకగా, కపివరుండు=హనుమ, చూచి, కామినీరత్నంబు=కాంతామణి, సీత అంచు, చిత్తమందు=మనస్సులో, పొంగెన్=ఆనందించె.

**తా :** పతికి దూరంగా ఉన్నాననే బాధకంటే రాక్షసులు పదేపదే ప్రదర్శించే మాయలకు పరితపించి పరితపించి, రాక్షసవీరుల వికృతాకారాలు చూసి మనస్సు తపించి తపించి, తనకు దిక్కు లేకుండా పోయిందే అని భయపడుతూ మనసులో క్రుంగిపోతోంది. చెవులకు బాధాకరంగా ఉండే విధంగా రాక్షసులు మాట్లాడే మాటలవల్ల కన్నులవెంట నీరు కారిపోతోంది – ఆ కన్నీటిలో మునిగిపోతోంది. రాముణ్ణే తలచుకుంటోంది, రాముణ్ణి స్తుతిస్తోంది. రామరామ! అంటూ రామనామ జపం చేస్తోంది. అట్టి స్త్రీరత్నాని చూసి హనుమంతుడు ఈమె తప్పకుండా సీతే అని నిర్ధారించుకుని – ఆనందంతో ఉప్పొంగాడు.

**విశే :** సుందరకాండలో 'సీత'ను వర్ణించే సందర్భంల్లో మొల్ల సీసపద్యాలే వ్రాసింది. ఇది మొదటిసీసం. ఈ పద్యంలో వేఁగివేఁగి, క్రాఁగిక్రాఁగి, లోఁగిలోఁగి, తోఁగితోఁగి – అని అచ్చతెలుగు పదాలు ఆమ్రేడితంగా ప్రయోగించి – సీతాదేవి శోకంలోని తీవ్రతను గొప్పగా వ్యక్తీకరించింది.

**వ. అట్టి సమయంబున రావణాసురుండు సీతాపహృత హృదయుండై పన్నీట మజ్జనం బాడి, దివ్యాంబరంబులు గట్టుకొని, కర్పూర సమ్మిళితంబైన శ్రీగంధంబు నెఱ పూఁత పూసి, పారిజాత పుష్పంబులు ముడిచి, మవ్వంపుఁదావి నివ్వటిల్లెడు జవ్వాది మెత్తి, దశశిరంబులయందును రత్నమకుటంబులు ధరించి, మణిమండితంబులగు కుండలములు పూని, భాను ప్రభావిలసితంబులగు పతకంబులును, ముక్తాహారంబులును, భుజకీర్తులును, బాహుపురులును, నంగుళీయంబులును, నవరత్న స్థగితంబగు నొడ్డాణంబును నమరించి, చంద్రహాస హస్తుండై, కందర్ప విలాస సుందరుండగుచుఁ గిన్నరకింపురుష గంధర్వామరోరగ సిద్ధవిద్యాధరాంగన లుభయ పార్శ్వంబుల నాలవట్టంబులు పట్టి, మౌక్తిక ఛత్రంబులును, దాళవృంతంబులును, వింజామరంబులును ధరించి రాఁ గొందఱు కర దీపికా సహస్రంబులు గైకొని**

**ముందఱంబిఱుంద నేతేర, నశోకారామంబు నకుఁజనుదెంచె, నప్పుడు గంధవాతూలంబునం దూలు పుష్పలతయునుం బోలె వడవడ వడంకుచుఁ, దన సుందరాంగంబులు, హస్తోరు వస్త్ర కేశంబుల, మాటియుఁ, గప్పియు, నడంచియు, నిపురు గప్పిన నిప్పు చందంబున, ధూళి ధూసరంబగు రత్నంబు కైవడి, మేఘచ్ఛన్నంబగు చంద్ర బింబంబు దంబున, నిత్తడి పొదిగిన కుందనంపు శలాక లాగున, మాఱుపడియున్న జానకిని గదిసె.** **42**

**ప్రతి :** అట్టి సమయంబున=హనుమ ఈమె సీతే అని నిశ్చయించుకున్న సమయంలో, రావణాసురుండు, సీతాపహృతహృదయుండై=సీతచేత దొంగిలింపబడిన హృదయము కలవాడై, సీతయందే మనస్సు గలవాడై, పన్నీట మజ్జనంబాడి=పన్నీటితో స్నానంచేసి, దివ్యాంబరంబులు గట్టుకొని=మనోహరమైన వస్త్రాలు ధరించి, కర్పూరసమ్మిళితంబైన=కర్పూరముకలిపిన, శ్రీగంధంబు=చందనము, నెఱపూతపూసి=నిండుగాశరీరానికి పూసుకుని, పారిజాత పుష్పంబులు ముడిచి=పారిజాత పుష్పాలు తలలో ముడుచుకుని, మవ్వంపున్‌తావి= ఇంపైనసువాసన, నివ్వటిల్లెడు=ప్రసరించునట్టి, జవ్వాది=ఒక పరిమళద్రవ్యము, మెత్తి=ఎక్కువగా పూసుకుని, దశశిరంబులయందును రత్నమకుటంబులు ధరించి=పదితలలకు రత్నకిరీటాలుపెట్టుకుని, మణి మండితంబులగు కుండలంబులుపూని=మణులుతాపినకుండలాలు (చెవులకుపెట్టుకునేవి) పెట్టుకుని, భానుప్రభావిలసితంబులగు పతకంబులను=సూర్యకాంతిని ప్రసరించే పతకాలు, ముక్తాహారంబులు= ముత్యాల హారాలు, భుజకీర్తులు= భుజాలకు కొంచెంపైన పెట్టుకు నేవి,బాహుపురులు=బాహువులకుపెట్టుకునే ఆభరణ విశేషములు, అంగుళీయకంబులును=ఉంగరాలు, నవరత్నస్థగితంబగు ఒడ్డాణంబును= నవరత్నాలు పొదిగిన ఒడ్డాణము (నడుముకుపెట్టుకొనునది) అమరించి=అలంకరించుకుని, చంద్రహాస హస్తుండై=చేతితోకత్తిని పట్టుకొని, కందర్ప విలాస సుందరుఁడగుచు=మన్మథునివలె అందముగాతయారై, కిన్నెర, కింపురుష, గంధర్వ, అమర, ఉరగ=నాగులు, సిద్ధులు, విద్యాధరజాతి, అంగనలు=మహిళలు, ఉభయపార్శ్వంబులన్=రెండువైపుల, ఆలవట్టంబులు=వస్త్రముతో చేయబడిన గుండ్రని విసనకఱ్ఱలు, పట్టి=పట్టుకొని, మౌక్తిక ఛత్రంబులను=ముత్యాల గొడుగులు, తాళవృంతములు=తాటాకువిసన కఱ్ఱలు, వింజామరంబులును=చమరీమృగము వెంట్రుకలతో చేయబడిన విసనకఱ్ఱలు, ధరించిరాన్= పట్టుకునిరాగా, కొందఱు, కరదీపికాసహస్రంబులు=వేయికాగడాలు, కైకొని=పట్టుకొని, ముందఱ పిఱుంద నేతేరన్= ముందు వెనుక రాగా, అశోకారామంబునకున్=అశోకవనానికి, చనుదెంచె=వచ్చెను, అప్పుడు, గంధవాతూ లంబునన్=పరిమళ భరితమయిన సుడిగాలికి, తూలు=పడిపోవు, పుష్పలతయుంబోలె=పూలతీగెవలె, వడవడ వడంకుచు=శబ్దము చేయుచూ వణికిపోతూ, తన సుందరాంగంబులు=అందమయిన అవయవాలను, హస్త, ఉరు=పెద్దదైన, వస్త్ర, కేశంబుల, మాటియు=దాచి, కప్పియు=కప్పి, అడంచియు=అణచి ధూళి ధూసరంబగు రత్నంబుకైవడి=దుమ్ము కొట్టుకుపోయిన రత్నంవలె, మేఘచ్ఛన్నంబగు చంద్రబింబంబుదంబున= మబ్బుకప్పిన చంద్రకాంతివలె, ఇత్తడి పొదిగిన కుందనపు శలాకలాగున=ఇత్తడి పూతపూసిన బంగారు బొమ్మవలె, మాఱుపడియున్న=వేరుగా కనిపించుచున్న, జానకిన్, కదిసి=సమీపించి.

**తా :** హనుమ ఈమె సీతే అని నిశ్చయించుకున్నవేళ, సీతయందు మోహంగల రావణుడు, పన్నీటజలకమాడి, మంచిబట్టలు కట్టుకుని, కర్పూరం కలిపిన చందనం పూసుకుని, పారిజాతాలు తలలో ముడుచుకుని, మంచివాసన గల జవ్వాది మెత్తుకుని, పదితలలకు రత్నకిరీటాలు, చెవులకు మణికుండలాలు, సూర్యకాంతిగల పతకాలు, ముత్యాలదండలు, భుజకీర్తులు, భుజపురులు, ఉంగరాలు, నవరత్నపు ఒడ్డాణం, అలంకరించుకుని, కత్తి చేత్తోపట్టుకుని తనకు ఇరుపక్కల, కిన్నరకింపురుష గంధర్వ అమర, ఉరగ, సిద్ధ, విద్యాధరజాతి స్త్రీలు, ఆలవట్టాలు, తాళవృంతాలు, వింజామరలు పట్టుకునిరాగా, కొందఱు వెయ్యి కాగడాలతో ముందు వెనుకరాగా అశోకవనానికి వచ్చాడు. అప్పుడు సీతసుడిగాలికి వణికిపోయే లతలా, తన అవయవాలను - చేతులతో, పెద్ద వస్త్రంతో, కేశపాశంతో, దాచి, కప్పి, అణచిపెట్టింది. నివురుగప్పిన నిప్పులా, మట్టి కొట్టుకుపోయిన రత్నంలా, మబ్బులు కప్పిన చంద్రునిలా, ఇత్తడి పూతపూసిన బంగారు బొమ్మవలె, సీతా? కాదా? అన్నట్లు ఉన్న సీతను సమీపించి–

### రావణుఁడు మదనాతురుఁడై సీతను బ్రార్థించుట

**క.** **సీతను గనుగొని రావణుఁ**
**దాతత నయవాక్యఫణితి నతికుతుకమునన్**
**జేతోభవ నిశితాంబక**
**పాతంబులఁ జాల నొచ్చి పలుకఁగఁ జొచ్చెన్. 43**

**ప్రతి :** రావణుఁడు, సీతను, కనుగొని, ఆతత=విస్తృతమైన, నయవాక్యఫణితిన్=మృదువైన వాక్యవిధానములో, అతికుతుకమునన్=ఎక్కువ కుతూహలంతో, చేతోభవ=మనస్సులో పుట్టిన మన్మథుని, నిశితాంబక= వాడిబాణాలచే, పాతంబులన్=దెబ్బలచే, చాలనొచ్చి=ఎక్కువ బాధపడి, పలుకఁగన్=మాట్లాడ, చొచ్చెన్= ఆరంభించాడు.

**తా :** రావణుడు సీతను చూచి మన్మథుని వాడిబాణాల దెబ్బకు చాలా నొచ్చి ఎంతో కుతూహలంతో మృదువుగా మాట్లాడడం ఆరంభించాడు.

**లయగ్రాహి**

**తోయజ దళాక్షి! వలరాయఁడిటు లేచి పటు**
**సాయకము లేర్చి యిపు డేయఁగఁ దొడంగెన్,**
**దోయద పథంబున నమేయ రుచితోడ నుడు**
**రాయఁడును మంచి వడఁ గాయఁగఁ గడంగెన్,**
**గోయిలలుఁ గీరములుఁ గూయఁగ నళి వ్రజము**
**లే యెడలఁ జూచినను మ్రోయుచుఁ జెలంగెన్,**

**నా యెడఁ గృపారసముసేయక వివేకమున**
**నీ యెడల నుండు టిది న్యాయమె లతాంగీ! 44**

**ప్రతి :** తోయజదళాక్షి=తామరరేకులవంటి కన్నుల గలదానా!, వలరాయఁడు=మన్మథుడు, ఇట్లు ఏచి=కష్టపడి, పటుసాయకములు=వాడి బాణాలు, ఏర్చి=ఏరుకుని, ఇపుడు, ఏయంగన్=వేయుటకు, తొడంగెన్=ప్రారంభించాడు, తోయదపథంబునన్=ఆకాశమార్గంలో, అమేయ రుచితోడన్=ఎక్కువ కాంతితో, ఉడురాయఁడును=చంద్రుడు, మంచివడన్=మంచి ఎండను, కాయగన్=కాయుటకు, కడంగెన్=పూనుకొనెను, కోకిలలున్, కీరములున్=చిలుకలు, కూయఁగన్, అళివ్రజము=తుమ్మెదల గుంపు, ఏయెడన్, చూచినను, మ్రోయుచున్=ఝుంకారం చేస్తూ, కృపారసముసేయక=దయచూపక, నీ యెడల=నీపట్ల, వివేకమున నుండుట= వివేకంతో ప్రవర్తించడం, న్యాయమె, లతాంగీ!=లతవంటి శరీరము కలదానా!

**తా :** తోయజదళాక్షీ! మన్మథుడు నామీద పదునైన బాణాలు ఎంచుకుని మరీ వేస్తున్నాడు. ఆకాశంలో చంద్రుడు వేడిగా ఎండకాస్తున్నాడు. కోకిలలు, చిలుకలూ అదేపనిగా కూస్తున్నాయి, తుమ్మెదలు చెలరేగి రొద చేస్తున్నాయి. ఇవి నాపట్ల కొంచెం కూడా దయ చూపడంలేదు. నీపట్ల ఎంతో వివేకంతో ప్రవర్తిస్తున్నాయి. ఇది న్యాయమా లతాంగీ!

**విశే :** రావణుడు సీత విషయంలో మన్మథపీడితుడై ఉన్నాడు. అలాంటి స్థితిలో ఉన్నవారికి చంద్రుని వెన్నెల వేడిగా ఉంటుంది. మధురంగా కూస్తున్న కోకిల కూతలు, చిలుక పలుకులు, తుమ్మెదల గానం భరించలేరు. ఇది కవి సమయం. కాబట్టి రావణుడు అవి తనమీద దయచూపటం లేదంటున్నాడు. సీత రామ నామస్మరణలో ఉంది. ప్రకృతి ఆమె ఎడల వివేకంతో ప్రవర్తిస్తోంది. ఈ పద్యం 'లయగ్రాహి' లయగ్రాహి నడక మనోహరంగా ఉంటుంది. 'భజసనభజసన భయ' అనే గణాలు ఉంటాయి.

**వ. అని మఱియును. 45**

**తా :** అని ఇంకనూ -

**సీ. అలకేశ్వరుం డుపాయనముగా నిచ్చిన**
**యంచిత చీనిచీనాంబరములు**
**దివిజాధినాథుండు దిన దినంబును నిచ్చు**
**పారిజాతోల్లస త్ప్రసవములును**
**దక్షిణాధీశుండు తగఁ గాన్క లంపిన**
**సురభి కర్పూరాది పరిమళములుఁ**
**బాతాళముననుండి ఫణిసార్వభౌముండు**
**పుత్తెంచినటువంటి భూషణములుఁ**

తే. గలవు నా యింట నే ప్రొద్దుఁ గడమ లేక
దేహ పరితృప్తి గావించి మోహ మలరఁ
గామకేళీ సుఖంబులఁగలయు టొప్పు
విడువు మడియాస రామ భూవిభుని మీఁద. 46

**ప్రతి :** అలకేశ్వరుండు=అలకానగరాధిపతి కుబేరుడు, ఉపాయనముగాన్=బహుమానముగా, ఇచ్చిన, అంచిత=గొప్ప, చీనిచీనాంబరములు=పట్టుబట్టలు, దివిజాధినాథుండు=దేవతల ప్రభువు, దినదినంబును=ప్రతిరోజు, ఇచ్చు, పారిజాతోల్లసత్ ప్రసవములును=మనోహరమైన పారిజాతపుష్పాలు, దక్షిణాధీశుండు=యముడు, తగన్, కాన్కలంపిన=కానుకలుగా పంపిన, పరిమళములున్=సుగంధద్రవ్యాలు, పాతాళమున నుండి, ఫణి సార్వభౌముండు=నాగరాజు శేషుడు, పుత్తెంచినటువంటి=పంపినట్టి, భూషణములు=నగలు, కలవు, నాయింటన్, ఏ ప్రొద్దు=ప్రతిరోజూ, కడమలేక=కొరతలేక, దేహపరితృప్తి గావించి=దేహానికి తృప్తినిచ్చి, మోహమలర, కామకేళీ సుఖంబులన్=శృంగార క్రీడల, కలయుట, ఒప్పు=మంచిది, రామ భూవిభునిమీద=రాముని మీద, అడియాస=తీరని ఆశ, విడువుము=విడిచిపెట్టుము.

**తా :** సీతా! నా దగ్గర కుబేరుడు కానుకగా ఇచ్చిన చీనిచీనాంబరాలున్నాయి. ఇంద్రుడు రోజూ పంపే పారిజాత కుసుమాలున్నాయి. యముడు కానుకగా ఇచ్చిన సుగంధద్రవ్యాలు కర్పూరం, జాజికాయ వంటివి ఉన్నాయి. నాగరాజు పంపిన ఎన్నో ఆభరణాలు ఉన్నాయి. నా యింట్లో దేనికీ కొరతలేదు. వీటినన్నిటిని ఉపయోగించు, నాతో కామసుఖాలు అనుభవించు. రాముని మీద ఆస వట్టి అడియాస. దానిని వదిలిపెట్టు అని రావణుని మాటలు.

సీ. ఎవ్వాని వీటికి నేడు వారాసులు
పెట్టని కోటలై పెచ్చు పెరుఁగు,
నెవ్వాని సేవింతు రింద్రాది దేవత
లనుచర బలులయి యనుదినంబు
నెవ్వాని చెఱసాల నే ప్రొద్దు నుందురు
గంధర్వ సుర యక్ష గరుడ కాంత,
లెవ్వాని భండార మిరవొంద విలసిల్లు
నవ నిధానంబుల వివిధ భంగి,

తే. సకల లోకంబులును మహోత్సాహ వృత్తి
నెవ్వానికిఁ జెల్లుఁ బుష్పక మ్మెక్కి తిరుగ,
నాకె తక్కఁగఁ గలదె యే నాట నైన?
మద్భుజాశక్తి ప్రతిపోల్ప నద్భుతంబు. 47

**ప్రతి :** ఎవ్వానివీటికిన్=ఎవని పట్టణానికి, ఏడువారాసులు=ఏడుసముద్రాలు, పెట్టనికోటలై=సహజంగా ఏర్పడిన కోటలై, పెచ్చుపెరుగు=అతిశయించాయో, ఎవ్వాని=ఎవరిని, ఇంద్రాది దేవతలు=ఇంద్రుడు మొదలైన దేవతలు, అనుచర బలులయి=గొప్ప సేవకులై, అనుదినంబు=ప్రతిరోజు, సేవింతురు = సేవింతురో, ఎవ్వాని చెఱసాలన్=ఎవరి చెఱసాలలో, ఏ ప్రొద్దున్=ఎల్లప్పుడును, ఉందురో, గంధర్వ సుర యక్షగరుడ, కాంతలు= స్త్రీలు, ఎవ్వాని భండారము=ఎవరి ధనాగారము, నవనిధానంబుల=తొమ్మిది నిధులతో, వివిధ భంగి=అనేక విధాల, ఇరవొంద విలసిల్లు=చక్కగా ప్రకాశిస్తూ ఉంటుందో, సకల లోకంబులను=అన్నిలోకాలలో, మహోత్సాహ వృత్తిన్=గొప్ప ఉత్సాహంతో, పుష్పకమెక్కి=పుష్పక విమానం ఎక్కి విహరించుట, ఎవ్వానికిన్, చెల్లు=చెల్లుతుందో, నాకెతక్కంగన్=నాకు తప్ప, కలదె, ఏనాటనైన=ఏ దేశంలో అయినా, మద్భుజాశక్తి=నా భుజశక్తి, ప్రతిపోల్ప=పోల్చి చెప్పాలంటే, అద్భుతంబు.

**తా :** ఎవరి పట్టణానికి ఏడు సముద్రాలూ పెట్టని కోటగా ఉన్నాయో, ఇంద్రాది దేవతలు గొప్పసేవకులై ఎవరికి సేవలు చేస్తూ ఉంటారో, ఎవరి చెఱసాలలో నిత్యం గంధర్వ సుర యక్ష నాగస్త్రీలు ఉంటారో, ఎవని ధనాగారం నవనిధులతో విలసిల్లుతూ ఉంటుందో, ఆ రావణుణ్ణి నేను. ఎంతో ఉత్సాహంతో లోకాలన్నీ పుష్పకవిమానం ఎక్కి విహరించే భాగ్యం ఏ దేశంలోనయినా ఎవరికయినా ఉందా. నా భుజశక్తి ఎంతటిదని చెప్పేది. పోల్చిచెప్పలేరు. అది అద్భుతం.

**విశే :** ఈ సీసపద్యం – తిక్కన విరాటపర్వంలోని పద్యానికి అనుసరణ. ధర్మరాజు గొప్పతనాన్ని గురించి ద్రౌపది భీమునితో చెప్తుంది అక్కడ. ఇక్కడ రావణుడే తన గొప్ప చెప్పుకున్నాడు. తిక్కనకు పేరు తెచ్చిన పద్యాల్లో ఇది ఒకటి.

**సీ. ఎవ్వని వాకిట నిభమదపంకంబు**
**రాజభూషణరజోరాజి నడఁగు**
**ఎవ్వని చారిత్ర మెల్లలోకములకు**
**నొజ్జయై వినయంబు నొఱపుగఱపు**
**ఎవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి**
**మానిత సంపదలీనుచుండు**
**ఎవ్వని గుణలత లేడువారాసుల**
**కడపటి కొండపైఁగలయ బ్రాఁకు.**

**తే. నతఁడు భూరి ప్రతాపమహాప్రదీప,**
**దూరవిఘటిత గర్వాంధకారవైరి**
**వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి**
**తలుదు కేవలమర్త్యుడే ధర్మసుతుఁడు** **విరాట–ద్వితీయ–191**

తిక్కన పద్య రచనా రీతిని అందంగా అనుసరించింది మొల్ల.

**సీ. శ్వసనుండు లోగిలి సమ్మార్జనముఁ జేయ**
**నబ్ధినాథుఁడు కలయంపి సల్లఁ,**
**బావకుం దరుదెంచి పాకంబు లొనరింప**
**శమనుండు వెసఁ బరిచర్యఁ జేయఁ,**
**బాకారి కల్పక ప్రకరంబు లర్పింప**
**దనుజేశ్వరుండు కైదండ యిడఁగ,**
**నర వాహనుండు తా నగరి వెచ్చము వెట్ట**
**నీశానుఁడు విభూతి నెలమి నీయ,**

**తే. గురుఁడు పంచాంగ మెప్పుడు సరవిఁ జెప్ప**
**నమర కిన్నర గంధర్వ యక్ష భుజగ**
**సిద్ధ కింపురుషాంగనల్ఁ చేరి కొలువ**
**వైభవంబునఁ జెలు వొందువాఁడఁ దరుణి!. 48**

**ప్రతి :** శ్వసనుండు=వాయువు, లోగిలి=ఇల్లు, సమ్మార్జనమున్=చీపురుతో ఊడవడం, చేయన్=చేయగా, అబ్ధినాథుఁడు=సముద్రుడు, కలయంపిసల్లన్= పేడకలిపిన నీళ్లను చల్లగా, పావకుందరుదెంచి=అగ్నిదేవుడు వచ్చి, పాకంబులు=వంటలు, ఒనరింప=చేయగా, శమనుండు=యముడు, వెసన్=వేగముగ, పరిచర్య చేయన్=ఉపచారాలు చేయగా, పాకారి=పాకుడు అనే రాక్షసుని సంహరించినవాడు –ఇంద్రుడు, కల్పక ప్రకరంబులు=కల్పవృక్షాల నుండి పూలను, అర్పింప=ఇవ్వగా, దనుజేశ్వరుండు బలిచక్రవర్తి, కైదండయిడఁగ=చేయూత ఇవ్వగా, నరవాహనుండు=నరుడు వాహనముగా గలవాడు కుబేరుడు, తానగరివెచ్చము= పట్టణానికి కావలసిన వెచ్చాలన్నీ, పెట్ట=కొనిపెట్టగా, ఈశానుఁడు=శివుడు, విభూతిన్=సంపదను ఎలమిన్=ప్రకాశించునట్లు ఈయగా, గురుఁడు=బృహస్పతి, పంచాంగమెప్పుడు= తిథివార నక్షత్రాదులు, సరవిన్=వరసగా, చెప్ప, అమర=దేవ, కిన్నర, గంధర్వ, యక్ష, భుజగ=నాగ, సిద్ధ, కింపురుష, అంగనల్ చేరి కొలువ=స్త్రీలు శ్రద్ధతో కొలువగా, వైభవంబునన్=ఐశ్వర్యంతో, చెలువొందువాడన్= శోభించువాడను, తరుణి!=స్త్రీ!

**తా :** తరుణీ! సీతా! నా వైభవం ఎంత శోభాయమానమైనదో చెప్తున్నాను. వాయుదేవుడు మా ఇల్లూ, వాకిలి ఊడుస్తాడు. సముద్రుడు కలాపి జల్లుతాడు. అగ్నిదేవుడు వచ్చి వంటలు చేస్తాడు. యముడు సేవ చేస్తాడు. ఇంద్రుడు కల్పవృక్షసుమాలు అర్పిస్తాడు. రాక్షసరాజైన బలిచక్రవర్తి చేయూత ఇస్తాడు. కుబేరుడు పట్టణానికి కావలసిన వెచ్చాలన్నీ సమకూర్చుతాడు. ఈశ్వరుడు సంపదలిస్తాడు. గురుడు రోజూ పంచాంగం వివరాలు వరుసగా చెప్తాడు. దేవ, కిన్నెర, గంధర్వ యక్ష భుజగ సిద్ధ కింపురుషాంగనలు చేరి సేవలు చేస్తారు. ఇంతటి వైభవంతో శోభిస్తున్నవాణ్ణి నేను.

**విశే :** సర్వలోకాలవారు రావణుణ్ణి ఇన్నివిధాల కొలుస్తున్నారు అని చెప్పడంలో మొల్ల చిన్నచమత్కారం చేసింది. ఏయే పనులు ఎవరు సమర్థంగా చెయ్యగలరో ఆయాపనులు వారిచేత చేయించింది. ఊడవడం వాయువు పని. గట్టిగా గాలి వీస్తే తుక్కు తుడిచినట్లవుతుంది. కల్లాపికి నీళ్ళు కావాలి. లంకంత విశాలమైన నగరానికి ఎన్నో నీళ్లు అవసరమవుతాయి. అందుకే సముద్రుడు ఆపని చేస్తున్నాడు. వంట చెయ్యాలి అంటే మంట కావాలి. అగ్ని స్వయంగా వచ్చి వంటపని కానిస్తున్నాడు. యము దంతటి వాడయినా సరే రావణునికి సేవ చెయ్యల్సిందే. అందుకే ఆ పని అందుకున్నాడు. ఇంద్రుడు కల్పవృక్షపు పూలు తెచ్చాడు. నందనవనం ఇంద్రలోకంలో ఉంది కదా అందుకు. బలిచక్రవర్తి రాక్షసరాజు చేయూత ఇస్తున్నాడు. రాక్షసజాతి కదా! బంధువు. అందువల్ల సాన్నిహిత్యంతో చేయూత ఇస్తున్నాడు, కుబేరుడు వెచ్చాలన్నీ ఇవ్వగలుగుతున్నాడు ధనాధిపతి గనుక, శివుడు విభూతి ఇస్తున్నాడు. విభూతిరాయడు శివుడు. గురుడు వరుసగా పంచాంగంలో విషయాలన్నీ చెప్తున్నాడు. గురుడు అంటే బృహస్పతి అనే అర్థంతోపాటు గురువు అనే అర్థం కూడా గ్రహించవచ్చు. ఇలా మొల్ల ఈ వర్ణనలో పనులు చేయించడంలో ఔచిత్యం పాటించింది.

**ఉ. ఎత్తితి శంకరాచల మహీన బలంబున బంతిలాగునన్**
**మొత్తితి సర్వ దిక్పతుల మూఁగిన గర్వము విచ్చిపాఱఁగా**
**నొత్తితి శత్రుభూపతుల నుగ్ర రణంబున భూమిఁ ద్రెళ్ళఁగా**
**మొత్తితి భోగి కంఠము లమోఘ జవంబున మేటి కీర్తులన్. 49**

**ప్రతి :** మేటి=గొప్ప, కీర్తులన్=కీర్తులతో, శంకరాచలము=కైలాసపర్వతము,అహీనబలంబునన్=అధికమైన బలంతో, బంతిలాగునన్=బంతివలె, ఎత్తితి, సర్వదిక్పతుల=దిక్పాలకులందరి, మూఁగిన=అతిశ యించిన, గర్వము, విచ్చిపాఱఁగా=ముక్కలై చెల్లాచెదరుకాగా, మొత్తితి=కొట్టాను, శత్రుభూపతులన్=శత్రురాజులను, రణంబున=యుద్ధంలో, భూమిన్, త్రెళ్లగా=చనిపోవునట్లు, ఒత్తితి=అణచితిని, భోగికంఠములన్= నాగులకంఠాలు, అమోఘజవంబున=సఫలమగుబలంబుతో, మొత్తితి=కొట్టితిని.

**తా :** మేటి కీర్తులు గలవాడనైన నేను – కైలాసపర్వతం బంతిలా ఎత్తాను, దిక్పతుల గర్వం విచ్చిపోయేలా మొత్తాను, శత్రురాజుల్ని యుద్ధంలో మరణించే విధంగా ఒత్తాను. నాగులకంఠాలు అమోఘమయిన బలంతో మొత్తాను.

**విశే :** ఈ పద్యం క్రియాపదాలతో ఆరంభించి వ్రాసినది. ఎత్తితి, మొత్తితి, ఒత్తితి, మొత్తితి, అనేవి క్రియాపదాలు.

**తే. జడలు ధరించి తపసుల చందమునను**
**దమ్ముఁడును దాను ఘోర దుర్గమ్ములందుఁ**
**గూరగాయలు కూడుగాఁ గుడుచునట్టి**
**రాముఁ డేరీతి లంకకు రాఁగలండు? 50**

**ప్రతి :** జడలు ధరియించి=జుట్టును మఱ్ఱిపాలు పూసుకుని జడలుజడలుగా చేసుకుని, తపసుల చందమునను= తాపసులవలె, తమ్ముఁడును, తాను, ఘోర=భయంకరమైన, దుర్గమ్ములందు=అరణ్యాల్లో పర్వత ప్రదేశాల్లో కష్టంగా ఉండే త్రోవలో, కూరగాయలు, కూడుగాన్=భోజనముగా, కుడుచున్=తినుచున్న, అట్టి=అటువంటి, రాముఁడు, ఏ రీతి=ఏవిధముగా, లంకకు=ఈ లంకకు, రాఁగలండు?=రాగలడు? రాలేడు.

**తా :** జడలు కట్టించుకుని తాపసులవలె తమ్ముడు తాను ఈ ఘోరదుర్గాల్లో తిరుగుతూ, కూరగాయలే కూడుగా భుజిస్తున్నట్టి రాముడు ఏవిధంగా లంకకు రాగలడు? రాలేడు.

**ఆ. ఇంకఁజేయ నేర, రీఁదంగ నోపరు**
**కట్టలేరు, చుట్టి పట్ట లేరు,**
**జలధి దాఁట లావు చాలదు నరులకు,**
**వచ్చు త్రోవ చెపుమ వారిజాక్షి? 51**

**ప్రతి :** ఇంకన్=ఇంకిపోవునట్లు, చేయన్ నేరరు=చేయ్యలేరు, ఈఁదంగనోపరు=ఈది వచ్చే శక్తిలేదు, కట్టలేరు=సముద్రము మీద కట్టలేరు, జలధిదాట=సముద్రం దాటే, లావు=బలము, చాలదు=సరిపోదు, నరులకు=మానవులకు, చుట్టిపట్టలేరు=చుట్టు తిరిగి పట్టుకోలేరు, వచ్చుత్రోవ=లంకకు వచ్చే మార్గం, చెపుమ=చెప్పు, వారిజాక్షి=తామరపూలవంటి కన్నులు గలదానా! ఓ సీతా!

**తా :** రాముడు లంకకు రావాలంటే సముద్రం దాటిరావాలి. మఱి సముద్రాన్ని నీళ్లు లేకుండా ఇంకి పోయేలా చేయలేరు, ఈదలేరు, వంతెన కట్టలేరు, చుట్టి రాలేరు, సముద్రం దాటడానికి మానవులకున్న బలం సరిపోదు. సీతా! మరి రాముడు వచ్చే మార్గమేదో చెప్పు.

**క. దానవు లెప్పుడు చూచిన**
**మానవులను గెలువఁగలరు, మది నూహింపన్**
**మానవ భక్షకులై మను**
**దానవులను గెలువ నరుల తరమే జగతిన్? 52**

**ప్రతి :** ఎప్పుడు చూచిన=ఏ సందర్భంలో చూసినా, దానవులు=రాక్షసులు, మానవులను, గెలువగలరు, మదిన్=మనస్సులో, ఊహింపన్=ఊహించగా, మానవభక్షకులై=నరమాంసభక్షుకులై, మను=జీవించునట్టి, దానవులను=రాక్షసులను, గెలువ, నరుల తరమే=నరులకు శక్యమా? జగతిన్=ఈ జగత్తులో.

**తా :** ఈ జగత్తులో ఎప్పుడయినా రాక్షసులు మానవుల్ని గెలవగలరు. ఆలోచించి చూస్తే నరమాంసం తినే రాక్షసుల్ని గెలవడం నరులకు సాధ్యామా?

**క. జగతీశుఁడు మానవుఁడఁట!**
**నగరే భుజ శక్తిచేత నా కెదు రన్నన్?**

**నగ ధరుఁడో, నగ ధన్వుఁడొ,**
**నగ భేదియొ, కొంత కొంత నాతోఁ బోరన్? 53**

**ప్రతి :** జగతీశుఁడు=భూభర్త అయిన రాముడు, మానవుఁడట!=మానవుడట, భుజశక్తిచేత=భుజబలంచేత, నాకు, ఎదురన్నన్=ఎదురుపడగలడు అంటే, నగరే నవ్వరా?, నగధరుఁడో=కొండను ధరించినవాడో, విష్ణువో, నగధన్వుఁడో=కొండవిల్లుగా గలవాడు శివుడో, నగభేదియొ=కొండలను భేదించిన ఇంద్రుడో, కొంతకొంత=కొంతలో కొంత, నాతోన్=నాతో, పోరన్=యుద్ధం చేయడానికి.

**తా :** రాజు అయిన రాముడు మానవుడు. ఒక నరుడు నాతో యుద్ధం చేసే బలం కలవాడు అంటే నవ్వరా. నగధరుడో, నగధన్వుడో, నగ భేదియో అయితే నాతో యుద్ధం చెయ్యగలరు.

**విశే :** నగధరుడు=క్షీరసాగర మథనం జరిగినప్పుడు విష్ణువు కూర్మావతారం ఎత్తి మందర పర్వతాన్ని మోశాడు. నగధన్వుడు=త్రిపురాసుర సంహారం చేసినప్పుడు శివుడు మేరు పర్వతాన్ని విల్లుగా చేసుకున్నాడు. నగభేది=పర్వతాల రెక్కలు ఖండించినవాడు ఇంద్రుడు. ఆయా దేవతాపురుషులకు నగము (పర్వతం)తోగల సంబంధాన్ని చమత్కరించిన రచన ఇది.

**వ. ఆ సంగతి యట్లుండనిమ్ము. 54**

**తా :** ఆ విషయం అలా ఉండనిమ్ము.

**క. నీ కన్నుల సౌభాగ్యము**
**నీ కుచములఁ గలుగు మేలు, నీ ముఖ కాంతుల్**
**నీ కరముల లావణ్యము**
**నాకస్త్రీలందు లేవు నాకుం జూడన్. 55**

**ప్రతి :** నీ కన్నుల, సౌభాగ్యము=సౌందర్యము, నీ కుచములన్ కలుగుమేలు=నీ చన్నులలో గల గొప్పదనము, నీ ముఖకాంతుల్=నీ ముఖములో గల ప్రకాశము, నీకరముల=నీ చేతులకుగల, లావణ్యము=నిగారింపు, నాకుంజూడన్=నాకు చూడగా, నాకస్త్రీలందు=దేవతాకాంతలలో, లేవు=లేవు.

**తా :** నీ కన్నుల అందం, నీ వక్షస్థల వైభవం, నీ ముఖకాంతి, నీ చేతులకున్న నిగారింపు చూడబోతే దేవతాకాంతల్లో లేవు. (రావణుడు సకల లోకాల స్త్రీల సౌందర్య తెలిసినవాడు).

**మ. సురకాంతల్ సరి రారు! యక్ష సతులున్ సూటింపఁగా రారు, కి**
**న్నర భామల్ ప్రతి రారు, సిద్ధ వనితల్ న్యాయంబుగాఁ బోల, రా**
**గరుడాబ్జాక్షులు సాటిరారు, తలఁపన్ గంధర్వ లోలాక్షులున్,**
**మఱి యేరీ నినుఁ జెప్పి చెప్పఁ దరుణుల్ మత్తేభ కుంభస్తనీ! 56**

**ప్రతి :** సురకాంతల్=దేవతాస్త్రీలు, సరిరారు=నీతో సరికాలేరు, యక్షసతులున్=యక్షకాంతలుకూడా, సూటింపగారారు=నీతో సరిరారు, కిన్నెరభామల్ ప్రతిరారు=కిన్నెర స్త్రీలు నీకు పోలినవారు కారు, సిద్ధవనితల్, న్యాయంబుగాన్=న్యాయానికి, పోలరు=పోల్చడానికి తగరు, ఆ, గరుడాబ్జాక్షులు=గరుడ+అబ్జాక్షులు=తామరల వంటి కన్నులు గల గరుడ స్త్రీలు, సాటిరారు, తలపన్=ఆలోచించగా, గంధర్వ లోలాక్షులున్=చలించేకన్నులు గల గంధర్వ స్త్రీలు కూడ, మత్తేభ కుంభస్తనీ=మదపుటేనుగు కుంభస్థలము వంటి కుచములుగల సీతా! మఱి, నినున్, చెప్పిచెప్పన్=చెప్పిన తరువాత చెప్పడానికి, తరుణుల్=యౌవనవతులైన స్త్రీలు, ఏరీ.

**తా :** మత్తేభ కుంభస్తనీ! నీకు దేవతాస్త్రీలు గాని, యక్షకాంతలు గాని, కిన్నెర భామలు గాని, సిద్ధవనితలు గాని, గరుడాంగనలు గాని, గంధర్వవనితలు కానీ సాటిరారు. ఇక మఱి ఎవరని చెప్పేది. నిన్ను చెప్పాక ఈ సమస్తలోకాల్లో చెప్పదగిన రమణులు లేరు.

**క. వ్రీడ యలంకారముగా**
**నాడుము భయ ముడిగి మధురమైన మృదూక్తుల్,**
**బేడిసల నేలు కన్నులఁ**
**జూడుము కనుఱెప్ప లెత్తి సుదతీ! నన్నున్. 57**

**ప్రతి :** వ్రీడ=సిగ్గు, అలంకారముగాన్=సింగారముగా, భయము, ఉడిగి=లేకుండా, మధురమైన=తియ్యని, మృదూక్తుల్=లలితమయిన మాటలను, ఆడుము=మాట్లాడుము, బేడిసలన్= బేడిసలు అనే చేపలను, ఏలు=పాలించు, కన్నులన్=కన్నులతో, కనుఱెప్పలెత్తి=కనురెప్పలు ఎత్తి, నన్నున్=నన్ను, చూడుము, సుదతీ=మంచి పలువరసగలదానా!

**తా :** సుదతీ! భయపడకుండా సిగ్గే సింగారంగా కలిగి మధురంగా లలితంగా నాతో మాట్లాడు. బేడిసచేపలను మించిన అందం గల నీ కన్నులెత్తి నన్ను చూడు.

**విశే :** కన్నులను చేపలతో పోల్చడం కవి సమయము. మీనాక్షి, మీననేత్ర ప్రసిద్ధమైనవి. అయితే తెలుగు కవులు కన్నులను బేడిస చేపలతో ప్రత్యేకంగా పోలుస్తారు.

**వ. అని యిట్లు నోరికి వచ్చిన మచ్చునఁ బ్రేలుచున్న యా నీచుని దుష్ట భాషణంబులకు రోసి తృణంబు చేపట్టి జనక భూపాల నందన యిట్లనియె. 58**

**ప్రతి :** అని, ఇట్లు, నోరికివచ్చినమచ్చునన్=నోటికివచ్చిన విధముగా, ప్రేలుచున్న=వాగుతున్న, ఆ, నీచుని, దుష్ట భాషణంబులకు=చెడుమాటలకు, రోసి=అసహ్యపడి, తృణంబు=గడ్డిపరక, చేపట్టి=చేతితో పట్టుకుని, జనక భూపాలనందన=సీత, ఇట్లనియె.

**తా :** రావణుడు నోటికి వచ్చినట్లు వాగుతున్న ఆచెడుమాటలను అసహ్యించుకొని గడ్డిపరక చేత్తోపట్టుకుని సీత ఈ విధంగా అన్నది.

## సీత రావణుని దెగడి శ్రీరాముని బొగడుట

క. పతి దైవముగా నెప్పుడు
మతిఁ దలఁచుచు నుండునట్టి మగువలఁ జెఱుపన్
బ్రతిన గలయట్టి నీతోఁ
బ్రతివచనము లాడుకంటెఁ బాపము గలదే? **59**

**ప్రతి :** పతి దైవముగాన్=భర్తనే భగవంతునిగా, ఎప్పుడు=ఎల్లప్పుడు, మతిన్+తలచుచునుండునట్టి=మనస్సులో తలుచుకుంటూ ఉండే, మగువలన్=స్త్రీలను. చెఱుపన్=పాడు చేయాలి అనే, ప్రతినగలయట్టి నీతోన్=ప్రతిజ్ఞగల నీతో, ప్రతివచనములు=సమాధాన వచనాలు, ఆడుకంటెన్=మాట్లాడడం కంటే, పాపము గలదే=వేరేపాపం ఏముంది?

**తా :** భర్తనే భగవంతునిగా భావించి జీవిస్తున్న వారిని పాడుచెయ్యడమే పనిగా పెట్టుకున్న నీలాంటి వాళ్లకు సమాధానం చెప్పడం కంటే వేరే పాపం ఏముంది.

క. పర దారాపేక్షకులగు
పురుషుల కాయువు నశించుఁ బుణ్యము సెడు, స
త్పురుషుల దూషింపఁగఁ దుది
నరకంబునఁ బడుదు రనెడి న్యాయము వినవే? **60**

**ప్రతి :** పర దారాపేక్షకులగు=ఇతరుల భార్యలను కోరుకునే, పురుషులకు, ఆయువు నశించున్=ఆయుష్షు నశించిపోతుంది, పుణ్యము, చెడు=చెడిపోతుంది, సత్పురుషులన్=ఉత్తములను, దూషింపగన్=నిందించుట వలన, తుదిన్=చివరకు, నరకంబున, పడుదురు, అనెడి, న్యాయము=ధర్మము, వినవే?

**తా :** ఇతరుల భార్యలను ఆశించే పురుషులకు ఆయుష్షు నశించిపోతుంది, పుణ్యము చెడిపోతుంది. ఉత్తములను దూషించడం వలన చివరకు నరకంలో పడతారు అనే లోకవ్యవహారం వినలేదా?

వ. అదియునుం గాక, -
అదీ కాక. **61**

క. తన సాహసంబు తానే
కొనియాడు నతండు హీన గుణుఁ డని వినుచున్
నిను నీవ పొగడుకొంటివి
వినఁగూడదు నీదు నీతివిరహిత భాషల్. **62**

**ప్రతి :** తన సాహసంబు=తన సాహసము, తానే, కొనియాడున్=పొగుడుకునే, అతండు, హీనగుణుఁడు=నీచగుణములు కలవాడు, అని వినుచున్=వింటూ, నిను, నీవ=నీవే, పొగడుకొంటివి, నీదు=నీయొక్క, నీతి విరహిత భాషల్=నీతిలేని మాటలు వినగూడదు.

**తా :** తాను చేసిన సాహసం గురించి తానే పొగడుకునే వాణ్ణి నీచుడు అంటారని తెలిసి కూడా, నిన్ను నువ్వు పొగడుకున్నావు. నీతిలేని మాటలు వినకూడదు.

**ఉ. సంగర రంగమందు నతి శౌర్యమునన్ రఘురాముతోడ మా**
**తంగ తురంగ సద్భట శతాంగ బలంబులఁ గూడి నీవు పో**
**రంగను నోప, కిప్పుడు విరాధ ఖరాదుల పాటుఁ జూచియున్**
**దొంగిలి నన్నుఁ దెచ్చితివి, తుచ్ఛపుఁ బల్కులు పల్కఁ బాడియే. 63**

**ప్రతి :** సంగర రంగమందున్=యుద్ధరంగములో, అతిశౌర్యమునన్=మిక్కిలి పరాక్రమంతో, రఘురాముతోడన్=రామునితో, మాతంగ=ఏనుగుల, తురంగ=గుఱ్ఱాల, సద్భట=మంచిభటుల, శతాంగ=రథాల, బలములన్, కూడి, నీవు పోరంగనున్=యుద్ధము చేయుటకు, ఓపక=శక్తిలేక, ఇప్పుడు, విరాధుడు, ఖరాదుల=ఖరుడు మొదలైన, పాటున్=అవస్థను, చూచియున్=చూచికూడా, దొంగిలి= అపహరించి, నన్ను, తెచ్చితివి, తుచ్ఛపు పల్కులు=నీచమైన పల్కులు, పల్కన్=పలుకుట, పాడియే= మర్యాదయా?

**తా :** యుద్ధరంగంలో రాముడితో తలపడి నీ పరాక్రమమం చూపి నీ చతురంగ బలంతో యుద్ధం చేసే శక్తి లేదు నీకు. విరాధుడు ఖరుడు పొందిన అవస్థ చూసి కూడా, నన్ను దొంగిలించి తెచ్చావు. ఇప్పుడు ఈ నీచమైన మాటలు మాట్లాడడం నీకు మర్యాదేనా?

**సీ. కూఁకటి ముడికినై కురులు గూడని నాఁడె**
**బెదరక తాటకఁ బీఁచ మణచెఁ**
**గాధేయుఁ డొనరించు క్రతు రక్షణము సేయఁ**
**బెక్కండ్రు దైత్యుల నుక్కణంచె**
**నవనిపై విలసిల్లు నఖిల రాజన్యులు**
**వ్రేలఁ జూపఁగఁ లేని విల్లు విఱిచె,**
**ఘోరాటవులలోనఁ గ్రుమ్మరు నప్పుడు**
**ఖర దూషణాది రాక్షసులఁ జంపెఁ,**

**తే. బాద రజమున నొక ఱాయిఁ బడఁతిఁ జేసె**
**లీల మాయా మృగంబును గూలనేసె,**
**రాజమాత్రుండె మేదినీ రక్షకుండు**
**రామ భూపాలుఁ డాదినారాయణుండు. 64**

**ప్రతి :** కూఁకటిముడికినై=చిన్నముడికి, కురులు=జుట్టు, కూడని=సరిపడని, నాఁడె=వయస్సులోనే, బెదరక, తాటకన్, పీఁచమణచె=చంపాడు, గాధేయుడు=గాధి కొడుకు విశ్వామిత్రుడు, ఒనరించు=చేయు, క్రతురక్షణముసేయ=యజ్ఞము రక్షించడానికి, పెక్కండ్రు=చాలామంది, దైత్యులన్=రాక్షసులను, ఉక్కు=పొగరు,

అణంచె=లొంగదీశాడు, అవనిపై=భూమిమీద, విలసిల్లు=ప్రకాశించు, అఖిల రాజన్యులు=అందరు రాజులు, వ్రేలన్=వ్రేలితో, చూపఁగలేని=చూపించలేని, విల్లువిఱిచె=విల్లువిఱిచాడు, ఘోరాటవులన్=భయంకరమైన అడవులలో, క్రుమ్మరున్=సంచరించు, అప్పుడు, ఖరదూషణాది=ఖరుడు, దూషణడు మొదలైన, రాక్షసులన్, చంపెన్, పాదరజమునన్=పాదధూళితో, ఒక, ఱాయిన్=రాతిని, పడఁతిన్=స్త్రీగా, చేసె, లీల=ఆటగా, మాయామృగంబును=మాయాలేడిని, కూలన్, ఏసె, రాజమాత్రుండె=రాజుమాత్రమేనా, మేదినీరక్షకుండు=భూనాయకుడయిన, రామభూపాలుడు, ఆదినారాయణుండు=సాక్షాత్తూ ఆ నారాయణుడే.

**తా :** కూకటి ముడి వెయ్యడానికి కూడా జట్టు పెరగని బాల ప్రాయంలోనే తాటకని సంహరించాడు, విశ్వామిత్రుని యాగ సంరక్షణ సందర్భంలో ఎందరో రాక్షసుల పొగరు అణిచాడు. భూమి మీద రాజులు తమ వ్రేలితో చూపించడానికి జంకే విల్లును విరిచాడు. భయంకరమైన అడవుల్లో సంచరిస్తూ ఖరుడు, దూషణుడు మొదలైన రాక్షసుల్ని చంపాడు. తన పాదధూళితో ఒక రాతిని నాతిగా చేసాడు. మాయలేడిని ఆట ఆడినట్లుగా కూలనేసాడు. ఈ భూరక్షకుడయిన శ్రీరాముడు రాజు మాత్రమే కాదు. రామభూపాలుడు సాక్షాత్తు ఆదినారాయణుడు.

**విశే :** ఈ పద్యంలో సీతతో పాటుగా మొల్ల కూడా రామ భూపాలుడు ఆదినారాయణుడు అని మనసారా నమ్మి నమస్కరించింది.

**తే.** **అట్టి రామున కీయది యనఁగ నెంత?**
**లంక యన నెంత? దనుజుల పొంక మెంత?**
**నీ వనఁగ నెంత? నీ లావు చేవ యెంత?**
**చెప్ప నేటికి నీవె చూచెదవు గాక!** **65**

**ప్రతి :** అట్టిరామునకు, ఈయది=ఈపని, అనగన్, ఎంత, లంకయన నెంత?=లంక అంటే ఎంత?, దనుజుల=రాక్షసుల, పొంకమెంత?=గర్వం ఏపాటి, నీవు, అనఁగ, ఎంత, నీలావు=నీబలము, చేవ=శక్తి, ఎంత, చెప్పన్, ఏటికి=ఎందుకు, నీవె, చూచెదవు గాక!

**తా :** చిన్నతనం నుండి ఎన్నెన్నో ఘనకార్యాలు చేస్తూ ఉన్న రామునికి ఈ పని ఏమంత పెద్దది? లంక ఎంత?, రాక్షసుల గర్వం ఏపాటి, నీవేపాటి, నీ బలం శక్తి ఎంత? నేను చెప్పడమెందుకు. నువ్వే చూచెదవుగాక! అని సీత సమాధానం చెప్పింది.

**విశే :** సీతాదేవికి రాముని పరాక్రమము పట్ల ఎంతటి విశ్వాసమో ఆమె సమాధానంలో ధీరగా, స్పష్టంగా వివరించింది. చిన్న చిన్న తెలుగు పదాలతో పెద్ద భావాన్ని పొదిగింది మొల్ల. ప్రశ్నిస్తున్న తీరు, పద్యంలో నుడికారపు అందాన్ని అందిస్తోంది. నీ వనగ నెంత? నీ లావు చేవ ఎంత? అనడం సీతలోని ధైర్యాన్ని చెప్పక చెప్తోంది.

ఈ చిన్నతేటగీతిలో – సింహగర్జన వినిపించింది సీత. ఈ పద్యంలో దనుజులు అనే పదం తప్ప–అన్నీ అసలైన తెలుగు పదాలే. తెలుగు భాషకున్న చేవ చూపింది మొల్ల.

**శా. వీరాలాపము లాడ నేల వినుమీ, విశ్వ ప్రకాశంబుగాఁ**
**బారావారముఁ గట్టి, రాఘవుఁడు కోప స్ఫూర్తి దీపింపఁగా**
**ఘోరాజిన్ నిను డాసి, లావు కలిమిన్ గోటీర యుక్తంబుగా,**
**గ్రూరాస్త్రంబుల మస్తకముల్ దునిమి, భుక్తుల్ బెట్టు భూతాళికిన్. 66**

**ప్రతి :** వీరాలాపములు=బీరాలు, ఆడనేల=మాట్లాడడమెందుకు, వినుమీ, విశ్వప్రకాంబుగాన్=ప్రపంచాని కంతా తెలిసే విధంగా, పారావారమున్=సముద్రమును, కట్టి=బంధించి (ఆనకట్ట కట్టి), రాఘవుడు, కోపస్ఫూర్తి దీపింపగా=కోపతీవ్రత ప్రకాశించే రీతిలో, ఘోరాజిన్=భయంకరమైన యుద్ధంలో, నిను, డాసి=ఎదుర్కొని, లావుకలిమిన్=బలసంపదతో, క్రూరాస్త్రంబులన్=క్రూరమైన అస్త్రములతో, కోటీరయుక్తంబుగాన్= కిరీటముతోసహా, మస్తకముల్=తలలు, తునిమి=త్రుంచి, భుక్తుల్=బలులు, భూతాళికిన్=భూతాల సమూహాలకు, పెట్టు=పెట్టును.

**తా :** ఊరికే బీరాలు పలకకు. విను. ప్రపంచమంతటికీ తెలిసే విధంగా సముద్రానికి ఆనకట్టకట్టి శ్రీరాముడు నీతో భయంకరంగా యుద్ధం చేస్తాడు. ఆ యుద్ధంలో కిరీటాలతోసహా నీ తలలు తన అస్త్రబలంతో త్రుంచి భూతాలకు బలిగా వేస్తాడు.

**విశే :** భూతాలకు బలి వెయ్యడం – నుడికారం.

**శా. ఆరూఢ ప్రతిమాన విక్రమ కళాహంకార తేజో నిధిన్**
**శ్రీరామున్, సుగుణాభిరాముఁ దెగడన్ జేకొన్న నిన్నాజిలో**
**దారన్ దొంగిలితంచు నిష్ఠురగతిన్ దండించి ఖండింప ము**
**న్నీ రెట్లైనను దాఁటివచ్చు నలుకన్ నేఁ డెల్లి శాంతింపుమా! 67**

**ప్రతి :** ఆరూఢ=ఔన్నత్యముతో, ప్రతిమాన=సాటియగు, విక్రమకళా=పరాక్రమించు కళలో, హంకార= అతిశయించు, తేజోనిధిన్=తేజస్సుకు నిధియైన, సుగుణాభిరామున్=మంచిగుణములతో ఒప్పునట్టి, శ్రీరామున్, తెగడన్=నిందించుటకు, చేకొన్న=పూనుకున్న, నిన్ను, ఆజిలో=యుద్ధములో, దారన్=భార్యను, దొంగిలితి= దొంగిలించావు, అంచు=అనుచు, నిష్ఠుర గతిన్=కఠినమైన పద్ధతిలో, దండించి=శిక్షించి, ఖండింపన్= చంపడానికి, మున్నీరు=సముద్రము, ఎట్లైనను=ఏదో పద్ధతిలో, దాఁటివచ్చున్=దాటివస్తాడు, అలుకన్= కోపంతో, నేఁడెల్లి=నేడు+ఎల్లి=ఈరోజు రేపు, శాంతింపుమా! శాంతించు ఓపికపట్టు.

**తా :** సాటిలేని ఔన్నత్యముతో విక్రమ కళాతిశయంతో తేజస్సుతో కూడినవాడు సుగుణాభిరాముడయిన రాముని నిందించ పూనుకున్న నిన్ను తన భార్యను దొంగిలించావనే కోపంతో యుద్ధంలో, దండించి ఖండించడానికి రాముడు నేడో రేపో ఏదోవిధంగా సముద్రం దాటి వస్తాడు. శాంతించు.

**విశే :** అతిత్వరలో రాముడు సముద్రం దాటి తప్పక వస్తాడు. నిన్ను ఖండిస్తాడు. అని సీత స్పష్టంగా నమ్మకంగా చెప్పింది. నేడెల్లి శాంతిపుమా! అనేది కందువమాట.

**వ. అని తన్నుఁ జీరికిం గొనక వీరాలాపంబు లాడ నా రావణుఁ డొడుపు దప్పిన కాలాహి చందంబున నుగ్రుండై మండిపడి యిట్లనియె. 68**

**ప్రతి :** అని, తన్నున్=తనను, చీరికింగొనక=అణుమాత్రమైన లెక్కచేయక, వీరాలాపంబులు=ధైర్యవచనాలు, ఆడన్=పలుకగా, ఆరావణుడు, ఒడుపు దప్పిన=పట్టుకోడానికి చేసిన ప్రయత్నం తప్పిన, కాలాహి=కాలనాగు, చందంబున=వలె, ఉగ్రుండై=కోపియై, మండిపడి, ఇట్లనియె.

**తా :** తనను అణుమాత్రం లెక్క చేయకుండా సీత ధీరవచనాలు పలుకగా, రావణుడు ఒడుపు తప్పిన పాములా కోపంతో మండిపడి ఇలా అన్నాడు.

## రావణుఁడు కుపితుఁడై సీతకు వ్యవధి నొసఁగుట

**క. ఆఁటదిగా యని కూరిమి**
**పాటించిన కొలది నన్నుఁ బలుకఁగఁ జొచ్చెన్**
**మాటాడకుండ నాలుక**
**తూఁటులుగాఁ జేయకున్న దోసము గాదే! 69**

**ప్రతి :** ఆఁటదిగా=ఆడదికద, అని, కూరిమి=స్నేహన్ని, పాటించిన=చూపిన, కొలది=కొద్దీ, నన్నున్=నన్ను, పలుకగన్=అనడానికి, చొచ్చెన్=మొదలుపెట్టింది, మాటాడకుండ, నాలుక, తూఁటులుగాన్=చిల్లులుగా, చేయకున్న=చేయకపోతే, దోసము గాదే!=తప్పు కాదా!

**తా :** ఆడది గదా అని స్నేహాన్ని చూపిస్తున్నకొద్దీ నన్ను నిందించడం మొదలుపెట్టింది. ఈవిడ మాట్లాడకుండా ఉండేలా నాలుకతూట్లు చెయ్యకపోతే తప్పుకదా!

**క. కుయ్యాడక నా ముందటఁ**
**గయ్యమునకుఁ గాలు దువ్వఁ గడఁగెను దీనిన్**
**దయ్యాలకు బలి పెట్టెద**
**వ్రయ్యలుగా నఱికి యెల్లవారును జూడన్. 70**

**ప్రతి :** కుయ్యాడక=కుయ్యి+ఆడకన్=దీనాలాపాలు పలుకక కుయ్యో మొఱ్ఱో అనక, నా ముందటన్=నా ఎదుట, కయ్యమునకున్=యుద్ధానికి, కాలుదువ్వఁ గడఁగెను=సిద్ధము కాసాగింది. దీనిని=ఈ సీతను, దయ్యాలకు బలివెట్టెద=దయ్యాలకు బలి ఇస్తాను. వ్రయ్యలుగానఱికి=ముక్కలుగా కోసి, ఎల్లవారును=అందరు, చూడన్=చూడగా.

**తా :** కుయ్యోమొఱ్ఱో అంటూ దీనంగా మాట్లాడక. కయ్యానికి కాలుదువ్వుతున్న ఈమెను ముక్కలుగా నరికి అందరూ చూస్తూ ఉండగా దయ్యాలకు బలిపెడతాను.

**విశే :** పొట్టేళ్లు, ఎద్దులు-ఎదుటి దాని మీదకు యుద్ధానికి వెళ్లేముందు కాళ్లతో నేలను గట్టిగా తవ్వినట్లు రాసి ముందుకు వెళతాయి అదే కయ్యానికి కాలుదువ్వడం, లేదా త్రవ్వడం అంటారు.

కయ్యానికి కాలుదువ్వు, దెయ్యాలకు బలిపెట్టు - తెలుగు జాతీయాలు.

క. **కాకున్న దీని బలిమిని**
**బైకొని నాకాంక్ష దీఱ భావజ కేళిన్**
**జేకొనక విడిచిపెట్టినc**
**గైకొనునే నవ్వుcగాక గర్వము పేర్మిన్.** **71**

**ప్రతి :** కాకున్న=అలా కాకపోతే, దీని=ఈమెను, బలిమిని=బలవంతగా పైకొని=ఆక్రమించి, నా కాంక్షదీఱ=నా కోరిక తీరగా, భావజకేళిన్=మన్మథకేళి, చేకొనక=చేయక, విడిచి పెట్టినన్, నవ్వున్, కాక, గర్వము పేర్మిన్=అతిశయించిన గర్వము వలన, కైకొనునే=స్వీకరించునా.

**తా :** ఈమెను బలాత్కారం చేసి నా కోరిక తీర్చుకుంటాను. అలా చెయ్యకపోతే ఈమె నన్ను స్వీకరిస్తుందా. అతిశయ గర్వంతో నవ్వుతుంది గాని.

శా. **భీమాటోప భుజ ప్రతాప మహిమన్ భీమాచలం బెత్తి, సు**
**త్రామాద్యష్ట దిగీశ సైన్యముల సంగ్రామంబులో నోర్చి, యు**
**ద్దామ ప్రౌఢిc జెలంగుచుండెడు కళా ధాముండ, నా ముందటన్**
**రాముন్ గీముని జెప్ప గిప్ప నగరా రాకేందు బింబాననా!.** **72**

**ప్రతి :** భీమ=భయంకరమయిన, ఆటోప=సంరభము, వేగము, భుజప్రతాప= భుజశౌర్య, మహిమన్= మహిమతో, భీమాచలం=కైలాసపర్వతము, ఎత్తి=ఎత్తి, సుత్రామ+ఆది+అష్టదిగీశ=ఇంద్రుడు మొదలైన అష్టదిక్పాలకుల, సైన్యముల, సంగ్రామంబులోన్=యుద్ధంలో, ఓర్చి=సహించి (జయించి), ఉద్దామప్రౌఢిన్= అతిశయించిన ప్రౌఢితో, చెలంగు చుండెడు=సంతోషిస్తూ ఉండే, కళాధాముండ=కళకు నెలవైనవాడను, నాముందటన్, రాముడ్ గీముని, చెప్పగిప్ప, నగరా=నవ్వరా? రాకేందుబింబాననా!=పూర్ణచంద్రుని వంటి ముఖము కలదానా!

**తా :** ఓ చంద్రముఖీ! భయంకరమైన వేగంతో భుజశక్తిమహిమతో కైలాస పర్వతం ఎత్తాను, ఇంద్రుడు మొదలయిన అష్టదిక్పాలకులను యుద్ధంలో ఓడించాను. అతిశయించిన గర్వంతో ఆనందించే కళకు నెలవైనవాడిని. అట్టి నా ముందు-ఈ రాముణ్ణి, గీముణ్ణి చెప్ప గిప్ప ఎవరయినా వింటే నవ్వరా!

**విశే :** నిందార్థంలో గిగీలు వస్తాయి తెలుగు భాషలో **రాముడు గీముడు, చెప్ప గిప్ప అని** చెప్పడం రెండింటినీ రావణుడు నిరసిస్తున్నాడు. బాలకాండలో పరశురాముడు కూడా – 'రాముడు గీముడంచు' అని అన్నాడు. బాలకాండ–95 పద్యము.

**సీ. అఖిల లోకముల నా యాజ్ఞ నిల్పితి నేక**
**హేలను బుష్పకం బెక్కి తిరిగి,**
**వేల్పుమూఁకలచేత వెట్టి సేయించితి**
**దితివంశ వల్లభుల్ నుతులు సేయ,**
**గణములతోఁ గూడ గైలాస మెత్తితి**
**బటువైన పూవుల బంతి పగది,**
**వనజగర్భుని చేత వరములు గైకొంటి**
**దండిగా నత్యుగ్ర తపము సల్పి,**

**తే. చెఱలు పట్టితి గంధర్వ సిద్ధ సాధ్య**
**భుజగ సుర యక్ష కిన్నర ముఖ్య సతుల,**
**నిట్టి సామర్థ్య మెవరి కేనాఁడు గలదు?**
**మహిని నా కొక్కనికె కాక మంజువాణి!. 73**

**ప్రతి :** అఖిలలోకముల=అన్నిలోకాలలో, నా ఆజ్ఞ=ప్రభుత్వం, నిల్పితిన్=నిలిపాను, ఏకహేలను=ఆనందంతో విరామం లేకుండా, పుష్పకంబు=పుష్పక విమానము, ఎక్కి, తిరిగి, వేల్పుమూఁకలచేతన్=దేవతాసమూహం చేత, వెట్టిసేయించితిని=జీతంలేని చాకిరీ చేయించాను, దితివంశవల్లభుల్=రాక్షసవంశనాథులు, నుతులుసేయ=కొనియాడగా, గణములతోన్=ప్రమథగణాలతో కూడ కైలాసపర్వతం, బటువైన=గుండ్రని, పూవుల బంతిపగిది=పూలబంతివలె, ఎత్తాను, వనజగర్భునిచేత=బ్రహ్మచేత, వరములు, కైకొంటి= పుచ్చుకున్నాను, దండిగా=అధికముగా, అత్యుగ్ర=మిక్కిలి భయంకరమైన, తపము సల్పి=తపస్సు చేసి, గంధర్వ, సిద్ధ, సాధ్య, భుజగ, సుర, యక్ష, కిన్నర, ముఖ్యసతులు=మొదలైన స్త్రీలను, చెఱలుపట్టితి=ఖైదీలుగా చేసాను, ఇట్టి=ఇటువంటి, సామర్థ్యము=శక్తి, ఎవరికి, ఏనాడు, కలదు?–మహిని=ఈ భూమిలో, నాకు, ఒక్కనికె, కాక, మంజువాణి=వినసొంపైన వాక్కులు గలదానా!

**తా :** ఓ మంజువాణి! సీతా! లోకాలన్నిటా నా ప్రభుత్వం నిలిపాను. పుష్పకం ఎక్కి ఆనందంతో నిర్విరామంగా విహరించాను. రాక్షసప్రభువులు మెచ్చేలా దేవతలచేత వెట్టిచాకిరీ చేయించాను, ప్రమథగణాలతో సహా కైలాసపర్వతాన్ని గుండ్రని పూలబంతిలా ఎత్తాను. తీవ్రమైన తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి వరాలు సంపాదించాను. గంధర్వ, సిద్ధ, సాధ్య, భుజగ, సుర, యక్ష, కిన్నెర మొదలైన స్త్రీల నందరినీ పట్టి చెఱసాలలో పెట్టాను. ఇంతటి సామర్థ్యం ఎవరికైనా, ఏనాడైనా ఉందా? ఈ భూలోకంలో నాకు కాక!

**తే. నాకు నెదిరింప నొక పేద నరుని నొడ్డి**
**వెఱవ కీ రీతి దుర్భాష లఱచు దీని**
**జిహ్వ మొదలంటఁ బట్టి యీ శిత కుఠార**
**ధారఁ దునుమాడి ధారుణిఁ బాఱవైతు. 74**

**ప్రతి :** నాకున్=నన్ను, ఎదిరింపన్=ఎదిరించడానికి, ఒకపేద నరునిన్=ఒక బీద మానవుణ్ణి, ఒడ్డి=పణముగా పెట్టి, (జూదములో పందెమునకు పణముగా పెట్టే ధనము మొదలయినవి ఒడ్డుట), వెఱవక=భయపడక, ఈ రీతి=ఈవిధంగా, దుర్భాషలు=నిందావాక్యాలు, అఱచు=అఱుస్తున్న, దీని=సీతయొక్క, జిహ్వ=నాలుక, మొదలంటన్=మొదలునించి, పట్టి, ఈ, శిత=వాడి అయిన, కుఠారధారన్=కత్తి అంచుతో, తునుమాడి=కోసి, ధారుణిన్=నేల మీద, పాఱవైతు=పడేస్తాను.

**తా :** నన్ను ఎదిరించడానికి ఒకపేద మానవుణ్ణి ఒడ్డి, ఇలా నిందిస్తూ అరుస్తుందా, ఈమె నాలుక నా వాడి కత్తితో మొదలుకు పట్టికోసి నేలమీద పడేస్తాను.

**విశే :** ఎనెన్నో మహత్కార్యాలు చేసిన రావణుడు కోపంతో సీత ధైర్యాన్ని తట్టుకోలేక, రాముణ్ణి, ఎదురు ఒడ్డడం సహించలేక, ఆమె నాలుక కోసేస్తానన్నాడు. ఔచిత్యం మరచిపోతే ఎంతటి వారయినా కోపంలో ఇలానే ప్రవర్తిస్తారు.

ఒడ్డి=యుద్ధంలో శత్రువును ఎదిరించే సందర్భంలో 'ఎదురొడ్డి', అంటారు. ఇక్కడ రావణుణ్ణి ఎదుర్కొని పోరాడే వీరుడని సీతమాటలలోని విషయాన్ని 'ఒడ్డి' అని ప్రయోగం ద్వారా వ్యక్తపరచింది కవయిత్రి మొల్ల.

**వ. అని చంద్రహాసంబు జంకించి లేవ నుంకించు తఱిఁ గొందఱు ప్రియ సుందరు లడ్డంబు సొచ్చి. 75**

**ప్రతి :** అని, ప్రియసుందరులు చంద్రహాసంబు=కత్తి, జంకించి=ఆడించి, లేవన్=లేచుటకు, ఉంకించుతఱిన్=ప్రయత్నించే వేళలో, అందమైన ప్రియురాళ్లు, అడ్డంబుసొచ్చి=అడ్డం వెళ్లి–

**తా :** నాలుక కోసేస్తానని భయంపెట్టి కత్తిపట్టుకుని లేవడానికి ప్రయత్నిస్తున్న రావణునికి కొందరు అందమైన ప్రియురాళ్లు అడ్డం వెళ్లి.

**చ. సురవరుఁడో? ధనంజయుఁడొ? సూర్యతనూజుఁడొ? యాతుధానుఁడో?**
**శరధి విభుండొ? గాడ్పొ? పురశాసను మిత్రుఁడొ? భోగిభూషుఁడో?**
**గురుభుజశక్తిఁ గైకొనుచుఁ గోపము సూపఁగ నీకు నెంత యి**
**త్తరుణిపయిం బ్రతాపమున దారుణ కృత్యము సేయఁ గూడునే? 76**

**ప్రతి :** సురవరుఁడో?=ఇంద్రుడో, ధనంజయుఁడొ?=సేవించుటవలన ధనము ఇచ్చువాడు అగ్ని, సూర్య తనూజుఁడొ=యముడో, యాతుధానుడో?=నిరుతియో?, శరధివిభుండో=సముద్రుడో, గాడ్పొ=వాయుదేవుడో?, పురశాసనుమిత్రుఁడొ=ఈశ్వరుని మిత్రుడు కుబేరుడా, భోగి భూషుఁడో=పాములు

అలంకరించు కునేవాడు శివుడో, గురుభుజశక్తిన్=అధికమైన భుజశక్తిని, కైకొనుచున్=గ్రహించి, కోపము, చూపగ, ఈ+తరుణి, ఇత్తరుణిపయిన్=ఈ స్త్రీమీద, నీకు, ఎంత!, ప్రతాపమున=వీరత్వముతో, దారుణకృత్యము=భయంకరమైనపని, చేయన్=చేయుట, కూడునే?=తగునా?

**తా :** ఈమె ఇంద్రుడా?, అగ్నియా?, యముడా?, నిరుతియా?, సముద్రుడా?, వాయుదేవుడా?, కుబేరుడా? శివుడా? – నీ భుజశక్తి చూపడానికి? ఈ స్త్రీమీద నీ ప్రతాపం చూపిస్తూ ఈ దారుణమైన పని చేయడం నీకు తగదు.

**క. ఏటికి మీ రిటు కినియఁగ**
**గాటపు జంకెనయె చాలుఁ, గరవాలున కీ**
**యాఁటది యర్హమె? మము నీ**
**మాటికి మన్నించి కావుమా యిఁకఁ జాలున్. 77**

**ప్రతి :** మీరు, ఇటు=ఈవిధముగా, కినియఁగ=కోపగించుకొనుట, ఏటికి=ఎందుకు, గాటపు=గట్టి, జంకెనయె=బెదిరించడమె, చాలున్=చాలును, కరవాలునకు=కత్తికి, ఈ, ఆటఁది=ఆడది, అర్హమె=తగునా? మమున్, ఈమాటికి=ఈసారికి, మన్నించి=క్షమించి, కావుమా=రక్షింపుమా, ఇఁకన్, చాలున్=ఇంకచాలు.

**తా :** మీరు ఇంతగా కోపగించుకోవడం దేనికి, గట్టిగా బెదిరిస్తే సరిపోతుంది. ఈ కత్తికి ఆడదాని మీదకు వెళ్లడం తగునా? ఈసారికి మా మాట మన్నించి, ఈమెను రక్షించు, ఇక చాలును.

**వ. అని శాంత వచనంబులఁ బ్రియంబు సెప్పిన యప్పంకరుహాక్షుల విన్నపంబులు మన్నించి, యా రాక్షస చక్రవర్తి వైదేహికిఁ గావలియున్న యేకజటా ద్విజటా త్రిజటా దుర్ముఖీ వాయుముఖీ శూర్పణఖలాదిగాఁగల దైత్య కామినులవంకఁ గనుగొని. 78**

**ప్రతి :** అనిశాంతవచనంబులన్+ప్రియంబుసెప్పిన=హితవు చెప్పగా, ఆ+పంకరుహాక్షుల అప్పంకరుహాక్షుల= ఆ తామరలవంటి కన్నులు గల స్త్రీల, విన్నపంబులు=భక్తితో చెప్పిన మాటలు, మన్నించి=గౌరవించి, ఆ రాక్షస చక్రవర్తి, వైదేహికిన్= విదేహరాజపుత్రి అయిన సీతకు, కావలియున్న=కాపలాగా ఉన్న, ఏకజటా, ద్విజటా, త్రిజటా, దుర్ముఖీ, వాయుముఖీ, శూర్పణఖలు, ఆదిగా గల=మొదలైన, దైత్యకామినుల వంకన్=రాక్ష స్త్రీలవైపు, కనుగొని=చూచి.

**తా :** ఆ సుందరులు చెప్పిన హితవు విని, వారు చెప్పిన మాటలు మన్నించి, ఆ రాక్షస చక్రవర్తి రావణుడు సీతకు కాపలా ఉన్న – రాక్షస్త్రీల వంక చూచి...

**విశే :** ఏకజట – ఒకజడ గలది, ద్విజట=రెండు జడలు గలది, త్రిజట=మూడు జడలుగలది. దుర్ముఖీ= చెడుముఖము గలది. వాయుముఖి=గాలిముఖంగలది, శూర్పణఖ=చేటలవంటి గోళ్లు కలదీ – ఇవన్నీ రాక్షసాంగనల పేర్లు. వాళ్ల రూపాలవల్ల వచ్చినవి.

క. గడు విచ్చితి నిరు మాసము
లొడఁ బఱుపుఁడు నేర్చినట్టు, లొడఁబడ కున్నన్
గడి కండలుగాఁ గోసుక
పడఁతులు భక్షింపుఁ డింతిపలలం బంతన్. 79

ప్రతి : గడువిచ్చితిన్=గడువు ఇచ్చాను, ఇరుమాసములు=రెండునెలలు, ఒడబఱుపుఁడు=ఒప్పుకునేలా చేయుడు, నేర్చినట్టు=మీకు చేతనయినంతలో, ఒడఁబడకున్నన్=ఒప్పుకోకపోయినట్లయితే, కడికండలుగాన్= మాంసపు ముక్కలుగా, కోసుక=కోసుకుని, పడతులు= స్త్రీలారా!, ఇంతి= స్త్రీయొక్క (సీత) పలలంబంతన్= మాంసాన్ని అంతా, భక్షింపుడు=తినుడు.

తా : రెండునెలలు గడువు ఇస్తున్నాను. మీకు చేతనయినంతలో ఆమెను ఒప్పుకునేలా చేయండి. ఒప్పుకోలేదా ఆమె మాంసాన్ని ముక్క ముక్కలుగా కోసుకుని తినండి.

వ. అని రోషారుణిత నేత్రుండై యతి భీషణాకారంబుఁ దాల్చి పలికిన. 80

తా : అని కోపంతో ఎరుపెక్కినకళ్లతో మిక్కిలి భయంకరమైన ఆకారంతో పలుకగా –

క. తన పతి నిందించుటకును
దను ప్రియములు చెప్ప వినక తక్కిన మీఁదన్
దనుఁ జంపుఁ డన్న మాటకు
నినకులవల్లభుని దేవి యేడ్చెన్ బెలుచన్. 81

ప్రతి : తనపతిన్=తన భర్తను, నిందించుటకును=తిట్టినందుకు, తను=తాను, ప్రియములుచెప్పన్= హితవు చెప్పగా, వినక, తక్కిన మీఁదన్=ఆపైన, తనున్=తనను, చంపుడు, అన్నమాటకున్, ఇనకులవల్లభుని దేవి=సూర్యవంశపురాజయిన రాముని దేవి సీత, పెలుచన్=మిక్కిలిగా, ఏడ్చెన్.

తా : శ్రీరాముని దేవేరి సీత తన పతిని తిట్టినందుకు, తాను చెప్పిన హితవు వినకపోగా, తనను చంపండి అన్నమాటకు మిక్కిలి ఏడ్చినది.

సీ. జానకి శోకింప సాధ్య కిన్నర యక్ష
గరుడోరగామర కాంత లెల్ల
వెంటనే శోకింప విని గంధవహు పుత్రు
దాత్మలోఁ జింతించి యాగ్రహమున
నీ దుష్ట దైత్యుపై నిప్పుడే లంఘించి
చెండాడ నాచేతఁ జిక్కెనేని
కార్యంబు లెస్సగుఁ, గాక సత్త్వము తూలి
పలువడి వీనిచే బడితినేని

**తే.** **సీతఁ గానంగ లేక కృశించి రామ**
**భద్రుఁ డడఁగిన, సీతయుఁ బ్రాణ మెడలు,**
**లక్ష్మణుండును జూడ నాలస్య ముడిగి**
**తెగును నట్లైనఁ గార్యంబు తెఱఁగు దప్పు.** **82**

**ప్రతి :** జానకిశోకింపన్=సీతాదేవి ఏడ్వగా, సాధ్య, కిన్నర, యక్ష, గరుడ, ఉరగ, అమర–కాంతలెల్ల= స్త్రీలు అందరు, వెంటనే=వెంటనే, శోకింపన్=ఏడ్వగా, విని=విని, గంధవహపుత్రుండు=వాసననుమోసే వాయువు కుమారుడు, హనుమ, ఆత్మలోన్=మనస్సులో, చింతించి=దుఃఖపడి, ఆగ్రహమునన్=కోపముతో, ఈ దుష్టదైత్యుపైన= ఈ దుష్టరాక్షసుని మీద, ఇప్పుడే=ఈ క్షణంలోనే, లంఘించి=దుమికి, చెండాడన్=చంపుటకు, నాచేతన్, చిక్కెనేని దొరికినట్లయితే, కార్యము లెస్సగు=నాపని బాగా అవుతుంది, కాక=అట్లాకాక, సత్త్వము తూలి=బలము చలించి, పలువడి=దుష్టత్వముగల, వీనిచే, పడితినేని=చనిపోయినట్లయిన, సీతగానంగలేక= సీతనుచూడలేక, కృశించి=చిక్కి, రామభద్రుడు, అడఁగినన్=నశించినట్లయిన, సీతయు=సీతకూడా, ప్రాణము, ఎడలు=వదిలివేస్తుంది, లక్ష్మణుండునున్=లక్ష్మణుడు కూడా, చూడ, ఆలస్యము ఉడిగి ఆలస్యం చేయకుండా, తెగును=చనిపోవును, అట్లైన=ఆ విధముగా జరిగితే, కార్యంబు=పని, తెఱగు= విధానము, తప్పు=తప్పుతుంది.

**తా :** సీతాదేవి ఏడ్వగా సాధ్య, కిన్నర, యక్ష, గరుడ, నాగ, దేవకాంత లందరూ ఏడ్చారు. ఆ ఏడ్పు విన్న హనుమ మనస్సులో దుఃఖపడ్డాడు. పట్టరాని కోపంతో ఈ రావణుని మీదకు దుమికి వీడు నా చేతిలో చచ్చేటట్లు చేస్తే అంతా బాగానే ఉంటుంది. అలాకాక నా బలం తగ్గి ఈ దుష్టుని చేతిలో నేను చనిపోతే, సీతను చూడక రాముడు మరణిస్తాడు, సీతా మరణిస్తుంది. క్షణం ఆలస్యం చెయ్యకుండా లక్ష్మణుడు కూడా మరణిస్తాడు. ఇలా అయితే నేను వచ్చిన పని సరియైన విధంగా చేసినట్లు కాదు. దారితప్పినట్లు.

**చ.** **అని పవనాత్మజుండు దివిజారి పయిం దెగ వేళ గాదు, భూ**
**తనయకు నాదు రాక, వసుధా వరు మేలు నెఱుంగఁ జెప్పి, మీ**
**దను మఱి చూత మంచు నుచిత స్థితి నూరక యుండె, నప్పు డా**
**దనుజ విభుండు వోయె నిజ ధామముఁజేర సతీ సమేతుఁడై.** **83**

**ప్రతి :** అని, పవనాత్మజుండు=హనుమంతుడు, దివిజారిపయిన్=రాక్షసుని మీదకు, తెగ=విజృంభించే, వేళకాదు=సమయం కాదు, భూతనయకున్=సీతాదేవికి, నాదురాక=నేను వచ్చిన సంగతి, వసుధావరు= భూభర్త అయిన రాముని, మేలున్=క్షేమము, ఎఱుంగన్=తెలియనట్లు, చెప్పి, మీదను=ఆ తరువాత, మఱియు చూతమంచున్=ఏమి చెయ్యడమో చూద్దాము అని, ఉచితస్థితిన్=తగిన విధముగా, ఊరకయుండెన్=ఊరికె ఉన్నాడు, అప్పుడు, ఆ, దనుజవిభుండు=రాక్షసుడు, సతీసమేతుండై=భార్యతో కలసి, నిజధామమున్=తన ఇంటికి, చేరన్=చేరుటకు, పోయె=పోయెను.

**తా :** అని ఆలోచించిన హనుమ రాక్షసుని మీద సాహసించే వేళకాదు. సీతకు నేను వచ్చిన సంగతి, రాముని క్షేమవార్త చెప్పాలి. ఆ తరువాత ఏదైనా చెయ్యవచ్చు అని ఏమీ చెయ్యకుండా ఉన్నాడు. రావణుడు అప్పుడు తన భార్యతో కలసి తన యింటికి వెళ్లాడు.

**వ. అప్పుడు యామినీచర కామినులు రావణానుమతంబున ననేక విధంబులగు మధురాలాపంబుల మిథిలాధీశు కుమారిం గుఱించి బోధించి, కార్యంబు సాధింప నోపక, యలసియుంటం జేసి యొక్కింతసేపు నిద్రించుచుండ, మేల్కొని త్రిజటయను నిశాచరి యిట్లనియె. 84**

**ప్రతి :** అప్పుడు, యామినీచర=రాత్రుళ్లు తిరుగాడే రాక్షసుల, కామినిలు=స్త్రీలు, రాక్షసస్త్రీలు, రావణానుమతంబున=రావణుని ఇష్టప్రకారం,అనేకవిధంబులగు, మధురాలాపంబులన్=తియ్యని మాటలతో, మిథిలాధీశుకుమారిన్, గుఱించి=సీతకు, బోధించి=బోధచేసి, కార్యంబు=పనిని, సాధింపన్=చేయన్, ఓపిక=లేక, అలసి, ఉంటంజేసి, ఒక్కింతసేపు=కొంచెంసేపు, నిద్రించుచుండ, మేల్కొని, త్రిజటయను, నిశాచరి=రాక్షసి, ఇట్లనియె.

**తా :** అప్పుడు, ఆ రాక్షసస్త్రీలు రావణుడు చెప్పినట్లుగా, సీతకు తియ్యని మాటలతో అనేకవిధాల చెప్పిచూశారు. కాని వాళ్లపని సానుకూలం కాలేదు. సీతను ఒప్పించలేకపోయారు. అలసిపోయి కాసేపు నిద్రపోయారు. అంతలో త్రిజట అనే రాక్షసి లేచి ఇలా చెప్పింది.

## త్రిజటా స్వప్నవృత్తాంతము

**మ. కల గంటిన్ వినుఁ డింతులార! మన లంకా ద్వీప మీ యబ్ధిలో**
**పల వ్రాలన్, మన రావణేశ్వరుని శుంభద్రత్న కోటీరముల్**
**కలనన్ గూల రఘూద్వహుం డెలమితో గంధద్విపం బెక్కి, యు**
**జ్జ్వల కాంతిన్ విలసిల్లు సీతఁ గొనిపోవన్ మిన్నకే నిప్పుడే. 85**

**ప్రతి :** ఇంతులార!=ఓ మహిళలారా! కలగంటిన్=కలగన్నాను, వినుడు, మన, లంకాద్వీపము=లంకా ద్వీపము, ద్వీపము అంటే నాలుగు పక్కలా నీళ్లు కలిగిన భూభాగము, లంక ఆ విధంగా ద్వీపం, ఈ అబ్ధిలోపల వ్రాలన్=ఈ సముద్రంలో పడిపోగా, మన రావణేశ్వరుని=మన రావణుని, శుంభద్రత్నకోటీరముల్= రత్నములచే ప్రకాశించే కిరీటాలు, కలనన్=యుద్ధరంగంలో, కూల=కూలిపోగా, రఘూద్వహుండు=రాముడు, ఎలమిన్=ఆనందముతో, గంధద్విపంబు=మదించిన ఏనుగును, ఎక్కి, ఉజ్జ్వలకాంతిన్=అధికమైన కాంతితో, విలసిల్లు=ప్రకాశించు, సీతన్=సీతను, కొనిపోవన్=తీసుకుని వెళుతుండగా, మిన్నక=ఏమీ అనక, అవాక్కయి, ఏను, ఇప్పుడే-కలగంటిన్.

**తా :** ఇంతులారా! వినండి మన లంకాద్వీపం సముద్రంలో మునిగిపోయింది. యుద్ధరంగంలో మనరావణుని రత్నకిరీటాలు కూలిపోయాయి. శ్రీరాముడు సంతోషంతో మత్తగజాన్ని ఎక్కి ఆనందంతో ప్రకాశిస్తున్న సీతను తీసుకు వెళుతున్నట్లు ఇప్పుడే నేను కలగన్నాను.

**క. శుద్ధాత్ముఁడైన రాముఁడు**
**శుద్ధాంతపు దేవిఁ గొనె శుభ సూచకముల్**
**సిద్ధమయి తోఁచుచున్నవి**
**సిద్ధం బీ మాట వేద సిద్ధాంతముగాన్. 86**

**ప్రతి :** శుద్ధాత్ముఁడైన, రాముడు, శుద్ధాంతపు దేవి=తన అంతఃపురములోనిదేవిని, కొనె=స్వీకరించాడు, శుభసూచకముల్=శుభశకునాలు, సిద్ధమయి తోఁచుచున్నవి=స్పష్టంగా కనిపిస్తున్నవి, సిద్ధంబు=సత్యముగా అంగీకరింపబడినది, ఈమాట, వేద సిద్ధాంతముగాన్=వేదంచేత ప్రమాణీకరింపబడినది.

**తా :** శుద్ధాత్ముడయిన రాముడు తన దేవిని స్వీకరించాడు. శుభశకునాలు కనిపిస్తున్నాయి. ఈ మాట సత్యము. వేదము ప్రమాణీకరించినది కూడా.

**క. కావున నిక్కోమలి యెడఁ**
**గావలి యున్నట్టి మీరు కఠినోక్తులు గా**
**నేవియు నాడకుఁ డిఁక నీ**
**దేవియ రక్షింప మనకు దిక్కగు మీఁదన్. 87**

**ప్రతి :** కావునన్=అందువల్ల, ఈ, కోమలి యెడన్=ఈ సుకుమారి పట్ల, కావలి యున్నట్టి మీరు=కాపలాగా ఉన్న మీరు, కఠినోక్తులుగాన్=మనస్సును కష్టపెట్టే మాటలు, ఏవియున్=వేటిని, ఆడకుఁ డిఁకన్=ఇక మాట్లాడకండి, ఈ దేవియ=ఈ సీతాదేవియే, మనకు, రక్షింప=కాపాడడానికి, మీఁదన్=ఇకమీద, దిక్కగు=దిక్కు కాగలదు.

**తా :** అందువల్ల ఈ సీతపట్ల కఠినంగా మాట్లాడకండి. ఇకమీద మనను కాపాడే దిక్కు ఈమే కాగలదు.

**వ. అని చెప్పి మఱియును. 88**

**తా :** ఆ విధంగా చెప్పి, ఇంకనూ –

**క. అమ్మా! వెఱవకు మదిలో**
**నిమ్ముగ మఱి వేడ్క నుండు మిఁక, నీ మగఁడున్**
**నెమ్మిగ నినుఁ గొనిపోవును,**
**మమ్మందఱ మనుపు మమ్మ! మఱవక కరుణన్. 89**

**ప్రతి :** అమ్మా! వెఱవకు మదిలోన్=మనసులో భయపడకుము, ఇమ్ముగన్=ప్రీతితో, మఱి, వేడ్కన్=ఆనందంతో, ఉండుము ఇఁకన్, మగఁడున్=నీ భర్త, నెమ్మిగ=అనురాగముతో, నినున్=నిన్ను, కొనిపోవును=తీసుకుని వెళ్లును, మమ్మందఱన్=మా అందరిని, మనుపుము=బ్రతికించు రక్షించు, అమ్మ=తల్లీ!, కరుణన్=దయతో–మఱవక,

**తా :** అమ్మా! సీతమ్మా! మనస్సులో భయపడకు. ఆనందంతోఉండు నీ భర్త అనురాగంతో నిన్ను తీసుకొని వెళతాడు. మా అందరినీ మఱచిపోక దయతో రక్షించు.

**ఆ. అనుచు దనుజ కాంత లంతంత నెడఁ బాసి**
**నిదుర వోయి, రంత నదరి సీత**
**తనకు దిక్కు లేమిఁ దలపోసి దుఃఖింపఁ**
**బవన సుతుఁడు మనుజ భాషఁ బలికె. 90**

**ప్రతి :** అనుచు, దనుజకాంతలు=రాక్షస స్త్రీలు, అంతంతన్=కొంచెం కొంచెం, ఎడబాసి=దూరంగా జరిగి, నిదురపోయిరి, అంతన్, అదరి=కంగారుపడి, సీత, తనకు దిక్కులేమిన్=దిక్కులేకపోవుటను, తలపోసి=ఆలోచించి, దుఃఖింపన్=దుఃఖపడగా, పవనసుతుఁడు=హనుమ, మనుజ భాషన్=మానవుల భాషలో, పలికె=పలికెను.

**తా :** రాక్షస స్త్రీలు సీతతో అలా రక్షించమని కోరుతూ, ఆమెకు దూరంగా జరిగి నిద్రపోయారు. త్రిజట మాటలకు కంగారుపడిన సీత తనకు దిక్కు లేదని విలపించసాగింది. అప్పుడు హనుమ మానవభాషలో మాట్లాడాడు.

## హనుమంతుఁడు రాముని కుశల వార్తను సీతకు విన్నవించుట

**క. ఉన్నాఁడు లెస్స రాఘవుఁ**
**డున్నాఁడిదె కపులఁ గూడి, యురు గతి రానై**
**యున్నాఁడు, నిన్నుఁ గొని పో**
**నున్నాఁ డిది నిజము నమ్ము ముర్వీ తనయా! 91**

**ప్రతి :** ఉన్నాడు, లెస్స, రాఘవుఁడిదె, కపులన్=కోతులతో, కూడి=కలసి, ఉరుగతి=వేగంగా, రానైయున్నాడు=రావడానికి సిద్ధంగా ఉన్నాడు, నిన్నున్=నిన్ను, కొనిపోనున్నాడు=తీసుకొని వెళ్లనున్నాడు, ఇది నమ్ముము, ఉర్వీతనయా=భూపుత్రీ!

**తా :** ఉన్నాడు క్షేమంగా బాగున్నాడు రాముడు. కోతులతో కూడి వేగంగా నీకోసం రావడానికి సిద్ధంగా ఉన్నాడు, నిన్ను తనతో తీసుకువెళ్ల నున్నాడు. ఇది నిజం నమ్ము సీతా!

**విశే :** తనకు దిక్కెవ్వరూ లేరు అనుకుని నిరాశతో ఉన్న సీత వినేలా మానవభాషలో హనుమ ఈ మాటలు చెప్పాడు. ఈ పద్యం 'ఉన్నాడు' అని ఎత్తుకోవడంలో గొప్పశిల్పం పాటించింది మొల్ల. ఉన్నాడు సరే ఎలా ఉన్నాడు అనే సందేహం తీరిపోయేలా వెను వెంటనే 'లెస్స' బాగున్నాడు. బాగున్నది ఎవరు? రాఘవుడు–ఉన్నాడు లెస్స రాఘవుడు–ఈ మాట వినగానే సీతకు ప్రాణం లేచి వచ్చింది. ఆ వెనువెంటనే రాముడు ఒంటరిగాలేడు, కపుల బలగంతో ఉన్నాడు – అనే విషయం వినే సరికి మరికొంత ప్రాణం కుదుటపడింది.

అతివేగంగా రాబోతున్నాడు, నిన్ను ఈ లంక నుండి తీసుకువెళ్లడానికి సంసిద్ధుడై ఉన్నాడు అనే మాటలు వినగానే ఆమెకు పూర్తిగా మనస్సు కుదుటబడింది ఉన్నాడు అనే మాట. నాలుగుసార్లు వినిపించాడు హనుమ. చిన్నచిన్న పదాలతో, చక్కని చిక్కని వాక్య విన్యాసంతో ఈ పద్యాన్ని మొల్ల కూర్చింది. తెలుగు పదాలకున్న అందం చందం కూడా ఈ పద్యంలో చూడవచ్చు.

క్రియాపదంతో ఆరంభించడంలో ఉన్న అందం మరింత స్ఫుటంగా ఈ పద్యంలో చోటు చేసుకుంది. ఆకులందున అణగి మణిగి కపివరుడు పలికిన కవిత ఇది. పలికించిన విదుషి మొల్ల.

**సీ. ఆ మాట లాలించి భూమిజ తనలోన**
**వెఱఁగంది, శింశుపా వృక్ష మరసి**
**చూడంగ, నప్పుడు సూక్ష్మ రూపంబున**
**నొడికమౌ శాఖల నడుమ నున్న**
**కపి కుమారుని రూప మపురూపముగఁ జేసి**
**స్వాంతంబులోన హర్షంబు నొంది**
**దనుజ మాయలచేతఁ దఱచు వేగుఁటఁ జేసి**
**మాఱాడ నేరక యూర కున్న**

**తే. భావ మూహించి, తన్ను నా దేవి యాత్మ**
**నమ్మకుండుట దెలిసి, యా కొమ్మమీఁద**
**నుండి క్రిందికి లంఘించి, నిండు భక్తి**
**మ్రొక్కి నిలుచుండి కరములు మోడ్చి పలికె. 92**

**ప్రతి :** ఆ మాటలు, ఆలించి=విని, భూమిజ=సీత, తనలోన=తనలో, వెఱఁగంది=ఆశ్చర్యపడి, శింశుపావృక్షము, అరసిచూడంగన్=పరీక్షగాచూడగా, అప్పుడు సూక్ష్మరూపంబునన్=చిన్న ఆకారముతో, ఒడికమౌ=అందమైన, శాఖలనడుమన్=కొమ్మల మధ్యలో, ఉన్న, కపికుమారునిరూపము=హనుమ ఆకారము, అపురూపముగన్=వింతగా, చేసి=అనిపించి, స్వాంతంబులోన=మనసులో, హర్షంబున్=ఆనందమును, ఒంది=పొంది, దనుజమాయలచేతన్=రాక్షసమాయలతో, తఱచు=పదేపదే, వేగుఁటన్ చేసి=బాధపడడంవల్ల, మాఱాడనేరక=బదులుచెప్పలేక, ఊరకున్న, భావము=ఆలోచన, ఊహించి=ఊహించి, తన్నున్=తనను, ఆ దేవి=సీతాదేవి, నమ్మకుండుటన్, తెలిసి, ఆ కొమ్మమీఁది నుండి, క్రిందికి, లంఘించి=దుమికి, నిండుభక్తిన్, మ్రొక్కి=నమస్కరించి, నిలుచుండి, కరములు మోడ్చి=చేతులు జోడించి, పలికె.

**తా :** ఆ మాటలు విని సీతాదేవి తనలో ఆశ్చర్యపడి, శింశుపావృక్షాన్ని తేరిపార చూసింది. అందమైన ఆ కొమ్మల మధ్యలో చిన్నరూపంతో వింతగా ఉన్న కోతిని చూసి ఆనందపడింది. కాని మాటిమాటికీ రాక్షస మాయలతో విసిగిపోవడంవల్ల ఏమీ అనక ఊరుకుంది. హనుమకు సీత భావం అర్థమయింది. తనను

సీత నమ్మలేదని గ్రహించి కొమ్మమీద నుండి క్రిందకు దుమికి సీతాదేవికి నమస్కరించి, చేతులు జోడించి ఇలా పలికాడు.

**ఉ. తమ్ముని గూడి పుణ్యగుణధాముఁడు రాముఁడు వచ్చి మాల్యవం**
**తమ్మున సైన్య సంఘము ముదంబునఁ గొల్వఁగ నుండి, భూమిపై**
**మిమ్ములఁ జూచి రండనుచు మేటి కపీంద్రులఁ బుచ్చి, యందు మొ**
**త్తమ్ముగ మమ్ముఁ గొందఱను దక్షిణ భాగము చూఁడ బంపుచున్. 93**

**ప్రతి :** తమ్మునిగూడి=తమ్మునితో కలసి, పుణ్యగుణధాముఁడు=ఉత్తమ గుణాలకు నెలవైన, రాముఁడు, వచ్చి, మాల్యవంతమ్మున=మాల్యవంతము అనే పర్వతము మీద, సైన్యసంఘము=సేనాసమూహం, ముదంబునన్=ఆనందంతో, కొల్వఁగన్=సేవించగా, ఉండి, భూమిపై=భూమిమీద, మిమ్ములన్=మిమ్మల్ని, చూచి రండనుచు=చూసిరండి అని, మేటికపీంద్రులన్=శక్తిమంతులయిన వానరనాయకుల్ని, పుచ్చి=పంపించి, మొత్తమ్ముగ=గుంపుగ, మమ్మున్, కొందఱను, దక్షిణభాగము=దక్షిణ దిక్కును, చూఁడన్=చూచుటకు, పంపుచున్=పంపుతూ...

**తా :** పుణ్యగుణధాముడయిన రాముడు తమ్మునితో కలసి మాల్యవంత పర్వతము మీద సైనికులుఆనందంతో కొలుస్తూ ఉండగా, సీతను చూచిరండని కపిశ్రేష్ఠుల్ని పంపించారు. మమ్మల్ని ఒక గుంపుగా దక్షిణదిశలో చూడండి అని పంపుతూ...

**క. అంగనఁ బొడఁగన నీ వి**
**య్యంగను గడుఁ జాలువాఁడ వంచును, నాచే**
**నుంగర మంపెను శ్రీరఘు**
**పుంగవుఁ డిది కొమ్మటంచు భూమిజ కిచ్చెన్. 94**

**ప్రతి :** అంగనన్=స్త్రీని (సీతను), పొడగనన్=కనిపెట్టడంలోను, ఇయ్యంగనున్=ఇవ్వడములోను, నీవు కడున్=మిక్కిలి, చాలువాఁడవు=సమర్థుడవు, అంచును=అంటూ, శ్రీరఘుపుంగవుడు=శ్రీరాముడు, నాచేన్=నాచేత, ఉంగర మంపెను=ఉంగరాన్ని పంపాడు, ఇదె=ఇదిగో, కొమ్ము=తీసుకొనుము, అటంచున్= అంటూ, భూమిజకు=సీతకు, ఇచ్చెన్=ఇచ్చాడు.

**తా :** సీతజాడ కనిపెట్టడంలోనూ, ఉంగరం ఇవ్వడంలోనూ నువ్వు సమర్థుడవని నా కనిపిస్తోంది అంటూ శ్రీరాముడు నాకు ఉంగరాన్ని ఇచ్చాడు. ఇదిగో తీసుకో అని సీతకు ఇచ్చాడు.

**ఉ. ఇచ్చినఁ జూచి, ధరణీశ్వరు ముద్రికఁగా నెఱింగి, తా**
**నిచ్చను మెచ్చి యా కువలయేక్షణ యాత్మ గతంబునందు నీ**
**వచ్చినదాని భావమును, వల్లభు చందము నేర్పడంగ, నేఁ**
**జెచ్చెర నంతయుం దెలియఁ జెప్పుము నమ్మిక పుట్టునట్లుగన్. 95**

**ప్రతి :** ఇచ్చినన్=ఇవ్వగా, చూచి, రామధరణీశ్వరు=రామరాజు, ముద్రికగాన్=ఉంగరముగా, ఎఱింగి= గుర్తించి, తాను, ఇచ్చనుమెచ్చి=మనసులో మెచ్చుకుని, ఆ కువలయేక్షణ=ఆ కువలయ+ఈక్షణ=కలువలవంటి కన్నులు గల సీత, ఆత్మ గతంబునందు=మనసులో, నీ వచ్చినదాని భావమును=నీ రాకకు గల ఆలోచన, వల్లభుచందమున్=రాముని వివరాలు, నే=నేను, ఏర్పడంగన్= తెలియనట్లుగా, చెచ్చెరన్=వేగంగా, అంతయున్=విషయమంతా, తెలియన్= తెలియునట్లు చెప్పుము, నమ్మిక పుట్టునట్లుగన్=నమ్మకము కలిగే విధముగా.

**తా :** ఇచ్చిన ఉంగరం చూసింది. శ్రీరాముని ఉంగరమే అని గుర్తించింది. మనసులో ఆనందించి మెచ్చుకుని హనుమతో నువ్వు వచ్చిన కారణం, శ్రీరాముని వివరాలు అన్నీ నాకు తెలిసేలా వేగంగా చెప్పు. నమ్మకం కలిగేలా చెప్పు అని అడిగింది-సీత.

**వ. అని విచారించి యిట్లనియె. 96**

**ప్రతి :** అని విషయం అడిగి ఇలా అన్నది.

**క. నిను విశ్వసింపఁ జాలను**
**వినుపింపుము నీ తెఱంగు, విభుని విధము నా**
**కనవుడుఁ బావని తెలియఁగ**
**వినయంబున విన్నవించె విస్ఫుట ఫణితిన్. 97**

**ప్రతి :** నిను=నిన్ను, విశ్వసింపన్, చాలను=నమ్మలేను,నీతెఱంగు=నీ విషయమంతా, వినుపింపుము= వినిపించు, విభుని విధము=నాభర్త రాముని విషయము నాకు, అనవుడున్=అనగా, పావని=హనుమ, వినయంబున=వినయంతో, తెలియఁగ=తెలిసే విధంగా, విస్ఫుట ఫణితిన్-స్ఫుటమయిన పద్ధతిలో, విన్నవించె= విన్నవించాడు.

**తా :** నిన్ను నేను నమ్మలేను, నీ సంగతి ముందు చెప్పు. శ్రీరాముడు ఎలా ఉన్నాడు? ఎక్కడ ఉన్నాడు? ఆ విషయాలన్నీ చెప్పు అని అడిగింది సీత. అప్పుడు హనుమ వినయంతో విషయాలన్నీ స్పష్టంగా విన్నవించాడు.

**ఉ. రాముని డాఁగురించి, నిను రావణుఁ డెత్తుక వచ్చువేళ, నీ**
**హేమ విభూషణావళుల నేర్పడ ఋష్య మహాద్రి వైచినన్**
**మే మవి తీసి దాఁచితిమి, మీపతి యచ్చటి కేఁగుదేరఁగాఁ**
**దామరసాప్త నందనుఁడు తా నవి సూపినఁ జూచి మెచ్చుచున్. 98**

**ప్రతి :** రాముని, డాఁగురించి=మోసగించి, నిను రావణుఁడు, ఎత్తుక వచ్చువేళ, నీ, హేమవిభూషణా వళులన్=బంగారు నగల సమూహాన్ని, ఏర్పడ=కనబడునట్లు, ఋష్యమహాద్రిన్=ఋష్యమూక పర్వతంమీద, వైచినన్=పడవేయగా, మేము, అవి, తీసి, దాఁచితిమి, మీ పతి=మీ భర్త రాముడు, అచ్చటకిన్=ఋష్యమూక

పర్వతం మీదకి, ఏఁగుదేరఁగాన్=రాగా, తామరసాప్త నందనుడు=సూర్యపుత్రుడు సుగ్రీవుడు, తాన్=తాను, అవి, చూపినన్, చూచి, మెచ్చుచున్.

**తా :** రాముణ్ణి మోసగించి రావణుడు నిన్ను ఎత్తుకుపోయేటప్పుడు నీవు నీ బంగారు నగలన్ని ఋష్యమూక పర్వతం మీద పడవేసావు. మేము వాటిని తీసి దాచాము. రాముడు అక్కడికి వచ్చినప్పుడు సుగ్రీవుడు ఆ నగలను చూపించాడు. రాముడు ఆ నగలు చూచి మెచ్చుకుంటూ!

**సీ. అర్క సంభవునకు నభయంబు దయచేసి**
**దుందుభి కాయమ్ముఁ దూలఁ దన్ని,**
**యేడు తాడుల సర్వ మేకమ్ముగాఁ ద్రుంచి**
**వాలి నద్భుతశక్తిఁ గూల నేసి,**
**సుగ్రీవునకుఁ దార సుదతిగా నిప్పించి**
**యంగదు యువరా జనంగ నిలిపి,**
**వారలతోడను వానర సైన్యంబు**
**లెన్నేని గొలువంగ నేఁగు దెంచి,**

**తే. మాల్యవంతంబునం దుండి,మనుజ విభుఁడు**
**నిన్ను వెదుకంగ నందఱ నన్ని దిశలఁ**
**బనుచునప్పుడు, దక్షిణ భాగ మరయ**
**నంగదునితోడఁ గొందఱ మరుగుదేర. 99**

**ప్రతి :** అర్కసంభవునకున్=సూర్యపుత్రుడు సుగ్రీవునకు, అభయంబు దయచేసి=(అభయమిచ్చి) దుందుభికాయమ్మున్=దుందుభి అనే రాక్షసుని శరీరాన్ని, తూలన్ తన్ని=తూలిపోవునట్లు తన్ని, ఏడుతాడుల= ఏడు తాటిచెట్లను, సర్వము=అన్నిటినీ, ఏకమ్ముగాన్=ఒకేసారి, త్రుంచి=పడవేసి, వాలిన్=వాలిని, అద్భుతశక్తిన్, కూలన్+ఏసి=పడగొట్టి, సుగ్రీవునకున్, తార=తారను, సుదతిగాన్=స్త్రీగా భార్యగా, ఇప్పించి=ఏర్పాటు చేసి, అంగదు=అంగదుని, యువరాజు, అనంగ, నిలిపి, వారలతోడను వారితో, వానరసైన్యంబులు, ఎన్నేని= లెక్కకుమించి, కొలువంగన్, ఏగుదెంచి=వచ్చి, మాల్యవంతంబునందు, ఉండి, మనుజవిభుండు=రాముడు, నిన్ను వెదుకంగన్, అందఱన్, అన్ని, దిశలన్, పనుచునప్పుడు=పంపే సమయంలో, దక్షిణభాగము, అరయన్= వెదకుటకు, అంగదుని తోడన్, కొందఱము, అరుగుదేర=రాగా!

**తా :** సుగ్రీవునికి అభమిచ్చి, దుందుభి కళేబరాన్ని తన్ని, ఏడుతాటి చెట్లను ఒక్క బాణంతో కూలగొట్టి, అద్భుతమైన శక్తితో వాలిని కూలవేసి, తారను సుగ్రీవునికి భార్యగా చేసి, అంగదుని యువరాజుగా చేసి, లెక్కలేని వానరసైన్యాలు కొలుస్తూ ఉండగా మాల్యవంతానికి వచ్చి-అక్కడ నుండి రాముడు నిన్ను వెదకడానికి, అందఱినీ అన్ని దిశలకు పంపాడు. దక్షిణదిక్కులో వెదకడానికి అంగదునితో కలసి మేము కొందరము వచ్చాము.

తే. వారి పంపున నవలీల వార్ధి దాఁటి
వచ్చి సకలంబుఁ జూచి యీ వంకఁ గంటి
రావణుఁడు వచ్చి నిన్ను నుగ్రంబుగాఁగఁ
బలుకునప్పుడు నున్నాఁడఁ బాదపమున. 100

**ప్రతి :** వారి పంపునన్=వారి ప్రోత్సాహంతో, అవలీలన్=తేలికగా, వార్ధిదాటి=సముద్రందాటి, వచ్చి, సకలంబున్=అంతటా, చూచి, ఈ వంకన్=ఇక్కడ, కంటి=చూసాను, రావుణుఁడు, వచ్చి, నిన్నున్, ఉగ్రంబుగాఁగన్=కోపంతో, పలుకు నప్పుడున్=మాట్లాడే సమయములో, పాదపమునన్=చెట్టుమీద, ఉన్నాడ=ఉన్నాను.

**తా :** అంగదాదులు ఇచ్చిన ప్రోత్సాహంతో నేను సముద్రం అవలీలగా దాటి వచ్చాను. లంకలో అంతా చూసాను. ఇక్కడ నిన్ను చూసాను. రావణుడు వచ్చి నీతో కోపంగా సంభాషిస్తున్నప్పుడు నేను ఈ చెట్టుపై ఉన్నాను.

## హనుమంతుఁడు శ్రీరాముని శోభన గుణములను వర్ణించుట

వ. ఇవ్విధంబున బలుకుచుండినను నమ్మక యతనిం గనుంగొని రాముఁడే రీతివాఁడో యతని చందం బెఱింగింపు మనవు డా వాయునందనుండు, రఘునందనునకు వందనం బాచరించి, భూమి నందన కిట్లని చెప్పుచున్నాఁడు. 101

**ప్రతి :** ఇవ్విధంబునన్=ఈ విధముగా, పలుకుచుండినను=చెప్తున్నప్పటికి, నమ్మక, అతనిన్, కనుంగొని=చూచి, రాముఁడు, ఏ రీతివాఁడో=ఎలాంటివాడో, అతని, చందంబు, రూపము ఎఱింగింపుము=తెలియజెప్పుము, అనవుడు=అనగా, ఆ, వాయునందనుండు, రఘునందనునకు=రామునకు, వందనం బాచరించి= నమస్కరించి, భూమినందనకున్=సీతతో, ఇట్లని=ఈ విధంగా, చెప్పుచున్నాఁడు=చెప్తున్నాడు.

**తా :** రాముని వివరాలు ఇంతగా చెప్పినా సీతకు నమ్మకం కుదరక, రాముడు ఎలాంటివాడు, అతని రూపం ఎలాంటిదో చెప్పు అని అడుగగా హనుమ శ్రీరామునికి నమస్కరించి సీతతో ఈ విధంగా చెప్తున్నాడు.

సీ. నీలమేఘ చ్ఛాయఁబోలు దేహమువాఁడు
ధవళాబ్జ పత్ర నేత్రములవాఁడు
కంబు సన్నిభమైన కంఠంబు గలఁవాడు
చక్కని పీన వక్షంబువాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘ బాహులవాఁడు
ఘనమైన దుందుభి స్వనమువాఁడు
పద్మ రేఖలు గల్గు పద యుగంబులవాఁడు
బాగైన యట్టి గుల్ఫములవాఁడు

**తే. కపట మెఱుఁగని సత్య వాక్యములవాఁడు**
**రమణి! రాముండు శుభ లక్షణములవాఁడు**
**ఇన్ని గుణముల రూపింప నెసఁగువాఁడు**
**వరుస సౌమిత్రి బంగారు వన్నె వాఁడు. 102**

**ప్రతి :** నీలమేఘచ్ఛాయన్=నీలమేఘాల కాంతితో, పోలు=పోలిన, దేహమువాఁడు=శరీము కలవాడు, ధవళాబ్జ పత్రనేత్రములవాఁడు=తెల్ల కలువ రేకులవంటి కన్నులు కలవాడు, కంబు సన్నిభమైన=శంఖముతో సరియైన, కంఠంబు, కలవాఁడు=కలిగినవాడు, చక్కని=చక్కని, పీనవక్షంబువాఁడు=బలసిన వక్షస్థలము కలవాడు, తిన్ననై కనుపట్టు=వంకర లేకుండా తిన్నగా కనబడే, దీర్ఘబాహులవాఁడు=పొడవైన బాహువులు గలవాడు, ఘనమైన=గొప్పదైన, దుందుభి=భేరీవాద్యము, స్వనమువాఁడు=కంఠధ్వని కలవాడు, పద్మరేఖలు= పద్మములవంటి రేఖలు, కల్గు=కలిగిన, పద యుగంబులవాడు=రెండు పాదములు కలిగినవాడు, బాగైనయట్టి=అందమయినట్టి, గుల్ఫములవాడు=చీలమండలు గలవాడు, కపట మెఱుఁగని=మోసము తెలియని, సత్యవాక్యములవాఁడు=సత్యమే పలుకువాడు, రమణి=అందమయిన సీతా!, రాముండు= శ్రీరాముడు, శుభలక్షణములవాడు=శుభమయిన లక్షణాలు గలవాడు, ఇన్ని గుణముల=ఇప్పుడు చెప్పిన గుణములన్నీ, రూపింప=నిరూపింపగా, ఎసగువాడు=ఒప్పునట్టివాడు, వరుస, సౌమిత్రి, బంగారు వన్నెవాఁడు=బంగారురంగు గలవాడు.

**తా :** నీలమేఘచ్ఛాయ గల శరీరము గలవాడు, తెల్లని కలువరేకులవంటి కన్నులు గలవాడు, శంఖం వంటి కంఠం గలవాడు, చక్కని బలిసిన వక్షస్థలం కలవాడు, తిన్నగా ఉన్న బాహువులు గలవాడు, భేరీనినాదం వంటి కంఠస్వరం కలవాడు, అరికాళ్లలో పద్మ చిహ్నాలుగల పాదాలవాడు, చక్కని చీలమండలు గలవాడు, మోసమనేదే తెలియని సత్యవాక్యాలవాడు అయిన రాముడు అన్నీ శుభలక్షణాలు గలవాడు. ఈ చెప్పిన గుణాలన్నీ వరుసగా తనయందు కూడా గలవాడు. శరీరచ్ఛాయ మాత్రం బంగారువన్నె కలిగినవాడు సౌమిత్రి. రామలక్ష్మణులకు వన్నె మాత్రమే తేడా.

**విశే :** శ్రీరామ సౌందర్యాన్ని హనుమ వర్ణిస్తున్నాడు. హనుమతో గొంతు కలిపి మొల్ల కూడా వర్ణిస్తున్నది. ఈ వర్ణనకు శ్రోత శ్రీరామపత్ని సీత. ఈ సన్నివేశంలో మొల్ల రాముని శుభలక్షణాలన్నీ అందంగా వరుసగా చెప్పింది. అయితే లక్ష్మణుడు ఎలా ఉంటాడు అని సీత అడిగే అవకాశం ఇవ్వకుండా సౌమిత్రిని గురించి కూడా ఒక్క వాక్యంలో చెప్పింది.

సంక్షిప్తంగా వ్రాయాలి అన్నది మొల్ల ప్రణాళిక. ఎంత అందంగా సంక్షిప్తీకరించవచ్చో ఈ పద్యంలో చూపింది. ఇన్ని గుణముల రూపింప నెసగువాడు–రామునిలోని గుణాలన్నీ సౌమిత్రిలోకూడా ఉన్నాయని నిరూపించవచ్చు. ఒక్కశరీరం మాత్రం 'బంగారు వన్నె' అంటూ జంట బాయని ఆ అన్నదమ్ములిద్దరినీ ఒకే సీసపద్యంలో రూపు కట్టించింది మొల్ల.

ఆంధ్రలోకంలో చాలా ప్రాచుర్యంలోకి వచ్చిన మొల్ల రామాయణంలోని పద్యాలలో ఇది ఒకటి. శారీరక సౌందర్యం వివరంగా చెప్పి–శ్రీరాముని శీల సౌందర్యాన్ని–కపట మెరుగని సత్యవాక్యములవాడు అని చెప్పడం మొల్ల ప్రతిభకు నిదర్శనం.

**తే. ఉరుతరాటవిలోన మహోగ్రతపము**
**వాయుదేవుని గుఱియించి వరుసఁ జేసి**
**యంజనాదేవి గనియె నన్నర్థితోడ**
**నర్కజుని మంత్రి, హనుమంతుఁ డంద్రు నన్ను. 103**

**ప్రతి :** ఉరుతరాటవిలోన=భయంకరమైన అడవిలో, మహోగ్రతపము=విశేషమయిన తపస్సు, వాయుదేవుని, గుఱియించి=ఉద్దేశించి, వరుసన్=చాలారోజులు, చేసి, అంజనాదేవి, కనియె=కన్నది, నన్ను, అర్థితోడన్=ప్రార్థించి, అర్కజునిమంత్రి=సుగ్రీవుని మంత్రిని, హనుమంతుడు, అంద్రు=అంటారు, నన్ను.

**తా :** భయంకరమైన అడవిలో ఘోరమైన తపస్సు వాయుదేవుని గుఱించి వరుసగా పెక్కుదినాలు చేసి వాయుదేవుణ్ణి ప్రార్థించి నన్ను మా అమ్మ అంజనాదేవి కన్నది. నేను సుగ్రీవుని మంత్రిని. నన్ను హనుమంతుడు అంటారు.

**విశే :** సీత రాముణ్ణి గురించి చెప్పమంది. బుద్ధిమతాం వరిష్ఠుడయిన హనుమ అదే సందర్భంలో తన జన్మవృత్తాంతం కూడా చెప్పాడు. సీతకు తన మీద కూడా నమ్మకం కలిగించడానికి నా పేరు హనుమంతుడు అని చెప్పకుండా నన్ను హనుమంతుడు అంటారు, అనే విధంగా పేరు చెప్పే సంప్రదాయాన్ని పాటించాడు హనుమ.

**వ. అని యిట్లు తాత్పర్యంబునఁ బట్టునట్లుగా విన్నవించి దేవీ! నీ దేవుండయిన శ్రీరాముండు నాచేతి కిచ్చి యంపిన నూత్న రత్నాంగుళీయకంబు నీకు సమర్పించితి నింక రిక్త హస్తంబులతోఁ జనుట దూతల కుచితమైన కార్యంబు గాదు. కావున నిన్ను దర్శించి నందులకు శ్రీరామునకు నమ్మిక పుట్టునట్టులుగా నీ శిరోరత్నంబు నాకు దయచేయవలయు ననుటయు నా కుశేశయ నయన యిట్లనియె. 104**

**ప్రతి :** అని యిట్లు, తాత్పర్యంబునన్+పట్టునట్లుగా=విషయం అంతా సందేహం లేకుండా తెలిసేటట్లుగా, విన్నవించి=చెప్పి, దేవీ!, నీ దేవుండయిన=నీ భర్త అయిన, శ్రీరాముండు, నాచేతికిచ్చి, అంపిన=పంపిన, నూత్నరత్నాంగుళీయకంబు=కొత్త రత్నాల ఉంగరం, నీకు, సమర్పించితిని=ఇచ్చాను, ఇంక, రిక్తహస్తంబులతో=వట్టిచేతులతో, చనుట=వెళ్లుట, దూతలకు, ఉచితమైన కార్యంబుకాదు=తగిన పనికాదు, కావున, నిన్ను, దర్శించినందులకు=నిన్ను చూసినందుకు, శ్రీరామునకు, నమ్మిక పుట్టునట్టులుగా, నీ, శిరోరత్నము=చూడామణి, నాకు, దయచేయవలెననుటయు=ఇవ్వమనగా, ఆ కుశేశయనయన=నీటియందు ఉండునది పద్మము, పద్మనయన, ఇట్లనియె.

**తా :** హనుమంతుడు విషయమంతా పూర్తిగా అవగతమయ్యే విధంగా చెప్పాడు. ఓ దేవీ! నీ భర్త రాముడు నా చేతికిచ్చిన ఆనవాలు ఉంగరం తెచ్చి నీకు సమర్పించాను. ఇప్పుడు శూన్యహస్తాలతో తిరిగి వెళ్లడం దూతలకు తగినపని కాదు కనుక, నేను నిన్ను చూసాను అని రామునికి నమ్మకం కలిగేలా నీ చూడామణి నాకు ఇవ్వలవలసినది అని కోరాడు. అప్పుడు పద్మనయన అయిన సీత ఇలా అన్నది.

## సీత తన చూడామణి నానవాలుగ హనుమంతునకు నిచ్చుట

**క.** **నా నాథు క్షేమ మంతయు**
**ధీనిధి! నీచేత వింటిఁ దెలియుగ, నైనన్**
**నీ నిజ రూపము చూడక**
**నే నా రత్నంబు నమ్మి నీ కీయఁ జుమీ!** **105**

**ప్రతి :** నా నాథుక్షేమమంతయు=నా భర్త క్షేమసమాచారమంతా, ధీనిధి!=ఓ బుద్ధిమంతుడా!, నీచేత వింటిఁదెలియుఁగ=పూర్తిగా తెలిసేలా నీవల్ల విన్నాను, ఐనన్=అయినప్పటికీ, నీ, నిజరూపము= అసలు స్వరూపము, చూడక=చూడకుండా, నేనారత్నంబు=నేను ఆ చూడామణిని, నమ్మి=నిన్ను నమ్మి, నీకీయన్చుమీ=నీకు ఇయ్యను సుమా!

**తా :** ఓ బుద్ధిమంతుడా! నా భర్త క్షేమసమాచారాలను నీవల్ల పూర్తిగా విన్నాను. అయినా నీ అసలు రూపం చూడకుండా నా చూడామణిని నీకు ఇవ్వను సుమా!

**విశే :** సీతాదేవి వ్యవహారదక్షత, మొల్ల కందువమాట ఈ పద్యంలో ఉన్నాయి. నీ కీయన్ జుమీ! అన్నది భావవ్యక్తీకరణకు ప్రయోగించే అచ్చమైన తెలుగుమాట.

**వ.** **అనుటయు నా హనుమంతుడు.** **106**

**తా :** సీత అలా అనగా ఆ హనుమంతుడు –

## ఆకసమంతఁ బెంచిన హనుమ రూపము

**క.** **చుక్కలు తల పూవులుగా**
**నక్కజముగ మేను వెంచి యంబర వీథిన్**
**వెక్కసమై చూపట్టిన**
**నక్కోమలి ముదము నొందె నాత్మస్థితికిన్.** **107**

**ప్రతి :** చుక్కలు=ఆకాశంలోని నక్షత్రాలు, తలపూవులుగాన్=తలలో పువ్వులవలె భాసించే విధంగా, అక్కజముగ= ఆశ్చర్యంగా, మేను పెంచి=శరీరంపెంచి, అంబర వీథిన్=ఆకాశ వీథిలో, వెక్కసమై=వింతయై, చూపట్టినన్= కనబడగా, అక్కోమలి=ఆ కోమలి సీత, ఆత్మస్థితికిన్=తన ఆత్మలో, ముదమున్=ఆనందమును, ఒందె=పొందెను, ఎంతో ఆనందించింది.

**తా :** ఆకాసవీథిలో చుక్కలు తలలో పెట్టుకున్న పువ్వులుగా ఒప్పేటంత ఎత్తుగా ఆశ్చర్యపడేలా శరీరాన్ని పెంచాడు. వింతగా తోచిన ఆ దృశ్యాన్ని చూచి సీతాదేవి తన ఆత్మలో ఎంతో ఆనందించింది.

**విశే :** చాలా ఎత్తుకి ఎదిగాడు అని చెప్పడానికి దేనితోనయినా ఉపమానంగా చెప్పవచ్చు. అలాకాకుండా నక్షత్రాలు తల్లో పెట్టుకున్న పువ్వులా అయ్యేట్లు ఎదిగాడు అని, చక్కని వర్ణన చేసింది. అంటే నక్షత్ర మండలం వరకు ఎదిగిపోయాడు అని. ఈ సందర్భంలో ఆంజనేయస్వామి వెక్కసమై చూపట్టిన అంది మొల్ల – వెక్కసమై అంటే వాడుకలో ఇంక చాలు అనే అర్థంలో వ్యవహారం ఉంది. ఇక్కడ–సీత నీరూప మహిమ నేను సంతృప్తిగా చూసాను అనిపించే విధంగా చూపట్టాడట. ఆ రూపాన్ని చూసిన సీత ఆత్మలో ఆనందం పొందింది. పదినెలలుగా ఆమె మనస్సు దుఃఖిస్తూనే ఉంది. ఈ క్షణంలో ఆనందం పొందింది. హనుమ ఈ విశ్వరూపాన్ని, సీత పొందిన ఆత్మానందాన్ని మొల్ల చిన్న కందపద్యంలో చూపించింది. హనుమది విశ్వరూపం మొల్లది కవితా విశ్వరూపం.

**వ. ఇట్లు తన మహోన్నత రూపంబు చూపి యెప్పటియట్ల మరల సూక్ష్మ రూపంబు గైకొని నమస్కరించిన, నా హనుమంతునకు నద్దేవి తన శిరోరత్నంబు ననుగ్రహించి యిట్లనియె. 108**

**ప్రతి :** ఇట్లు=ఈ విధంగా, తన మహోన్నతరూపంబు=తనయొక్క చాలా పెద్ద రూపాన్ని, చూపి, ఎప్పటియట్ల= ఎప్పుడూ ఉన్నవిధంగానే, మరల, సూక్ష్మరూపంబు గైకొని=చిన్న రూపాన్ని స్వీకరించి, నమస్కరించినన్, ఆ హనుమంతునకున్, ఆ+దేవి=అద్దేవి – ఆ సీత, తన శిరోరత్నంబున్=తన నెత్తిమీది అలంకారమగు రత్నమును, అనుగ్రహించి=ఇచ్చి, ఇట్లు, అనియె.

**తా :** ఇలా తన గొప్పరూపాన్ని చూపించి, తిరిగి సూక్ష్మరూపంగా మారి నమస్కరించిన హనుమకు సీతాదేవి తన శిరోరత్నాన్ని ఇచ్చి ఇలా చెప్పింది.

## శ్రీరామునకు సీత సందేశము

**చ. రవికుల వార్థిచంద్రుఁడగు రాముని సేమము చాల వింటి, నా**
**వివిధము లైన పాట్లు పృథివీపతికిం దగఁ జెప్పఁగల్గె నేఁ**
**డవిరళభంగి నీ వలన, నచ్చుగ నే నుపకార మేమియుం**
**దవిలి యొనర్ప లేను వసుధాస్థలి వర్థిలు బ్రహ్మ కల్పముల్. 109**

**ప్రతి :** రవికులవార్థి చంద్రుడగు=సూర్యవంశము అనే సముద్రానికి చంద్రుడయిన, రామునిసేమము= శ్రీరామునియొక్క క్షేమము, చాలవింటి= చాలావిన్నాను, నా=నాయొక్క, వివిధములైన=రకరకములైన, పాట్లు=కష్టాలు, పృథివీపతికిన్=రాజుకి (రామునికి), తగన్+చెప్పన్+కల్గె=తగినవిధంగా చెప్పే అవకాశం లభించింది, నేఁడు=ఈనాడు, అవిరళభంగి=వివరణాత్మకంగా (తక్కువ లేకుండా), నీ వలనన్=నీవల్ల, అచ్చుగన్=ఈ ఋణం తీర్చడానికి, నేను, ఉపకార మేమియున్, తవిలి=తిరిగి, ఒనర్పలేను=చేయలేను, వసుధాస్థలిన్= భూమిమీద, బ్రహ్మకల్పముల్=బ్రహ్మకల్పముల వరకు, వర్థిల్లుము=సుఖముగా ఉండుము.

**తా :** శ్రీరాముని క్షేమసమాచారాలు నీవల్ల చాలా విన్నాను. నేను ఇక్కడ పడుతున్న వివిధములైన పాట్లు వివరంగా శ్రీరామునికి చెప్పే అవకాశం లభించింది నీవల్ల. నీ ఋణం తీర్చుకోలేను. కానీ నీవు బ్రహ్మకల్పము లున్నంత కాలం భూమిమీద వర్ధిల్లు. చిరంజీవివి కమ్ము! అని దీవించింది.

**వ. ఇట్లు దీవించి మఱియును. 110**

**తా :** ఈ విధంగా ఆశీర్వదించి, ఇంకను –

**క. ఏ యెడఁ జూచిన ధరణీ**
**నాయకు శ్రీపాద యుగము నా చిత్తములోఁ**
**బాయ దని విన్నవింపుము**
**వాయు తనూభవుఁడ! పుణ్యవంతుఁడ! తెలియన్! 111**

**ప్రతి :** ఏయెడన్=ఏపక్కగా, చూచిన=చూసినా, ధరణీనాయకు=భూపాలకుడయిన శ్రీరాముని, శ్రీపాదయుగము=సౌభాగ్యవంతములయిన రెండు పాదములు, నా, చిత్తములోన్=మనస్సులో, పాయదని= వదలిపోదు అని, వాయుతనూభవుఁడ=హనుమంతుడ!, పుణ్యవంతుఁడ!=పుణ్యం చేసుకున్నావాడా, తెలియన్=తెలియునట్లుగ, విన్నవింపుము=చెప్పుము.

**తా :** హనుమంతా! పుణ్యవంతుడా! ఎటుచూసినా శ్రీరాముని శ్రీపాదయుగళి నా మనస్సులో నుండి తొలగిపోదని శ్రీరామునకు తెలియ చెప్పుము.

**విశే :** సీతాదేవి రామునికి పంపే సందేశంలోని మొదటి మాట శ్రీరాముని శ్రీపాదయుగళి మనస్సులో స్థిరముగా ఉంది అన్న విషయం. సీతారాముల దాంపత్యంలోని మహత్వ మిది. ఎక్కడ ఉన్నా, ఎలా ఉన్నా, ఎటుచూసినా, ఏమి చూసినా – సీత మదిలో రామపాదాలు నిరంతరం కొలువై ఉంటాయన్నది సత్యం.

**తే. ఇపుడు రావణుఁ డేతెంచి కపట బుద్ధి,**
**గర్వమునఁజేసి నన్నెన్ని కాఱులాడె,**
**నన్నియును నీవు చెవులార విన్న తెఱఁగు**
**పతికి దయ పుట్టఁగా విన్న పంబు సేయు. 112**

**ప్రతి :** ఇప్పుడు, రావణుఁడు, ఏతెంచి=వచ్చి, కపటబుద్ధి=మోసపు టాలోచనలతో, గర్వమునన్, చేసి, నన్ను, ఎన్నెన్ని=ఎన్నివిధములుగా, కాఱులాడెన్=దుర్భాషలు మాట్లాడాడో, అన్నియును, నీవు, చెవులారా విన్నతెఱగు=చెవులతోవిన్న విధమంతా, పతికిన్=భర్తకు, దయపుట్టఁగా=దయ కలిగేలా, విన్నపంబు సేయు=వివరించి చెప్పుము.

**తా :** ఇప్పుడు కపటబుద్ధి గల రావణుడు వచ్చి గర్వంతో నన్ను ఎన్నెన్ని దుర్భాషలాడాడో నువ్వు చెవులారా విన్నవన్నీ నా భర్తకు దయగలిగేలా విన్నవించు.

సీ. నిడుద పెన్నెఱివేణి జడలుగా సవరించి
మలిన జీర్ణాంబరం బొలియఁ గట్టి,
భూమీరజంబు విభూతి పూఁతగఁ బూసి
తన పతిమూర్తిఁ జిత్తమున నిల్పి,
నిరశన స్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారక బ్రహ్మ మంత్రంబుఁ బఠింపుచుఁ
గఠిన రాక్షస దుర్మృగములలోన

తే. నహిత లంకా మహా ద్వీప గహన సీమఁ
దపము సేయుచున్నాను దన్నుఁ గూర్చి,
నాకుఁ బ్రత్యక్ష మగు మని నాథునకును
విన్నవింపుము సత్త్వ సంపన్న! నీవు. 113

**ప్రతి :** నిడుదపున్=పొడవయిన, నెఱివేణి=అందమయిన జుట్టును, జడలుగా, సవరించి=చేసి (మట్టిపాలు రాసుకుని జుట్టు జడలుజడలుగా చేసుకుంటారు), మలిన=మాసిన, జీర్ణాంబరంబు=చిరిగిన బట్ట, ఒలియన్=జారిపోవునట్లు, కట్టి, భూమిరజంబు=నేలమీద ధూళి, విభూతి పూతగన్=విభూతిగా, పూసి=పూసుకొని, తన పతిమూర్తిన్=తన భర్త రూపాన్ని, చిత్తమున=మనస్సులో, నిల్పి=నిలుపుకొని, నిరశనస్థితితోడ=ఉపవాస దీక్షతో, నిలిచి=ఉండి, భూశయ్యను=భూమినే పడకగా, పవళించి=పడుకొని, నిదుర=నిద్ర, ఏర్పడగ=పూర్తిగా, విడిచి=వదలి, తారక బ్రహ్మమంత్రంబున్, పఠింపుచున్=చదువుతు, కఠిన రాక్షస=ఘోరమైన రాక్షసుల, దుర్మృగములలోన=దుష్ట జంతువుల మధ్యలో, అహిత=ఇష్టములేని (శత్రుసంబంధమైన), లంకామహాద్వీపగహనసీమ=లంకామహాద్వీపమనే అరణ్యంలో, తపము చేయుచున్, ఉన్నాను, తన్నున్=రాముని గూర్చి, నాకు, ప్రత్యక్షమగుమని=ఎదురుగా కనబడుమని, నాథునకును=నా భర్తకు, సత్త్వసంపన్న=బలసంపద గలిగినవాడా!, నీవు, విన్నవింపుము=మనవి చేయుము.

**తా :** నా పొడవైన జుట్టును జడలుగా చేసుకుని, మాసిన, చిరిగిన చీర కట్టుకుని, భూమిమీద ధూళినే విభూతిగా పూసుకుని, నా భర్తరూపాన్నే మనసులో నిలుపుకుని, ఆహారం తీసుకోకుండా, భూమినే శయ్యగా చేసుకుని నిద్రలేకుండా, తారక బ్రహ్మమంత్రము పఠిస్తూ, కఠినులైన రాక్షసుల, దుష్టమృగముల మధ్య ఇష్టపడని లంకామహాద్వీపమనే అడవిలో శ్రీరాముని గూర్చి తపస్సు చేస్తున్న నాకు ప్రత్యక్షమగు మని నా భర్తతో విన్నవించు, సత్త్వసంపన్నా!

**విశే :** తారకబ్రహ్మమంత్రము=రామనామమంత్రము. హనుమను సత్త్వసంపన్నా! అని సంబోధించింది సీతాదేవి. ఇది సాభిప్రాయ విశేషణం. ఎంతటి సత్త్వసంపన్నుడు కాకపోతే నూరుయోజనాల సముద్రం అవలీలగా దాటి లంకలో ప్రవేశించగలడు? అందుకే అలా సంబోధించింది. ఇక సీత తాను లంకలో ఏం

చేస్తున్నదీ చెప్పిన రీతి చూస్తే – ఉన్న పరిస్థితులనే తపస్సుకు అనుగుణంగా చేసుకుని నామమంత్రజపం చేస్తూ తపస్సు సాగిస్తున్నానని చెప్పింది. తపస్సుకు ఫలమే రాముని క్షేమవార్తను పవన పుత్రుడు వచ్చి చెప్పడం. ఇక శ్రీరాముడు రావాలి. తపశ్శక్తి అంత మహత్త్వం గలది.

**వ. అని చెప్పి మఱియును. 114**

**తా :** ఆ విధంగా చెప్పి, ఇంకా

**చ. జనకుని భంగి రామ నృపచంద్రుని, నన్నును దల్లిమాఱుగాఁ**
**గని, కొలువంగ నేర్చు గుణగణ్యుని, లక్ష్మణు నీతిపారగున్**
**వినఁ గన రాని పల్కు లవివేకముచేతను బల్కినట్టి యా**
**వినుత మహాఫలం బనుభవించితి నంచునుఁ జాటి చెప్పుమా. 115**

**ప్రతి :** జనుకునిభంగి=తండ్రివలె, రామనృపచంద్రుని=శ్రీరామచంద్రుని, నన్నునున్= నన్ను, తల్లిమాఱుగా గని=తల్లికిమాఱుగా చూసుకుని, కొలువంగ నేర్చు=సేవించడం నేర్చిన, గుణగణ్యుని=లెక్కింపదగిన గుణవంతుని, లక్ష్మణు=లక్ష్మణుని, నీతి పారగున్=నీతివంతుని, వినఁ గన రాని పల్కులన్=వినరాని, కనరాని మాటలతో, అవివేకము చేతను=వివేకం లేకపోవడంచేత, పల్కినట్టి=పలకడం వల్ల, ఆ వినుత మహాఫలంబు=ఆ విశేషమయిన మహాఫలాన్ని, అనుభవించితిన్=అనుభవించాను, అంచున్=అని, చాటి చెప్పుమా!=గట్టిగా చెప్పుమా!

**తా :** రామచంద్రుని తండ్రిగా, నన్ను తల్లిగా భావించి మనసారా కొలువ నేర్చిన గుణగణ్యుడు, నీతిపారగుడు అయిన లక్ష్మణుని విన కన రాని మాటలు ఆనాడు అవివేకంతో పలికాను. అంత ఉత్తముని నిందించిన ఆ వినుత మహాఫలం అనుభవించానని అందరికి తెలిసేలా చాటి చెప్పు.

**విశే :** సీతామాతకు బహునాళ్లగా లక్ష్మణుని నిందించి రామునికోసం పంపినందుకు మనస్సులో విపరీతమైన బాధగా ఉంది. పశ్చాత్తాపభావంతో ఈ సందేశం హనుమతో పంపుతోంది.

'వినుత మహాఫలం' అనే సంస్కృత సమానం, 'వినగనరాని పల్కులు అనే'–తెలుగు మాటలు ఈ పద్యానికి గౌరవాన్ని కలిగించాయి. ఆనాడు లక్ష్మణునితో అన్నమాటలు ఏవో చెప్పకుండా 'వినగనరాని పల్కులు' అని ఔచిత్యం పాటించింది మొల్ల. సీతామాతకంఠనుండి గాని, మొల్లమాంబ గంటం నుండి గాని ఆ పరుషోక్తులు రాకపోవడమే ఉచితం.

**క. ఆ మాటలు మది నుంచక**
**నా మానముఁ గావు మనుచు నయవినయగుణో**
**ద్దాముఁడు రాముని తమ్ముఁడు**
**సౌమిత్రికిఁ జెప్పవయ్య సాహసివర్యా! 116**

**ప్రతి :** ఆ మాటలు=ఆనాడు నేను అన్నమాటలు, మదినుంచకన్=మనసులో పెట్టుకోక, నా మానమున్= నా గౌరవము, కావుము=రక్షించుము, అనుచు, నయవినయ గుణోద్దాముఁడు=నీతితో, వినయగుణములతో ఒప్పునట్టివాడు, రాముని తమ్ముడు, సౌమిత్రికిన్, చెప్పవయ్య, సాహసివర్యా!=సాహసులలో శ్రేష్ఠుడా!

**తా :** ఆనాటి నా మాటలు మనసులో పెట్టుకోక నా గౌరవము కాపాడమని నయవినయ గుణోద్దాముడైన రాముని తమ్మునికి, సౌమిత్రికి చెప్పవయ్య సాహసివర్యా! హనుమా!

**విశే :** సీతాదేవి లక్ష్మణుని నయవినయగుణోద్దాముడని హనుమను సాహసివర్యా! అనీ సంభావించడం ఆయా పాత్రల ఔన్నత్యాన్ని స్పష్టం చేయడమే.

వ. **అని యిట్లు జనకరాజతనయ పలికినపలుకు లాలకించి హనుమంతుండా జననితో నిట్లనియె. 117**

**తా :** సీత ఈ విధంగా పలికిన ఆ పలుకులు విని హనుమంతుడు ఆ తల్లితో ఈ విధంగా అన్నాడు.

క. **ఇనుఁడుదయింపక మున్నే**
**వననిధి లంఘించి, మనుజ వల్లభుకడకున్**
**నినుఁ గొనిపోయెద, వీఁపున**
**జననీ! కూర్చుండు మనిన, సంతోషమునన్. 118**

**ప్రతి :** ఇనుఁడు=సూర్యుడు, ఉదయింపకమున్నే=ఉదయించక ముందే, వననిధి= సముద్రము, లంఘించి= దాటి, మనుజవల్లభుకడకున్=మానవనాథుడయిన శ్రీరాముని వద్దకు, కొనిపోయెద=తీసుకుని వెళ్లిపోతాను, జననీ!=తల్లీ, వీపున=నా వీపుమీద, కూర్చుండుము, అనిన, సంతోషమునన్.

**తా :** తల్లీ! నా వీపుమీద కూర్చో సూర్యోదయం కాకుండా సముద్రం దాటి శ్రీరాముని వద్దకు తీసుకువెళతాను అన్న హనుమ మాటకు ఆనందంతో –

క. **నీ వంతవాఁడ వగుదువు**
**నీ వెంటనె వత్తునేని నెగడవు కీర్తుల్**
**రావణుకంటెను మిక్కిలి**
**భూవరుఁడే దొంగ యండ్రు బుధనుతచరితా!. 119**

**ప్రతి :** నీ వంతవాఁడవు=నీవు అంతటి కార్యం చెయ్యగలవాడవు, అగుదువు=కాగలవు, నీ వెంటన్, వత్తునేని= వచ్చినట్లయితే, కీర్తుల్, నెగడవు=వర్ధిల్లవు, రావణు కంటెను, మిక్కిలి, భూవరుఁడే=రాజైన రాముడే, దొంగ, అండ్రు=అందురు, బుధనుత చరితా!=పండితుల చేత పొగడబడిన చరిత్ర కలవాడా!

**తా :** బుధనుతచరితా! హనుమా! నువ్వు అంతటి కార్యం చేయ గలవాడవే. కాని నీవెంట నేను వచ్చినట్లయితే కీర్తులు ప్రసిద్ధి చెందవు. రావణుని కంటే రాముడే పెద్ద దొంగ అంటారు.

**విశే :** నీవంత వాఁడ వగుదువు – చక్కని తెలుగు నుడికారము.

**వ. అదియునుం గాక రామచంద్రునిం దప్ప నితరుల నంటుదానం గాను, గావున నీతో రాఁదగదు మఱియును. 120**

**తా :** అదీకాక నేను రాముని తప్ప ఇతరులను తాకను. కాబట్టి నీతో రావడం కుదరదు ఇంకా–

**క. దొంగిలి తెచ్చిన దైత్యుని**
**సంగడులగు వాని వారి సాహస మొప్పన్**
**సంగర ముఖమునఁ జంపక**
**దొంగిలి కొనిపోవఁ దగునె దొరలకు నెందున్? 121**

**ప్రతి :** దొంగిలి తెచ్చిన=దొంగిలించి తెచ్చిన, దైత్యుని=రాక్షసుని, సంగడులు=సంబంధములు, అగు=గల, వాని, వారి, సాహసమొప్పన్=సాహసము ప్రదర్శించి, సంగరముఖమునన్=యుద్ధరంగంలో, చంపక, దొంగిలికొనిపోవన్=దొంగిలించి తీసుకొనిపోవడం, దొరలకున్=ప్రభువులకు, ఎందున్=ఎక్కడైనా, తగునె=న్యాయమా?.

**తా :** దొంగిలించి తెచ్చిన రాక్షసుని శత్రు సంబంధం గలవానిని యుద్ధరంగంలో సాహసం ప్రదర్శించి సంహరించకుండా, దొంగిలించి తీసుకొని పోవడం ప్రభువులకు ఎక్కడైనా న్యాయమా?

**వ. మఱియు రామచంద్రుండు త్రిజగదేక వీరుండును, గోదండ దీక్షా గురుండును, రాక్షస కులాంతకుండును నగుటంజేసి రాణివాస ద్రోహి యగు రావణుని సంగరరంగంబునఁ బ్రఖ్యాతంబుగాఁ జంపి కొనిపోవుట ధర్మంబు: నీవు రామచంద్రునకుఁ బరమ భృత్యుండవును, బుత్త్రసముండవును నగుటంజేసి, నీ వెంట నరుగు దెంచుట తప్పుగాక బోయినను, బగ తీర్పక వచ్చు టుచితంబు గాదు. కావున రాఘవేశ్వరుల కిన్నియుం దెలియ విన్నపంబుసేసి తడయక తోడ్కొని రమ్మనిన నద్దేవికి నమస్కరించి హనుమంతుం డిట్లనియె. 122**

**ప్రతి :** మఱియు, రామచంద్రుండు, త్రిజగదేకవీరుండును=మూడు జగత్తులలో ఏకైకవీరుడు, కోదండదీక్షాగురుండు=కోదండదీక్షతో ఉన్నవాడు, రాక్షసకులాంతకుండును=రాక్షసకులాన్ని అంతం చేసేవాడు. అగుటంజేసి=అగుటవలన, రాణివాసద్రోహి=అంతపురకాంతలకుద్రోహంచేసివాడు, అగు=అయిన, రావణుని, సంగరరంగంబునన్=యుద్ధరంగంలో, ప్రఖ్యాతంబుగాన్=ప్రసిద్ధికెక్కిన విధంగా, చంపి, కొనిపోవుట, ధర్మంబు, నీవు, రామచంద్రునకున్, పరమ భృత్యుండవును=కూర్చు సేవకుడవును, పుత్త్రసముండవును=కొడుకుతో సమానమైనవాడవును, అగుటంజేసి=అగుటవలన, నీవెంటన్, అరుగుదెంచుట=వచ్చుట, తప్పు కాకబోయినను, పగతీర్పక=పగతీర్చకుండా, వచ్చుట, ఉచితంబుగాదు=తగినపని కాదు, కావున, రాఘవేశ్వరులకు=శ్రీరామునకు, ఇన్నియు=ఈ విషయాలన్ని, తెలియన్=తెలియునట్లు, విన్నపంబుసేసి= మనవి చేసి, తడయక=ఆలస్యం చేయకుండా, తోడ్కొని రమ్ము=కూడా తీసుకుని రమ్ము, అనిన, ఆ+దేవికి– అద్దేవికి=ఆ సీతకు, నమస్కరించి, హనుమంతుడు, ఇట్లనియె.

**తా :** అదికాక రాముడు త్రిజగదేకవీరుడు, కోదండదీక్షా గురుడు, రాక్షసకులాంతకుడు కావడంవల్ల, అంతఃపురకాంతలకు ద్రోహం చేసిన వాడయిన రావణుని యుద్ధంలో ప్రసద్ధికెక్కే విధంగా చంపి నన్ను తీసుకువెళ్లడం ధర్మము. నువ్వు శ్రీరామునకు కూర్చిన సేవకుడవు, పుత్రునితో సమానమైనవాడవు. అందువల్ల నీతో రావడం తప్పు కాకపోవచ్చు. అయినా పగ తీర్చకోకుండా ఇక్కడ నుండి రావడం తగిన పనికాదు. కాబట్టి శ్రీరామునికి ఈ విషయాలన్నీ మనవి చేసి ఆలస్యం చేయకుండా నీతోకూడా తీసుకొనిరా అన్నది సీత. హనుమ ఆ దేవికి నమస్కరించి ఇట్లా అన్నాడు.

**విశే :** సీతాదేవి శ్రీరాముని కీర్తి వర్ధిల్లే కోణంలో ఆలోచించిన విధానం, రావణసంహార ఆవశ్యకత ఈ వచనంలో మొల్ల సీతాముఖంగా ఆవిష్కరించింది.

**ఉ. నీ విభుఁ డబ్ధి దాఁటి, ధరణీతల నాథులు సన్నుతింప, సు**
**గ్రీవ సుషేణ ముఖ్య బల బృందముతో నరుదెంచి, నీచునిన్**
**రావణు నాజిలోఁ దునిమి, రాజస మొప్పఁగ నిన్నుఁ గొంచు, సే**
**నావళితోడ నీ పురికి నారయ నేఁగు నిజంబు నమ్ముమా!. 123**

**ప్రతి :** నీ విభుఁడు=నీ భర్త, అబ్ధి=సముద్రము, దాఁటి, ధరణీతలనాథులు=భూలోకంలోని రాజులు, సన్నుతింప=స్తుతింపగా, సుగ్రీవ, సుషేణ ముఖ్య బలబృందముతోన్=సుగ్రీవుడు, సుషేణుడు మొదలైన బలసమూహాలతో, అరుదెంచి=వచ్చి, నీచునిన్, రావణున్, ఆజిలో=యుద్ధంలో, తునిమి=సంహరించి, రాజస మొప్పఁగ=ఠీవిగా, నిన్నున్, కొంచు, సేనావళితోడ=సేనాసమూహంతో, నీ పురికిన్=నీపట్టణానికి, ఆరయ నేఁగు=చూచుచుండగ వెళ్లును, నిజంబు, నమ్ముమా!

**తా :** నీ భర్త సముద్రం దాటి రాజులందరూ కొనియాడే విధంగా సుగ్రీవుడు సుషేణుడుతో, ముఖ్య బలాలతో వచ్చి నీచుడైన రావణుని యుద్ధంలో చంపి, నిన్ను తీసుకుని ఠీవిగా సేనావళితో కూడా అందరూ చూస్తూ ఉండగా మీ పట్టణానికి వెళ్తాడు. ఇది నిజము. నమ్ముము.

**వ. అని విన్నవించి నమ్రుండై యద్దేవిచేత దీవెనలు పొంది, మరలి చనుచున్న వాఁడై తనరాక రావణున కెఱుంగఁజేయవలయు ననితలంచి. 124**

**తా :** అని వినయంతో చెప్పి ఆ సీతాదేవి దీవెనలు పొంది తిరిగి వెళుతున్నవాడు తనరాక రావణునికి తెలియజేయాలి అనుకొని.

## హనుమంతుని విక్రమ విహారము

**సీ. మేదినిసమముగా మేడలు గావించి**
**కేళీ గృహంబుల నేలఁ గలిపి,**
**కమలాకరంబులు కలఁచి గారలు వెట్టి**
**వృక్ష జాతంబుల విఱుగఁ దన్ని,**

**పుష్ప గుచ్ఛంబులు పుణికి పాఱఁగ వైచి**
**తేనెలు రాల్చి పూఁదేనె లుడిపి**
**పొదరిండ్ల పొదవులు చదియఁగా నుగ్గాడి**
**చప్పరంబుల నేల చదునుజేసి,**

**తే. వనముఁ గాచెడి రాక్షస వర్గములను**
**వీర వరులను, నెనిమిదివేలఁ జంప,**
**సీతఁ గాచెడి రాక్షస స్త్రీలు బెదిరి**
**పాఱిపోయిరి రావణుపాలి కంత. 125**

**ప్రతి :** మేదిని=భూమితో, సమముగా, మేడలు గావించి=మేడలను చేసి, కేళీ గృహంబుల=విహార గృహాలను, నేలన్ కలిపి=నేలలో కలిపి, కమలా కరంబులు=తామరకొలనులను, కలఁచి=కలచివేసి, కారలు వెట్టి=పీడించి, వృక్షజాతంబులన్= రకరకాల చెట్లను, విఱుగన్, తన్ని, పుష్ప గుచ్ఛంబులు=పూల గుత్తులు, పుణికి పాఱంగ పైచి=కోసి పాఱవేసి, తేనెలు రాల్చి=తేనె పట్టులలోని తేనెను రాల్చి, పూఁదేనెలు, ఉడిపి=పాడుచేసి, పొదరిండ్ల పొదవులు=పొదరిళ్ల ఆకారాలు, చదియగా=చితికిపోవునట్లు, నుగ్గాడి=నాశనము చేసి, చప్పరములు= మండపాలు, నేల చదునుజేసి=నేలమీద చదునుగా అయ్యేలా చేసి, వనము, కాచెడి=రక్షించెడి, రాక్షస వర్గములను=రాక్షస సమూహాలను, వీరవరులను=శ్రేష్ఠులయిన వీరులను, ఎనిమిది వేలన్, చంప, సీతన్, కాచెడి=కాపలాకాయు, రాక్షసస్త్రీలు, బెదరి=భయపడి, పాఱిపోయిరి, రావణుపాలికి=రావణునికి చెంతకు, అంత=అప్పుడు.

**తా :** మేడలన్నీ నేలమట్టం చేసి, కేళీ మందిరాలను నేలలో కలిపి, తామరకొలను కలచివేసి, చెట్లనన్నిటినీ విరగదన్ని, పూగుత్తులన్నీ కోసి పారేసి, తేనెపట్లలోని తేనె రాల్చి, పూలలో తేనెను పాడుచేసి, ఆ వనాన్ని కాపలాకాసే ఎనిమిదివేల మంది రాక్షస వీరులను చంపేసాడు హనుమ. సీతను కాపలా కాసే రాక్షస స్త్రీలు భయపడి రావణుని చెంతకు పాఱిపోయారు. ప్రమదావనం రూపం లేకుండా ధ్వంసం చేసేసాడు హనుమ.

**వ. ఇట్లు రావణుం జేరి వారు. 126**

**తా :** ఇలా రావణుని దగ్గరకు వెళ్లి వారు-

**క. దేవా! నేఁడొక మర్కటుఁ**
**డే విధమున వచ్చినాఁడొ యెఱుఁగము, సీతా**
**దేవిఁగని మాటలాడియుఁ**
**బోవుచు వన మెల్లఁ బెఱికి ప్రోవిడి కడఁకన్. 127**

**ప్రతి :** దేవా!, నేడు, ఒక మర్కటుఁడు=కోతిగాడు, ఏవిధమున=ఏవిధముగా, వచ్చినాఁడొ=వచ్చాడో, ఎఱుఁగము=మాకు తెలియదు, సీతా దేవిన్, కని=చూచి, మాటలాడియున్=మాట్లాడి, పోవుచు=వెళ్లిపోతూ, వనమెల్లన్=తోటంతా, పెఱికి=పీకి, ప్రోవిడి=ప్రోగుగాపెట్టి, కడఁకన్=సాహసముతో-

**తా :** దేవా! ఈనాడు ఒక కోతిగాడు ఎలా వచ్చాడో మాకు తెలియదు. వచ్చి సీతను చూసాడు. మాట్లాడాడు కూడా. వెళుతూ వెళుతూ వనమంతా సాహసంతో పీకి ప్రోగులు పెట్టాడు.

**విశే :** సీతకు కాపలాగా ఎందరో రాక్షస స్త్రీలు ఆమె చుట్టూ ఉన్నారు. అసలు లంకానగరంలోకి ప్రవేశించడమే కష్టబహుళం. ఈ ప్రమదావన సమీపానికి వచ్చి సీతతో మట్లాడాలంటే ఎంత సాహసం చెయ్యాలో హనుమ చేసి చూపాడు.

**తే.** **వనముఁగాచెడి రాక్షస వర్గములను**
**దండి నొకనిని మిడి వోవకుండఁ బట్టి,**
**మేటి భుజశక్తి నందఱ గీటడంచి,**
**వాలి యున్నాఁడు సాహసవంతుఁ డగుచు.** **128**

**ప్రతి :** వనమున్, కాచెడి, రాక్షస వర్గములను=రాక్షస సమూహలను, దండిన్=ధైర్యముతో, ఒకనిని=ఒక్కని కూడా, మిడిపోవకుండన్=తప్పిపోకుండా, పట్టి=పట్టుకుని, మేటిభుజశక్తిన్=గొప్ప భుజబలముతో, అందఱన్=అందరినీ, గీటడంచి= చంపి, వాలియున్నాఁడు=విజృంభించియున్నాడు, సాహసవంతుండగుచు.

**తా :** సాహసవంతుడై వనాన్ని కాపాడే రాక్షసమూక నందరినీ ఒక్కడిని కూడా వదలకుండా ధైర్యంతో పట్టుకుని గొప్పభుజబలంతో అందరినీచంపి విజృంభించి ఉన్నాడు.

## కపి వీరుఁడు రాక్షస వీరులను గసిమసంగుట

**వ.** **అని విన్న వించినంతనే క్రోధరక్తాంతలోచనుం డగుచు, నవ్వింశతి లోచనుండు విచారించి, వాఁడు రాముని పంపున వచ్చిన దూత కాఁబోలు, వానిం జంపుం డని పదివేల రాక్షసులం బంపిన.** **129**

**ప్రతి :** అని, విన్నవించినంతనే=చెప్పిన వెంటనే, క్రోధరక్తాంత లోచనుండగుచు=కోపముతో ఎఱ్ఱబడిన కన్నులు గలవాడగుచు, ఆ+వింశతిలోచనుండు=ఇరవై కన్నులవాడయిన ఆ రావణుడు, విచారించి, వాఁడు, రాముని పంపున వచ్చిన, దూత కాఁబోలు, వానిన్, చంపుండని, పదివేల, రాక్షసులన్, పంపిన.

**తా :** అని చెప్పగానే రావణుని కళ్లు కోపంతో ఎఱ్ఱబడ్డాయి. ఆ ఇరవై కన్నులవాడు దుఃఖపడి ఆ కోతి రాముడు పంపగా వచ్చిన దూత కావచ్చు, వాణ్ణి చంపండి అని పదివేలమంది రాక్షసులను పంపాడు.

**క.** **ఉగ్రాకారుం డగుచు ద**
**శగ్రీవుం డనుపఁ దనుజ సంఘంబులు దా**
**మాగ్రహమునఁ జనుచు బలో**
**దగ్ర క్రోధాత్ము లగుచుఁదాఁకిరి కడిమిన్.** **130**

**ప్రతి:** ఉగ్రాకారుండగుచు=భయంకరమైన ఆకారము గలవాడగుచు, దశగ్రీవుండు=పది తలలుగలవాడు, అనుపన్=పంపగా, దనుజసంఘంబులు=రాక్షసమూకలు, తాము, ఆగ్రహమునన్=పట్టుదలతో, చనుచు=

వెళ్లుచు, బలోదగ్ర క్రోధాత్ములగుచున్=బలముచే అధికమైన కోపముతో నిండిన మనస్సుగలవారగుచు, కడిమిన్=ధైర్యముతో, తాకిరి=ఎదుర్కొనిరి.

**తా :** ఉగ్రాకారంతో దశగ్రీవుడు రాక్షస మూకను పంపగా వారు పట్టుదలగా వెళ్తూ తమ బలంతో ఎదుర్కొన్నారు.

**ఉ. తాఁకిన యంత, వాయుజుఁడు తా నదలించి కఠోర రేఖతో**
**వీఁక నెదిర్చి పేర్చి, రణవీథి నిశాచర సైన్య మెల్ల నొ**
**క్కూఁకున వెంటనంటి సమదోగ్ర బలంబునఁ బాఱఁ బాఁఱఁగా**
**దోఁకను జుట్టి మోఁదె, బలు దుర్దములం దునుమాడె నందఱన్. 131**

**ప్రతి :** తాఁకిన యంత=ఎదుర్కొనగా, వాయుజుఁడు=హనుమ, తాన్=తాను, అదలించి=బెదిరించి, కఠోరరేఖలతో=భయంకరమైన విన్యాసముతో, వీఁకన్=పరాక్రమముతో, ఎదిర్చి=ఎదిరించి, పేర్చి=అతిశయించి, రణవీథిన్=యుద్ధవీథిలో, నిశాచర సైన్యమెల్లన్=రాక్షసుల సైన్యమంతా, ఒక్క+ఊకున=ఒక్కూకున=ఒకే ప్రయత్నంతో, వెంటనంటి=వెంబడించగా, సమదోగ్ర బలంబునన్=అధికబలంతో, పాఱన్=తరమగా, పాఱగాన్=పారిపోగా, తోఁకను జుట్టి=తోకతో చుట్టి, మోదె=నేలకేసి కొట్టెను, పలు=పెక్కురు, దుర్దములన్=అణచడానికి లొంగని వారిని, అందఱన్=అందరని, తునుమాడెన్=చంపెను.

**తా :** రాక్షస సైన్యం తనను ఎదుర్కోగానే కఠోరమైన చర్యలతో పరాక్రమంతో ఎదిరించి యుద్ధరంగంలో రాక్షస సైన్యాన్నంతా ఒక్క ఊపులో తన బలంతో వెంటపడి తఱిమికొట్టాడు. పారిపోతున్న రాక్షసులను తన తోకతో చుట్టి నేలకేసి కొట్టాడు. విశేషమైన బలంగల ఆ రాక్షసులందరినీ చంపేసాడు.

**క. అందునఁ జావక మిగిలిన**
**కొందఱు పఱతెంచి, యసుర కొల్వున మొఱ్ఱో**
**యందఱ మ్రింగెను, దానవు**
**లందఱకును వీఁడు దారుణాంతకుఁ డగుచున్. 132**

**ప్రతి :** అందునన్, చావక, మిగిలిన, కొందఱు, పఱతెంచి=పారిపోయి, అసురకొల్వున= రావణుని కొలువులో, మొఱ్ఱో, అందఱన్=అందరినీ, మ్రింగెను, దానవులందఱకును, వీఁడు=ఈ హనుమ, దారుణాంతకుఁడగుచున్=భయంకరమైన యముడగుచు.

**తా :** హనుమతో పోరు చేసిన వారిలో చావగా మిగిలిన కొందరు రావణుని కొలువుకు పరుగునవచ్చి మొఱ్ఱో! అంటూ – వీడు ఎందరినో మ్రింగాడు. భయంకరమైన యముడు అయ్యాడు.

**వ. అని విన్నవించిన రాక్షసేశ్వరుం డగు రావణుండు మండిపడి. పింగళాక్షుని, దీర్ఘజిహ్వుని, నశ్మవక్షుని, శార్దూలముఖుని, వక్రనాసుని బనిచిన, వారును దమ తమ బలంబులం గూడికొని రథారూఢులై వచ్చి,**

**యార్చుచుం దాఁకి, శస్త్రాస్త్రంబు లడరించిన, నవియెల్ల లెక్కగొనక, యక్కరువలి కొడుకు దర్పంబునం బేర్చి, వాల మల్లార్చి, యెదిర్చిన బలంబును బలువిడిగాఁ దోలి, పింగళాక్షుని ద్రుంచి, దీర్ఘ జిహ్వుని దీర్ఘనిద్ర పుచ్చి, వక్రనాసుని బరాక్రమంబునం జూర్ణంబు సేసి, యశ్మవక్షుని భస్మంబుఁజేసి,శార్దూలముఖుని మర్దించి, నిర్వక్రమ పరాక్రమంబున గర్వించి, మరలి మకరతోరణంబు నారోహించి, యార్చుచున్న సమయంబున. 133**

**ప్రతి :** అని, విన్నవించినన్=విజ్ఞప్తి చేయగా, రాక్షసేశ్వరుండు అగు=రాక్షసరాజగు, రావణుండు, మండిపడి=కోపంతో రగిలిపోయి, పింగళాక్షునిన్, దీర్ఘజిహ్వునిన్, అశ్మవక్షునిన్, శార్దూలముఖునిన్, వక్రనాసునిన్, పనిచినన్=పంపగా, వారును, తమ తమ, బలంబులన్=సేనలతో, కూడికొని, రథారూఢులై=రథాలను ఎక్కినటువంటివారై, వచ్చి, ఆర్చుచున్=అరుస్తూ, తాకి=సమీపించి, శస్త్రాస్త్రంబులు, అడరించినన్=ప్రయోగించగా, అవియెల్లన్=వానినన్నింటిని, లెక్కగొనక=లక్ష్యపెట్టక, ఆ+కరువవలికొడుకు–అక్కరువలి కొడుకు=ఆ వాయుపుత్రుడగు హనుమంతుడు, దర్పంబునన్=గర్వముతో, పేర్చి=హెచ్చి, వాలము=తోకను, అల్లార్చి=ఆడించి/ఎత్తికొట్టి, ఎదిర్చిన బలంబును=తన్ను ఎదుర్కొన్న సైన్యమును, బలువిడిగాఁదోలి=ధాటిగా/బలంగా తరిమి, పింగళాక్షుని, త్రుంచి=చంపి, దీర్ఘజిహ్వుని, దీర్ఘనిద్రపుచ్చి=చంపి, వక్రనాసునిన్, పరాక్రమంబునన్=గొప్ప బలంతో, చూర్ణంబుచేసి=పిండిచేసి, అశ్మవక్షుని, భస్మంబున్ చేసి=బూడిద చేసి, శార్దూలముఖుని, మర్దించి=అణచి, నిర్వక్రపరాక్రమంబునన్=మొక్కవోని/తిరుగులేని పరాక్రమముతో, గర్వించి, మరలి=తిరిగి, మకరతోరణంబును=మకరద్వార పైభాగమును, ఆరోహించి=ఎక్కి, ఆర్చుచున్న సమయంబునన్=అరుస్తున్న సమయములో –

**తా :** అని చెప్పగా రాక్షసేశ్వరుడయిన రావణుడు మండిపడి, పింగళాక్షుని, దీర్ఘజిహ్వుని, అశ్మవక్షుని, శార్దూలముఖుని, వక్రనాసుని పంపాడు. వారు తమ బలాలతో రథారూఢులై వచ్చి పెద్దగా అరుస్తూ ఎదుర్కొన్నారు. శస్త్రాలు అస్త్రాలు ప్రయోగించారు. వాటినన్నిటిని లెక్క చెయ్యకుండా ఆ వాయుపుత్రుడు గర్వంతో పరాక్రమించి, తోక ఎత్తికొట్టి, తనను ఎదుర్కొన్న రాక్షసబలాన్ని, వక్రనాసుని, అశ్మవక్షుని, శార్దూలముఖుని చంపాడు. తన గొప్ప పరాక్రమంతో గర్వించి వచ్చి మకరతోరణంబు ఎక్కి, అరుస్తున్నవేళలో–

**విశే :** ఈ వచనంలో చంపాడు అని చెప్పే సందర్భంలో మొల్ల అనేక పర్యాయపదాలు వాడింది, త్రుంచి, దీర్ఘనిద్రపుచ్చి, చూర్ణంచేసి, భస్మంబుచేసి, మర్దించి–అనేవి. ఈ పదాలన్నీ తాత్పర్యంలో సంహరించాడు అనే అర్థాన్ని కూరుస్తాయి.

**క. చావక మిగిలిన దైత్యులు**
**రావణు కడ కేఁగి వేగ రాహుత్తుల పా**
**ట్లా వాయుజు సాహసమును**
**వే విధములఁ జెప్ప నతఁడు విస్మయపడుచున్. 134**

**ప్రతి :** చావక=చావకుండా, మిగిలిన, దైత్యులు=రాక్షసులు, రావణుని వద్దకు వెళ్లి, రాహుత్తుల=సైనికుల (గుఱ్ఱాలు ఎక్కి యుద్ధం చేసే రౌతులు) పాట్లు=అవస్థలు, వాయుజు=హనుమ, సాహసమును=పరాక్రమాన్ని, వేవిధములన్=వేయి విధాలుగా, చెప్పన్, అతఁడు, విస్మయపడుచున్=ఆశ్చర్యపడుతూ.

**తా :** యుద్ధంలో చావకుండా మిగిలిన రాక్షసులు రావణుని దగ్గరకు వచ్చి సైనికుల పాట్లు హనుమంతుని సాహసం గురించి వేయి విధాలు చెప్పగా రావణుడు ఆశ్చర్యపడుతూ –

**మ. కుటిల భ్రూకుటి దుర్నిరీక్షణములం గ్రోధానల జ్వాల లు**
**త్కటమై పర్వఁగ, మంత్రి సూనుల, మహా గర్వాంధులన్, గ్రూరులన్**
**పటు బాహాబలు లార్వురం బనిచె, శుంభద్విక్రమాటోప మ**
**ర్కట పారీంద్రముమీఁద నుద్దవిడి సంగ్రామంబు గావింపఁగన్. 135**

**ప్రతి :** కుటిల=వంకర,భ్రూకుటి=కనుబొమల, దుర్నిరీక్షణములన్=సహింపజాలని చూపులనుండి, క్రోధానల జ్వాలల=కోపాగ్నిజ్వాలలు, ఉత్కటమై=అధికమై, పర్వఁగన్=వ్యాపించగా, మంత్రిసూనులన్=మంత్రి కుమారులను, మహాగర్వాంధులన్=గొప్ప గర్వముచేత అంధులై ప్రవర్తించేవారిని (కన్నుమిన్నుకానక), క్రూరులన్=క్రూరులను, పటుబాహాబలులు=అధికమైన బాహుబలము కలవారిని, ఆర్వురన్=ఆరుగురిని, శుంభత్ విక్రమాటోప=అధికమైన పరాక్రమముతో ప్రకాశిస్తున్న, మర్కటపారీంద్రము=వానరసింహము (శ్రేష్ఠమైన వానరము), మీద, ఉద్దవిడి=వేగముగా, సంగ్రామంబు=యుద్ధము, కావింపఁగన్=చేయుటకు, పనిచె=పంపాడు.

**తా :** వంకరైన కనుబొమలతో చూడ శక్యముగాని చూపులనుండి కోపాగ్ని జ్వాలలు అధికంగా ప్రసరిస్తుండగా, గర్వముతో కన్నుమిన్నుగానక ప్రవర్తించేవారు, క్రూరులు, విశేషమైన బాహుబలోపేతులు అయిన ఆరుగురు మంత్రి సుతులను పరాక్రమాటోపముతో ప్రకాశిస్తున్న మర్కట పారీంద్రముతో యుద్ధం చేయడానికి ఉన్నపళంగా పంపాడు.

**విశే :** వృషభము, సింహము అనే ఈ రెండు శబ్దాలు ఉత్తరపదంగా శ్రేష్ఠతా వాచకముగా ప్రయోగంలో ఉన్నాయి. కవివృషభము, రాజసింహము, పురుషసింహము మొదలయినవి. పారీంద్రము=సింహము. మర్కటపారీంద్రము ప్రయోగం మొల్ల ప్రత్యేకత.

**వ. ఇట్లు పనిచిన నా యార్వురును. 136**

**తా :** అలా పంపగా ఆ ఆరుగురును

**సీ. శతకోటి విక్రమ ప్రతిమానుఁ డైనట్టి**
**శతజిహ్వుఁ డత్యంత సాహసుండు,**
**రోషానలాభీల శేషాహి యైనట్టి**
**రుధిరాక్షుఁ డత్యుగ్ర రూప యుతుఁడు,**

పర సైన్య కానన పావకుం డైనట్టి
రక్తరోముఁడు మహా రణబలుండు,
కఠిన శాత్రవ లోక గజ సింహుఁడైనట్టి
శూరదంష్ట్రుడు లయ కాల హరుఁడు

తే. వ్యాఘ్ర కబళుండు పృథుతరాహవ జయుండు
స్తనితహస్తుండు సాహసోదార బలుఁడు,
వీర లార్వురు నత్యుగ్ర వేషములను
రూఢి వెడలిరి ఘన రథారూఢు లగుచు. 137

**ప్రతి :** శతకోటి విక్రమ ప్రతిమానుఁడైనట్టి=నూరు కోట్లమంది విక్రమముతో సరిసమానుడైనటువంటి, అత్యంత సాహసుండు=మిక్కిలి సాహసవంతుడు, శతజిహ్వుఁడు, రోషానలా భీల–రోష+అనల+ఆభీల= భయంకరమైన కోపాగ్నితో కూడిన, శేషాహి=శేషనాగు, అత్యుగ్రరూప యుతుఁడు=మిక్కిలి ఉగ్రమైన రూపముతో కూడినవాడు, ఐనట్టి=అయినటువంటి, రుధిరాక్షుడు, పరసైన్య కానన పావకుండైనట్టి=శత్రు సైన్యమనే అడవికి అగ్నిహోత్రుని వంటివాడయిన, మహారణబలుండు=గొప్ప యుద్ధము చేయగల శక్తిసంపన్నుడు, రక్తరోముఁడు, కఠినశాత్రవలోక గజసింహుఁడైనట్టి=కఠినమైన శత్రువులనే ఏనుగులకు సింహము వంటివాడైన, లయకారహరుడు=ప్రళయకాలమునాటి శివుడు, శూరదంష్ట్రుడు, పృథుతరాహవ జయుండు=అతిగొప్ప యుద్ధాలను జయించినవాడు, వ్యాఘ్రకబళుండు, సాహసోదారబలుడు=ఉదార సాహసముతో కూడిన బలము కలవాడు, స్తనితహస్తుండు, వీరలు=వీరు, ఆర్వురు=ఆరుగురు, అత్యుగ్ర వేషములను=అతి భయంకరమైన వేషాలతో, రూఢి=స్థైర్యముతో, ఘన రథారూఢులగుచు=పెద్దరథాలను ఎక్కినవారై, వెడలిరి=వెళ్లిరి.

**తా :** శతజిహ్వుడు శతకోటి విక్రమసమానుడు అత్యంత సాహసుడు. రుధిరాక్షుడు భయంకర కోపాగ్నితో కూడిన శేషనాగుడు ఉగ్రరూపుడు. రక్తరోముడు శత్రుసైన్యారణ్యానికి నిప్పువంటివాడు. మహారణబలుడు. శూరదంష్ట్రుడు శత్రురాజులనే ఏనుగులపాలిటి సింహము, లయకాలహరుడు. వ్యాఘ్రకబళుండు గొప్ప గొప్ప యుద్ధాలు జయించాడు. స్తనితహస్తుడు సాహసోదార బలుడు. వీరు ఆరుగురు భయంకరమైన వేషాలు ధరించి స్థైర్యంగా రథాలెక్కి వెళ్లారు.

**విశే :** పరసైన్యకాననపావకుండు=శత్రుసైన్యాలనే అడవికి అగ్ని అంటే అగ్ని అడవులను కాల్చినట్లే శత్రువులను సంహరిస్తారు అని. అడవికి నిప్పు అంటుకుంటే అది అలా అలా విజృంభిస్తూ ముందుముందుకు అంటుకుంటూ పోతుంది.

శాత్రవలోక గజసింహుడు=శత్రులోకమనే ఏనుగులపాలిటి సింహము ఏనుగు ఆకారంలో ఎంత పెద్దగా ఉన్నా సింహం ఏనుగు కుంభస్థలాన్ని చీల్చి చంపుతుంది. ఏనుగులకు సింహాలంటే చాలాభయం.

అందుకే 'సింహస్వప్నము' అనేమాట ఏర్పడింది. ఏనుగుకి సింహం కలలోకి వచ్చినా భయపడుతుందని తాత్పర్యము.

**క. తమ తమ బిరుదులు నెఱపుచుఁ**
**దమకంబున వెడలి రధిక దళలము గొలువన్**
**ఘుమఘుమ భేరీ రవ సం**
**భ్రమములతో మంత్రి సుతులు పావనిమీఁదన్. 138**

**ప్రతి :** తమ తమ=వారి వారి, బిరుదులు=శక్తులను, నెఱపుచున్=ప్రదర్శిస్తూ, తమకంబున=వేగముగా, అధిక, దళములు=సైన్యములు, కొలువన్=కొలువగా, ఘుమఘుమ, భేరీరవసంభ్రమములతో=భేరీవాద్యాల ఘుమఘుమల సందడితో, మంత్రిసుతులు, పావని మీఁదన్=హనుమ మీదకు, వెడలిరి=వెళ్లిరి.

**తా :** భేరీ నినాదాలు ఘుమఘుమ మంటూ సందడి చేస్తుండగా మంత్రిసుతులు తమ తమ శక్తులు ప్రదర్శిస్తూ, పెక్కు సైనికదళాలు కొలువగా హనుమ మీదకు యుద్ధానికి వెళ్లారు.

**వ. ఇట్లు కదిసి సింహనాదంబు లంబరంబునం జెలంగ, గజ తురంగ శతాంగ సుభట నికరంబుం గూడి శస్త్రాస్త్రంబులం బొదివిన. 139**

**ప్రతి :** ఇట్లు, కదిసి=ఎదుర్కొని, సింహనాదంబులు=సింహము యొక్క ధ్వనులవంటి ధ్వనులు, అంబరంబునన్=ఆకాశంలో, చెలంగన్=వ్యాపింపగా, గజ-తురంగ-శతాంగ-సుభట-నికరంబున్= ఏనుగుల-గుఱ్ఱముల-రథముల-సుభటుల సమూహమును, కూడి, శస్త్రాస్త్రంబులన్=శస్త్రములను, అస్త్రములను, పొదివినన్=ప్రయోగింపగా -

**తా :** ఇట్లా ఎదుర్కొని సింహనాదాలు ఆకాశంలో వ్యాపించగా, ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, భటులతో కూడి శస్త్రాలు అస్త్రాలు వ్యాపింపచేయగా.

**తే. వాల మల్లార్చి, బ్రహ్మాండ గోళమెల్ల**
**పగుల నార్చుచు, భుజ యుగం బప్పళించి,**
**రణము చేయంగ మకరతోరణము డిగ్గి**
**మంతు కెక్కిన యా హనుమంతుఁడంత. 140**

**ప్రతి :** వాలము=తోక, అల్లార్చి=త్రిప్పికొట్టి, బ్రహ్మాండ గోళమెల్ల, పగులన్=పగిలి పోవునట్లు, ఆర్చుచు= అరుస్తూ, భుజయుగంబు=రెండు భుజాలు, అప్పళించి=చరిచి, రణము=యుద్ధము, చేయంగ, మకరతోరణము డిగ్గి=మకరతోరణము నుండి దిగి, మంతుకెక్కిన=ప్రసిద్ధికెక్కిన, ఆ హనుమంతుఁడు, అంత.

**తా :** ప్రసిద్ధికెక్కిన హనుమంతుడు మకరణతోరణం మీద నుండి దిగి తోకత్రిప్పి కొట్టి బ్రహ్మాండభాండమంతా పగిలిపోయేటట్లుగా అరుస్తూ భుజాలు చరుచుకుని యుద్ధం చేయడానికి సిద్ధపడ్డాడు.

**విశే :** శబ్దానికి కూడా బ్రద్దలు చేయగల శక్తి ఉన్నది. ఈ బ్రహ్మాండాన్ని బ్రద్దలు చేయగల భీకరశబ్దం హనుమ చేసాడు.

**సీ. ఒక్కొక్క రథముతో నొక్కొక్క రథమును**
**విటతాటనంబుగా విఱుగఁ గొట్టి**
**యొక్కొక్క గజముతో నొక్కొక్క గజమును**
**జాఁపచుట్టగఁ బట్టి చావఁ గొట్టి,**
**యొక్కొక్క హయముతో నొక్కొక్క హయమును**
**వాల ముఖంబునఁ గూలఁగొట్టి**
**యొక్కొక్క భటునితో నొక్కొక్క సుభటుని**
**వడిఁ ద్రిప్పి చెక్కలు వాఱఁ గొట్టి**

**తే. బాహుబల గర్వమునఁ బేర్చి, ప్రధన సీమ**
**మంత్రి సూనుల నార్వుర మడియఁ గొట్టి,**
**మకరతోరణమున విక్రమమ్ము మెఱయ**
**భీకరాకారుఁడై యుండెఁబెచ్చు పెరిఁగి. 141**

**ప్రతి :** ఒక్కొక్క రథముతోన్=ఒక్కొక్క రథమును, విటతాటనంబుగాన్=తారుమారు అయ్యే రీతిలో, విఱుగగొట్టి, ఒక్కొక్క గజముతోన్=ఒక్కొక్క ఏనుగును, చాఁపచుట్టగన్=చాపచుట్టలా తేలికగా, పట్టి, చావగొట్టి=చంపి, ఒక్కొక్క హయముతోన్=ఒక్కొక్క గుఱ్ఱాన్ని, వాలముఖంబునన్=తోకముఖంతో-తోక చివరి భాగంతో, కూలగొట్టి=పడవేసి, ఒక్కొక్క భటునితోన్, ఒక్కొక్క సుభటుని=మంచిభటుని, వడి ద్రిప్పి=వేగంగా త్రిప్పి, చెక్కలువాఱన్=ముక్కలు అగునట్లుగా, కొట్టి, బాహుబలగర్వమునన్=బాహుబల గర్వంతో, పేర్చి= అతిశయించి, ప్రధనసీమ=యుద్ధరంగములో, మంత్రి సూనులన్=మంత్రి కొడుకులను, ఆర్వుర=ఆరుగురిని, మడియన్=చచ్చునట్లు, కొట్టి, విక్రమము మెఱయ=పరాక్రమము ప్రకాశిస్తూ ఉండగా, మకరతోరణమున, పెచ్చుపెరిగి=అతిశయించి, భీకరాకారుఁడై=భీకరమైన ఆకారముతో, ఉండెన్= ఉన్నాడు.

**తా :** ఒక్కొక్క రథంతో ఒక్కొక్క రథాన్ని తారుమారయ్యే విధంగా విరగగొట్టి, ఒక ఏనుగుతో మరో ఏనుగును చాపచుట్టలా పట్టుకుని చంపి, గుఱ్ఱాన్ని తోకతో పట్టుకుని మరో గుఱ్ఱాన్ని కొట్టి చంపి, ఒక భటుని త్రిప్పి మరో భటుణ్ణి కొట్టి ముక్కలుచేసి తన భుజబలాతిశయంతో యుద్ధరంగంలో ఆరుగురు మంత్రి పుత్రులను చంపి భీకరాకారంతో పరాక్రమం అతిశయించగా మకరతోరణం మీద ఉన్నాడు, హనుమ.

**విశే :** చాపచుట్టగ=పూర్వం తాటాకులతో ఈతాకులతో చాపలు అల్లుకుని పరుచుకునేవారు. కూర్చోడానికి పడుకోవడానికివాడేవారు. అవసరం లేనప్పుడు వాటిని చుట్టి పెట్టుకునేవారు. ఆ చాపచుట్ట తేలికగా

ఉంటుంది. ఒక ఏనుగుని చాపచుట్టగ పట్టుకుని, మరో ఏనుగును కొట్టాడు హనుమ. హనుమ ఏనుగును చాపచుట్ట అంత తేలికగా అవలీలగా ఎత్తగలడు. చాపచుట్టగ-చక్కని కందువమాట.

**క. ఆ రణవీథిని నిలువక**
**పాటిన హతశేషు లెల్లఁ బర్విడి, రాజ**
**ద్వారమున బొబ్బ లిడి, రా**
**ఘోరాజిని మంత్రి సుతులు కూలి రటంచున్. 142**

**ప్రతి :** ఆ రణవీథిని=ఆ యుద్ధభూమిలో, నిలువకపాటిన=నిలబడలేక పారిపోయిన, హతశేషులెల్లన్=చావగా మిగిలినవారంతా, పర్విడి=పరుగుపెట్టి, రాజద్వారమున, ఆ ఘోరాజిని=ఆ ఘోరమైన యుద్ధంలో, మంత్రిసుతులు, కూలిరి=చనిపోయిరి, అటంచున్=అంటూ, బొబ్బలిడిరి=పెద్దగా కేకలు పెట్టారు.

**తా :** ఆ యుద్ధభూమిలో నిలవలేక పారిపోయి చావగా మిగిలిన వారు రాజద్వారం దగ్గఱ ఆభయంకరమైన యుద్ధంలో మంత్రిసుతులు చనిపోయారు అంటూ పెద్దగా బొబ్బలు పెట్టారు.

**వ. వారి పాటు విని రావణాసురుం డదరిపడి, యాజ్యాహుతిం బ్రజ్వరిల్లు హుతాశనుం బోలి మండిపడి, ప్రహస్త తనూజుండగు జంబుమాలిం గని, నీ వా వానరాధముని వధించి శ్రీఘ్రమ్ము రమ్మని యనిపిన. 143**

**ప్రతి :** వారిపాటు విని=వారి మరణ విషయం విని, రావణాసురుండు, అదిరిపడి, ఆజ్యాహుతిన్=నెయ్యి పొయ్యడంవల్ల, ప్రజ్వరిల్లు=బాగా మండునట్టి, హుతాశనుం బోలి=అగ్నిహోత్రునివలె, మండిపడి, ప్రహస్తతనూజుండగు=ప్రహస్తుని కొడుకగు, జంబుమాలిన్, కని, నీవు, ఆ, వానరాధముని=నీచుడైన ఆ కోతిని, వధించి=చంపి, శ్రీఘ్రమ్ము, రమ్మని, అనిపిన=పంపగా.

**తా :** మంత్రిసుతుల మరణం విని రావణుడు అదిరిపడ్డాడు. నెయ్యిపోసిన అగ్నిహోత్రునిలా మండిపడుతూ ప్రహస్తుని కొడుకు జంబుమాలిని చూచి నువ్వు వెళ్లి ఆ వానరాధముణ్ణి చంపి తొందరగా రా అని పంపగా.

## హనుమంతుఁడు జంబుమాలిని రూపుమాపుట

**ఉ. అప్పుడు జంబుమాలి భయదాకృతి, వీర రసాప్తిఁ గన్నులన్**
**నిప్పులు రాలఁ, బేరలుక నిండఁగఁ, నూర్పులు పర్వఁ జిత్రమై**
**యొప్పుగ రొప్పుచున్, రణ మహోత్సుకుఁడై గజవాజి బృందముల్**
**విప్పుగ వెంట రాఁగఁ, గపివీరు నెదుర్కొని విక్రమంబునన్. 144**

**ప్రతి :** అప్పుడు, జంబుమాలి, భయదాకృతిన్=భయంకరమైన రూపముతో, వీరరసాప్తిన్=వీరరసభావం కలగడం వల్ల, కన్నులన్=కన్నుల నుండి, నిప్పులురాలన్=నిప్పులు రాలగా, పేరలుక నిండగన్=మిక్కుటమయిన కోపం నిండగా, ఊర్పులు=శ్వాసలు, పర్వన్=వ్యాపించగా, చిత్రమై=వింతగా, ఒప్పుగ రొప్పుచున్=బాగా రొప్పుతూ, రణమహోత్సకుడై=యుద్ధం చేయడానికి గొప్ప ఉబలాటముగలవాడై, గజవాజి బృందముల్=

ఏనుగులు, గుఱ్ఱాలు, విప్పుగ=వికాసముతో, వెంటరాగన్=కూడా రాగా, కపివీరున్, ఎదుర్కొని, వి(క్రయంబునన్= పరా(క్రమముతో.

**తా :** అప్పుడు జంబుమాలి భయంకరాకృతిలో, వీరరసస్ఫూర్తి వల్ల కన్నుల నుండి నిప్పులు రాలగ, మిక్కిలి కోపంతో నిండి, నిట్టూర్పులు అంతటా వ్యాపించగా వింతగా రొప్పుతూ యుద్ధం చేయడానికి గొప్పగా ఉబలాటపడుతూ, ఏనుగులు, గుఱ్ఱాలు కూడా వికాసంతో వెంటరాగా హనుమను ఎదుర్కొని పరా(క్రమముతో–

**క. అదలించి, వాయు నందనుఁ**
**(బదరంబుల నేయ నంతఁ బవనజుఁ డలుకన్**
**గొదగొని బలముల నన్నిటిఁ**
**జదియంగా మోఁదె నొక్క సాలముచేతన్. 145**

**(ప్రతి :** అదలించి=బెదిరించి, వాయునందనున్=హనుమను, (ప్రదరంబులన్=బాణములతో, ఏయన్=వేయగా, అంతన్=అంతట, పవనజుఁడు=హనుమ, అలుకన్=కోపముతో, గొదగొని=ఆకలిగొని, బలముల నన్నిటిన్= అన్ని బలములను, చదియంగా=చచ్చునట్లు, ఒక్క, సాలముచేతన్=మద్దిచెట్టుతో, మోదెన్=బాదెను.

**తా :** జంబుమాలి హనుమను బెదిరించి బాణాలు (ప్రయోగించాడు. దానితో హనుమ కోపం అనే ఆకలి గొని యుద్ధంలో పాల్గొన్న బలాల నన్నిటినీ ఒక్క మద్దిచెట్టుతో చచ్చేటట్లు బాదాడు.

**విశే :** బలములు–ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, సైనికులు.

**ఆ. రథము నుగ్గు సేసి, రథ సారథిని జంపి,**
**రథ తురంగములఁ బృథుల శక్తిఁ**
**బట్టి, వాలమునను బడఁగొట్టి చంపిన,**
**జంబుమాలి కినిసి సాహసమున. 146**

**(ప్రతి :** రథము నుగ్గుసేసి=రథాన్ని పిండిచేసి, రథసారథిని, చంపి, తురంగములన్= గుఱ్ఱాలను, పృథులశక్తిన్= అధికమైన శక్తితో పట్టి, వాలమునసున్=తోకతో, పడన్, కొట్టి, చంపిన, జంబుమాలి, కినిసి=కోపగించి, సాహసమున=సాహసముతో.

**తా :** హనుమ రథాన్ని పిండిచేసి రథసారథిని చంపి, గుఱ్ఱాలను నేర్పుతోపట్టి తోకతో పడగొట్టి చంపగా, కోపగించిన జంబుమాలి సాహసముతో.

**క. అడిదంబును గదయును గొని,**
**పుడమికి లంఘించి, వాయు పు(త్తుని నిటలం**
**బెడపక (వేసిన, ధరణిం**
**బడి మూర్ఛ మునింగి, తెలిసి బలయుతుఁ డగుచున్. 147**

**ప్రతి :** అడిదంబును=కత్తిని, గదయునుగొని=గదను తీసుకొని, పుడమికిలంఘించి=భూమిమీదికి దుమికి, వాయుపుత్రుని=హనుమయొక్క, నిటలంబు=నుదుటి భాగము, ఎడపక=ఒకదానివెంట ఒకటి, వ్రేసిన=ప్రయోగించగా, ధరణింబడి=నేలమీదపడి, మూర్ఛమునింగి=మూర్ఛపోయి, తెలిసి=తెలివి తెచ్చుకుని, బలయుతుఁడగుచున్=బలముతో కూడినవాడగుచు.

**తా :** జంబుమాలి కత్తితో, గదతో భూమి మీదకు ఉరికి హనుమ నుదుటిమీద అదే పనిగా గదతో కొట్టగా హనుమ మూర్ఛపడి లేచి బలం కూడగట్టుకుని.

**క. ఆలంబున నాతని కర**
**వాలంబును ద్రుంచివైచి, వర భుజ శక్తిన్**
**నేలం గూల్చెను, విక్రమ**
**శాలిన్, వడి జంబుమాలి, సాహసశీలిన్. 148**

**ప్రతి :** ఆలంబునన్=యుద్ధములో, ఆతని=జంబుమాలి యొక్క, కరవాలంబునున్=కత్తిని, త్రుంచివైచి=విఱుగగొట్టి, వరభుజశక్తిన్=గొప్ప భుజబలముతో, విక్రమశాలిన్=పరాక్రమవంతుని, వడిన్=వేగముగా, జంబుమాలిన్=జంబుమాలి, సాహసశీలిన్=సాహసవంతుని, నేలం గూల్చెను=నేలగూల్చాడు,

**తా :** సాహసశీలి, పరాక్రమంతుడు అయిన జంబుమాలి కత్తిని విఱగగొట్టి తన భుజశక్తితో నేలగూల్చాడు హనుమ.

**విశే :** 'విక్రమశాలిన్ జంబుమాలి సాహసశీలిన్' అంత్యానుప్రాసప్రయోగం.

**ఆ. అంత జంబుమాలి, యత్యంత బలశాలి**
**గర్వ మెల్లఁ దూల, కలన వ్రాలి,**
**పొలిసె ననుట దైత్యపుంగవుఁ డాలించి,**
**యాత్మ సంచలింప నాగ్రహించి. 149**

**ప్రతి :** అంత, అత్యంతబలశాలి=మిక్కిలిబలముకలవాడు, జంబుమాలి, గర్వమెల్లన్=గర్వమంతా, తూలన్=చలించగా, కలన=యుద్ధభూమిలో, వ్రాలి=వ్రాలిపోయి, పొలిసెన్=చనిపోయెను, అనుట, దైత్యపుంగవుఁడు=రాక్షస శ్రేష్ఠుడు రావణుడు, ఆలించి=విని, ఆత్మసంచలింపన్=మనస్సు కలవరపడగా, ఆగ్రహించి=కోపించి.

**తా :** అత్యంత బలశాలి అయిన జంబుమాలి తన గర్వమంతా అణగి యుద్ధరంగంలో పడి చనిపోయాడు అనే మాట విని రావణుడు మనస్సు చంచలించగా, కోపించినవాడై.

**క. సాహసము వెలయ సమరో**
**త్సాహంబున దుష్ట కపినిఁ జంపు మటంచున్**

**బాహు బలాఢ్యుని, నరి నిక**
**రాహవ సంహారు, వీరు, నక్ష కుమారున్.** **150**

**ప్రతి :** సాహసము వెలయన్=సాహసము ప్రకాశించునట్లు, సమరోత్సాహంబునన్=యుద్ధము చేయాలనే ఉత్సాహంతో, దుష్టకపిని=దుష్టుడయిన ఆ కోతిని, చంపుము, అటంచున్=అని చెప్తూ, బాహుబలాఢ్యునిన్=గొప్ప బాహుబలము కలవానిని, అరినికరాహవ సంహారున్=శత్రుసమూహాలను యుద్ధంలో సంహరించే శీలము గలవానిని, వీరున్=వీరుని, అక్షకుమారున్=అక్షకుమారుని.

**తా :** బాహుబలాఢ్యుడు, శత్రుసంహారకుడు వీరుడు అయిన అక్షకుమారుణ్ణి నీ సాహసం ప్రదర్శించి సమరోత్సాహంతో ఆ దుష్టవానరుణ్ణి చంపు అని (పంపాడు).

**విశే :** అక్షకుమారుడు రావణుని కొడుకు. ఇంద్రజిత్తుకు తమ్ముడు. మహావీరుడు.

**వ. అంపిన నతండు.** **151**

**తా :** పంపగా అతడు

## అక్షకుమార పవనకుమారుల భీకర సమరము

**సీ. చిత్ర మాణిక్య రంజిత వేత్ర విభవంబు**
**భానుకోటి ప్రభా భాసితంబు,**
**భీకర ధ్వజ దండ బిరుదాలవాలంబు**
**శస్త్రాస్త్ర పరికర సంయుతంబు,**
**బంధురాధికజవ బహు హయోపేతంబు**
**కుటిల దిక్పాల దృగ్గోచరంబు,**
**ఘన నభోమార్గ విఖ్యాతైక గమనంబు**
**వర తపోలబ్ధాతి వైభవంబు**

**తే. నైన రథ మెక్కి, మద వారణౌఘ సుభట**
**వీర హుంకార ఝుంకార వార ములియఁ**
**గదలె హనుమంతుపైకి నాగ్రహ మెసంగ**
**మదము దైవార నక్షకుమారుఁ దలుక.** **152**

**ప్రతి :** చిత్రమాణిక్య రంజిత విభవంబు=చిత్రమైన మాణిక్యముల కాంతిసంపద కలిగినట్టిది, భానుకోటి ప్రభాభాసితంబు=కోటిసూర్యుల ప్రకాశముతో కూడినట్టిది, భీకర ధ్వజదండ బిరుదాలవాలంబు=భయంకరమైన జెండాకఱ్ఱలు, బిరుదు పట్టాలకు నెలవైనది, శస్త్రాస్త్ర పరికరసంయుతంబు=శస్త్రాస్త్రముల వివిధ పరికరాలతో కూడుకున్నది, బంధురాధిక జవబహు హయోపేతంబు=అధికమైన వేగము, బలము కలిగిన గుఱ్ఱములు

కట్టబడినది, కుటిల దిక్పాలదృగ్గోచరంబు=కుటిలురైన దిక్పాలకులు కనబడునట్టిది, ఘన=గొప్పదైన, నభోమార్గ=ఆకాశమార్గమున, విఖ్యాతైక గమనంబు=విఖ్యాతి పొందిన గమనము కలది, వరతపోలబ్ధ=గొప్ప తపస్సు చేసి పొందిన, అతివైభవంబున్=గొప్ప ఐశ్వర్యంతో కూడినది, ఐన=అయినట్టి, రథమెక్కి, మదవారణ=మదించిన ఏనుగుల, ఔఘ=సమూహములు, సుభట=మంచివీరులైన భటుల, హుంకార ఝుంకార, వారము=సమూహము, ఉలియన్=మ్రోతపెట్టగా, ఆగ్రహమెసంగ=పట్టుదల ఎక్కువకాగా, మదముదైవారన్=గర్వము అతిశయించగా, హనుమంతుపైకి, అలుకన్=కోపముతో, అక్షకుమారుడు, కదలె=కదలెను.

**తా :** చిత్రమైన మాణిక్యాల కాంతిసంపదతో, కోటిసూర్యుల ప్రకాశంతో, పెద్ద పెద్ద జెండాకఱ్ఱలు, బిరుదపట్టాలతో, శస్త్రాస్త్ర సరంజామాతో, గొప్ప వేగము, బలముగల గుఱ్ఱాలతో, దిక్పాలకులు కనబడే గొప్ప ఆకాశమార్గంలో అద్భుతంగా సంచరించేది, ఘోరతపస్సు చేసి సంపాదించినది అయిన రథమెక్కాడు అక్షకుమారుడు. మదించిన ఏనుగుల హుంకారాలతో వీరభటుల ఝుంకారాలతో మ్రోగిపోతూ ఉండగా పట్టుదల, గర్వము అతిశయించగా అక్షకుమారుడు హనుమంతుని మీదకు యుద్ధానికి కదిలాడు.

**విశే :** ఇది పూర్తిగా అక్షకుమారుని రథవర్ణన. ఈ రథాన్ని అతడు ఘోరమైన తపస్సు చేసి వరంగా సంపాదించుకున్నాడు. ఈ రథం భూమిమీదే కాదు ఆకాశంలో కూడా అవలీలగా పరిగెత్తగలదు.

**క. అటు చని పావనిఁ గని ది**
**క్తటములు సెదరంగ నార్చి, దందడి భూభృ**
**త్తటముపయిఁ గురియు వర్షో**
**త్కట ధారల రీతి, నంప ధారలు గురిసెన్. 153**

**ప్రతి :** అటు=ఆ విధముగా, చని=వెళ్లి, పావనిన్=హనుమను, కని=చూచి, దిక్తకటములు=దిక్కుల అంచులు, చెదరంగన్=చెదిరిపోవునట్లు, ఆర్చి=అరచి, దందడి=దట్టముగా, భూభృత్=పర్వత, తటముపయి=చరియలపై, కురియు, వర్షోత్కట ధారలరీతి=గట్టివాన ధారలవలె, అంపధారలు=బాణాలధారలు, కురిసెన్=కురిపించెను.

**తా :** ఆ విధంగా వెళ్లి అక్షకుమారుడు హనుమంతుణ్ణి చూసి, దిక్కుల అంచులు చెదిరిపోయేలా పెద్దగా అరిచాడు. కొండచరియల మీద దట్టంగా కురిసే వర్షధారలవలె బాణాలు ధారగా కురిపించాడు.

**ఉ. వాయుజు ఁడప్పు డంపగమి వాల ముఖంబునఁ ద్రుంచెఁ, ద్రుంచినన్**
**వాయుజుమీఁదఁ గ్రమ్మఱ నవార్య బలంబున నేసె, నేసినన్**
**వాయుజుఁ డుగ్రుఁడై తునిమె వాని శరావళి నెల్లఁ బిమ్మటన్,**
**వాయుజు నాట సేసెఁ గడు వాఁడి శరంబుల నక్షుఁ దుద్ధతిన్. 154**

**ప్రతి :** వాయుజుఁడు=హనుమంతుడు, అప్పుడు, అంపగమిన్=బాణాల సమూహాన్ని, వాలముఖంబునన్=తోకతో, త్రుంచెన్=త్రుంచెను, త్రుంచినన్=త్రుంచగా, వాయుజుమీఁదన్=హనుమమీద, క్రమ్మఱ=తిరిగి,

అవార్యబలంబునన్=వారింపశక్యముకాని బలంతో, ఏసెన్=వేసెను, ఏసినన్=వేయగా, వాయుజుఁడు= హనుమ, ఉగ్రుఁడై=కోపించినవాడై, వాని, శరావళినెల్లన్=బాణసమూహాన్ని అంతా, తునిమె=త్రుంచెను, పిమ్మటన్=ఆ తరువాత, వాయుజున్=హనుమను, నాటన్=నాటుకునేలా/గుచ్చుకునేలా, కడువాఁడి= మిక్కిలి పదునైన, శరంబులన్=బాణాలతో, అక్షుఁడు, ఉద్ధతిన్=పరాక్రమంతో, ఏసెన్=కొట్టెను/వేసెను.

**తా :** అక్షకుమారుడు వేసిన బాణసమూహాల్ని తోకతో త్రుంచాడు హనుమ. హనుమ అలా త్రుంచగానే మళ్లీ బలంగా బాణాలు వేసాడు అక్షకుమారుడు. హనుమ కోపంతో ఆ బాణాలన్నిటినీ త్రుంచాడు. అక్షకుమారుడు మరింత ఉద్ధతితో హనుమకు బాగా గుచ్చుకునేలా పదునైన బాణాలు ప్రయోగించాడు.

**విశే :** ఈ పద్యరచనలో ప్రతిపాదంలో 'వాయుజుడు' కనిపిస్తాడు. యుద్ధరంగమంతా తానై విజృంభించినట్లే వాయుజుఁడు పద్యరంగంలో కూడా పదేపదే దర్శనం ఇచ్చాడు.

**వ.** **ఇట్లేసిన.** **155**

**తా :** ఇలా వేయగా

**ఉ.** **తాలమహీజరాజిని రథంబును గూలఁగ మోఁదె, మోఁదినన్**
**నేలఁ బదాతియై నిలిచి నేర్పున వాఁడు శరాళి మారుతిన్**
**ఫాలము నొంచె నొంచినను బావని మూర్ఛిలి తేటి, దానవున్**
**దూలఁగ ముష్టిచేఁ బొడిచె దోర్బల శక్తి రణాంగణంబునన్.** **156**

**ప్రతి :** తాలమహీజరాజిని=తాటిచెట్ల సమూహంతో, రథంబునున్=రథాన్ని, కూలఁగ మోఁదె=కూలిపడేలా కొట్టాడు, మోదినన్=కొట్టగా, నేలన్=నేలమీద, పదాతియై=కాల్బటుడై, నిలిచి, నేర్పునన్=నేర్పుతో, వాఁడు, శరాళి=బాణాల వరుసతో, మారుతిన్=హనుమను, ఫాలమున్=నుదురును, నొంచె=నొప్పించాడు, నొంచినను=నొప్పించగా, పావని=హనుమ, మూర్ఛిలి తేటి=మూర్ఛపడి తేఱుకుని, దానవు=రాక్షసుని, తూలగన్=పడిపోవునట్లు, దోర్బలశక్తిన్=భుజబలశక్తితో, రణాంగణంబునన్=యుద్ధరంగంలో, ముష్టిచేన్= పిడికిలితో, పొడిచె=పొడిచెను.

**తా :** తాటిచెట్లతో రథాన్ని కూలిపడేలా గట్టిగా కొట్టాడు. రథం పడిపోడంతో అక్షకుమారుడు నేలమీద కాలిభటునిలా నిలబడి నేర్పుతో బాణాలతో హనుమ నుదుటిమీద కొట్టి నొప్పించాడు. ఆ దెబ్బకు హనుమ మూర్ఛపడి తేఱుకుని యుద్ధరంగంలో భుజబలంతో రాక్షసుడు పడిపోయేలా పిడికిలితో పొడిచాడు.

## అక్షకుమారాదుల సంహారము

**సీ.** **పొడిచిన మూర్ఛిల్లి, పడిఁ దేటి, దైత్యుండు**
**గదఁ గొని వైచె వక్షంబు పగుల,**
**వైచిన మారుతి వడి వాని గదఁ బుచ్చు**
**కొని వాని దేహంబు గుదియ నేసె,**

**నేసినఁ దన వీఁక నోసరింపక వాఁడు**
**గగనంబు కెగసె నా క్షణమునందె,**
**వాయు తనూజుండు వదలక తన వెంట**
**నెగసిన, గదఁ గొని యేసె నతని,**

**తే. నతఁడు గదఁ ద్రుంప, ఖడ్గాన నతుల శక్తి**
**వాఁడు మారుతి తొడలు నొవ్వంగ నడఁచె**
**నంత సోలుచు నా హనుమంతుఁ, డెగిరి**
**పట్టుకొని వాని ధాత్రిపైఁ గొట్టిచంపె. 157**

**ప్రతి :** పొడిచిన=పొడిచినంత, మూర్ఛిల్లి, వడిన్=వేగముగ, తేఱి=తేరుకుని, దైత్యుఁడు=రాక్షసుడు, గదన్‌కొని=గదను తీసుకుని, వక్షంబు=రొమ్ము, పగుల వైచె=పగులునట్లు వేసెను, వైచినన్=వేయగా, మారుతి=హనుమ, వాని గదన్=అక్షకుమారుని గదను, పుచ్చుకుని=తీసుకుని, వానిదేహంబు, గుదియన్=గదతో, ఏసెన్=వేసెను, ఏసినన్=వేయగా, తన, వీఁకన్=పరాక్రమమును, ఓసరింపక=తగ్గక, వాఁడు, గగనంబుకున్=ఆకాశములోనికి, ఎగసెను=ఎగిరెను, ఆక్షణమునందె, వాయుతనూజుఁడు=హనుమ, వదలక, తనవెంట నెగసినన్=తనవెంట ఎగరగా, గదగొని=గద తీసుకొని, ఏసెన్, అతనిన్, అతడు, గదఁద్రుంప=గదను విరిచి వేయగా, ఖడ్గానన్=కత్తితో, అతులశక్తిన్=సాటిలేని బలంతో, వాఁడు=అక్షకుమారుడు, మారుతి=హనుమ, తొడలున్, నొవ్వంగన్=నొప్పిపుట్టునట్లు, అడఁచె=అణిచివేసెను, అంత, సోలుచున్=వాలిపోతూ, ఆ హనుమంతుఁడు, ఎగిరి, పట్టుకొని, వాని ధాత్రిపైన్=భూమిమీద, కొట్టి, చంపె.

**తా :** హనుమంతుడు పిడికిలితో పొడవగా అక్షకుమారుడు మూర్ఛపోయి వేగంగా తేరుకుని గదతో హనుమ రొమ్ము పగులగొట్టాడు. హనుమ అక్షకుమారుని గదనే తీసుకొని వాడి దేహం పగులునట్లు ఆ గదతో కొట్టాడు. అక్షకుమారుడు తగ్గక ఆకాశంలోకి ఎగిరాడు. వెంటనే హనుమ కూడా ఎగిరాడు. తనవెంట వస్తున్న హనుమను వాడు గదతో కొట్టాడు. హనుమతొడలు గట్టిగా కొట్టి అణచిపట్టాడు. హనుమ వాలిపోతూనే ఎగిరి అక్షకుమారుని పట్టుకుని నేలకేసి గట్టిగా కొట్టి చంపాడు.

**తే. అంత హతశేషు లగువార లరుగుదెంచి,**
**సంభ్రమంబున దానవ చక్రవర్తిఁ**
**గాంచి, కొలువెల్ల సందడి గాఁగ, నపుడు**
**బహు విధంబుల హనుమంతుఁ బ్రస్తుతించి. 158**

**ప్రతి :** అంత=అప్పుడు, హతశేషులగువారు=చావగా మిగిలినవారు, అరుగుదెంచి= వచ్చి, సంభ్రమమున=కంగారుతో, దానవచక్రవర్తిన్=రావణుని, కాంచి=చూచి, కొలువెల్లన్=సభలోని వారంతా, సందడిగాఁగన్=సందడి చేయునట్లు, అపుడు, బహువిధంబుల=అనేక రీతుల, హనుమంతున్=హనుమను, ప్రస్తుతించి=కొనియాడి.

**తా :** చావగా మిగిలినవారు రావణుని కొలువుకు వచ్చి ఆందోళనతో కొలువులోని వారంతా సందడి చేసేవిధంగా అనేకవిధాల హనుమంతుణ్ణి పొగిడారు.

**విశే :** హనుమ అక్షకుమారుల యుద్ధం చాలా విశేషంగా జరిగింది. అక్షకుమారుడు తపోబలసంపన్నుడయిన మహావీరుడు. హనుమను ప్రస్తుతించే శ్లోకాలలో –

**'అంజనానందనమ్ వీరమ్ జానకీశోకనాశనమ్**
**కపీశమ్ అక్షహంతారమ్ వందేలంకాభయంకరమ్'**

అనే ప్రసిద్ధ శ్లోకం ఒకటి ఉంది. హనుమ ఎందరో రాక్షసులను సుందరకాండలో, యుద్ధకాండలో కూడా సంహరించాడు. కానీ హనుమను ప్రత్యేకంగా 'అక్షహంతారమ్' అని పేర్కొని కీర్తించడం – అక్షకుమారుని వీరత్వాన్ని తెలియజేస్తోంది.

అక్షకుమారుని చంపడంతో లంకలోని వారంతా రావణునితో సహా భయపడ్డారు. అందుకే 'వందే లంకాభయంకరమ్' అని శ్లోకంలో మరో బిరుదవాక్యం హనుమకు కూర్చారు. ఈ విషయం గమనించిన మొల్ల చావక మిగిలి వచ్చిన రాక్షసులు హనుమను ప్రస్తుతించారు అన్నది.

**సీ. అక్షుండు తెగె, నశ్మవక్షుండు తెగటాఱె**
**రక్తరోముఁడు నీల్గె రణములోన**
**స్తనితహస్తుఁడు మ్రగ్గె, శార్దూలముఖుఁ**
**డీల్గెఁ గింకర వర్గంబు గీటడంగె**
**శార్దూలకబళుండు సచ్చె, దుర్జయుఁ డేఁగె**
**శతమాయుఁ డొరిగెను, సమసె వక్ర**
**నాసుండు, మఱి రక్తనాసుండుఁ గడతేఱె**
**శూలదంష్ట్రుఁడు నేలఁ గూలిపోయె.**

**తే. మడిసె యూపాక్షుఁ, డట జంబుమాలి తునిఁగె**
**బింగళాక్షునిపేరంత బిలముసొచ్చె,**
**వనము కావలి రాక్షస వర్గ మడఁగె**
**దీర్ఘజిహ్వుండు నేటితోఁదీఱిపోయె.** **159**

**ప్రతి :** అక్షుండు, తెగె=చనిపోయెను, అశ్మవక్షుండు, తెగటాఱె=చంపబడె, రక్త రోముఁడున్, నీల్గె=చచ్చె, రణములోన=యుద్ధంలో, స్తనితహస్తుఁడు, మ్రగ్గె=చచ్చె, శార్దూలముఖుడు, చచ్చె, దుర్జయుఁడు, ఏగె=వెళ్లిపోయె, శతమాయుడు, ఒరిగెను=ఒరిగిపోయాడు, వక్రనాసుండు, సమసె=చనిపోయాడు, మఱి, రక్తనాసుండు, కడతేఱె=చచ్చె, శూలదంష్ట్రుఁడు, నేలగూలిపోయె=చనిపోయె, యూపాక్షుడు, మడిసె=

చనిపోయె, అట, జంబుమాలి, తునిఁగె=మరణించె, పింగళాక్షుని, పేరు+అంత=పేరు అంతయు, బిలము సొచ్చె=కన్నంలోకి వెళ్లింది, వనము కావలి రాక్షస వర్గము=వనపాలకులయిన రాక్షసమూక, అడఁగె=చనిపోయె, దీర్ఘజిహ్వుండు, నేటితోన్=ఈనాటితో, తీఱిపోయె=చనిపోయె.

**తా :** అక్షుడు, అశ్మవక్షుడు, రక్తరోముడు, స్తనితహస్తుడు, శార్దూలముఖుడు, సేవకవర్గము, శార్దూల కబళుండు, దుర్జయుడు, శతమాయుడు, వక్రనాసుడు, రక్తనాసుడు, శూలదంష్ట్రుడు, యూపాక్షుడు, జంబుమాలి, పింగళాక్షుడు, వనమునకు కావలివారైన రాక్షససమూహము, దీర్ఘజిహ్వుడును మరణించారు. ఈ పద్యంలో ఎందరు రాక్షస వీరులు హనుమతో పోరాడి చనిపోయారో పేరు పేరునా చెప్పారు.

**విశే :** ఈ చెప్పడంలో చనిపోయారు అన్నది ప్రతి వీరునికి సంబంధించినదే. చచ్చు అనే క్రియాపదానికి గల పెక్కు పర్యాయపదాలు-తెలుగు భాషాపదాలు ప్రయోగించడం మొల్ల ప్రత్యేకత (1) తెగె (2) తెగటాఱె (3) నీల్గె (4) మ్రగ్గె (5) ఊల్గె (6) గీటడంగె (7) చచ్చె (8) ఏగె (9) ఒరిగెను (10) సమసె (11) కడతేఱె (12) నేల కూలిపోయె (13) మడిసె (14) తునిగె (15) పేరు బిలముసొచ్చె (16) అడగె (17) నేటితో తీఱిపోయె.

**వ. అని వేఱు వేఱు విన్నవించిన నసురేంద్రుఁడు విని తన మనంబున. 160**

**తా :** అలా వేఱు వేఱుగా పేరు పేరున చెప్పగా రాక్షసరాజు విని తన మనస్సులో.

**మత్త. వీని వానరుఁ డంచు నాత్మను విశ్వసింపఁగ జెల్ల, దీ**
**దానవావళి మ్రింగఁ బుట్టిన దయ్యమో? యటుగాక వై**
**శ్వానరుం డిటువంటి రూపున వచ్చి నిల్చెనొ? కాక యీ**
**మేను గైకొని విష్ణుఁ డీడకు మేటియై చనుదెంచెనో? 161**

**ప్రతి :** వీని=ఇందరిని చంపిన వీనిని, వానరుఁడంచు, ఆత్మను=మనస్సులో, విశ్వసింపగన్=నమ్మడం, చెల్లదు=కుదరదు, ఈ దానవావళిన్=ఈ రాక్షస సమూహాన్ని, మ్రింగన్=మ్రింగుటకు, పుట్టిన దయ్యమో= పుట్టిన దెయ్యమై ఉండాలి, అటుగాక=అలా కాకపోతే, వైశ్వానరుండు=అగ్నిహోత్రుడు, ఇటువంటి, రూపునన్= రూపముతో, వచ్చి, నిల్చెనొ?=నిలబడ్డాడో, కాక=కాకపోతే, విష్ణుఁడు=శ్రీమమహావిష్ణువు, ఈ మేనుగైకొని=ఈ వానర శరీరం స్వీకరించి, ఈడకున్=ఇచ్చటికి, మేటియై=ధీరుడై, చనుదెంచెనో?=వచ్చాడో?

**తా :** ఇంతమందిని చంపిన వీణ్ణి వానరుడు అనుకొని మనస్సులో నమ్మడం చెల్లదు. ఈ రాక్షసులందరినీ మ్రింగడానికి పుట్టిన దయ్యమో, కాకపోతే అగ్నిహోత్రుడో? కాక శ్రీమహావిష్ణువే ఈ వానర రూపంతో దిగి వచ్చాడో?

**విశే :** వృత్తము మత్తకోకిల-ర,స,జ,జ,భ,ర, అనే గణాలు ఉంటాయి. 11వ అక్షరము యతి.

**మత్త. కాక యేవరమైన నా కళకంఠుఁ డిచ్చిన నుబ్బి యా**
**నాక వల్లభుఁ డెల్ల కాలము నాకు నోడిన భీతిమై**
**లోక భీకర మైన రాక్షస లోక మెల్ల నడంపగా**
**నీ కరాళపు రూపు నిప్పుడ యీడ కంపఁగ వచ్చెనో? 162**

**ప్రతి :** కాక=అదీకాకపోతే, ఏవరమైనన్=ఏ వరమయినా, ఆ, కళకంఠుఁడు=శివుడు, ఇచ్చినన్=ఇస్తే, ఉబ్బి=ఆనందపడి, ఆ, నాకవల్లభుఁడు=స్వర్గాధిపతి ఇంద్రుడు, ఎల్లకాలము, నాకున్=నాచేత, ఓడిన= ఓడిపోయిన, భీతిమై=భయంతో, లోకభీకరమైన=లోకానికంతా భయంకరమైన, రాక్షసలోకము, ఎల్లన్=అంతా, అడపంగాన్=అణచివేయాలని, ఈ కరాళపు రూపున్=ఈ భయానకపు రూపుని, ఇప్పుడ=ఇప్పుడే, ఈడకు= లంకకు, అంపఁగ=పంపగా, వచ్చెనో=వచ్చెనేమో?

**తా :** అదికాకపోతే స్వర్గాధిపతి అయిన ఇంద్రుడు శివుణ్ణి మెప్పించి ఏదోవరాన్ని పొంది ఉంటాడు. ఆ ఉత్సాహంతో ఎప్పుడూ రాక్షసులచేతిలో ఓడిపోయినవాడు ఈనాడు లోకభీకరులయిన రాక్షసలోకాన్ని నాశనం చేయగల ఈ భయానక రూపుగలవాణ్ణి పంపగా వచ్చాడేమో?

**మత్త. కాక తక్కినవార లెవ్వరు గర్వ సంపద మీఱఁగా**
**నాకు ఢీకొని ఢాకతోడ రణంబు సేయఁగ నోపరే**
**లోకమందిటు కోఁతు లెక్కడ లోఁచు దానవ వీరులన్**
**జోక వీనికిఁ గల్గెనేనియుఁ జూఱ పుచ్చఁడె సర్వమున్. 163**

**ప్రతి :** కాక=కాకపోతే, తక్కిన వారలెవ్వరు=మిగిలిన వారెవ్వరు, గర్వసంపద మీఱఁగా=గర్వం అతిశయించగా, నాకు ఢీకొని=నన్ను ఎదిరించి, ఢాకతోడ= పరాక్రమముతో, రణంబు సేయగన్=యుద్ధం చేయడానికి, ఓపరే=తట్టుకోలేరు, లోకమందిటు=లోకంలో ఈ విధంగా, కోఁతులు=కోతులు, ఎక్కడ, లోఁచు= లొంగదీసుకొనును, దానవవీరులన్=రాక్షస వీరులను, జోక=ఉత్సాహము, వీనికిన్, కల్గెనేనియున్= కలిగినట్లయితే, సర్వమున్=అంతా!, చూఱపుచ్చడె=కొల్లగొట్టడా?

**తా :** అలాకాకపోతే తక్కిన వారెవ్వరూ గర్వంతో నన్ను ఢీకొని ఇంత పరాక్రమంతో యుద్ధం చేయలేరు. లోకంలో ఎక్కడయినా కోతులు రాక్షసవీరుల్ని లొంగదీసుకోవడం ఉందా? ఈతడికి గనుక ఉత్సాహం తోడయితే సర్వము కొల్లగొట్టడా?

**విశే :** అక్షకుమారుని చంపాడు అనగానే హనుమ సామాన్యుడు కాదనే భయం లంకలో వారికే కాదు రావణునికీ కలిగింది. అందుకే ఒక్కసారి నిగ్రహించుకుని వీడు కోతేనా? దేవతలెవరయినా ఈ రూపంలో వచ్చారా? కోతి రాక్షసుల్ని లొంగదీసుకోవడం ఏమిటి? అనే ఆలోచనలతో కిందా మీదా అవుతున్నాడు, రావణుడు.

**విశే :** హనుమ ఎడల 'వందే లంకా భయంకరమ్' – అన్నది సార్థకమయింది ఈ సందర్భంలో.

**వ. అనియిట్లనేక ప్రకారంబులఁ జింతించి యక్షకుమారుం దలంచి పలు దెఱంగులఁ బలవించుచున్న తండ్రిం గాంచి మేఘనాదుం డిట్లనియె. 164**

**తా :** అని ఈ విధంగా అనేకవిధాల ఆలోచించి, అక్షకుమారుని తలచుకుని, పలురీతుల దుఃఖిస్తున్న తండ్రిని చూచి మేఘనాదుడు ఇలా అన్నాడు.

**విశే :** మేఘనాదుడు అనేది ఇంద్రజిత్తు అసలు పేరు. ఇంద్రుణ్ణి జయించి – 'ఇంద్రజిత్తు' అనే బిరుదనామం సంపాదించుకొన్నాడు.

**ఇంద్రజిత్తు హనుమంతునిపై నెత్తివచ్చుట**

**క. దేవతలతోడఁ గూడను,**
**దేవేంద్రుని గెలిచినట్టి దేవర! మీకు**
**న్నీ వగపేటికి నేఁటికి**
**దేవా! చిత్తంబులోన దీనుని భంగిన్? 165**

**ప్రతి :** దేవతలతోడన్ కూడను=దేవతలందరితో కలిపి, దేవేంద్రుని, గెలిచినట్టి, దేవర!=ప్రభు!, మీకున్=మీకు కూడా, నేఁటికి, దేవా! చిత్తంబులోన=మనసులో, దీనుని భంగిన్=శక్తిలేని వానివలె, ఈవగపేటికి=ఈ దుఃఖమెందుకు,

**తా :** దేవరా! దేవతలందరినీ ఇంద్రునితోసహా గెలిచిన మీకు కూడా ఈ దుఃఖమెందుకు? ఈనాడు మనస్సులో దీనునివలె ఈ బాధ దేనికి దేవా!

**విశే :** ఈ చిన్న కందపద్యంలో – మేఘనాదుడు తండ్రిని దేవర! అనీ, దేవా! అనీ రెండు సంబోధనలతో పలకరించి ఆత్మీయంగా ధైర్యం చెప్తున్నాడు. మీవంటి వారికి కూడా ఈ దుఃఖమేమిటి అంటూ 'మీకున్నీ' – అనే తెలుగు పదం అందంగా అమరింది.

**క. వానరునిఁ గొండ చేసుక**
**పూనికఁ జింతింప నేల? భుజబలశక్తిన్**
**వానిం జంపెద నొండెను**
**దీనునిఁ గావించి పట్టి తెచ్చెద నొండెన్. 166**

**ప్రతి :** వానరుని=కోతిని, కొండ చేసుక=పెద్ద కొండగా చేసుకుని, పూనికన్= ప్రయత్నంతో, చింతింపనేల?= విచారించడం దేనికి? భుజబలశక్తిన్=నా భుజబలశక్తితో, వానిన్, చంపెదన్, ఒండెను=కాకపోతే, దీనుని గావించి=అశక్తునిగా చేసి, పట్టి తెచ్చెదన్, ఒండెన్=ఒకటి – ఏదో ఒకటి తప్పక చేస్తాను.

**తా :** ఒక చిన్న కోతిని కొండ చేసుకుని, చిన్న సమస్యని పెద్దగా చేసుకుని, ప్రత్యేక ప్రయత్నంతో విచారించడమెందుకు? ఒకటి నా భుజబలంతో వాణ్ణి చంపుతాను, లేదా అశక్తునిగా చేసి పట్టి తెస్తాను. ఏదో ఒకటి చేస్తాను.

**విశే :** కొండ చేసుక-కందువమాట. ఒండెన్=కాని పక్షంలో పక్షాంతరములో.

**వ. నావుడు రాక్షసేశ్వరుం దతని మాటలకు మనంబున నలరి, నీవు విరించి వరదత్త ప్రతాప హుతాశనుండవు, చాపవిద్యాప్రవీణుండవు, తపోబల సమర్థుండవు, దేవేంద్రగర్వ విమర్దనుండవు, మత్సమానశౌర్యచాతుర్యధుర్యుండవు, గావున నీ కసాధ్యం బగు కార్యంబెద్దియును లేదు. నీ విపుడు పోయి వాని సాధించి రమ్మని పంచిన. 167**

**ప్రతి :** నావుడు=అనగా, రాక్షసేశ్వరుండు=రావణుడు, అతని, మాటలకు, మనంబునన్=మనస్సులో, అలరి= ఆనందించి, నీవు, విరించి వరదత్త=బ్రహ్మ ఇచ్చిన వరాలవల్ల, ప్రతాప హుతాశనుండవు=అగ్నివంటి ప్రతాపం కలవాడవు, చాపవిద్యా ప్రవీణుండవు=విలువిద్యలో నేర్పరివి, తపోబల సమర్థుండవు=తపోబలముచే సమర్థుడవు, దేవేంద్ర గర్వ విమర్దనుండవు=దేవేంద్రుని గర్వమును అణచినవాడవు, మత్సమాన=నాతో సమానమైన, శౌర్యచాతుర్యధుర్యుండవు=శౌర్య చాతుర్యములలో అగ్రేసరుడవు, కావున, నీకు, అసాధ్యంబగు= చేయలేని, కార్యంబు=పని, ఎద్దియును లేదు=ఏదిలేదు, నీవు, ఇపుడు=ఇప్పుడే, పోయి, వాని సాధించి=జయించి, రమ్మని, పంచిన=పంపగా.

**తా :** ఇంద్రజిత్తు అలా చెప్పగా రావణుడు అతని మాటలకు మనస్సులో ఆనందించాడు. నాయనా! నీవు బ్రహ్మ ఇచ్చిన వరాలవల్ల ప్రతాపంలో అగ్నివి, విలువిద్యా నైపుణ్యం గలవాడవు, తపోబల సమర్థుడవు, దేవేంద్రుని గర్వాన్ని అణచినవాడవు, నాతో సమానమైన శౌర్యచాతుర్యాలలో అగ్రేసరుడవు. కాబట్టి నీకు అసాధ్యమైనది ఏదీలేదు. ఇప్పుడే వెళ్లి వాణ్ణి జయించి రా! అని పంపగా-

**విశే :** రావణుడు మేఘనాదుని శక్తిని వివరిస్తూ అతడు తనతో సమానమైన శౌర్యవంతుడని అభినందించాడు. హనుమను జయించడానికి తనతో సమానమైన బలసంపన్నుడు కావాలి అని రావణుడు మనస్సులో నిశ్చయించుకున్నాడని తెలుస్తోంది.

**సీ. మాణిక్య తపనీయ మయ విమానముతోడఁ**
**గెంబట్టు బిరుదు టెక్కెంబుతోడ**
**సరి చెప్పఁగా రాని శస్త్రాస్త్రములతోడ**
**బలమైన దివ్య చాపంబుతోడ**
**నాహవ కోవిదుండైన సారథితోడ**
**ఘన సత్త్వ జవ తురంగములతోడఁ**
**గనుపట్టి దిక్కుల గగన యానముతోడ**
**బాల సూర్యోదయ ప్రభలతోడఁ**

**తే. గరము విలసిల్లు రథ మెక్కి, గంధ నాగ**
**తురగ రథ భట వంది సందోహ పటహ**

**శంఖ కాహళ దుందుభి స్వనము లొలయ**
**మేఘనాదుండు హనుమంతుమీఁద వెడలె.** **168**

**ప్రతి :** మాణిక్య=మాణిక్యములతో, తపనీయమయ=బంగారుతో కూడిన, విమానముతోడన్=శిఖరములతో, కెంబట్టు=ఎఱ్ఱని, పట్టుబిరుదు టెక్కెంబుతోడ=శౌర్యానికి చిహ్నాలయిన జెండాలతో, సరి చెప్పఁగా రాని=ఇన్ని అని సరిగా చెప్పలేని, శస్త్రాస్త్రములతోడ, బలమైన దివ్య చాపంబుతోడన్=బలమైన దివ్యమైన విల్లుతోను, ఆహవకోవిదుండైన=యుద్ధంలో రథం నడపడంలో గల మెళకువలు తెలిసినవాడు, సారథితోడ=సారథితో, ఘనసత్త్వ జవ తురంగముల తోడన్=గొప్పబలము శక్తిగల గుఱ్ఱాలతోను, కనుపట్టి=కనిపెట్టి, దిక్కుల, గగనయానముతోడన్=ఆకాశంలో ప్రయాణిస్తూ, బాలసూర్యోదయ ప్రభలతోడన్=ఉదయసూర్యుని వంటి కాంతితోను, కరము=మిక్కిలి, విలసిల్లు=ప్రకాశించు, రథమెక్కి, గంధనాగ=మదించిన ఏనుగుల, తురగ=గుఱ్ఱముల, రథ=రథముల, భట=భటుల, వంది, సందోహస్తోత్రము=చేయువారి సమూహాల, పటహశంఖ కాహళ దుందుభి=వివిధ వాయిద్యాల, స్వనములు=నాదాలు, ఒలయన్=వ్యాపించగా, మేఘనాదుండు, హనుమంతుమీఁద, వెడలె=వెళ్లెను.

**తా :** మాణిక్యాలతో కూడిన స్వర్ణమయమైన శిఖరాలతో, ఎఱ్ఱని పట్టు బిరుదు జెండాలతో, లెక్కలేని శస్త్రాస్త్రలతో, గొప్ప విల్లుతో, యుద్ధనైపుణ్యం గల సారథితోడ ఆకాశంలో ప్రయాణించే శక్తిగలిగి, ఉదయభానుని ప్రకాశంతో ప్రకాశించే రథమెక్కి ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, భటులు, వందుల సందోహం, పటాహ, శంఖ కాహళ దుందుభివంటి వాయిద్యాల నాదాలు వ్యాపించగా మేఘనాదుడు హనుమంతుని మీదకు యుద్ధానికి వెళ్లాడు.

**లయగ్రాహి.**

**పెక్కులగు గుఱ్ఱములుఁ జొక్కపు రథంబులును,**
**నెక్కువగు నేనుఁగులుఁ గ్రిక్కిఱిసి రాఁగా**
**రక్కసులు సేరి యిరు ప్రక్కలును గొల్వఁ గడు**
**నుక్కునను మీఱి చల మెక్కుడుగ నంతన్**
**గ్రక్కదల భూతలము, చుక్క లొగి రాల, శిల**
**లుక్కసిలి, నాదములు పిక్కటిలి మ్రోయన్**
**దెక్కెముల మించి, జవ మెక్కుడుగఁ జూపు దళ**
**మక్కజముగా నడువ దిక్కులు వడంకన్.** **169**

**ప్రతి :** పెక్కులగు=ఎక్కువగు, గుఱ్ఱములున్, చొక్కపు=అందమైన, రథంబులును, ఎక్కువగు, ఏనుగుఁలున్, క్రిక్కఱిసిరాఁగా=ఒకదాని కొకటి రాసుకుంటూ రాగా, రక్కసులు, చేరి, ఇరుప్రక్కలును=రెండుపక్కలా, కొల్వన్=కొలవగా, కడున్=మిక్కిలి, ఉక్కునను=గర్వముతో, మీఱి=అతిశయించి, చలమెక్కుడుగన్=గట్టి

పట్టుదలతో, అంతన్, క్రక్కదలన్= భూమి అధికంగా కదలగా, చుక్కలు వరసగా రాలగా, శిలలు=రాళ్లు, ఉక్కసిలి=వేడెక్కి బ్రద్దలై, నాదములు=ధ్వనులు, పిక్కటిలి మ్రోయన్=అధికంగా మ్రోయగా, డెక్కెముల= జెండాలతో, మించి= ప్రకాశించి, జవము=శక్తి, ఎక్కుడున్= అధికంగా, చూపు=ప్రదర్శించు, దళము=సేన, అక్కజముగ=ఆశ్చర్యకరంగా, దిక్కులు, వడంకన్–

**తా :** ఎన్నో గుఱ్ఱాలు, అందమైన రథాలు, చాలా ఏనుగులు క్రిక్కిఱిసి రాగా, ఇరుపక్కలా రాక్షసులు కొలవగా, మిక్కిలి గర్వంతో, పట్టుదలతో నడవగా, భూమి మిక్కిలి కదిలిపోయింది. చుక్కలు వరుసగా రాలిపోయాయి. రాళ్లన్నీ వేడెక్కి బ్రద్దలవడం వల్ల పుట్టిన నాదాలతో తమశక్తి ప్రదర్శిస్తూ సైనికదళం జెండాలతో ఆశ్చర్యం గొలిపేలా దిక్కులు వణికిపోయేలా నడిచింది.

**వ. ఇట్లు భయంకరాకారంబున వెడలి, కంఠ హుంకృతులును, భేరీ భాంకృతులను, నంబరంబున, జెలంగ, బొంగి చనుదెంచుచున్న రాక్షస సైన్యంబుం గనుంగొని హనుమంతుఁడు తోరణ స్తంభంబుపై నుండి, బధిరీభూత దిగంతరంబుగా భీకర గతి నార్చిన.** **170**

**ప్రతి :** ఇట్లు, భయంకరాకారంబున=భయము కొలిపే ఆకారంతో, వెడలి=వెళ్లి, కంఠహుంకృతులను= కంఠంనుండి వెలువడే 'హుం' అనే శబ్దాలు, భేరీ భాంకృతులను=భేరీ అనే వాయిద్యం నుండి వచ్చే 'భాం' అనే శబ్దాలు, అంబరంబునన్=ఆకాశంలో, చెలంగన్=వ్యాపించగా, పొంగి=ఆనందముతో, చనుదెంచుచున్న= వస్తున్న, రాక్షససైన్యంబున్=రాక్షససైన్యాన్ని, కనుగొని=చూచి, హనుమంతుడు, తోరణ స్తంభంబుపైన ఉండి, బధిరీభూత దిగంతరంబుగా=దిక్కులన్నీ చెవుడు పడేలా చేయగల, భీకర గతిన్=భయంకరంగా, ఆర్చిన=అరవగా –

**తా :** ఇలా భయంకరాకారంతో ఇంద్రజిత్తు వెళ్లాడు. కంఠహుంకృతులు, భేరీ భాంకృతులు ఆకాశం వరకు వ్యాపించి చెలరేగగా ఆనందంతో వస్తున్న రాక్షససైన్యాన్ని తోరణస్తంభం మీద ఉన్న హనుమ చూచాడు. చూచి దిక్కులన్నీ చెవుడు పడేటంత గట్టిగా అరవగా!

**విశే :** మేఘనాదుని సేన, భేరీలు చేసిన ధ్వనికంటే ఒక్క హనుమ చేసిన ధ్వని మొత్తం విశ్వాన్నంతా బధిరీభూతంగా చేసిందన్న మాట.

**విశే :** చిన్న కోతి విషయం కొండంత చేసుకోవాలా అంటూ తండ్రికి ధైర్యం చెప్పాడు ఇంద్రజిత్తు. ఆ కోతి చేసిన నాదానికి అందరి చెవులు గళ్లుపడ్డాయి. పెద్ద శబ్దం వింటే చెవుడు వచ్చే ప్రమాదం ఉంది అని విజ్ఞాన శాస్త్రం చెప్తోంది.

## మేఘనాదుని భయంకర సమరము

**క. కలఁగినవి దేవ గుణములు,**
**జలధులు ఘూర్ణిల్లె, గిరులు చలనం బొందెన్,**

**జలజాప్త చంద్రు లొదిగిరి,**
**జలధరములు పఱియ లగుచుఁ జదలం బర్వెన్.** **171**

**ప్రతి :** దేవగణములు=దేవతా సమూహములు, కలఁగినవి=కలవరపడినవి, జలధులు=సముద్రాలు, ఘూర్ణిల్లె=అల్లకల్లోల మయినవి, గిరులు=పర్వతాలు, చలనంబొందెన్=కదిలిపోయాయి, జలజాప్తచంద్రులు= సూర్యచంద్రులు, ఒదిగిరి=దాక్కొనిరి, జలధరములు=మేఘాలు, పఱియలగుచు=ముక్కలగుచు, చదలన్=ఆకాశంలో, పర్వెన్=వ్యాపించాయి.

**తా :** దేవతాగణాలు కలవరపడ్డాయి. సముద్రాలన్నీ అల్లకల్లోలమైనాయి. పర్వతాలు కదిలిపోయాయి, సూర్యచంద్రులు దాక్కున్నారు. మేఘాలు ముక్కముక్కలై ఆకాశమంతా వ్యాపించాయి.

**విశే :** హనుమ చేసిన గంభీర నాదానికి ప్రకృతిలో ఇంతటి విశేషమైన మార్పులు సంభవించాయి.

క. **అప్పుడు దానవ వీరులు**
**నిప్పులు వర్షించునట్టి నిశితాస్త్రములన్**
**గప్పిరి కెందొగ వానలఁ**
**గప్పిన శైలంబుఁ బోలఁ గపివరు మీఁదన్.** **172**

**ప్రతి :** అప్పుడు, దానవవీరులు=రాక్షసవీరులు, నిప్పులు వర్షించునట్టి=నిప్పులు కురిసేటటువంటి, నిశితాస్త్రములన్=వాడి బాణాలను, కెందొగ=ఎఱ్ఱతామర, వానలన్=వానలతో కప్పిన, శైలంబున్=కొండను, పోలన్=పోలునట్లు, కపివరు మీదన్=వానరశ్రేష్ఠుని మీదను, కప్పిరి.

**తా :** రాక్షస వీరులు అప్పుడు నిప్పులు కురిసేవాడి బాణాలతో హనుమంతుని కప్పారు. ఆ హనుమ ఎలా ఉన్నాడు అంటే ఎఱ్ఱ తామరపూల వానతో కప్పబడిన కొండలా ఉన్నాడు.

**విశే :** చక్కని ఉపమాలంకారము.

తే. **అంప వర్షంబు తనమీదఁ జొంపములుగ**
**లీలఁ గురియంగ, నవి యెల్ల లెక్కఁగొనక**
**భువికి లంఘించి, యప్పు డద్భుతముగాఁగ**
**వాల మల్లార్చి యొక మహాసాల మెత్తి.** **173**

**ప్రతి :** అంప వర్షంబు=బాణాలవాన, తనమీదన్, జొంపములుగ=నిరంతర ధారగా, లీలన్=ఆటగా, కురియంగా, అవి యెల్లన్=వాటినన్నిటిని, లెక్కగొనక=లెక్కచెయ్యక, భువికి లఘించి=నేలమీదకి దుమికి, అప్పుడు, అద్భుతముగాఁగ=ఆశ్చర్యం గొలిపేలా, వాలము=తోక, అల్లార్చి=గుండ్రంగా తిప్పి, ఒక మహాసాలము=ఒక పెద్ద మదిచెట్టును, ఎత్తి=పెకలించి.

**తా :** బాణాల వాన తనమీద నిరంతరం ధారగా కురుస్తూ ఉండగ దానిని లెక్కచెయ్యక తోరణం మీద నుండి నేలమీదికి ఉరికి హనుమ ఆశ్చర్యపడే విధంగా తనతోక గుండ్రంగా తిప్పి ఒక పెద్ద మద్దిచెట్టును పెకలించి.

**తే. తేరు లన్నియు గూరాటి తేరులుగను,**
**గుఱ్ఱముల నెల్లఁ గావేరి గుఱ్ఱములుగ,**
**నేనుఁగుల నెల్ల వెదరూపు టేనుఁగులుగ**
**దళము లన్నియు మఱి హరిదళము గాఁగ. 174**

**ప్రతి :** తేరులన్నియున్=రథాలన్నీ, కూరాటి తేరులుగను=పులియబెట్టిన కడుగు నీరు తేరేటట్లుగా చేసిన, కడుగు నీటి తేట, గుఱ్ఱములన్+ఎల్లన్=గుఱ్ఱాలన్నిటిని, కావేరిగుఱ్ఱములుగ=పసుపుతో చేసిన గుఱ్ఱాలుగా, ఏనుఁగుల నెల్లన్=ఏనుగులన్నిటిని, వెదరూపు టేనుగులుగ=బొమ్మలుగా చేసిన ఏనుగులుగా, దళములన్నియు= సైనిక దళాలన్నీ, మఱి, హరి దళముగాఁగ=పుసుపు పచ్చని ధాతువు, కాఁగ=కాగ.

**తా :** రథాలన్నీ పులియబెట్టిన కడుగునీటి తేటలాగ, గుఱ్ఱాలన్నీ పసుపుతో చేసిన గుఱ్ఱాలుగా, ఏనుగులనన్నిటినీ బొమ్మ ఏనుగుల్లా సైనిక దళాలన్నీ పసుపు పచ్చని ధాతువులు కాగా – అంటే ఏవిధమయిన ఉపయోగం లేనివిగా అని.

**విశే :** ఈ పద్య రచనలో తేరులు – కూరాటి తేరులు, గుఱ్ఱములు – కావేరి గుఱ్ఱాలు, ఏనుగులు – వెదరూపు టేనుగులు, దళములు – హరిదళములు అనే పదప్రయోగంతో చక్కని చమత్కారం సాధించింది మొల్ల.

**వ. ఇట్లు సమయింపం జూచి బలములపై కురికి. 175**

**తా :** ఈ రకంగా చంపాలని ఆయా బలాల మీదికి ఉఱికి –

**సీ. కరి యూథములమీఁదఁ గదిసి మావంతుల**
**తోడఁ గూడఁగఁ బట్టి తునియఁ గొట్టి,**
**గుఱ్ఱంపుఁ బౌఁజులకును దాఁటి రౌతులఁ**
**గలయంగఁబట్టి చెక్కలుగఁగొట్టి,**
**రథములపైకి నుగ్రంబుగా లంఘించి**
**రథికులతోఁ గూడ రసను గొట్టి,**
**బలములమీద నిబ్బరముగాఁ గుప్పించి**
**వాల ముఖంబునఁ దూలఁ గొట్టి,**

**తే. పటహ నిస్సాణ కాహళ పటిమ లురియ**
**ద్రొక్కి శస్త్రాస్త్ర నిచయముల్ తుమురు చేసి**

**ఛత్రములఁ ద్రుంచి పడగల సత్త్వ మణఁచి**
**పవన సూనుండు సాహస ప్రౌఢి మెఱసె. 176**

**ప్రతి :** కరియూథముల మీదన్=ఏనుగుల సమూహం మీదకు, కదిసి=విక్రమించి, మావంతులతోడన్= ఏనుగులను నడిపే మావటీలతో, కూడగన్‌పట్టి=కలిపిపట్టుకొని, తునియన్ కొట్టి=ముక్కలుగా కొట్టి, గుఱ్ఱంపున్=గుఱ్ఱముల, పౌజులకును=వరుసలకును, దాఁటి=అతిక్రమించి, రౌతులన్=స్వారీ చేయు వీరులను, కలయంగన్ పట్టి=అందరినీ కలయగట్టి, చెక్కలుగన్=ముక్కలు చెక్కలుగా, కొట్టి, రథముల పైకిన్= రథాలమీదకు, ఉగ్రంబుగా=భయంకరముగా, లంఘించి=దుమికి, రథికులతోన్ కూడ=రథాలమీద ఉండి యుద్ధం చేసేవారిని కూడ, రసను గొట్టి=పొడి చేసి, బలముల మీద=అన్ని సేనలమీద, నిబ్బరముగా ధైర్యంగా, కుప్పించి=దుమికి, వాలముఖమున=తోకతో, తూలగొట్టి=పడగొట్టి, పటహ, నిస్సాణ, కాహళ, వాద్యవిశేషముల, పటిమలు=శక్తులు, ఉరియ=చలించునట్లు, త్రొక్కి=పైకి రాకుండా చేసి, శస్త్రాస్త్ర సమూహాలను, తుమురుచేసి=చిన్నచిన్న ముక్కలుగా చేసి, ఛత్రములన్=గొడుగులను, త్రుంచి=ముక్కలు చేసి, పడగల సత్త్వమణంచి=జెండాల ప్రకాశంపోగొట్టి (ధ్వంసం చేసి), పవన సూనుండు=హనుమంతుడు, సాహస ప్రౌఢిమెఱసె=అతిశయించిన సాహసముతో ప్రకాశించెను.

**తా :** ఏనుగు సమూహాలను మావటీలతో సహా ముక్కలుచేసి, గుఱ్ఱాల వరుసలను రౌతులను కలిపి పట్టుకుని ముక్కలుచేసి, రథాలమీదకు ఉరికి రథికులతో సేనలన్నిటి మీద నిబ్బరంగా దుమికి, తోకకుచ్చుతో పడవేసి, తొక్కిపట్టి, శస్త్రాస్త్రలను చిన్నచిన్న ముక్కలుగా చేసి, గొడుగులు, జెండాలు విరిచేసి హనుమంతుడు అతిశయించిన సాహసంతో ప్రకాశించాడు.

**వ. అట్టి సమయంబున. 177**

**తా :** అటువంటి సమయంలో –

**చ. అనలము రీతి మండి దివిజారి తనూజుఁడు తేరు దోలి, య**
**య్యనిల తనూజు నేసె వివిధాయుధ పంక్తుల, వాని నెల్లఁ దు**
**త్తునియలు సేసె వాయుజుఁడు, దోర్బల శక్తిని దైత్యుఁ డేయఁ దోఁ**
**కను దునుమాడె వాని విశిఖంబుల నన్నిటి వాయుసూనుఁడున్. 178**

**ప్రతి :** అనలమురీతి మండి=అగ్నిలా మండి, దివిజారి తనూజుఁడు=దేవతల శత్రువైన రావణుని కొడుకు, తేరున్=రథమును, తోలి=నడిపి, ఆ+అనిలతనూజున్= ఆ వాయుపుత్రుని, వివిధాయుధపంక్తులన్=వివిధమైన ఆయుధాల సమూహంతో, ఏసె=కొట్టెను, వానినెల్లన్=వాటినన్నిటిని, తుత్తునియలుసేసె=చిన్న చిన్న ముక్కలుగా చేసాడు, వాయుజుఁడు=హనుమంతుడు, దోర్బలశక్తిని=భుజశక్తితో, దైత్యుఁడు=రాక్షసుడు, ఏయన్=వేయగా, తోకను=తోకతో, వాని, విశిఖంబులన్=బాణములు, అన్నిటి=అన్నిటిని, వాయుసూనుఁడున్= హనుమంతుడు, తునుమాడె=ఖండించెను.

**తా :** ఇంద్రజిత్తు అగ్నిలా మండిపడుతూ రథంతోలి హనుమను రకరకాల ఆయుధాల సమూహంతో కొట్టాడు. ఆ ఆయుధాల నన్నింటినీ హనుమ ముక్కలు ముక్కలు చేసేశాడు. భుజశక్తితో రాక్షసుడు కొట్టగా ఆ బాణాలనన్నింటినీ తన తోకతో ముక్కలు చేశాడు హనుమ.

**క.** **గిరులను బావని రువ్వుచు**
**దరువుల నేయంగఁ, గినిసి దానవుఁ డంతన్**
**దురమున నడుమనె త్రుంచెను**
**శరజాలముచేత నొక్క క్షణమున వానిన్.** **179**

**ప్రతి :** పావని=హనుమంతుడు, గిరులను=కొండలను, రువ్వుచు=విసురుతూ, తరువులన్=చెట్లతో, ఏయంగన్=కొట్టంగా, కినిసి=కోపగించి, అంతన్, దానవుఁడు, దురమున=యుద్ధమున, నడుమనె=మధ్యలోనే, శరజాలము చేతన్=బాణాల గుంపుతో, ఒక్క క్షణమున, వానిన్=ఆ కొండలను, చెట్లను, త్రుంచెను=ముక్కలు చేసెను.

**తా :** హనుమంతుడు కొండలను చెట్లను ప్రయోగించగా కోపగించిన ఇంద్రజిత్తు వాటిని తనదాకా రాకుండా మధ్యలోనే తన బాణాలతో ఒక క్షణంలో ముక్కలు చేసేశాడు.

**తే.** **గంధవహు పుత్త్రుఁ డప్పు డాగ్రహముతోడ**
**రథముఁ గూలంగఁ దన్ని సారథినిఁ జంపి**
**గుఱ్ఱములఁ జంపి, కేతువుఁ గూల నడవ,**
**మేఘనాదుండు కినిసి సమీర సుతుని.** **180**

**ప్రతి :** గంధవహుపుత్రుఁడు=వాయునందనుడు, అప్పుడు, ఆగ్రహముతోడ=కోపముతో, రథము, కూలంగదన్ని=కూలిపోవుట్లుగా తన్ని, సారథిని చంపి, గుఱ్ఱములన్, చంపి, కేతువున్=జెండాను, కూలనడవ= విఱిచి పడవేయగ మేఘనాదుండు, కినిసి=కోపగించి, సమీరసుతుని=హనుమను –

**తా :** హనుమంతుడు అప్పుడు రథము కూలిపోయేలా తన్ని, సారథిని చంపి గుఱ్ఱాల్ని చంపి, జెండా విరిచేయగా, మేఘనాదుడు కోపంతో సమీరసుతుని –

**వ.** **అహంకారంబునఁ బ్రతిఘటించి.** **181**

**తా :** అహంకారంతో ఎదుర్కొని

**క.** **వాయవ్యాస్త్రము నంతట**
**వాయుజు మీఁదికి నతండు వడి నేసిన, నా**
**వాయవ్యాస్త్రముఁ దూలెను**
**వాయుజునిం జంప నోడి వారని కరుణన్.** **182**

**ప్రతి :** వాయవ్యాస్త్రమును, అంతట, వాయుజు=హనుమ, మీదికిన్, అతండు, వడినేసిన=వేగంగా వేయగా, ఆ వాయవ్యాస్త్రమున్, వాయుజునిన్=హనుమను, చంపన్=చంపుటకు, ఓడి=శక్తిలేక, వారని కరుణన్=మిక్కిలి దయతో, తూలెను=కూలిపోయెను.

**తా :** హనుమ మీద మేఘనాదుడు వాయవ్యాస్త్రం ప్రయోగించాడు. ఆ వాయవ్యాస్త్రము హనుమను చంపలేక దయతో కూలిపడినది.

**విశే :** వాయవ్యాస్త్రము=వాయుదేవునకు సంబంధించింది. వాయుజుని మీద వాయవ్యాస్త్రం ప్రయోగిస్తే అది హనుమను ఏమి చేస్తుంది. హనుమ వాయుపుత్రుడు కదా! అందుకే మొల్ల వాయవ్యాస్త్రము-వాయుజుడు అనే పదబంధాలు రెండేసిసార్లు ప్రయోగించి శబ్దచమత్కారాన్ని కూర్చింది.

**వ. అది వృథ యగుటం గని మఱియును. 183**

**తా :** అది వృథా అయిపోవడం చూచి మఱియు.

**క. రౌద్రం బడరఁగ నేసెను**
**రుద్రాస్త్రం బతనిమీఁద రూఢిగ నతఁడా**
**రుద్రుని యంశం బగుటను**
**రౌద్రాస్త్రము దేలిపోయె రభసం బొప్పన్. 184**

**ప్రతి :** రౌద్రంబడరఁగన్=అతనిలోని రౌద్రం తగ్గిపోయేలా, రౌద్రాస్త్రంబు=రౌద్రాస్త్రాన్ని, అతనిమీద, రూఢిగ=స్థైర్యంతో, ఏసెను, అతడు=హనుమ, ఆ రుద్రుని యంశంబు=హనుమంతుడు రుద్రాంశతో పుట్టినవాడు కావడంవల్ల, రౌద్రాస్త్రము, తేలిపోయె=ఏమీ చేయక తేలిపోయింది, రభసంబు+ఒప్పన్=ఉత్కంఠ కలిగేలా.

**తా :** హనుమలోని రౌద్రం పోయేలా మేఘనాదుడు రౌద్రాస్త్రాన్ని హనుమ మీద స్థైర్యంతో వేసాడు. అయితే హనుమంతుడు రుద్రాంశ సంభూతుడు కావడంతో ఇదేమిటి అని ఉత్కంఠ కలిగేలా ఆ అస్త్రం అతనిని ఏమీ చేయలేకపోయింది.

**వ. అమ్మహాస్త్రంబు గూడఁ దప్పి పోవుట కాశ్చర్యంబు నొంది యింద్రజిత్తు మఱియును. 185**

**తా :** ఆ మహాస్త్రంకూడ ఏమీ చేయకపోవడం చూసి ఆశ్చర్యపడి ఇంద్రజిత్తు మఱియును.

## బ్రహ్మాస్త్రమునకు గట్టుపడిన హనుమంతుఁడు

**క. సుర ఖచర యక్ష కిన్నర**
**గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ గణం**
**బరుదంది చూడఁగా ని**
**ర్భర ముష్టిం దొడిగి యేసె బ్రహ్మాస్త్రంబున్. 186**

**ప్రతి :** సుర=దేవతలు, ఖచర=ఆకాశంలో సంచరించేవారు, యక్ష, కిన్నర, గరుడ, ఉరగ, సిద్ధ, సాధ్య, గంధర్వ, గణంబు=సమూహాలు, అరుదంది=ఆశ్చర్యపడి, చూడఁగా=చూస్తుండగా, నిర్భరముష్టిన్= గట్టి పిడికిలితో, తొడిగి, ఏసె, బ్రహ్మాస్త్రంబున్.

**తా :** సుర ఖచర యక్ష కిన్నర గరుడ ఉరగ సిద్ధ సాధ్య గంధర్వగణాల వారంతా ఆశ్చర్యపడి చూస్తూండగా గట్టిగా పిడికిలి బిగించి బాణంతొడిగి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

**వ. అట్టి యవసరమున** **187**

**తా :** ఆ సమయములో

**క. సప్తాంభోధులు కలఁగెను,**
**సప్త ద్వీపములు వణఁకె, శైలము లదరెన్,**
**సప్తానిలములు దలఁకెను,**
**సప్తాశ్వుఁడు బ్రమసపడియె, జగములు గదలెన్.** **188**

**ప్రతి :** సప్త+అంభోధులు=ఏడుసముద్రాలు, కలఁగెను=చలించెను, సప్త ద్వీపములు, వణఁకె, శైలములదరెన్= కొండలు అదిరినవి, సప్త+అనిలములు=ఏడువాయువులు, తలఁకెను=పైకివీచినవి, సప్త+అశ్వుడు- సప్తాశ్వుడు=ఏడు గుఱ్ఱములు కలవాడు, సూర్యుడు, బ్రమసపడియె=కదలలేకపోయాడు, జగములు, కదలెన్=కదిలిపోయాయి.

**తా :** ఏడు సముద్రాలు చలించాయి. ఏడుద్వీపాలు వణికిపోయాయి. కొండలు అదిరినవి, వాయువులు ఏడూ పైకి వీచాయి, సూర్యుడు చలనంలేకుండా ఆగిపోయాడు, జగములు కదలిపోయాయి. బ్రహ్మాస్త్ర ప్రయోగంతో ప్రకృతి ఎంతగా సంక్షోభించిదో ఈ చిన్న పద్యంలో వివరించింది మొల్ల. సంఖ్యావాచకం - 'సప్త'కు స్తంబంధించిన పరిజ్ఞానం కూడా అందించింది.

**సప్త సాగరములు** : 1. లవణ 2. ఇక్షు 3. సురా 4. ఘృత 5. దధి 6. క్షీర 7. జల

**సప్త ద్వీపాలు** : 1. జంబూ 2. ప్లక్ష 3. శాల్మలీ 4. కుశ 5. క్రౌంచ 6. శాక 7. పుష్కర

**సప్తకులపర్వతాలు** : 1. మహేంద్ర 2. మలయ 3. సహ్య 4.హిమాలయం 5. గంధమాదన 6. వింధ్య 7. పారియాత్ర.

**సప్తవాయువులు** : 1. అవహం 2. ప్రవహం 3.సంవహం 4. ఉద్వహం 5.పరివహం 6. వరావహం 7. దివ్యవాయువు.

**సప్తాశ్వములు** : 1. గాయత్రి 2. బృహతి 3. ఊష్ణిక 4. జగతి 5. దృష్టులు 6. అనుష్టుప్ 7. పంక్తి.

**వ. ఇట్లనేక ప్రకారంబులఁ గాలాగ్ని తెఱంగున వెడలి, మిడుంగుఱులు చెదరి పడఁగ, బ్రహ్మాండ మండలంబులం బట్టుకొనునట్టు పెనుమంట లుప్పరం బెగయ, నేతెంచు బ్రహ్మాస్త్రముం గని హనుమంతుఁడు తన మనంబున. 189**

**ప్రతి :** ఇట్లు అనేక ప్రకారంబులన్, కాలాగ్ని=ప్రళయ కాలమునాటి అగ్ని, తెఱంగున=వలె, వెడలి=వెళ్లి, మిడుంగురులు=అగ్నికణములు, చెదిరి పడఁగ=అటు ఇటు పడగ, బ్రహ్మాండమండలంబులన్, పట్టుకొనునట్టు, పెనుమంటలు=పెద్దమంటలు, ఉప్పరంబు=ఆకాశమునకు, ఎగయన్=వ్యాపించగా, ఏతెంచు=వచ్చు, బ్రహ్మాస్త్రంబున్, కని, హనుమంతుఁడు, తన మనంబున –

**తా :** ఇలా ప్రళయాగ్నిలా బయలుదేరి నిప్పురవ్వలు చెదరిపడగా, బ్రహ్మాండాలన్నిటిని అంటుకునే విధంగా పెద్దమంటలు ఆకాశం వరకు వ్యాపింపచేస్తూ వస్తున్న బ్రహ్మాస్త్రాన్ని చూచి హనుమంతుడు మనసులో–

**ఆ. తనకుఁ జిన్న నాఁడు దయచేసినటువంటి**
**వనజ భవునిచేతి వరముఁ దలచి,**
**బ్రహ్మ మంత్ర మప్డు పఠియింప, నది చంప**
**కతనిఁ గట్టి వైచె నవనిమీఁద 190**

**ప్రతి :** తనకున్=తనకు, చిన్ననాఁడు=బాల్యంలో, దయచేసినటువంటి= ఇచ్చినటువంటి, వనజ భవుని= బ్రహ్మదేవుని, చేతి వరమున్=స్వయంగా ఇచ్చిన వరమును, తలచికొని, బ్రహ్మమంత్రము, అపుడు, పఠియింపన్=చదువగ, అది, చంపక, అతని, అవనిమీద=భూమిమీద, కట్టివైచె=కట్టిపడవేసెను.

**తా :** బ్రహ్మ స్వయంగా తనకు చిన్నప్పుడు ఇచ్చిన వరాన్ని తల్చుకొని హనుమ బ్రహ్మమంత్రాన్ని చదివాడు. చదవగానే ఆ బ్రహ్మాస్త్రం హనుమను చంపకుండా, కట్టి భూమి మీద పడేసింది.

**విశే :** మొల్ల రచనలో – రావణు చేతి బాధలు, వనజభవు చేతివరము అనే ప్రయోగాలు తెలుగు నుడికారము గలవి. నీ చేతి వంట, నీ చేతి మాత్ర మొ॥ లోకంలో వాడుకలో ఉన్నవే.

**వ. ఇట్లు కట్టు వడిన కరువలిపట్టిని జూచి రావణాసురునిపట్టి తనలో నిట్టు లనుకొనియె. 191**

**ప్రతి :** కరువలిపట్టి=గాలికొడుకు – హనుమ.

**తా :** ఈ విధంగా కట్టుపడిన హనుమనుచూచి ఇంద్రజిత్తు తనలో ఇలా అనుకున్నాడు

**క. ఈ బ్రహ్మాస్త్రము తాఁకున**
**కే బలియుఁడు బ్రదుక నోపఁ, డితఁడు ఘనుండౌ,**
**నీ బాహుబలుని గట్టుట**
**నా బలిమికిఁ దొడవ కాదె నాకులు మెచ్చన్! 192**

**ప్రతి :** ఈ బ్రహ్మాస్త్రము, తాకునకున్=దెబ్బకు, ఏ=బలియుఁడు=ఎంతటి బలవంతుడును, బ్రదుకన్=జీవింప, ఓపడు=శక్తుడు కాదు, ఇతఁడు, ఘనుండౌన్=చాలా గొప్పవాడే, ఈ బాహుబలిని=గొప్ప భుజశక్తి గలవానిని, కట్టుట=కట్టివేయుట, నా, బలిమికిన్=శక్తికి, తొడవకాదె=భూషణము కాదా, నాకులు=దేవతలు, మెచ్చన్= మెచ్చుకోగా.

**తా :** ఈ బ్రహ్మాస్త్రము దెబ్బకు ఎంత బలియుడయినా బ్రదుకలేడు. ఇతడు చాలా గొప్పవాడు అయి ఉంటాడు. ఇట్టి బాహుబలిని దేవతలు మెచ్చేలా కట్టి పడవెయ్యడం నా శక్తికి భూషణమే కదా!

**విశే :** హనుమను కట్టివేయడం దేవతలు మెచ్చుకునే కార్యము అని ఇంద్రజిత్తు భావన.

**క. పెక్కండ్ర దనుజ వీరులఁ**
**జక్కాడిన వీనిఁ బట్టి, సాహసముగ మా**
**రక్కసుల ఱేని యొద్దకుఁ**
**జక్కఁగఁ గొనిపోవు టదియ చంపుట గాదే!. 193**

**ప్రతి :** పెక్కండ్ర=చాలామంది, దనుజవీరులన్=రాక్షసవీరులను, చక్కాడిన=చంపిన, వీనిన్, పట్టి, సాహసముగ=సాహసంతో, మా రక్కసుల ఱేని యొద్దకున్=మా రాక్షసరాజు చెంతకు, చక్కఁగన్=చక్కగా, కొనిపోవుట=తీసుకొనిపోవుట, అదియు=అదీ, చంపుటగాదే=చంపడమే కదా!

**తా :** ఎందరో రాక్షసవీరుల చంపిన వీణ్ణి పట్టుకొని సాహసంతో మా రాజు దగ్గరకు జాగ్రత్తగా తీసుకు వెళ్లడం చంపడమే కదా! చంపడంతో సమానమే కదా!

**చ. అని తన సత్త్వ సంపద రయంబునఁ బొంగుచు మేఘనాదుఁ డ**
**య్యనిలజుఁ గొంచు నేఁగె దివిజారి సభాస్థలి కద్భుతంబుగా**
**ఘన రథ దంతి ఘోటక నికాయ భటావళి శస్త్ర దీప్త కే**
**తన వర శంఖ కాహళ వితాన రవంబులు మిన్ను ముట్టఁగన్. 194**

**ప్రతి :** అని, తన సత్త్వసంపద రయంబునన్=తన బలసంపద వేగానికి, పొంగుచు=ఆనందపడుతు, మేఘనాదుఁడు, ఆ+అనిలజున్, కొంచున్= తీసుకుని, ఏఁగె=వెళ్లెను, దివిజారి=దేవతల శత్రువు, సభాస్థలికిన్= సభకు, అద్భుతంబుగా, ఘన=గొప్ప, రథ=రథములు, దంతి=ఏనుగుల, ఘోటక=గుఱ్ఱాల, నికాయ= సమూహము, భటావళి=భటులవరుస, శస్త్ర=శస్త్రాలు, దీప్తకేతన=ప్రకాశించే జండాలు, వర=శ్రేష్ఠమయిన, శంఖ, కాహళ, వితాన రవంబులు=శంఖము, కాహళ, సమూహాల ధ్వనులు, మిన్నుముట్టఁగన్=ఆకాశంవరకు వ్యాపించగా!

**తా :** తన బలానికి ఆనందపడుతూ మేఘనాదుడు హనుమంతుని రావణుని సభాస్థలికి అద్భుతంగా గొప్పరథాల, ఏనుగుల, గుఱ్ఱాల సమూహంతో, భటులు, శస్త్రాలతో, ప్రకాశించే జెండాలతోను, గొప్ప శంఖకాహళ సమూహాల ధ్వనులు మిన్నుముట్టేలా తీసుకువెళ్లాడు.

**వ. ఇట్లు కొనిపోయి రాక్షసేశ్వరుం డయిన రావణాసురు సమ్ముఖమ్మునం బెట్టినంతనే గాడుపు పట్టిం గని. 195**

**ప్రతి :** ఇట్లు=ఈ విధంగా, కొనిపోయి=తీసికొనిపోయి, రాక్షసేశ్వరుండు అయిన, రావణాసురు సమ్ముఖమ్మునన్=రావణాసురునికి ఎదురుగా, పెట్టినంతనే=ఉంచిన వెంటనే, గాడుపు పట్టిన్=గాలికొడుకగు హనుమంతుని, కని=చూచి.

**తా :** ఈ విధంగా తీసుకొనిపోయి రావణు సమ్ముఖంలో పెట్టగానే, గాడుపు పట్టి అయిన హనుమను చూచి.

## హనుమంతునిచే రావణుని యధిక్షేపము

**క. కుటిల భ్రూకుటి నటన**
**స్ఫుట ధూమ విలాస పవన ఫూత్కృతి జనితో**
**ద్భట రోషానల కీలో**
**త్కట నేత్రుం డగుచుఁ బలికెఁ గటము లదురఁగన్. 196**

**ప్రతి :** కుటిల=వంకరైన, భ్రూకుటి నటన=కనుబొమల కదలిక, స్ఫుట=స్ఫుటముగా, ధూమవిలాస= పొగతో విలాసంగా, పవన=గాలి, ఫూత్కృతి=ఊదబడిన, జనితోద్భట=పుట్టిన అధిక, రోషానల కీలోత్కట= రోషాగ్ని కీలలతో తీవ్రమైన, నేత్రుండగుచు=కన్నులు కలవాడై, కటములు=చెంపలు, అదురఁగన్=అదరగా!, పలికెన్=పలికాడు.

**తా :** వంకరైన కనుబొమల నుండి పొగతో అందగించి ఊదబడడం వల్ల పుట్టిన గొప్ప రోషాగ్ని కీలలతో కూడిన కనులు కలవాడై చెక్కిళ్ళు అదరగా ఇలా పలికాడు.

**విశే :** దీర్ఘసంస్కృత సమాస రచన.

**ఉ. ఎవ్వఁడ వోరి? నీకుఁ బ్రభు వెవ్వఁడు చెప్పుము? నీ విటొంటివై**
**నివ్వనరాశి దాఁటి యిట కే గతి వచ్చితి? నామ మేమి? నీ**
**వెవ్వని ప్రాపునం బెఱికి తీ వనమంతయు శంక లేక? యిం**
**కెవ్వని పంపునం దునిమి తీ సురవైరుల నెల్ల నుగ్రతన్? 197**

**ప్రతి :** ఎవ్వఁడవు+ఓరి?=ఓరి! ఎవ్వడవు, నీకున్, ప్రభువెవ్వఁడు=రాజు ఎవరు చెప్పుము, నీవిటొంటివై (నీవు+ఇటు+ఒంటివై)=నువ్వు ఇలా ఒక్కడివిగా, ఇవ్వన రాశి=ఈ+వనరాశి=ఈ జలరాశిని సముద్రాన్ని దాటి, ఇటకు, ఏగతి, వచ్చితి?, నామమేమి?=పేరేమి?, నీవు, ఎవ్వని, ప్రాపునన్=అండచూసుకుని, ఈ వనమంతయు, పెఱికితి=పెకలించావు?, శంకలేక=అనుమానం లేక, ఇంక, ఎవ్వని, పంపునన్=ఆజ్ఞవల్ల, ఈ, సురవైరులన్=రాక్షసులను, ఎల్లన్, ఉగ్రతన్=కోపంతో, తునిమితి=చంపావు?

**తా :** ఓరీ! నీ వెవడవు? నీ రాజు ఎవరు? నువ్వు ఒక్కడవు ఈ సముద్రాన్ని దాటి ఇక్కడకు ఎలా వచ్చావు, నీ పేరేమి? ఎవరి అండచూసుకుని ఏ రకమయిన శంక లేకుండా ఈ వనాన్ని పెకలించావు? ఎవరి ఆజ్ఞతో కోపగించి రాక్షసులనందరినీ చంపావు?

**విశే :** ఈ పద్యంలో అన్నీ ప్రశ్నలే. ప్రశ్నల పద్యమిది.

**సీ. అమర వల్లభు భోగ మంతయుఁ గైకొని**
**వీతిహోత్రుని సిరి నీటముంచి,**
**జముని కింకరులను సంహార మొనరించి**
**రాక్షసాధీశ్వరుని శిక్షసేసి,**
**యంభోధినాథుని గాంభీర్య మణఁగించి**
**దోర్బలంబున గాలిఁ దూలఁబెట్టి,**
**విత్తనాథుని మహా విభవంబు గొల్లాడి**
**శూల హస్తుని నొక్క మూల కదిమి**

**తే. అమర గంధర్వ కిన్నర యక్ష భుజగ**
**గరుడ గుహ్యక ముని సిద్ధ వరుల నెల్లఁ**
**బట్టి మును వెట్టి సేయించునట్టి నన్ను**
**విన్న యంతన గుండెలు వ్రీల వెట్లు? 198**

**ప్రతి :** అమరవల్లభు=ఇంద్రుని, భోగమంతయున్, కైకొని=తీసుకుని, వీతిహోత్రుని=అగ్నిదేవుని, సిరి= సంపదను, నీటముంచి=నీళ్లలో ముంచి, జమునికింకరులను=యముని సేవకులను, సంహారమొనరించి= చంపి, రాక్షసాధీశ్వరు=బలిచక్రవర్తిని, శిక్షసేసి=శిక్షించి, అంభోధినాథుని=సముద్రుని, గాంభీర్యమణగించి= గాంభీర్యాన్ని అణగగొట్టి, దోర్బలంబునన్=భుజబలంతో, గాలిన్, తూలన్‌బట్టి=పడవేసి, విత్తనాథుని=కుబేరుని, మహావిభవంబు=గొప్ప సంపదను, కొల్లాడి=కొల్లగొట్టి, శూలహస్తుని=శివుని, ఒక్క మూలకదిమి= ఈశాన్య మూలకు పంపి, అమర, గంధర్వ, కిన్నర, యక్ష, భుజగ, గురుడ, గుహ్యక, ముని, సిద్ధవరుల నెల్లన్, పట్టి, మును=పూర్వం, వెట్టిసేయించునట్టి=వెట్టిచాకిరీ (జీతం భత్యం లేనిది) చేయిస్తున్నట్టి, నన్ను=నన్ను గురించి, విన్నయంతన=వినగానే, గుండెలు, వ్రీలవు=ముక్కలు, ఎట్లు=ఏ విధంగా.

**తా :** ఇంద్రుని భోగమంతా తీసుకొని, అగ్నిసంపద నీటిపాలు చేసి, యమకింకరులను సంహరించి, బలిని శిక్షించి, సముద్రుని గాంభీర్యం అణచివేసి, భుజబలంతో గాలిని తూలగొట్టి, కుబేరుని మహాసంపదనంతా కొల్లగొట్టి, శివునిని ఒక మూలను అదిమిపెట్టి, అమర, గంధర్వాదులను అందరినీ స్వాధీనపరచుకుని వెట్టిచాకిరీ చేయించునట్టి నన్ను గురించి వినగానే గుండెలు బ్రద్దలు కాలేదా? అదెలా?

**విశే :** తనపేరు వింటేనే గుండెలు ముక్కలవ్వాలి అని రావణుని తలపు. రావణుని చూసినా హనుమ చెక్కు చెదరలేదు. ఈ పద్యంలో - వీతిహోత్రుని సిరి నీటముంచి - అగ్నిసిరి మంట దానిని నీటముంచితే ఆరిపోతుంది అనే అర్థంతోపాటు నీటముంచాడు అంటే నాశనం చేశాడు అనే అర్థం కూడా ఉంది. నీట ముంచుతావో పాలముంచుతావో! అనే వ్యవహారం ఉంది. శూలిని ఒక్కమూల కదిమి - శివుడు ఈశాన్యమూలలో ఉంటాడు. దాన్ని చమత్కారంగా - ఒక మూల అదిమిపెట్టాడు అని వర్ణించింది మొల్ల.

**చ. శరనిధి దాఁటి వచ్చుటయ చాలక నా పురిఁ జొచ్చి, చొచ్చియున్**
**వెఱవక బంటవై వనము వేళ్ళకుఁ ద్రుంచితి, త్రుంచి క్రమ్మఱన్**
**బిరుదవు పోలె రాక్షసులఁ బెక్కురఁ జంపితి, చంపి నెమ్మదిన్**
**గరకరితోడ నా యెదుర గర్వముతోడ నిల్చి తద్దిరా! 199**

**ప్రతి :** శరనిధి=సముద్రము, దాఁటివచ్చుటయ=దాటిరావడం, చాలక=సరిపోక, నా పురిన్=నా లంకాపురిలో, చొచ్చి=ప్రవేశించి, చొచ్చియున్=ప్రవేశించింది కాక, వెఱవక=భయపడక, బంటవై=యోధుడవై, వనము, వ్రేళ్లకున్+త్రుంచితి=వ్రేళ్లతోసహా త్రుంచావు, త్రుంచి=పీకి, క్రమ్మఱన్=తిరిగి, బిరుదవు=శూరుడవు, పోలె=వలె, రాక్షసులన్, పెక్కురన్=చాలామందిని, చంపి, నెమ్మదిన్=నిండు మనస్సులో, కరకరితోడ=ద్వేషముతో, నా యెదుర=నా ఎదుట, గర్వముతోడ, నిల్చితి=నిలిచావు, అద్దిరా!=ప్రశంసతో కూడిన ఆశ్చర్యాన్ని తెలియబరిచేది.

**తా :** సముద్రం దాటి రావడం చాలక నా పురంలో ప్రవేశించావు, అది చాలక భయపడక యోధుడవై వనములో చెట్లు మొదలంటా పెకలించావు సరే! అంతతో ఆగక శూరుడిలా ఎందరో రాక్షసులను చంపావు. మనస్సులో ద్వేషంతో నా ఎదుట గర్వంతో నిలబడ్డావు అద్దిరా! నీ సాహసం ఆశ్చర్యంగా ఉంది.

**విశే :** రావణుడు హనుమ కార్యాలకు ఆశ్చర్యపోతున్నాడు. ఇంతవరకు ఇట్టి వీరుణ్ణి చూసే అవకాశం రాలేదు. హనుమ తనను చూసి భయపడకపోగా గర్వంతో తన ఎదుట ధీరుడై నిలవడం తట్టుకోలేక అద్దిరా! అన్నాడు. తెలుగువాడి కోపం మూర్తీభవించిన పద్యమిది. కోపంతో ఉన్నవాడి వాక్యవిన్యాసం ఈ పద్యంలో స్పష్టంగా వినిపిస్తుంది.

సముద్రం దాటి రావడం చాలక నా లంక ప్రవేశించావు, ప్రవేశించావు సరే కొంచమైనా భయపడక నా లంకలో ప్రమదావనంలో చెట్లన్నీ మొదళ్లతో త్రుంచావు, త్రుంచి ఊరుకున్నావా? మా రాక్షసుల్ని ఎందరినో చంపావు. చంపి గర్వంతో, 'నా యెదురనిల్చి తద్దిరా!' అద్దిరా! ఏమిరా నీ ధైర్యం - ఇన్ని పనులు చేసి నా ఎదుట ఠీవిగా నిలబడతావురా! అంటూ కోపంతో విరుచుకుపడుతున్న రావణుణ్ణి చిత్రించింది మొల్ల.

ఈ పద్యంలో ముక్తపదగ్రస్తము అనే అలంకారాన్ని కూర్చి తెలుగుభాషకు గల పదును చూపించింది మొల్ల.

ముక్త పదగ్రస్తము - అంటే వదిలిన పదాన్నే మళ్లీ గ్రహించడం.

ఈ పద్యంలో – చొచ్చి, చొచ్చియు, త్రుంచితి, త్రుంచి, చంపితి, చంపి – అనే జంటలతో తెలుగు వాక్య విన్యాసాన్ని ప్రదర్శించింది మొల్ల ఇవన్నీ క్రియాపదాలు కావడం మరింత అందం సమకూడింది.

**క. ఖండించెద నీ చేతులు,**
**తుండించెద నడుము రెండు తునుకలు గాఁగన్**
**జెండించెదఁ గత్తులతో**
**వండించెద నూనెలోన వారక నిన్నున్. 200**

**ప్రతి :** ఖండించెద=నరికేస్తాను, నీ చేతులు, తుండించెదు=ఖండిస్తాను, నడుము, రెండు తునుకలుగాగన్= రెండు ముక్కలు అయ్యేలా, చెండించెదన్=చంపుదును, కత్తులతో=కత్తులతో చంపిస్తాను, నూనెలోన వండించెద=నూనెలో వేసి వండిస్తాను, వారక=తప్పక, నిన్నున్=నిన్ను.

**తా :** నీ చేతులు ఖండిస్తాను, నీ నడుము రెండు ముక్కలుగా నఱుకుతాను, కత్తులతో చంపిస్తాను. నూనెలో వేసి నిన్ను తప్పక వండిస్తాను.

**విశే :** ఖండించెద, తుండించెద, చెండించెద, అనే క్రియాపదాల ప్రయోగం పర్యాయపదాలను పరిచయం చేయడంతోపాటు వండించెద అనే క్రియాపదం – తాను వండడు – వండిస్తాడు అనే విషయాన్ని చెప్తోంది.

**వ. ఇట్లు పట్టరాని కోపంబున నాటోపంబుగాఁ బలుకుచున్న రావణా సురుం జీరికిం గొనక హనుమంతుం డిట్లనియె. 201**

**ప్రతి :** పట్టరాని కోపంబునన్=ఆపుకోలేని కోపంతో, ఆటోపంబుగాన్=గర్వంగా, పలుకుచున్న, రావణాసురుం, చీరికి కొనక=లెక్కచేయక, హనుమంతుండిట్లనియె.

**తా :** రావణాసురుడు పట్టరాని కోపంతో గర్వంగా మాట్లాడిన మాటలు లెక్కచేయక హనుమంతుడు ఇలా అన్నాడు.

### హనుమంతునిచే శ్రీరామచంద్రుని గుణ కీర్తనము

**క. ఇనతనయుని వర మంత్రిని,**
**జనపతి యైనట్టి రామచంద్రుని దూతన్,**
**ఘనుఁడగు వాయు కుమారుఁడ,**
**వినుమీ! హనుమంతుఁ డనఁగ వెలసినవాఁడన్! 202**

**ప్రతి :** ఇన తనయుని=సుగ్రీవుని, వరమంత్రిని=శ్రేష్ఠమైన మంత్రిని, జనపతి=రాజు, ఐనట్టి=అయిన, రామచంద్రుని దూతన్=రామ దూతను, ఘనుఁడగు= గొప్పవాడైన, వాయు కుమారుఁడన్=వాయువు కొడుకును, వినుమీ!, హనుమంతుఁ డనఁగ=హనుమంతుడని, వెలసిన వాఁడన్=ప్రసిద్ధికెక్కినవాడను.

**తా :** సుగ్రీవుని శ్రేష్ఠమైన మంత్రిని, రాజైన శ్రీరాముని దూతను, ఘనుడయిన వాయుదేవుని పుత్రుడను, హనుమంతుడు అనే పేరుతో ప్రసిద్ధికెక్కినవాడిని.

**క. రాముని పంపున వచ్చితి,**
**రాముని సేమంబు నీ పురంబున ను న్నా**
**రాముని సతి కెఱిఁగించితి,**
**రాముని కడ కేఁగుచుండి రాజస వృత్తిన్. 203**

**ప్రతి :** రాముని పంపున వచ్చితి=రాముని ఆజ్ఞమీద వచ్చాను, రాముని సేమంబు=రాముని క్షేమవార్త, నీపురంబునన్=నీ పట్టణంలో, ఉన్న=ఉన్నటువంటి, ఆ రాముని సతికి=ఆ రాముని భార్య సీతకు, ఎఱిఁగించితి=తెలియ చెప్పాను, రాముని కడకు=రాముని చెంతకు, రాజసవృత్తిన్=దర్పంతో, ఏగుచుండి= వెళుతూ...

**తా :** నేను రాముని ఆజ్ఞమేరకు వచ్చాను, రాముని క్షేమవార్త నీ లంకలో ఉన్న సీతకు చెప్పాను, తిరిగి రాముని కడకు బయలుదేరాను దర్పంతో –

**విశే :** హనుమ రామదూత. రామభక్తుడు. అందుకే తాను చెప్పేమాటల్లో వీలయినన్నిసార్లు రామనామం పలికే ప్రయత్నం చేసాడు. ప్రతిపాదాదిని 'రాముని' అనే పదం ప్రయోగించి మొల్ల, పలికి హనుమ ధన్యులయ్యారు.

**క. నా రాక మీకుఁ దెలియఁగ**
**బీరంబున వనము గలయఁ బెఱికితి శక్తిన్,**
**ఘోరాజి నాకు నెదిరిన**
**వారలఁ బంపితిని యముని పట్నము చూడన్. 204**

**ప్రతి :** నా రాక=నేను వచ్చిన సంగతి, మీకున్=మీకు, తెలియఁగ=తెలిసేలా, బీరంబున=ధైర్యంతో, వనమున్, కలయన్=అన్నిపక్కలా, పెఱికితి=పీకేసాను, శక్తిన్= శక్తితో, ఘోరాజి=భయంకరమైన యుద్ధంలో, నాకున్=నన్నున్, ఎదిరిన వారలన్=ఎదిరించిన వారిని, యముని పట్నము=యమధర్మరాజుగారి పట్నం, చూడన్=చూడడానికి, పంపాను=పంపించాను (యమలోకానికి పంపాను–చంపేసాను).

**తా :** నారాక మీకు తెలియడం కోసం ధైర్యంచేసి నాశక్తికొలదీ వనం నాలుగు పక్కలా పెకలించి వేశాను. యుద్ధంలో నన్ను ఎదుర్కొన్నవారిని యముని పట్నం చూడడానికి పంపాను అంటే చంపాను అని.

**విశే :** వాక్యజ్ఞుడయిన హనుమ మాటతీరు ఇది.

**క. నినుఁ జూచి తిరిగి పోయెదు**
**మనమున మఱి కట్టఁ బడితి మనుజాశన! నీ**

**యను వెల్లఁ గంటి, నింకను**
**వినుమా నా బుద్ధిఁ దెలియ వివరముతోడన్.** **205**

**ప్రతి :** నినున్+చూచి=నిన్నుచూచి, తిరిగిపోయెదు=వెళ్లిపోయే, మనమునన్=కోరికతో, మఱి, కట్టఁబడితి= కట్టబడ్డాను, మనుజాశన=మనుష్యులను భుజించేవాడా! నీ, అనువు=పద్ధతి, ఎల్లన్=అంతా, కంటిన్= చూసాను, ఇంకను, వినుమా, నా బుద్ధిన్+తెలియ=నా ఆలోచన తెలుసుకునేందుకు, వివరముతోడన్= వివరాలతో –

**తా :** మనుజాశనా! రాక్షసుడా! నిన్ను చూసి వెళదామనే కోరికతో ఇలా కట్టుబడ్డాను. నీ పద్ధతి అంతా చూసాను. నా ఆలోచనలు వివరంగా చెప్తాను విను.

**చ.** **ఘనుఁడవు, నీతిమంతుఁడవు, కార్య మెఱుంగుదు, సాహసంబునన్**
**నిను నెదిరించి పోరుటకు నిర్జర వల్లభుఁ డోపలేఁడు, నీ**
**వనిన జగత్త్రయం బళుకు, నద్భుత రూపము సెప్పరాదు. నీ**
**యనుపమ భోగ సంపదల కాఱడి తెచ్చితి విప్డు రావణా!** **206**

**ప్రతి :** రావణా!, ఘనుఁడవు=గొప్పవాడవు, నీతిమంతుడవు=నీతి తెలిసినవాడవు, కార్యమెఱుంగుదు=ఏ పని ఎలా చెయ్యాలో తెలుసు, సాహసంబునన్=సాహసంతో, నినునెదిరించి=నిన్ను ఎదిరించి, పోరుటకు= యుద్ధం చేయడానికి, నిర్జర వల్లభుఁడు=ఇంద్రుడు, ఓపలేఁడు=సహించలేడు, నీవనినన్=నువ్వంటే, జగత్త్రయంబు=ముల్లోకాలు, అళుకు=భయపడతాయి, అద్భుతరూపము=అద్భుతమైన రూపం, చెప్పరాదు= చెప్పలేనంత గొప్పది, నీ అనుపమ=నీ సాటిలేని, భోగ సంపదలకు, ఇపుడు, ఆఱడి=చేటు, తెచ్చితివి.

**తా :** రావణా నువ్వు ఘనుడవు, నీతిమంతుడవు, కార్యనిర్వహణ తెలిసినవాడవు. నీతో ఎదిరించి సాహసంతో యుద్ధం చెయ్యడానికి ఇంద్రుడు కూడా తట్టుకోలేడు. నువ్వంటే ముల్లోకాలు భయపడతాయి. నీ రూపం అద్భుతమైంది. నీ సాటిలేని భోగసంపదలు ఇప్పుడు నాశనం చేసావు.

**క.** **కడ లేని బలము, ధర నె**
**క్కడ లేని మహా ధనంబు కరి తురంగంబుల్**
**కడ గానరాని సంపద**
**చెడ కుండఁగ నీకు బుద్ధి చెప్పెద వినుమా!** **207**

**ప్రతి :** కడలేని=అంతులేని, బలము, ధరన్=భూమిపై, ఎక్కడలేని=ఎక్కడాలేని, మహాధనంబు=గొప్పధనము, కరి=ఏనుగులు, తురంగంబుల్=గుఱ్ఱాలు, కడగానరాని=అంతం కనబడని, సంపద, చెడకుండఁగ= చెడిపోకుండ, నీకు, బుద్ధిచెప్పెద, వినుమా!

**తా :** అంతులేని బలం ఉంది. భూమిమీద ఎక్కడాలేనంత మహాధనం ఉంది. ఏనుగులు,గుఱ్ఱాలుమొదలయిన వివిధ సంపదలు మితిలేకుండా ఉన్నాయి. ఆ సంపదలు నశించిపోకుండా నీకు బుద్ధి చెప్తాను వినుమా రావణా!

**సీ.** **కుదియించి సింహంబు కోరలు పెఱుకంగ**
**శేషాహి దౌడలు చీల్చివేయఁ**
**బీడించి దంభోళిఁ బిడికిటఁ బట్టగఁ**
**గఠిన కాకోలంబు కడి గొనంగఁ**
**జెలంగి బ్రహ్మాండమ్ము చిప్ప లూడఁగఁ దన్న**
**హంకారమున బడబాగ్ని నుఱుక,**
**నంభోనిధానంబు లఱచేత నడపంగ**
**గిరివర్గములఁ దలక్రిందు చేయఁ**

**తే.** **గల మహాబాహుసత్త్వ విఖ్యాతి విపుల**
**చండ భుజదండ సాహసోద్దండ విజయ**
**కాల రుద్రావతార సంగ్రామ భీమ**
**మూర్తి మంతులు కపులు, సత్కీర్తియుతులు.** **208**

**ప్రతి :** కుదియించి=అణచి, సింహంబు, కోరలు=నోట్లోని పళ్లు, పెఱుకంగ=లాగడం, శేషాహి=శేషనాగు, దౌడలు, చీల్చివేయన్=చీల్చివేయడం, పీడించి=బాధపెట్టి, దంభోళి=వజ్రాయుధాన్ని, పిడికిటన్=పిడికిలితో, పట్టగన్=పట్టుకోవడం, కఠినకాకోలంబు=క్రూరమైన మాలకాకి, కడిగొనంగ=నోట్లో ఆహారం తీయడం, చెలఁగి=విజృంభించి, బ్రహ్మాండమ్ము, చిప్పలు=బ్రహ్మాండం చిప్పలు పైచిప్ప, క్రింది చిప్ప, ఊడఁగన్= ఊడిపడేలా, తన్న=తన్నడం, హంకారమున=గర్వంతో, బడబాగ్నిన్=సముద్రం మధ్యలోగల అగ్నిని బడబాగ్ని అంటారు, ఉఱుక=దూకడం, అంభోనిధానంబులు=సముద్రాలు, అఱచేతన్=అఱచేతితో, అడపంగ= అణచిపెట్టడం, గిరివర్గములన్=కొండల సమూహాన్ని, తలక్రిందు చేయన్=తలక్రిందుగా చేయడం, కల= కలిగిన, మహాబాహుసత్త్వ=గొప్ప భుజబలముచే, విఖ్యాతి=పేరుగల, విపుల=అధిక, చండ= భయంకరమైన, భుజదండ, సాహసోద్దండ=గొప్ప సాహసం వల్ల, విజయ=విజయం పొందే, కాలరుద్రావతార= ప్రళయకాలం నాటి రుద్రునివలె, సంగ్రామ భీమమూర్తులు=యుద్ధరంగంలోని భయంకరమైన రూపములు గలవారు, కపులు=వానరులు, సత్కీర్తియుతులు=మంచి కీర్తితో కూడి ఉన్నారు.

**తా :** సింహాన్ని అణిచి దాని నోటిలో కోరలు పీక గలవారు, ఆదిశేషుని దౌడలు చీల్చగలవారు, వజ్రాయుధాన్ని పిడికిట్లో పట్టగలవారు, బొంతకాకి నోట్లో ముద్ద తీసుకోగలవారు, ఈ బ్రహ్మాడం పైచిప్ప క్రింద చిప్ప ఊడిపడేలా తన్నగలవారు, హంకారంతో బడిబాగ్నిలో దూకగలవారు, సముద్రాన్ని అరచేతితో అడపగలవారు,

పర్వతాల్ని తలకిందులుగా చేయగలవారు, గొప్ప భుజశక్తికి పేరుపొంది విశేషమయిన భుజదండ సాహసోద్దండంతో విజయం పొందిన కాలరుద్రావతారులు, సంగ్రామ భీమమూర్తిమంతులు కపులు. విజయం పొందిన ప్రళయకాలం నాటి రుద్రునివంటి రూపం గలవారు. సత్కీర్తియుతులు.

**వ. అదియునుంగాక దశరథరాజు నందనుండును, గౌసల్యా గర్భ సంభవుండును, దాటకా ప్రాణాపహరుండును, విశ్వామిత్ర యాగ సంరక్షకుండును, నహల్యా శాప మోక్ష దీక్షా గురుండును, హర కోదండ ఖండనుండును, జామదగ్ని బాహుబల భంగుండును, విరాధ నిరోధుండును, ఖర దూషణ త్రిశిర శ్ఛేదనుండును, మాయామృగ సంచారి మారీచ సంహారకుండును, గబంధాంతకుండును, వాలి ప్రాణ నిబర్హణుండును, సుగ్రీవ రాజ్య సంస్థాపన పరమాచార్యుండును, ధనుర్విద్యా ప్రవీణుండును, నమోఘ బాణుండును, రాక్షస కులాంతకుండును, గాకుత్థ్సాన్వయాంభోనిధి చంద్రుండును, గురుణాసింధుండును, నగు శ్రీరామ చంద్రుండు కరుణాలంకారుఁడు గావున. 209**

**ప్రతి :** అదియునుంగాక=అంతేకాక, దశరథరాజునందనుండును=దశరథుని కొడుకు, కౌసల్యాగర్భ సంభవుండును=కౌసల్య కడుపున పుట్టినవాడు, తాటకా ప్రాణాపహరుండును=తాటకను చంపినవాడు, విశ్వామిత్రుయాగ సంరక్షుండును=విశ్వామిత్రుని యాగం రక్షించినవాడు, అహల్యాశాపమోక్ష దీక్షాగురుండు= అహల్య శాపాన్ని విమోచనం చేసే దీక్షగలిగిన గురుడు, హరకోదండ ఖండనుండును=శివుని విల్లు విరిచినవాడు, జామదగ్ని బాహుబల భంగండును=పరశురాముని గర్వం భంగం చేసినవాడు, విరాధ నిరోధుండును=విరాధుణ్ణి చంపినవాడు, ఖరదూషణ త్రిశిర శ్ఛేదనుండును=ఖరుడు, దూషణుడు, త్రిశరుడు అనేవారిని చంపినవాడును, మాయామృగ సంచారి=మాయలేడిలా సంచరించే, మారీచసంహారకుండును= మారీచుని సంహరించినవాడును, కబంధాంతకుండును=కబంధుణ్ణి అంతం చేసినవాడు, వాలి ప్రాణ నిబర్హణుండును=వాలి ప్రాణాలు తీసినవాడును, సుగ్రీవరాజ్య సంస్థాపన పరమాచార్యుండును=సుగ్రీవునికి పట్టాభిషేకం జరిపించిన ఆచార్యుడు, ధనుర్విద్యాప్రవీణుండును=ధనుర్విద్యలో నేర్పరియు, అమోఘ బాణుండును=తిరుగులేని బాణం కలవాడు, రాక్షసకులాంతకుండును=రాక్షసకులాన్ని అంతం చేసేవాడు, కాకుత్థ్సాన్వ యాంభోనిధి చంద్రుండును=కాకుత్థ్సాన్వయమనే సముద్రానికి చంద్రుని వంటివాడు, కరుణా సింధుఁడు=కరుణాసముద్రుడును, అగు శ్రీరామచంద్రుడు, కరుణాలంకారుండును=కరుణ అలంకారంగా గలవాడు, కావున=కాబట్టి.

**తా :** అదీకాక! దశరథుని పుత్రుడు, కౌసల్య కడుపున పుట్టినవాడును, తాటక సంహారం చేసినవాడు, విశ్వామిత్రుని యాగం రక్షించినవాడు, అహల్యాశాపమోక్షం చేసినవాడు, శివుని విల్లు విరిచినవాడును, పరశురామ గర్వభంగం చేసినవాడును, విరాధుణ్ణి, ఖరుణ్ణి, దూషణుణ్ణి త్రిశిరుణ్ణి సంహరించినవాడును, మాయలేడిగా తిరిగే మారీచుణ్ణి సంహరించినవాడు, కబంధుణ్ణి అంతం చేసినవాడు, వాలి ప్రాణాలు తీసినవాడు, సుగ్రీవుణ్ణి రాజ్యపీఠం ఎక్కించినవాడు, ధనుర్విద్యలో ప్రవీణుండును, తిరుగులేని బాణాలు

కలవాడు, రాక్షసకులాన్ని అంతం చేసేవాడు, కాకుత్థ్సాన్వయ సముద్రానికి చంద్రుని వంటివాడు, కరుణాసముద్రుడు అగు శ్రీరామచంద్రుడు కరుణే అలంకారంగా గలవాడు కావున–

**విశే :** శ్రీరామచరిత్ర ఇది. రామభక్తుయిన హనుమ కంఠం నుండి మొల్ల గంటం నుండి వెలువడిన పవిత్ర గాథ.

**ఉ. వారక సీత నిచ్చి, రఘువల్లభునిన్ శరణంబు చొచ్చినన్,**
**నేరము లెంచి చంపమికి నీ యెడ కెప్పుడు నేను బూఁటగా**
**భారపడంగఁ జాలుదు, శుభ స్థితి నమ్ముము, నమ్మ కూరకే**
**పోరఁగఁ జూచితేనిఁ బొరిపుచ్చక మానఁడు నిన్ను రావణా! 210**

**ప్రతి :** వారక=తప్పకుండా, సీతను, ఇచ్చి, రఘువల్లభునిన్=రాముని, శరణంబు చొచ్చినన్=శరణు వేడుకొంటే, నేరములు=తప్పులు, ఎంచి=లెక్కపెట్టి, చంపమికి=చంపకుండా ఉండడానికి, నీయెడ=నీ పక్షాన, ఎప్పుడు= ఎల్లప్పుడు, నేను, పూఁటగా=అండగా, భారపడంగజాలుదు=ఆ భారం వహించగలను, శుభస్థితిని, నమ్ముము, నమ్మక=నమ్మకుండ, ఊరకే, పోరఁగ జూచితేనిన్=యుద్ధం చేయాలని చూసినట్లయితే, పొరిపుచ్చక= సంహరించక, మానఁడు, నిన్ను, రావణా!

**తా :** తప్పకుండా సీతను రామునికి ఇచ్చి, అతణ్ణి శరణువేడుకో. నువ్వు చేసిన నేరాలు ఎంచి నిన్ను చంపకుండా నీ పక్షాన మాట్లాడి నీకు అండగా ఉండే భారం నేను వహిస్తాను. దానివల్ల శుభం కలుగుతుంది. ఆ శుభస్థితి నమ్ము. నమ్మకుండా నేను యుద్ధమే చేస్తానని పూనుకున్నావా, రాముడు నిన్ను సంహరించక మానడు.

**విశే :** దూతగా హనుమ చెప్పిన మాటలు అత్యంత సమాదరణీయాలు. ఉన్న విషయం విప్పిచెప్పి, బలాబలాలు చెప్పి, తాను అండగా ఉంటానని చెప్పి, చేయవలసిన కార్యం చెప్పి, చేయకపోతే సంభవించే నష్టం చెప్పి – దూతకార్యాన్ని చక్కగా నిర్వహించాడు హనుమ.

**ఉ. నావుడు మండి, దైత్యకుల నాయకుఁ డుగ్ర విలోకనంబులం**
**బావక విస్ఫులింగములు పైకొని పాఱఁగ, వీర ఘోర దై**
**త్యావళిఁ జూచి, మీరలు మహా విశిఖంబుల వీనిఁ జంపుఁడీ**
**యావల రాముఁ డుల్కుచు భయాకులుఁడై చెడిపోవు నట్టుగన్. 211**

**ప్రతి :** నావుడు=అనగా, మండి=మండిపడి, దైత్యకులనాయకుఁడు=రాక్షసకుల నాయకుడయిన రావణుడు, ఉగ్రవిలోకనంబులన్=కోపముతో నిండిన చూపులలో, పావక విస్ఫులింగములు=నిప్పురవ్వలు, పైకొని= అతిశయించి, పాఱఁగ=రాలగా, వీరఘోర=వీరులు, భయంకరులు అయిన, దైత్యావళిన్=రాక్షసమూకను, చూచి, మీరలు=మీరు, మహా విశిఖంబుల=గొప్ప బాణాలతో, వీనిన్=హనుమను, చంపుడీ=చంపెయ్యండి,

ఆవల=ఆ తరువాత, రాముఁడు, ఉల్కుచు=కలవరపడుతూ, భయాకులుఁడై=భయముతో దుఃఖితుడై, చెడిపోవునట్టుగన్=నశించునట్లుగా.

**తా :** హనుమ అట్లు అనగా, రావణుడు మండిపడి కోపంవల్ల చూపులనుండి అతిశయించిన నిప్పురవ్వలు రాలగా, వీరఘోర దైత్యులను చూసి మీరు గొప్ప బాణాలతో హనుమను చంపండి, అటుపై రాముడు కలవరపడి భయంతో దుఃఖించి నాశనమయ్యేటట్లుగా –

**వ. అనిన విభీషణుం డిట్లనియె. 212**

**తా :** అనగా విభీషణుడు ఇలా అన్నాడు.

## దూతను జంపుట దోసమని రావణునకు విభీషణుని హితవు

**క. దూతపనిఁ బూని వచ్చిన**
**దూతలు తమ నోరి కెంత తోఁచిన నట్లా**
**నేతల నాడుదు, రాడిన**
**దూతలఁ జంపంగఁ దగదు దొరలకు నెందున్. 213**

**ప్రతి :** దూతపనిన్, పూని వచ్చిన=చేయడానికి వచ్చిన, దూతలు, తమ నోరికి, ఎంతతోచిన=ఏవిధంగా అనిపిస్తే, అట్లా=ఆ విధంగా, నేతలను=నాయకులను, ఆడుదురు=అంటారు, ఆడిన=మాట్లాడిన, దూతలన్, చంపంగన్=చంపుట, ఎందున్=ఎక్కడయినా, దొరలకు=ప్రభువులకు, తగదు=కూడదు.

**తా :** దూతకార్యానికి వచ్చిన దూతలు తమనోటికి ఎంత వస్తే అంతా నాయకుల గురించి మాట్లాడతారు. అలా మాట్లాడారని దూతలను చంపడం ఎక్కడయినా ప్రభువులకు తగని పని. దూతలను చంపకూడదు.

**విశే :** 'నోరి కెంత తోఁచినట్లు' కందువమాట.

**క. కాకుండిన మీ చిత్తము**
**కాకెల్లను దీఱ ముజ్జగంబులు బెదరన్**
**ధాక నదలించి తోఁకను**
**వీఁకన్ ముట్టించి పోవ విడుచుట చాలున్. 214**

**ప్రతి :** కాకుండిన=కాకపోతే!, మీ చిత్తముకాక=మీ మనస్సులో తాపము, ఎల్లను=అంతా, తీఱ=తీరునట్లుగా, ముజ్జగంబులు, బెదరన్=బెదరునట్లు, ధాకన్=పరాక్రమముతో, అదలించి=భయపెట్టి, తోకను, వీఁకన్= ఉత్సాహంతో, ముట్టించి=నిప్పు అంటించి, పోవ విడుచుట=పొమ్మనడం, చాలున్=చాలును.

**తా :** కాకపోతే ఒక పని చేయవచ్చు. మీ మనస్తాపం తీరేలా ముజ్జగాలు బెదిరిపోయేటట్లు పరాక్రమంతో ఈ కోతిని భయపెట్టి ఉత్సాహంతో తోకకు నిప్పుపెట్టి పొమ్మంటే చాలు.

**వ. అని విన్నవించిన.** **215**

**తా :** ఈ విధంగా మనవి చేసికోగా –

**ఆ. నీతి వాక్య సరణి నెఱయంగ విని రావ**
**ణేశ్వరుండు కోప మెదలి పలికె**
**వీనిఁ దోఁక గాల్చి, వెడలంగఁ ద్రోయుఁడీ**
**ప్రొద్దె యటకుఁ దిరిగి పోవుఁ గాక.** **216**

**ప్రతి :** నీతి వాక్య సరణి=నీతివాక్యాల విధానాన్ని, నెఱయంగ=పూర్తిగా, విని, రావణేశ్వరుండు, కోపము, ఎడలి=వదలి, పలికె, వీని, తోఁక, కాల్చి, వెడలంగన్=పోవునట్లు, త్రోయుడు=తోసెయ్యండి, ఈ ప్రొద్దె= ఈ రోజే, అటకున్=అచ్చటికి, తిరిగిపోవున్ కాక!=తిరిగి వెళ్లిపోవును గాక!

**తా :** నీతి వాక్యాలన్నీ పూర్తిగా విని రావణుడు కోపం వదిలి వీడి తోక కాల్చి పొమ్మనండి. ఈ రోజే వచ్చిన చోటకు తిరిగిపోవు గాక!

**వ. అని యిట్లానతిచ్చిన విని, రాత్రించరు లతనిని సభా మధ్యంబు నుండి బయటికి వెడలం గొనిపోయి యొక్కచోట.** **217**

**ప్రతి :** అని, ఇట్లు, ఆనతిన్=ఆజ్ఞను, ఇచ్చినన్, విని, రాత్రించరులు=రాత్రి సంచరించెడి వారు రాక్షసులు, అతనిని, సభామధ్యంబునుండి=సభామందిరం మధ్యలోనుండి, బయటకిన్, వెడలన్=వెళ్ళునట్లుగా, కొనిపోయి= తీసికొనిపోయి, ఒకచోటన్=ఒక ప్రదేశంలో.

**తా :** అని ఈ విధంగా ఆజ్ఞ చేయగా విని, రాక్షసులు అతన్ని సభామధ్యం నుండి బయటికి లాక్కుపోయి ఒకచోట –

## వాలాగ్ర జ్వాలలతో వాయు సుతుఁడు లంకను దగులఁ బెట్టుట

**ఉ. వాలము నిండఁ గోకలు జవంబున గట్టిగఁ జుట్టి, పైఁ**
**దైలము చక్కఁ జల్లి, పిఱుఁదం జని పౌరులు సూడఁ బావక**
**జ్వాలఁ దగిల్చి, బొబ్బలిడి, వాడల వాడలఁ ద్రిప్పుచుండ, వా**
**తూల భవుండు దానికిని దూలక వహ్ని జపంబు సేయఁగన్.** **218**

**ప్రతి :** వాలమునిండన్=తోకనిండా పూర్తిగా, కోకలు=చీరలు, జవంబున=వేగంగా, గట్టిగన్, చుట్టి, పైన్=దానిమీద, తైలము=నూనె, చక్కగా, చల్లి, పిఱుందన్=వెనకనే, చని=వెళ్లి, పౌరులు=పురజనులు, చూడన్=చూడగా, పావక జ్వాలన్=అగ్నిజ్వాలను, తగిల్చి=తగిలించి, బొబ్బలిడి=పెద్ద పెద్ద కేకలుపెట్టి, వాడలవాడలన్=పురంలోని వివిధ వాడలలో, త్రిప్పుచుండ=త్రిప్పుచుండగా, వాతూల భవుండు=వాయువునకు

పుట్టినవాడు-హనుమ, దానికిని=ఆ అగ్నికి, తూలక=చలించక, వహ్నిజపంబు=అగ్నిజపం, చేయఁగన్=చేయగా -

**తా :** తోకనిండా కోకలు వేగంగా గట్టిగా చుట్టారు. పైన నూనె బాగా చల్లారు అగ్ని ముట్టించారు. పురజనులందరు చూస్తూండగా వెంటపడి, బొబ్బలు పెడుతూ వాడవాడలా త్రిప్పగా హనుమ ఆ పనులకు చలించకుండా అగ్నిదేవుణ్ణి ధ్యానం చేయగా

**ఆ. అగ్నిదేవుఁ డప్పు డాత్మలోఁ జింతించి**
**"హితుఁడు నాకు, లోక హితుఁడు పవనుఁ,**
**డతని పుత్త్రుఁ డైన హనుమంతునకు నేను**
**చలువ కూర్తు" ననుచుఁ జల్ల నయ్యె. 219**

**ప్రతి :** అప్పుడు, అగ్నిదేవుఁడు, ఆత్మలోన్=మనసులో, చింతించి=ఆలోచించి, హితుఁడు నాకు=నాకు స్నేహితుడు, లోకహితుఁడు=లోకానికంతా మేలు చేసేవాడు, పవనుఁడు=వాయుదేవుడు, అతని పుత్రుఁడైన=కొడుకయిన, హనుమంతునకు, నేను, చలువకూర్తు=చల్లదనాన్ని కూరుస్తాను, అనుచున్=అంటూ, చల్లనయ్యె= చల్లగా అయ్యాడు.

**తా :** అప్పుడు అగ్నిదేవుడు మనసులో నాకు హితుడు, లోకహితుడు అయిన వాయుదేవుని కొడుకు హనుమ. నేను తప్పకుండా ఇతనికి చల్లదనం చేకూర్చాలి అంటూ చల్లగా అయ్యాడు.

**వ. అప్పుడచ్చటి వృత్తాంతం బంతయుఁ, దనకుఁ గావలి యున్న రాక్షసకాంతలవలన విని, చింతా భరాక్రాంతయై, జనకరాజ నందన కరంబు శోకించి, కరంబులు ముకుళించి, జగద్ధిత కార్య ధుర్యుండును, రాఘవ ప్రియానుచరుండును, మత్ప్రాణ బంధుండును, జగత్ప్రాణనందనుండును నైన హనుమంతునకు శీతలుండవు కమ్మనియగ్ని దేవునకు నమస్కరించి, యగ్నిమంత్రంబును, బ్రహ్మ మంత్రంబును నుచ్చరించిన, నద్దానివలన వానికి వైశ్వానర భగవానుండు సల్లనయ్యె, బ్రహ్మాస్త్ర బంధనంబును నూడె నట్టి సమయంబున. 220**

**ప్రతి :** అప్పుడు, అచ్చటి, వృత్తాంతంబు=విషయము, అంతయు, తనకు, కావలియున్న=కాపలా ఉన్న, రాక్షసకాంతల వలన, విని, చింతాభరాక్రాంతయై=దుఃఖభారంతో కూడుకున్నదై, జనకరాజనందన=సీత, కరంబు=మిక్కిలి, శోకించి=దుఃఖించి, కరంబులు=చేతులు, ముకుళించి=ముడిచి, జగద్ధిత కార్యధుర్యుండును=జగత్తుకు హితమైన కార్యం చేయడంలో సమర్థుడును, రాఘవ ప్రియానుచరుండును= రామునికిప్రియమైన సేవకుడును, మత్ప్రాణ బంధుండును=నాకు ప్రాణబంధువును, జగత్ప్రాణ నందనుండును=జగత్తుకు ప్రాణకారకుడయిన వాయువు కొడుకును, ఐన, హనుమంతునకు, శీతలుండవు=చల్లనివాడవు, కమ్ము=అగుము, అని, అగ్నిదేవునకు నమస్కరించి, అగ్నిమంత్రంబును,

బ్రహ్మమంత్రంబునున్, ఉచ్చరించినన్=చదువగా, అద్దానివలన=దానివలన, వానికి=హనుమకు, వైశ్వానరభగవానుండు=అగ్నిదేవుడు, చల్లనయ్యె=చల్లగా అయ్యాడు, బ్రహ్మాస్త్ర బంధనంబునన్= బ్రహ్మాస్త్రముచే కట్టుబడిన కట్లును, ఊడెన్=ఊడిపోయాయి, అట్టి సమయంబున=ఆ సమయంలో.

**తా :** తనకు కావలి ఉన్న రాక్షస స్త్రీల వలన విషయం అంతా విన్న సీత దుఃఖంతో కూడినదై మిక్కిలి శోకించింది. చేతులు ముకుళించి జగద్ధిత కార్యధుర్యుడు, రాముని ప్రియానుచరుడు, నా ప్రాణబంధుడు, జగత్ప్రాణనందనుడు అయిన హనుమపట్ల చల్లగా వర్తించవలసిందని సీత అగ్నిమంత్రం, బ్రహ్మమంత్రం పఠించింది. దానివలన అగ్ని చల్లబడ్డాడు. కట్టుకట్టిన బ్రహ్మాస్త్రం ఆ సమయంలో విడిపోయింది.

**విశే :** అగ్నిమంత్రం హనుమ కూడ పఠించినట్లు మొల్ల పేర్కొంది. వాల్మీకి రామాయణంలో హనుమ అలాంటి ప్రయత్నం ఏమీ చేసినట్లు లేదు. అలాగే బ్రహ్మాస్త్రం విడవడానికి సీత అగ్నిమంత్రం బ్రహ్మమంత్రం పఠించిన విషయం కూడా వాల్మీకి రచనలో లేదు. తన పాతివ్రత్యసంపద ఆధారంగా అగ్నిదేవుణ్ణి శాసించినట్లు వాల్మీకి రామాయణంలో కనిపిస్తుంది.

**సీ.** **కొలువు కూటములకుఁ గుప్పించి, గజ వాజి**
**శాలల మీఁదికిఁ జౌకళించి**
**భండార గృహముల పైకిని లంఘించి**
**మెఱుఁగారు మేడలమీఁది కుఱికి,**
**చప్పరంబులమీఁది కుప్పరంబున దాఁటి**
**యంతఃపురమునకు గంతువైచి,**
**చవికలమీఁదను సాహసంబున వ్రాలి**
**గరిడికూటంబుల సొరిది నెక్కి,**

**తే.** **వాడ వాడల వీథుల వన్నె మెఱసి**
**హరుఁడు త్రిపురంబు గాల్చిన యట్టి లీల**
**నొక్క గృహమైన లెక్కకు దక్క నీక**
**దానవేశ్వర పురము దగ్ధంబు చేసె.** **221**

**ప్రతి :** కొలువు కూటములకున్=సభాస్థలాలకు, కుప్పించి=దుమికి, గజ వాజిశాలలు=ఏనుగుల, గుఱ్ఱాలశాలల, మీదికి, చౌకళించి=ఎగిరి, భండారుగృహములపైకిని=వస్తువులు, ధనము నిలువపెట్టే గృహాల మీదకి, లంఘించి= దుమికి, మెఱుఁగారు=మిక్కిలి ప్రకాశించే, మేడలమీఁదికి, ఉఱికి=దుమికి, చప్పరంబుల మీదికి=మండపాల మీదికి, ఉప్పరంబునదాఁటి=పైకి ఎగిరిదాటి, అంతఃపురమునకు, గంతువైచి=గంతువేసి, చవికెలమీదను=మండపాల మీదను, సాహసంబున, వ్రాలి=ఎగిరి చేరి కూర్చోవడం, గరిడి కూటంబుల= వ్యాయామం అభ్యాసం చేసే స్థలాలు, సొరిదిన్=వరసగా, ఎక్కి, వాడవాడల వీథుల=వాడల్లో వీథుల్లో, వన్నె

మెఱసి= ప్రకాశించి, హరుఁడు=శివుడు, త్రిపురంబున్=త్రిపురాలను, కాల్చిన యట్టిలీలన్=కాల్చిన విధంగా, ఒక్క గృహమైన=ఒక ఇల్లైనా, లెక్కకు దక్కనీక=లెక్కలో మిగలనీకుండా, దానవేశ్వరపురము=లంకానగరము, దగ్ధంబు చేసె=కాల్చివేసెను.

**తా :** కొలువు కూటాల మీదకు, ఏనుగుల, గుఱ్ఱాల శాలల మీదకు, నిలువ చేసే గృహాల మీదికి దుమికాడు. మెఱసే మేడల మీదికి, చవికెల మీదికి, మండపాల మీదికి, అంతఃపురాల మీదకు గరిడి కూటంబుల మీదకు దుముకుతూ సాహసంతో వాడవాడలా వీథుల్లోనూ ప్రకాశించి పరమశివుడు త్రిపురమును కాల్చినట్లుగా లంకానగరంలో ఒక్క ఇల్లుకూడా మిగలకుండా కాల్చేసాడు.

**విశే :** లంకానగరంలోని వివిధ కట్టడాల మీదకు హనుమ మండుతున్న తోకతో దుమికాడు. దుమికాడు – అనే అర్థాన్ని ఇవ్వగల కుప్పించి, చౌకళించి, లంఘించి, ఉఱికి, దాఁటి, గంతువైచి, వ్రాలి, ఎక్కి – వంటి పర్యాయపదాలను, ఈ పద్యంలో ప్రయోగించి భాషాజ్ఞానాన్ని పెంపొందించే ప్రయత్నం చేసింది కవయిత్రి.

**శా. అంభోరాశిని వాలవహ్ని నతిశౌర్యం బొప్ప చల్లార్చి. య**
**య్యంభోజానన సీత గాంచి, తన వృత్తాంతంబు తెల్లంబుగా**
**గంభీర ధ్వని విన్న వింపుచు నమస్కారంబు గావించి సం**
**రంభం బొప్పగ వేడ్కతో గదలె ధీర ప్రౌఢి హన్మంతుఁడున్. 222**

**ప్రతి :** అంభోరాశిని=సముద్రంలో, వాలవహ్ని=తోకకున్న నిప్పును, అతిశౌర్యంబు=మిక్కిలి శూరత్వం, ఒప్పన్‌గా=ఒప్పగ, చల్లార్చి=ఆర్పి, ఆ+అంభోజానన=ఆ తామర పువ్వువంటి ముఖముగల, సీతన్=సీతను, కాంచి=చూచి, తన, వృత్తాంతంబు=విషయము, తెల్లంబుగా=స్పష్టంగా, గంభీరధ్వనిన్=గంభీరమైన కంఠంతో, విన్నవింపుచు=చెపూ్త, నమస్కారంబు, కావించి=చేసి, సంరంభంబు=ఉద్రేకము, ఒప్పగ=ఒప్పగా, వేడ్కతోన్= ఆనందంతో, ధీర ప్రౌఢి హన్మంతుఁడున్=ధీరుడు ప్రౌఢుడు అయిన హనుమంతుడు, కదలె.

**తా :** ధీరుడు, ప్రౌఢుడు అయిన హనుమ సముద్రంలో తన తోకకున్న నిప్పును ఆర్పి చలార్చికొని, సీతను చూసి జరిగిన విషయాలన్నీ గంభీరస్వరంతో చెపూ్త నమస్కారం చేసి ధీరుడై గంభీరంగా కదిలాడు.

## మారుతి పిడికిటిపోటుతో యమపురి కరిగిన లంకిణి

**క. పోయెదు వాయుజు నెక్కడ**
**బోయెదు నాచేత ననుచు బోనీక వడిన్,**
**డాయగ వచ్చిన లంకిణి**
**కాయము పగులంగ బొడిచె గడు వడి గినుకన్.** కోరిః

**ప్రతి :** పోయెదు=వెళ్తున్న, వాయుజున్=హనుమను, ఎక్కడబోయెదు=ఎక్కడకి వెళ్తావు, నాచేతన్, అనుచు, పోనీక, వడిన్డాయగ వచ్చిన=వేగంగా దగ్గరకు వచ్చిన, లంకిణి కాయము=లంకిణి శరీరాన్ని, పగులంగ బొడిచెన్=పగులునట్లుగా పొడిచాడు, కడున్ వడిన్=మిక్కిలి వేగంగా, కినుకన్=కోపంతో.

**తా :** నాచేత పడ్డవాడివి ఎక్కడకు పోతావు అంటూ వెళ్తున్న హనుమను అడ్డుకొని పోనియ్యక తనకు దగ్గఱగా, వేగంగా వచ్చిన లంకిణి శరీరం పగిలిపోయే (ముక్కలయ్యే) విధంగా కోపంతో పొడిచాడు హనుమ.

**విశే :** లంకిణి-లంకాధిదేవత. "లంక" అన్నదే ఆమె పేరు, కాని తెలుగువారు ఆమెను లంకిణి అన్నారు. ఆ లంకిణి హనుమ లంకలో ప్రవేశిస్తున్నప్పుడు అడ్డుకొన్నది. ఇక్కడ తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు అడ్డుకున్నట్లు మొల్ల వర్ణన.

**వ. ఇట్లు లంకిణిం జంపి, సువేలాచలం బెక్కి, సింహనాదంబు సేయుచు. 224**

**తా :** ఇలా లంకిణిని చంపి, సువేలాచలం ఎక్కి, సింహనాదం చేస్తూ

లంక (లంకిణి)ని హనుమ చంపినట్లు వాల్మీకి మహర్షి చెప్పలేదు.

**క. పుడమీ ధర శృంగంబున**
**నడుగులు వడి నూది త్రొక్కి, యద్భుత శక్తిన్**
**జలరాశి దాఁటఁ బావని**
**మిడివింటం బసిఁడి యుండ మీఁటిన రీతిన్. 225**

**ప్రతి :** పుడమీధర శృంగంబున=కొండ శిఖరంపై, పుడమీధరము=భూమిని ధరించేది, అడుగులువడి= పాదాలు వేగంగా, ఊఁది త్రొక్కి=గట్టిగా త్రొక్కి, అద్భుతశక్తిన్, జలరాశిదాఁటన్=సముద్రం దాటడానికి, పావని=హనుమ, మిడివింటన్=ఎత్తైన విల్లునుండి, పసిడియుండ=బంగారపు ఉండను, మీటిన రీతిన్= ఎగజిమ్మినట్లుగా.

**తా :** హనుమ కొండ కొమ్మున అడుగులు పెట్టి గట్టిగా బలంతో త్రొక్కి, అద్భుతశక్తితో జలరాశి దాటడానికి ఆకాశంలోకి జిమ్మిన బంగారపు ఉండలా ఎగిరాడు.

**విశే :** ఉండ గుండ్రంగా ఉంటుంది. హనుమ బంగారు ఛాయలో ఆకాశంలో ఒక ఉండలా ఉన్నాడని మొల్ల వర్ణన.

**వ. ఇట్లు కుప్పించి, యుప్పరం బెగసి, వాయువేగంబునం జనుచు నయ్యబ్ధి మధ్యంబున నున్న సునాభంబను శైలంబున దన దేహంబు దాహంబు తీర్చుకొని, సముద్రంబును దాటి, యవ్వలి కిం జనియె నప్పుడు. 226**

**ప్రతి :** ఇట్లు, కుప్పించి=ఎగిరి, ఉప్పరంబు=ఆకాశము, ఎగసి=పైకి చేరుకొని, వాయువేగంబునన్=వాయువు వంటి వేగముతో, చనుచున్, ఆ+అబ్ధి మధ్యంబునన్=ఆ సముద్రము మధ్యలో, ఉన్న సునాభంబు అను శైలంబునన్, తన దేహంబుదాహంబు=తన శరీర తాపమును, తీర్చుకొని=పోగొట్టుకొని, సముద్రంబును దాటి, అవ్వలికిన్=ఆవలి ఒడ్డునకు, చనియెన్, అప్పుడు...

**తా :** ఇలా ఆకాశంలోకి ఎగిరి, వాయువేగంతో ప్రయాణిస్తూ, ఆ సముద్రములో ఉన్న సునాభము అనే పర్వతం మీద ఆగి, శరీర శ్రమ తీర్చుకొని, సముద్రం దాటి అవతలి గట్టుకు వెళ్ళాడు. అప్పుడు, ఇలా హనుమ మధ్యలో ఆగి విశ్రాంతి తీసుకున్నట్లు వాల్మీకంలో కనిపించదు.

## దధివనమున వానర వీరుల యుత్సాహ క్రీడ

**ఉ. వచ్చిన పావనిం గని, జవంబున నంగదు డాదియౌ కపుల్**
**గ్రచ్చఱ భక్తితో నెదురుగా జన, నందఱ గౌగిలించి వా**
**రచ్చుటి కార్యమంతయు బ్రియంబున ద న్నడుగంగ, బోయి వే**
**వచ్చిన చంద మేర్పడగ వారికి జెప్పెను దప్పకుండఁగన్. 227**

**ప్రతి :** వచ్చిన, పావనిన్ కని=హనుమను చూచి, జవంబునన్=వేగంగా, అంగదుఁ డాదియౌ కపులు= అంగదుడు మొదలైన వానరులు, క్రచ్చఱ=సవిలాసంగా, భక్తితో, ఎదురుగాన్, చనన్=వెళ్లగా, అందఱన్= అందరినీ, కౌగిలించి, వారు, అచ్చుటి, కార్య మంతయు=పనిని గురించిన వివరాలు అన్నీ, ప్రియంబునన్= ప్రేమతో, తన్ను, అడుగంగన్, పోయి=వెళ్ళి, వేవచ్చిన=వేగంగా వచ్చిన, చందమేర్పడఁగ=విధానము వివరంగా, వారికిన్, చెప్పెను, తప్పకుండగన్= ఒకటి కూడా విడవకుండా.

**తా :** వచ్చిన హనుమంతుణ్ణి చూచి అంగదుడు మొదలైన వానరులు వేగంతో విలాసంగా భక్తితో ఎదువచ్చారు, హనుమ వారి నందరినీ కౌగలించుకున్నాడు. వానరులందరూ హనుమ చేసిన కార్యాల గురించి ప్రేమతో అడగగా లంకకు వెళ్లడం అక్కడ కార్యం నెఱపి వేగంగా రావడం వివరంగా ఒక్క సంగతి కూడ విడిచి పెట్టకుండా చెప్పాడు.

**క. రఘువరుఁడిచ్చిన ముద్రిక**
**రఘువల్లభు దేవి కిచ్చి, రభసంబున నా**
**రఘువరున కానవాలుగ**
**రఘువల్లభు దేవిచేతి రత్నముఁగొంటిన్. 228**

**ప్రతి :** రఘువరుఁడు, ఇచ్చిన, ముద్రిక=ఉంగరం, రఘువల్లభుదేవికి=సీతాదేవికి, ఇచ్చి, రభసంబున= సంతోషంతో, ఆ, రఘువరునకు=రామునకు, ఆనవాలుగ=గుర్తుగా, రఘువల్లభుదేవి=సీతాదేవి, చేతి రత్నమున్=చేతిలోని రత్నాన్ని, కొంటిన్= తీసుకొన్నాను.

**తా :** శ్రీరాముడు ఇచ్చిన ఉంగరాన్ని సీతాదేవికి ఇచ్చాను. సంతోషంతో సీతను చూచినందుకు ఆనవాలుగా ఆమె చేతి రత్నాన్ని తీసుకున్నాను.

**విశే :** ఈ పద్యంలో కూడా "రఘువరుడు" "రఘువల్లభుఁడు" అనే పదాలు ప్రయోగించి హనుమ, మొల్ల తమ రామభక్తిని వ్యక్తం చేసుకున్నారు.

మ. అని చెప్పన్ విని యంగదాదులు మహాహ్లాదంబునన్ బొంగి, పా
వని బాహాబల సత్త్వముల్ వొగడుచున్, వర్ణింపుచున్, వే పునః
పునరాలింగన మాచరింపుచు, వడిన్ భూషించుచున్ మ్రొక్కుచున్,
ఘనతం బాడుచు నాడుచున్, బలువడిన్ గర్వంబునన్ దాటుచున్. **229**

**ప్రతి :** అని చెప్పన్=అని చెప్పగా, విని, అంగదాదులు, మహాహ్లాదంబునన్=గొప్ప ఆనందంతో, పొంగి, పావని=హనుమ, బాహాబలసత్త్వముల్=భుజబలము యొక్క శక్తిని, పొగడుచున్, వర్ణింపుచున్, వే=వేగంగా, పునఃపునరాలింగనము ఆచరింపుచు=మళ్ళీ మళ్ళీ కౌగలించుకుని, వడిన్=వేగంగా, భూషించుచున్=పొగడుచు, మ్రొక్కుచున్, ఘనతన్=గొప్పతనాన్ని, పాడుచు, ఆడుచున్, పలువడిన్=మిక్కిలి వేగంగా, గర్వంబునన్, దాటుచున్=గెంతుతూ.

**తా :** అని హనుమ చెప్పగా అంగదాదులు మహాసంతోషంతో పొంగిపోయారు. హనుమ బాహుబలసత్త్వాలను పొగుడుతూ, వర్ణిస్తూ, తిరిగి తిరిగి కౌగలించుకుంటూ, స్తుతిస్తూ మ్రొక్కుచూ గొప్పగా ఆడుతూ పాడుతూ, వేగంగా గర్వంతో గంతులు వేస్తూ. (తమ సంతోషాన్ని వ్యక్తపరిచారు).

శా. నేనే చాలుదు రావణాసురు తలల్ నేలం బడంగొట్టఁగా
నేనే చాలుదు వాని పట్టణము మున్నీటం బడం ద్రోయఁగా,
నేనే చాలుదు దుష్ట దానవ తతిన్ నిర్భీతి దండింపఁగా,
నేనే చాలుదుఁనంచుఁ బంతము పూన్కిం బల్కుచున్ ద్రుళ్ళుచున్. **230**

**ప్రతి :** నేనే చాలుదు, రావణాసురు, తలల్, నేలన్, పడంగొట్టగా, నేనే చాలుదు, వాని పట్టణము, మున్నీటన్=సముద్రంలో, పడన్+త్రోయగా=పడవేయడానికి, నేనే చాలుదు, దుష్టదానవ=దుష్టులైన రాక్షసుల, తతిన్=సమూహాన్ని, నిర్భీతిన్= భయంలేకుండా, దండింపగా=శిక్షించడానికి, నేనే చాలుదున్, అంచున్, పంతంబులు, పూన్కిన్=పూనికతో, పల్కుచున్, త్రుళ్ళుచున్=గెంతుతూ.

**తా :** రావణుని తలలు నేలమీద పడగొట్టడం నేనే చెయ్యగలను. రావణుని లంకసముద్రంలో ముంచడానికి నేనే చాలు. రాక్షసమూకను దండించడానికి నేనే చాలు అంటూ పంతంపట్టి పూనికతో పల్కుతు గెంతుతూ.

క. ఆ రాత్రి కీశు లందఱు
మారుతితోఁ గూడి నిలిచి మఱునాఁడచటన్
ధీరత దుర్ధర శైలము
చేరం జని, నిద్రచేసి చిత్తము లలరన్. **231**

**ప్రతి :** ఆ రాత్రి, కీశులు=కోతులు, అందఱు, మారుతితోన్=హనుమతో, కూడి నిలిచి=కలిసి ఉండి, మఱునాఁ డచటన్, ధీరత=ధైర్యముతో, దుర్ధరశైలము=గొప్ప కొండ, చేరంజని=చేరుకుని, నిద్రజేసి=నిద్రపోయి, చిత్తములు=మనస్సులు, అలరన్=ఆనందించగా.

**తా :** ఆ రాత్రి వానరులందరూ హనుమతో కూడి ఉండి, మఱునాడు, ధైర్యంతో, ఋశ్యమూకపర్వతం దగ్గఱకు వెళ్ళి అక్కడ నిద్రచేసి చిత్తములు ఆనందంగా ఉండగా

**విశే :** సీతను దర్శించి వచ్చామనే ధైర్యంతో ఆనందంతో వచ్చారు. నిద్ర చేసారు. ఒక మంచి పని చేసినప్పుడు హాయిగా పడుకునే విధానాన్ని నిద్రచేయడం అంటారు.

**వ. అమ్మఱునాడుదయంబున మధువనంబులో బ్రవేశింప నుద్యోగించి. యందఱకన్నను బెద్దవాడగు జాంబవంతునిం బిలిచి, నీవు శ్రీరామునకు హితుండవు, సుగ్రీవునకు మంత్రివి, కావున మాకు నొక బుద్ధి యానతిమ్ము. ఈ కపులు క్షుద్బాధావశంబునం బొరలి, మహాశ్రమంబును బొందియున్న వారు, గావున సుగ్రీవుని మధువనంబున నుండెడు ఫలంబులం బరితృప్తులమై, రాముని సన్నిధానంబున కేఁగుట లెస్సయని యంగద హనూమంతులు పల్క జాంబవంతుండును నత్యుత్సాహంబున నంగీకరించి. కపులం బురస్కరించుకొని, మధువనంబులో బ్రవేశించినంత. 232**

**ప్రతి :** అమ్మఱునాఁడు, ఉదయంబున, మధువనంబులోన్=మధువనంలో, ప్రవేశింప, ఉద్యోగించి= ప్రయత్నించి, అందఱకన్నను,పెద్దవాడగు, జాంబవంతునిన్, పిలిచి, నీవు శ్రీరామునకు, హితుండవు= స్నేహితుడవు, సుగ్రీవునకు, మంత్రివి, కావున మాకున్, ఒక బుద్ధి=ఒక కోరిక, ఆనతిమ్ము=తీర్చుము (ఆజ్ఞ చేయుము), ఈ కపులు, క్షుద్బాధావశంబునన్=ఆకలి బాధతో, పొరలి=తిరిగి, మహాశ్రమంబును= అధికంగా కష్టమును, పొందియున్నారు=అనుభవించియున్నారు, కావున, సుగ్రీవుని మధువనంబునన్, ఉండెడు, ఫలంబులన్, పరితృప్తులమై=తృప్తిపడినవారమై, రాముని, సన్నిధానంబునకున్=దగ్గరకు, ఏఁగుట=వెళ్లుట, లెస్సయని=బాగుంటుంది అని, అంగదహనుమంతులు, పల్క, జాంబవంతుండును, అత్యుత్సాహంబున= మిక్కిలి ఉత్సాహంతో, అంగీకరించి=ఒప్పుకొని, కపులన్ పురస్కరించుకొని=వానరులను ముందుపెట్టుకొని, మధువనంబులో ప్రవేశించినంత.

**తా :** ఆ మఱునాడు ప్రొద్దున్నే మధువనంలో ప్రవేశించాలనే ప్రయత్నంతో అందఱికన్న పెద్దవాడైన జాంబవంతుని పిలిచి నీవు శ్రీరామునకు ఇష్టుడవు, సుగ్రీవునకు మంత్రివి కాబట్టి మా కోరికకు ఒప్పుకో. ఈ వానరులందరూ ఆకలిబాధతో తిరిగి తిరిగి ఎంతో శ్రమపడి ఉన్నారు. కాబట్టి సుగ్రీవుని మధువనము అనే పేరుగల వనంలో ఉండే మధురఫలాలు ఆరగించి తృప్తిపడి అప్పుడు శ్రీరాముని దర్శనానికి వెళ్ళడం మంచిది అని అంగదుడు, హనుమంతుడు అడిగారు. జాంబవంతుడు చాల ఉత్సాహంతో ఒప్పుకుని వానరులనందరినీ ముందుపెట్టుకొని మధువనంలో ప్రవేశించాడు అంత.

**సీ. ఒక్కఁ డాకొని కొమ్మ నూచినబండ్లెల్ల**
**జేకొని తేర భక్షించు నొకఁడు,**
**ఒక్కఁ డాకొని కోయుచున్నట్టి తేనియల్**
**తడయక కొల్లాడి త్రాగు నొకఁడు**

ఒక్కఁ డాకొని కోయుచున్నట్టి కాయలు
మిన్నక యూటాడి మ్రింగు నొకఁడు
ఒక్కఁ డాకొని గోళ్ళ నొలిచినట్టి చివుళ్ళఁ
బుక్కిళ్ళ కొలఁదిగా బొక్కునొకఁడు.

**తే.** తరువుపై నుండి తరువునకు దాఁటు నొకఁడు
పండ్ల కెటువంటి మ్రాఁకైన బ్రాకు నొకఁడు.
దిగువ గూర్చుండి తరువున కెగురు నొకఁడు
పెద్ద పొడవున నుండి కుప్పించు నొకఁడు. **233**

**ప్రతి :** ఒక్కఁడు, ఆకొని=ఆకలితో, కొమ్మను, ఊచినన్=ఊపగా, పండ్లెల్లన్= పళ్లనన్నింటిని, చేకొని=తీసుకుని, తేర=కష్టపడకుండా లభించిన వాటిని, భక్షించున్=తినును, ఒక్కడు, ఒక్కఁడాకొని=ఒకడు ఆకలితో, రేపుచున్నట్టి=తేనెటీగలను కదిలించి, తేనియల్=తేనెలు, తడయక=ఆలస్యం చేయకుండా, కొల్లాడి=కొల్లగొట్టి, త్రాగు నొకఁడు=ఒకడు, తాగుతున్నాడు, ఒక్కఁడాకొని, కోయుచున్నట్టి కాయలు, మిన్నక=ఏ ప్రయత్నం లేకుండా, ఊటాడి=ఊగి, ఊగి మ్రింగునొకఁడు, ఒక్కఁడాకొని, గోళ్ళన్=గోళ్లతో, ఒలిచినట్టి=కోసినట్టి, చివుళ్ల=చిగురులను, పులిక్కిళ్ల=బుగ్గలోపలిభాగం, కొలఁదిగా=పట్టినంతగా, బొక్కున్=నోటినిండుగా వేసుకొని తిన్నాడు ఒకడు, తరువుపై నుండి=చెట్టుమీదనుండి,తరువునకు=చెట్టుకు, దాఁటు=దుముకును, ఒక్కఁడు, పండ్లకు, ఎటుంటి, మ్రాకైనన్=చెట్టునైనా, ప్రాకున్=ఎక్కును, ఒకఁడు, దిగువన్+కూర్చుండి= క్రింద కూర్చోని, తరువునకు, ఎగురును, ఒకఁడు, పెద్దపొడవున నుండి=చాలా ఎత్తునుండి, కుప్పించున్=దుముకును,ఒకఁడు.

**తా :** ఒకడు ఆకలితో కొమ్మ ఊపగా పడిన పళ్లన్నీతేరగా తినేవాడొకఁడు. ఒకఁడు ఆకలితో తేనెపట్టును రేపగా ఆ తేనెను కొల్లగొట్టిత్రాగి తూలిపోయే వాడొకడు. ఒకడు ఆకలితో కోస్తున్న కాయలు శ్రమపడకుండా ఊగతూ మ్రింగేవాడొకడు. ఒకడు ఆకలితో గోళ్లతో కోసిన చిగుళ్ళు పుక్కిళ్ల కొలదిగా బొక్కేవాడొకడు. పళ్లకోసం ఎటువంటి చెట్టైనా ఎక్కేవాడొకడు. క్రిందకూర్చుని చెట్టు మీదకు ఎగిరేవాడొకడు, పెద్ద ఎత్తుమీద నుండి దుమికే వాడొకడు.

**విశే :** ఈ సీసపద్య రచనలో – 'ఒక్కడు' తో ఆరంభించి – 'ఒకడు' తో ప్రతిపాదం ముగుస్తుంది. వానర చేష్టలన్నీ స్వభావోక్తిరమ్యంగా వర్ణించింది. మధుపానం చేసి ఊగుతున్న కోతుల్లా – పద్యపాదాల్లో ఒక ఊగుతూగు ఉంది. ఈ సందర్భంలో మూలంలోని వాల్మీకి రచనాశైలిని తలపించే తెలుగు పద్యం మొల్లమ్మ నిర్మించింది.

**ఉ.** కాయల వ్రేటు లాడుచును, గంతులు వైచుచుఁ బూవు దీవలం
దూయల లూగుచున్, దరువు లూఁపుచు, బండ్లను బొట్టనిండఁగా
మేయుచు, వెక్కిరింపుచును, మిన్నక దాఁటుచు, దోఁక లెత్తుచుం
గూయుచు, నేల దూఁకుచును, గుంపులు గూడి కపీంద్రులెంతయున్. **234**

**ప్రతి :** కాయలను వ్రేటులాడు=కాయలను కొదుతూ, గంతులు వైచునున్=గంతులు వేస్తూ, పూవుదీవలందు= పూదీవెలందు, ఊయలల్=ఊయలలు, ఊగుచున్, తరువులు=చెట్లు, ఊపుచున్, పండ్లను, పొట్టనిండగా, మేయుచు=తింటూ, వెక్కిరింపుచున్, మిన్నక దాటుచు=ఊరికే దుముకుతూ, తోకలెత్తుచున్=తోకలుపైకి ఎత్తిపెడుతూ, కూయుచును=కిచకిచలాడుతూ, గుంపులు కూడి=గుంపులుగా కూడి, కపీంద్రులు, ఎంతయున్=అధికముగా.

**తా :** కాయలను కొదుతూ, గంతులు వేస్తూ, పూతీగెలలో ఉయ్యెలలు ఊగుతూ, చెట్లు ఊపుతూ, కడుపునిండా పళ్లుతింటూ, వెక్కిరిస్తూ, ఊరికే దుముకుతూ, తోకలెత్తిపెడుతూ, కిచకిచలాడుతూ నేలమీదకు దుముకుతూ, గుంపులుగా కూడి ఆ వానరులు అతిశయించగా.

**క.** **వన మెల్ల గాసి చేయఁగ**
**వన పాలకు లేఁగుదెంచి, వడిఁగోపముతో**
**దను నదలించిన, వారల**
**హనుమంతుఁడు మొదలుగాఁగ నగచరులెల్లన్.** **235**

**ప్రతి :** వనమెల్ల గాసి చేయగ=వనాన్నంతా ధ్వంసం చేయగా, వనపాలకులు=వనాన్ని కాపలా కాసేవారు, ఏగుదెంచి=వచ్చి, వడిన్=వేగముగా, కోపము తోడను=కోపంతో, అదలించిన=భయపెట్టగా, వారల, హనుమంతుఁడు, మొదలుగాగ=మొదలయిన, అగచరులెల్లన్=చెట్లలో చరించేవారు (వానరులు అందరు).

**తా :** వానరులు వనాన్ని ధ్వంసం చేయగా వనపాలకులు వచ్చి కోపంతో వారిని భయపెట్టగా హనుమంతుడు మొదలయిన వానరులు అందరు.

**క.** **మెడఁబట్టి వనములోపల**
**వెడలఁగ నటు పాఱద్రొబ్బి, వెడలుం డన్నన్**
**దడయక దధిముఖుఁ దను తమ**
**యొడయని కడ కేఁగి వార లుగ్రముగాఁగన్.** **236**

**ప్రతి :** మెడన్+పట్టి=మెడను పట్టుకొని, వనములోపల వెడలగన్ అటు=వనంలో నుండి వెళ్లిపోవునట్లు, ప్రాఱద్రొబ్బి=తఱిమికొట్టి, వెడలుండు అన్నన్=పొండి అనగా, తడయక=ఆలస్యం చేయక, దధిముఖుండును, తమ, ఒడయుని=ప్రభువు, కడకేగి=వద్దకు వెళ్ళి, వారలు, ఉగ్రముగాగన్=కోపించునట్లు.

**తా :** తమను అదలించిన వనపాలకుల మెడబట్టి వనంలోనుండి వెడలిపోయేలా తఱిమికొట్టి పొండి అనగా వారు ఆలస్యం చెయ్యకుండా వారి ప్రభువైన దధిముఖుని దగ్గరకు వచ్చి కోపించే విధంగా వానరులు వనాన్ని ధ్వంసం చేసిన విషయం చెప్పారు.

వ. విన్నవించిన యంతనే. 237

తా : విన్నవించగానే

**అంగదాదులచే దధిముఖ పరాభవము**

**చ. దధిముఖుఁ డల్గి మండిపడి, తాఁ దనవారలఁ గూడి వచ్చి, బల్**
**విధముల సంచరించు కపి వీరులఁ గోపముతోడఁ జూచి, యీ**
**మధువన మెల్లఁ గొల్లగొన మర్కట వల్లభు నాజ్ఞఁద్రోయ, మ**
**మ్మధములఁజేయ, నెంత ఘనులంచును బాఱఁగ వారి నుద్ధతిన్. 238**

**ప్రతి :** దధిముఖుఁడు, అల్గి=కోపించి, మండిపడి, తాన్, తనవారలన్, కూడివచ్చి, పల్విధముల=అనేక విధాల, సంచరించు=తిరుగాడు, కపివీరులన్, కోపముతోడన్, చూచి, ఈ మధువనమెల్లన్, కొల్లగొన= దోచుకొన, మర్కటవల్లభున్=వానర ప్రభువుయొక్క, ఆజ్ఞన్=ఆజ్ఞను, త్రోయ=త్రోసిపుచ్చి, మమ్ము, అధములన్= చేతకాని వారిగా, చేయన్, ఎంత, ఘనులు=గొప్పవారు, అంచును=అంటూ, వారిని=వానరులను, ఉద్ధతిన్=కఠినముగా, పాఱఁగ=తఱుమగా.

**తా :** దధిముఖుడు కోపగించి మండిపడుతూ తన వారిని తీసుకువచ్చి వనంలో ఇష్టానుసారం తిరుగుతున్న వానరులను చూచి, ఈ మధువనమంతా దోచుకుని, వానర ప్రభువు ఆజ్ఞ త్రోసిపుచ్చి, మమ్మల్ని చేతకాని వారిగా చేసేటంత గొప్పవాళ్ళా మీరు అంటూ కఠినంగా తరిమికొట్టగా.

**వ. ఇట్లు దండింపుచున్న దధిముఖునిపై నంగదాది వనచరులు గదిసి యాగ్రహంబున. 239**

**ప్రతి :** వనచరులు = వానరులు, కదిసి = కలిసి, ఆగ్రహంబున = కోపంతో

**తా :** ఇలా దండిస్తున్న దధిముఖుని మీద అంగదుడు మొదలైన వానరులు అందరు కలిసి కోపంతో

**క. కొందఱఁ గఱచియుఁ బొడిచియు**
**గొందఱ ఁదలపట్టి యీడ్చి కొట్టియు, గోళ్ళన్**
**గొందఱ ప్రచ్చియు ఁదన్నియు,**
**నందఱ నొప్పింప వార లాగ్రహ వృత్తిన్. 240**

**ప్రతి :** కొందఱన్, కఱచియున్, పొడిచియున్, కొందఱన్, తలపట్టి=తల పట్టుకొని, ఈడ్చి, కొట్టియు, గోళ్ళతో, కొందఱ, ప్రచ్చియున్=గీరి, తన్నియున్, అందఱ, నొప్పింప=బాధపెట్టగా, వారలు=వారు, ఆగ్రహవృత్తిన్=కోపముతో.

**తా :** కొందఱిని కఱిచారు, పొడిచారు, కొందఱిని తలపట్టి ఈడ్చికొట్టారు, కొందఱిని గోళ్ళతో గీరి తన్నారు, అలా అందరినీ బాధపెట్టడంతో వారంతా కోపంతో కూడినవారై.

**క. వ్రయ్యలు వాఱంగ వ్రచ్చినఁ**
**గ్రయ్యఁగ రక్తములు గ్రమ్మఁగా వడితోడన్**
**గుయ్యో మొఱ్ఱోయని వా**
**రయ్యెడ సుగ్రీవు కడకు నరిగిరి భీతిన్. 241**

**ప్రతి :** వ్రయ్యలు=ముక్కలు, వాఱంగ=సన్నగా కోసిన, వ్రచ్చినన్=చీల్చగా, క్రయ్యగ=కలియబడగా, రక్తములు, క్రమ్మఁగా=చిందగా, వడితోడన్=వేగంగా, కుయ్యోమొఱ్ఱో, అని, వారు, అయ్యెడ=ఆ సమయంలో, సుగ్రీవుకడకున్=సుగ్రీవుని వద్దకు, భీతిన్=భయముతో, అరిగరి.

**తా :** వనపాలకులను సన్నగా ముక్కలుగా చీల్చారు హనుమదాదులు. వీరు కలియబడగా రక్తం చిమ్మింది. వారు భయంతో వేగంగా కుయ్యో మొఱ్ఱో అంటూ సుగ్రీవుని వద్దకు వెళ్ళారు.

**విశే :** "కుయ్యో మొఱ్ఱో అనుచు" – జాతీయము.

**వ. అరిగి, రామ లక్ష్మణులం గూడియున్న మిహిర నందనుం గనుంగొని, నమస్కరించి, మధువనంబు నందు జరిగిన వృత్తాంతం బంతయు విన్నవించిన, వారల నాదరించి సుగ్రీవుం డిట్లనియె. 242**

**ప్రతి :** అరిగి=వెళ్ళి, రామలక్ష్మణులన్, కూడియున్న, మిహిరనందనున్=సూర్యుని కుమారుడగు సుగ్రీవుని, కనుంగొని, నమస్కరించి, మధువనంబునందు జరిగిన వృత్తాంతంబు అంతయు, విన్నవించిన వారలన్= చెప్పిన వారలను, ఆదరించి=గౌరవించి, సుగ్రీవుండు, ఇట్లు, అనియె.

**తా :** వెళ్ళి రామలక్ష్మణులతో కూడి ఉన్న సుగ్రీవుణ్ణి చూచి నమస్కరించి, మధువనంలో జరిగిన విషయమంతా చెప్పారు. సుగ్రీవుడు వారిని చేరదీసి ఇలా అన్నాడు.

## సుగ్రీవాజ్ఞచే గిష్కింధకు వానర వీరుల పునరాగమనము

**క. దేవర పంపునఁ జని, వా**
**రే వెరవున సీతఁ గనిరొ, యిటు గాకున్నన్**
**నా వనము పాడుసేయరు**
**పావని మొదలైనవారు భయ విరహితులై. 243**

**ప్రతి :** దేవర పంపునన్=ప్రభువు ఆజ్ఞను, చని=వెళ్ళి, వారు, ఏ వెరవున= ఉపాయంతో, సీతన్=సీతను, కనిరో=చూసారో, ఇటు=ఈ విధంగా, కాకున్నన్= లేకపోతే (సీతను చూసి ఉండకపోతే), నా వనము=నా యొక్క మధువనము, భయవిరహితులై=భయం లేకుండా, పావని = హనుమ, మొదలైనవారు పాడుసేయరు.

**తా :** ప్రభువు ఆజ్ఞాపించి పంపగా వెళ్ళివారు ఏ ఉపాయంతో సీతను చూసారో? చూసి ఉండకపోతే ఏ భయం లేకుండా హనుమదాదులు నా మధువనాన్ని పాడుచేయరు.

**వ. అని రామ భూపాలుండు విన సుగ్రీవుండు వారల నూరార్చి, వారి దుండగంబులు వారికే యుండుంగాని వారలం దోడ్కొని యతివేగమ రండని యనిపినం జని, యంగద హనుమంతులం గని, యవనీశ్వరుండీ క్షణంబున మిమ్ముందఱ నచ్చటికి రండని యానతిచ్చెం గావున జెచ్చెర బదుండని, తోడ్కొని పోవునప్పుడు వారల కెదురుగా వానర వీరుల గొందఱ ననిపిన, వారల గూడి చనుదెంచి, శ్రీరామచంద్రుని పాదారవిందమ్ములకు సాష్టాంగ దండ ప్రణామమ్ములాచరించి, సౌమిత్రికిని వందనమ్ము లొనరించి, సుగ్రీవునకు నమస్కరించి, తనచేత మేలు వార్త విన నుత్సహింపుచున్న రఘుకులేశ్వరుల తలం పెఱింగి హనుమంతుండిట్లనియె. 244**

**ప్రతి :** అని, రామభూపాలుండు, వినన్=వినునట్లుగా, సుగ్రీవుండు, వారలన్, ఊరార్చి=ఊరడించి, వారిదుండగంబులు=వారి చెడుపనులు, వారికే యుండునున్, కాని, వారలన్ తోడ్కొని=ఆ అంగదాదులను వెంటపెట్టుకొని, అతివేగమ=మిక్కిలి వేగముగా, రండు, అని, అనిపినన్=పంపగా, చని=వెళ్ళి, అంగద హనుమంతులన్, కని=చూచి, అవనీశ్వరుండు=రాజు, ఈ క్షణంబునన్=ఈ క్షణంలోనే, మిమ్ము అందఱన్= మిమ్మలనందరిని, అచ్చటికిన్, రండు, అని, ఆనతి ఇచ్చెన్=ఆజ్ఞను ఇచ్చాడు, కావునన్=అందువలన, చెచ్చెరన్ పదుండు=వేగముగా నడవండి, అని, తోడ్కొనిపోవునప్పుడు=వెంటతీసుకొని వెళ్ళునపుడు, వారలకున్, ఎదురుగాన్, వానరవీరులన్, కొందఱన్, అనిపినన్=పంపగా, వారలన్గూడి= ఎదురుగా వచ్చిన వారితో కలిసి, చనుదెంచి=వెళ్ళి, శ్రీరామచంద్రుని పాదారవిందమ్ములకున్=శ్రీరామచంద్రుని పాదపద్మములకు, సాష్టాంగ దండప్రణామమ్ములు=దండమువలె నేలపై ఎనిమిది అంగములు ఆనునట్లుగా నమస్కారములు, ఆచరించి=చేసి, సౌమిత్రికిని, వందనమ్ములు=నమస్కారములు, ఒనరించి=చేసి, సుగ్రీవునకున్, నమస్కరించి, తనచేతన్, మేలువార్త=మంచివార్త, వినన్=వినుటకు, ఉత్సహింపుచున్న=ఉత్సాహపడుచున్న, రఘుకులేశ్వరుల తలంపు=రఘువంశరాజుల-రామలక్ష్మణుల ఆలోచనను, ఎఱింగి=తెలిసికొని, హనుమంతుడు, ఇట్లు, అనియె.

**తా :** అని శ్రీరామచంద్రుడు వింటూ ఉండగా సుగ్రీవుడు వారిని ఓదార్చాడు. వారి అల్లర్లు వారికే ఉండనివ్వండి, వారిని తీసుకుని తొందరగా రండి అని పంపాడు. వీళ్లు వెళ్లి అంగదుణ్ణి, హనుమంతుణ్ణి చూసి రాజు ఇప్పుడే మిమ్మల్ని అందరినీ అక్కడికి రమ్మని ఆనతిచ్చారు. కాబట్టి వేగంగా బయలుదేరండి అని వెంటబెట్టుకుని వస్తుండగా వీరలకు ఎదురుగా కొందరు వానరవీరులను స్వాగతం చెప్పడానికి పంపాడు, వారు వీరు కలిసి వచ్చి, శ్రీరామచంద్రుని పాదారవిందాలకు సాష్టాంగ దండప్రణామాలు చేసి, సౌమిత్రికి నమస్కరించి, సుగ్రీవునికి వందనం చేసారు. తననుండి శుభవార్త వినడానికి కుతూహలపడుతున్న రఘురాముని ఆలోచన తెలుసుకున్న హనుమంతుడు ఇలా అన్నాడు.

**శా. కంటిన్ జానకిఁ బూర్ణ చంద్రవదనన్, గల్యాణి నా లంకలోఁ**
**గంటిన్ మీ పదపంకజాతము మదిన్ గౌతూహలం బొప్పగాఁ**
**గంటిన్ మీ కరుణావలోకనము విఖ్యాతంబుగా, గీర్తులం**
**గంటిన్ మా కపివీర బృందములలో గాంభీర్య వారాన్నిధీ. 245**

**ప్రతి :** కంటిన్=చూచితిని, జానకిన్=సీతను, పూర్ణచంద్రవదనన్=పున్నమినాటి చంద్రునివంటి ముఖముగల ఆమెను, కల్యాణిన్=శుభలక్షణాలు గలిగిన, ఆ లంకలోన్=ఆ లంకలో, కంటిన్=చూచితిని, మీ పదపంకజాతము=మీపాద పద్మాలు, మదిన్=మనస్సులో, కౌతూహలంబొప్పగాన్=కుతూహలముతో, కంటిన్, మీ కరుణావలోకనము=మీ కృపాదృష్టిని, మా కపివీర బృందములలోన్=మా వానరవీర సముహంలో, విఖ్యాతంబుగా=ప్రసిద్ధి పొందేవిధంగా, కీర్తులన్, కంటిన్ = పొందితిని, గాంభీర్యవారాన్నిధీ!=గంభీరగుణ సముద్రుడా!

**తా :** చూసాను! సీతను. పూర్ణచంద్రవదన, కల్యాణి అయిన సీతను ఆ లంకలో చూసాను, వెంటనే నా మనస్సులో మీ పదపద్మాలు చూడగలిగాను ఇది చాలా కుతూహలంతో కూడిన విషయం. మీ దయాదృష్టి ప్రసిద్ధికెక్కే విధానం చూసాను. "నన్ను ఆదరించి సీతను నువ్వు చూస్తావనే నమ్మకం నాకుంది, ఇదిగో ఇది నా ఉంగరం, ఆనవాలుగా ఇస్తున్నాను దీన్ని సీతకివ్వు. ఆమె దగ్గరనుండి ఏదేనా ఆనవాలుగా తీసుకుని రా, అని నన్ను ఆశీర్వదించి దయచూపి పంపారు. "ఆ సంఘటనలన్నీ చూసాను" అని తాత్పర్యం, సీతామాతను దర్శించగలిగినందుకు మా వానర వీరబృందంలో కీర్తిని పొందాను, ఓ గంభీరగుణ సముద్రుడా! రామా!

**విశే :** ఈ పద్యం 'కంటిన్' అనే క్రియాపదంతో ఎత్తుకోవడంలోని ఔచిత్యం సాటిలేనిది. 'సీతను' అంటూ ఆరంభిస్తే – ఆ తరువాతి మాట చూసాను కావొచ్చు, చూడలేదు అనైనా కావచ్చు. అందువల్ల అలాంటి సందేహానికి తావులేకుండా శ్రోతని ఇబ్బందిపెట్టకుండా – 'కంటిన్ జానికి' అన్నాడు హనుమ. ఈ శిల్పం వాల్మీకి మహర్షి నుండి గ్రహించినదే అయినా అందంగా నిర్వహించడంలో మొల్ల కృతకృత్యురాలైంది. జానికిని చూసావు సరే ఆమె ఎలా ఉంది. క్షేమంగా ఉందా? లేదా? – అనే విషయం తెలియబరచడానికి 'పూర్ణచంద్రవదనన్' కల్యాణిన్ అన్నాడు. పున్నమి చంద్రుని వంటి మోముతో, సకల కల్యాణగుణోపేతయై ఉంది అని చెప్పాడు వెంటనే లంకలో కంటిన్ అంటూ ఎక్కడ చూసాడో చెప్పాడు. ఆ వెంటనే 'మీ పదపంకజంబులను నే గౌతుంహలంబొప్పఁగా గంటి' సీతాదేవి క్షేమవార్త విని మీరు ఎంతగా ఆనందపడతారో, నన్ను ఏమని అభినందిస్తారో, మా ప్రభువు సుగ్రీవుని ఎంతగా మెచ్చుకుంటారో అని అనేక విధాలుగా నాలో కుతూహలం కలుగుతూ ఉండగా మీ పాదపద్మాలు దర్శించాను. అక్కడ కళ్యాణి అయిన అమ్మను దర్శించాను, అన్నాడు భక్తి తన్మయతతో. ఇంతవరకు రాముడు ఏమీ మాట్లాడలేదు. శ్రోతగానే ఉన్నాడు. కానీ హనుమను ఆదరంతో చూసాడు. శ్రీరామునికి తన ఎడల ఎంతటి అభిమానం కలిగిందో ఆయన చూపుల్లో చూసి మురిసిపోయాడు హనుమ. 'మీ కరుణావలోకనము కంటిన్' అంటూ పులకరించిపోయాడు. ఆ పులకరింతలో రామా! ఈ కార్యాన్ని నిర్వర్తించడం వల్ల మా కపిబృందంలో విఖ్యాతిని గొప్ప కీర్తిని పొందాను స్వామీ! 'కీర్తులన్ గంటిన్' కీర్తులు అని బహువచన ప్రయోగం చేయడంలో–ఒక కీర్తికాదు సీతాన్వేషణలో కీర్తుల పరంపరను సాధించాడు హనుమ. చివరిగా స్వామిని 'గాంభీర్యవారాన్నిధీ! అని సంబోధిస్తూ' అంజలి ఘటించాడు శ్రీరామునిలో గాంభీర్యాన్ని గ్రహించగలిగే ఆత్మీయుడు హనుమ. అందుకే పెదవి విప్పకపోయినా రాముని కన్నులోని ప్రశంసాపూర్వక ఆశీస్సులను స్వీకరించి కళ్లకద్దు కున్నాడు. ఈ

పద్యంలో సహృదయులు ఎంతగా భావించగలిగితే అంతగా సొగసులున్నాయి. మొల్లకు పేరు తెచ్చిన పద్యాల్లో ఇది కూడా ఒకటి.

**సీ. కట్టిన వస్త్రంబు కట్టు కొంగే తప్ప**
**జీర్ణించి పోయిన చీరతోడ,**
**నుడుగని వగలచే నోరంత ప్రొద్దును**
**జెక్కింటఁ జేర్చిన చేయితోడఁ**
**బుడమిపైఁ బొరలాడు నొడలు బూడిద బ్రుంగి**
**నిరతంబు దొరఁగు కన్నీటితోడ,**
**నిడుద పెన్నెఱివేణి సడలించి జడలతో**
**నిరత నిరాహార నియతితోడఁ**

**తే. గినుక జంకించు దైత్య కామినుల నడుమఁదపముఁ**
**జేయుచు దనుజ బాధలకు నోర్చి,**
**వనిత ప్రాణంబు దక్క సర్వముఁ దృజించి**
**నిత్యమును మిమ్ము మదిలోన నిల్పియుండు.** **246**

**ప్రతి :** కట్టిన వస్త్రంబు=కట్టుకున్న చీర, కట్టుకొంగే=చీరకొంగే, తప్ప, జీర్ణించిపోయిన=చిరిగిపోయిన, చీరతోడ, ఉడుగని=అంతంలేని, వగలచేన్=దుఃఖాలతో, ఓరంతపొద్దునున్=పొద్దస్తమానూ (రోజంతా) చెక్కింటన్=చెక్కిట, చేర్చిన=పెట్టుకున్న, చేయితోడన్, పుడమిపైన్=భూమి మీద, పొరలాడు=ఇటూ అటూ కదలడం వల్ల, ఒడలు=శరీరం, బూడిదబ్రుంగి=దుమ్ముకొట్టుకొనిపోగా, నిరతంబు=ఎడతెగకుండా, తొరఁగు= కారిపోతున్న, కన్నీటితోఁడ, నిడుద=పొడుగైన, పెన్నెఱివేణి=మిక్కిలి అందమైన, జట్టు, సడలించి=విప్పి, జడలతోన్=జడలుకట్టగ వాటితో, నిరత=అనుక్షణమూ, నిరాహార=ఆహారం తీసుకోకుండా, నియతితోడన్= నియమముతో, కినుకన్=కోపముతో, జంకించు=బెదిరించు, దైత్యకామినుల నడుమన్=రాక్షస స్త్రీలమధ్య, తపమున్ చేయుచు, దనుజ బాధలకున్=రాక్షసులు పెట్టే బాధలకు, ఓర్చి=తట్టుకుని, వనిత=స్త్రీ (సీత), ప్రాణంబుదక్క=ప్రాణము తప్ప, సర్వము=అన్నిటిని, త్యజించి=వదలివేసి, నిత్యమును=నిత్యము, మిమ్ము, మదిలోన=మనస్సులో, నిల్పియుండు.

**తా :** సీతాదేవి కట్టుకున్న చీర, ఆ చీరకొంగు తప్ప మిగతా చీరంతా చివికిపోయింది. అలాంటి చిరిగిన చీరతో, అంతులేని దుఃఖాలతో రోజంతా చెక్కిట చేర్చిన చేతితో, నేలమీద కూర్చుని ఇటూ అటూ సర్దుకోవడంలో దుమ్ము కొట్టుకుపోయిన శరీరంతో, ఎడతెగకుండా కారిపోతున్న కన్నీళ్లతో, జడలు కట్టిన అందమయిన పెద్ద తలకట్టుతో, నిరాహారం క్రమం తప్పకుండా పాటిస్తూ, సర్వకాల సర్వావస్థల్లోనూ కోపంతో బెదిరించే

రాక్షస స్త్రీలమధ్య, రాక్షసులు పెట్టే బాధలు భరిస్తూ, ఒక్క ప్రాణం తప్ప అన్నీ వదలివేసి తపస్సు చేస్తూ – ఆమె నిత్యమూ మిమ్మల్ని 'మదిలో నిల్పియుండు' అని చెప్పాడు హనుమ.

**విశే :** సీత రామునికి పంపిన సందేశాన్ని కూడా మొల్ల ఒక సీసపద్యంలోనే కూర్చింది. (113వ పద్యం – సుందరకాండ) అందులో సీత – లంకా మహాద్వీప గహనసీమలో రాముని మూర్తిని చిత్తములో నిలిపి, తారకబ్రహ్మమంత్రం పఠిస్తూ తపము చేస్తున్నాను. నా పతిని నాకు ప్రత్యక్షం అవమని చెప్పుకుంది. ఆ విషయాలే ఇక్కడ రామునికి హనుమ అందిస్తున్నాడు.

లంకలో సీతాదర్శనం చేసిన హనుమ ఆమె రూపాన్ని కళ్లలో నింపుకుని, నిలుపుకుని వచ్చాడు. శ్రీరామునికి ఆమె మూర్తిని యథాతథంగా, చేయితిరిగిన చిత్రకారునివలె దృశ్యమానం చేస్తున్నాడు. ప్రాణంబు తక్క సర్వము త్యజించి అనే విషయం హనుమ పరిశీలనలో గ్రహించాడు.

'నిత్యమును మిమ్ము మదిలోన నిల్పియుండు' – అనే మాటతో తన విన్నపం ముగించాడు హనుమ. 'నిల్పియుండు' – అనడం సర్వకాల సర్వావస్థలలో సీతాదేవి తన మనస్సులో రాముణ్ణి నిల్పి ఉండు. రాముడు ఆమె మనస్సులోనే ఉంటాడు అనే మహార్థాన్ని సూచించింది మొల్ల. లంకలో సీత స్థితిని మొల్ల ఈ సీస పద్యాల్లో శిల్పీకరించింది.

**క.** **జానకిఁ బొడగనియును, మీ**
**రానతి నా కిచ్చి పంపినట్టి విధంబున్**
**నే నాయమ కెఱిఁగించియు,**
**జానకి రత్నంబుఁ గొంచుఁ జనుదేఁ గంటిన్. 247**

**ప్రతి :** జానకిన్=జానకిని, పొడగనియును=చూచియు, మీరు, ఆనతి, నాకిచ్చి, పంపినట్టి, విధంబున్, నేను, ఆయమకు=ఆమెకు, ఎఱింగించియున్=చెప్పియు, జానకి, రత్నంబున్=రత్నమును (చూడామణిని) కొంచున్=తీసుకొని, చనుదేన్ కంటిని=వచ్చుటకు సిద్ధమయితిని.

**తా :** జానకిని చూచి మీరు ఆజ్ఞాపించిన విధంగా నాకిచ్చి పంపిన ఉంగరాన్ని ఆమెకు అందించి, మీ క్షేమ సమాచారాలు చెప్పి, ఆమె ఇచ్చిన రత్నాన్ని తీసుకుని బయలుదేరాను.

## సీతా శిరోరత్నమును గాంచి శ్రీరాముఁడు దురపిల్లుట

**వ.** **ఇవ్విధంబున సీత చిహ్నంబులు రామచంద్రునకుం జెప్పి, దండ ప్రణామంబు లాచరించి, తనకు సీతా మహాదేవి దయచేసిన శిరో రత్నంబు శ్రీరామచంద్రునకు సమర్పించినం జూచి, యది యక్కునం జేర్చి, యానంద బాష్పంబులు గ్రమ్ముదేర మూర్ఛిల్లి, తెప్పిఱిల్లి. హా! వామలోచన! హా! పద్మగంధి! హా! సీత! హా! సీతా! యనుచు శోకించి సుగ్రీవుం జూచి, మనము లంకా ప్రయాణముఁ జేయఁబోవుదము, గాన నిఁక సేనలం గూర్చు మని యానతిచ్చిన వానరేశ్వరుండు మహాప్రసాదం బని యంగద హనుమ**

**జ్జాంబవ త్సుషేణ పనస నల నీల గజ గవాక్ష గోముఖాదు లగు సేనా నాయకుల నఱువదికోట్ల నియోగించిన, వారును నొక్కొక్కరు నూఱేసి కోట్ల బలంబులతోడ రామచంద్రుని కిరువంకల నాడుచుఁ బాడుచు మాల్యవంతంబు వెడలి, రని విని నారదుని వాల్మీకి మహామునీశ్వరుం డటమీఁది వృత్తాంతం బెట్టిదని యడుగుటయును. 248**

**ప్రతి :** ఇవ్విధంబునన్ (ఈ+విధంబునన్)=ఈ విధంగా, సీతచిహ్నంబులు, రామచంద్రునకున్, చెప్పి, దండప్రణామంబులు=సాష్టాంగ నమస్కారములు, ఆచరించి, తనకున్, సీతామహాదేవి, దయచేసిన=ఇచ్చిన, శిరోరత్నంబు=శిరోభూషణమగు రత్నమును, శ్రీరామచంద్రునకున్, సమర్పించినన్=ఈయగా, చూచి, అది అక్కునన్=దానిని హృదయమునందు, చేర్చి=ఉంచుకొని, ఆనందబాష్పంబులు=ఆనందముచే కల్గిన కన్నీరు, క్రమ్ముదేర=వెలువడగా, మూర్ఛిల్లి=మూర్ఛనొంది, తెప్పిఱిల్లి=మేలుకొని, హా వామలోచన!=హా అందమైన కనులు కలదానా! హా పద్మగంధి!=పద్మము యొక్క పరిమళము వంటి పరిమళము కలదానా!, హా సీతా!, హా సీతా!, అనుచు, శోకించి, సుగ్రీవున్, చూచి, మనము, లంకా ప్రయాణమున్, చేయన్, పోవుదము, కానన్=కావున, ఇఁకన్, సేనలన్, కూర్చుము=ఏర్పరుచుము, అని, ఆనతి ఇచ్చినన్=ఆజ్ఞ ఈయగా, వానరేశ్వరుండు= వానరరాజగు సుగ్రీవుడు, మహాప్రసాదంబు=గొప్ప అనుగ్రహము, అని, అంగద హనుమజ్జాంబవత్సుషేణ పనసనలనీలగజ గవాక్షగోముఖాదులగు, సేనానాయకులన్=సేనాధిపతులను, అఱువదికోట్లన్=అరవై కోట్లమందిని, నియోగించినన్=ఏర్పాటు చేయగా, వారునున్, ఒక్కొక్కరు, నూఱేసి, బలంబులతోడ= సైనికులతోడ, రామచంద్రునికిన్, ఇరువంకలన్=రెండు వైపులను, ఆడుచున్, పాడుచున్, మాల్యవంతంబు= మాల్యవంతమగు పర్వతమునకు, వెడలిరి=వెళ్ళిరి, అని, విని, నారదుని, వాల్మీకి మహామునీశ్వరుండు= వాల్మీకి మహర్షిశ్రేష్ఠుడు, అఁటమీఁదీ వృత్తాంతంబు=ఆ తరువాతి వృత్తాంతము, ఎట్టిది=ఎటువంటిది, అని, అడుగటయును.

**తా :** ఈ విధంగా సీత గుర్తులు, సంగతులు రామచంద్రునికి చెప్పి, చేతులెత్తి నమస్కరించాడు హనుమ. తనకు సీతాదేవి యిచ్చిన చూడామణిని శ్రీరామునికి సమర్పించాడు. ఆ చూడామణి చూసి దానిని గుండెలకు హత్తుకుని, కళ్లనిండా ఆనందబాష్పాలు ప్రవహించగా మూర్ఛపోయాడు రాముడు. కొంతసేపటికి తేరుకుని హా! అందమయిన కన్నులుగలదానా! హా! పద్మము వంటి పరిమళము గలదానా! హా సీతా! హా! సీతా! అంటూ దుఃఖించి, సుగ్రీవుణ్ణి చూచి, మనం లంకకు ప్రయాణమవుదాము. కాబట్టి ఇంక సేవలను సమకూర్చు అని ఆజ్ఞాపించాడు. వానరేశ్వరుడయిన సుగ్రీవుడు మహాప్రసాదం అని అంగదుడు, హనుమంతుడు, జాంబవంతుడు, సుషేణుడు, పనసుడు, నలుడు, నీలుడు, గజుడు, గవాక్షుడు, గోముఖుడు మొదలయిన సేనాయకులు అరవైకోట్ల మందిని నియోగించాడు. వారు ఒక్కొక్కరు నూఱేసి కోట్ల బలాలతో శ్రీరాముని ఇరుప్రక్కలా ఆడుతూ పాడుతూ మాల్యవంతాన్ని వదలి వెళ్లారని విని వాల్మీకి మహర్షి ఆ తరువాత వృత్తాంతం ఎట్టిది అని నారద మహర్షిని అడుగగా–

## ఆశ్వాసాంత పద్య గద్యములు

క. **జలజాక్ష! భక్త వత్సల!**
**జలజాసన వినుత పాద జలజాత! సుధా**
**జలరాశి భవ్య మందిర!**
**జలజాకర చారు హంస! జానకి నాథా!** **249**

గద్యము : ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురుజంగమార్చన వినోదసూరిజన వినుత కవితాచమత్కా రాతుకూరి కేసనసెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీరామయణ మహా కావ్యంబునందు సుందర కాండము సర్వము నేకాశ్వాసము.

* * *

# యుద్ధకాండ

## ప్రథమాశ్వాసం

క. కామారి వినుతనామా!
సామీరికృత ప్రణామా! సంహృత రక్షో
గ్రామా! వర్షామేఘ
శ్యామా! సంగ్రామ భీమ! జానకి రామా! 1

**ప్రతి :** కామారి=మన్మథునకు శత్రువైన శివునిచే, వినుతనామా!=నుతింపబడిన నామము కలవాడా!, సామీరి=సమీరుని కొడుకు సామీరి, వాయుపుత్రునిచే, కృతప్రణామ=చేయబడిన నమస్కారము కలవాడా! సంహృత రక్షోగ్రామా=సంహరింపబడిన రాక్షసులు గల, వర్షామేఘశ్యామా!=వర్షాకాలమందలి మేఘమువలె నల్లనివాడా! సంగ్రామ భీమ=యుద్ధంలో విశేషమైన శక్తిగలవాడా, జానకి రామా!

**తా :** మన్మథునకు శత్రువైన శివునిచే నుతింపబడిన నామము కలవాడా – 'రామ' నామాంకితుడా!, హనుమచే నమస్కరింపబడినవాడా! రాక్షస సంహారా! నీలమేఘశ్యామా! సంగ్రామభీమా! జానకిరామ!

### శ్రీరాముఁడు వానరసేనతో లంకపై దాడి వెడలుట

**వ. శ్రీనారద మునీశ్వరుండు వాల్మీకిమునీశ్వరున కెఱింగించిన తెఱంగు వినిపించెద సావధాన చిత్తంబుతో నాకర్ణించు మట్లు శ్రీరామ చంద్రుండు వానరసైన్యముతో వెడలి నడచు చుండ హనుమంతుం డంతకు ముందు తాను లంక కరిగి మగిడి వచ్చి యచ్చటి వృత్తాంతమంతయు శ్రీరామచంద్రున కెఱింగించియుఁ ద్రోవలో నుబుసుపోకకుఁగా మరలరావణుం డుండు చందంబును రాక్షసస్త్రీల సంవాదంబును నింద్రజి త్తతికాయాది కుమార వర్గంబు తెఱంగునుఁ గుంభకర్ణ విభీషణాది సోదరుల యునికియును లంకిణిపొంకం బణంచుటయు లంకలోపలకుఁ బోయిన చందంబును లంకాపురీ దహనంబును సముద్రలంఘనంబును నది యిది యననేల తాఁజేసి వచ్చిన కార్యంబు నెల్ల నెవ రెవ్వ రేదేది యడిగిన వారి కావృత్తాంతంబు నెఱింగించుచుండ మిగిలిన కపులు వినుచుఁ దమ జాతి చేష్టలు సూపుచుఁ జనుచున్న చందంబు సుగ్రీవుండు రామచంద్రునకుఁ జూపుచు నడచు చున్న సమయంబున. 2**

**ప్రతి :** శ్రీనారద మునీశ్వరుండు, వాల్మీకిమునీశ్వరునకున్, ఎఱింగించిన=తెలియపరచిన, తెఱంగున్= విధానమును, వినిపించెద=వినిపిస్తాను, సావధానచిత్తంబుతోన్=ఏకాగ్రమగు మనస్సుతో, ఆకర్ణించుము= వినుము, అట్లు=ఆ విధంగా, శ్రీరామచంద్రుండు, వానరసైన్యముతో, వెడలి=వెళ్ళి, నడుచుచుండన్= నడుస్తూండగా, హనుమంతుండు, అంతకుముందు=దానికంటె ముందుగా, లంకకున్, అరిగి=వెళ్ళి, మగిడివచ్చి=తిరిగివచ్చి, అచ్చటి వృత్తాంతమంతయు, శ్రీరామచంద్రునకున్, ఎఱింగించియున్=

తెలియజేసినను, త్రోవలోన్=మార్గములో, ఉబుసుపోకకుఁగాన్=కాలక్షేపము కొఱకు, మరల, రావణుండు, ఉండు, చందంబును=విధానమును, రాక్షసస్త్రీల, సంవాదంబును=సంభాషణములను, ఇంద్రజిత్తు+ అతికాయాది కుమారవర్గంబు తెఱంగునున్=ఇంద్రజిత్తు, అతికాయుడు మున్నగు రావణ కుమారుల సమూహము యొక్క విధానమును, కుంభకర్ణ విభీషణాది సోదరుల యునికియును=కుంభకర్ణుడు, విభీషణుడు మొదలగు సోదరుల స్థితియును, లంకిణిపొంకంబు=లంకిణి బలమును/పొగరును, అణంచుటయు= అణచివేయుటయు, లంకలోపలకున్, పోయిన చందంబును=వెళ్ళిన విధానమును, లంకాపురీదహనంబును= లంకానగరమును కాల్చుటయును, సముద్రలంఘనంబును=సముద్రమును దాటుటయును, అది ఇది అనన్ఏల=అదీ ఇదీ అనడం ఎందుకు, తాఁజేసివచ్చిన కార్యంబునెల్లన్=తాను చేసివచ్చిన పనినంతటిని, ఎవ్వరెవ్వరు, ఏది ఏది, అడిగినన్, వారికిన్, ఆ వృత్తాంతంబును=ఆ సన్నివేశమును, ఎఱింగించుచుండున్= తెలియపరచుచుండగా, మిగిలిన కపులు=తక్కిన వానరులు, వినుచున్, తమజాతి చేష్టలు= కోతిజాతి పనులు, చూపుచున్, చనుచున్నచందంబు=వెళ్ళుచున్న విధానమును, సుగ్రీవుండు, రామచంద్రునకున్, చూపుచు=నడుచుచున్న సమయంబునన్=నడుస్తూన్న సమయంలో...

**తా :** శ్రీనారద మహర్షి వాల్మీకి మహర్షికి చెప్పిన కథ వినిపిస్తాను. మనస్సు పెట్టి విను. శ్రీరామచంద్రుడు వానరసేనతో బయలుదేరి నడచి వెళుతూ ఉండగా, హనుమంతుడు తాను లంకకు వెళ్లడం అక్కడ చక్కబెట్టిన విషయాలు తిరిగి వచ్చి శ్రీరామునకు చెప్పినప్పటికీ ఇప్పుడు త్రోవలో ఉబుసుపోకకు మళ్లీ రావణుడు ఎలా ఉంటాడు. రాక్షస స్త్రీలు ఏమి మాట్లాడారు, వారు ఇంద్రజిత్తు, అతికాయుడు మొదలైన రావణుని కుమారుల విధానం ఎలాంటిదీ, కుంభకర్ణుడు విభీషణుడు మొదలైయిన సోదరులతో రావణునకు గల సన్నిహితత్వం వివరంగా చెప్పాడు. ఇంకా లంకిణిని తాను జయించిన సంగతి, లంకలో ప్రవేశించిన విధానం, లంకను కాల్చడం, సముద్రం దాటడం అదీ ఇదీ అనడం ఎందుకు తాను లంకలో చేసివచ్చిన పనులన్నీ - ఎవరు ఏది అడిగితే వారికి ఆయా ఘట్టాలు వివరించి చెప్తున్నాడు. మిగిలిన వానరులు వింటు సమయానుకూలంగా కోతిచేష్టలు చేస్తూ ప్రయాణిస్తున్న వారిని సుగ్రీవుడు శ్రీరామునకు చూపుచూ నడుస్తుండగా-

**విశే :** హనుమ సముద్రం దాటడం, సీతను దర్శించడం, లంకిణిని చంపడం, లంకను కాల్చడం వంటి విశేష ఘట్టాలు - లంకలోని రాక్షసుల వివరాలు - వానరులందరూ పదే పదే అడిగి హనుమచేత చెప్పించుకుని పరమోత్సాహంతో నడక శ్రమ తెలియకుండా ప్రయాణం చేస్తున్నారు.

ఒక మహత్కార్యం సాధించి వచ్చినప్పుడు ఆ విశేషాలు మళ్ళీ మళ్ళీ అడిగి చెప్పించుకోవడం అత్యంత సహజమైన విషయం. కార్యసాధకుడికి తన విజయాన్ని ఎందరు ఎన్నిమార్లు అడిగినా ఆనందంతో వివరించడమూ సహజమే. శ్రోతకూ, వక్తకూ కూడా విసుగురాని, విసుగులేని సందర్భమిది. ఉబుసుపోక= కాలక్షేపము కందువ మాట.

ఉ. కొందఱు మంతనమ్ములను గొంచును గొందఱు దొమ్ములాడుచుం
గొందఱు రామలక్ష్మణులకుం బ్రియమౌగతి నాటలాడుచుం
గొందఱు గంతులేయుచును గొందఱు పండ్లిగిలించి చూపు చి
ట్లందఱుఁ బోవుచుండిరి దయానిధి రాముఁడు సంతసిల్లఁగన్. 3

**ప్రతి :** కొందఱు, మంతనమ్ములను=రహస్య సంభాషణలను, కొంచును=ఒకరితో ఒకరు చెప్పుకుంటూ, కొందఱు, దొమ్ములాడుచున్=చాలామంది కలియబడి యుద్ధం చేస్తూ (ఆటగా), కొందఱు, రామలక్ష్మణులకున్, ప్రియమౌగతిన్=ఆనందం కలిగించే విధంగా, ఆటలాడుచున్=రకరకాల ఆటలు ఆడుతూ, కొందఱు, గంతులేయుచున్, కొందఱు, పండ్లిగిలించి చూపుచు=ఇది కోతులకు ప్రత్యేకమయిన కళ (పళ్లు కనబడేటట్లుగా చూపడం), ఇట్లు, అందఱు, పోవుచుండిరి=వెళుతున్నారు, దయానిధి రాముఁడు=కరుణాసముద్రుడయిన రాముడు, సంతసిల్లఁగన్=ఆనందించగా.

**తా :** దయానిధి అయిన రాముడు ఆనందపడేలా వానరులు కొందఱు రహస్యాలాడుకుంటూ, కొందఱు దొమ్మి యుద్ధం ఆడుకుంటూ, కొందఱు రామలక్ష్మణులు చూచి ఆనందించేలా ఆటలాడుతూ, కొందఱు గంతులేస్తూ, కొందఱు పళ్లికిలించి చూపిస్తూ అందరూ ప్రయాణం చేస్తున్నారు.

సీ. పాదఘట్టనలచేఁ బరఁగిన పెంధూళి
యాకసమ్మున మేఘమట్లు పర్వ
వీఁకఁతో దాఁకిన వృక్షజాతం బెల్ల
వ్రేల్మిడిఁ గొమ్మలు విఱిగి పడఁగ
బలువడితోఁ బోవు పక్షిజాతమ్ములు
భయముచే నందంద పాఱుచుండఁ
జూపించి రావణాసురుని సైన్యం బిట్లు
మనవారిచేతను మ్రందఁ గలదు

తే. అనుచు శ్రీరామునకు నర్కతనయుఁడిట్లు
సంతసము పుట్టఁజెప్పుచు సాగిసాగి
క్రమముగా నందఱునుఁ గొంతకాలమునకుఁ
దిన్నఁగాఁ జేరిరి సముద్రతీరమునకు. 4

**ప్రతి :** పాదఘట్టనలచేన్=కాళ్లతాకిడికి, పరఁగిన=ప్రసరించిన (లేచిన), పెంధూళి=పెద్ద దుమ్ము, ఆకశమ్మున=ఆకాశంలో, మేఘమట్లు=మేఘమువలె, పర్వ=వ్యాపించగా, వీఁకతోన్=పరాక్రమముతో, తాకిన=కొట్టిన, వృక్షజాతం బెల్ల=రకరకాల చెట్లన్నీ, వ్రేల్మిడిన్=చిటికెలో, కొమ్మలు విఱిగి పడగ, పలువడితోన్=కూతలు కూస్తూ, పక్షిజాతమ్ములు=వివిధజాతుల పక్షులు, భయముచేన్, అందంద,

పాఱుచుండన్=పారిపోతూ ఉండగా, చూపించి, రావణాసురుని, సైన్యంబు, ఇట్లు=ఈ విధంగా, మనవారిచేతను=మన వానరసైన్యం చేత, ధ్రంసన్ కలదు=నాశనము కాగలదు, అనుచు, శ్రీరామునకున్, అర్కతనయుఁడు=సుగ్రీవుడు, ఇట్లు, సంతసము=ఆనందము, పుట్టన్=కలుగునట్లు, చెప్పుచు, సాగిసాగి=నడచి నడచి, క్రమముగాన్=వరుసగా, అందఱునున్, కొంత కాలమునకున్, సముద్ర తీరమునకు, తిన్నఁగాన్, చేరిరి.

**తా :** వానరులు నడుస్తుండగా వాళ్ల అడుగులు తొక్కిడికి దుమ్ము విపరీతంగా రేగి ఆకాశంలో మేఘంలా అలుముకొంది. పరాక్రమంతో వారు కొట్టిన దెబ్బలకు చెట్ల కొమ్మలన్నీ చిటికలో విఱిగి పడిపోయాయి. పక్షులన్నీ కూతలు కూస్తూ భయంతో ఎగిరిపోసాగాయి. ఈ దృశ్యాన్ని సుగ్రీవుడు శ్రీరామునికి చూపించి రావణాసురుని సైన్యం ఇలాగే మన వానరుల చేత నాశనం కాగలదు అని రామునకి ఆనందం కలిగేలా చెప్తూ ప్రయాణం సాగించాడు. నెమ్మదిగా అందరూ కొంతసేపటికి తిన్నగా సముద్రతీరానికి చేరారు.

**వ. ఇట్లందఱును సముద్రతీరమున విడిసి యున్న సమయంబున హనుమంతుండు బుద్ధిమద్వరిష్ఠుండు గావున శ్రీరామచంద్రునకు నమస్కరించి రావణుండు రాజ్యంబునం బట్టభద్రుండై యున్నవాఁడు వానిం జంపి సీతా మహాదేవిం దెప్పించుపనికై వేగ మన మందఱమును సిద్ధులమై యుండవలయు ననవుడు రామచంద్రుడు తమ్మునితో.** **5**

**ప్రతి :** ఇట్లు, అందఱును, సముద్రతీరమునన్, విడిసియున్న సమయంబునన్=తాత్కాలికంగా నివాసమున్న సమయంలో, హనుమంతుండు, బుద్ధిమద్వరిష్ఠుండు గావునన్=బుద్ధిమంతులలో మిక్కిలి శ్రేష్ఠుడగుట వలన, శ్రీరామచంద్రునకున్, నమస్కరించి, రావణుండు, రాజ్యంబునన్ పట్టభద్రుండై ఉన్నవాఁడు=రాజ్యాధికారములో పట్టాభిషిక్తుడై ఉన్నటువంటివాడు, వానిన్, చంపి, సీతామహాదేవిన్, తెప్పించు పనికై, వేగన్=వేగముగా, మనము అందఱమును, సిద్ధులమై=సన్నద్ధులమై, ఉండవలయును, అనవుడు=పిమ్మట, రామచంద్రుండు, తమ్మునితో –

**తా :** ఇలా అందరు సముద్రతీరంలో సేన అంతా బసచేసి ఉండగా బుద్ధిమంతులలో శ్రేష్ఠుడయిన బుద్ధిమద్వరిష్ఠుండు హనుమ శ్రీరామునకు నమస్కరించి రావణుడు లంకారాజ్యంలో పట్టభద్రుడై ఉన్నాడు. వాణ్ణి చంపి సీతాదేవిని తెచ్చుకునే పనికి మనం అందరం సిద్ధంగా ఉండాలి అన్నాడు. హనుమ చెప్పిన మాట విని రాముడు లక్ష్మణునితో –

**క. ఈ వానరులను దోడ్కొని**
**ప్రావీణ్యముతోడ వృక్షపర్వతతతులన్**
**వేవేగమె తెప్పింపుము**
**పోవుద మటమీఁద వైరి పురముంజేరన్.** **6**

**ప్రతి :** ఈ వానరులను, తోడ్కొని=వెంటపెట్టుకుని, ప్రావీణ్యము తోడన్=నేర్పుతో, వృక్షపర్వతతతులన్=అనేకమైన చెట్లను, కొండలను, వేవేగము=అతివేగంగా, తెప్పింపుము, అటమీఁదన్=ఆ తరువాత, వైరిపురమున్=శత్రువు యొక్క నగరం, చేరన్=చేరుకుందుకు, పోవుదము=వెళ్లుదము.

**తా :** ఈ వానరులనందరినీ పంపి వృక్షపర్వత సమూహాలను నేర్పుతో అతివేగంగా తెప్పించు. వాటితో వారధి కట్టిన తరువాత శత్రునగరానికి వెళదాము.

**వ. అని యిట్లానతిచ్చి సముద్రతరణోపాయంబాలోచించుచుండె నంత. 7**

**తా :** అని ఈ విధంగా ఆనతి యిచ్చి, సముద్రం దాటడం ఎలాగా అని ఆలోచిస్తూ ఉన్నాడు అంత.

## రాక్షస వీరులతో రావణుని మంతనము

**సీ. అక్కడ రావణుం డఖిలమంత్రుల వేగ**
**రావించి తగగ వారలకు ననియె**
**మంత్రిసత్తములారా! మర్కటుండొకఁ డేఁగు**
**దెంచి మనందఱం గొంచెపఱిచి**
**రాక్షస వీరుల రణభూమిఁ బొలియించి**
**వనమంత బెకలించి వార్ధిదాఁటి**
**పోయెను బోరానిపోకలఁ బోవుచు**
**వాఁడు శ్రీరాముని వద్దకేఁగి**

**తే. ఏమి చెప్పునో యామీఁద నా మనుష్యు**
**లిద్దఱును వానరులఁగూడి యేపుమీఱ**
**వచ్చి లంకాపురములోని వారినెల్ల**
**నేమి చేయునొ యిపుడు నాకేమి దారి. 8**

**ప్రతి :** అక్కడ, రావణుండు, అఖిలమంత్రులన్=అందరు మంత్రులను, వేగరావించి=వేగంగా రప్పించి, తగగ=తగురీతిలో, వారలకున్=వారితో, అనియె, మంత్రి సత్తములారా!=శ్రేష్ఠులైన మంత్రులారా!, మర్కటుండు=కోతి, ఒకఁడు, ఏఁగుదెంచి=వచ్చి, మనందఱన్=మనల్ని అందరినీ, కొంచె పఱిచి=చులకనచేసి, రాక్షసవీరుల=వీరులైన రాక్షసులను, రణభూమిన్=యుద్ధభూమిలో, పొలియించి=చంపి, వనమంతన్=తోటంతా, పెకలించి=పీకేసి, వార్ధిదాఁటి పోయెను=సముద్రం దాటి వెళ్లాడు, పోరాని పోకలన్=వెళ్లలేని మార్గాల్లో, పోవుచు=వెళ్లుచు, వాఁడు, శ్రీరాముని వద్ద కేఁగి=రామునివద్దకు వెళ్లి, ఏమిచెప్పునొ?, ఆ మీఁదన్=ఆ తరువాత, ఆ మనుష్యులిద్దఱును, వానరులన్, కూడి, ఏపుమీఱ=అతిశయంతో, వచ్చి, లంకాపురములోని, వారిన్, ఎల్లన్ ఏమి చేయునొ? ఇపుడు, నాకు, ఏమి, దారి?

**తా :** లంకలో రావణుడు మంత్రులందరినీ వేగంగా రప్పించాడు. మంత్రిసత్తములారా! ఒక కోతి వచ్చి మనందరినీ చులకన చేసి మన వీరుల్ని యుద్ధంలో చంపి, తోటంతా ధ్వంసం చేసి సముద్రం దాఁటి వెళ్లాడు. చేయలేని పనులన్నీ చేస్తూ ఆ హనుమంతుడు శ్రీరామునితో ఏం చెప్పాడో? అది విన్న రామలక్ష్మణులు మానవమాత్రులు ఇద్దరూ వానరులతో కూడి ఉత్సాహంతో వచ్చి ఈ లంకలో వారినందరినీ ఏమి చేస్తారో? ఇప్పుడు నాకు దారి ఏది? ఏం చెయ్యాలి?

**విశే :** ఈ పద్యంలో రావణుడు హనుమ లంకలో చేసిన పనులకు ఎంతగా భయపడ్డాడో వివరించింది మొల్ల – వాడు వెళ్లి రామునికి ఏమి చెప్తాడో? వారు వచ్చి ఏమి చేస్తారో? అని, భయపడుతున్న రావణుడు చివరకు ఇపుడు నాకేమి దారి? అని దిగులు పడడం స్పష్టంగా అతని మాటల్లో వ్యక్తమవుతోంది. చక్కని తెలుగుభాషలో గల నుడికారపు సొంపుతో ఈ పద్యం కూర్చింది మొల్ల. మనలనందఱ కొంచెపఱిచె, పోరాని పోకలఁ బోవుచు, నాకేమిదారి? – కందువ మాటలు.

**వ. అని యిట్లు రావణుండు నిండు పేరోలగంబునఁ గూర్చుండి డోలాయమాన మానసుండై విచారించుచుండ నా సమయంబున విభీషణుండు సాయం సంధ్యావిధిం దీర్చికొని తన మంత్రులుం దానును గొల్వు కూటంబున కేతెంచి పెద్ద గద్దియపైఁ గొలువున్న యన్నకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించిన నతండును సంతోషించి యనుజునకు నర్హపీఠంబుఁ జూపిన నాసీనుండై యన్న కిట్లనియె. 9**

**ప్రతి :** అని, ఇట్లు, రావణుండు, నిండుపేరోలగంబునన్=నిండు సభలో/కొలువులో, కూర్చుండి, డోలాయమానమానసుండై=ఊగిసలాడుతున్న మనస్సు కలవాడై, విచారించుచుండన్=ఆలోచించుచుండగా, ఆ సమయంబునన్, విభీషణుండు, సాయంసంధ్యావిధిన్=సాయంకాలపు సంధ్యావందన కార్యమును, తీర్చికొని=ముగించుకొని, తనమంత్రులున్, తానును, కొల్వుకూటంబునకున్=సభామందిరమునకు, ఏతెంచి=వచ్చి, పెద్దగద్దియపై=పెద్ద సంహాసనముపై, కొలువున్న=కూర్చున్న, అన్నకున్, సాష్టాంగదండ ప్రణామంబులు=కర్రవలె ఎనిమిది అవయములు నేలపై ఊని చేయు నమస్కారములను, ఆచరించినన్= చేయగా, అతండును=ఆ రావణుడును, సంతోషించి=ఆనందించి, అనుజునకున్=తమ్మునకు, అర్హపీఠంబున్= యోగ్యమగు ఆసనమును, చూపినన్=చూపించగా, ఆసీనుండై=కూర్చున్నవాడై, అన్నకున్, ఇట్లు, అనియెన్.

**తా :** నిండు కొలువులో కూర్చుండి రావణుడు ఇలా ఏం చెయ్యాలా అని మనసులో ఊగిసలాడుతుండగా ఆ సమయంలో విభీషణుడు సాయంసంధ్యా కార్యక్రమాలన్నీ పూర్తి చేసుకుని తన మంత్రులతో కలసి ఆ కొలువు కూటానికి వచ్చాడు. పెద్ద సింహాసనం మీద కూర్చున్న అన్నగారికి సాష్టాంగదండ ప్రణామాలు చేశాడు. రావణుడు ఆనందపడి తమ్ముడికి తగిన ఆసనం చూపించాడు. విభీషణుడు ఆ పీఠం మీద కూర్చుని అన్నగారితో ఇట్లా అన్నాడు.

**తే. అవధరింపుము దేవ! మహానుభావ!**
**మన పురమ్మునఁ బ్రకృతము చనుతెఱంగు**

**విన్నవించెద నున్నది యున్న యట్లు**
**కొంచె మవధానముగ నాలకించు మయ్య! 10**

**ప్రతి :** అవధరింపుము దేవ!=దేవా! వినుము, మహానుభావ!, మనపురమ్మునన్=మన లంకానగరంలో, ప్రకృతము=ప్రస్తుతం, చనుతెఱంగు=జరుగుతున్న వివిధ విషయాలు, విన్నవించెద=తెలిపెద, నున్నదియున్నయట్లు=ఉన్నది ఉన్నవిధంగా, కొంచెము, అవధానముగన్=ఏకాగ్రతతో, ఆలకించుమయ్య=వినుమయ్య.

**తా :** మహానుభావుడవయిన దేవా! శ్రద్ధగా విను. మన లంకానగరంలో ప్రస్తుతం కనిపిస్తున్న వివిధ విషయాలు ఉన్నవి ఉన్నట్లుగా చెప్తున్నాను.

**విశే :** ఉన్నది ఉన్నట్లు - కందువమాట.

**సీ. అన్నంబు నీరును నక్కఱ లేకుండ**
**భటు లందఱును దుఃఖపడుదరయ్య**
**కంబాలఁ గట్టిన గజబృంద మెల్లను**
**జవసత్త్వములు దూలి జడిసెనయ్య**
**హర్షంబుతోడుత హయజాతమంతయు**
**మెడ లెత్తుకొని వేడ్క మెలఁగవయ్య**
**ప్రజ్వలించుచు నున్న ప్రతిహోమకుండంబు**
**బొగలు గ్రమ్ముచు నాఱిపోవునయ్య**

**తే. ఇట్టి యపశకునముల గన్పెట్టుమయ్య**
**సకలశాస్త్రంబు లెఱిఁగిన జాణవయ్య**
**యింపుగాఁజెప్పుచుంటి నాలింపుమయ్య**
**వేగ రాముని సతి నిచ్చివేయు మయ్య! 11**

**ప్రతి :** అన్నంబు, నీరును, అక్కఱ లేకుండ=సమయానికి లేక, భటులందఱును, దుఃఖపడుదురయ్య, కంబాలన్=స్తంభాలకు, కట్టిన, గజబృందము=ఏనుగుల సమూహము, ఎల్లను=అంతా, జవసత్త్వములు=వేగము, శక్తి, తూలి=పోయి, జడిసెనయ్య=భయపడినవయ్యా!, హర్షంబుతోడుత=ఆనందంతో, హయజాతమంతయు=గుఱ్ఱాలన్నీ, మెడలెత్తుకొని=మెడలుపైకెత్తిపెట్టి, వేడ్క=కుతూహలంతో, మెలగవయ్య=తిరుగుటలేదు, అయ్య=ప్రభూ!, ప్రజ్వలించుచున్=బాగా మండుచు ఉన్న, ప్రతి హోమకుండంబు=అన్ని హోమకుండాలు, పొగలు, క్రమ్ముచున్=చుట్టుకుంటూ, ఆఱిపోవునయ్య= ఆరిపోతున్నాయి. ఇట్టి, అపశకునములన్=చెడ్డశకునాలు, కన్పెట్టుమయ్య=జాగ్రత్తగా చూడుమయ్య, సకల శాస్త్రంబులు, ఎఱిఁగిన=

తెలిసిన, జాణవయ్య=నేర్పరివయ్య, ఇంపుగాన్=మంచిగా, చెప్పుచుంటిన్=చెప్తున్నాను. ఆలింపుమయ్య= వినవయ్య, వేగ=తొందరగా, రాముని సతిన్=రాముని భార్యను, ఇచ్చివేయుము అయ్యా!

**తా :** సమయానికి అన్నము, నీరు లభించక భటులందరు దుఃఖపడుతున్నారు. స్తంభాలకు కట్టిన ఏనుగుల సమూహం వేగము బలంలేక తూలి భయపడుతున్నాయి. ఆనందంతో గుఱ్ఱాలన్నీ మెడలెత్తుకుని తిరగడం లేదు. చక్కగా మండే అగ్నిహోత్రంతో ఉండే హోమకుండాలన్నీ పొగలు వ్యాపించి ఆరిపోతున్నవయ్యా! ఇలాంటి ఈ అపశకునాలను గమనించు. నువ్వు సకల శాస్త్రాలు తెలిసిన జాణవు. మంచిగా చెప్తున్నాను వినవయ్య! రాముని సతి సీతను తొందరగా ఆయనకు సమర్పించవయ్యా!

**క. సీతను దెచ్చుట మొదలుగ**
**నీతో నయవాక్యములను నేఁ జెప్పితి నీ**
**చేతమునఁ బెట్టవైతివి**
**ఖ్యాతిగ నిక నైన సీత నాతని కిమ్మా. 12**

**ప్రతి :** సీతను, తెచ్చుట=తీసుకువచ్చిన, మొదలుగ=నాటినుండి, నీతో, నయవాక్యములను=నీతివాక్యాలను, నేన్, చెప్పితి, నీ చేతమునన్=నీ మనస్సులో, పెట్టవైతివి=పెట్టుకోలేదు, ఇఁకనైన=ఇప్పటికైన, ఖ్యాతిగ= కీర్తి కలిగేలా, సీతన్=సీతను, ఆతనికిన్=రామునికి, ఇమ్మా=ఇచ్చివేయుమయ్యా!

**తా :** సీతాదేవిని లంకకు తెచ్చిన నాటినుండీ నీతో నేను ఈ పని సరియైనది కాదని చెప్తూనే ఉన్నాను. నీ మనస్సుకు పట్టించుకోలేదు. ఇప్పటికైనా సీతను రామునికి ఇచ్చి కీర్తిని పొందు అన్నాడు.

**వ. అదియునుంగాక మొన్నరాతిరి సీతయొద్దఁ గావలియున్న రాక్షసకాంత లందఱును నిద్రించుచున్న సమయంబునఁ ద్రిజట దిగ్గన మేల్కాంచి నిదురించుచున్న స్త్రీలను లేపి చెప్పిన దుస్స్వప్నంబు విన్న వించెద నాకర్ణింపుము. రామచంద్రుండు మనలంకపై దండు విడిసినట్లును నీవును గుంభకర్ణుండును దక్షిణాభిముఖులై గార్దభంబులపై నెక్కి పితృభూమి కరుగుచున్నట్లును నింద్రజిత్తాది కుమార వర్గంబును సైన్యంబును మూలబలంబును సర్వంబును నశించేపోవుచున్నట్లును. సీతంజేకొని శ్రీరామచంద్రుం డయోధ్యకుఁ బోవుచున్నట్లును గలఁగన్నదఁట. త్రిజటకల నిక్కంబై తోఁచెడిని. రాముండు వానరసైన్యంబుతోఁ గూడి సముద్రతీరంబునకు వచ్చి యున్నాఁడని చారులు విన్నవించిరి. రాముని దూతలు మఱల నిచ్చటకు రాకమునుపే శ్రీరామచంద్రునకు సబహుమానంబుగా సీతను సమర్పించుటయు లెస్స కార్యము. ఇంతచెప్పనేల మొన్న నొక్కదూత వానరవేషంబున వచ్చి తన పరాక్రమంబు నీకును బరివారమునకును నెఱింగించి పోయెనది గుఱుతుంచుకొమ్ము. అనియిట్లు నీతిచెప్పు తమ్మునిపైఁ గోపించి దిగ్గన కొలువు కూటంబువిడిచి యంతఃపురంబునకుఁ బోయె నా సమయంబున నా సభలోని వారందఱును దమతమ మందిరంబులకరిగిరి. 13**

**ప్రతి :** అదియునుంగాక=అదీకాక, మొన్నరాతిరి, సీతయొద్దన్, కావలియున్న రాక్షసకాంతలు=కాపుగా ఉన్న రాక్షసస్త్రీలు, అందఱును, నిద్రించుచున్న సమయంబునన్=నిద్రిస్తూన్న సమయంలో, త్రిజట, దిగ్గనమేల్కాంచి=ఉలిక్కిపడిలేచి, నిదురించుచున్న స్త్రీలను, లేపి, చెప్పిన, దుస్స్వప్నంబు=చెడుకలను, విన్నవించెదను=విజ్ఞప్తి చేయుదును, ఆకర్ణింపుము=వినుము, రామచంద్రుండు, మనలంకపై, దండు విడిసినట్లును=దండెత్తి వచ్చినట్లును, నీవును, కుంభకర్ణుండును, దక్షిణాభిముఖులై=దక్షిణ దిక్కునకు అభిముఖులై, గార్దభంబులను=గాడిదలను, ఎక్కి, పితృభూమికిన్=స్మశానమునకు, అరుగుచున్నట్లునున్=వెళ్ళుచున్నట్లును, ఇంద్రజిత్తాదికుమారవర్గంబును=ఇంద్రజిత్తు మొదలగు కుమారసమూహమును, సైన్యంబును, మూలబలంబును=ప్రధాన బలమును, సర్వంబును, నశించిపోవుచున్నట్లును, సీతన్ చేకొని=సీతను తీసికొని, శ్రీరామచంద్రుఁడు, అయోధ్యకున్, పోవుచున్నట్లును=వెళ్ళుచున్నట్లును, కలన్కన్నదఁట=కలలో చూచినదట, త్రిజట కల=త్రిజట యొక్క కల, నిక్కంబై=సత్యమై, తోఁచెడిని=తోచుచున్నది, రాముండు, వానరసైన్యంబుతోన్, కూడి, సముద్రతీరంబునకున్, వచ్చి, ఉన్నాఁడని, చారులు=గూఢచారులు, విన్నవించిరి=తెలియపరచిరి, రాముని దూతలు, మరలన్, ఇచ్చటకున్, రాకమునుపే=వచ్చుటకుముందే, శ్రీరామచంద్రునకున్, సబహుమానంబుగాన్=సగౌరవముగా, సీతను, సమర్పించుటయు=ఇచ్చుటయు, లెస్సకార్యము=మంచిపని, ఇంతచెప్పన్ ఏల?=ఇంతగా చెప్పుటెందులకు?, మొన్నన్=ఇంతకుమునుపు, ఒక్కదూత, వానరవేషంబునన్=కోతిరూపములో, వచ్చి, తన పరాక్రమంబు=తన వీరత్వమును, నీకును, పరివారమునకును=నీ చుట్టూ ఉన్న జనులకును, ఎఱింగించి=తెలియజేసి, పోయెను=వెళ్ళెను, అది గుఱుతుంచుకొమ్ము=అది గుర్తుపెట్టుకొనుము, అని, ఇట్లు=ఈ విధంగా, నీతిచెప్పు తమ్మునిపైన్=నీతిని చెప్పెడి తమ్ముడిపట్ల, కోపించి, దిగ్గన కొలువుకూటంబు విడిచి=ధిక్కారమున సభామందిరమును విడిచిపెట్టి, అంతఃపురంబునకున్, పోయెను=వెళ్ళెను, ఆసమయంబునన్, ఆ సభలోని వారందఱును=ఆ కొలువులో ఉన్నవారంతా, తమ తమ మందిరములకున్=తమ తమ నివాసములకు, అరిగిరి=వెళ్ళిరి.

**తా :** అదీకాక మొన్నరాత్రి సీతకు కావలియున్న రాక్షస స్త్రీలు అందరూ నిద్రిస్తూండగా త్రిజట ఉలిక్కిపడి లేచింది. నిద్రపోతున్న వారి నందరినీ లేపి ఒక దుస్స్వప్నం గురించి చెప్పింది – ఆ విషయం చెప్తాను విను. రాముడు మన లంకపై దండుతో వచ్చి బసచేసి ఉన్నట్లు, నువ్వూ, కుంభకర్ణుడు దక్షిణ దిక్కుకు గాడిదల మీద ఎక్కి పితృభూమికి వెళుతున్నట్లు, ఇంద్రజిత్తు మొదలయిన కుమారులందరు, సైన్యము, మూలబలము సర్వమూ నశించిపోతున్నట్లు, సీతాసమేతుడై శ్రీరామచంద్రుడు అయోధ్యకు వెళ్తున్నట్లు కలకన్నదట. త్రిజట కల నిజమవుతుంది అనిపిస్తోంది. రాముడు వానరసైన్యంతో సముద్రతీరానికి వచ్చినట్లు గూఢచారులు చెప్పారు. రాముని దూతలు మళ్లీ ఇచ్చటకు రాకముందే శ్రీరామచంద్రునికి గౌరవంగా సీతను సమర్పించడం మంచి పని. ఇంతగా చెప్పడమెందుకు – మొన్నటికి మొన్న ఒక దూత కోతిరూపంలో వచ్చి తన పరాక్రమం ఎంతటిదో నీకు, మన వారందరికీ తెలియచెప్పి వెళ్లాడు. అది గుర్తుపెట్టుకో అని మంచి చెప్పిన తమ్ముని మీద కోపించి దిగ్గన కొలువుకూటంబు వదలి అంతఃపురానికి వెళ్లిపోయాడు. ఆ సభలోని వారందరూ కూడా తమ తమ మందిరాలకు వెళ్లారు.

**విశే :** త్రిజట స్వప్నవృత్తాంతం సుందరకాండలోది. రామకథలో ఈ త్రిజట స్వప్నం – సీతామాతకు ధైర్యాన్ని, ఆశని కలిగించినట్టిది. ఈ వృత్తాంతానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. అయితే ఈ స్వప్నవృత్తాంతం రావణునకు తెలిసినట్లు వాల్మీకి రామాయణంలో లేదు. ఇక్కడ మొల్ల విభీషణుని చేత రావణునికి సభలో చెప్పించడం వల్ల విషయం చాలామందికి తెలిసింది.

త్రిజట స్వప్నవృత్తాంతం విభీషణుడికి తెలిసింది. సీతపట్ల భక్తిగల విభీషణుడు ఆమె యోగక్షేమాలు తెలుసుకుంటూ ఉండేవాడు. ఏనాటి కానాడు సీతమ్మ క్షేమసమాచారాలు తెలుసుకునే శ్రద్ధగల విభీషణుడు ఈ స్వప్నవృత్తాంతం తెలుసుకుని, తగు సమయంలో అన్నకు ఆ కల లంకకు అశుభసూచకమని కూడా చెప్పాడు. ఇది వాల్మీకి చెప్పినదే. సమయానుకూలంగా రావణునికి విభీషణుని చేత చెప్పించి – రావణుడిలో మార్పు వస్తుందేమో అని ప్రయత్నించింది మొల్ల.

క. **మఱునాఁ డెప్పటి యట్లనె**
**సురుచిరముగఁ గొలువు సేయఁ జోద్యంబుగ ని**
**ద్దురబోవు కుంభకర్ణుఁడు**
**సరిగా మేలుకొని వచ్చె సరభసలీలన్.** **14**

**ప్రతి :** మఱునాఁడు=మరుసటిరోజు, ఎప్పటియట్లనె=రోజూలాగే, సురుచిరముగన్=మనోహరముగా, అందముగ, కొలువు సేయన్=సభాసమావేశం చేయగా, చోద్యంబుగ=ఆశ్చర్యంగా, నిద్దురబోవు=నిద్రపోయే, కుంభకర్ణుఁడు, సరిగా=చక్కగా, మేలుకొనివచ్చె=లేచి వచ్చాడు, సరభసలీలన్=వేగంగా ఆనందంతో.

**తా :** మరుసటిరోజు ఎప్పటిలాగే అందంగా కొలువు చేసాడు. ఎప్పుడూ నిద్రపోతూ ఉండే కుంభకర్ణుడు పూర్తిగా మేల్కొని అందరూ ఆశ్చర్యపోయేలా వేగంగా ఆనందంతో వచ్చాడు.

**విశే :** వాల్మీకి రామాయణంలో కుంభకర్ణుని నిద్ర నుండి లేపడం ప్రత్యేకఘట్టం.

వ. **ఇట్లు వచ్చి గృహప్రవేశంబుఁ జేసి స్నానాదిక్రియలు నిర్వర్తించుకొని భుజియించి మంత్రులతో నన్న కొలువునకుఁ జనుచుండు కుంభకర్ణునితో మఱల విభీషణుండు మంత్రిసహితుండై వచ్చెను. అనుజు లిద్దఱును వచ్చి నమస్కరించిన దీవించి సేమం బడిగి యుచితాసనంబులం గూర్చుండ నియోగించినఁ గుంభకర్ణుం డత్యంతమును నాసన్నుండై కూర్చుండెను. కొంచెము దూరములోఁగూర్చుండియున్న విభీషణుండు మరల నన్నతో నిట్లనియె.** **15**

**ప్రతి :** ఇట్లువచ్చి=ఈవిధంగా వచ్చి, గృహప్రవేశంబుఁజేసి=ఇంటిలోకి ప్రవేశించి, స్నానాదిక్రియలు=స్నానము మున్నగు పనులు, నిర్వర్తించుకొని=పూర్తిచేసుకుని, భుజించి=భోజనము చేసి, మంత్రులతో, అన్న కొలువునకున్, చనుచుండు=వెళ్లునట్టి, కుంభర్ణునితో, మఱల=మళ్లీ, మంత్రిసహితుండై=మంత్రులను కూడి, అనుజులు = తమ్ములు, ఇద్దఱును, వచ్చి, నమస్కరించిన, దీవించి, సేమంబడిగి = క్షేమసమాచారాలు అడిగి, ఆసనాల=పీఠముల, కూర్చుండ, నియోగించినన్=ఆజ్ఞాపించగా, అత్యంతమును= మిక్కిలి, ఆసన్నుండై=

దగ్గఱగా, కూర్చుండెను, కొంచెము దూరములో=కొద్దిదూరములో, కూర్చుండియున్న=కూర్చొని ఉన్న, మరల=తిరిగి

**తా :** ఇలా ప్రవేశించి స్నానం మొదలయిన పనులు అన్నీ పూర్తి చేసుకుని, భోజనం చేసి, మంత్రులతో అన్న కొలువుకు బయలుదేరిన కుంభకర్ణునితో మళ్లీ విభీషణుడు కూడా మంత్రులతో కూడి వచ్చాడు. తమ్ముళ్లిద్దరూ వచ్చి నమస్కరించగానే రావణుడు దీవించి క్షేమసమాచారాలు అడిగి తగిన ఆసనాల మీద కూర్చోమన్నాడు. కుంభకర్ణుడు రావణునికి దగ్గరగా కూర్చున్నాడు. కొంచెం దూరంలో కూర్చున్న విభీషణుడు అన్నగారితో తిరిగి ఇలా అన్నాడు.

**సీ. దశరథరాముండు తనపత్నిఁ గోల్పోయి**
**వానరావళిఁ గూడివచ్చి యిప్పు**
**దదె చూడు మంభోధి యావలి యొడ్డునఁ**
**గపిబలంబులతోడఁ గలసి యుండె**
**రాముని సత్త్వంబు రమణిచే మున్వింటి**
**మాతని తమ్ముండు నట్టిఁడంట**
**సొరిది వారికిఁ బ్రాపు సుగ్రీవుఁ డున్నాడు**
**వార్ధి నిన్ ముంచినవాని తమ్ముఁ**

**తే. డాతఁడిట వచ్చి నిన్ను నుగ్గాడి కాని**
**సీతఁ దే నని పంతంబు చేసె నంట**
**వలదు వైరమ్ము సీత నీవలయు వేగ**
**నతని నని గెల్వఁగా జాల రమరవరులు.** **16**

**ప్రతి :** దశరథరాముండు=దశరథుని పుత్రుడయిన శ్రీరాముడు, తన పత్నిన్=తన భార్యను, కోల్పోయి=పోగొట్టుకుని, వానరావళిన్=వానరమూకతో, కూడివచ్చి=కలసివచ్చి, ఇప్పుడు, అదె చూడుము=అదిగో చూడు, అంబోధి=సముద్రము, ఆవలి=అటుపక్క, ఒడ్డునన్=తీరంలో, కపిబలంబుల తోడన్=వానర బలగంతో, కలసి, ఉండె, రాముని సత్త్వంబు=శ్రీరాముని బలపరాక్రమాలు, రమణిచే=సీత చెప్పగా, మును=ఇంతకుముందు, వింటిమి=విన్నాము, ఆతని, తమ్ముండున్=తమ్ముడు కూడా, అట్టిఁడు=అంతటివాడు, అంట=అట, సొరిది=క్రమంగా, వారికి, ప్రాపు=తోడుగా, సుగ్రీవుడు, ఉన్నాడు, వార్ధిన్=సముద్రంలో, నిన్ముంచిన=నిన్ను ముంచిన, వాని తమ్ముఁడు=వాని తమ్ముడు, ఆతండు, ఇట, వచ్చి, నిన్ను, నుగ్గాడి కాని=చంపి కాని, సీతన్=సీతను, తేను, అని, పంతంబు=ప్రతిజ్ఞ, చేసెను, అంట, వలదు=వద్దు, వైరము=శత్రుత్వము, సీతను, ఈవలయు=ఇవ్వవలెను, వేగన్=వేగముగ, అతనిన్=సుగ్రీవుని, అనిన్=యుద్ధంలో, అమరవరులు=దేవతాశ్రేష్ఠులు, గెల్వఁగాన్=గెలవ, చాలరు=లేరు.

**తా :** అదిగో! చూడు దశరథరాముడు భార్యను పోగొట్టుకుని వానరమూకతో వచ్చి సముద్రానికి అవతలి ఒడ్డున వానరసైన్యంతో కలసి ఉన్నాడు. ఇంతకుముందే సీత చెప్పగా శ్రీరాముని బలపరాక్రమాల గురించి విన్నాము. అతని తమ్ముడు కూడా అంతటివాడేనట. మరి వరుసగా చూస్తూ ఉంటే సుగ్రీవుడు వాళ్లకు బాసటగా ఉన్నాడు. ఆ సుగ్రీవుడు ఎవరనుకుంటున్నావు? నిన్ను సముద్రంలో ముంచిన వాలి తమ్ముడు. అతడు నిన్ను చంపి సీతను తెస్తానని ప్రతిజ్ఞ చేసాడట. వారితో శత్రుత్వం వద్దు. దేవతలు కూడా అతన్ని గెలవలేరు. కాబట్టి వేగంగా సీతాదేవిని ఇచ్చివేయాలి.

**విశే :** వాలి–వార్ధి–రావణుడు. వాలి రోజూ ఉదయమే నాలుగు సముద్రాలలో మునిగి సంధ్యావందనం చేసుకునేవాడు. ఒకనాడు వాలి ఆ పనిమీద వెళుతూ ఉండగా రావణుడు ఎదుర్కొన్నాడు. వాలి మాట్లాడకుండా రావణుణ్ణి చంకలో ఇరికించుకుని తనతోపాటుగా నాలుగు సముద్రాల్లో ముంచాడు. తన సంధ్యావందన కార్యక్రమం పూర్తి అయ్యాక చంకను వదలు చేసి రావణుణ్ణి నేలమీద పడేసాడు. రావణుడు బతుకు జీవుడా అంటూ పారిపోయాడు.

**తే.** **రాముఁ గెలువంగ వచ్చునే రాజసమున**
**సీత నర్పించి తత్పదాబ్జాతములకు**
**నర్థిఁ బ్రణమిల్లి శరణన్న నతఁడె కాచు**
**సత్యసంధుండు సత్కృపాసాంద్రుఁ డతఁడు.** **17**

**ప్రతి :** రామున్=రాముని, గెలువంగ=జయింపగ, వచ్చునా=సాధ్యమా, రాజసమున=గర్వాతిశయముతో, సీతను, అర్పించి=భక్తితో ఇచ్చి, తత్పదాబ్జాతములకు–తత్=అతని, పద=పాద, అబ్జాతములకు=పద్మములకు, ఆ రాముని పాదపద్మాలకు, అర్థిన్=ప్రార్థనాపూర్వకముగ, ప్రణమిల్లి=నమస్కరించి, శరణు+అన్న=శరణన్న=శరణు కోరితే, అతఁడె=ఆతడే, కాచు=రక్షించును, అతఁడు=రాముడు, సత్యసంధుండు=నిజమైన ప్రతిజ్ఞ గలవాడు, సత్కృపాసాంద్రుఁడు=అధికమైన దయతో ఆదరించువాడు.

**తా :** నీ గర్వాతిశయంతో రాముణ్ణి గెలవడం సాధ్యం కాదు. సీతను భక్తితో ఇచ్చి, రాముని పాదపద్మాలకు ప్రార్థనాపూర్వకంగా నమస్కరించి శరణు అంటే చాలు అతడే రక్షిస్తాడు. అతడు ఈ విషయంలో నిజమైన ప్రతిజ్ఞగలవాడు. మిక్కిలి దయాశాలి.

**విశే :** 'శరణు' అంటే చాలు ఎవరినయినా రక్షిస్తాను అన్న ప్రతిజ్ఞ గలవాడు రాముడు. విభీషణుడు శరణు అంటూ వస్తే పగవాని తమ్ముడే అని కూడా ఆలోచించకుండా శరణు ఇచ్చాడు.

**ఆ.** **చంప వచ్చినట్టి శత్రువు నైనను**
**శరణు జొచ్చినంత సదయుఁ డగుచు**
**నభయ మిచ్చి కాచు టాతని బిరుదంట**
**సీత నిచ్చి రాముఁ జేరి బ్రతుకు.** **18**

**ప్రతి :** చంపవచ్చినట్టి=చంపడానికి వచ్చిన, శత్రువునైనను=శత్రువునైనా, శరణు జొచ్చినంత=శరణుకోరితే, సదయుఁడగుచు=దయతో కూడినవాడై, అభయమిచ్చి=నీకు భయంలేదు అని, కాచుట=రక్షించుట, అతని, బిరుదు=సామర్థ్యానికి గుర్తుగా ఇచ్చేది, అట, సీతను, ఇచ్చి, రామున్=రాముని, చేరి=ఆశ్రయించి, బ్రతుకు= జీవించుము.

**తా :** తనను చంపడానికి సిద్ధపడి వచ్చిన శత్రువునైనా సరే, శరణు అని గనుక ఆతడు కోరినట్లయిత ఎంతో దయతో అభయమిచ్చి రక్షించడమే అతని బిరుదు. సీతనిచ్చి రాముణ్ణి ఆశ్రయించి జీవించు.

**వ. అనిన రావణుండు కటకటంబడి విభీషణునితో రోషభీషణంబుగా నిట్లనియె. 19**

**ప్రతి :** కటకటంబడి = బాధపడి, రోషభీషణంబుగా = భయంకరమైన కోపంతో, ఇట్లనియె=ఈవిధంగా అన్నాడు.

**తా :** అనగా విని ఆ రావణుండు బాధపడి విభీషణునితో భయంకరమైన కోపంతో ఇలా అన్నాడు.

## రావణుఁడు విభీషణుని దూషించుట

**తే. నీవు నా దాయతోఁ గూడి నీచబుద్ధి!**
**బుద్ధి సెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు**
**కడగి నీమంత్రులును నీవుఁ గంటిలోని**
**నెరసు సరవిగ నున్నారు నిశ్చయముగ. 20**

**ప్రతి :** నీవు, నా, దాయతోన్=శత్రువుతో, కూడి=కలసి, నీచబుద్ధి!=నీచమైన బుద్ధి కలవాడా, బుద్ధిసెప్పెదు=బుద్ధి చెప్తున్నావు, నాకున్, తమ్ముఁడవె?=తమ్ముడవా, నీవు, కడగి=పూనుకుని, నీ మంత్రులును, నీవున్, కంటిలోని నెరసు=కంట్లోపడిన నలుసు, సరవిగన్=వలె, ఉన్నారు, నిశ్చయముగ=సంశయము లేకుండా.

**తా :** ఓ నీచబుద్ధీ! నువ్వు నా శత్రువుతో కలిసి నాకు బుద్ధి చెప్తున్నావు. నువ్వు నాకు తమ్ముఁడవేనా? చూడబోతే నువ్వు నీ మంత్రులు పూనుకుని నాకు కంట్లో నలుసులా ఉన్నారన్నది నిశ్చయం. ఇందులో అనుమానం లేదు అని నేను అనుకుంటున్నాను.

**విశే :** కంటిలోని నెరసు - జాతీయము. కంటిలో పడిన నలుసు చాలా చిన్నదిగా ఉంటుంది కనబడదు. కానీ విపరీతమైన బాధపెడుతుంది. కష్టపడి తీసి చూస్తే చాలా చిన్నదిగా ఉంటుంది. బాధపెట్టడంలో మాత్రం విశేషమయింది.

**తే. నాకుఁ దమ్ముఁడ వయ్యు ననార్యముగను**
**నాదు శత్రులఁ బొగడుచు నాకు బుద్ధి**
**సెప్పవచ్చితి వౌరౌర! సిగ్గులేక**
**యిచ్చ వర్తింపుచుండు టిదేమి పనిర? 21**

**ప్రతి :** నాకున్, తమ్ముడవయ్యున్=తమ్ముడవై యుండి, అనార్యముగ=గౌరవింపదగనిదిగ, నాదు=నాయొక్క, శత్రులన్=శత్రువులను, పొగుడుతూ, నాకు, బుద్ధిసెప్పవచ్చితివి=బుద్ధి చెప్పడానికి వచ్చావు, ఔర+ఔర= ఔరౌర=ఆశ్చర్యకరంగా, సిగ్గులేక, ఇచ్చ వర్తింపుచుండుట=నీ ఇష్టానుసారం ప్రవర్తించడం, ఇదేమి, పనిర!

**తా :** నువ్వు నాకు తమ్ముడవై యుండి నా శత్రువులను పొగడడం గౌరవప్రదమైన పనేనా, పైగా నాకు బుద్ధి చెప్పడానికి వచ్చావు. ఔరౌర! ఎంత ఆశ్చర్యకరంగా ఉంది నీ వ్యవహారం! నీ ఇష్టానుసారం ప్రవర్తిస్తున్నావు ఇదేమి పనిర!

**వ. అనిన విభీషణుం డన్న కిట్లనియె. 22**

**తా :** అట్లు పలుకగా విభీషణుడు అన్నతో ఇలా అన్నాడు –

**తే. నిన్నుఁ జంపఁగఁ దలపోసి నీదుమంత్రి**
**వరులు గాచుచు నున్నారు వలదు గోత్ర**
**కలహ మీ చెడుబుద్ధి యే కరణి నబ్బె**
**నన్న? యింకొక్క కొనమాట యాలకించు. 23**

**ప్రతి :** నిన్నున్=నిన్ను, చంపఁగన్=చంపాలి అని, తలపోసి=ఆలోచించి, నీదు, మంత్రివరులు=శ్రేష్ఠులయిన మంత్రులు, కాచుచున్=ఎదురుచూస్తూ, ఉన్నారు, వలదు, గోత్రకలహము=ఒకే వంశము వారిమధ్య యుద్ధము, ఈ చెడుబుద్ధి=ఈ చెడు ఆలోచన, ఏకరణి=ఏవిధముగా, అబ్బెను=అలవడింది, అన్నా?, ఇంకొక్క, కొనమాట=చివరిమాట, ఆలకించు=వినవలసింది.

**తా :** అన్నా! నీ మంత్రివరులు నిన్ను చంపాలి అనే ఆలోచనతో ఎదురుచూస్తున్నారు. మన అన్నదమ్ముల మధ్య యుద్ధం వద్దు. ఈ చెడు ఆలోచన సీతను తీసుకురావాలి అనే ఆలోచన, ఏ విధంగా వచ్చింది నీకు. అన్నా చివరిగా ఇంకొక్క మాట చెప్తాను వినండి.

**వ. రామచంద్రుం డాదినారాయణుండు సీత యాదిలక్ష్మి వానరబలంబు బృందారక సందోహంబు గావున నీ వా రామచంద్రున కెదిరి జయంబు గొనుట కడింది కార్యంబు నేఁ జెప్పిన బుద్ధి విని వేగ నా రాముని శరణు చొఱుము. సుఖంబుగ మనుము. అని విన్న వించిన హితవచనంబులు రోగికిఁ బథ్యాహారంబు రుచింపని పోలికను వీనుల కసహ్యంబు లైయుండ రావణుండు మండిపడి యిట్లనియె. 24**

**ప్రతి :** రామచంద్రుండు, ఆదినారాయణుండు=ఆదిమహావిష్ణువు, సీత, ఆదిలక్ష్మి=ఆది శ్రీమహాలక్ష్మి, వానరబలంబు=వానరుల సైన్యము, బృందారకసందోహంబు=దేవతాసమూహము, కావునన్, నీవు, ఆ రామచంద్రునకున్, ఎదిరి=ఎదుర్కొని, జయంబుగొనుట=జయము పొందుట, కడిందికార్యంబు=అసాధ్యమగు పని, నేన్ చెప్పిన బుద్ధిన్=నేను చెప్పిన తెలివిని, విని, వేగన్=వేగముగా, ఆ రాముని, శరణు=రక్షణము, చొఱుము=పొందుము, సుఖంబుగన్, మనుము=జీవించుము, అని, విన్నవించినన్=మనవి చేసికొనగా,

హితవచనంబులు=శ్రేయము కూర్చు మాటలు, రోగికిన్=రోగగ్రస్తునకు, పథ్యాహారంబు=పథ్యమగు ఆహారము, రుచింపని పోలికను=ఇష్టము కాని విధముగా, వీనులకున్=చెవులకు, అసహ్యంబులై యుండన్=సహింప శక్యములు కానివై యుండగా, రావణుండు, మండిపడి=రగిలిపోయి, ఇట్లు, అనియెన్.

**తా :** రామచంద్రుడు ఎవరోకాదు ఆదినారాయణుడు. సీత సాక్షాత్తు ఆదిలక్ష్మి. వానరులంతా దేవతల సమూహం కాబట్టి నువ్వు రామచంద్రుణ్ణి ఎదిరించి జయం పొందుతాను అనుకోవడం అసాధ్యమైన పని. నే చెప్పిన మాటవిని, తొందరగా ఆ రాముణ్ణి శరణువేడుకో! సుఖంగా జీవించు అని మనవి చేసిన మంచికోరి చెప్పిన ఆ మాటలు రోగికి పథ్యాహారము రుచింపనట్లు, రావణుని చెవులకు భరించరానివిగా ఉండగా రావణుడు మండిపడి ఇలా అన్నాడు.

**విశే :** పథ్యాహారము=జబ్బు తగ్గడానికి కావలసిన విధంగా తయారు చేసిన ఆహారము. అంతగా రుచిగా ఉండదు.

**సీ. పటువిషం బొలికించు పాములతో నైన**
**జెలఁగి యింపుగఁ జెల్మి సేయవచ్చుఁ**
**గాని శత్రుల నెప్డు గైవారములు సేయు**
**వానినిఁ దన ప్రాణబంధునైనఁ**
**జేరఁ దీసినయేనిఁ జేటు వాటిల్లును**
**గావున వీని బల్గర్వ మణతు**
**విను కుంభకర్ణ! నీవును రాకమునుపు నీ**
**చెడుగు నాకును బుద్ధి చెప్పఁ బూనె**

**ఆ. ననుచు హుంకరించి యవ్విభీషణుఁ బట్టి**
**వేగఁ గత్తిఁ బూని వ్రేయఁ బోవ**
**నట ప్రహస్తుఁ డప్పు డడ్డమ్ముగా వచ్చి**
**దేవ! నీకుఁ దగునె యీవిధంబు. 25**

**ప్రతి :** పటు విషంబు=తీవ్రమైన విషము, ఒలికించు=కక్కు, పాములతోన్ అయిన, చెలఁగి=సంతోషంతో, ఇంపుగ=అందంగా, చెల్మి=స్నేహము, చేయవచ్చున్, కాని, శత్రువులన్=శత్రువులను, ఎప్డున్=ఎల్లప్పుడూ, కైవారములు సేయు=పొగడుతూ ఉండే, వానినిన్=వానిని, తన=తనయొక్క, ప్రాణబంధునైనన్=తన ప్రాణబంధు వయినప్పటికి, చేరన్=దగ్గరకు, తీసినయేనిన్=తీసినట్లయితే, చేటు=అపకారం, వాటిల్లును=సంభవిస్తుంది, కావున, వీని, బల్గర్వము=బలగర్వాన్ని, అణతు=అణచివేస్తాను, కుంభకర్ణ! విను, నీవును, రాకమునుపున్= రాకముందు కూడా, ఈ, చెడుగు=బుద్ధిహీనుడు, నాకును, బుద్ధి, చెప్పన్=చెప్పడానికి, పూనెన్=పూనుకొన్నాడు, అనుచు, హుంకరించి=హుమ్ అని అరచి, ఆ+విభీషణున్, పట్టి=పట్టుకొని, వేగన్= వేగంగా, కత్తిన్,

పూని=పట్టుకొని, వ్రేయన్ పోవన్=చంపబోగా, అట=అక్కడ, అప్పుడు, ప్రహస్తుండు, అడ్డమ్ముగా వచ్చి, దేవ!, ఈ విధంబు=ఈ పద్ధతి, నీకున్ తగునె=నీకు సరియైనదా? కాదు.

**తా :** మహావిషాన్ని కక్కే పాములతో అయినా ఆనందంగా స్నేహం చేయవచ్చు గానీ నిరంతరం శత్రువులనే స్తుతిస్తూ ఉండే వాణ్ణి తనకు ప్రాణ బంధువయినా గాని చేరదీస్తే చేటు సంభవిస్తుంది. కాబట్టి నీ బలము గర్వము అణిచివేస్తాను. ఓ కుంభకర్ణ! నువ్వు రాక ముందు కూడా ఈ విభీషణుడు నాకు బుద్ధి చెప్పడం మొదలుపెట్టాడు అంటూ హుం అంటూ ఆ విభీషణుని పట్టి వేగంగా కత్తి పట్టుకొని చంపబోయాడు. అప్పుడు ప్రహస్తుడనే మంత్రి అడ్డంగా వచ్చి దేవా! ఈ విధంగా తమ్ముణ్ణి చంపబోవడం నీకు తగిన పనేనా? కాదు సుమా! అన్నాడు.

**క.** **నీ కేల యింత కోపము**
**నీకు హితముఁ జెప్పుచున్న నీ తమ్ముని నీ**
**వే కత్తివ్రేసి చంపిన**
**లోకులు నిను మెత్తురయ్య లోకస్తుత్యా!.** **26**

**ప్రతి :** నీకు, ఏల, ఇంత కోపము, నీకు, హితమున్=మంచిని, చెప్పుచున్న, నీ తమ్ముని=నీ తమ్ముణ్ణి, నీవే=నువ్వే, కత్తివ్రేసిచంపిన=కత్తితో చంపితే, లోకులు=ప్రజలు, నిను, మెత్తురయ్య=మెచ్చుకుంటారయ్యా! లోకస్తుత్యా!=లోకుల చేతస్తుతింపబడేవాడా!

**తా :** ఓ లోకస్తుత్యా! రావణా! నీ కెందుకయ్యా ఇంత కోపం. నీకు మంచి చెప్తున్నాడు నీ తమ్ముడు. నీ తమ్ముణ్ణి నువ్వే కత్తితో చంపేస్తే లోకులు నిన్నేం మెచ్చుకుంటారయ్యా!

**తే.** **గుణయుతుండైన మన విభీషణుఁడు లేని**
**లంక యేటికి సైన్యంబు లింక నేల**
**వైభవం బేల యామీఁదఁ బ్రాణ మేల**
**శాంత మవధారు దేవ! నీ స్వాంతమందు.** **27**

**ప్రతి :** గుణయుతుండైన=గుణశాలి అయిన, మనవిభీషణుఁడు, లేని=లేనటువంటి, లంక యేటికి=లంక ఎందుకు, సైన్యంబులు, ఇంకనేల=ఇకనెందుకు, వైభవం ఏల=భాగ్యాలన్నీ ఎందుకు, ఆమీద=ఆతరువాత, ప్రాణము+ఏల=ప్రాణం మాత్రం ఎందుకు, దేవ, నీ స్వాంతము+అందు=నీ మనస్సులో, శాంతము అవధారు= శాంతం వహించు.

**తా :** గుణశాలియైన విభీషణుడే లేకపోయిన తరువాత లంక ఎందుకు, సైన్యాలెందుకు, వైభవాలెందుకు, అన్నిటికి మించి జీవించి ఉండడం దేనికి, నేను చెప్పినది విను. నీ మనస్సులో శాంతించు.

**విశే :** విభీషణుని ప్రాధాన్యం లంకలో ఎంత గొప్పగా ఉందో ఈ ప్రహస్తుని మాటల్లో తెలియవస్తోంది.

**వ. అని ప్రహస్తుండు రావణుకోపంబును గొంత శాంతపఱిచె నప్పు డన్న కోపంబునకుఁ దమ్ముఁడు కుంభకర్ణుండు వడవడ వడఁకి యన్న కెదురాడ నోపక తమ్మునిఁ గాదనలేక గద్దియమీఁదఁ గూర్చుండియున్న యన్నకు మ్రొక్కి నిదుర గృహంబునకుం జనియె నట రావణుండు విభీషణుం జూచి యోరీ నీవు విశ్వాస ఘాతకుండవు స్వామి ద్రోహివి గావున నీవు నా కొక్క పేదనరునిఁ బెద్దజేసి చెప్పెద వాతఁడ పౌరుష శాలియేని నీవాతనింజేరి సుఖంబున బ్రతుకు మనిన నతం డిట్లనియె. 28**

**ప్రతి :** అని, ప్రహస్తుండు, రావణుకోపంబును=రావణుని కోపమును, కొంత శాంతపఱిచెన్=కొలదిగా శాంతింపజేసెను, అప్పుడు, అన్న కోపంబునకున్, తమ్ముఁడు, కుంభకర్ణుండు వడవడ వడఁకి=వడవడ వణకిపోయి, అన్నకున్, ఎదురాడన్ ఓపక=ఎదురు మాట్లాడలేక, తమ్మునిన్=తమ్ముడగు విభీషణుని, కాదనలేక=కాదని చెప్పలేక, గద్దియమీఁదఁగూర్చుండియున్న యన్నకున్=సింహాసనము మీద కూర్చున్న అన్నకు, మ్రొక్కి=నమస్కరించి, నిదురగృహంబునకున్=నిద్రించే గృహానికి, చనియెన్, అటన్, రావణుండు, విభీషణున్, చూచి, ఓరీ! నీవు, విశ్వాసఘాతకుండవు=విశ్వాసమును నశింపజేయువాడవు, స్వామిద్రోహివి= యజమానికి ద్రోహము చేయువాడవు, కావునన్=అందువలననే, నీవు, నాకున్, ఒక్క పేద నరునిన్=ఒక బక్కనరుని గూర్చి, పెద్దజేసి=గొప్పగా జేసి, చెప్పెదవు=చెప్పుచున్నావు, ఆతఁడ=ఆతడే, పౌరుషశాలియేని= అంత పౌరుషవంతుడే అయినచో, నీవు, ఆతనిన్ చేరి=అతనిని సమీపించి, సుఖంబునన్, బ్రతుకుము= జీవింపుము, అనినన్=అని పల్కగా, అతండు, ఇట్లు, అనియెన్.

**తా :** ప్రహస్తుడు అలా చెప్పి రావణుని కోపాన్ని కొంత శాంతపరిచాడు. అన్నగారి కోపం చూసి తమ్ముడైన కుంభకర్ణుడు గడగడా వణికి అన్నకు ఏమీ చెప్పలేక తమ్ముణ్ణి కాదు అనలేక గద్దెమీద కూర్చున్న అన్న రావణునికి మొక్కి తన పడకగదికి వెళ్లి పోయాడు. రావణుడు విభీషణుని చూచి నువ్వు విశ్వాసం లేని వాడవు, ప్రభువుకు ద్రోహం తలపెట్టినవాడివి – అందుకే ఒక పేదనరుణ్ణి పొగడుతూ గొప్పవాడని చెప్తున్నావు. నీ దృష్టిలో అతడే పౌరుషవంతుడయితే నువ్వు వెళ్లి అతనితో కలిసి సుఖంగా బ్రతుకు అన్నాడు. అన్న ఇలా అనగా తమ్ముడు విభీషణుడు ఈ విధంగా అన్నాడు.

**సీ. విను రాక్షసేశ్వర! విష్ణుసన్నిభుఁడు రా**
**ముండు హా! పేదనరుండె నీకు**
**నతని సత్యస్థితి యతనిపరాక్రమం**
**బిపుడునీ కెఱుంగంగ నెట్టు లగును**
**అవనీశు బాణంబు లతిరయంబున వచ్చి**
**దండించు నపుడైనఁ దలచు నన్నుఁ**
**బర్వత శిఖరముల్ పడినట్టు నీతల**
**లిలఁ గూలు నపుడైనఁ దలఁచు నన్నుఁ**

**తే. నీకు దమ్ముండ నౌటనే నీవు బ్రతుకు**
**కొఱకుఁ జెప్పిన నీ కింతకోప మేల**
**వినుము నామాట సీత నర్పించి యతని**
**శరణువేడుము వలదు నీ సాహసమ్ము. 29**

**ప్రతి :** విను, రాక్షసేశ్వర=రాక్షసరాజ, విష్ణుసన్నిభుడు రాముండు=రాముడు విష్ణువుతో సమానమైనవాడు హా! (ఆశ్చర్యార్థకము) నీకు, పేదనరుండె=పేదనరుడులా అని పిస్తున్నాడా?, అతని సత్యస్థితి=ఆతని నిజమైన వ్యక్తిత్వము, అతని, పరాక్రమంబు, ఇపుడు, నీకు, ఎఱుంగంగ=తెలుసుకోవడం, ఎట్టులు=ఏ విధంగా, అగును=అవుతుంది, అవనీశు=భూనాయకుడయిన రాముని, బాణంబులు, అతిరయంబున=చాలా వేగంగా వచ్చి, దండించునపుడైనన్=దండించే సమయంలోనైనా, నన్ను, తలచు=తలచుకో, పర్వతశిఖరముల్= కొండ కొమ్ములు, పడినట్టు=పడిన విధంగా, నీ తలలు=నీతలకాయలు, ఇలన్=భూమిమీద, కూలునపుడైనన్= కూలిపోతున్నప్పుడైనా, తలఁచునన్ను=నన్ను తలచుకో, నీకున్ తమ్ముండను ఔటనే=నీకు తమ్ముడను అవడం చేతనే, నీవు బ్రతుకు కొఱకున్=నీవు బ్రతకటంకోసం, చెప్పిన=చెప్పగా, నీకు, ఇంత, కోపము, ఏల=నీకింత కోపమెందుకు. వినుము, నా మాట, సీతను, అర్పించి=ఇచ్చి, అతని=రాముని, శరణువేడుము, నీ సాహసమ్ము= నీ ఈ సాహసం, వలదు=వద్దు.

**తా :** ఓ రాక్షసేశ్వరా! విను నువ్వు ఎవరినయితే పేదనరుడు అనుకుంటున్నావో అతడు సాక్షాత్తు విష్ణువుతో సమానుడు. ఆతని సత్యస్థితి అతని పరాక్రమం నీకు ఎలా తెలుస్తుందో ఇపుడు. ఆ రాజు బాణాలు అతివేగంగా వచ్చి నిన్ను దండిచినప్పుడైనా నన్ను తలుచుకో, పర్వత శిఖరాలు కూలినట్లుగా నీ తలలు నేలమీద పడిపోతున్నప్పుడయినా నన్ను తలుచుకో. నీకు తమ్ముణ్ణి కాబట్టి–ఒకే రక్తం పంచుకు పుట్టిన వాణ్ణి కాబట్టే నువ్వు క్షేమంగా జీవించి ఉండాలని ఈ హితవు చెప్పాను. దానికి ఇంతగా కోపగిస్తావెందుకు. నా మాట విను. సీతను గౌరవంగా రామునికి ఇచ్చి, అతణ్ణి శరణు వేడుకో, ఇలా సాహసం చేయకు.

**వ. అని చెప్పిన హితవచనంబులకు మఱింత కోపోద్దీపిత మానసుండై యాజ్యాహుతిం బ్రజ్వరిల్లిన హుతాశను గతి నృండిపడి పెళపెళనార్చి గద్దియమీఁదం గూర్చున్న విభీషణుని వక్షంబు పగులం దన్నిన నతండు తనకన్నుల నుండి తొరఁగు జలకణంబులు హస్తంబులం దుడిచికొనుచు నాక్షణంబున మంత్రులుం దానును దనతల్లియైన కైకసి యొద్దకుం జని సాష్టాంగ దండప్రణామం బాచరించి యన్న చేసిన దుర్ణయం బెఱింగించి శరణాగతవత్సలుండైన శ్రీరామచంద్రుని సన్నిధానంబునకుఁ బోవుచున్నాఁడ నని చెప్పి యాయమ్మ యనుమతంబు వడసి దీవనలు గైకొని చని సముద్రతీరంబున విచారగ్రస్తుండై యున్న శ్రీరామచంద్రునింగని విభీషణుండు. 30**

**ప్రతి :** అని, చెప్పినన్=చెప్పగా, హితవచనంబులకున్=హితము గూర్చు మాటలకు, మఱింత=ఇంకనూ, కోపోద్దీపిత మానసుండై=కోపముచే ఉద్రేకమునొందిన మనస్సు కలవాడై, ఆజ్యాహుతిన్=నేయి పోయుటచే,

ప్రజ్వరిల్లిన హుతాశనుగతిన్=ఎగిసిపడిన అగ్నివలె, మండిపడి=రగిలిపోయి, పెళపెళన్ ఆర్చి=పెళ పెళ ధ్వనులు చేసి, గద్దియమీఁదన్=సింహాసనముపై, కూర్చున్న విభీషణుని వక్షంబు పగులన్=కూర్చుండిన విభీషణుని గుండెప్రదేశము పగులునట్లుగా, తన్నినన్=తన్నగా, అతండు, తన కన్నులనుండి, తొరఁగు జలకణంబులు=వెలువడు కన్నీటిబొట్టులు, హస్తంబులన్=చేతులతో, తుడిచికొనుచున్, ఆ క్షణంబునన్= ఆ క్షణముననే, మంత్రులున్, తానును, తన తల్లియైన కైకసియొద్దకున్, చని, సాష్టాంగ దండప్రణామంబు= సాష్టాంగ నమస్కారము, ఆచరించి=చేసి, అన్న చేసిన దుర్ణయంబు=తన అన్న చేసిన దురాగతమును, ఎఱింగించి=తెలిపి, శరణాగతవత్సలుండైన=రక్షణకై వచ్చిన వారిపట్ల ప్రేమ గలిగిన, శ్రీరామచంద్రుని, సన్నిధానంబునకున్=చేరువకు, పోవుచున్నాఁడను అని=వెళ్ళుచున్నానని, చెప్పి, ఆయమ్మయనుమతంబు=ఆ తల్లి అంగీకారమును, వడసి=పొంది, దీవనలు=ఆశీస్సులు, కైకొని=తీసికొని, చని, సముద్రతీరంబునన్, విచారగ్రస్తుండైయున్న=చింతాక్రాంతుడైయున్న/విచారములో చిక్కియున్న, శ్రీరామచంద్రునిన్, కని=చూచి, విభీషణుండు.

**తా :** అలా చెప్పిన మేలు మాటలకు రావణుడు మరింత కోపంతో కూడిన మనస్సుతో నెయ్యిపొయ్యడం వల్ల ప్రజ్వరిల్లిన అగ్నిహోత్రునిలా మండిపడి పెళపెళ కేకలు పెట్టాడు. గద్దియ మీద కూర్చుని ఉన్న విభీషణుని గుండెలు పగిలేలా ఒక్క తన్ను తన్నాడు. అప్పుడు ఆ విభీషణుడు తన కండ్ల వెంబడి కారే నీటి బిందువుల్ని చేతులతో తుడుచుకుంటూ వెంటనే మంత్రులతో కలిసి తమ తల్లి అయిన కైకసి వద్దకు వెళ్లాడు. వెళ్లి సాష్టాంగ ప్రణామం చేసి తనపట్ల అన్న రావణుడు ప్రవర్తించిన చెడును చెప్పుకున్నాడు. నేను శరణాగతవత్సలుండైన శ్రీరాముని సన్నిధానానికి వెళ్తున్నాను నాకు అనుజ్ఞ ఇవ్వమ్మా అంటూ అనుమతిని, ఆమె దీవెనలను కూడా తీసుకుని వెళ్లి సముద్రతీరంలో విచారంతో ఉన్న శ్రీరామచంద్రుని చూచి విభీషణుడు.

### విభీషణ శరణాగతి

**సీ.** **భానుకులోత్తంస! వందితామరలోక!**
**జానకీనాయక! శరణు! శరణు!**
**తాటకాప్రాణవిదారణ! రఘురామ!**
**సకలలోకాధార! శరణు! శరణు!**
**దిక్కు నీవని వచ్చితిని దీనమందార!**
**పరమపూరుష! రామ! శరణు! శరణు!**
**మాతృపిత్రాదులమాడ్కి సంరక్షించు**
**సర్వలోకస్తుత్య! శరణు! శరణు!**

**ఆ.** **రాను వెఱచినాఁడ రక్షించు రక్షించు**
**మిపుడు నాకు నభయ మిమ్ము ఇమ్ము**

**చూడు చూడు నిన్నుఁ జొచ్చితి శరణమ్ము**
**కావు కావు నన్నుఁ గరుణతోడ.** **31**

**ప్రతి :** భానుకులోత్తంస!=సూర్యవంశశ్రేష్ఠుడా! వందితామరలోక=దేవతల బృందంచేత నమస్కరింపబడినవాడా, జానకీనాయక!, శరణు! శరణు!, తాటకా ప్రాణ విదారణ=తాటక ప్రాణములను తీసిన వాడా!, రఘురామ, సకలలోకధార లోకములన్నింటికి ఆధారమైనవాడా!, శరణు! శరణు!, దిక్కు నీవని=నీవే నాకు దిక్కు అని, వచ్చితిని, దీనమందార!=దీనులపాలిటి మందారవృక్షము వంటివాడా–మందారం నందనవనంలోని వృక్షము. కల్పవృక్షంలా కోరిన కోర్కెలు తీర్చే శక్తి కలది, పరమపూరుష=పరమపురుషా!, రామ, శరణు! శరణు!, మాతృపిత్రాదులమాడ్కి=తల్లిదండ్రులవలె, సంరక్షించు=కాపాడుము, సర్వలోకస్తుత్య=సర్వలోకముల చేస్తుతింపబడేవాడా!, శరణు! శరణు!, రాను=రావడానికి, వెఱచినాఁడ=భయపడ్డాను, రక్షించురక్షించుము= కాపాడుకాపాడు, ఇపుడు, నాకున్, అభయము=నీకేమీ భయము లేదు నేను ఉన్నాను అనే ధైర్యాన్ని, ఇమ్ము, ఇమ్ము, చూడుచూడు=నా పరిస్థితిని నన్ను చూడు, నిన్నున్=నిన్నే, శరణమ్ము, చొచ్చితి, కావు కావు, నన్నున్, కరుణతోడ.

**తా :** సూర్యవంశంలో శ్రేష్ఠుడా, దేవతల చేత నమస్కరింపబడేవాడా! జానకీ నాయకా! శరణు! శరణు, తాటక సంహారా! రఘురామా! సకల లోకాలకు ఆధారయినవాడా! శరణు శరణు, ఓ దీనమందారా! నీవే దిక్కు అని వచ్చాను, పరమపురుష! రామ! శరణు శరణు. తల్లిదండ్రులవలె చేరదీసి కాపాడు, సర్వలోకాల చేత స్తుతింపబడేవాడా! శరణు శరణు. రావడానికి భయపడ్డాను రక్షించు – నాకు ఇప్పుడు అభయమివ్వు, నిన్ను శరణుజొచ్చాను నన్ను చూడు కరుణతో నన్ను కాపాడు! కాపాడు.

**విశే :** ఈ పద్యంలో విభీషణ శరణాగతి, ఆర్తి, భక్తితో కలిసి ప్రవహించాయి. శరణు! శరణు అంటూ ప్రతిపాదాంతంలో ఆమ్రేడితం చేయడంతోపాటు ఎత్తు గీతి ఆటవెలదిలో కూడా క్రియా పదాలన్ని ఆమ్రేడితం చేయడం–భక్తునిలోని ఆర్తిని మరింత స్పష్టంగా వ్యక్తీకరించింది మొల్ల. రక్షించు రక్షించు, అభయమిమ్ము ఇమ్ము అని పాదాంతంలోను, చూడు చూడు, కావు కావు అని పాదాదిని ప్రయోగించి చక్కని శిల్పాన్ని ఆవిష్కరించింది కవయిత్రి.

వ. **అని యివ్విధంబున రామచంద్రుని స్తుతిసేయుచుఁ జేరవచ్చు తతిని సుగ్రీవుండు శ్రీరామచంద్రునిఁ గని విశ్వాసంబు సూపువాఁడై దేవా వీఁడు రావణుని తమ్ముండు విభీషణుం డనువాఁడు రాక్షసులు మాయలు సేయుదురు గాన వీని వధియింప నాజ్ఞయొసంగు మనిన రామచంద్రుం డందులకు సమ్మతింపక యితండెవ్వండైన నేమి శరణన్న రావణుని తమ్మునినేకాదు రావణునైనను గాచెద శరణని వచ్చిన వాని ప్రాణంబులు గాపాడుట రాజులకుఁ బరమధర్మంబు, తొల్లి శిబి చక్రవర్తి రాజ్యంబు సేయుచుండ నొక్క ఖగం బేతెంచి శరణు చొచ్చిన నభయం బిచ్చి తన దేహముం గోసి దానిం దఱుముకొని వచ్చిన డేగ కిచ్చెనఁట కావున నాతని నాయొద్దకుఁగొని రమ్మనవుడు సుగ్రీవుండు విభీషణునిఁ దొడ్కొని తెచ్చి**

**శ్రీరామచంద్రుని పాదారవిందములపైఁ బడవైచిన నతండు విభీషణునెత్తి యాలింగనంబుచేసి యభయప్రదానం బొసఁగి నేఁడు మొదలు నీవు మాకు హితుండువు బంధుండవు నయితివి గావున నిన్ను మా తమ్ములలో నొకనిఁగాఁ జూచు కొనియెద నని నమ్మఁబలికి విభీషణా! యింక వైరిప్రభావంబు చెప్పుమనిన దశరథ నందనుకుం వందనం బాచరించి కరంబులు శిరంబునధరించి యతం డిట్లనియె 32**

**ప్రతి :** అని, ఇవ్విధంబునన్=ఈ ప్రకారంగా, రామచంద్రుని, స్తుతి చేయుచున్=ప్రశంస చేయుచు, చేరవచ్చు తఱిని=దగ్గరకు వచ్చు సమయమున, సుగ్రీవుండు, శ్రీరామచంద్రునిన్, కని=చూచి, విశ్వాసంబు= నమ్మకమును, చూపువాఁడై=చూపించెడివాఁడై, దేవా! వీఁడు, రావణుని, తమ్ముండు, విభీషణుండు, అనువాఁడు= అను పేరు గలవాడు, మాయలు చేయుదురు=మాయలు చేస్తారు, కానన్=అందువలన, వీనిన్, వధియింపన్= చంపుటకు, ఆజ్ఞ=ఆనతిని, ఒసంగుము=ఇమ్ము, అనినన్=అని పలుకగా, రామచంద్రుండు, అందులకున్= అట్లు చేయుటకు, సమ్మతింపక=అంగీకరింపక, ఇతండు ఎవ్వండు ఐనన్ఏమి?=ఇతడు ఎవడైతే ఏమిటి?, శరణు అన్నన్=శరణు (రక్షింపుము), అని పలికినచో, రావణుని తమ్మునినే కాదు, రావణుని ఐనన్, కాచెద=రక్షించెదను, శరణు అని=రక్షింపుమని, వచ్చినవాని ప్రాణంబులు=నన్ను చేరినవాని ప్రాణములు, కాపాడుట=రక్షించుట, రాజులకున్=పరిపాలకులకు, పరమధర్మంబు=ఉత్కృష్టమగు ధర్మము, తొల్లి=మునుపు, శిబిచక్రవర్తి, రాజ్యంబు చేయుచుండన్= రాజ్యపాలనము చేస్తూండగా, ఒక్క ఖగంబు=ఒక పక్షి, ఏతెంచి= వచ్చి, శరణు చొచ్చినన్=రక్షణను కోరగా, అభయంబు=భయము లేకుండటను/ రక్షణను ఇచ్చి, తన దేహమున్=తన శరీరమును, కోసి, దానిన్=ఆ పక్షిని, తఱుముకొని వచ్చిన డేగకున్= వెంటపడి వచ్చిన డేగకు, ఇచ్చెనఁట, కావునన్=అందువలన, ఆతనిన్, నా యొద్దకున్, కొనిరమ్ము=తీసికొని రమ్ము, అనవుడు=పిమ్మట, సుగ్రీవుండు, విభీషణునిన్, తోడ్కొని తెచ్చి=వెంటతీసికొని వచ్చి, శ్రీరామచంద్రుని, పాదారవిందములపైన్ పడవైచినన్=పాదపద్మములపై పడవేయగా, అతండు, విభీషణున్, ఎత్తి=పైకి లేవదీసి, ఆలింగనమంబు చేసి=కౌగిలించుకొని, అభయ ప్రదానంబు ఒసఁగి=అభయమునిచ్చి, నేడు మొదలు, నీవు, మాకున్, హితుండవు=శ్రేయమును కోరువాడవు, బంధుండవున్, అయితివి, కావునన్=అందువలన, నిన్ను, మాతమ్ములలోన్, ఒకనిఁగాన్, చూచుకొనియెదన్= చూచుకొంటాను, అని, నమ్మఁబలికి= విశ్వసించునట్లుగా/నమ్మునట్లుగా పలికి, విభీషణా! ఇంక, వైరిప్రభావంబు=శత్రువు యొక్క బలాన్ని, చెప్పుము, అనినన్=అని పలుకగా, దశరథనందనుకున్=దశరథ కుమారుడగు రామునకు, వందనంబు=నమస్కారము, ఆచరించి=చేసి, కరంబులు=చేతులు, శిరంబున ధరించి=శిరస్సుపై పెట్టుకొని, అతండు, ఇట్లు, అనియె.

**తా :** అని ఈ విధంగా శ్రీరాముని స్తుతిస్తూ చేరవస్తుండగా సుగ్రీవుడు రాముణ్ణి చూసి రాముని యెడల విశ్వాసం చూపదలచి-దేవా! ఈ వచ్చినవాడు రావణుని తమ్ముడు, వీడిపేరు విభీషణుడు. రాక్షసులు మాయలు చేస్తూ ఉంటారు. కాబట్టి ఇప్పుడు శరణంటూ వచ్చిన వీణ్ణి చంపడానికి అనుజ్ఞ ఇవ్వండి అన్నాడు. రామ చంద్రుడు ఆ మాట ఒప్పుకోక, ఇతడు ఎవడైనాకానీ శరణు అంటే రావణుని తమ్ముణ్ణేకాదు, రావణుని అయినా కాపాడతాను. శరణని వచ్చినవాని ప్రాణాలు కాపాడడం రాజులకు ముఖ్య ధర్మం.

పూర్వం శిబి అనే చక్రవర్తి రాజ్యం చేస్తూండగా ఒక పక్షికి అభయం ఇచ్చాడు. ఆ పక్షిని తరుముకుంటూ వచ్చిన డేగకు తన శరీరం కోసి దానికి కావలసినంత మాంసం ఇచ్చాడట. కాబట్టి నువ్వు ఆ విభీషణుని దగ్గఱకు వెళ్లి అతనిని తీసుకొనిరా అన్నాడు రాముడు. రాముని మాట మేరకు సుగ్రీవుడు విభీషణుని తీసుకొనివచ్చి శ్రీరామచంద్రుని పాదాలమీద పడవేసాడు. రాముడు విభీషణుని ఎత్తి కౌగలించుకుని అభయం ఇచ్చాడు. ఈనాటి నుండి నువ్వుమాకు హితడవు, బంధువుడవు అయ్యావు. కాబట్టి నిన్ను మా తమ్ముళ్ళలో ఒకనిగా చూసుకొంటాను అని విభీషణునికి నమ్మకం కలిగేలా మాట్లాడాడు రాముడు. ఆ తరువాత విభీషణా! ఇక నా శత్రువు ప్రభావాన్ని చెప్పు అని అడిగాడు. విభీషణుడు శ్రీరామునికి నమస్కరించి చేతులు శిరస్సు మీద పెట్టుకొని ఇలా అన్నాడు.

## విభీషణుఁడు రామునికి రావణుని బల సంపదను దెలుపుట

**క. రావణు బలసత్త్వ స్థితి**
**యా వీరుని శౌర్యమహిమ యభినుతి సేయన్**
**నా వశముగా దతం డల**
**దేవేంద్రుని వెట్టిఁ గొనును దినము నరేంద్రా. 33**

**ప్రతి :** రావణు, బల సత్త్వస్థితి=బలము శక్తిసామర్థ్యాలు, ఆ వీరుని, శౌర్యమహిమ=శూరత్వము, అభినుతి= స్తుతి, చేయన్, నా వశముగాదు=నా వల్లకాదు, అతండు, దినము=ప్రతిరోజు, అల=ఆ, దేవేంద్రుని=దేవేంద్రుని, వెట్టిన్=జీతములేని చాకిరీ, కొనును=చేయించుకొనును, నరేంద్రా!

**తా :** నరేంద్రా! రావణుని బల పరాక్రమాలు, అతని శౌర్యము యొక్క మహిమ స్తుతించడం నావల్లకాదు. ఆ రావణుడు ప్రతిరోజూ దేవేంద్రుని చేత వెట్టిచాకిరీ చేయించుకుంటాడు.

**క. ఒక్కొక్క గవని వాఁకిట**
**నొక్కొక యేనూరుకోటు లుందురు దైత్యుల్**
**పెక్కుర్ఁ గావలి యుంచును**
**దక్కక మఱి యెల్లకడలఁ దానును దిరుగున్. 34**

**ప్రతి :** ఒక్కొక్క గవని వాఁకిటన్=ఒకొక్క పురద్వారము దగ్గర, ఒక్కొక, ఏను నూరు కోటులు=అయిదువందల కోట్లు ఉందురు, దైత్యులు=రాక్షసులు, పెక్కుర=చాలా మందిని, కావలియుంచును, తక్కక=వదిలిపెట్టకుండా, మఱి, ఎల్లకడలన్=అన్ని ద్వారాల వద్ద, తానును=తాను కూడా, తిరుగున్=తిరుగుతూ ఉంటాడు.

**తా :** ఒకొక్క పురద్వారం దగ్గర అయిదు వందలకోట్లు రాక్షసులు కాపలా ఉంటారు. వాళ్లు కాపలా ఉన్నారుకదా అని వదిలి పెట్టకుండా రావణుడు స్వయంగా అన్ని ద్వారాలదగ్గర తిరుగుతూ పర్యవేక్షిస్తూ ఉంటాడు.

**వ. తన కుమారవర్గంబు లక్షయుం బదివేలు వారల కొక్కొక్కరికి లక్షమంది బంట్ల నేర్పఱచి యుంచిన వారు లంకవీథులలోఁగొందఱును నగరుచుట్టును గొందఱును మఱికొన్ని చోట్ల మఱికొందఱును గుంపుగూడి తిరుగుచుందురు. అయినను బ్రహ్మాదుల కైనను సాధింప వలనుపడని లంకా పట్టణము మీచేత సాధింపఁబడఁగలదు. కావున మీరు వేవేగ సముద్రునిం బ్రార్థించి సముద్ర బంధనంబు సేయవలయు ననిన నంత మహేంద్రపర్వతంబు డిగ్గి సముద్ర ప్రాంతంబున విడిసి జాంబవదంగదసుషేణ నీలమైందాదివనచరవీరులచేత నలు దిక్కులయందు గలపర్వతంబులను వృక్షంబులను బాషాణంబులను దెప్పించి కడలి కట్టం గడంగిన. 35**

**ప్రతి :** తన=తనయొక్క (రావణుని యొక్క), కుమారవర్గంబు=కొడుకుల సమూహము, లక్షాపదివేలు, వారలకు=ఆ కొడుకులకు, ఒక్కొక్కరికిన్, లక్షమంది, బంట్లన్=సైనికులను, ఏర్పఱిచి=ఏర్పాటుచేసి, ఉంచినన్=ఉంచగా, వారు, లంకవీథులలోన్, కొందఱును=కొంతమందియు, నగరుచుట్టును=పట్టణమునకు చుట్టూ, కొందఱును, మఱికొన్నిచోట్లన్=ఇంకా కొన్ని ప్రదేశములందు, మఱికొందఱును= ఇంకొంతమందియు, గుంపుగూడి=గుంపుగా కలిసి, తిరుగుచుందురు=తిరుగుతుంటారు, అయినను= అయినప్పటికి, బ్రహ్మాదులకైనను=బ్రహ్మ మొదలగువారిని కూడ, సాధింపవలనుపడని=సాధించుటకు శక్యముగాని, లంకాపట్టణము, మీచేత, సాధింపబడగలదు=సాధింపబుడుతుంది, కావునన్=అందువలన, మీరు, వేవేగన్=మిక్కిలి వేగముగా, సముద్రునిన్, ప్రార్థించి, అభ్యర్థించి, సముద్రబంధనంబు=సముద్రమునకు అడ్డుకట్ట, చేయవలయున్=చేయవలెను, అనినన్=అని పలుకగా, అంత=పిమ్మట, మహేంద్రపర్వతంబు= మహేంద్రపర్వతము, డిగ్గి=దిగి, సముద్రప్రాంతమునన్=సముద్రతీరమున, విడిసి=నివాసముండి, జాంబవత్–అంగద–సుషేణ–నీల–మైందాది–వనచరవీరులచేత, నలుదిక్కులయందు=నాలుగు దిక్కులయందును, కలపర్వతంబులను=ఉన్న పర్వతములను, వృక్షంబులను, పాషాణంబులను=రాళ్ళను, తెప్పించి=రప్పించి, కడలిన్=సముద్రమును, కట్టన్= కట్టుటకు, కడంగినన్=ప్రయత్నింపగా...

**తా :** రావణుడు తన కుమారులు లక్షా పదివేలమందికి ఒక్కొక్కరికి లక్షమంది బంట్లును ఏర్పరిచి ఉంచాడు. వారు లంకానగర వీధులలో కొందరు, నగరు చుట్టూను, కొందరు మరి కొన్నిచోట్ల, మఱి కొందరు గుంపు గూడి తిరుగుతూ ఉంటారు. బ్రహ్మాదులకైనా సాధింపసాధ్యము కాని లంకాపట్టణము మీచేత సాధింపబడగలదు. కాబట్టి మీరు త్వరగా సముద్రుని ప్రార్థించి సముద్రముమీద ఆనకట్ట కట్టాలి అన్నాడు. అనగానే రామాదులు మహేంద్ర పర్వతం దిగి సముద్రము ప్రాంతంలో బస చేసారు. జాంబవంతుడు, అంగదుడు, సుషేణుడు, నీలుడు, మైందుడు మొదలైన వానరవీరుల చేత నాలుగు దిక్కులలో గల, పర్వతాలను, వృక్షాలను, రాళ్లను తెప్పించి సముద్రం మీద వారధి కట్టడానికి పూనుకున్నాడు.

## పర్వతములు రువ్వి వారిధిపై వారధి తీరుప వానర వీరుల సముత్సాహము

**శా. కూపారుండును సంతసిల్లి జలజాక్షుం జూచి మిన్నంది స**
**ల్లాపం బుద్ధతిఁ బొంగఁ జూచి విరసోల్లాసంబునన్ రాఘవ**

**క్ష్మాపాలుండును గోపముం గదుర నీగర్వంబు నాచేత వ**
**మ్మైపో నిప్డు దటంచు లక్ష్మణుఁడు విల్లందియ్యఁ బెన్వీఁకతోన్. 36**

**ప్రతి :** కూపారుండును=సముద్రుడు కూడా, సంతసిల్లి=సంతోషించి, జలజాక్షున్=తామరపువ్వులవంటి కన్నుగల శ్రీరాముని, చూచి, మిన్నంది=ఆకాశం ముట్టుకొని, సల్లాపం=మాట్లాడాలి అని ఆనందించి, ఉద్ధతిన్=గర్వంతో, పొంగన్=పొంగగా, చూచి, విరసోల్లాసంబునన్=ఇష్టపడని ధోరణితో, రాఘవక్ష్మాపాలుండును=భూపాలకుడును, కోపమున్, గదురన్=అతిశయించగా, నీగర్వంబు=నీయొక్క గర్వము, నాచేతన్=నాచేతిలో, వమ్ము=వృథా, ఐపోన్=అగునట్లుగా, ఇప్పుడు, అటంచు=అని అనుచు, లక్ష్మణుఁడు, విల్లు, అందియ్యన్=అందించగా, పెన్=ఎక్కువ, వీఁకతోన్=పరాక్రమముతో.

**తా :** సముద్రుడు రాముణ్ణి చూచి ఆనందించాడు. మిన్ను ముట్టి ఎత్తుగాపొంగి మాట్లాడబోగా రాముడు ఇష్టంలేని ధోరణితో కోపంతో నీ గర్వం నాచేతిలో ఇప్పుడే వృధా చేస్తాను అంటూ లక్ష్మణుడు అందించిన విల్లు తీసుకుని విశేషమైన పరాక్రమముతో.

**విశే :** సముద్రుడు రాముని చూసి ఆనందంతో ఉప్పొంగి పలకరించ బోయాడు. ఆతని ఆ ఉప్పొంగడం తనను లక్ష్యపెట్టక విజృంభిస్తున్నాడు అని రాముడు భావించి అతనితో సంభాషించడానికి ఇష్టపడలేదు. అతని విజృంభణకు కోపగించి సముద్రుడా! నీ గర్వం నా చేతిలో వమ్మైపోతుంది. అంటూ విల్లు ఎక్కుపెట్టాడు. మనం దుఃఖంలో ఉన్నప్పుడు ఎదుటివారి ప్రవర్తనను ఒకొక్కప్పుడు అపార్థం చేసుకునే అవకాశం ఉంది. ఈ సంఘటన అలాంటిది.

**మ. పరుషోద్యత్కుటిలాకృతిన్ బొమలుచూపట్టంగ శోణప్రభో**
**త్కరరేఖ ల్గనుఁ గొల్కుల న్నిగుడఁ గోదండంబు చేఁదాల్చి భూ**
**వర వంశాగ్రణి రాముఁ దద్భుతముగా వారాశిమీఁదన్ వడిన్**
**శరజాలంబులు పేర్చి ప్రేయుటయు నిచ్చన్ బ్రాణభీతిన్ వడిన్. 37**

**ప్రతి :** పరుష+ఉద్యత్+కుటిల+ఆకృతిన్=కఠిన భావముతో లేచిన వంకర తిరిగిన ఆకారముతో, బొమలు=కనుబొమ్మలు, చూపట్టంగ=కానరాగా, శోణప్రభ+ఉత్కర రేఖలన్=ఎఱ్ఱని కాంతితో ప్రకాశించు కనుజీరలతో, కనుగొల్కులన్=కళ్ల చివరి భాగంలో, నిగుడన్=వ్యాపించగా, కోదండంబు=విల్లు, చేఁదాల్చి=చేతితో పట్టుకుని, భూవరవంశాగ్రణి=రాజవంశ శేఖరుడు, రాముడు, అద్భుతముగా=ఆశ్చర్యపడే విధంగా, వారాశి=సముద్రుని, మీఁదన్, వడిన్=వేగంగా, శరజాలంబులు=బాణసమూహాన్ని, పేర్చి=వరుసగా కూర్చి, ఇచ్చన్=కోరికతో, ప్రేయుటయున్=ప్రయోగించబోగా, ప్రాణభీతిన్=ప్రాణం పోతుందేమో అన్న భయంతో, వడిన్=వేగంగా.

**తా :** కోపంతో ఉబికిన వంకర తిరిగిన కనుబొమలుచూపట్టగా, ఎఱ్ఱని జీఱలు కనుకొల్కులలో వ్యాపించగా, కోదండం పట్టి రాజశ్రేష్ఠుడయిన రాముడు సముద్రుని మీద అద్భుతంగా బాణాలు సంధించి వదలబోగా సముద్రుడు ప్రాణ భయంతో వేగంగా, (వచ్చి).

**క. రాముని యెదుట సముద్రుఁడు**
**తా మానవురూపుఁదాల్చి దైన్యము దోఁపన్**
**రాముసకు మ్రొక్కి యపుడా**
**ధీమంతున కనియె నిలిచి తేజం బెసఁగన్. 38**

**ప్రతి :** రాముని, ఎదుట, సముద్రుఁడు, తాన్=తాను, మానవురూపున్, తాల్చి= ధరించి, దైన్యము=దీనభావము, తోఁపన్=కనబడునట్లు, రామునకు, మ్రొక్కి, అపుడు, ఆధీమంతునకు=ఆ బుద్ధిశాలికి, తేజంబు= ప్రకాశము, నిలిచి, ఎసఁగన్=అతిశయించగా, అనియె.

**తా :** సముద్రుడు మానవ రూపంతో దీనుడై వచ్చి రామునికి నమస్కరించాడు. బుద్ధిశాలి అయిన రాముని ఎదుట నిలిచి స్పష్టంగా ఇలా అన్నాడు.

**ఆ. ఇంక నేల తడయ నినకులాధీశ్వర!**
**కపులఁ బంపి వేగఁ గట్టు మయ్య**
**కట్టఁ గట్టి దాటు కమలాప్తకులచంద్ర!**
**నీదు కీర్తిలతకు నెలవు గాఁగ. 39**

**ప్రతి :** ఇంకన్, ఏల, తడయన్=ఆలస్యం చేయడం, ఇనకులాధీశ్వర!=సూర్యవంశ ప్రభూ!, కపులన్, పంపి వేగన్, కట్టుమయ్య, కట్టఁగట్టి=వారధికట్టి, దాటు=నన్ను దాటు, కమలాప్త కులచంద్ర=సూర్యవంశ చంద్రా!, నీదు=నీయొక్క, కీర్తిలతకు=కీర్తి అనే లతకు, నెలవుగాఁగ=ఊతమయ్యే విధంగా.

**తా :** సూర్యవంశప్రభూ! ఇంకా ఆలస్యం చేయడం దేనికి, వానరులను పంపి వేగంగా ఆనకట్ట కట్టించి దానిమీదుగా దాటండి. ఈ కట్ట నీకీర్తిలతకు ఊతమవుతుంది. సముద్రం మీద కట్టకట్టాడు అనే కీర్తిలతకు ఈకట్టే ఆధారం అయి వ్యాపిస్తుంది.

**వ. మిమ్మును దరిసించుటకు మిన్నంటఁ బొంగితి నింతియకాని కపటోపాయంబునఁ బొంగిన వాఁడను గాననిన రామభద్రుండు కరుణాసముద్రుండు గావున సముద్రు నెప్పటి యట్ల యుండ నియమించి వానరులం బనిచిన. 40**

**ప్రతి :** మిమ్మును=రామచంద్రుడవగు మిమ్ములను, దరిసించుటకున్=చూచుట కొరకు, మిన్ను అంటన్= ఆకాశమును తాకునంతగా, పొంగితిన్=ఉప్పొంగితిని, ఇంతియకాని=ఇంతేకాని, కపటోపాయంబునన్= వంచనతో కూడిన ఉపాయముతో, పొంగినవాఁడను కాను=ఉబ్బినవాడను కాను, అనినన్=అని పలుకగా, రామభద్రుండు, కరుణాసముద్రుండు=దయాసముద్రుడు, కావునన్=అగుటవలన, సముద్రున్, ఎప్పటియట్లయుండన్=ఎప్పుడూ ఉన్న విధంగా ఉండుటకు, నియమించి=ఆదేశించి, వానరులన్, పనిచినన్= పంపగా...

**తా :** మిమ్మల్ని దర్శించుకోవాలని ఆకాశమంత ఎత్తు పొంగాను. అంతేకాని కపటమైన ఆలోచనతో పొంగలేదు అని రామునికి విన్నవించాడు సముద్రుడు. రాముడు కరుణాసముద్రుడు కాబట్టి సముద్రుణ్ణి చేరదీసి నీవు ఎప్పటివలె ఉండమన్నాడు. వానరులను పంపాడు.

**క. రాముని పంపునఁ బ్లవగ**
**స్తోమం బట్లరిగియరిగి దొడ్డగు కొండల్**
**క్షేమమునఁ దెచ్చి జలనిధి**
**రామాజ్ఞను వైచి రధిక రభసం బొప్పన్. 41**

**ప్రతి :** రాముని పంపున=రాముని ఆజ్ఞమేరకు, ప్లవగ=వానర, స్తోమంబు=సమూహము, అట్లరిగి యరిగి, అట్లు, అరిగి అరిగి=వెళ్లి వెళ్లి, దొడ్డగు కొండల్=పెద్ద పెద్ద కొండలను, క్షేమమునన్=ఎలాంటి ఇబ్బందులు పడకుండ, తెచ్చి, జలనిధిన్=సముద్రములో, రామాజ్ఞను=రాముని ఆనతి ప్రకారం, అధిక=ఎక్కువయిన, రభసంబు=ఆనందం, ఒప్పన్=ఒప్పగా, వైచిరి=పడవేసిరి.

**తా :** రాముడు చెప్పగానే వానరమూక అలా వెళ్లి వెళ్లి పెద్దపెద్ద కొండలు క్షేమంగా తెచ్చి గొప్ప సంతోషంతో రాముని ఆజ్ఞప్రకారం సముద్రంలో పడేసారు.

## సముద్రమునఁ బర్వతములను మ్రింగివేయు మహా మత్స్యములు

**వ. ఇట్లు వానర వీరులు పర్వత పాషాణ వృక్షజాతంబులు లక్షోపలక్షలుగాఁదెచ్చి వారాశిం బడవైచి తద్గుభగుభ ధ్వానంబుల కుప్పొంగుచు బ్రహ్మాండ భాండంబు బ్రద్దలగునట్లుగా నార్చుచు నట్టహాసంబులు సేయుచు గంతులు పెట్టుచు వెక్కిరింపుచుఁ బరువు లెత్తుచు మున్ను దెచ్చివైచిన పర్వతాదుల నెల్లఁ దిమి తిమింగిలములు మ్రింగ నాసమయంబున. 42**

**ప్రతి :** ఇట్లు, వానరవీరులు, పర్వతపాషాణ వృక్షజాతంబులు=కొండల, రాళ్ళ, చెట్ల సమూహములు, లక్షోపలక్షలుగాన్=లక్షలు లక్షలుగా, తెచ్చి=తీసికొనివచ్చి, వారాశిన్=సముద్రములో, పడవైచి, తద్గుభగుభ ధ్వానంబులకున్=దాని 'గుభగుభ' అనే శబ్దములకు, ఉప్పొంగుచున్=మిక్కిలి ఆనందించుచు, బ్రహ్మాండ భాండంబు=బ్రహ్మాండమనెడి కుండ, బ్రద్దలగునట్లుగాన్=బ్రద్దలయ్యే విధంగా, ఆర్చుచున్=అరుస్తూ, అట్టహాసములు=పెద్దగా నవ్వులు, చేయుచున్, గంతులు, పెట్టుచున్, వెక్కిరింపుచున్=వెక్కిరిస్తూ, పరువులెత్తుచున్=పరుగులు తీస్తూ, మున్ను=మునుపు, తెచ్చివైచిన పర్వతాదులన్=తీసికొనివచ్చి పడవేసిన పర్వతములు మొదలగువానిని, ఎల్లన్=అన్నింటిని, తిమింగలములు=తిమిలు, తిములను మ్రింగు తిమింగలములు, మ్రింగన్=మింగివేయగా, ఆ సమయంబునన్=ఆ సమయంలో

**తా :** ఆ విధంగా వానరవీరులు పర్వతాలు, బండరాళ్లు, చెట్లు లక్షలకొద్దీ తెచ్చి సముద్రంలో పడేసారు. అలాపడవేయగా సముద్రంలోనుండి వస్తున్న గుభగుభమనే చప్పుళ్లకు ఉప్పొంగిపోతూ, ఈ బ్రహ్మాండమనే

కుండ బ్రద్దలయ్యే విధంగా అరుస్తూ గట్టిగానవ్వుతూ గంతులు వేస్తూవెక్కిరిస్తూ, పరుగులుపెడుతూ ఉన్నారు. వారు తెచ్చివేసిన పర్వతాలను రాళ్లను చెట్లను తిమి తిమింగలములు మ్రింగగా అప్పుడు.

**విశే :** తిమి తిమింగిలములు=సముద్రంలో నివసించే పెద్ద ఆకారముగల జంతువులు. తిమింగిలాలు పిల్లలకు పాలిచ్చిపెంచుతాయి. ఆకారంలో చాలా పెద్దవి. ఇసుక దిబ్బల్లా తేలి ఉంటాయి అప్పుడప్పుడు. ఓడలు వాటి వెన్నుమీద ఆగుతాయి, ఇసుకదిబ్బలనుకుని. అవి కదలగానే ఓడమునిగే ప్రమాదం కూడా ఉంది.

**ఆ. తిరుగఁదెచ్చి వైవఁ దేలి రాకుండుట**
**నాత్మలోన సంశయంబు నొంది**
**రాజసింహుఁ డపుడు రత్నాకరునిఁజూచి**
**యడుగుటయును వేగ నాతఁ డనియె. 43**

**ప్రతి :** తిరుగన్=మళ్లీ, తెచ్చివైవన్=తీసుకువచ్చి వేయగా, తేలిరాకుండట=తేలిపైకి రాకపోవడం, ఆత్మలోన= మనసులో, సంశయంబున్=అనుమానం, ఒంది=పొంది, రాజసింహుఁడు=రాజశ్రేష్ఠుడయిన శ్రీరాముడు, రత్నాకరునిన్=సముద్రుని, చూచి=చూచి, అడుగుటయును=అడుగగా, వేగన్=వేగముగా, ఆతఁడనియె=అతడు అన్నాడు.

**తా :** వానరవీరులు మళ్లీ కొండలు రాళ్లు చెట్లు తెచ్చి సముద్రంలో పడేసారు. కానీ అవి తేలలేదు. శ్రీరామునికి మనసులో అనుమానం వచ్చింది. ఏదో జరుగుతోంది అని. సముద్రని వంక చూచి ఏమిటి సంగతి అని అడుగగా సముద్రుడు వెంటనే ఇలా అన్నాడు.

## నలునిచే సేతు నిర్మాణము

**సీ. రావణుపంపున రాలెల్లఁ జేఁపలు**
**మ్రింగుచుండెఁ గదయ్య మేదినీశ!**
**తిమితిమింగిలములు దిరుగుచు నాయందు**
**నుండి రావణుపంపు నొనరఁ జేయు**
**నలుఁడు కట్టినఁ గాని నిలువ నేరదు కట్ట**
**నలునిఁ బంపఁగదయ్య నళిననేత్ర!**
**యని సరిత్పతి సెప్పి యవ్వేళ నరిగిన**
**వీరు లిచ్చట మహావీర్యముసను**

**తే. పర్వతంబులు తేరఁగా భానుకులుని**
**పంపుచేతను వారధిఁ బరఁగ వేగ**
**నలుఁడు నా ప్రొద్దె పది యోజనములు గట్టె**
**నంతలో సూర్యుఁ డస్త్రాద్రి కరుగుచుండె. 44**

**ప్రతి :** రావణుపంపున=రావణుని ఆజ్ఞప్రకారం, రాలు=రాళ్లు, ఎల్ల=అన్నీ, చేcపలు, మ్రింగుచుండెన్=మ్రింగేస్తున్నవి, కదయ్య, మేదినీశ!=భూపతి, తిమి తిమింగిలములు, నాయందు=నా జలాలలో ఉండి, తిరుగుచు=తిరుగుచు, రావణు పంపున్=రావణుని ఆజ్ఞను, ఒనరంజేయున్=చక్కగాపాటిస్తున్నాయి. నలుడు, కట్టినన్=కడితే, కాని=కాని, నిలువనేరదు కట్ట=ఈవారధి నిలబడలేదు, నలునిన్, పంపన్, కదయ్య, నళిననేత్ర=పద్మముల వంటి కళ్లుకలవాడా! అని, సరిత్పతి=నదుల భర్త అయిన సముద్రుడు, చెప్పి, అవ్వేళన్=అప్పుడు, అరిగిన=వెళ్లగా, వీరులు=కపివీరులు, ఇచట=ఇక్కడ, మహావీర్యముననుు=అధికమైన సాహసంతో, పర్వతంబులు, తేరcగా = తీసుకొనిరాగ, భానుకులుని=సుగ్రీవుని, పంపుచేతను=ఆజ్ఞవలన, వారధిన్=వంతెనను, పరcగన్=వేగ, నలుడున్, ఆ ప్రొద్దె=పగటి కాలంలోనే, పది యోజనములు, కట్టెను, అంతలో, సూర్యుడు, అస్త్రాద్రికి=పడమటి కొండకు, అరుగుచుండె=వెళ్లిపోతున్నాడు.

**తా :** శ్రీరామా! మీవాళ్లు వేస్తున్న రాళ్ల నన్నిటినీ చేపలు మ్రింగేస్తున్నాయయ్యా. ఈ తిమి తిమింగిలాలు నాజలాల్లో నివసిస్తూ, రావణుని ఆజ్ఞను అనుసరించి నడుచుకుంటాయి. ఈ సముద్రం మీద కట్టే కట్ట నలుడు అనే వానరుడు కడితేగాని నిలబడదు. కాబట్టి నలుణ్ణి ఈ పనికి నియోగించు అని సముద్రుడు చెప్పి వెళ్లాడు. వీరులయిన వానరులు మహాసాహంతో పర్వతాలు తెచ్చారు. సుగ్రీవుని ఆజ్ఞమేరకు నలుడు ఆ పగటి కాలంలోనే అతివేగంగా పదియోజనాల పొడవు వారధి కట్టాడు. అంతలో సూర్యుడు పడమటి దిక్కుకు చేరుకున్నాడు. పగటి కాలం ముగిసింది. సూర్యాస్తమయం అవుతోంది.

**విశే :** నలుడు వానరసేనలో గొప్ప ఇంజనీరు. అదికాక అతడు చిన్నతనంలో అల్లరికి మహర్షుల సామగ్రిని సముద్రంలో పడవేసేవాడు. మహర్షులు భరించలేక-నలుడు నీళ్లలో పడేసిన వన్నీ తేలుగాక అని-వరం లాంటి పలుకు పలికారు. అందువల్ల నలుడు కడితేనే రాళ్లు పర్వతాలు వృక్షాలు నీటి మీద తేలి వారధి కట్టబడుతుంది.

## కపిసేనతో శ్రీరామచంద్రుని లంకాప్రవేశము

**వ.** **అంత సూర్యాస్తమయం బగుటయు వానరేంద్రులు తమ బలంబులం గూడి వేగునందాcక సేతుబంధనంబునకుc గాపుండి రంత సూర్యోదయం బయిన వెంటనే మహాబలశాలియగు హనుమంతుండు సువేలాద్రికరిగి యా నగంబు పొంతనున్న హేమ కూటంబును నాగపర్వతంబును సింహాచలంబును నను మూcడుగొండలు వాలపాశంబునం బెకలించి నిమ్మపండ్ల మాడ్కిc బూల బంతుల వంతున నెగుఅవైచుచు నేతెంచి నలున కందిచ్చిన నాపర్వతంబులు మూcడును దొంబది యోజనంబులు నిడుపుగల్గియుండ నవ్విధంబున శత యోజనములు నిడుపును దశయోజనంబులు వెడల్పుగా నీరధిని బంధించి నలుండా వార్త రాముని కెఱింగించినతోడనే యతండు లంక లగ్గలు పట్ట నుద్యోగించి పనసు నుత్తరపుగవను జాంబవంతుc బడమటిగవను గవయు దక్షిణపుగవను హనుమంతు దూరుపుగవనుc బట్టనియమించిన వారలును లంకాపురంబు లగ్గలకుంజొచ్చి రాక్షసుల నుగ్గునూచంబు గావించుచుండ హతశేషులు పరుగెత్తి**

**యావింతయంతయు రావణున కెఱింగిచిన నతండు చింతాక్రాంతుడై దేవాంతక నరాంతకాతికాయ త్రిశిరమహోదర మహాపార్శ్వాదుల రామలక్ష్మణులం జంపి వారి శిరంబులు గొనిరండని పనుప వా రరుగుదెంచి ఘోరాహవంబునం దమశిరంబులే రామలక్ష్మణుల బాణంబుల కర్పించిన వారితోఁ జావక మిగిలిన యతికాయుం దరుగుదెంచి తండ్రి యగు రావణునకిట్లు లనియె. 45**

ప్రతి : అంతన్=అంతలో, సూర్యాస్తమయంబు=సూర్యుని అస్తమించుట, అగుటయు, వానరేంద్రులు=వానరశ్రేష్ఠులు, తమ బలంబులన్కూడి=తమయొక్క సైన్యములతో కలిసి, వేగునందాక=తెల్లవారువరకు, సేతుబంధనంబునకున్=సముద్రముమీది కట్టుకు, కాపుండిరి=రక్షణగా ఉండిరి, అంతన్=పిమ్మట, సూర్యోదయంబు, అయిన వెంటనే, మహాబలశాలియగు=గొప్ప బలవంతుడగు, హనుమంతుండు, సువేలాద్రికిన్=సువేల పర్వతమునకు, అరిగి=వెళ్ళి, ఆ నగంబుపొంతనున్న=ఆ పర్వత సమీపములోనున్న, హేమకూటంబును= హేమకూటమను పర్వతమును, నాగపర్వతంబును, సింహాచలంబును, అను మూడుగొండలు=అను పేరుగల మూడు పర్వతములను, వాలపాశంబునన్=త్రాడువంటి తోకతో, పెకలించి=పైకి పెరికి, నిమ్మపండ్ల మాడ్కిన్= నిమ్మపండ్లను వలె, పూలబంతులవంతునన్=పూలబంతుల పద్ధతిలో, ఎగుఁబవైచుచున్=ఎగురవేస్తూ, ఏతెంచి=వచ్చి, నలునకున్, అందిచ్చినన్=అందీయగా, ఆ పర్వతంబులు మూఁడును=ఆ మూడు పర్వతాలు, తొంబది యోజనంబులు=తొంభై యోజనములు, నిడుపుకల్గియుండన్=పొడవు కలిగియుండగా, అవ్విధంబునన్=ఆ విధంగా, శతయోజనములు=నూరు యోజనములు, నిడువును, దశయోజనములు, వెడల్పుగా, నీరధిని=జలధిని/సముద్రమును, బంధించి=కట్టడిచేసి, నలుండు, ఆ వార్త=ఆ విషయము, రామునకున్, ఎఱింగించినతోడనే=తెలిపిన వెంటనే, అతండు, లంకనగ్గలుపట్టన్=లంకను ముట్టడించుటకు, ఉద్యోగించి=ప్రయత్నించి, పనసున్, ఉత్తరపుగవను=ఉత్తర ద్వారమును, జాంబవంతున్, పడమటిగవను= పశ్చిమద్వారమును, గవయున్, దక్షిణపుగవను=దక్షిణపు ద్వారమును, హనుమంతున్, తూరుపుగవను=తూర్పు ద్వారమును, పట్టన్ నియమించినన్=పట్టుటకు నియమించగా, వారలును, లంకాపురంబున్, అగ్గలకున్= ముట్టడించుటకు, చొచ్చి=ప్రవేశించి, రాక్షసులన్, నుగ్గనూచంబు=పొడిపొడిగా, కావించుచుండన్= చేయుచుండగా, హతశేషులు=చావగా మిగిలినవారు, పరుగెత్తి, ఆ వింతయంతయు=ఆశ్చర్యకరమగు ఆ విషయమునంతటిని, రావణునకున్, ఎఱిగించినన్=తెలుపగా, అతండు, చింతాక్రాంతుడై=ఆలోచనలో నిమగ్నుడై, దేవాంతక నరాంతకాతికాయత్రిశిర మహోదర మహాపార్శ్వాదులన్=దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు, త్రిశిరుడు, మహోదరుడు, మహాపార్శ్వుడు మొదలగువారిని, రామలక్ష్మణులన్, చంపి, వారి శిరంబులు=వారి తలలు, కొనిరండు అని=తీసికొని రండు అని, పనుపన్=పంపగా, వారు, అరుగుదెంచి= వచ్చి, ఘోర+ఆహవంబునన్-ఘోరాహవంబునన్=భయంకరమైన యుద్ధంలో, తమ శిరంబులే=తమ తలలే, రామలక్ష్మణుల బాణంబులకున్, అర్పించినన్=అప్పగించగా, వారితోన్, చావక=మరణింపక, మిగిలిన యతికాయుండు=మిగిలినటువంటి అతికాయుడనువాడు, అరుగుదెంచి=వచ్చి, తండ్రియగు రావణునకున్, ఇట్టులు, అనియె.

**తా :** సూర్యాస్తమయం కావడంతో వానరవీరులు తమవారితో కూడి తెల్లవారే వరకు అప్పటి వరకు కట్టిన సేతువునకు కాపున్నారు. సూర్యోదయం అయిన వెంటనే మహాబలశాలి అయిన హనుమంతుడు సువేల పర్వతం వద్దకు వెళ్లి ఆ పర్వత సమీపంలో ఉన్న, హేమకూటము, నాగపర్వతం, సింహాచలం, అనే మూఁడు కొండలు తోకతో చుట్టబెట్టి, పెకలించి నిమ్మపళ్లలా, పూలబంతుల్లా ఎగురవేస్తూ తెచ్చి నలునికి అందించాడు.ఆ మూఁడు పర్వతాలు తొంభై యెజనాల పొడుగుకల్గి ఉన్నాయి. నిన్న పదియోజనాలు,ఈ రోజు తొంభై యోజనాలు కలిసి నూరుయోజనాల పొడవుకల్గి పదియోజనాల వెడల్పు కలిగేవిధంగా సముద్రాన్ని బంధించాడు నలుడు. సేతువు నిర్మాణం పూర్తి అయింది అనే వార్తను రామునికి తెలియబరిచాడు. వెంటనే రాముడు లంకానగరాన్ని ముట్టడించే ప్రయత్నంలో పనసుణ్ణి ఉత్తరపురద్వారాన్ని, జాంబవంతుణ్ణి పడమటపు ద్వారాన్ని, గవయుణ్ణి దక్షిణపు ద్వారాన్ని హనుమంతుణ్ణి తూర్పు ద్వారం పట్టుకోవడానికి నియమించాడు. రాముని ఆనతితో వారందరు లంకాపుర ద్వారాల్లో ప్రవేశించి రాక్షసులను పొడిపొడి చేయసాగారు. దెబ్బతినక మిగిలినవారు పరుగు పరుగు వెళ్లి ఈ వింతయిన విషయాన్ని రావణునికి తెలియచెప్పారు. అతడు ఆలోచనలోపడ్డాడు. దేవాంతకుణ్ణి, నరకాంతకుణ్ణి, అతికాయుణ్ణి, త్రిశిరుణ్ణి, మహోదరుణ్ణి, మహాపార్శ్వుడు మొదలైన వారిని పిలిచి రామలక్ష్మణులను చంపి వారి తల తీసుకునిరండి అని పంపాడు. రావణుని మాటమీద వాళ్లు వచ్చారు. ఘోరమైన యుద్ధంలో తమ శిరస్సులే రామలక్ష్మణుల బాణాలకు అర్పించారు. ఈ వెళ్లినవారిలో చావగా మిగిలిన అతికాయుడు వచ్చి తనతండ్రి రావణునితో ఇలా అన్నాడు.

**విశే :** హనుమంతుడు తెచ్చిన మూడు పర్వతాలు-తొంభై యోజనాల దూరాన్ని సేతు నిర్మాణంలో ఉపయోగించిన విషయం వాల్మీకి రామాయణంలో లేదు. వాల్మీకం ప్రకారం సేతు నిర్మాణానికి ఐదురోజులు పట్టింది.

### అతికాయుఁడు వానరుల దుండగములను రావణునకు మనవి సేయుట

శా. **దేవా! భానుకులావతంసుఁడు మహాధీరుండు రాముండు బా**
**హావిర్భూతమహా ప్రతాపమున దైత్యవ్రాతమున్ భూరి వీ**
**రావేశంబునఁ ద్రుంచెఁబో మనము నందాశ్చర్యమున్ భీతియున్**
**ద్రోవన్ వేఱ వచింపనేల యిఁకఁ దద్ఘోర ప్రతాపోన్నతుల్.** **46**

**ప్రతి :** దేవా!, భానుకులావతంసుఁడు=సూర్యవంశ శ్రేష్ఠుడు, మహాధీరుండు=గొప్ప ధైర్యవంతుడు, రాముండు= రాముఁడు, బాహావిర్భూతమహాప్రతాపమున=బాహువులనుండిపుట్టిన గొప్పప్రతాపంతో, దైత్యవ్రాతమున్= రాక్షససమూహాలను, భూరి=గొప్పదైన, వీరావేశంబునన్=వీరత్వముతోకూడిన ఆవేశంతో, త్రుంచెన్+పో= చంపేసాడు, మనమునందు=మనస్సులో,ఆశ్చర్యమున్, భీతియున్=భయమును, త్రోవన్=తోచగా, ఇకన్= ఇంకను, తత్+ఘోర=అతని భయంకరమైన, ప్రతాపోన్నతుల్=అధికమైన ప్రతాపాల గురించి, వేఱవచింపనేల= ఇంతకంటెవేరుగా, చెప్పడమెందుకు.

**తా :** దేవా! సూర్యకుల ప్రదీపుడు మహాధీరుడు అయిన రాముడి బాహువుల నుండి పుట్టిన ప్రతాపంతో రాక్షస మూకను వీరావేశంతో చంపేసాడు. అది చూస్తుంటే మనస్సులో ఆశ్చర్యం, భయం పుట్టాయి. ఆ రాముని భయంకరమైన ప్రతాపాన్ని గురించి ఇంకా వేరే చెప్పడమెందుకు?

**వ. అని అతికాయుఁడు విన్న వించిన నుల్కిపడి కుంభకర్ణుని మేల్కొలుపఁ బనిచిన నతండును లేచి యావులింపుచుఁ లయకాలమృత్యువుం బోలె నేతెంచిన నట్టి యనుజుంజూచి దశముఖుం డిట్టులనియె. 47**

**ప్రతి :** అని, అతికాయుఁడు, విన్నవించినన్=వినతి చేయగా, ఉల్కిపడి=ఉలిక్కిపడి, కుంభకర్ణునిన్, మేల్కొలుపన్=నిద్రనుండి లేపుటకు, పనిచినన్=పంపగా, అతండును, లేచి, ఆవులింపుచు, లయకాల మృత్యువున్ పోలెన్=ప్రలయకాలమునాటి మృత్యువు వలె, ఏతెంచిన=వచ్చిన, అనుజుం=తమ్ముని, చూచి, దశముఖుఁడు=రావణుడు, ఇట్టులు, అనియె.

**తా :** అని అతికాయుఁడు చెప్పగా రావణుడు ఉలిక్కిపడి కుంభకర్ణుని లేపండి అని ఆజ్ఞాపించాడు. కుంభకర్ణుడు లేచి ఆవులిస్తూ, పండ్లు కొరుకుతూ, లయకాలమృత్యువు వలె వచ్చాడు. అలా వచ్చిన తమ్ముణ్ణి చూచి రావణుడు ఇలా అన్నాడు.

**విశే :** 'లయకాల మృత్యువు'-ప్రళయకాలం నాటి మృత్యువు.

**క. అనిలో నీ వా రాముని**
**ననుపమబలశాలి యైన యనిలతనూజున్**
**ఘనుఁ డగులక్ష్మణుఁ గూలిచి**
**విను వారల తలలు గొంచు వేగమ రమ్మీ. 48**

**ప్రతి :** అనిలో=యుద్ధంలో, నీవు, ఆ రాముని, అనుపమ బలశాలియైన=సాటిలేని బలశాలియైన, అనిలతనూజున్=హనుమని, ఘనుఁడు+అగు=గొప్పవాడైన, లక్ష్మణున్=లక్ష్మణుని, కూలిచి=చంపి, విను= జాగ్రత్తగావిను, వారల తలలున్=వారి తలలు, కొంచున్=పట్టుకుని, వేగమ=తొందరగా, రమ్మీ=రమ్ము.

**తా :** యుద్ధంలో ఆరాముణ్ణి, అనుపమబలశాలి అయిన హనుమను ఘనుడైన లక్ష్మణుని చంపి వాళ్ల తలలుపట్టుకుని తొందరగా రమ్ము అన్నాడు.

**విశే :** ఈ పద్యంలో హనుమకు, లక్ష్మణునకు విశేషణాలున్నాయి. హనుమ అనుపమ బలశాలి, లక్ష్మణుడు ఘనుడు. రాముణ్ణి గురించి 'ఆ రాముడు'-అని మాత్రమే అన్నాడు రావణుడు. 'ఆ' అనేది నిర్దేశ సర్వనామము. ఏ రాముడు అని ప్రశ్నించుకుంటే సముద్రం మీద సేతువు కట్టి ఇంతటి కపిసేనతో వచ్చి లంకను ముట్టడించేలా చేసి, తాను పంపిన మహావీరుల తలలు త్రుంచిన రాముడు-అనే అనేకానేక అర్థాలు-'ఆ' అనే సర్వనామం ఇస్తుంది. ఇదొక విశేషమైన రచనా విన్యాసం.

**వ. అని యనిపిన. 49**

**తా :** అని పంపగా

సీ. **భేరీమృదంగాది భీమవాద్యధ్వాన**
**ములకు సముద్రముల్ పొంగిపొరలఁ**
**గపులపాలికి లయకాలుఁడో యనుచును**
**వినువీథి దివిజులు వెఱచిఁ తొలఁగ**
**నతికాయుఁడును మహాహంకారమున వేగ**
**వెను వెంట రోషప్రవృత్తిఁ జనఁగఁ**
**గుంభకర్ణుండు కాకుత్స్థు పైఁ బోయిన**
**దక్షిణోత్తర సముద్రములరీతిఁ**

తే. **గదిసి యిరువురుఁ బోరాడఁ గడగుటయును**
**గపులు వేవేగ వచ్చిరి విపులశక్తి**
**సాధ్య గంధర్వ పతులెల్ల సరభసమునఁ**
**జూచుచుండగఁ బోరిరి సురచిరముగ.** **50**

**ప్రతి :** భేరిమృదంగాది=భేరి, మృదంగముమొదలయిన, భీమవాద్యధ్వానములకు=గొప్పవాద్యముల చప్పుళ్లకు, సముద్రముల్, పొంగిపొరలన్=అధికంగాపొంగగా, కపులపాలికి=వానరులపాలిటి, లయకాలుఁడో=ప్రళయకాలమునాటియముడో, అనుచును=అంటూ, వినువీథి=ఆకాశవీథిలో, దివిజులు=దేవతలు, వెఱచి=భయపడి, తొలఁగ=వెదలిపోగా, అతికాయుఁడును, మహా+అహంకారమున= గొప్ప అహంకారముతో, వేగ, వెనువెంట=వెంబడించి, రోష ప్రవృత్తిన్=కోపం ప్రదర్శిస్తూ, చనఁగన్=వెళ్లగా, కుంభకర్ణుడు, కాకుత్స్థుపైన్=రాముని మీదకు, పోయిన=వెళ్లగా, దక్షిణ+ఉత్తర=దక్షిణోత్తర సముద్రముల రీతి=దక్షిణ దిక్కునందలి సముద్రము ఉత్తరదిక్కునగల సముద్రములవలె, కదిసి=ఎదుర్కొని, ఇరువురున్, పోరాడన్=యుద్ధము చేయుటకు, కడగుటయును=పూనుకొనగా, కపులు, వేవేగ, వచ్చిరి, విపులశక్తి= గొప్పబలంతో, సాధ్య గంధర్వ పతులెల్ల=సాధ్యుల గంధర్వుల రాజులందరూ, సరభసమునన్=సంతోషముతో, చూచుచుండగన్, పోరిరి=యుద్ధం చేసిరి, సురుచిరముగ=చూడ వేడుకగ.

**తా :** భేరీ మృదంగము వంటి పెద్దవాద్యాల ధ్వనికి సముద్రాలు పొంగి పొరలగా కుంభకర్ణుడు వానరులపాలి కాలయముడా అనుకుని ఆకాశంలోని దేవతలు భయపడి వెళ్లిపోయారు. కుంభకర్ణునికి తోడుగా అతికాయుడు కూడా రోషంతో మహాహంకారంతో వచ్చాడు. కుంభకర్ణుడు రాముణ్ణి ఎదుర్కొన్నాడు. దక్షిణ ఉత్తర సముద్రాలవలె వారిరువురు ఎదుర్కొని యుద్ధం చేయడానికి పూనుకున్నంతలో బలశాలురైన వానరులు వేగంగా వచ్చారు. సాధ్యగంధర్వ పతులు సంతోషంతో చూస్తుండగా వేడుకగా రామకుంభకర్ణులు యుద్ధం చేసారు.

## అతికాయ కుంభకర్ణుల సంహరణము

**వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు వీరావేశంబునఁ బోరుచుండఁ గుంభకర్ణుండు విజృంభించి బలంబుల కుఱికి దిగ్గజకర్ణపుట స్ఫాటితంబుగా నార్చుచు వానరవీరుల నసంఖ్యంబుగా మ్రింగుటకుం కడంగిన రఘువీరుం డలిగి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించి వాని శిరంబును దునిమాడె నంత నతికాయుండు, తన పినతండ్రి పాటున కలిగి రాఘవేంద్రుని కభిముఖంబుగా నిలిచి దివ్యాస్త్రంబులు ప్రయోగించుచుండ లక్ష్మణుం డడ్డుసొచ్చి నానాస్త్రంబులు ప్రయోగించి ఘోరంబుగా యుద్ధముసేసి కడపట వారుణాస్త్రంబు వింత సంధించి విడిచిన నది యతికాయుని శిరంబుం ద్రుంచె నంత హతశేషులైన రాక్షసులు కాందిశీకులయి రావణుంజేరి. 51**

**ప్రతి :** ఇట్లు, పెద్దయున్ ప్రొద్దు=చాలాసేపు, వీరావేశంబునన్=వీరులకు సహజమగు పూనికతో, పోరుచుండన్=యుద్ధము చేయుచుండగా, కుంభకర్ణుండు, విజృంభించి=చెలరేగి, బలంబులకు=కపుల సేనలలోకి, ఉఱికి, దిగ్గజకర్ణపుటస్ఫాటితంబుగా=దిగ్గజముల కర్ణపుటములు మ్రోగునట్లుగా, ఆర్చుచున్= అరుస్తూ, వానరవీరులన్, అసంఖ్యాకముగాన్=లెక్కింపలేనంతగా, మ్రింగుటకున్=మ్రింగివేయుటకు, కడంగినన్=ప్రయత్నింపగా, రఘువీరుండు=రఘువంశవీరుడగు శ్రీరాముడు, అలిగి=కోపించి, బ్రహ్మాస్త్రంబు, ప్రయోగించి, వాని శిరంబును, తునిమాడెన్=ఖండించెను, అంతన్=అటుపై, అతికాయుండు, తన పినతండ్రి పాటునకున్=తన పినతండ్రి కుంభకర్ణుడు పడిపోవుటకు, అలిగి=కోపించి, రాఘవేంద్రునికిన్=రఘువంశ శ్రేష్ఠునికి, అభిముఖంబుగాన్=ఎదురుగా, నిలిచి, దివ్యాస్త్రంబులు ప్రయోగించుచుండన్, లక్ష్మణుండు, అడ్డుసొచ్చి=అడ్డుగావచ్చి, నానాస్త్రంబులు=పలు విధములగు అస్త్రములు, ప్రయోగించి, ఘోరంబుగా= భయంకరంగా, యుద్ధము, చేసి, కడపటన్=చివరగా, వారుణాస్త్రంబున్=వరుణదేవతాకమగు అస్త్రమును, వింతన్=ఆశ్చర్యముగా, సంధించి=ఎక్కుపెట్టి, విడిచినన్=విడువగా, అది, అతికాయుని శరంబున్, త్రుంచెన్= తెగగొట్టెను, అంతన్=పిమ్మట, హతశేషులైన=చావగా మిగిలిన, రాక్షసులు, కాందిశీకులై= నిరాశ్రయులై, దిక్కుతోచక పోవువారు, రావణున్, చేరి=సమీపించి...

**తా :** ఈ విధంగా చాలాసేపు వీరావేశంతో యుద్ధం చేస్తుండగా కుంభకర్ణుడు, విజృంభించి కపిబలాల మధ్యకు దుమికాడు. అష్టదిగ్గజాల చెవుల్లో మార్మోగేలా గట్టిగా అరుస్తూ లెక్కపెట్టరాని వానరులను మ్రింగుటకు పూనుకోగా రాముడు కోపించి బ్రహ్మాస్త్రం ప్రయోగించి వాని శిరస్సును ఖండించాడు. అప్పుడు అతికాయుడు తన పినతండ్రి చనిపోయినందుకు కోపించి శ్రీరామునికి ఎదురు నిలబడి దివ్యాస్త్రాన్ని ప్రయోగించబోయాడు. అంతలో లక్ష్మణుడు అడ్డుపడి నానాస్త్రంబులు ప్రయోగించి ఘోరంగా యుద్ధం చేసి చివరగా వారుణాస్త్రం వింటికి సంధించి విడిచాడు. అది అతికాయుని శిరస్సు త్రుంచింది. చావగా మిగిలిన రాక్షసులు దిక్కుతోచక భయంతో రావణుని చేరారు.

**తే. దేవ! దేవాంతకుఁడు సచ్చె దీనవృత్తిఁ**
**గుంభకర్ణుండు సమసెను ఘోరలీలఁ**

**దెగువ నతికాయుఁడును ద్రమ్మగ్గె దీని కింకఁ**
**బూని ప్రతికార మొనరింపు భూరితేజ.** **52**

**ప్రతి :** దేవ!, దేవాంతకుఁడు, చచ్చె, దీనవృత్తి=దీనమయిన స్థితిలో, కుంభకర్ణుఁడు, ఘోరలీల=ఘోరమైన రీతిలో, సమసెను=చచ్చెను, తెగువన్= ధైర్యంతో, అతికాయుడును, మ్రగ్గె=చనిపోయాడు, దీనికి, ఇంకన్, పూని, ప్రతికారము=చేసినదానికి బదులు క్రియ, భూరితేజ=గొప్ప ప్రకాశముగలవాడా, ఒనరింపుము= చేయుము.

**తా :** దేవా! అతిదీనస్థితిలో దేవాంతకుడు చనిపోయాడు. ఘోరమయిన పద్ధతిలో కుంభకర్ణుడు చనిపోయాడు. ఎంతో ధైర్యం చూపిన అతికాయుడు కూడా పోయాడు. భూరితేజ! ఇంక నీవు పూనుకుని దీనికి ప్రతిక్రియ చేయి.

**వ. అని విన్నవించిన మండిపడి రావణుం డింద్రజిత్తుం బంపిన నతండాగ్రహంబున. 53**

**ప్రతి :** విన్నవించిన = చెప్పగా, పంపిన = పంపగా, ఆగ్రహంబున = కోపంతో

**తా :** అని చెప్పగా రావణుడు మండిపడ్డాడు. ఇంద్రజిత్తును యుద్ధానికి పంపగా అతడు కోపంతో –

## ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే వానరసైన్యమును హతమార్చుట

**క. పరవీరులపై వైశ్వా**
**నరుచేఁ గొన్నట్టి చాపనారాచములుం**
**బరిఘయు బ్రహ్మాస్త్రముఁ గొని**
**దుర మొనరింపంగ వచ్చె దోర్బలశక్తిన్.** **54**

**ప్రతి :** వైశ్వానరుచేన్=అగ్నిహోత్రునిచే, కొన్నట్టి=పుచ్చుకున్నట్టి, చాప నారాచములున్=విల్లు, బాణాలు, పరిఘయు=గడియవంటి ఆయుధము, బ్రహ్మాస్త్రమున్, కొని=పట్టుకొని, పరవీరులపై=శత్రువీరులపై, దురము=యుద్ధము, ఒనరింపంగ=చేయుటకు, దోర్బలశక్తిని=భుజశక్తితో, వచ్చె=వచ్చెను.

**తా :** ఇంద్రజిత్తు అగ్నిహోత్రుని అర్చించి సంపాదించిన విల్లు బాణాలు పట్టుకొని, పరిఘను, బ్రహ్మాస్త్రాన్ని కూడా తీసుకుని విశేషమైన భుజశక్తితో శత్రువీరులతో యుద్ధం చేయడానికి వచ్చాడు.

**వ. తదనందరంబున.** **55**

**తా :** ఆ తరువాత

**క. తండోపతండములుగాఁ**
**జండాశుగసమితిఁ బఱపి శైలశరాళిన్**
**గాండమయంబుగఁ జేయుచు**
**భండన మొనరించె దైత్యపతి పుత్త్రుండున్.** **56**

**ప్రతి :** తండోపతండములగాన్=గుంపులు గుంపులుగా, చండాశుగ సమితిన్=తీక్ష్ణమైన బాణసమూహాన్ని, పఱపి=ప్రయోగించి, శైలశరాళిన్=రాళ్లబాణాలని, కాండమయముగన్=జలమయంగా చేయుచు, దైత్యపతి= రాక్షసరాజైన రావణుని, పుత్రుండున్=తనయుడు, భండనము=యుద్ధము, ఒనరించె=చేసెను.

**తా :** గుంపులు గుంపులుగా తీక్ష్ణమైన బాణాలు ప్రయోగించి, వానరసేన ప్రయోగించిన రాళ్ల బాణాలను నీరుగా చేసేస్తూ రావణపుత్రుడైన ఇంద్రజిత్తు యుద్ధం చేసాడు.

**విశే :** తండము తండము=ఆమ్రేడిత రూపంలో తండోపతండం-అవుతుంది.

**సీ.** **మిన్నక రామసౌమిత్రుల మీఁదను**
**ప్లవగసేనల మీఁద బాహుశక్తి**
**బ్రహ్మాస్త్ర మదరింపఁ బటునినాదంబునఁ**
**బఱతెంచి వానరప్రతతిమీఁద**
**బ్రహ్మమంత్రజ్ఞానపరు లైనవారి ని**
**ర్బంధంబుగాఁ జుట్టి పట్టి కట్టి**
**తక్కినవారల నుక్కడగించినఁ**
**గనుఁగొని యమరేంద్రకంటకుండు**

**తే.** **వైరమెల్లను నేఁటితోఁ దీఱె ననుచు**
**మించి కెరలుచు విల్లెక్కుడించి పొదలి**
**శాంతతను బొంది రాక్షసచక్రవర్తి**
**కడకు నేఁగెను వడి ముద్దుఁ గొడుకుఁగుఱ్ఱ.** **57**

**ప్రతి :** మిన్నక=ఎక్కువ ప్రయత్నములేకుండా, రామసౌమిత్రుల మీఁదను=రామలక్ష్మణుల మీదను, ప్లవగ సేనలమీఁద=వానర సేనల మీదను, బాహుశక్తిన్=భుజబలముతో, బ్రహ్మాస్త్రము, అదరింపన్=ప్రయోగించగా, పటునినాదంబునన్=అధికధ్వనితో, పఱతెంచి=వేగముగావచ్చి, వానరప్రతతిమీఁద=కోతుల సమూహం మీద, బ్రహ్మమంత్రజ్ఞానపరులైనవారి=బ్రహ్మమంత్రజ్ఞానం తెలిసినవారిని, నిర్బంధముగాన్=గట్టిగా బంధించి, చుట్టిపట్టికట్టి=బ్రహ్మాస్త్రంతో చుట్టిగట్టిగా పట్టికట్టి, తక్కినవారలన్=ఇతరులను, ఉక్కడగించినన్=చావగొట్టి, కనుఁగొని=చూచి, అమరేంద్రకంటకుండు=ఇంద్రజిత్తు, వైరమెల్లను=శత్రుత్వమంతా, నేఁటితోన్=ఈరోజుతో, తీఱెన్=తీరిపోయెను, అనుచున్, మించి కెరలుచు=ఎక్కువగా ఆనందిస్తూ, విల్లెక్కుడించి=ఎక్కుపెట్టిన వింటిని దింపి, పొదలి శాంతతనుపొంది=శాంతము వృద్ధిపొందగా, రాక్షసచక్రవర్తి=రావణుని, కడకున్=వద్దకు, వడి=వేగముగా, ముద్దుఁ గొడుకుఁ గుఱ్ఱ=ముద్దల చిన్న తనయుడు, ఏఁగెను=వెళ్లెను.

**తా :** రావణుని ముద్దులకొడుకు ఇంద్రజిత్తు రామలక్ష్మణుల మీద, వానరసేనమీద భుజబలం కొద్దీ అవలీలగా బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అది పెద్ద ధ్వని చేస్తూ వేగంగా వచ్చి వానరమూఁకమీద, బ్రహ్మమంత్రం

తెలిసిన వారి మీదకు వచ్చి బలవంతంగా చుట్టి పట్టి కట్టింది. తక్కిన వారిని చంపేసింది. ఆ స్థితిని చూచిన ఇంద్రజిత్తు ఇవాళతో శత్రుత్వం తీరిపోయింది. శత్రువులందరినీ పడగొట్టాను అనుకుంటూ ఏడ్పుపెట్టిన పిల్లాడిలాగ శాంతింపచేసినవాడై తన తండ్రి రాక్షస చక్రవర్తి రావణుని వద్దకు వేగంగా సంతోషంతో వెళ్లాడు.

**విశే :** కొడుకుఁ గుజ్జు!–కందువమాట, కుజ్జువాడైన కొడుకు.

**క.** **మునినాయక విను మంతట**
**దన మనుమలపాటు దెలిసి తనలోఁ దానే**
**కనుఁగొనఁ జాలక పోయెనొ**
**యనఁగను నపరాబ్ధిలోన నర్కుఁడు గ్రుంకెన్.** **58**

**ప్రతి :** ముని నాయక=వాల్మీకి మహర్షీ! వినుము=వినుము, అంతట=అప్పుడు తన మనుమలపాటున్=తన మనుమలందరూ పడిపోవడం, తెలిసి=తెలుసుకుని, తనలోన్‌తానే=తన మనస్సులో తానే, కనుఁగొనన్=చూడ, చాలకపోయెనొ=శక్తి లేకపోయెనో, అనఁగనున్=అనుకునే విధంగా, అర్కుఁడు=సూర్యుడు, అపరాబ్ధిలోనన్= పడమటి సముద్రంలో, క్రుంకెన్=అస్తమించెను.

**తా :** వాల్మీకి మహర్షీ! విను ఆ సమయంలో తన మనుమలందరూ ఇలా యుద్ధభూమిలో పడిపోవడం తెలిసి ఆ దుస్థితి చూడలేక అన్నట్లు సూర్యుడు అస్తమించాడు.

**విశే :** రామలక్ష్మణులు సూర్యవంశజులు కాబట్టి వారందరూ సూర్యునికి మనుమలు. సూర్యాస్తమయానికి కారణం ఈ మనుమలు యుద్ధభూమిలో పడిపోవడం–అని మొల్ల హేతువును చెప్పింది. హేతువు కాని దానిని హేతువుగా చెప్తే అది హేతూత్ప్రేక్షాలంకారము.

**క.** **అరవిందభవుని కరుణను**
**వరమందిన వాయుసుతుఁడు వసుమతిమీఁదన్**
**మఱి బ్రహ్మమంత్రజపముం**
**బిరుదై యున్నట్టి యలవిభీషణుఁ డొకఁడున్.** **59**

**ప్రతి :** అరవిందభువుని=పద్మమునుండి పుట్టిన బ్రహ్మ, కరుణను=దయచేత, వరము, అందిన, వాయుసుతుఁడు=హనుమ, వసుమతి=భూమి, మీఁదన్, మఱి=ఇంకను, బ్రహ్మమంత్ర జపమున్, బిరుదైయున్నటి=ప్రసిద్ధి కలయట్టి, అల=ఆ, విభీషణుఁడు, ఒకఁడున్.

**తా :** బ్రహ్మదేవుని వలన వరం పొందిన హనుమంతుడు ఇంకా ఈ భూమిలో బ్రహ్మమంత్ర జపం చేయడంలో ప్రసిద్ధికెక్కిన విభీషణుడొక్కడు.

**వ.** **తక్కఁ దక్కినవా రెల్లను మూర్ఛాగతులై చచ్చినయట్లు పడియున్న సమయంబున వాయుసుతుండు విభీషణుండును దమలో నెవ్వరు సచ్చిరో గొఱవులు పట్టుకొని రణరంగంబుఁ గలయ శోధింపుచువచ్చి శరతల్పంబున నున్న జాంబవంతునిం గని విభీషణుం డిట్లనియె.** **60**

**ప్రతి :** తక్కన్=(విభీషణుడు) తప్ప, తక్కినవారు ఎల్లను=మిగిలినవారంతా, మూర్ఛాగతులై=మూర్ఛనొందినవారై, చచ్చినయట్లు=చచ్చిన విధంగా, పడియున్న సమయంబునన్, వాయుసుతుండు=హనుమంతుడు, విభీషణుండును, తమలోన్=తమవారిలో, ఎవ్వరు చచ్చిరో, కొఱువులు=కాగడాలు (మండే కట్టెలు) పట్టుకొని, రణరంగంబున్=యుద్ధరంగమును, కలయన్=అంతటా, శోధింపుచువచ్చి=వెతుకుతూ వచ్చి, శరతల్పంబునన్=బాణాల శయ్యపై, ఉన్న జాంబవంతునిన్, కని=చూచి, విభీషణుండు, ఇట్లు, అనియె.

**తా :** హనుమ విభీషణులు తప్ప తక్కిన వారందరూ మూర్ఛపోయి చచ్చినట్లు పడిఉన్న సమయంలో, హనుమ విభీషణుడు తమసేనలో ఎవరు చచ్చిపోయారో, ఎవరు దెబ్బతిని పడి ఉన్నారో చూడాలి అని కటిక చీకటిలో మండే కొఱవులు పట్టుకొని రణరంగమంతా కలియ తిరిగి వెతుకుతూ వచ్చారు. ఒక చోట బాణాలతో పడివున్న జాంబవంతుని చూసారు. అతనితో విభీషణుడు ఇలా అన్నాడు.

**క. భల్లూకేశ్వర! వానరు**
**లెల్లను నృపవరులతోడ నిలమీఁదను మూ**
**ర్ఛిల్లియుఁ జచ్చియు నున్నా**
**రొల్లంబోవుచును దీని కుపమ యెటన్నన్. 61**

**ప్రతి :** భల్లూకేశ్వరా!=ఓ జాంబవంతుడా!, వానరులు, ఎల్లను=అందరు, నృపవరుల తోడన్=రాజశ్రేష్ఠులయిన రామలక్ష్మణులతో, ఇలమీఁదను=భూమి మీద పడి, మూర్ఛిల్లియున్, చచ్చియున్, ఉన్నారు, ఒల్లం బోవుచును=కళతప్పి, దీనికి=ఈ పరిస్థితికి, ఉపమ=ఉపాయము, ఎటు=ఏవిధంగా, అన్నన్=అని అడుగగా–

**తా :** ఓ జాంబవంతుఁడా! రామలక్ష్మణులు, వానరులందరు మూర్ఛపోయి, చచ్చిపోయి, కళతప్పి ఈ రణభూమిలో పడి ఉన్నారు. ఇప్పుడు ఏది ఉపాయం మనకి అని అడిగాడు.

**ఆ. అపుడు జాంబవంతుఁ డసురేశ నీవంకఁ**
**గన్ను విచ్చి చూడఁ గానరాదు**
**వాయుసుతుని మేలువార్త నాకిప్పుడు**
**చెవులు సోఁకునట్లు చెప్పుమయ్య. 62**

**ప్రతి :** అప్పుడు, జాంబవంతుడు, అసురేశ=రాక్షసరాజా! నీవంకన్=నీవైపు, కన్ను విచ్చిచూడన్=కళ్లువిప్పి చూడ కానరాదు=కనిపించటంలేదు, వాయుసుతుని=హనుమంతుని, మేలువార్త=క్షేమంగా ఉన్నాడనే మాట, నాకు, ఇప్పుడు, చెవులు సోకునట్లు=చెవులకు వినబడేటట్లు, చెప్పుము, అయ్య!

**తా :** జాంబవంతుడు ఓరాక్షసరాజా! నేను కళ్లు విప్పిచూసినా నువ్వు కనబడటం లేదు. హనుమంతుడు క్షేమంగా ఉన్నాడనే వార్త నా చెవులకు వినబడేటట్లు చెప్పవయ్యా! అన్నాడు.

**వ. అనిన విని హనుమంతుండు. 63**

**చ. పదములఁ జేరి మ్రొక్కుచును బాణియుగంబును మోడ్చి నీ కృపన్**
**బ్రదికినవాఁడ నన్న నతిప్రీతినిఁ జేరఁగ దీసి నీవిటన్**
**బ్రదికితిగాన నీకతనఁ బార్థివముఖ్యునిసేన లన్నియున్**
**బ్రదుకునిజంబుగా నిపుడుపావనియంచుఁ బ్రియంబు సేయుచున్. 64**

**ప్రతి :** పదములన్ చేరి=పాదాల వద్ద చేరి, పాణియుగంబును=రెండు చేతులు, మోడ్చి=దగ్గరగా చేర్చి, మ్రొక్కుచున్=నమస్కరిస్తూ, నీ కృపన్=నీదయ వలన, బ్రతికినవాఁడన్=జీవించి ఉన్నాను, అన్నన్=అనగా, అతిప్రీతిన్=మిక్కిలి ప్రేమతో, చేరఁగన్ తీసి=దగ్గరకు తీసుకుని, నీవు, ఇటన్, బ్రతికితిగాన=బ్రతికి బయటపడ్డావు కనుక, నీ కతనన్=నీ కారణంగా, పార్థివ ముఖ్యుని సేనలు=భూపతి అయిన శ్రీరామచంద్రుని సేనలు, అన్నియున్=అన్నీ కూడా, బ్రదుకు=జీవిస్తాయి. నిజంబుగాన్, ఇపుడు, పావని=హనుమ, అంచున్, ప్రియంబు సేయుచున్=ప్రేమ భావంతో –

**తా :** హనుమంతుడు రెండు చేతులు మోడ్చి పాదాలమీదపడి నీ దయవలన నేను బ్రతికే ఉన్నాను అన్నాడు. అనగానే హనుమను ప్రేమతో దగ్గరకు తీసుకుని నాయనా నువ్వు బ్రతికి ఉన్నావు కనుక నీవల్ల శ్రీరాముని సేనంతా బ్రతుకు తుందయ్యా. ఇది నిజము పావనీ! అంటూ హనుమను ప్రేమతో చూసాడు.

**విశే :** ఈ ఘట్టం మొల్ల వాల్మీకి రామాయణంలో ఉన్నట్లుగానే వ్రాసింది. విభీషణుని జాంబవంతుడు రాముడు క్షేమమేనా! అని అడగడు. హనుమ క్షేమమా ఆ మాట ముందు చెప్పు అన్నాడు. హనుమ క్షేమంగా ఉంటే అందరికీ క్షేమం కలుగుతుందని జాంబవంతుని నమ్మకం. ఈ పడిన వారినందరినీ లేపగలిగే ఔషధం తేగల సమర్థుడు హనుమ ఒక్కడే. అనుభవజ్ఞుడైన జాంబవంతుని ఆలోచన మేరకు హనుమ తదనంతర కార్యక్రమం చేస్తాడు.

## హనుమంతుఁడు తెచ్చిన సంజీవనిచే వానర వీరుల పునర్జీవనము

**వ. వినుము వాయునందనా! యా లవణసముద్రంబున్ దాఁటి హిమవంతంబును నిషధాచలంబును గడచి మేరుశైలంబును వెండి కొండయును శ్వేతపర్వతంబును నతిక్రమించి ఘృత సాగరంబు లంఘించి ద్రోణగిరి మధ్యంబునం దున్న యౌషధ శిఖరంబునం గల సంజీవిన్యాది దివ్యౌషధంబులు గొనివచ్చి రాఘవప్రీతిగా సైన్యంబుల ప్రాణంబులు నిలిపి కీర్తి వడయుమని ప్రార్థించిన నియ్యకొని వాయునందనుండు వాయువేగ మనోవేగంబునం జని జాంబవంతుడు చెప్పిన దివ్యౌషధాచలంబునె కొనివచ్చి సకల సైన్యంబుల ప్రాణంబులు గాచి నిమేష మాత్రంబున నక్కొండ తొల్లింటి యునికిపట్టుననె నెలకొల్పి వచ్చెనపుడు. 65**

**ప్రతి :** వాయునందనా! వినుము, ఆ లవణసముద్రంబున్=ఆ ఉప్పుసముద్రమును, దాఁటి, హిమవంతంబును=మంచుకొండను, నిషధాచలంబును=నిషధ పర్వతమును, కడచి=దాటి, మేరుశైలంబును, వెండికొండయును, శ్వేతపర్వతంబునున్, అతిక్రమించి=దాటి, ఘృతసాగరంబు=నేతిసముద్రము, లంఘించి= దూకి/దాటి, ద్రోణగిరి మధ్యంబునందున్ ఉన్న=ద్రోణపర్వత మధ్యలో ఉన్న, ఔషధశిఖరంబునన్‌కల=ఔషధ

శిఖరమునందు కల, సంజీవిన్యాది దివ్యౌషధంబులు=సంజీవిని మున్నగు దివ్యములైన ఔషధములు, కొనివచ్చి=తీసికొనివచ్చి, రాఘవప్రీతిగాన్=రామునికి సంతోషమగునట్లుగా, సైన్యంబుల ప్రాణంబులు, నిలిపి=నిలబెట్టి, కీర్తి, పడయుము=పొందుము, అని, ప్రార్థించినన్=ప్రార్థింపగా/కోరగా, ఇయ్యకొని= అంగీకరించి, వాయునందనుండు, వాయువేగమనోవేగంబునన్=వాయువు యొక్క వేగముతో, మనసు యొక్క వేగముతో, చని=వెళ్ళి, జాంబవంతుండు, చెప్పిన, దివ్యౌషధాచలంబునె=దివ్యౌషధములు కల పర్వతమునె, కొనివచ్చి=తీసికొనివచ్చి, సకల సైన్యంబుల ప్రాణంబులు, కాచి=రక్షించి, నిమేషమాత్రంబునన్= ఒక నిమేషమాత్రములో, అక్కొండ=ఆ కొండను, తొల్లియునికి పట్టుననె=మునుపున్నచోటననే, నెలకొల్పి= ఉంచి, వచ్చెను, అపుడు...

**తా :** వాయునందనా! విను. ఆ ఉప్పుసముద్రం దాటి, హిమాలయం, నిషధాచలం కూడ దాటివెళ్లు, మేరుపర్వతం, వెండికొండ, శ్వేత పర్వతం కూడా దాటివెళ్లు, అక్కడ నేతిసముద్రం ఉంటుంది. దాన్ని దాటి వెళితే అక్కడ ద్రోణ పర్వతం ఉంది. ఆ పర్వతం మధ్యలో ఒక ఔషధశిఖరం ఉంది. ఆ శిఖరం మీదే సంజీవిని మొదలయిన దివ్యౌషధాలు ఉన్నాయి. వాటిని తీసుకువచ్చి శ్రీరామునికి ఆనందం కలిగేలా ఈ సైన్యం ప్రాణాలు నిలబెట్టి కీర్తిమంతుడవు కమ్ము అని ప్రార్థించగా, వెంటనే సరే అని హనుమంతుడు వాయువేగ, మనోవేగంతో వెళ్లి జాంబవంతుడు చెప్పిన దివ్యౌషధాలు గల కొండనే పట్టుకొచ్చి, సకల సైన్యంబుల ప్రాణాలు రక్షించాడు. వెంటనే నిముషంలో ఆ కొండను ఎక్కడి నుండి తెచ్చాడో అక్కడ పెట్టివచ్చాడు.

**విశే :** ఎక్కడ తీసిన వస్తువు అక్కడ పెట్టడం హనుమను చూచి అలవర్చుకోవాలి.

**క.** **ఇనుఁడుదయ పర్వతంబున**
**గనుపట్టినఁ దెల్లవాఱఁ గపిసైన్యములున్**
**జననాథుఁ గాంచి మ్రొక్కిరి**
**జనపతియును వాయుసుతుని సంశ్లాఘించెన్.** **66**

**ప్రతి :** ఇనుఁడు=సూర్యుడు, ఉదయ పర్వతంబునన్=తూర్పు కొండమీద, కనుపట్టినన్=కనబడగా, తెల్లవాఱన్=తెల్లవారగా, కపిసైన్యములున్, జననాథున్= శ్రీరాముని, కాంచి=చూచి, మ్రొక్కిరి, జనపతియును= శ్రీరాముడు కూడా, వాయుసుతుని, సంశ్లాఘించెన్=అధికంగా కొనియాడాడు.

**తా :** సూర్యోదయమై తెల్లవారింది. వానరసైన్యమంతా మేలుకుని శ్రీరాముని వద్దకు వచ్చి నమస్కరించారు. విషయం తెలుసుకున్న రాముడు హనుమంతుణ్ణి మిక్కిలి కొనియాడాడు.

**విశే :** హనుమ నెఱపిన సాహసకార్యమిది, సముద్రాలు, కొండలు దాటి ప్రయాణం చేసి ద్రోణగిరిని పెరికి తేవడం సామాన్య విషయం కాదు అందుకే రాముడు శ్లాఘించాడు అనక 'సంశ్లాఘించెన్' – అంది మొల్ల.

## కుంభ నికుంభాది రాక్షసవీరుల నిహతి

**వ. అంత నింద్రజిత్తు పరాక్రమంబునకు సంతోషించి నిజంబును గల్లయును దెలియుటకు రావణుం డనుపఁ జారులేతెంచి యుత్సాహంబుతో యుద్ధసన్నద్ధులై కెరలుచున్న వానర బలంబులం గనుంగొని మరలి చనుదెంచి రామచంద్రుని బలంబున్న తెఱం గెఱింగించిరి. అది విని కలంగియుఁ గలంగని భంగి నాశ్చర్యంబు నొంది రామలక్ష్మణులపైకిఁ గుంభనికుంభ గవాక్ష ప్రజంఘ శోణితాక్షులం బంపిన వారును దమతమ బలంబులతోడఁ గరితురగరథారూఢులై వెడలి సింహనాదంబులు సేయుచు నావానర సైన్యంబుపైఁ గవిసి శరవర్షంబులు గురియుచుఁ బరిఘలం జక్కుసేయుచు నడిదంబుల వ్రేయుచు ముద్గరంబులం జెండుచు ముసలంబుల మోఁదుచుఁ గరులచే మట్టింపుచుఁ దురంగమములచేఁ ద్రొక్కింపుచు రథంబులం దోలి వెంపరలాడుచు మహాహవంబు సేయుసమయంబునఁ గపిబలంబు లదరి గిరివర్గంబులుఁ దరువర్గంబులును ననర్గళంబుగఁ గైకొని ప్రతిఘటించి పోరాడునప్పుడు. 67**

**ప్రతి :** అంతన్=పిమ్మట, ఇంద్రజిత్తు పరాక్రమంబునకున్, నిజంబును=సత్యమును, కల్లయును=అసత్యమును, తెలియుటకున్=తెలిసికొనుటకు, రావణుండు, అనుపన్=పంపగా, చారులు=గూఢచారులు, ఏతెంచి=వచ్చి, ఉత్సాహంబుతో, యుద్ధసన్నద్ధులై=యుద్ధమునకు సిద్ధముగానున్నవారై, కెరలుచున్న=విజృంభించుచున్న/అరచుచున్న, వానరబలంబులన్=వానర సైన్యములను, కనుంగొని=చూచి, మరలి=వెనుదిరిగి, చనుదెంచి=వచ్చి, రామచంద్రుని బలంబు=రాముని బలమును, ఎఱింగించిరి=తెలియజేసిరి, అదివిని=ఆ వార్తవిని, కలంగియు=కలత చెందియు, కలంగనిభంగిన్=కలత చెందని విధముగా, ఆశ్చర్యంబునొంది=ఆశ్చర్యపడి, రామలక్ష్మణులపైకిన్, కుంభనికుంభ గవాక్ష ప్రజంఘశోణితాక్షులన్, పంపినన్=పంపగా, వారును, తమ తమ బలంబులతోడన్=తమ తమ సైన్యాలతో, కరి-తురగ-రథారూఢులై=ఏనుగు, గుఱ్ఱము, రథములను ఎక్కినవారై, వెడలి=వెళ్ళి, సింహనాదంబులు=సింహమువంటి గర్జనలను, చేయుచున్, ఆ వానరసైన్యంబుపైన్=ఆ వానర సైన్యము మీద, కవిసి=చుట్టుముట్టి, శరవర్షంబులు=బాణాలవర్షము, కురియుచున్=కురిపించుచు, పరిఘలన్=అడ్డగడియలను, జక్కుసేయుచును=ముక్కలు చేస్తూ, నడిదంబులన్=ఖడ్గములతో, వేయుచున్=నరుకుతూ, ముద్గరంబులన్=ముద్గరములతో, చెండుచు=విసురుతూ, ముసలంబులన్=రోకళ్ళతో, మోదుచున్=కొట్టుచు, కరులచే=ఏనుగులచే, మట్టింపుచున్=కుమ్మింపుచు, తురంగములచేన్=గుఱ్ఱములచే, త్రొక్కింపుచున్=త్రొక్కిస్తూ, రథంబులన్, తోలి, వెంపరలాడుచున్=చావులకు గురిచేస్తూ/హింసిస్తూ, మహాహవంబు=గొప్ప యుద్ధము, చేయు సమయంబునన్= చేస్తున్న సమయంలో, కపిబలంబులు=కపుల సైన్యము భయపడి, గిరివర్గంబులున్=పర్వత సముదాయములు, తరువర్గంబులును=వృక్షసముదాయములు, అనర్గళంబుగన్=అడ్డులేకుండా, కైకొని= స్వీకరించి, ప్రతిఘటించి=అడ్డుకొని, పోరాడినప్పుడు=పోరాడిన సందర్భంలో.

**తా :** ఇంద్రజిత్తు పరాక్రమానికి సంతోషించిన రావణుడు, అది నిజమా అబద్ధమా తెలుసుకుని రండని చారుల్ని పంపారు. ఆ చారులు వచ్చి చూసే వేళకు వానరసేనలన్నీ ఉత్సాహంతో యుద్ధసన్నద్ధులై ఉండటం చూసి వచ్చి రాముని సేన ఎలా ఉన్నదీ వివరంగా చెప్పారు. వారలు చెప్పిన విషయం విని భయపడి భయపడనట్లుగా ఆశ్చర్యపడి రామలక్ష్మణుల మీద యుద్ధానికి కుంభుడు, నికుంభుడు, గవాక్షుడు,

ప్రజంఘుడు, శోణితాక్షుడు అనేవారిని పంపాడు. వారు వారివారి బలాలతో ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు ఎక్కి, సింహనాదాలు చేస్తూ ఆ వానర సైన్యంమీద బాణాల వర్షం కురిపిస్తూ, పరిఘలతో ముక్కలు చేస్తూ, కత్తులతో చంపుతూ, ముద్గరాలతో చెండుతూ. ముసలములతో మోదుతూ, ఏనుగులతో, గుఱ్ఱాలతో తొక్కిస్తూ వానరసైన్యం మీదకి రథాలు తోలి వారిని పడేస్తూ గొప్పగా యుద్ధం చేస్తుంటే కపుల సైన్యం పరాక్రమించి కొండల సమూహాల్ని, చెట్ల సమూహాల్ని ఎడతెంపు లేకుండా ప్రయోగిస్తూ రాక్షసులను నిలువరించి పోరాడారు.

**విశే :** కలంగు=భయపడు, అడిదము=కత్తి, ముసలము=రోకలి, పరిఘలు, అడిదములు, ముద్గరములు, ముసలములు–ఇవన్నీ యుద్ధంలో ప్రయోగించే ఆయుధ విశేషాలు.

**క. తెంపున వాలికుమారుఁ డ**
**కంపనుఁ దను వాఁ డెదుర్పఁ గని కోపమునం**
**గంపింపఁ బట్టి వానిని**
**జంపెను వక్షంబు పొడిచి సాహసవృత్తిన్. 68**

**ప్రతి :** తెంపున=ధైర్యంతో, వాలికుమారుఁడు=అంగదుడు, అకంపనుఁడు అనువాఁడు, ఎదుర్పన్=ఎదిరించగా, కని=చూచి, కోపమునన్, కంపింపన్=వణికి పోయేటట్లు, పట్టి, వానిని=అకంపనుని, వక్షంబు=రొమ్ము, పొడిచి, సాహసవృత్తిన్=సాహసంతో, చంపెను=చంపెను.

**తా :** అకంపనుడు అనే రాక్షసుడు ఎదుర్కోగా అంగదుడు కోపంతో వణుకు తున్నవాణ్ణి పట్టుకుని రొమ్ముమీద పొడిచి సాహసంతో చంపాడు.

**వ. అప్పుడు. 69**

**తా :** ఆ సమయంలో –

**చ. కనుఁగొని శోణితాక్షుఁడు నకంపన ప్రాణముఁగొన్న వాలినం**
**దనుని పయిం గడుం గినిసి తార్కొనితాఁకి రథంబుఁ దోలినం**
**గనలుచు నంగదుండు తురగంబులతోన రథంబు నుగ్గుగా**
**దనుజుని మీఁదఁ దానుటికి తన్నిన వాఁడునుగూలె నేలపైన్. 70**

**ప్రతి :** కనుంగొని=చూచి, శోణితాక్షుఁదున్, అకంపను, ప్రాణమున్ కొన్న=ప్రాణాలు తీసిన, వాలినందనునిపై=అంగదునిపై, కడున్ కినిసి=మిక్కిలి కోపగించి, తార్కొని=ఢీకొని, తాఁకి=కొట్టి, రథంబు. తోలినన్, కనలుచున్=మండిపడుతూ. అంగదుడు, తురగంబులతోన రథంబు=గుఱ్ఱాలతో సహా రథాన్ని, నుగ్గుగా=పిండి అయ్యేట్లు, దనుజుని మీఁదన్=రాక్షసుని మీద, తాను, ఉటికి, తన్నన్=తన్నగా, వాఁడును, కూలె, నేలపైన్.

**తా :** అకంపనుడిని చంపిన అంగదుణ్ణి చూసి శోణితాక్షుడు అనేవాడు కోపంతో అంగదుని మీదపడి కొట్టి రథం అతని మీదకు తోలాడు. అది చూచిన అంగదుడు మండిపడుతూ గుఱ్ఱాలతో సహా రథం నుగ్గయ్యేలా ఆ రాక్షసునిమీదకు ఉటికి ఒక్క తన్నుతన్నాడు ఆ తన్నుకి వాడు నేల కూలాడు.

**ఆ. అతఁడు నేలఁ గూల నా ప్రజఘుండును**
**ఘనుఁడు యూపనేత్రుఁ డెనసి వాలి**
**కొడుకుమీఁద రాఁగఁ గోపించి మైందుండు**
**ద్వివిదుఁ డంతలోనె తెంపు మిగిలి. 71**

ప్రతి : అతడు, నేలఁగూలన్=చనిపోగా, ఆ, ప్రజఘుండును, ఘనుడు=గొప్పవాడు, యూపనేత్రుడు, ఎనసి=జంటగా, వాలికొడుకు మీఁద, రాఁగన్=రాగా, కోపించి, మైందుండు, ద్వివిదుఁడు, అంతలోనె, తెంపుమిగిలి=ధైర్యం అతిశయించగా –

**తా :** శోణితాక్షుడు నేల కూలగానే ప్రజంఘుడు, ఘనుడైన యూపనేత్రుడు జంటగా అంగదుని మీదకు వచ్చారు. అది చూచికోపించిన మైందుడు, ద్వివిదుడు అనే వానరులు అతిశయించిన ధైర్యంతో అంతలోనే.

**క. దనుజులఁదోలఁ బ్రజంఘుఁడు**
**గనుఁగొని యవ్వాలిసుతుని కటములు పొడువన్**
**గనలి నిశాచరు శిరమును**
**ఘనతర దృఢముష్టిఁ బొడిచి కడపెన్ ధరకున్. 72**

ప్రతి : దనుజులన్=రాక్షసులను, తోలన్=తరిమికొట్టగా, ప్రజంఘుఁడు, కనుఁగొని=చూచి, అవ్వాలి సుతుని=ఆవాలి కుమారుడైన అంగదుని, కటములు=చెంపలు, పొడువన్=పొడవగా, కనలి=మండిపడి, నిశాచరు=రాక్షసుని, శిరమును=తలను, ఘనతర=పటిష్టమయిన, దృఢముష్టిన్=గట్టిపిడికిలితో, పొడిచి, ధరకున్=నేలమీదికి, కడపెన్=కూల్చెను.

**తా :** మైంద ద్వివిదులు రాక్షసులను తరిమికొట్టడం చూచిన ప్రజంఘుడు అంగదుని చెంపల మీద పొడిచాడు. అంగదుడు మండిపడి ఆ రాక్షసుని శిరస్సు గొప్ప పటిష్టమైన తన పిడికిలితోపొడిచి నేల కూల్చాడు. ప్రజంఘుడు చనిపోయాడు.

**సీ. ఘనుఁడు ప్రజంఘుఁడు కదనంబులోఁ బడ్డ**
**నక్షయబలుఁడు యూపాక్షుఁ డంత**
**గదఁగొని వ్రేసిన ఘనతతోఁ గుప్పించి**
**భుజశక్తి నాతనిఁ బొదివి పట్టి**
**కొనిపోవునప్పుడు కోపించి యన్నకై**
**శోణితాక్షుఁడు వచ్చి శూరుఁడగుచు**
**విడిపించుకొనఁ జూడ వడిగ మైందుఁడు డాసి**
**కలన యూపాక్షుని గదిసి పోరి**

**తే. సాహసంబున నొఱలంగఁ జంపుటయును**
**శోణితాక్షుండు ద్వివిదునిఁ జూచి పొడువ**
**నతఁడు మూర్ఛిల్లి తెప్పిరి యసురఁ బట్టి**
**శిరము కూలంగ నడిదంబుచేత వ్రేసె. 73**

**ప్రతి :** ఘనుఁడు=గొప్పవాడు, ప్రజంఘుఁడు, కదనంబులోన్=యుద్ధములో, పడ్డన్=పడిపోగా, అక్షయబలుఁడు= నాశములేని బలము గల, యూపాక్షుఁడు, అంత=అంతలో, గదన్‌కొని=గదను తీసుకొని, వ్రేసిన=కొట్టగా, ఘనతతోన్=గొప్పగా, కుప్పించి=దుమికి, భుజశక్తిన్=భుజబలంతో, ఆతనిన్=యూపాక్షుని, పొదివిపట్టి= గట్టిగా కదలకుండా పట్టుకుని, కొనిపోవునప్పుడు=తీసుకుపోతూ ఉండగా, కోపించి, అన్నకై=అన్నగారికోసం, శోణితాక్షుడు, వచ్చి, శూరుఁడు, అగుచు, విడిపించుకొనన్, చూడ, వడిగ=వేగంగా, మైందుఁడు, డాసి=ఎదుర్కొని, కలన=యుద్ధంలో, సాహసంబునన్, ఒఱలంగ=నేర్పుగా, చంపుటయును, శోణితాక్షుండు, ద్వివిదునిన్, చూచి, పొడువన్, అతడు, మూర్ఛిల్లి, తెప్పిరి=తేరుకుని, అసురన్=రాక్షసుని, పట్టి, శిరము, కూలంగన్, అడిదంబుచేత=కత్తితో, వ్రేసె=సంహారించాడు.

**తా :** ఘనుడయిన ప్రజంఘుడు యుద్ధంలో చనిపోగా అక్షయబలుడయిన యూపాక్షుడు అంతలో గదతో అంగదుని కొట్టాడు. అంగదుడు ఒక్క ఉరుకు ఉరికి తన భుజబలంతో యుపాక్షుణ్ణి పొదివి పట్టి తీసుకుపోసాగాడు. తన అన్నగారిని విడిపించుకోడానికి పరాక్రమంతో శోణితాక్షుడు వచ్చాడు. అది గమనించిన మైందుడు వేగంగావచ్చి ఎదుర్కొని యూపాక్షుణ్ణి యుద్ధంలో నేర్పుగా సాహసంతో చంపాడు. శోణితాక్షుడు ద్వివిదుణ్ణి పొడిచాడు. ద్వివిదుడు మూర్ఛపోయి అంతలోనే తేరుకొని ఆ రాక్షసుని శిరస్సు తెగిపడేలా కత్తితో కొట్టాడు.

**తే. శోణితాక్షుండు పోరిలోఁ జూర్ణమయినఁ**
**గుంభుఁ డప్పుడు కోపించుకొనుచు వచ్చి**
**ద్వివిదు నెదుఱొమ్ము నాటఁగఁ దీవ్రశరము**
**లేసి వడిఁ జంపె నాజిలో నేమి చెప్ప. 74**

**ప్రతి :** శోణితాక్షుండు, పోరిలో=యుద్ధంలో, చూర్ణమయిన=పొడికాగా (చనిపోగా), కుంభుఁడు, అప్పుడు, కోపించుకొనుచువచ్చి, ద్వివిదున్, ఎదుఱొమ్ము= గుండెలమీద, నాటఁగన్=గుచ్చుకునే విధంగా, తీవ్రశరములు=పదునైన బాణాలు, ఏసి=ప్రయోగించి, ఆజిలోన్=యుద్ధములో, వడిన్=వేగముగా, చంపెన్, ఏమి చెప్ప=ఏమని చెప్పేది.

**తా :** శోణితాక్షుడు యుద్ధంలో చనిపోవడం చూసిన కుంభుడు కోపగించు కుంటూ వచ్చాడు. ద్వివిదుని రొమ్ము మీద పదునైన బాణాలు వేగంగా నాటుకునేలా వేసి యుద్ధంలో ద్వివిదుణ్ణి చంపాడు. ఏమని చెప్పేది.

క. తమ్ముని పాటు గనుంగొని
హుమ్మన మైందుండు కుంభు నురుతర ముష్టిన్
ఱొమ్మున బొడిచిన నతఁ డొ
క్కమ్మున గూలంగ నేసె నమరులు దలఁకన్. 75

ప్రతి : తమ్ముని పాటున్=తమ్ముడు పడిపోవుటను, కనుంగొని, హుమ్మన=హుంకరించగ, మైందుండు, కుంభున్, ఉరుతర=దృఢతరమైన, ముష్టిన్=పిడికిలితో, ఱొమ్మునన్, పొడిచినన్, అతఁడు, ఒక్క+అమ్మునన్= ఒక బాణంతో, కూలంగన్=కూలిపోవునట్లు, అమరులు=దేవతలు, తలఁకన్=భయపడగా, ఏసెన్=వేసెను.

తా : తమ్ముడు పడిపోవడం చూచిన మైందుడు హుంకరించి కుంభుని ఱొమ్ముమీద తన బలమైన పిడికిలితో పొడిచాడు. ఆ కుంభుడు ఒక్క బాణం ప్రయోగించి దేవతలు భయపడేటట్లుగా మైందుని చంపేసాడు.

ఉ. అంగదుఁ డంతం గుంభుని శతాంగముపై నొకపర్వతంబు భూ
మిం గలయంగ వ్రేయుటయు మేదినికిన్ వడి దాఁటి వాలిపు
త్రుం గని దైత్యుఁ డాగ్రహముతో ముసలంబున వ్రేయనొచ్చి తోఁ
కంగొని వజ్రిపౌత్త్రుఁడు సగర్వమునన్ దగమోదె నార్చుచున్. 76

ప్రతి : అంతన్, అంగదుఁడు, కుంభుని, శతాంగముపైన్=రథము మీద, ఒక పర్వతంబు=ఒకకొండ, భూమిన్=భూమిలో, కలయంగ=కలసిపోయే విధంగా, వ్రేయుటయు=వేయగా, మేదినికిన్=భూమిమీఁదకు, వడి=వేగంగా, దాఁటి, వాలి పుత్రుంగని=అంగదుణ్ణి చూచి, దైత్యుఁడు=రాక్షసుడు, ఆగ్రహముతో=కోపముతో, నొచ్చి=నొప్పిపుట్టగా, తోకంగొని=తోకతో, వజ్రిపౌత్రుఁడు=ఇంద్రుని మనుమడయిన, అంగదుడు, సగర్వమునన్=గర్వముతో కూడినవాడై, ఆర్చుచున్=పెద్దగా అరుస్తూ, తగమోదె=అదేపనిగా కొట్టాడు.

తా : అంగదుడు కుంభుని రథం మట్టిలో కలిసిపోయేలా ఒక పెద్ద పర్వతం పడేసాడు. కుంభుడు గమనించి రథంలోంచి భూమి మీదకు ఉటికాడు. కోపంతో అంగదుణ్ణి రోకలితో కొట్టాడు. ఆ దెబ్బకు నొప్పిపుట్టగా అంగదుడు తనతోకతో సగర్వంగా పెద్దగా అరుస్తూ కుంభుణ్ణి అదే పనిగా మోదాడు.

విశే : వజ్రిపౌత్రుఁడు,వజ్రి=ఇంద్రుడు=వజ్రాయుధము కలవాడు వజ్రి. పౌత్రుఁడు=పుత్రుని కొడుకు. పౌత్రుడు-మనుమడు అని. వాలి ఇంద్రుని కొడుకు, వాలి కొడుకు ఇంద్రపౌత్రుడు, ఇంద్రుని మనుమడు అంటే అంగదుడు.

క. కాలాంతకరుద్రులతోఁ
బోలుపఁ దగు కుంభుఁ డపుడు భుజబల శక్తిన్
వాలికుమారుని ధరపైఁ
గూలఁగ వడి నేసె నైదుకోలలచేతన్. 77

**ప్రతి :** కాలాంతకరుద్రులతోన్=ప్రళయకాలంనాటి రుద్రులతో, పోలుపన్ తగు=పోల్చడానికి తగిన, కుంభుఁడు, అపుడు, భుజబలశక్తిన్, వాలికుమారుని, ధరపై=భూమిమీద, కూలఁగ=పడునట్లు, వడిన్=వేగముగా, ఐదుకోలలచేతన్=అయిదు బాణాలతో, ఏసె=కొట్టెను,

**తా :** ప్రళయకాలం నాటి రుద్రులతో పోల్చదగిన కుంభుడు తన భుజ బలంకొద్దీ అంగదుడు నేల కూలేలా అయిదుబాణాలతో కొట్టాడు.

**వ. ఇట్లు వాలి కుమారుండు కుంభునిచేత బాణపీడితుండై పడుట యెఱింగి రామచంద్రుఁడు వానిపై సుగ్రీవ జాంబవ ద్ధనుమదాదులం బంపిన. 78**

**ప్రతి :** బాణపీడితుండై=బాణములచే బాధింపబడినవాడై, పడుట=పడిపోవుట, ఎఱింగి=తెలుసుకొని, సుగ్రీవ జాంబవద్ధనుమదాదులన్=సుగ్రీవుడు, జాంబవంతుడు, హనుమ మొదలగువారు,

**తా :** ఈ విధంగా అంగదుడు కుంభుని బాణాలవల్ల పడిన సంగతి తెలిసిన రామచంద్రుడు కుంభుని మీదకు సుగ్రీవుణ్ణి, జాంబవంతుని, హనుమంతుణ్ణి పంపగా –

**క. వారందఱధిపు నాజ్ఞను**
**భూరుహములు గిరులుఁ గొనుచు భువనము లదరన్**
**బోరున నార్చుచుఁ గుంభునిఁ**
**దారసమై వ్రేసిరంత దర్పోద్ధతులై. 79**

**ప్రతి :** వారు, అందఱు, అధిపున్, ఆజ్ఞను=ఆజ్ఞమేరకు, భూరుహములు=చెట్లు, గిరులున్=కొండలున్ను, కొనుచు=తీసుకొని, భువనములు=లోకాలు, అదరన్= కదలునట్లు, బోరునన్=గట్టిగా, ఆర్చుచున్=అరుస్తూ, కుంభునిన్, తారసమై=ఎదురై, దర్పోద్ధతులై=బలగర్వంతో, వ్రేసిరి=కొట్టారు, అంత.

**తా :** శ్రీరాముని ఆజ్ఞమేరకు వారందరూ చెట్లు, కొండలు తీసుకుని లోకాలు కదలిపోయేటట్లు గట్టిగా అరుస్తూ కుంభునికి ఎదురువెళ్లి బలగర్వంతో కొట్టారు.

**క. వారలు వ్రేసిన తరు గిరు**
**లారయఁ దనుఁ దాఁకకుండ నవి తునియలుగాఁ**
**గ్రూరాస్త్రంబులఁ దునుముచు**
**నారసములఁ వారివారి నాటఁగ నేసెన్. 80**

**ప్రతి :** వారలు=ఆ వానరులు, వ్రేసిన=ప్రయోగించిన, తరుగిరులు=చెట్లు కొండలు, ఆరయ=కనిపెట్టి, తనున్=తనకు, తాఁకకుండన్=తగలకుండా, అవి, తునియులు గాన్=ముక్కలుముక్కలుగా, కూరాస్త్రంబులన్=భయంకరమైన బాణాలతో, తునుముచు=ముక్కలుచేస్తూ, నారసములన్=బాణాలతో, వారివారిన్=వారి అందరిని, నాటఁగన్=నాటుకునే విధంగా, ఏసెన్=కొట్టెను.

**తా :** వానరులు ప్రయోగించిన చెట్లు కొండలు ఎలా వస్తున్నవో కనిపెట్టి అవి తనకు తగలకుండా క్రూరాస్త్రాలతో వాటిని ముక్కముక్కలుగా చేస్తూ, వానరులకు గుచ్చుకునేలా బాణాలు ప్రయోగించాడు.

**క.** **ఏసినఁ గుంభుని రవిజుం**
**దా సమయమునందు నేసె నద రంటంగా**
**నేసినఁ గ్రమ్మఱ రవిజుని**
**గాసిల వక్షంబు పొడువఁగా నిలఁబడియెన్.** **81**

**ప్రతి :** ఏసినన్=వేయగా, కుంభుని, రవిజుందు=సుగ్రీవుడు, ఆ సమయము నందున్, ఏసెన్, అదరంటంగాన్=తీవ్రంగా, ఏసినన్, క్రమ్మఱ=తిరిగి, రవిజుని=సుగ్రీవుని, గాసిల=బాధపెట్టేలా, వక్షంబు=రొమ్ము, పొడువంగాన్=పొడవగా, ఇలన్=భూమి మీద, పడియెన్=పడిపోయెను.

**తా :** తన మీద బాణాలు వేసిన కుంభుణ్ణి సుగ్రీవుడు అప్పుడు తీవ్రంగా కొట్టాడు. కుంభుడు తిరిగి సుగ్రీవుణ్ణి రొమ్ము మీద గట్టిగా కొట్టడంతో అతడు నేలమీద పడిపోయాడు.

**తే.** **మూర్ఛతేఱి యా రవిజుఁ డమోఘముష్టి**
**పూని దైత్యుని ఱొమ్ము పైఁ బొడువ నంత**
**శరధిమథియించు మందరాచలముమాడ్కి**
**ధీరత యడంగి దిర్దిరఁ దిరిగి పడియె.** **82**

**ప్రతి :** మూర్ఛతేఱి=మూర్ఛ నుండి తేరుకుని, ఆ రవిజుఁడు=ఆ సుగ్రీవుడు, అమోఘ ముష్టిపూని=తిరుగులేనట్టి పిడికిలి బిగించి, దైత్యుని=రాక్షసుని, ఱొమ్ముపైన్=రొమ్ముమీద, పొడువన్=పొడవగా. అంత, శరధి మథియించు=సముద్రాన్ని చిలుకుతున్న, మందరాచలముమాడ్కి=మందర పర్వతమువలె, ధీరత=ధైర్యము, అడంగి=నశించి, దిర్దిరన్=గిరగిరా, తిరిగి, పడియె=పడిపోయాడు.

**తా :** సుగ్రీవుడు మూర్ఛనుండి తేరుకుని తిరుగులేని తన పిడికిలి బిగించి కుంభుని రొమ్ముమీద గట్టిగా పొడిచాడు. ఆ దెబ్బకి సముద్రాన్ని చిలికే మందర పర్వతం గిరగిరా, ఇటూ అటూ తిరిగినట్లు తిరిగిపడ్డాడు.

**విశే :** చక్కని ఉపమాలంకారము.

**ఉ.** **కుంభుఁడు గూలినంగని నికుంభుఁడు దాఁబరిఘాయుధంబు సం**
**రంభ మెలర్పఁ ద్రిప్పి దినరాజతనూజుఁనిపైకి రాఁగ బల్**
**సంభ్రమమొప్ప వాయుజుఁడు శౌర్యము గన్పడ నడ్డమైన ది**
**క్కుంభిగముల్ కలంగఁగను గొబ్బున వక్షమువైచె నార్చుచున్.** **83**

**ప్రతి :** కుంభుఁడు, కూలినన్, కని, నికుంభుఁడు, తాన్, పరిఘాయుధంబు=పరిఘ అనే ఆయుధాన్ని, సంరంభము=ఉత్సాహము, ఎలర్పన్=అతిశయించగా, త్రిప్పి=గిరగిరా త్రిప్పి, దినరాజు తనూజునిపైకి=సూర్యపుత్రుడయిన సుగ్రీవుని మీదికి, రాఁగన్=రాగ, బల్ సంభ్రమొప్ప=అధికమైన ఆశ్చర్యం కలిగేలా,

వాయుజుఁడు=హనుమ, శౌర్యము=ప్రతాపము, కన్పడన్=ప్రదర్శిస్తూ, అడ్డమైన=అడ్డమురాగా, దిక్కుంభిగముల్=అష్టదిక్కులలో ఉండే ఏనుగుల సమూహాలు, కలంగఁగను=బెదురునట్లుగా, గొబ్బున=శీఘ్రముగా, వక్షమువైచె=రొమ్ముమీద వేసాడు, ఆర్చుచున్=అరుస్తూ.

**తా :** కుంభుడు కూలిపోవడం చూచి నికుంభుడు పరిఘ అనే ఆయుధం ఉత్సాహంగా త్రిప్పి త్రిప్పి సుగ్రీవునిపైకి వచ్చాడు. అంతలో హనుమంతుడు ఆశ్చర్యం కలిగేలా శౌర్యాన్ని ప్రదర్శిస్తూ అడ్డమై వచ్చాడు, దిగ్గజ సమూహాలు బెదిరేలా వేగంగా అరుస్తూ వాని రొమ్ముమీద వేసాడు, నికుంభుడు.

**క. వ్రేసిన పరిఘాయుధ మది**
**వీసము నాటంగలేక విఱిగిన మిగులన్**
**గాసిలి దైత్యుఁడు పవనజు**
**నా సమయమునందు నేసె నడిదము చేతన్. 84**

**ప్రతి :** వ్రేసిన=ప్రయోగించిన, పరిఘాయుధము=పరిఘ అనే ఆయుధము, అది=ఆ, వీసమున్=కొంచెం కూడా, నాటంగలేక=నాటుకోలేక, విఱిగిన=విరిగిపోగా, మిగులన్=మిక్కిలి, గాసిలి=దుఃఖపడి, దైత్యుఁడు=రాక్షసుడు, ఆసమయము నందు=అప్పుడు, పవనజున్=హనుమను, అడిదముచేతన్=కత్తితో, ఏసెన్=వేసెను.

**తా :** నికుంభుడు ప్రయోగించిన పరిఘ అనే ఆయుధం హనుమంతునికి వీసమయినా గుచ్చుకోలేదు సరికదా అది కాస్తా విరిగి పోయింది. అది చూసి దుఃఖపడి హనుమంతుని కత్తితో కొట్టాడు నికుంభుడు.

**విశే :** వీసము-రూపాయిలో 16వ భాగము. చాలా తక్కువ అని.

**తే. అంత హనుమంతుఁ డుగ్రుఁడై యసురగళము**
**నందు వాలంబు దగిలించి యాకసమునఁ**
**ద్రిప్పి ధరణితలంబునఁ ద్రెళ్ళఁ గొట్టి**
**సింహనాదంబుఁ జేసె నచ్చెరువు గాఁగ. 85**

**ప్రతి :** అంత=అప్పుడు, హనుమంతుఁడు, ఉగ్రుఁడై=కోపించినవాడై, అసురగళమునందు=రాక్షసుని కంఠానికి, వాలంబు=తోకను, తగిలించి, ఆకసమున=ఆకాశంలో, త్రిప్పి=గిరగిరా త్రిప్పి, ధరణితలంబునన్=భూమి మీద, త్రెళ్ళన్=చచ్చునట్లు, కొట్టి, సింహనాదంబున్=సింహమువలెగర్జించుట, చేసె, అచ్చెరువుగాఁగ=ఆశ్చర్యపడేలా!

**తా :** అప్పుడు ఉగ్రుడైన హనుమ తన తోక ఆ రాక్షసుని కంఠానికి చుట్టి ఆకాశంలో గిరగిరా త్రిప్పి, భూమి మీద చచ్చేటట్లు కొట్టి సింహగర్జన చేసాడు, అందరూ ఆశ్చర్యపడేలా.

**వ. అట్టి సమయంబున. 86**

**తా :** అటువంటి సమయంలో -

**క. హతశేషులు ఘటకర్ణుని**
**సుతు లాహవభూమిఁ దెగినసుద్దులు లంకా**
**పతి కెఱిఁగించిన దుఃఖో**
**న్నతుఁడై యొక్కింత తడవునకు నిట్లనియెన్. 87**

**ప్రతి :** హతశేషులు=చావగా మిగిలినవారు, ఘటకర్ణుని సుతులు=ఘటకర్ణుడనే వాని కొడుకులు, శుంభ నిశుంభులు, ఆహవభూమిన్=యుద్ధభూమిలో, తెగిన=చనిపోయిన, సుద్దులు=కబుర్లు, లంకాపతికి, ఎఱిఁగించిన, దుఃఖోన్నతుఁడై=అధికముగా దుఃఖించినవాడై, ఒక్కింత తడవునకున్=కొద్దిసేపట్లో, ఇట్లనియెన్= ఇలా అన్నాడు.

**తా :** చావగా మిగిలినవాళ్లు వెళ్లి కుంభ నికుంభులు మరణించారనే కబురు రావణునికి చెప్పారు. రావణుడు ఎక్కువగా దుఃఖించాడు. కొద్దిసేపటికి తేరుకుని ఇలా అన్నాడు.

**తే. మనకుఁ గలయట్టి బాంధవగణము సుతులు**
**దొరలుఁ బరివారమును గంధకరులు హరులు**
**గుటిల కపియూధములబారి గొఱియ లగుచుఁ**
**దెగిరి మునుముట్ట నేటితోఁ దీవ్రగతిని. 88**

**ప్రతి :** మనకున్, కలయట్టి=ఉన్నట్టి, బాంధవగణము=చుట్టాలసమూహము, సుతులు=కొడుకులు, దొరలున్= ప్రభువులు, పరివారము=సేనలు, గంధకరులు=మదపుటేనుగులు, హరులున్=గుఱ్ఱాలు, కుటిల కపియూధముల బారిన్=కపటులయిన వానర సైన్యాల లక్ష్యానికి, గొఱియలు=గొఱ్ఱెలు, అగుచున్, తెగిరి= చనిపోయిరి, మునుముట్ట=సమూలంగా, నేటితోన్=ఈ రోజుతో, తీవ్రగతిని=అతి వేగంగా.

**తా :** మనకున్న చుట్టాలు, సుతులు, దొరలు, సేనలు, ఏనుగులు, గుఱ్ఱాలు. కపటులయిన వానర సైన్యాల గుఱికి గొఱ్ఱెలై ఈ రోజుతో అందరూ వేగంగా చనిపోయారు.

**వ. అని చింతింపుచుఁ గొంతవడికి ధైర్యంబుంగొని. 89**

**ప్రతి :** చింతింపుచున్=బాధపడుతూ, కొంతవడికి=కొంతసేపటికి,

## శ్రీరాముఁడు మకరాక్షుని రూపు మాపుట

**క. దైతేయవల్లభుఁడు గడు**
**ప్రీతిన్ మకరాక్షుఁజూచి పృథుతరశక్తిన్**
**మీ తండ్రి ఖరునిన్ఁ జంపిన**
**యాతనిపై సూడు వీఁగు మరుగుమటన్నన్. 90**

**ప్రతి :** దైతేయ వల్లభుఁడు=రాక్షసులరాజు, కదుప్రీతిన్=మిక్కిలి ప్రేమతో, మకరాక్షున్, చూచి, పృథుతరశక్తిన్= అత్యధికమైన శక్తితో, మీ తండ్రి ఖరునిన్, చంపిన ఆతనిపై, సూడు=పగతో, వీఁగుము=విజృంభించుము, అరుగుము=వెళ్లుము, అటన్నన్=అని అనగా.

**తా :** రావణుడు మకరాక్షుని ప్రేమగా చూచి నీ తండ్రి ఖరుణ్ణి అత్యధిక శక్తితో చంపిన రాముని మీద పగ తీర్చుకునేలా విజృంభించు వెళ్లు అన్నాడు.

**సీ. సింధుర రథ భట సైంధవంబులతోడఁ**
**దఱచైన పట్టు ఛత్రములతోడఁ**
**బటహ భేరీ ముఖ్య బహువాద్యములతోడ**
**దట్టంపు నానాయుధములతోడ**
**వందిమాగధసూత బృందస్తుతులతోడఁ**
**గెరలాడు బిరుదుటెక్కెములతోడ**
**బహుళకాహళ శంఖ భాంకారములతోడ**
**రాజిల్లునవచామరములతోడ**

**తే. నడిచె దిగ్దంతి భూదారనాగకూర్మ**
**కులనగేంద్రయుతముగ భూతలము గదలఁ**
**బదరజఃపాళి సంఛన్న భానుఁడగుచు**
**దక్షుఁడై నట్టి మకరాక్షుఁ డాక్షణంబ. 91**

**ప్రతి :** సింధుర=ఏనుగు, రథ, భట, సైంధవంబులతోడన్=గుఱ్ఱాలుతో, ఏనుగులు రథాలు భటులు గుఱ్ఱాలతో, తఱచైన=దట్టమైన, పట్టు ఛత్రములతోడన్= పట్టుగొడుగులతో, పటహభేరీముఖ్య బహువాద్యములతోడన్= పటహము, భేరీ మొదలయిన పెక్కు వాద్యములతో, దట్టంపు నానా యుధములతోడన్=పెక్కు రకరకాల ఆయుధాలతో, వందిమాగధ సూత బృందస్తుతులతోడ=వంది మాగధుడు సూతుడుమున్నగు వారు చేసే స్తోత్రాలతో, కెరలాడు=ఎగురుచున్న, బిరుదు టెక్కెములతోడ=బిరుదులు వ్రాసిన జెండాలతో, బహుళ కాహళశంఖ భాంకారములతో=ఎక్కువ కాహళములు, శంఖములు చేసే ధ్వనులు, రాజిల్లు నవ చామరములతోడ=ప్రకాశిస్తున్న కొత్త చామరాలతో, నడిచె=నడిచెను, దిగ్దంతి=అష్టదిక్కుల్లో ఉండే ఏనుగులు, భూదార=వరాహము (పంది), నాగ=శేషుడు, కూర్మ=తాబేలు, కులనగేంద్రయుతముగ=కులపర్వతాలతో సహా, భూతలము=భూమి, కదలన్=కదిలిపోగా, పదరజఃపాళి=నడచినప్పుడు లేచిన పాదముల ధూళిచే, సంఛన్న=కప్పబడిన, భానుఁడగుచు=సూర్యునివలె అగుచు, దక్షుఁడైనట్టి=కార్యము నిర్వహింపగలవాడైన, మకరాక్షుఁడు, ఆ క్షణంబ=ఆ క్షణంలోనే.

**తా :** ఏనుగులు గుఱ్ఱాలు రథాలు భటులతోను, దళసరైన పట్టుగొడుగులతోను, పటాహము మొదలయిన పెక్కువాద్యాలతోను, ఎన్నెన్నో ఆయుధాలతోను, వందిమాగధుల స్తోత్రాలతోను, ఎగురుతున్న బిరుదు

టెక్కాలతోను, పెక్కు కాహళములు శంఖాలు చేస్తున్న ధ్వనులతోను, మెఱిసిపోతున్న కొత్త చామరాలతోను, అష్టదిగ్గజాలు, ఆదివరాహము, శేషుడు, కూర్మము, కులపర్వతాలతో సహా ఈ భూమి అంతా కదిలిపోగా, భటులు గుర్రాలు రథాలు ఏనుగులు పదపదం పట్ల వేగాన దుమ్ము సూర్యుణ్ణి కప్పివేయగా కార్య నిర్వహణలో దిట్టయైన మకరాక్షుడు రావణుడు చెప్పగానే బయలుదేరాడు.

**విశే :** అష్టదిగ్గజాలు, ఆదివరాహము, ఆదిశేషుడు, ఆది కూర్మము ఈ భూమిని నిరంతరం మోస్తూ ఉంటాయి అని పురాణాలు చెప్తున్నవి.

**వ. ఇట్లు భయంకరంబుగా, గదలి వానరవీరులతోడం దలపడి పోరాడునెడ వానరబలంబులు తలచెడి పాఱుటగని రాజపుంగవుం డోహో వెఱవకుఁడని తనమఱువునకు మరలించి మకరాక్షుం దేఱి చూచి చండకాండముల తండంబులు ఖండించి హరుల శరంబులపాలుచేసి రథంబులను సారథులతోడం గూడఁ బృథ్విం గలిపి బలంబులఁ జలంబునం దఱిమి సింహనాదంబు చేసినం గినిసి మకరాక్షుం డిట్లనియె. 92**

**ప్రతి :** ఇట్లు, భయంకరంబుగాన్=భయమును కలిగించునట్లుగా, కదలి=ముందుకు సాగి, వానరవీరులతోడన్, తలపడి=ఎదిరించి, పోరాడునెడన్=పోరాడుచున్నపుడు, వానరంబులు, తలచెడి=భయపడి, పాఱుటగని=పాఱిపోవుట చూచి, రాజపుంగవుండు=రాజశ్రేష్ఠుడు శ్రీరాముడు, ఓహో, వెఱవకుఁడు=భయపడకండి, అని, తనమఱుఁగునకున్=తన చాటునకు, మరలించి=రప్పించి, మకరాక్షున్, తేఱిచూచి=సూటిగా చూచి, చండకాండములతండంబులు=వాడి బాణములతో సమూహములను, ఖండించి, హరులన్=గుఱ్ఱములను, శరంబులపాలుచేసి=బాణముల పాలు పడునట్లుచేసి, రథంబులను, సారథులతోడన్, కూడన్, పృథ్విన్ కలిపి=మట్టిలో కలిపి, బలంబులన్=సైనికులను, జలంబునన్ తఱిమి=నీటిలో ముంచి, సింహనాదంబు=సింహమువలె గర్జించగా, చేసినన్=చేయగా, కినిసి=కోపించి, మకరాక్షుండు, ఇట్లు, అనియె.

**తా :** ఈ విధంగా అతి భయంకరంగా వచ్చి వానరవీరులతో తలపడి పోరాడే సమయంలో వానరుల బలం ధైర్యాన్ని కోల్పోయి పారిపోవడం చూచి రాజశ్రేష్ఠుడైన శ్రీరాముడు–ఓహో–కంగారు పడకండి భయపడకండి అని తన చాటునకు మరలించాడు. మకరాక్షుణ్ణి తీక్షణంగా చూసి వాడి బాణాల పరంపరలతో గుంపుగా చంపి, గుఱ్ఱాలను బాణాలపాలుచేసి, రథాలను సారథులతో సహా మట్టిలో కలిపి సైన్యాన్ని పట్టుదలతో తరిమివేసి సింహనాదం చేయగా కోపగించిన మకరాక్షుడు ఇలా అన్నాడు.

**క. మా తండ్రి ఖరునిఁ జంపిన**
**నీతో యుద్ధంబు సేయ నేఁడిదె కలిగెన్**
**నా తీవ్ర నిశిత సాయక**
**పాతంబుల పాలొనర్తుఁ బగ దీఱ నినున్. 93**

**ప్రతి :** మా తండ్రి ఖరునిన్, చంపిన, నీతో, యుద్ధంబు, చేయ, నేఁడు, ఇదె, కలిగెన్=సమకూడినది, నా, తీవ్రనిశిత సాయక పాతంబుల=మిక్కిలి పదునైన, బాణాలు ప్రయోగించి,పాలొనర్తున్=పాలు చేస్తాను, నినున్, పగదీఱన్=పగతీరేలా.

**తా :** మా తండ్రి ఖరుణ్ణి చంపిన నీతో యుద్ధం చేసే అవకాశం దొరికింది ఈ రోజు. నిన్ను నా పగ తీరేలా పదునైన బాణాల పరంపరల పాలు చేస్తాను.

**మ. అని గర్వోక్తులు పల్కుచుం గెరలి తీవ్రాస్త్రంబు లా రాముపైఁ**
**దన బాహాబలశక్తి నేయఁ గని కోదండంబునం దప్పుచున్**
**వనజాప్తాన్వయుఁ డేసె వాని నఁట గీర్వాణుల్ ప్రశంసింపఁగా**
**దనుజుం డేసెను రామ భూవిభునిపైఁ దద్బాణజాలంబులన్. 94**

**ప్రతి :** అని, గర్వోక్తులు=గర్వముతో కూడిన మాటలు, పల్కుచున్, కెరలి=అతిశయించి, తీవ్రాస్త్రంబులు=శక్తివంతమైన అస్త్రాలను, ఆ రాముపైన్, తన బాహాబలశక్తిన్=భుజబలం కొద్దీ, ఏయన్=వేయగా, కని=చూచి, కోదండంబునన్=కోదండంబుతో, తప్పుచున్=తప్పించుకొనుచు, వనజాప్తాన్వయుఁడు=సూర్యవంశజుడు, ఏసె=వేసెను, వానిన్=మకరాక్షుని, అఁటన్=ఆకాశములో, గీర్వాణుల్=దేవతలు, ప్రశంసింపఁగా=మెచ్చునట్లుగా, దనుజుండు=రాక్షసుడు, రామభూవిభునిపైన్, తద్బాణ జాలంబులన్=ఆ బాణసమూహాన్ని, ఏసెను=వేశాడు.

**తా :** గర్వంగా మాట్లాడుతూ ఉత్సాహంతో శక్తివంతమైన బాణాలు భుజబలం కొద్దీ ప్రయోగించాడు మకరాక్షుడు. రాముడు ఆ బాణాలను తన కోదండంతో తప్పించుకుని దేవతలు మెచ్చే విధంగా మకరాక్షుని మీద బాణాలు వేశాడు. ఆ రాక్షసుడు ఆ బాణసమూహాన్ని రామునిపై వేసాడు.

**క. ఆ శరము లుడిపి మఱియొక**
**యాశుగమున వాని చాప మపుడు దునిమి యా**
**దాశరథి రథము పొడిగాఁ**
**గౌశలమున నేయ వాఁడు క్ష్మాస్థలి కుఱికెన్. 95**

**ప్రతి :** ఆ శరములు=ఆ బాణాలు, ఉడిపి=నాశనము చేసి, మఱియొక=వేరే, ఆశుగమున=బాణంతో, వాని, చాపము, అపుడు, తునిమి, ఆ దాశరథి=ఆ రాముడు, రథము పొడిగా=రథము పొడి అయ్యేలా, కౌశలమునన్=నేర్పుతో, ఏయన్=వేయగా, వాఁడు=మకరాక్షుడు, క్ష్మాస్థలికిన్=భూమి మీదకు, ఉఱికెన్= దుమికెను.

**తా :** మకరాక్షుడు వేసిన బాణాలు నాశనం చేసి, మరొక బాణంతో వానివిల్లు విరిచి ఆ రాముడు గొప్ప నేర్పుతో వాని రథం పొడిపొడి అయ్యేలా బాణం వేయగా మకరాక్షుడు భూమి మీదకు దూకాడు.

**ఆ. ధరకు నుఱికి దుష్టదైత్యుడు గదఁ ద్రిప్పి**
**భానుకులుని నేయ దానినొక్క**
**విశిఖముననె తునిమి వేగంబె విభుఁ డగ్ని**
**శరముఁ దొడిగి వానిశిరము ద్రుంచె. 96**

**ప్రతి :** ధరకున్=భూమిమీదకు, ఉఱికి=దుమికి, దుష్టదైత్యుఁడు=దుష్ట రాక్షసుడు, గదన్=గదను, త్రిప్పి, భానుకులునిన్=సూర్యవంశజుడయిన రాముని మీద, ఏయ=ప్రయోగించగా, దానిని, ఒక్క, విశిఖముననె= బాణంతోనే, తునిమి= ముక్కలు చేసి, వేగంబె=వేగముగ, విభుఁడు=రాముడు, అగ్నిశరమున్=అగ్నిబాణమును, తొడిగి=సంధించి, వాని=రాక్షసుని, శిరము, త్రుంచె=తెంపివేసెను.

**తా :** ఆ దుష్టరాక్షసుడు భూమిమీదకు ఉరికి గద తీసుకొని గిరగిరా తిప్పి రాముని మీద వేయగా దానిని ఒక్క బాణంతో రాముడు ముక్కముక్కలుగా చేసి వేగంగా అగ్ని బాణం ప్రయోగించి మకరాక్షుని శిరస్సు ఖండించాడు.

**క.** **ఆయెడ మకరాక్షుఁడు రిపు**
**సాయకములు దూఱ నాటి చచ్చుట విని దై**
**తేయుఁడు గుండెలు వగులఁగఁ**
**బాయని దుఃఖంబు పాలుపడి చింతిల్లెన్.** **97**

**ప్రతి :** ఆయెడ=అక్కడ, మకరాక్షుఁడు, రిపుసాయకములు=శత్రుని బాణాలు, తూఱ=పైబడి, నాటి= గుచ్చుకుని, చచ్చుట, విని, దైతేయుఁడు=రావణుడు, గుండెలు వగులఁగ=గుండెలు బ్రద్దలగునట్లు, పాయని= వీడని, దుఃఖము పాలుపడి=దుఃఖానికి వశమై, చింతిల్లెన్=శోకించెను.

**తా :** మకరాక్షుడు శత్రువుల బాణాలు గట్టిగా గుచ్చుకోవడం వల్ల చచ్చిపోవుట విని రావణుడు గుండెలు పగులగా వీడని దుఃఖంతో శోకించాడు.

**వ.** **ఇట్లు చింతాక్రాంతుండై కొంతతడ వూరకుండి మేఘనాదునిఁ గనుంగొనియె.** **98**

**ప్రతి :** చింతాక్రాంతుండై = దుఃఖముచేకూడినవాడై, కొంతతడవు = కొంతకాలము,

**తా :** ఇలా దుఃఖంతో కొంతసేపు ఏమీచేయక ఉండి మేఘనాదుని చూచి –

**క.** **అక్కట! నీవును నేనును**
**దక్కఁగ మఱి తక్కినట్టి దళములు దెగఁగా**
**నొక్క కపి యైన గానీ**
**యక్కడ రిపులందు నొచ్చిరనఁగా వింటే.** **99**

**ప్రతి :** అక్కట! అయ్యో!, నీవును, నేనును, తక్కగ=తప్ప, మఱి, తక్కినట్టి దళములు=తక్కిన సేనలు, తెగఁగాన్= చనిపోగా, ఒక్క కపియైన గానీ=ఒక్కకోతి అయినా, అక్కడ, రిపులందున్=శత్రువులలో, నొచ్చిరి=చచ్చిరి, అనగా, వింటే.

**తా :** అయ్యో! నువ్వు నేను తప్ప మన సేనలన్నీ చనిపోయాయి. మన శత్రుపక్షంలో ఒక్కకోతి అయినా చచ్చినట్లు విన్నావా?

వ. అదియునుంగాక. 100

**తా :** అదేకాకుండా -

## వానరుల బీరమును వినిన రావణుని బెగడుపాటు

సీ. నాగపాశంబున నాఁ డాజిలోఁ బడ్డ
  ప్లవగు లీరీతిని బ్రదుకు టెట్లు
బ్రహ్మాస్త్రమునఁ గూల్పఁబడి ధాత్రి యెడఁబాసి
  పోయిన కపులెల్లఁ బుట్టు టెట్లు
కుంభకర్ణుఁడు సావఁగొట్టిన వానరుల్
  చెచ్చెఱ జీవించి వచ్చుటెట్లు
అతికాయుఁ డడగించినట్టి కీశబలంబు
  క్రమ్మఱఁ దానెల్ల గలుగు టెట్లు

తే. రాముఁడెన్నంగ నాదినారాయణుండె
వనచరావళు లెల్ల దేవతల మున్నె
కానలేనైతి నీరీతిఁ గదనమునను
వారిగెలువంగ నెవ్వారి వశము చెపుమ. 101

**ప్రతి :** నాగపాశంబునన్=నాగపాశంతో, నాఁడు=ఆనాడు, ఆజిలోన్=యుద్ధంలో, పడ్డ=పడిపోయిన, ప్లవగులు=కోతులు, ఈ రీతిన్=ఈ విధముగా, బ్రతుకుట=జీవించుట, ఎట్లు=ఎలా జరిగింది. బ్రహ్మాస్త్రమునన్=బ్రహ్మాస్త్రముతో, కూల్పంబడి=కూల్చబడి, ధాత్రి=భూమిని, ఎడబాసిపోయిన=వదలిపోయిన (స్వర్గానికి పోయిన). కపులు, ఎల్లన్=అందరు, పుట్టుట=తిరిగిబ్రతికి, ఎట్లు=ఎలా, కుంభకర్ణుండు, చావన్, కొట్టిన, వానరుల్, చెచ్చెఱ=వేగంగా, జీవించి=బ్రతికి, వచ్చుట=రావడం, ఎట్లు, అతికాయుండు, అడగించినట్టి=చంపినట్టి, కీశబలంబు=వానరసైన్యము, క్రమ్మఱన్=తిరిగి, తానెల్లన్=వారందరూ, కలుగుట=ఉండుట, ఎట్లు?, రాముండు, ఎన్నంగన్=పరిశీలించగా, ఆదినారాయణండె=సాక్షాత్తూ నారాయణుడే, వనచరావళులు=కోతులు, ఎల్ల=అన్నీ, దేవతల=దేవతలే, మున్నె=ముందె, కానలేనైతిన్= తెలుసుకో లేకపోయాను. ఈ రీతి=ఈ విషయము, కదనమునను=యుద్ధంలో, వారిన్, గెలువంగన్, ఎవ్వారి=ఎవరి, వశము=శక్యము, చెపుమ=చెప్పుము.

**తా :** నాగాస్త్రంతో యుద్ధంలో పడిపోయిన వానరులు ఇలాఎలా బ్రదికారు. బ్రహ్మాస్త్రం ప్రయోగించడంతో చనిపోయిన కోతులన్నీ ఎలా పుట్టుకొచ్చాయి. కుంభకర్ణుడు చావగొట్టిన కపివీరులందరు ఇలా వేగంగా జీవించి ఎలావచ్చారు. అతికాయుడు చంపిన వానరబలమంతా మళ్లీ ఎలా వచ్చింది. చూడబోతే ఈ రాముడు సాక్షాత్తూ ఆ ఆదినారాయణుడే, కపులందరూ దేవతలే. ఈ సంగతి ముందుగా తెలుసుకోలేక పోయాను. యుద్ధరంగంలో వారిని గెలవడం ఎవరి చేతనవుతుంది-చెపుమా!

## ఇంద్రజిత్తు మాయా సమరము

వ. అని దీనాలాపంబు లాడుచున్న తండ్రికి నమస్కరించి మేఘనాదుండు మేఘగంభీర వాక్యంబుల దుఃఖోపశమనంబు చేసి నేఁటితోడఁ బగ సాధింతునని ప్రాగల్భ్యంబుగఁ బలికి యనిపించుకొని గజ వాజి శతాంగాదు లగు చతురంగబలంబులు గూర్చుకొని ఛత్రచామరంబులు పిక్కటిల్ల నట్టహాసంబు సేయుచు లంకాపురంబు వెడలి సంగ్రామరంగంబునకుం జని తన బలంబులఁ జక్రాకారంబుగా నిలిపి తన్మధ్యంబున రథావతరణంబుచేసి రక్తాంబర గంధమాల్యంబులు ధరించి లోహపాత్రంబునఁ గృష్ణసర్ప రక్తంబు నించి తర్పణము చేయుచుఁ దద్విధియుక్తంబైన హోమంబులు సేయుచుండు నెడ నొక కృత్తి ప్రత్యక్షంబై నిలిచి మెచ్చితి వరం బిచ్చెద వేఁడు మనిన నతండు తా నాకసంబున నుండి భండనంబు సేయునెడఁ గపులకుం గానరాకుండ నంధకారంబు గావించిన నేను వారిని జయింతునని ప్రార్థించిన నియ్యకొనియె నంత మేఘనాదుండు నభంబున కెగసి మహాంధకార బాణంబు వ్రేసిన దానంజేసి పెంజీకటిం గప్పినఁ జీకాకై పాఱుచున్న వానరులంగని వాయునందనుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె. **102**

**ప్రతి :** అని, దీనాలాపములు+ఆడుచున్న=దీనమైన మాటలు మాట్లాడుతున్న తండ్రికి, నమస్కరించి, మేఘగంభీర వాక్యములు=మేఘము ఉఱిమినట్లు గంభీరమైన వాక్యములతో, దుఃఖోపశమనంబుచేసి= దుఃఖాన్ని తగ్గించి, నేటితోడన్=ఈ రోజుతో, పగసాధింతునని=పగసాధిస్తానుఅని, ప్రాగల్భ్యంబుతో=గర్వంతో, పలికి, అనిపించుకొని=సరే అనిపించుకుని, గజవాజిశతాంగంబులగు=ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలతోకూడి, చతురంగ బలంబులు=రథగజవాజి పదాతి–దళాలు చతురంగ బలాలు. కూర్చుకుని=సమీకరించుకుని, ఛత్రచామరంబులు=గొడుగులు చామరాలు, పిక్కటిల్లన్=ఆ ప్రదేశమంతా నిండి, అట్టహాసంబు=గట్టిగా శబ్దం వచ్చేలా నవ్వుతూ, లంకాపురంబు వెడలి=లంక నుండి బయలుదేరి, సంగ్రామ రంగంబునకున్= యుద్ధరంగాన్ని, చని, తనబలంబులన్, సైన్యాన్ని చక్రాకారంబుగా=చక్రము వలె గుండ్రని ఆకారంతో, నిలపి=నిలబెట్టి, తన్మధ్యంబున=దాని మధ్యలో, రథావతరణంబుచేసి=రథము దిగి, రక్తాంబరగంధ మాల్యంబులు=ఎఱ్ఱని, బట్టలు, గంధము, పూలమాలలు, ధరియించి=వేసుకొని, లోహపాత్రంబున=రాగి గిన్నెలో, కృష్ణసర్పరక్తంబు=నల్లత్రాచురక్తము, నించి=నింపి, తర్పణంబుచేయుచు=సమర్పించుచు, తద్విధి యుక్తంబైన=ఆకార్యమునకు చెప్పబడిన చేయవలసిన, హోమంబులు=అగ్నిహోత్రుని పూజలు, చేయుచుండు నెడ=చేస్తున్న సమయంలో, ఒక కృత్తి=హోమము చేయుటవలన పుట్టిన దేవతామూర్తి, ప్రత్యక్షంబై, నిలిచి, మెచ్చితి, వరంబు, ఇచ్చెద, వేఁడుము, అనిన, అతండు, తాను, ఆకసంబున నుండి=ఆకాశంలోఉండి, భండనము=యుద్ధము, చేయునెడన్=చేసేటప్పుడు, కపులకున్, కానరాకుండ=కనిపించకుండ, అంధకారంబు గావించిన=చీకటిగా చేసినట్లయిన, నేను, వారిని, జయింతునని, ప్రార్థించినన్, ఇయ్య కొనియె= ఒప్పుకొనెను; మహాంధకార బాణంబు=భయంకరమైన చీకటిని కలగజేసే బాణం, వ్రేసిన, దానంజేసి=దానివల్ల, పెంజీకటిన్=చిక్కని చీకటి, కప్పిన=కప్పగా, చీకాకై=కంగారుపడి, పాఱుచున్న=పరుగెత్తుచున్న, వానరులన్, కని, వాయునందనుడు శ్రీరామచంద్రునితో నిట్లనియె.

**తా :** నీరస వచనాలు పల్కుతున్న తండ్రికి నమస్కరించి మేఘనాదుడు తండ్రి దుఃఖాన్ని పోగొట్టి, ఈ రోజుతో నేను శత్రువును సాధిస్తాను అని అతిశయంతో పలికాడు. తండ్రి చేత సరే వెళ్లు అనిపించుకుని గజ వాజి శతాంగాదులయిన చతురంగ బలాలు కూర్చుకుని ఛత్రచామరాలు నిండిపోగా గట్టిగా నవ్వుతూ రణరంగానికి వచ్చాడు. తన సైన్యాన్ని చక్రాకారంగా తీర్చి తన రథాన్ని ఆ మధ్యలోకి తెచ్చి రథం దిగి-ఎఱ్ఱని బట్టలు కట్టుకుని, ఎఱ్ఱనిగంధం పూసుకుని ఎఱ్ఱని పూలమాలలు వేసుకుని, ఎఱ్ఱని రాగి గిన్నెలో నల్లత్రాచు పాము రక్తం నింపి తర్పణం చేస్తూండగా ఆ హోమగుండం నుండి ఒక దేవత ప్రత్యక్షమైనది. నీ హోమానికి మెచ్చాను వరం కోరుకోమన్నది. నేను ఆకాశంలో ఉండి యుద్ధం చేస్తూండగా కపులకు నేను కనపడకుండా చీకటిమయం చేయి-నేను అప్పుడు వారిని జయిస్తాను అని కోరాడు. ఆ కృత్య సరే అంది మేఘనాదుడు ఆకాశంలోకి ఎగిరి మహాంధకార బాణం ప్రయోగించాడు. ఆ ప్రదేశమంతా గొప్ప చీకటి అలముకుని చిమ్మచీకటి అయిపోయింది. కోతులు కంగారుపడుతూ పరిగెత్తసాగాయి. అలా పారిపోతున్న వానరులను చూచి హనుమ శ్రీరామునితో ఇలా అన్నాడు.

**క. వాయవ్యాస్త్రము చేతను**
**బాయును జు మ్మంధకారబాణ విశేషం**
**బీయెడ నేయుఁడు శ్రీరఘు**
**నాయక! యని విన్నవింప నవ్వుచు నంతన్. 103**

**ప్రతి :** వాయవ్యాస్త్రము=వాయు సంబంధమైన అస్త్రము, చేతను, పాయును=పోవును, చుమ్ము=సుమా, అంధకారబాణ విశేషంబు=ఈ చీకటిని వ్యాపింప చేసిన బాణశక్తి, ఈ యెడన్=ఇప్పుడు, ఏయుఁడు=వెయ్యండి, శ్రీరఘునాయక!=ఓ శ్రీరామ!, అని, విన్నవింప=చెప్పగా, నవ్వుచున్, అంతన్.

**తా :** హనుమ ఓరామచంద్రా! ఈ అంధకార బాణశక్తి వాయవ్యాస్త్రం ప్రయోగిస్తే పోతుంది సుమా, మీరు ఇప్పుడు ఆ అస్త్రం ప్రయోగించండి అని చెప్పగా రాముడు నవ్వుతూ -

**క. విల్లెక్కు పెట్టి మారుత**
**భల్లము సంధించి తివిచి పార్థివుఁ డలుకన్**
**బెల్లార్చి యేసె గగనం**
**బెల్లను వడిఁ దూల దైత్యుఁ డిలపైఁ గూలన్. 104**

**ప్రతి :** విల్లు, ఎక్కువెట్టి, మారుతభల్లము=వాయువ్యాస్త్రము, సంధించి, తివిచి=లాగి, పార్థివుఁడు=రాజు, అలుకన్=కోపముతో, పెల్లార్చి=గట్టిగా అరచి, ఏసె, గగనంబు=ఆకాశము, ఎల్లను=అంతా, వడిన్=వేగముగా, తూల= తూలిపోగా, దైత్యుఁడు=రాక్షసుడు, ఇలపై=భూమిమీద, కూలన్=కూలగా -

**తా :** రాముడు కోపంతో విల్లు ఎక్కుపెట్టి వాయవ్యాస్త్రాన్ని సంధించి లాగి ప్రయోగించగా, ఆకాశమంతా తూలిపోయింది. దైత్యుడు నేలమీద పడ్డాడు.

**ఆ. రాజతిలకుఁ డంబరమ్మున కెగయంగ**
**వాయుశరముఁ దొడిగి వ్రేయఁ దడవె**
**మాయశక్తి దొలఁగి పోయిన నంతలో**
**మేఘనాదుఁ డుర్వీమీఁదఁ బడియె. 105**

**ప్రతి :** రాజతిలకుఁడు=రాజశ్రేష్ఠుడు, అంబరమ్మునకు=ఆకాశానికి, ఎగయంగ=పైకి వెళ్లగా, వాయుశరమున్=వాయు బాణమును, తొడిగి=సంధించి, వ్రేయన్=వేసిన, తడవె=వెంటనే, మాయశక్తి= హోమంచేసి సంపాదించిన మాయశక్తి, తొలఁగిపోయినన్=విచ్చిపోగా, అంతలో, మేఘనాదుఁడు, ఉర్వీమీఁదన్=భూమి మీద పడ్డాడు.

**తా :** రాజతిలకుడయిన శ్రీరాముడు వాయు బాణం తొడిగి ఆకాశంపైకి వెళ్లేలా వేసీవెయ్యగానే మాయాశక్తి విచ్చిపోయింది. అంతలో మేఘనాదుడు భూమిమీద పడ్డాడు.

**చ. పడియును మేఘనాదుఁడు సుపర్వులు బెగ్గిల నుగ్రబాణముల్**
**తొడిగి ప్లవంగ సేనపయిఁ దోరముగా నడరింప నంతటన్**
**బెడబెడ నార్చి మారుతివిభీషణు లుగ్రత దానవావళిన్**
**బొడిపొడి సేయ లక్ష్మణుఁడు పూనిక నాతనిఁ దాఁకె నార్చుచున్. 106**

**ప్రతి :** పడియును,మేఘనాదుఁడు, సుపర్వులు=దేవతలు, బెగ్గిలన్=భయపడునట్లు, ఉగ్రబాణముల్= భయంకరమైనబాణాలు, తొడిగి, ప్లవంగసేనపయిన్=వానరసేన మీద, తోరముగా=అధికముగా, అడరింపన్= ప్రయోగించగా, అంతటన్, బెడబెడన్=బెడబెడమని, ఆర్చి=అరచి, మారుతి=హనుమ, విభీషణులు, ఉగ్రతన్=కోపంతో, దానవావళిన్=రాక్షసులవరుసలను, పొడిపొడిసేయ=పొడిపొడిగాచేయ, లక్ష్మణుఁడు, పూనికన్=ప్రయత్నముతో, ఆతని=మేఘనాదుని, ఆర్చుచున్=గట్టిగా అరుస్తూ, తాఁకెన్=ఎదుర్కొనెను.

**తా :** మేఘనాదుడు అలా పడినప్పటికి దేవతలు భయపడే విధంగా భయంకర మైన బాణాలు వానరసేనమీద అధికంగాప్రయోగించాడు. అప్పుడు హనుమంతుడు, విభీషణుడు బెడబెడమని బొబ్బలుపెట్టి కోపంతో రాక్షససమూహాల్ని పొడిపొడి చేసారు. లక్ష్మణుడు ప్రయత్నపూర్వకంగా మేఘనాదుని మీదకు అరుస్తూ వెళ్లాడు.

**క. అంతట దానవసేనలు**
**పంతము చెడి తలలు వీఁడ బాఱం గని తా**
**నెంతయు వెఱవకుఁ డనుచును**
**గుంతము ద్రిప్పుచును దైత్యకుంజరుఁ డంతన్. 107**

**ప్రతి :** అంతటన్, దానవసేనలు=రాక్షససేనలు, పంతముచెడి=పట్టుదల కోల్పోయి, తలలువీఁడన్= జుట్టుముడులు వీడిపోగా, పాఱన్=పరుగెత్తగా, కని=చూచి, తాను=మేఘనాదుడు, ఎంతయు=ఎంతగానో,

వెఱవకుఁడు=భయపడకండి, అనుచును=అంటూ, కుంతమున్=కత్తిని, త్రిప్పుచును, దైత్యకుంజరుఁడు=రాక్షస శ్రేష్ఠుడు, అంతన్ –

**తా :** రాక్షస సేనలు పట్టుదల కోల్పోయి జుట్టుముడులు వీడిపోగా పరుగెత్తి పోవడం చూసి మేఘనాదుడు భయపడకండి అంటూ ఎంతగానో చెప్పి కత్తి త్రిప్పుతూ ఉండగా.

## లక్ష్మణునిచే నింద్రజిత్తు సంహారము

**శా.** **సౌమిత్రిం గని గర్వమొప్పఁ బలికెన్ శౌర్యంబు సంధిల్లఁగా**
**నామీఁదం బఱపింప వచ్చితివె నా నాగాస్త్రసంఘంబులన్**
**నే మిమ్మందఱిఁ గట్టుటల్ మఱచితే నేఁడైనఁ జింతింపుమీ**
**నీ మా సత్త్వ విశేషమెల్ల మదిలో నిక్కంబుగా లక్ష్మణా.** **108**

**ప్రతి :** సౌమిత్రిన్, కని, గర్వము, ఒప్పన్, పలికెన్, శౌర్యంబు=పరాక్రమం, సంధిల్లఁగాన్=కూడగా, నా మీఁదన్, పఱపింప వచ్చితివె=ప్రయోగించవచ్చావా?, నా=నాయొక్క, నాగాస్త్రసంఘంబులన్=నాగాస్త్ర సమూహాలతో, నే=నేను, మిమ్మందఱన్=మిమ్మల్ని అందరినీ, కట్టుటల్=కట్టివేయుట, మఱచితే=మరచి పోయావా, నేఁడు, ఐనన్=ఈరోజు నైనా, నీమా=నీయొక్క మా యొక్క, సత్త్వ విశేషమెల్ల=బలం సగంతి అంతా, మదిలో=మనస్సులో, నిక్కంబుగా=నిజంగా, చింతింపుమీ=ఆలోచించు కొనుము, లక్ష్మణా!

**తా :** లక్ష్మణుని చూసి మేఘనాదుడు గర్వంతో “పరాక్రమంతోడై యుండగ వచ్చావా? నేను మీ అందరినీ నాగాస్త్రంతో కట్టిపడేసింది, మఱిచిపోయావా? నీ బలమెంతో మా బలమెంతో, నిజమేమిటో ఎంతో ఒక్కసారి ఈనాడైనా ఆలోచించుకో లక్ష్మణా!” అన్నాడు.

**వ.** **అని బాణ ప్రయోగంబు సేసిన.** **109**

**ప్రతి :** బాణ ప్రయోగంబు = బాణమును వేయగ

**తా :** ఆ విధముగ పలికి బాణము ప్రయోగించగా.

**క.** **వానిని బ్రతిశరములు దాఁ**
**బూనిక సంధించి త్రుంచి భుజబలశక్తిన్**
**దానవుని మూర్ఛపుచ్చెను**
**భానుకులుం డంత నొక్కబాణము చేతన్.** **110**

**ప్రతి :** వానిని, ప్రతిశరములు=అతడు ప్రయోగించిన బాణాలకు జవాబుగా బాణాలు, తాన్, పూనిక సంధించి=శ్రద్ధతో సంధించి, త్రుంచి=ఖండించి, భుజ బలశక్తిన్=భుజబలశక్తితో, దానవుని=రాక్షసుని, అంతన్ ఒక్క బాణముచేతన్=ఒక బాణముతో, భానుకులుండు=సూర్య వంశజుడయిన లక్ష్మణుడు, మూర్ఛపుచ్చెను=మూర్ఛపడ వేసెను,

**తా :** లక్ష్మణుడు, మేఘనాదుని శరాలకు ప్రతిశరాలు శ్రద్ధతో సంధించి ఖండించాడు. తన భుజబలముతో శక్తితో ఒక్క బాణంతో ఆ రాక్షసుని మూర్ఛపడ వేసాడు.

**ఆ.** **ఇంద్రజిత్తుఁ దప్పు డినకులోద్భవునిచే**
**మూర్ఛనొంది తెలిసి మూర్ఖగతిని**
**భాసమాన మైన బాణత్రయంబున**
**నతని నొవ్వనేసి యార్చెనంత.** **111**

**ప్రతి :** ఇంద్రజిత్తుఁడు, అప్పుడు, ఇనకులోద్భవునిచే=లక్ష్మణునిచే, మూర్ఛనొంది, తెలిసి=తేరుకుని, మూర్ఖగతిని=మూర్ఖునివలె, భాసమానమైన=ప్రకాశవంతమైన, బాణత్రయంబునన్=మూడు బాణాలతో, అతనిన్=లక్ష్మణుని, నొవ్వనేసి=నొప్పించు నట్లువేసి, ఆర్చెను=అరచెను, అంత.

**సీ.** **సౌమిత్రి తా వానిచాపంబు నడిమికి**
**ఘనతరాస్త్రంబుచేఁ దునుఁగ నేసి**
**పదిబాణములు వానిబాహుమధ్యంబునఁ**
**గాటంబుగా వడి నాట నేసి**
**తురగంబులను నాల్గు తూపులఁ దునుమాడి**
**సారథి నొక్కట సంహరించి**
**శరవృష్టిఁ గప్పిన సురవైరి కోపించి**
**కాద్రవేయాస్త్రసంఘంబు లేయ**

**తే.** **గరుడశరమునఁ దునిమి లక్ష్మణుఁడు కినిసి**
**వడిఁ గుబేరాస్త్ర మతనిపై వైచె నసుర**
**దానిఁ దునుమాడి వేగ నైంద్రాస్త్ర మేసె**
**నరవరుఁడు దాని యామ్యబాణమునఁ ద్రుంచె.** **112**

**ప్రతి :** సౌమిత్రి, తా=తాను, వాని చాపంబు=మేఘనాదుని చాపము, ఘనతరాస్త్రంబుచేన్=ఘనమైన అస్త్రంతో, నడిమికి=మధ్యకు, తునుఁగన్=ముక్కలగునట్లు, ఏసెను=ప్రయోగించెను, పదిబాణములు, వాని, బాహుమధ్యంబునన్=భుజము మధ్యలో, గాటంబుగా=తీక్షణంగా, వడి=వేగంగా, నాటన్=నాటు కొనునట్లు, ఏసె=వేసెను, తురగంబులను=గుఱ్ఱాలను, నాల్గుతూపులన్=నాల్గుబాణాలతో, తునుమాడి=విరచి వేసి, సారథిన్, ఒక్కట=ఒకదానితో, సంహరించి=చంపి, శరవృష్టిన్=బాణాల వర్షంతో, కప్పిన=కప్పివేయగ, సురవైరి=దేవతల శత్రువైన మేఘనాదుడు, కాద్రవేయాస్త్ర సంఘంబు=నాగాస్త్ర సమూహాల్ని, ఏయ=వేయగా, కాద్రవేయులు= కద్రువ పుత్రులు=నాగులు, కద్రువకొడుకులు కనుక కాద్రవేయులు, గరుడశరమునన్=గరుడాస్త్రంతో, తునిమి=విరిచి, లక్ష్మణుఁడు, కినిసి=కోపించి, వడిన్=వేగముగా, కుబేరాస్త్రము, అతనిపై, వైచె, అసుర=

మేఘనాదుడు, దానిన్, తునుమాడి=ఖండించి, వేగన్, ఐంద్రాస్త్రమేసె, నరవరుఁడు=లక్ష్మణుడు, దానిని, యామ్య బాణమునన్=యముని సంబంధమైన బాణముతో, త్రుంచె.

**తా :** సౌమిత్రి మేఘనాదుని విల్లును వాడి అయిన బాణాలతో నడిమికి విరిచేసాడు. అయిదు బాణాలతో వాని భుజాలమధ్య గట్టిగా నాటుకునేలా వేసాడు. నాల్గు బాణాలతో గుఱ్ఱాలను చంపి, సారథిని ఒక్క బాణంతో చంపాడు. బాణవృష్టి కురిపించి కప్పివేసాడు. మేఘనాదుడు కోపించి నాగాస్త్రాలు ప్రయోగించగా గరుడాస్త్రంతో దాన్ని తునుమాడి, కోపంతో రాక్షసుని మీద కుబేరాస్త్రం ప్రయోగించాడు, అసురుడు దాన్ని తునిమి ఐంద్రాస్త్రం వేసాడు. నరశ్రేష్ఠుడయిన లక్ష్మణుడు దాన్ని యామ్య బాణంతో విరిచేసాడు.

**వ. ఇట్లు త్రుంచిన. 113**

**తా :** ఇలా విరిచేయగా..

**క. వరుణాస్త్రంబును నేసెను**
**సురరాజవిరోధి రాజసూనుని మీఁదన్**
**గర మలిగి రామునోదరుఁ**
**దరుదారఁగ దాని ద్రుంచె నైంద్రాస్త్రమునన్. 114**

**ప్రతి :** సురరాజ విరోధి=రాక్షసుడు, రాజసూనుని మీదన్=రాజ కుమారుడు లక్ష్మణుని మీద, వరుణాస్త్రంబునున్=వరుణాస్త్రమును, ఏసెను=వేసెను, కరము=మిక్కిలి, అలిగి=కోపించి, రాము సోదరుఁడు=రాముని తమ్ముడు, అరుదారగన్=విశేషముగా, ఐంద్రాస్త్రమునన్=ఐంద్రాస్త్రముతో, త్రుంచెన్.

**తా :** మేఘనాదుడు లక్ష్మణుని మీద వరుణాస్త్రం వేసాడు. దానికి మిక్కిలి కోపించిన రాముని తమ్ముడు ఐంద్రాస్త్రముతో అవలీలగా దానిని త్రుంచాడు.

**వ. మఱియును. 115**

**తే. కనలి దానవుఁ డతనిపై గంధపుష్ప**
**సమితి నొప్పెడు గంధర్వశరముఁ దొడిగి**
**వ్రేయఁ గోపించి దశరథోర్వీపసుతుఁడు**
**ఖండశశిబాణమున దాని గండడంచె. 116**

**ప్రతి :** కనలి=మండిపడి, దానవుఁడు=మేఘనాదుడు, అతనిపై=లక్ష్మణునిపై, గంధపుష్ప సమితిన్=గంధము పుష్పముల సమూహముతో, ఒప్పెడు=అందంగా గల, గంధర్వశరమున్=గంధర్వము అనే బాణాన్ని, తొడిగి= పూన్చి, వ్రేయన్=వేయగా, కోపించి, దశరథోర్వీప సుతుఁడు=లక్ష్మణుడు దశరథమహారాజు కొడుకు, ఖండశశిబాణమునన్=అర్ధచంద్రాస్త్రముతో, దాని=గంధర్వాస్త్రము యొక్క, గండు=శక్తిని, అడంచె=తగ్గించెను.

**తా :** మేఘనాదుడు మండిపడి గంధపుష్పాలతో కూడిన గంధర్వాస్త్రాన్ని లక్ష్మణుని మీద ప్రయోగించాడు. అది చూచి కోపగించిన లక్ష్మణుడు అర్ధచంద్ర బాణాన్ని ప్రయోగించి గంధర్వ బాణశక్తిని నశింపచేసాడు.

**వ. ఇట్లు గంధర్వ శరంబును ద్రుంచి యంతటం బోవక దేవేంద్రదత్తంబైన భుజగాస్త్రంబు వింట సంధించి వేదంబులు నిత్యంబగునేని రామచంద్రుండు ధర్మాత్ముండేని యింద్రాదిబృందారక ద్రోహి యైన యింద్రజిత్తునిశిరంబు నీ శరంబు ద్రుంచుంగాక! యని వానిపై లక్ష్యంబు చేసి ప్రత్యాలీఢపాదస్థుండై నిలిచి కర్ణాంతంబుగాఁ దిగిచి యేసిన నదియును గాలానలాభీల జ్వాలాజాలంబు లుప్పతిల్ల గగనంబునం బఱతెంచి యక్కఱకురక్కసుని శిరంబుఁ ద్రుంచిన. 117**

**ప్రతి :** ఇట్లు, గంధర్వశరంబును=గంధర్వ బాణమును, త్రుంచి=ముక్కలుజేసి/తెగగొట్టి, అంతటన్=అంతటితో, పోవక=ఆగక/వెళ్ళక, దేవేంద్ర దత్తంబైన=దేవేంద్రుడిచ్చిన, భుజగాస్త్రంబు=నాగాస్త్రమును, వింటన్= విల్లునందు, సంధించి=ఎక్కుపెట్టి, వేదంబులు, నిత్యంబు అగునేని=శాశ్వతము అయినచో, రామచంద్రుండు, ధర్మాత్ముండేని=ధర్మస్వరూపుడే అయినచో, ఇంద్రాది బృందారకద్రోహియైన=ఇంద్రుడు మొదలగు దేవతలకు ద్రోహియైన, ఇంద్రజిత్తుని శిరంబున్=ఇంద్రజిత్తు యొక్క తలను, ఈ శరంబు=ఈ బాణము, త్రుంచుంగాక!= ఖండించుగాక! అని వారిపై, లక్ష్యంబుచేసి=గురిపెట్టి, ప్రత్యాలీఢపాదస్థుండై=ఎడమ పాదము ముందుకు పెట్టి నిలుచున్నవాడై, నిలిచి=నిలబడి, కర్ణాంతరంబుగాన్=చెవి చివరివరకు, తిగిచి=లాగి, ఏసినన్=వేయగా, అదియును, కాలానలాభీలజ్వాలాజాలంబులు=ప్రలయకాలపు అగ్నివలె భయంకరమైన జ్వాలల సమూహములు, ఉప్పతిల్లన్=వెలువడగా, గగనంబునన్=ఆకాశములో, పఱతెంచి=ప్రయాణించి, అక్కఱకు (ఆ+కఱకు) రక్కసుని శిరంబున్=ఆ కఠినాత్ముడగు రాక్షసుని తలను, త్రుంచినన్=ఖండించగా...

**తా :** ఈ విధంగా గంధర్వశరాన్ని విరిచి అంతటితో ఆగక దేవేంద్రుడు ఇచ్చిన నాగాస్త్రాన్ని వింటికి కూర్చి వేదము నిత్యంబు అయినట్లయితే, రామచంద్రుడు ధర్మాత్ముండే అయినట్లయితే, ఇంద్రాది దేవతల ద్రోహి అయిన ఇంద్రజిత్తుని తలను ఈ నా శరము త్రుంచుగాక! అని అంటూ మేఘనాదుని లక్ష్యంగా చేసి ప్రత్యాలీఢ పాదస్థుండై నిలబడి, చెవిదాకా నారినిలాగి లక్ష్మణుడు బాణం ప్రయోగించాడు. అది ప్రళయకాలం నాటి భయంకరమైన అగ్నిలా మండుతూ ఆకాశంలో మేఘనాదుని శిరస్సు ఖండించగా,

**విశే :** ప్రత్యాలీఢ పాదస్థుడు=బాణప్రయోగం చేసేటప్పుడు ఎడమకాలు ముందుకు పెట్టి కుడికాలు వెనుకకు పెట్టి ఉంటే దాన్ని ప్రత్యాలీఢ పాదము అంటారు.

**క. కనుఁగొని దేవత లందఱుఁ**
**దనుఁ బొగడఁగ మరలి రాము తమ్ముఁడు విజయం**
**బున వచ్చి మ్రొక్క నాతని**
**మనుజేంద్రుఁడు కౌఁగిలించి మఱి యిట్లనియెన్. 118**

**ప్రతి :** కనుఁగొని=చూచి, దేవతలు, అందఱు, తనున్=తనను, పొగడఁగ= స్తుతింపగ, మరలి=యుద్ధరంగము నుండి మరలి, రాముని తమ్ముడు=లక్ష్మణుడు, విజయంబున=విజయముతో, వచ్చి మ్రొక్కన్=వచ్చి నమస్కరించగా, ఆతనిన్=ఆ లక్ష్మణుని, మనుజేంద్రుడు=శ్రీరాముడు, కౌఁగిలించి, మఱి, ఇట్లనియెన్.

**తా :** దేవతలందరూ మేఘనాదవధను చూచి తనను స్తుతించగా లక్ష్మణుడు యుద్ధరంగం నుండి విజయుడై వచ్చి రామునికి సమస్కరించగా ఆ లక్ష్మణుని శ్రీరాముడు కౌగలించుకుని ఇలా అన్నాడు.

**క. నీచేత వీఁడు త్రుంగుట**
**భూచక్రంబెల్ల మేలు పొందెను వినుమీ**
**నా చేత దశముఖుండును**
**నీచుఁడు తెగుఁటెల్ల నిజము నిర్మలచరితా! 119**

**ప్రతి :** నీచేత, వీఁడు=ఈమేఘనాదుడు, త్రుంగుట=చనిపోవుట, భూచక్రంబెల్ల=ఈ భూలోకమంతా, మేలుపొందెను=ఉపకారంపొందింది, వినుమీ, నాచేత, దశముఖుండును=రావణుడు,నీచుఁడు, తెగుఁటెల్ల= చనిపోవుట, నిజము, నిర్మల చరితా!=స్వచ్ఛమైన చరిత్ర కలవాడా! లక్ష్మణా!

**తా :** ఓ నిర్మల చరితుడా! లక్ష్మణా! నీచేత ఈ మేఘనాదుడు చనిపోవడం వల్ల భూలోకమంతా మేలు పొందింది. అలాగే నీచుడైన దశముఖుడు నా చేతిలో చనిపోవడం నిజము-వినుమీ!

**వ. ఇట్లు సౌమిత్రిచేత నింద్రజిత్తు తెగెనని చెప్పిన నారదుని వాల్మీకి మహామునీంద్రుం డటమీఁదికథావిధానం బెట్టి దనియడుగుటయు. 120**

**తా :** ఇలా సౌమిత్రి చేతిలో ఇంద్రజిత్తు చనిపోయాడని చెప్పిన నారదునితో వాల్మీకి మహర్షి ఆ తరువాతి కథావిధానం ఎట్టిది అని అడుగగా -

### ఆశ్వాసాంత పద్య గద్యములు

**క. జలజాక్ష! భక్త వత్సల!**
**జలజాసన వినుత పాద జలజాత! సుధా**
**జలరాశి భవ్య మందిర**
**జలజాకర చారు హంస! జానకి నాథా! 121**

**గద్యము :** **ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద సూరి జన వినుత కవితా చమత్కారాతుకూరి కేసనసెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబునందు యుద్ధకాండమునం బ్రథమాశ్వాసము.**

* * *

# యుద్ధకాండ

## ద్వితీయాశ్వాసము

**క. అమలిన శుభచారిత్రా!**
**కమలదళ సమాననేత్ర! కౌశికమిత్రా!**
**ద్యుమణికులవార్ధిసోమా!**
**సమదాసురజనవిరామ! జానకిరామా! 1**

**ప్రతి :** అమలిన=స్వచ్ఛమైన, శుభచారిత్రా!=శుభప్రదమైన చరిత్రకలవాడా!, కమలదళ సమాన నేత్ర!=తామర రేకులవంటి నేత్రములు కలవాడా!, కౌశిక మిత్రా!=విశ్వామిత్రుని మిత్రుడా!, ద్యుమణికులవార్ధి సోమా!= సూర్యవంశ సముద్రమునకు చంద్రుడా, సమదాసురజన విరామ!=మదించిన రాక్షసులను సంహరించిన వాడా!, జానకిరామా!=జానకీపతియైన రామా!

**తా :** స్వచ్ఛమైన శుభచారిత్రుడా! తామర రేకుల వంటి కన్నులవాడా! కౌశికమిత్రా! సూర్యవంశసముద్రమునకు చంద్రుడా! మదించిన రాక్షసులను సహరించినవాడా! జానకీరామా!

**వ. శ్రీనారదమహామునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెఱంగెఱింగించెద నాకర్ణింపు మట్లు. 2**

**ప్రతి :** ఎఱింగించిన = చెప్పిన, తెఱంగు = విధము, ఆకర్ణింపుము = వినుము

**తా :** శ్రీనారదమహామునీశ్వరుడు వాల్మీకిమహర్షికి చెప్పినవిధంగా చెప్తాను విను.

### ఆహవ రంగమునకు రావణాగమనము

**ఆ. చారు లరుగుదెంచి సౌమిత్రిచే నింద్ర**
**జిత్తుఁ డీల్గె ననుచు జెప్పుటయును**
**బంక్తిముఖుఁడు సుతునిఁ బలుమాఱు తలఁచుచు**
**వగవఁ జొచ్చె నెల్లవారు వినఁగ. 3**

**ప్రతి :** చారులు, అరుగుదెంచి=వచ్చి, సౌమిత్రిచేన్, ఇంద్రజిత్తుఁడు, ఈల్గెన్=చనిపోయెను, అనుచున్, చెప్పుటయును, పంక్తిముఖుఁడు=రావణుడు, సుతుని= కొడుకుని, పలుమాఱున్=అనేకసార్లు, తలఁచుచున్, ఎల్లవారున్=అందరూ, వినఁగ, వగవన్=దుఃఖపడ, చొచ్చెన్=ఆరంభించెను.

**తా :** చారులు, వచ్చి ఇంద్రజిత్తు సౌమిత్రిచేత చంపబడ్డాడు అని చెప్పగా రావణుడు కుమారుని పలుమాఱు తలచుకుని అందరూవినేలా దుఃఖించ సాగాడు,

**విశే :** పంక్తిముఖుఁడు=పదిముఖములు కలవాడు.

**వ. ఇట్లనేక ప్రకారంబులఁ గుమారుం బలవరించుచు దుఃఖించుచుఁ గొంత తడవున కూఱడిల్లి ధైర్యంబు నూలుకొల్చి తనకుమారుం జంపినవానిని నేఁ డవశ్యం బును సంగ్రామ రంగంబునఁ జంపుదు నని నియమంబు చేసి తత్క్షణంబ. 4**

**ప్రతి :** ఇట్లు, అనేక ప్రకారంబులన్=పలు విధములుగా, కుమారున్, పలవరింపుచున్=తలచుకొనుచు, దుఃఖింపుచున్, కొంత తడవునకున్=కొంతసేపటికి, ఊఱడిల్లి=తెప్పరిల్లి, ధైర్యంబు, నూలుకొల్చి=తెచ్చుకొని, తన కుమారున్, చంపినవానిన్, నేఁడు, అవశ్యంబున=తప్పనిసరిగా, సంగ్రామరంగంబునన్=యుద్ధరంగములో, చంపుదును=చంపుతాను, అని, నియమంబు చేసి=ప్రతిన పూని, తత్క్షణంబ=ఆ క్షణంలోనే.

**తా :** ఈ విధంగా అనేకవిధాలుగా కుమారుని తలచుకుని దుఃఖిస్తూ, కొంతసేపటికి, తేరుకుని ధైర్యాన్ని తెచ్చుకుని నా కుమారుణ్ణి చంపిన వానిని నేను యుద్ధరంగంలో తప్పకుండా చంపుతాను అని ప్రతిన చేసి వెంటనే –

**సీ. శైలసన్నిభములౌ సామజంబులతోడ**
**ననిలవేగము గల్గు హరుల తోడఁ**
**గాంచనోజ్జ్వలములౌ ఘనరథంబులతోడఁ**
**బ్రతి లేని ఘనమూల బలముతోడఁ**
**గిమ్మీరవర్ణోరు కేతనంబుతోడఁ**
**దఱచైన పట్టు ఛత్రములతోడఁ**
**భేరీ మృదంగాది పృథువాద్యములతోడ**
**వరశంఖకాహళ ధ్వనులతోడఁ**

**తే. బాదఘట్టన చలితోర్వీభాగుఁ డగుచు**
**వనధులెల్లను బిండలివండు గాఁగ**
**నడిచె లంకేశుఁ డధిక సన్నాహమునను**
**రామచంద్రునితోడను రణ మొనర్ప. 5**

**ప్రతి :** శైలసన్నిభములౌ=కొండలతో సమానమైన, సామజంబుల తోడ=ఏనుగుల తోను, అనిలవేగము గల్గు=వాయువేగము కలిగిన, హరులతోడన్=గుఱ్ఱాలతోను, కాంచనోజ్జ్వలములౌ=బంగారంతో ప్రకాశిస్తున్న, ఘనరథంబుల తోడన్=గొప్ప రథాలతోను, ప్రతిలేని=సాటిలేని, ఘనమూలబలముతోడన్=ఎందరో సైనిక బలాలతోను, కిమ్మీర వర్ణోరు కేతనంబులతోన్=వివిధరంగుల మిశ్రమంతోడి పెద్దపెద్ద జెండాల తోను, తఱచైన=దట్టమైన, పట్టు ఛత్రముల తోడన్=పట్టు గొడుగు లతోను, భేరీ మృదంగాది పృథువాద్యములతోడ=

భేరీమృదంగము వంటి పెద్దపెద్ద వాద్యాలతోను, వరశంఖకాహళధ్వనులతోడన్=శ్రేష్ఠమైనశంఖము కాహళముల శబ్దాలతోను, పాదఘట్టన చలితోర్వీభాగుcడగుచు= పాదములతో నడవగా కదలిపోతున్న భూభాగము కలవాడగుచు, వనధులెల్లను=సముద్రాలన్నీ, పిండిలి వండుగాcనన్=పిసికి బురదబురదగా చేసి, నడిచె= ప్రయాణించెను, లంకేశుcడు=రావణుడు, అధిక సన్నాహమునను=మిక్కిలి ప్రయత్నంతో, రామచంద్రునితోడను=రామునితో, రణమొనర్ప=యుద్ధం చేయడానికి.

**తా :** లంకేశుడయిన రావణుడు శ్రీరామచంద్రునితో యుద్ధం చేయడానికి పర్వతాలవంటి ఏనుగులతో, వాయు వేగంగల గుఱ్ఱాలతో, బంగారు రథాలతో సాటిలేని మూలబలాలతో, కిమ్మీర వర్ణాలతోకూడిన జెండాలతో, పట్టు గొడుగులతో, భేరీమృదంగాది వాయిద్యాలతో, శంఖకాహళ ధ్వనులతో భూమి కదిలిపోయేలా ప్రయాణంచేస్తూ, సముద్రాలన్నీ బురదబురదకాగా మహాప్రయత్నం చేస్తూ వచ్చాడు.

**మ. కరిఘీంకారములున్ మహాజవతురంగవ్రాత హేషావళుల్**
**వర కోదండ నినాదముల్ సుభట దుర్వారాట్టహాసంబులున్**
**గురుశంఖోజ్జ్వల నాదముల్ దశదిశాక్రోశంబుగా నొక్కటై**
**పరగన్పంక్తి ముఖుండు దా నడిచెc గోపస్ఫూర్తి నిశ్వాసుcడై. 6**

**ప్రతి :** కరిఘీంకారములున్=ఏనుగుల అరుపులు,మహాజవ తురంగవ్రాత= గొప్ప వేగముగల గుఱ్ఱాల సమూహాల, హేషావళుల్=ధ్వనులు, వరకోదండనినాదముల్=శ్రేష్ఠమయిన విల్లుల నాదాలు, సుభట దుర్వారాట్టహాసంబులున్=శక్తివంతులయిన భటుల వారింపలేని గట్టినవ్వులు, గురుశంఖోజ్జ్వల నాదముల్=పెద్ద పెద్ద శంఖాలనాదాలు, దశదిశాక్రోశంబుగాన్=పది దిక్కుల ప్రతిధ్వనించగా, ఒక్కటై=అన్నిధ్వనులూ కలిసి ఒక్కటిగా అయి, పరగన్=ఒప్పుగా, పంక్తిముఖుండు=రావణుడు, తాన్=తాను, కోపస్ఫూర్తినిశ్వాసుcడై= కోపంతో కూడిన నిట్టూర్పుగలవాడై, నడిచెన్=నడిచాడు.

**తా :** ఏనుగుల అరుపులు, గుఱ్ఱాల అరుపులు, వింటి శబ్దాలు, భటుల అట్టహాసాలు, శంఖనాదాలు దశదిశలా వ్యాపించి ఒకే ధ్వనిగా రూపొందగా–రావణుడు కోపంతో నిట్టూరుస్తూ నడిచాడు.

**విశే :** ఘీంకారము=ఏనుగులు చేసేధ్వని, హేషావళులు=గుఱ్ఱాలు చేసేధ్వని.

## రావణ సుగ్రీవుల కదనము

**వ. ఇట్లు చతురంగబలంబులు గొల్వ లోకవిద్రావణుం డగు రావణుండు సమరం బొనర్ప నరుదేరం గని రాఘవేశ్వరుం డతనికి దండనాయకులం బనిచిన వారును దరు గిరిపాషాణపాణులై యెదురు నడిచి సింహనాదంబులు సేయ నుభయ బలంబులుం దలపడి పోరాడు సమయంబున నమరవైరులు శస్త్రాస్త్ర వర్షంబులు గురిపించి నొప్పించి నంత వానరవీరులు మరల దానవులపైc బాషాణపాదపంబు లడరింప నరిబలంబులు విఱిగి పికాపికలై పఱచునత్తఱిc బంక్తి కంధరుం డుదగ్రుండై కెరలుచుc గ్రూరనారాచంబులు**

**చాపంబునం దొడిగి పనస పవనతనయ నల నీల ద్వివిద శరభ కుముద గజ గవయ గవాక్ష గంధమాదనాంగద మైందాదుల నొక్కొక్కరిఁ బదేసిబాణంబుల గుదిగొన నేసిన విఱిగి యగచరసేనలు సురుగు-నయ్యవసరంబున.** **7**

**ప్రతి :** ఇట్లు, చతురంగబలంబులు=నాలుగు విధములగు సైన్యములు, కొల్వన్=సేవింపగా, లోకవిద్రావణుండు=లోకవినాశకారుడు, అగు రావణుండు, సమరంబు=యుద్ధము, ఒనర్పన్=చేయుటకు, అరుదేరన్=రాగా, కని=చూచి, రాఘవేశ్వరుండు=రఘువంశ శ్రేష్ఠుడగు రాముడు, అతనికిన్, దండనాయకులన్, పనిచినన్=పంపగా, వారును, తరుగిరి పాషాణపాణులై=చెట్లు, పర్వతము, రాళ్ళు చేతియందు కలవారై, ఎదురు నడిచి=ఎదురేగి, సింహనాదములు=సింహమువంటి గర్జనలు, చేయన్=చేయగా, ఉభయ బలంబులున్=రెండు సైన్యములు, తలపడి=ఎదిరించి, పోరాడు సమయంబునన్=యుద్ధము చేస్తున్న సమయంలో, అమరవైరులు=దేవతల శత్రువులగు రాక్షసులు, శస్త్రాస్త్ర వర్షంబులు=శస్త్రముల, అస్త్రముల వానలు, కురియించి=కురిపించి, నొప్పించినన్=బాధించగా, అంతన్=పిమ్మట, వానరవీరులు, మరల=తిరిగి, దానవులపైన్=రాక్షసులపై, పాషాణపాదపంబులు=రాళ్ళ, వృక్షములు, అదరింపన్=ప్రయోగింపగా, అరిబలంబులు=శత్రుసేనలు, విఱిగి=నశించి, పికాపికలై=చెల్లాచెదరై, పఱచు నత్తఱిన్=పారిపోవుచున్న ఆ సమయంలో, పంక్తికంధరుండు=రావణుడు, ఉగ్రుండై=కోపోద్రిక్తుడై, కెరలుచున్=అరుచుచు, క్రూరనారాచంబులు=వాడిబాణములు, చాపంబునన్=విల్లునందు, తొడిగి=సంధించి/పూన్చి, పనస పవన తనయ నలనీల ద్వివిద శరభ కుముద గజ గవయ గవాక్ష గంధమాద నాంగద మైందాదులన్, ఒక్కొక్కరిన్, పదేసిబాణంబులన్=పదేసి బాణములను, గుదిగొనన్=గుంపుగా గొని, ఏసినన్=వేయగా, అవి, విఱిగి=నశించి, అగచరసేనలు=వానరసేనలు, సురుగు = వెనుదిరిగిపోవు, అయ్యవసరంబునన్ (ఆ+అవసరంబునన్)= పారిపోవు ఆ సమయమున...

**తా :** ఈ విధంగా చతురంగబలాలు కొలుస్తూ ఉండగా లోకభయంకరుడయిన రావణుడు యుద్ధం చేయడానికి రావడం చూచి రాముడు అతనిని ఎదుర్కోడానికి దండనాయకులను పంపాడు. ఆ వానరవీరులు చెట్లు, కొండలు, బండలు పట్టుకుని ఎదురు వెళ్ళి సింహనాదం చేసారు. ఉభయ బలాలు తలపడి యుద్ధం చేస్తున్న సమయంలో రాక్షసులు శస్త్రాలు అస్త్రాలు వర్షంగా కురిపించి వానరుల్ని నొప్పించారు. వానరవీరులు అప్పుడు రాక్షసుల మీద రాళ్లూ చెట్లూ ప్రయోగించగా శత్రుబలాలు భయపడి చెల్లాచెదరై పరుగెత్తుచుండగా, చూచిన రావణుడు కోపించినవాడై మండిపడుచు తీక్ష్ణమైన బాణాలు, చాపానికి తొడిగి-పనసుడిని, హనుమంతుణ్ణి, నీలుణ్ణి, నలుణ్ణి, ద్వివిదుణ్ణి, శరభుణ్ణి, కుముదుణ్ణి, గజుని, గవయుని, గవాక్షుని, గంధమాదనుని, అంగదుని, మైందుడు మొదలయిన వారిపై ఒకొక్కరిని పదేసి బాణాలు అతిశయంతో వేయగా వానరసేనలు, భయపడి వెనుదిరిగి పోయే సమయంలో.

క. **చేరి విరూపాక్షుని దగు**
**తేరిపయిని నొక్కకొండ ధీరతతోడన్**

**సూరజుఁ డప్పుడు మిక్కిలి**
**శూరత్వం బదరనేసి చూర్ణము సేసెన్.** 8

**ప్రతి :** చేరి=సమీపించి, విరూపాక్షునిది, అగు, తేరిపయినిన్=రథముమీద ఒక్క కొండ, ధీరతతోడన్=ధైర్యముతో, సూరజుఁడు=సుగ్రీవుడు, అప్పుడు, మిక్కిలి, శూరత్వంబు, అదరనేసి=ప్రకాశించునట్లువేసి, చూర్ణము=పొడిపొడిగా, చేసెన్=చేసెను.

**తా :** సుగ్రీవుడు మంచి ధైర్యంతో విరూపాక్షుని రథం మీద ఒక కొండను శూరత్వం ప్రదరిస్తూ వేసి పిండిపిండిగా చేసాడు.

ఆ. **రథము విఱిగినంత రణమధ్యమున నొక్క**
**వారణంబు నెక్కివచ్చు నెడను**
**వాలికొడుకు దాని పటురోషమునఁ దోల**
**నుఱికి ప్లవగుఁ గోల నఱికె వాఁడు.** 9

**ప్రతి :** రథము విఱిగినంత=రథంవిఱిగిపోగానే, రణమధ్యమునన్=యుద్ధరంగపు మధ్యలో, ఒక్క వారణంబున్=ఒక ఏనుగు, ఎక్కివచ్చునెడను=ఎక్కి వస్తున్న సందర్భంలో, వాలికొడుకు=అంగదుడు, దాని=ఆ ఏనుగును, పటురోషమునన్=మిక్కిలికోపముతో, తోలన్=తోలగా, ఉఱికి=క్రిందకుదుమికి, వాఁడు, ప్లవగున్=వానరుని, కోల=బాణంతో, నఱికె=నఱికెను.

**తా :** విరూపాక్షుడు రథం విఱిగిపోగానే రణరంగం మధ్యలో ఒక ఏనుగునెక్కి వస్తుండగా అంగదుడు, తీవ్రమైన కోపంతో ఆ ఏనుగుని తోలగా విరూపాక్షుడు క్రిందకి ఉఱికి వానరుని బాణంతో ఖండించాడు.

క. **అక్షయబలుఁడగు రవిసుతుఁ**
**డాక్షణమున నుగ్రుఁడగుచు నద రంట విరూ**
**పాక్షుని వక్షముఁ బొడిచిన**
**రక్షోవీరుండు కూలి రణమునఁ బడియెన్.** 10

**ప్రతి :** అక్షయబలుఁడు+అగు=నాశములేని బలముగల, రవిసుతుడు=సుగ్రీవుడు, ఆక్షణమునన్, ఉగ్రుఁడచున్=భయంకరుడగుచు, అదరంట=భయంపుట్టేలా, విరూపాక్షుని, వక్షమున్=రొమ్మును, పొడిచిన, రక్షోవీరుండు=రాక్షసవీరుడు, కూలి, రణమునన్=యుద్ధమున, పడియెన్=పడిపోయెను.

**తా :** అక్షయబలుడయిన సుగ్రీవుడు ఆ క్షణంలో ఉగ్రుడై భయం పుట్టేవిధంగా విరూపాక్షుని రొమ్మున పొడిచాడు. ఆ రాక్షసవీరుడు యుద్ధంలో కూలి పడ్డాడు.

వ. **ఇట్లు కూలిన.** 11

**తా :** ఇలా కూలి పడగా..

క. హుమ్మని యాతని కూరిమి
తమ్ముండును గనలి వచ్చు తపనజు నత్యు
గ్రమ్ముగ మార్కొని జడిగా
నమ్ముల వర్షంబుఁ గురియ నాలోఁ బెలుచన్. 12

ప్రతి : హుమ్మని, ఆతని కూరిమి తమ్ముందును=ఆతని ప్రియమైన తమ్ముడు, కనలి=మండిపడుచు, వచ్చు=వస్తున్న, తపనుజున్=సుగ్రీవుని, అత్యుగ్రమ్ముగ=మిక్కిలి భయంకరముగ, మార్కొని=ఎదుర్కొని, జడిగాన్=వ్యవధిలేకుండా వేగంగా, అమ్ముల వర్షంబున్=బాణాల వానను, కురియన్=కురిపించగ, ఆలోన్= అంతలో, పెలుచన్=కోపంతో.

**తా :** అతని తమ్ముడు హుమ్మని మండిపడుచు వచ్చుచున్న సుగ్రీవుని భయంకరముగ ఎదుర్కొని బాణాలను జడివానగా కురిపించాడు, అంతలో కోపముతో

**విశే :** తపనుజుడు=సూర్యునికొడుకు.

చ. శరములు తాఁకకుండ నొకశైలమునం దగ నోసరించి యా
యరదము నుగ్గుగాఁ గపికులాగ్రణి వైచిన వాఁడు నేలకున్
వరభుజశక్తి దాఁటి కరవాలున నేసినఁ దప్పఁ గ్రుంకి వా
నరపతి కొట్టె నప్డు మహినాథుఁడు సంతసమంది చూడఁగన్. 13

ప్రతి : శరములు=బాణములు, తాఁకకుండన్=తగలకుండా, ఒక,శైలమునన్= కొండను, తగన్=తగునట్లుగా, ఓసరించి=తొలగించి, ఆ+అరదము=అరథము, నుగ్గుగాన్=పిండిఅగునట్లు, కపికులాగ్రణి=సుగ్రీవుఁడు వానరకులములో శ్రేష్ఠుడు, వైచిన=వేసిన, వాఁడు, నేలకున్=భూమిమీదకు, వరభుజశక్తి=శ్రేష్ఠమైన భుజశక్తితో, దాఁటి=దుమికి, కరవాలునన్=చేతికత్తితో, ఏసినన్=వేయగా, తప్పన్=గురితప్పు నటులగా, క్రుంకి= క్రిందకువంగి, వానరపతి=సుగ్రీవుడు, కొట్టెన్, అప్డు, మహినాథుఁడు=రాముడు, సంతసమంది= ఆనందించి, చూడఁగన్=చూడగా.

**తా :** కురిపించిన బాణాలు తగలకుండా ఒక కొండను పెకిలించి, ఆ రథము, నుగ్గు నుగ్గు అయ్యేలా కొట్టాడు సుగ్రీవుడు. తన భుజశక్తితో రాక్షసుడు భూమి మీదకు దుమికి తన చేతికత్తితో కొట్టాడు, అది తనకు తగలకుండ వంగి సుగ్రీవుడు రాముడు చూచి ఆనందించేలా కొట్టాడు.

క. కదనమున నొచ్చి దానవుఁ
డదలింపుచు భానుసుతుని యొదల వగులన్
గదచే నడిచిన వానినిఁ
గుదియంగాఁ బట్టి వైచెఁ గుంభినిమీఁదన్. 14

**ప్రతి :** కదనమున=యుద్ధంలో, నొచ్చి=దెబ్బలుతిని, దానవుఁడు=రాక్షసుడు, అదలింపుచు=బెదిరించుచు, భానుసుతుని=సుగ్రీవుని, ఔదలపగులన్=నడినెత్తిపగి లేలా, గదచేన్=గదతో, అడిచిన=కొట్టగా, వానినిన్=రాక్షసుని, కుదియంగాన్=వదలకుండా బిగియపట్టి, పట్టి=పట్టుకుని, కుంభినిమీఁదన్=భూమిమీద, వైచెన్=పడవేసెను.

**తా :** యుద్ధంలో దెబ్బలు తిన్న రాక్షసుడు సుగ్రీవుణ్ణి బెదిరిస్తూ తన గదతో నడినెత్తి పగిలేలా కొట్టగా, సుగ్రీవుడు వాణ్ణి గట్టిగా పట్టుకొని భూమిమీద పడేసాడు.

### పవనజుఁడు సుపార్శ్వుని మట్టుపెట్టుట

**క.** **అంత సుపార్శ్వుఁడు మిక్కిలి**
**పంతము నెఱపుచును రథము పవనాత్మజుపై**
**నెంతయుఁ బఱపుచు బాణము**
**లంతంతనె నాట నేయు నవసరమందున్.** **15**

**ప్రతి :** అంత=అప్పుడు, సుపార్శ్వుఁడు, మిక్కిలి పంతము=మిక్కిలి పౌరుషము, నెఱపుచును=ప్రదర్శించుచు, రథము, పవనాత్మజుపైన్=హనుమ మీదకు, ఎంతయున్=అధికముగా, పఱపుచు=తోలుచు, బాణములంతంతనె=బాణములు వెంటవెంటనే, నాటన్=నాటుకునే విధంగా, ఏయున్=వేయునట్టి, అవసరమందున్=సమయములో.

**తా :** అప్పుడు సుపార్శ్వుడు మిక్కిలి పౌరుషం ప్రదర్శిస్తూ హనుమంతుని మీదకు రథాన్ని దగ్గరగా తోలుతూ బాణాలను వెంటవెంటనే నాటుకునే విధంగా ప్రయోగించే సమయంలో –

**సీ.** **హనుమంతుఁ డాదైత్యు నరదంబు పై దాఁటి**
**చెక్కలు వాఱంగఁ ద్రొక్కివేసి**
**సైంధవంబులఁ జంపి సారథితలఁ గొట్టి**
**గొడుగులు పడగలు పుడమిఁ గలిపి**
**వడి వానిచే నున్న యడిదంబుఁ గైకొని**
**బిరుసుగా నేసిన ధరనుగూలి**
**గొబ్బునఁ దెప్పిర్లి కోపంబు దీపింప**
**ననిలజు నురము మూఁడంబకముల**

**తే.** **జాంబవంతుని నిరుమూఁడు సాయకముల**
**వడి గవాక్షుని నైదింట వాలిసుతుని**
**నేడు బాణంబులను దూలనేసె నంత**
**నవనిఁ బడి లేచి యంగదుం డాగ్రహమున.** **16**

**ప్రతి :** హనుమంతుఁడు, ఆదైత్యునరదంబుపై=ఆ రాక్షసుని రథం మీదికి, దాఁటి=దుమికి, చెక్కలు వాఱంగన్=ముక్కలు చెక్కలు అయ్యేలా, త్రొక్కివేసి, సైంధవంబులన్=గుఱ్ఱాలను, చంపి=చంపి, సారథితలఁ గొట్టి=సారథితల త్రుంచి, గొడుగులు పడగలు=గొడుగులు జెండాలు, పుడమిన్=భూమిలో, కలిపి=కలిపేసి, వడి=వేగంగా, వానిచేన్=సుపార్శ్వుని చేతిలో, ఉన్న, అడిదంబున్=కత్తిని, కైకొని=తీసుకుని, బిరుసుగాన్=క్రూరంగా, ఏసిన=వేయగా, ధరనుగూలి=భూమి మీదకు కూలి, గొబ్బునన్=వేగముగా, తెప్పిర్లి=తేరుకుని, కోపంబు దీపింప=కోపము ప్రకాశింపగా, అనిలజున్=హనుమయొక్క, ఉరము=రొమ్మును, మూఁడు, అంబకములన్=బాణములతో, జాంబవంతునిన్, ఇరుమూఁడు సాయికములన్=ఆరు బాణాలతో, వడి, గవాక్షుని, ఐదింట, వాలిసుతుని=అంగదుని, ఏడు బాణంబులను, తూలనేసెన్=పడగొట్టాడు, అంత, అవనిఁ బడిలేచి=భూమిపై పడిలేచి, అంగదుడు, ఆగ్రహమున=కోపముతో.

**తా :** హనుమంతుడు ఆ రాక్షసుని రథము మీదకు దుమికి చెక్కముక్కలుగా త్రొక్కాడు. గుఱ్ఱాలను చంపి, సారథి తలగొట్టి, గొడుగులు, జెండాలు నేలలో కలిపేసి, ఆ రాక్షసుని చేతిలోగల కత్తి తీసుకుని క్రూరంగా అతనిని కొట్టగా అతడు నేలకూలిపోయాడు. అంతలోనే వేగంగా తేరుకుని కోపంతో హనుమ రొమ్మును మూఁడు బాణాలు, జాంబవంతుని ఆరు బాణాలు, గవాక్షుని అయిదు బాణాలు, అంగదుని ఏడు బాణాలు ప్రయోగించి పడగొట్టాడు. అప్పుడు భూమిమీద పడి లేచిన అంగదుడు కోపంతో–

**తే.** **వాని చేవిల్లు విఱిచిన వాఁడు కినిసి**
**పరిఘుఁ గొని యేయ మూర్ఛిల్లి ధరణి వ్రాలి**
**తెలిసి యంగదుఁ డాదైత్యుఁ దెగువ నురము**
**పిడు గడంచిన గతి ముష్టిఁ బొడిచి చంపె.** **17**

**ప్రతి :** వాని=సుపార్శ్వుని, చేవిల్లు విఱిచిన=చేతిలోని విల్లును విరవగా, వాఁడు కినిసి=వాడు కోపించి, పరిఘున్=పరిఘ అనే ఆయుధాన్ని, కొని=తీసుకుని, ఏయన్=వేయగా, మూర్ఛిల్లి=మూర్ఛపోయి, ధరణివ్రాలి=నేలమీదపడి, తెలిసి=తెప్పరిల్లి, అంగదుడు, ఆదైత్యున్, ధైర్యంతో, ఉరము=రొమ్ము, పిడుగు, అడంచిన=నాశనముచేసిన, గతిన్=వలె, ముష్టిన్=పిడికిలితో, పొడచి చంపె=పొడిచి చంపెను,

**తా :** సుపార్శ్వుని చేతిలో విల్లును అంగదుడు విఱిచేసాడు. అతడు కోపంతో పరిఘ అనే ఆయుధంతో అంగదుణ్ణి మూర్ఛపోయేలా కొట్టాడు. నేలమీద పడిలేచిన అంగదుడు పిడుగుపడితే నాశనం చెందినట్లు–తన పిడికిలితో సుపార్శ్వుని రొమ్ముమీద పొడిచి చంపాడు.

**వ.** **ఇట్లు సుపార్శ్వాది రక్షోనాయకు లాక్షణంబునం గూలిన.** **18**

**తా :** ఈవిధంగా సుపార్శ్వుడు మొదలైన రాక్షసనాయకులు ఆ క్షణంలో కూలిపోగా

**క.** **తన కట్టెదురను గూలిన**
**దనుజులఁ బెక్కండ్రఁ జూచి దశకంఠుఁడు దా**

గనలుచు సూతున కనియెను
జననాయకుమీఁద రథముఁ జన నిమ్మనుచున్. 19

ప్రతి : తన, కట్టెదురను=ఎదురుగా, కూలిన=చనిపోయిన, దనుజులన్= రాక్షసులను, పెక్కంద్రన్=చాలా మందిని, చూచి, దశకంఠుండు=రావణుడు, తాన్=తాను, కనలుచు=మండిపడుతు, సూతునకున్=రథము నడిపేవానికి, జననాయకుమీఁద=శ్రీరాముని మీదకు, రథమున్. చననిమ్ము=నడుపుము, అనుచున్, అంటూ.

తా : తన ఎట్ట ఎదుటనే ఎంతోమంది రాక్షసవీరులు చనిపోవడం చూచిన రావణుడు మండిపడుతూ సూతునితో రథాన్ని శ్రీరాముని మీదికి పోనివ్వయ్యా అన్నాడు.

ఆ. అధిపుఁ డానతిచ్చినట్టుగా సూతుండు
రామచంద్రుమీఁద రథము వఱపె
నపుడు శంఖకాహళాదిరవంబులు
వందిజనుల నుతులు సందడింప. 20

ప్రతి : అధిపుడున్=ప్రభువు, ఆనతి, ఇచ్చినట్టుగా, సూతుడు, రామచంద్రు మీఁద, రథము, పఱపెన్= నడిపించెను, అపుడు, శంఖకాహళాదిరవంబులు=శంఖకాహళములు మొదలైన ధ్వనులు, వందిజనులనుతులు= నుతించు వారినుతులు, సందడింప=సందడిచేయగా,

తా : అప్పుడు రావణుడు ఆజ్ఞాపించినట్లుగా సూతుడు శ్రీరాముని మీదికి రథం పోనిచ్చాడు. శంఖకాహళాల ధ్వనులు వందిజనులు చేసే స్తోత్రాలు సందడి చేయగా.

వ. ఇట్లు శతాంగతురంగ హేషారవంబులును బహుళకింకిణీ ఘంటికా నినదంబులును రథనేమిస్వనంబులును దనుజభటాట్టహాసంబులును బోరుకలంగ సంగరరంగంబున కరుగుదెంచు నక్తంచరేశ్వరుండు ధనుర్ధరుండై ప్రతిఘటించు సమయంబున. 21

ప్రతి : ఇట్లు, శతాంగతురంగ హేషారవంబులును=రథములకున్న గుఱ్ఱపు సకిలింపుల ధ్వనులును, బహుళకింకిణీఘంటికా నినదంబులును=పలు మువ్వలగంటల ధ్వనులును, రథనేమి స్వనంబులును= రథములయొక్క చక్రముల చప్పుడులును, దనుజ భటాట్టహాసంబులును=రాక్షస భటుల పెద్దపెద్ద నవ్వులును, బోరుకలంగసంగర రంగంబునకున్=యుద్ధము చేయగా యుద్ధరంగమునకు, కరుగుదెంచి=వచ్చి, నక్తంచరేశ్వరుండు=రాక్షసరాజు ధనుర్ధరుండై=విల్లు పట్టినవాడై, ప్రతిఘటించు సమయంబునన్=ఎదురొడ్డిన సమయంలో...

తా : ఈ విధంగా రథాలకు కట్టిన గుఱ్ఱాల హేషారవంబులు, మిక్కిలి మువ్వల గంటల ధ్వనులు, రథనేమి చప్పుళ్లు, రాక్షసభటుల అట్టహాసాలు అతిశయించగా యుద్ధరంగానికి రాక్షసేశ్వరుడయిన రావణుడు వచ్చి ధనుస్సు ధరించి ఎదుర్కొనే సమయంలో.

విశే : నక్తంచరుడు రాత్రి తిరుగువాడు, రాక్షసుడు

క. తన కెదిరించిన రామునిఁ
గని దనుజవిభుండు కినుక గదురఁగ నటఁ జ
య్యన నాగాస్త్రములను దన
ధనువునఁ గీలించి యేసెఁ దనభుజశక్తిన్. 22

ప్రతి : తనకు=తనను, ఎదిరించిన, రామునిన్, కని, దనుజవిభుండు=రాక్షసరాజు, కినుకగదురఁగన్=కోపం అతిశయించగా, అట, చయ్యన=వెంటనే, నాగాస్త్రములను, తన, ధనువునన్ కీలించి=వింట సంధించి, తనభుజశక్తిన్=తనయొక్క భుజబలం కొద్దీ, ఏసెన్=వేసెను.

తా : తనను ఎదిరించిన రాముణ్ణి చూసి రావణుడు కోపాతిశయంతో వెంటనే నాగాస్త్రాలను ధనుస్సులో సంధించి తన భుజశక్తి కొద్దీ ప్రయోగించాడు.

క. అవి లెక్కఁ గొనక పొరిఁబొరి
నవనీనాయకుఁడు గినుక నసురాధిపుపై
దివిజారు లులికి పాఱఁగఁ
బవిసన్నిభ మైన తీవ్రబాణము లేసెన్. 23

ప్రతి : అవి=వాటిని, లెక్కన్ కొనక=పరిగణనలోకి తీసుకోకుండా, పొరిఁబొరిన్=క్రమంగా, అవనీనాయకుఁడు=భూనాయకుడు, కినుకన్=కోపంతో, అసురాధిపుపై=రావణుని మీద, దివిజారులు=రాక్షసులు, ఉలికి పాఱఁగన్=భయపడి పారిపోగా, పవిసన్నిభమైన=వజ్రాయుధము వంటి, తీవ్రబాణములు, ఏసెన్= వేసెను,

తా : ఆ బాణాలు లెక్కచెయ్యకుండా క్రమంగా శ్రీరాముడు కోపంతో రావణుని మీద రాక్షసులు బెదిరి పారిపోయేలా వజ్రాయుధం వంటి తీవ్రమైన బాణాలు ప్రయోగించాడు,

సీ. లంకేశుఁ డవి యెల్ల లక్ష్యంబు సేయక
తిమిరాంబకములు సంధించియేయ
నిబిడమై చీఁకటి నిండంగఁ బర్వినఁ
గపు లెల్ల నంధులై కళవళింప
నుర్వీశ్వరుం డంప నుగ్రబాణంబుల
నంధకారం బంత నడఁగఁజేసి
వాసవారాతిపై వహ్నిబాణము నేయ
నాతండు రౌద్రాస్త్ర మడరనేసె -

తే. రెండు బాణంబులును గూడి గం డెసంగఁ
బెనఁగి యాకాశమున నుండి పృథ్వీమీఁదఁ

**బడియె నద్భుతగతి జగత్ప్రళయముగను**
**సురలుఁ గపులును దైత్యులుఁ జోద్యపడఁగ.** **24**

**ప్రతి :** లంకేశుఁడు=రావణుడు, అవి ఎల్ల, లక్ష్యంబు సేయక=లెక్కచేయక, తిమిరాంబకములు=చీకటిని సృష్టించే బాణాలు, సంధించి=వింటకూర్చి, నిబిడమై=దట్టంగా, చీఁకటి నిండంగన్ పర్వినన్=అంతటా చీకటి వ్యాపించగా, కపులెల్ల, అంధులై=గ్రుడ్డివారై, కళవళింప=కలవరపడగా, ఉర్వీశ్వరుండు=రాముడు, అంపన్=పంపగా, ఉగ్రబాణంబులన్=వాడిఅయిన బాణములతో, అంధకారంబు=చీకటి, అంత=పూర్తిగా, అడఁగన్, చేసి=నశింపచేసి, వాసవారాతిపై=ఇంద్రుని శత్రువైన రావణుని మీద, వహ్నిబాణమున్=అగ్నిసంబంధమైన బాణాన్ని, ఏయన్=వేయగా, ఆతండు, రౌద్రాస్త్రము=రుద్రసంబంధమయిన అస్త్రాన్ని, అదరన్=నశియించునట్లు, ఏసె=వేసెను, రెండు బాణంబులును, కూడి=కలిసి, గండెసంగన్=కోపం ఎక్కువ కాగా, పెనఁగి=పోరాడి, ఆకాశమున నుండి, అద్భుతగతి=అద్భుతంగా, జగత్ప్రళయముగను=జగత్తుకు ప్రళయము వచ్చినట్లు, సురలున్=దేవతలు, కపులు, దైత్యులున్=రాక్షసులు, చోద్యపడఁగ=ఆశ్చర్యపడేలా!, పృథ్వీమీదన్=భూమి మీద, పడియెన్.

**తా :** రావణుడు ఆ బాణాలు లెక్కచేయక చీకటిని సృష్టించే బాణాలు ప్రయోగించాడు. చీకటి అంతటా వ్యాపించింది. వానరులందరూ గుడ్డివాళ్లైపోయారు. కంగారుపడిపోతున్నారు. అప్పుడు రాముడు వాడి అయిన బాణం ప్రయోగించి చీకటిని నశింపచేసాడు. రావణుని మీద అగ్నిబాణం ప్రయోగించాడు, రావణుడు రౌద్రాస్త్రం వేసాడు. రెండుబాణాలు కలిసికోవడంతో ఆకాశంలోకి ఎగిరి, భూమి మీద పడ్డాయి, ఆ దృశ్యం–జగత్ప్రళయం వచ్చినట్లుగా దేవతలు, వానరులు, రాక్షసులు ఆశ్చర్యపడేలా ఉంది.

వ. **అట్లు మహాద్భుతకరంబుగా సమరంబు జరుగుచున్న సమయంబున.** **25**

**ప్రతి :** మహాద్భుత కరంబుగా=మిక్కిలి ఆశ్చర్యకరంగా, సమరంబు=యుద్ధము

**తా :** ఆ విధంగా మిక్కిలి ఆశ్చర్యకరంగా యుద్ధం జరుగుతున్న సమయంలో.

క. **రామునిమేనను బాణ**
**స్తోమంబులు నాట నేసె సుపురరిపుఁ డలుకన్**
**రాముఁడు ఘననారాచ**
**స్తోమంబులు నాట నేసె సురరిపుమీఁదన్.** **26**

**ప్రతి :** రాముని మేనను=రాముని శరీరం మీద, బాణస్తోమంబులు=బాణాల సమూహాలు, నాటన్=నాటుకునేలా, సురరిపుఁడు=రావణుడు, అలుకన్=కోపంతో, ఏసె=వేసెను, రాముఁడు, ఘననారాచ స్తోమంబులు=గొప్పవైన బాణసమూహాల్ని, నాటన్=నాటుకునేలా, సురరిపుమీఁదన్=దేవతల శత్రువైన రావణుని మీద, ఏసె=వేసెను.

**తా :** రావణుడు కోపంతో రాముని శరీరంలో గుచ్చునేలా బాణ సముహాన్ని వేసాడు. శ్రీరాముడు రావణునికి గుచ్చుకునేలా తీక్ష్ణమైన బాణసమూహాల్ని, ప్రయోగించాడు.

**విశే :** రామరావణుల యుద్ధవిధానంలో రాముడు రావణుడు ఒకరికొకరు తీసిపోకుండా చేసారు, రచనలో కూడా ఆ సొగసు చూపింది మొల్ల.

**చ. ధరణిపుమీఁదనుం గనలి దానవనాయకుఁడేసె నంత భీ**
**కర శరభోష్ట్ర కాక ఫణి గండక ఘూక బలాక భేక సూ**
**కర కిరి ఋశ్య కూర్మ శుక గర్దభ భల్లుక నీలకంఠ కే**
**సరి వృక గృధ్ర కీట బక సైంధవ సైరిభవక్త్ర బాణముల్. 27**

**ప్రతి :** ధరణిపు=రాముని, మీఁదనున్=పై, కనలి=మండిపడి, దానవనాయకుఁడు రావణుడు, ఏసెన్, అంత, భీకర=భయంకరమైన, శరభ=ఎనిమిదికాళ్ల జంతువు, ఉష్ట్ర=ఒంటె, కాక=కాకి, ఫణి=పాము, గండక=ఖడ్గమృగము, ఘూక=గుడ్లగూబ, బలాక=కొక్కెర, భేక=కప్ప, సూకర=అడవి పంది, కిరి=పంది, ఋశ్య=మనుపెంటి, కూర్మ=తాబేలు, శుక=చిలుక, గర్దభ=గాడిద, భల్లుక=ఎలుగుబంటి, నీలకంఠ=నెమలి, కేసరి=సింహము, వృక=తోడేలు, గృధ్ర=గ్రద్ద, కీట=ఏనుగు, బక=కొంగ, సైంధవ=గుఱ్ఱము, సైరిభ=దున్నపోతు, వక్త్ర=ముఖములుగాగల, బాణముల్=బాణములను, ఏసెన్=ప్రయోగించెను.

**తా :** రావణుడు మండిపడి రాముని మీద భయంకరమైన బాణాలు వేసాడు. ఆ బాణముఖాలు–ఆయా జంతువుల, పక్షుల ముఖాలవంటి ఆకారం గలవి, అవి వరుసగా ఒంటె, కాకి, పాము, ఖడ్గమృగం, గుడ్లగూబ, కొక్కెర, కప్ప, అడవిపంది, పంది, మనుపెంటి, తాబేలు, నెమలి, చిలుక, సింహము, తోడేలు, గ్రద్ద, ఏనుగు,కొంగ, గుఱ్ఱము, దున్నపోతు ముఖాలుగల బాణాలు.

**విశే :** 1) ఆ రోజుల్లోనే బాణాలను ఇంత విశేషంగా తయారు చేసేవారన్నమాట, ఎనిమిది కాళ్ల జంతువు శరభం – దాని ముఖంలాంటి ముఖం బాణానికి ముఖంగా చెక్కారన్నమాట.

2) పద్యరచనలో గణాలకోసం పక్షులు, జంతువులు విడవిడిగా చెప్పడం వీలుకాదు, మొల్ల సంస్కృత సమాసరచనా విన్యాసానికి ఈ పద్యం ఉదాహరణ. రెండు, మూడు, నాలుగు, పాదాలు కలిపి ఒకే సమాసం.

ఈ పద్యంలో జంతువులు–శరభము, ఎలుగుబంటి, సింహము, తోడేలు, ఏనుగు, గుఱ్ఱము, దున్నపోతు.

పక్షులు–కాకి, గుడ్లగూబ, కొక్కెర, చిలుక, నెమలి, గ్రద్ద, కొంగ

3) ఉభయచరాలు=తాబేలు, కప్ప, నేలమీద నీటిలోనూ చరించేవి. పాము=పొట్టతోపాకేది.

**వ. ఇట్లు నిరంతరంబుగాఁ బ్రయోగించిన. 28**

**తా :** ఇలా ఎడతెరపి లేకుండా బాణాలు వేయగా,

**చ. పరువడి మీదవచ్చు పటుబాణచయంబుఁ జూచి రాఘవుం**
**దరుదుగ వాని నన్నిటి వియత్తల వీథిని ద్రుంచి క్రమ్మఱన్**
**సురరిపు మీఁద నేసె బలసూదనముఖ్యులు సూచి మెచ్చ ని**
**బ్బరముగ నగ్నిబాణము నభంబునఁ గీలలు పర్వుచుండఁగన్. 29**

**ప్రతి:** పరువడి=వేగముగా, మీదవచ్చు=మీదకువచ్చు, పటుబాణచయంబులన్=తీక్ష్ణమైన బాణ సమూహాలను, చూచి, రాఘవుండు, అరుదుగ=ఆశ్చర్యకరంగా, వానిన్=ఆబాణాలు, అన్నిటిని, వియత్తలవీథిని=ఆకాశవీథిలో, త్రుంచి=విరిచేసి, క్రమ్మఱన్=మళ్లీ, సురరిపు మీఁదన్=రాక్షసునిమీద,ఏసె, బలసూదన ముఖ్యులు=బలుడు అనే రాక్షసుని సంహరించిన ఇంద్రుడు మొదలయిన వారు చూచి, మెచ్చ=మెచ్చునట్లుగ, నిబ్బరముగ= ధైర్యంగా, అగ్నిబాణము, నభంబునన్=ఆకాశంలో, కీలలు పర్వుచుండఁగన్=మంటలు వ్యాపిస్తూ ఉండగ.

**తా :** రాముడు వేగంగా మీదకు వస్తున్న తీవ్రమయిన బాణాలను చూచి, ఆశ్చర్చపడేలా ఆబాణాల నన్నిటినీ ఆకాశవీథిలో త్రుంచి తిరిగి రావణుని మీద ఇంద్రాదులు మెచ్చేలా అగ్ని కీలలు ఆకాశమంతటా వ్యాపించేలా ధైర్యంతో అగ్ని బాణాన్ని ప్రయోగించాడు.

**వ. అమ్మహాస్త్రంబవలన. 30**

**ప్రతి :** (ఆ+మహాస్త్రంబువలన)=ఆ గొప్ప అస్త్రంవల్ల

**క. దహన ముఖంబుల శరములు**
**గ్రహముఖములు గలుగునట్టి ఘనతరశరముల్**
**మిహిరముఖంబుల శరములు**
**బహుళముగాఁ గల్గి దైత్యపతిపైఁ బర్వెన్. 31**

**ప్రతి :** దహనముఖంబుల శరములు=మంటల ముఖంతో కూడి ఉన్న బాణాలు, గ్రహముఖములు=గ్రహాలు ముఖాలుగా, కలుగునట్టి=ఉన్నట్టి, ఘనతర శరముల్=గొప్పబాణాలు, మిహిర ముఖంబుల=సూర్యుడు ముఖంగా గల శరములు, బహుళముగాన్=అధికముగా, కల్గి=కలిగి ఉండి, దైత్యపతిపై=రాక్షసనాథునిపై, పర్వెన్=వ్యాపించెను,

**తా :** ఆ అగ్నిబాణం నుండి మంటలతో కూడిన బాణాలు, గ్రహాలు ముఖాలుగా గలిగిన గొప్ప బాణాలు, సూర్యముఖం గలిగిన పెక్కు బాణాలు. రావణుని మీద వ్యాపించాయి.

**ఆ. అంత దానవేంద్రుఁ డా బాణతతు లెల్ల**
**దృణములట్లు నడుమఁ ద్రెంచి వైచి**
**మయునిచేతఁ గొన్న మహనీయ మగునట్టి**
**శంబరాఖ్య మైన శరము వైచె. 32**

**ప్రతి :** అంత, దానవేంద్రుఁడు=రావణుడు, ఆ బాణతతులు=ఆ బాణసమూహాలు, ఎల్లన్=అన్నీ, తృణములట్లు= గడ్డిపరకలవలె, నడుమన్=మధ్యలోనే, త్రెంచి వైచి=విరుగ గొట్టి, మయుని చేతన్=మయాసురునినుండి, కొన్న=తీసుకొన్న, మహనీయమగునట్టి=గొప్పవయినట్టి, శంబర+ఆఖ్య=శంబరము అనే పేరుగల, శరమువైచె=బాణాన్ని వేసాడు.

**తా :** రావణుడు ఆ బాణసమూహాల నన్నిటినీ గడ్డిపరకలలా భావించి తనను చేరవచ్చేలోపలే విరుగగొట్టి తాను మయునిచే పొందిన శంబరమనే పేరుగల బాణాన్ని ప్రయోగించాడు.

**క.** **ఆ శరమున బహుశస్త్రము**
**లాశుగతిం గలిగి గవియ నన్నిటి నొకటన్**
**నాశము చేసెను రాముం**
**దాశాపతు లలర మన్మథాస్త్రముచేతన్.** **33**

**ప్రతి :** ఆశరమునన్=ఆ బాణము నుండి, బహుశస్త్రములు=పెక్కుబాణాలు, ఆశుగతిన్=వేగ గమనంతో, కవియన్=సమీపించగా, అన్నిటిన్, ఒకటన్=ఒకే బాణమున, రాముండు, ఆశాపతులు=దిక్పాలకులు, అలరన్=ఆనందించేలా, మన్మథాస్త్రము చేతన్, నాశము చేసెను.

**తా :** రావణుడు ప్రయోగించిన శంబరాస్త్రం నుండి ఎన్నోబాణాలు వేగంగా మీదకురావడం చూసిన రాముడు ఆ బాణాలన్నిటిని ఒక్కబాణంతో నాశనం చేసాడు. రాముడు మన్మథాస్త్రం ప్రయోగించి దిక్పాలకులందరూ ఆనందిచేలా ఈపని చేసాడు.

**విశే :** మన్మథాస్త్రము - అనగానే శృంగార సంబంధి అని వినిపిస్తుంది. కాని వీర రసప్రధానమైన అస్త్రాలలో మన్మథాస్త్రం కూడా ఒకటి అన్నమాట, ఆశ=దిక్కు

**ఆ.** **శంబరాఖ్యశరము జగదీశుబాణంబు**
**వలనఁ జెడక రామువక్ష మదర**
**నాటె నంతలోన నాకారిపై నేసె**
**విశిఖతతులు వేయి వేయు నెడను.** **34**

**ప్రతి :** శంబరాఖ్యశరము=శంబరశరము, జగదీశు బాణంబు=రాముని బాణము, వలనన్, చెడక= నాశనముకాక, రామువక్షము=రాముని రొమ్ము, అదర=నొప్పిపుట్టునట్లు, నాటన్=గుచ్చుకొనెను, అంతలోన= అంతలో, నాకారిపై=స్వర్గలోక శత్రువైన రావణుని మీద, విశిఖతతులు=బాణాల గుంపులు, వేయి=వెయ్యి, వేయునెడను=వేసే సమయంలో.

**తా :** శంబరశరము రాముడు వేసి బాణంవల్ల చెడిపోక, రాముని రొమ్ముని బాధించే విధంగా గుచ్చుకొనగా అంతలోనే రాముడు ఒక వేయి బాణాలు రావణుని మీద వేసేటంతలో -

**క. రావణుఁ డాబాణములకు**
**వేవేగను ప్రతిఘటించి వేసినశరముల్**
**చేవ మెయిఁ దాకిఁ వడి ధా**
**త్రీవలయంబునను బడి ధరిత్రి వడంకెన్. 35**

**ప్రతి :** రావణుఁడు, ఆ బాణములకు, వేవేగను=అతి వేగంగా, ప్రతిఘటించి=ఎదుర్కొని, వేసిన, శరముల్, చేవమెయిన్=శక్తి కొలదిగా, తాకి=తగిలి, వడి=వేగంగా, ధాత్రీవలయంబునను=భూమిమీదను, పడి, ధరిత్రి=భూమి, వడంకెన్=వణికిపోయెను.

**తా :** రావణుడు, ఆ బాణములకు, ఎదుర్కొని వేసిన బాణాలు బలం కొలదీ రామునికి తగిలి, భూమి మీద పడగా భూమి వణికిపోయింది.

## రావణుని శక్తి ప్రహారముచే లక్ష్మణుని మూర్ఛ

**ఉ. తల్లడ మంది రామవసుధాపతి కడ్డము సొచ్చి లక్ష్మణుం**
**దుల్లమునొవ్వ నాటుచు మహోన్నత కోపము తోడ దైత్యుచే**
**విల్లును నారియుం దునిమివేసి వడిన్ శరసప్తకమ్ముచే**
**బల్లిదుఁడైన దైత్యకులపాలుని వక్షముఁ దూర్చి యార్చినన్. 36**

**ప్రతి :** తల్లడమంది=కంగారుపడి, రామవసుధాపతికి=రామభూపతికి, అడ్డము, సొచ్చి లక్ష్మణుండు, ఉల్లమునొవ్వనాటుచు=మనస్సు నొచ్చునట్లుగా గుచ్చుచు, మహోన్నత కోపముతోడ=మిక్కిలి ఎక్కువైన కోపంతో, దైత్యుచే విల్లును నారియున్=రాక్షసుని చేతిలోని వింటిని, నారిని, తునిమివేసి=విరిచివేసి, వడిన్=వేగముగ, శరసప్తకమ్ముచే=ఏడు బాణాలతో, బల్లిదుఁడైన=పరాక్రమశాలియైన, దైత్యకులపాలుని=రాక్షసరాజుని, వక్షమున్=రొమ్మున, తూర్చి=గుచ్చుకునేటట్లు చేసి, ఆర్చినన్=గొప్పధ్వని చేయగా.

**తా :** ఆ పరిస్థితికి కలతపడి, లక్ష్మణుడు రామునికి అడ్డం వచ్చాడు. మనస్సు బాధపడగా మహోన్నత కోపంతో రాక్షసుని చేతిలోని విల్లును, నారిని నాశనంచేసి, ఏడుబాణాలు సంధించి ఆ పరాక్రమవంతుడైన రావణుని రొమ్ముకు బలంగా నాటేటట్లు వేసి పెద్ద బొబ్బపెట్టాడు.

**క. అంత విభీషణుఁ డమరేం**
**ద్రాంతకు నరదంబుఁ గూల నట నేసిన న**
**త్యంత జవంబున ధరణికి**
**గంతుగొనెన్ వడిని బంక్తి కంధరుఁ డలుకన్. 37**

**ప్రతి :** అంత=అప్పుడు, విభీషణుఁడు, అమరేంద్రాంతకున్=ఇంద్రుని జయించినవాని, అరదంబున్=రథమును, కూలన్, అటన్, ఏసినన్, అత్యంత జవంబున=మిక్కిలి శక్తితో, వడిని=వేగంగా, పంక్తికంధరుఁడు=రావణుడు, అలుకన్=కోపంతో, ధరణికిన్=భూమి మీదకు, గంతుకొనెను=గెంతాడు.

**తా :** అప్పుడు విభీషణుడు రావణుని రథాన్ని కూలనేయగా మిక్కిలి బలంతో రావణుడు భూమిమీదకి వేగంగా ఒక్కగెంతు గెంతాడు.

**వ. ఇట్లు తన రథంబుఁ గూలనేసిన విరథుండై రావణుండు మయదత్తంబైన శక్తినిఁబూని తమ్ముని నేయఁ జూచు చున్నంత శరణాగత వజ్రపంజరుండగు రాఘవేశ్వరునితోఁబుట్టు వగుటంజేసి లక్ష్మణుండు కరుణాపరుండై విభీషణుం తనవెనుక నిడికొని యెదిర్చినం గని నీవ నా పగర కడ్డంబ వైతివి గావున నీవ యీశక్తిచేత హతుఁడువు గమ్మని యేసిన నదియును శతఘంటికారంజితంబును శతకోటినినదంబును బావకజ్వాలాభీలకీలాన్వి తంబునునై పఱతేరంగని సురేంద్రాది దేవగణంబులు భయంబంది రాముతమ్మునకు దీర్ఘాయు వగుం గావుత మని దీవింప జగంబులు తల్లడిల్ల సముద్రంబులు ఘూర్ణిల్లఁ గులాచలంబులు వడంకఁ జంద్రార్క బింబంబులు దలంక నేఁగుదెంచి సౌమిత్రియురంబునాటి ధాత్రిం బడియె నట్టియవసరమ్మున. 38**

**ప్రతి :** ఇట్లు, తనరథంబున్, కూలనేసినన్=కూల్చివేయగా, విరథుండై=రథము లేనివాడై, రావణుండు, మయదత్తంబైన=మయునిచే ఈయబడిన, శక్తిన్=శక్తి అను ఆయుధమును, పూని=పట్టుకొని, తమ్మునిన్= తమ్ముడగు విభీషణుని, ఏయన్=కొట్టగా, చూచుచున్నంతన్=చూస్తూండగా, అంతలో, శరణాగత వజ్రపంజరుండు అగు=శరణు కోరివచ్చినవారికి వజ్రపంజరము వంటివాడగు, రాఘవేశ్వరునితోఁబుట్టువు= శ్రీరామచంద్రుని తమ్ముడు, అగుటంజేసి=అగుటవలన, లక్ష్మణుండు, కరుణాపరుండై= దయాపరవశుడై, విభీషణున్, తన వెనుకన్=తన వెనుకభాగమున, ఇడికొని=ఉంచికొని, ఎదిర్చినన్= ఎదిరించగా, కని=చూచి, నీవ=నీవే, నాపగరకున్=నా శత్రునకు, అడ్డంబవు+ఐతివి=అడ్డంకుగా ఉంటివి, కావునన్=అందువలన, నీవ=నీవే, ఈ శక్తిచేత, హతుఁడవు కమ్మని=చంపబడినవాడవు (చచ్చినవాడవు) అగుము అని, ఏసినన్= కొట్టగా, అదియును, శతఘంటికారంజితంబును=నూరుఘంటలతో అందముగా నున్నదియును, శతకోటినినదంబును=నూరుకోట్ల ధ్వనులు చేయునట్టియు, పావక జ్వాలాభీలకీలాన్వితంబునై=అగ్నిజ్వాలలచే భయంకరమగు అగ్నిశిఖలతో కూడియున్నది, పఱతేరన్=ప్రయాణించగా, కని=చూచి, సురేంద్రాది దేవగణంబులు=దేవేంద్రాది దేవసమూహములు, భయంబు, అంది=పొంది, రాముతమ్మునకున్=రాముని తమ్ముడగు లక్ష్మణునకు, దీర్ఘాయువు=దీర్ఘమగు ఆయువు, అగుంగావుత=కలుగుగాక!, అని, దీవింప= దీవింపగా, జగంబులు=లోకములు, తల్లడిల్లన్=బాధపడగా, సముద్రంబులు, ఘూర్ణిల్లన్=సముద్రములు ఉద్ఘోషించగా, కులాచలంబులు=కులపర్వతములు, వడంకన్=చలించగా, చంద్రార్కబింబములు=చంద్ర సూర్యబింబములు, తలంకన్=భయపడగా, ఏఁగుదెంచి=వచ్చి, సౌమిత్రియురంబునాటి=సౌమిత్రి వక్షముపై తగిలి, ధాత్రిన్ పడియెన్=భూమిపై పడెను, అట్టి అవసరంబునన్=అలాంటి సమయంలో...

**తా :** ఈ విధంగా తన రథాన్ని కూలదోయడంతో రావణుడు రథంలేని వాడయ్యాడు, మయుడు ఇచ్చిన శక్తిని పూని తమ్మునిమీద వేయ సిద్ధంగా ఉన్నంతలో, శరణుకోరి వచ్చిన వారికి వజ్రపంజరమువలె రక్షించే స్వభావము కలిగిన రామునితోడ బుట్టినవాడు కావడం వల్ల లక్ష్మణుడు దయాశాలియై విభీషణుణ్ణి

తనవెనుక పెట్టుకొని రావణుని ఎదుర్కొన్నాడు. అది చూసి రావణుడు నీవు నా శత్రువుకి అడ్డం వచ్చావు కనుక నువ్వే ఈ శక్తిచేత చావు అని ప్రయోగించగా ఆ శక్తి నూరు గంటలతో విరాజిల్లుతూ నూరుకోట్ల నినాదాలు చేస్తూ, అగ్నికీలలతో కూడి లక్ష్మణుని మీదకు రావడం చూసిన ఇంద్రుడు మొదలైన దేవతాగణాలు భయపడి రాముని తమ్మునకు దీర్ఘాయువు అగుగాక! అంటూ దీవించారు. ఆ సమయంలో జగాలన్నీ కంపించగా, సముద్రాలు ఘోషించగా, కులపర్వతాలు వణకిపోగా, చంద్రసూర్యబింబాలు భయపడగా ఆ బాణం వచ్చి సౌమిత్రి రొమ్మున నాటుకుని భూమిమీద పడింది; అప్పుడు.

**సీ. పంక్తికంధరుఁ డేయు బాణంబు లవి లెక్క**
**సేయక రఘుకులసింహుఁ డపుడు**
**తమ్మునిమెయి నాటి ధరణి గాడినశక్తి**
**నొగి వానరులు తీయ నోపకున్న**
**నవలీల దాని నొయ్యనఁ దీసి పోవైచి**
**ఘనులైన కపులను గాపు వెట్టి**
**నేనె రాముఁడ నైతినేని మజ్జనకుండు**
**దశరథుండగునేనిఁ దప్పకుండఁ**

**తే. గలన నెదిరించి నాతోఁడ గయ్యమునకు**
**నిలిచె నేనియు దనుజేంద్రు నిజము గాఁగ**
**నమరు లెఱుఁగంగ జంపుదు నతనిచేతఁ**
**జత్తు ఇంతియకాని నే రిత్తమగుడ.** **39**

**ప్రతి :** పంక్తికంధరుఁడు=రావణుడు, ఏయు, బాణంబులు, అవి, లెక్కసేయక, రఘుకులసింహుఁడు=రాముడు రఘువంశములో శ్రేష్ఠుడు, అపుడు, తమ్ముని శరీరానికి, నాటి=నాటుకుని, ఒగి=నేర్పుతో, వానరులు తీయన్=కోతులు తీయ, ఓపకున్నన్=లేకపోగా, అవలీల=తేలికగా, దానిన్, ఒయ్యనన్=సూటిగా, తీసి, పోవైచి=దూరంగా పడవేసి, ఘనులైన=గొప్పవారయిన, కపులను కాపువెట్టి=వానరులను కాపలాపెట్టి, నేనె, రాముఁడ నైతినేని=రాముణ్ణి అయినట్లయితే, మజ్జనకుండు=నా తండ్రి, దశరథుండగునేనిన్= దశరథుడయినట్లయితే, తప్పకుండన్, కలనన్=యుద్ధములో, ఎదిరించి, నాతోఁడన్, కయ్యమునకు, నిలిచె నేనియు=నిలబడినట్లయిన, దనుజేంద్రు=రావణుని, నిజముగాఁగన్=నిజముగా, అమరులు=దేవతలు, ఎఱుఁగంగన్=తెలియునట్లు, చంపుదున్, అతని చేతన్, చత్తున్, ఇంతియకాని, నేరిత్తమగుడ=నేను ఊరికే తిరిగివెళ్లను.

**తా :** రావణుడు ప్రయోగించే బాణాలు లెక్కచేయక రాముడు లక్ష్మణుని శరీరానికి నాటుకుని భూమిలోకి చొచ్చుకొనిపోయిన శక్తి అనే ఆయుధాన్ని వానరులు తీయలేకపోగా, తాను అవలీలగా తీసి దూరంగా

పడవేసి వీరులయిన వానరులను లక్ష్మణునికి కాపలాపెట్టి, నేనే గనుక రాముడనయితే దశరథపుత్రుణ్ణే అయితే యుద్ధరంగలో నాతో యుద్ధానికి సిద్ధమైన రావణుణ్ణి ఇంద్రాదేవతలకు తెలిసి వచ్చేలా చంపేస్తాను, లేదా అతని చేతిలో నేను చస్తాను అంతేకానీ ఊరికే తిరిగి వెళ్లను.

**వ. అని మఱియును. 40**

**తా :** అని పలికి, ఇంకనూ -

**క. రాముఁడు రావణుఁ డనుచును**
**భూమిపయిని నిర్వురునికి పొసఁగదు సుండీ**
**నామాట వినుఁడు లెస్సగ**
**రాముఁడ నే నొండె భువిని రావణుఁ డొండెన్. 41**

**ప్రతి :** రాముడు, రావణుఁడు, అనుచును, భూమిపయినిన్, ఇర్వురికిని=ఇద్దరికి, ఉనికి=ఉండుట, పొసఁగదు= సరిపడదు, సుండీ, నామాట వినుఁడు, లెస్సగ=బాగుగా, రాముఁడన్, ఏన్, ఒండె=ఒకడనో, భువిని=భూమిలో, రావణుఁడు, ఒండెన్=ఒకడో.

**తా :** రాముడు, రావణుడు అంటూ ఈ భూమిమీద ఇద్దరు ఉండడం కుదరని సంగతి. నా మాటలు బాగావినండి. రాముడను నేనయినా ఉండాలి లేదా రావణు డొకడేనా ఉండాలి. ఎవరో ఒకరే ఉండాలి.

**విశే :** బాగా కోపం వచ్చినప్పుడు తెలుగువారి వాక్యవిన్యాసం ఎలా ఉంటుందో సరిగ్గా అదేవిధంగా రాముడు మాట్లాడాడు, పొసగదుసుండీ! అనే తెలుగువాడి నాడిని ప్రయోగించింది మొల్ల.

**వ. ఉండుదుమని వీరాలాపంబు లాడుచు రామచంద్రుండు ధనుర్ధరుడై శరవర్షంబులు గురియించిన నసురేశ్వరుండును బ్రతిశరంబుల వాని నన్నింటినిం దూల నేసినఁ గనలి రామచంద్రుండు తొడిగిన యమ్మును వెడలు తూఁపులును విల్లుగుదుసు పడుటయు నెఱుంగరాని చందంబునఁ బింజపింజం గఱచి పాఱుచుండు నట్లుగా హస్తంబు ముడుచుటయుఁ జాచుటయు దెలియరాకుండ రావణు కాలు సేతు లాడకుండ శరలాఘవంబు నెఱపుచు నేయుచున్న యప్పుడు విఱిగి శరీర భూషణంబు లురులఁగిరీటంబులు డుల్లఁ దలలు వీడ మరలి మరలి చూచుచు మృగేంద్రుం గన్న గజేంద్రుని చందంబున భీతచేతస్కుండై దశముఖుండు లంకాపురంబుఁ జొచ్చెఁ దదనంతరంబున. 42**

**ప్రతి :** ఉండుదుము అని=రామరావణులలో ఎవరో ఒకరే ఉంటామని, వీరాలాపంబులు=వీరోచితములలైన మాటలను, ఆడుచున్=పలుకుచు, రామచంద్రుండు, ధనుర్ధరుఁడై=విల్లుపట్టినవాడై, శరవర్షంబులు=బాణముల వానలు, కురియించినన్=కురిపించగా, అసురేశ్వరుండును=రాక్షసరాజును, ప్రతిశరంబులన్=వాటిని ఎదుర్కొను బాణములచే, వానిన్ అన్నింటినిన్=ఆ బాణాలన్నింటిని, తూలన్=పడిపోవునట్లుగా, ఏసినన్= వేయగా, కనలి=బాధపడి, రామచంద్రుండు, తొడిగినయమ్మును=సంధించిన బాణమును, వెడలు

తూఁపులును=వెలువడు బాణములను, విల్లుగుడుసుపడుటయున్=విల్లు (ఎక్కుపెట్టినపుడు), గుండ్రముగా నగుటయును, ఎఱుంగరానిచందంబునన్=తెలియరాని విధంగా, పింజపింజన్ కఱచి=ఒకదానినొకటి పట్టుకొని, పాఱుచుండునట్లుగా=పరుగెత్తుచున్నట్లుగా, హస్తంబుముడుచుటయున్, చాచుటయున్, తెలియరాకుండన్=తెలియలేనివిధంగా, రావణుకాలుసేతులు, ఆడకుండన్=కదలకుండగా, శరలాఘవంబు= బాణముల వేగమును / శీఘ్రతను, నెఱపుచున్=కలిగించుచు, ఏయుచున్న యప్పుడు=వేస్తున్న సమయంలో, విఱిగి, శరీరభూషణంబులు=శరీరం మీది అలంకారాలు, ఉరులన్=జారిపడగా, కిరీటంబులు=నెత్తిమీది కిరీటముల, డుల్లన్=జారిపడగా, తలలు, వీడన్=విడిపోగా, మరలి మరలి= తిరిగి తిరిగి, చూచుచున్, మృగేంద్రున్=సింహమును, కన్న=చూచిన, గజేంద్రుని చందంబునన్=గజరాజులా, భీతచేతస్కుఁడై= భయపడిన మనస్సు కలవాడై, దశముఖుండు, లంకాపురంబున్=లంకాపట్టణమును, చొచ్చెన్=ప్రవేశించెను, తదనంతరంబున=అటుపిమ్మట.

**తా :** అయితే నేను, లేకపోతే రావణుడు ఎవరో ఒకరమే ఉంటామని వీరరసస్ఫూర్తి గల మాటలు మాట్లాడుతూ శ్రీరాముడు ధనుస్సు పట్టి బాణవర్షం కురిపించాడు, రావణుడు కూడా ఆ శరాలకు సమాధానంగా బాణాలు ప్రయోగించి రాముని బాణాలనన్నిటిని పడగొట్టగా శ్రీరాముడు మండిపడి వింటికి తొడిగే బాణం, వింటిలో నుండి వెలువడే బాణం, విల్లు గుండ్రంగా అవడం తెలియరాని విధంగా ఒకదాని వెంబడి ఒకటి గుచ్చుకొని పరుగెత్తుతున్నట్లుగా, చెయ్యి ముడవడం, చాచడం తెలియరాకుండా, రావణునికి కాళ్లు చేతులూ ఆడకుండా బాణప్రయోగంలో నేర్పును ప్రదర్శిస్తూ ప్రయోగిస్తూ ఉండగా రావణుడు భయపడి వంటి మీది నగలు జారిపోగా, కిరీటాలు రాలి పడిపోగా, తల కట్టుముడులు వీడిపోగా, తిరిగి తిరిగి చూస్తూ సింహాన్ని చూసిన ఏనుగులా భయపడిన మనస్సుతో లంకాపురానికి వెళ్ళిపోయాడు. ఆ తరువాత–

**విశే :** విల్లుగుడుసుపడుట=బాణం తొడిగి లాగినప్పుడు విల్లు గుండ్రంగా అవుతుంది–దాన్ని గుడుసు పడుట అంటారు.

**క.** **ఆ వేళ లావు సూపుచు**
**రావణుచేశక్తి దాఁకి రణరంగమునన్**
**జేవ సెడి పడిన లక్ష్మణ**
**దేవున్ దగ్గఱఁగ రామదేవుఁడు వచ్చెన్.** **43**

**ప్రతి :** ఆ వేళ=ఆ సమయములో, లావుసూపుచు=బలాన్ని ప్రదర్శిస్తూ, రావణుచే శక్తి దాఁకి=రావణుడు వేసిన 'శక్తి' అనే ఆయుధం తగిలి, రణరంగమునన్= యుద్ధరంగంలో, చేవసెడి=శక్తి హీనుడై, పడిన= పడిపోయిన, లక్ష్మణదేవున్=లక్ష్మణుని, దగ్గఱగ=సమీపానికి, రామదేవుఁడు=రాముఁడు, వచ్చెన్=వచ్చెను.

**తా :** రావణుడు ప్రయోగించిన శక్తి ఆయుధం తగిలి శక్తిహీనుడై యుద్ధరంగంలో పడిపోయిన లక్ష్మణుని దగ్గఱకు రాముడు వచ్చాడు.

**విశే :** లక్ష్మణ దేవుడు, లక్ష్మణదేవర, రామదేవుడు అనే ప్రయోగాలు తెలుగువారి వ్యవహారంలో కనిపిస్తాయి.

**వ. ఇట్లురుగుఁ దెంచి. 44**

**తే. రక్త సిక్తాంగుఁడై ధాత్రి శక్తి నాఁటి**
**యున్న తమ్మునిఁ గనుఁగొని యుస్సు రనుచు**
**దుఃఖ మంతంత నాఁగక తొంగలింపఁ**
**దొడలపై నిడి బాష్పముల్ దొప్పదోఁగ. 45**

**ప్రతి :** శక్తినాఁటి=శక్తిగుచ్చుకుని, రక్తసిక్తాంగుఁడై=రక్తముచేత తడపబడిన, అంగములు కలవాడై, ధాత్రిన్=భూమిమీద, ఉన్న=పడి ఉన్న తమ్ముని, కనుఁగొని=చూచి, ఉస్సురనుచు, దుఃఖము, అంతంతన్= ఎంతటికీ, ఆఁగక, తొంగలింపన్=పొంగిపొరలగా, తొడలపైనిడి=తొడలమీదపెట్టుకుని, బాష్పముల్=కన్నీరు, తొప్పదోఁగ=అధికంగా కారిపోగా.

**తా :** శక్తి గుచ్చుకోడంవల్ల శరీరమంతా నెత్తురుతో తడిసి భూమిమీద పడి ఉన్న తమ్ముణ్ణి చూచి నిట్టూర్చి దుఃఖము ఎంతకీ ఆగక పొంగి పొరలుతుండగా. తమ్ముణ్ణి తొడల మీద పడుకోపెట్టుకుని కన్నీరు కారుచుండగా-

## శ్రీరాముని సంతాపము

**సీ. హా! భానుకులదీప! హా! సత్యసల్లాప!**
**హా! సుగుణకలాప! హా సురూప!**
**హా! ధర్మసంచార! హా! వైరి సంహార!**
**హా కీర్తివిస్తార! హా! సుధీర!**
**హా! నిత్య సుజ్ఞాన! హా! పుణ్యసంధాన!**
**హా! పూజ్యసమ్మాన! హా!నిధాన!**
**హా! శౌర్యగుణవృద్ధ! హా! యుద్ధసన్నద్ధ!**
**హా! చిత్త సంశుద్ధ! హా!ప్రసిద్ధ!**

**తే. హా! మునీశ్వరసంరక్ష! యసురశిక్ష!**
**హా! గుణస్తోత్రసత్పాత్ర! యబ్జనేత్ర!**
**హా! సదాచారసంపన్న! హా! ప్రసన్న!**
**యనుచు శోకాతురాత్ముఁడై యంతకంత. 46**

**ప్రతి :** హా! భానుకులదీప!=సూర్యవంశానికి దీపమువంటివాడా! హా!, సత్యసల్లాప!=సత్యమే పలుకువాడా, హా! సుగుణకలాప=మంచిగుణములే భూషణములుగా గలవాడా, హా! సురూప=ఓ అందగాడా, హా!

ధర్మసంచార!=ధార్మికమైన నడవడిక గలవాడా!, హా! వైరిసంహార!=శత్రువులను సంహరించువాడా, హా! కీర్తివిస్తార!=వ్యాపించిన కీర్తిగలవాడ, హాసుధీర=గొప్పవీరుడా, హా! నిత్యసుజ్ఞాన!=ఎల్లప్పుడు మంచి జ్ఞానము కలవాడా, హా! పుణ్యసంధాన!=పుణ్యముతో కూడుకున్నవాడా! హా! పూజ్యసమ్మాన!=పెద్దలచే సమ్మానింపబడిన వాడా, హా! నిధాన!=ఆధారమైనవాడా!, హా! శౌర్యగుణవృద్ధ!=శౌర్యగుణము అధికముగా గలవాడా!, హా! యుద్ధసన్నద్ధ=యుద్ధమున సిద్ధపడి యుండెడివాడా!, హా! చిత్తసంశుద్ధ!=నిర్మలమైనచిత్తము గలవాడా, హా! ప్రసిద్ధ!=ప్రసిద్ధికెక్కినవాడా!, హా!, మునీశ్వర సంరక్ష!=మునీశ్వరులను రక్షించినవాడా!, అసురశిక్ష=రాక్షసులను శిక్షించినవాడా!, హా!, గుణస్తోత్ర, సత్పాత్ర!=స్తుతింపదగిన గుణములకు పాత్రమైనవాడా! అబ్జనేత్ర!= తామరలవంటి కన్నులు గలవాడా! హా!, సదాచారసంపన్న!=ఉత్తమమైన ఆచారములనే సంపదలతో కూడినవాడా, హా! ప్రసన్న=ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉండేవాడా!, అనుచు, శోకాతురాత్ముఁడై=శోకముతో కలవరపడిన మనస్సు కలవాడై, అంతకంత=ఇంకా ఇంకా!

**తా :** యుద్ధరంగమున శక్తిహీనుడై పడియున్న లక్ష్మణుని తన ఒడిలోనికి తీసికొని రాముడు ఇలా బాధపడుతున్నాడు – హా! సూర్యవంశానికి దీపంవంటివాడా! సత్యం మాట్లాడేవాడా! మంచిగుణాలు కలవాడా! సురూపా! ధర్మంగా సంచరించేవాడా! శత్రువులను సంహరించువాడా! గొప్ప కీర్తికలవాడా!, సుధీరా! నిత్యసుజ్ఞాన! పుణ్యం చేయువాడా! పూజ్యులను గౌరవించువాడా! నిధానా! శౌర్యగుణములచే పెద్దవాడా! యుద్ధసన్నద్ధుడా! స్వచ్ఛమగు చిత్తము కలవాడా! ప్రసిద్ధా! మునీశ్వరులను రక్షించువాడా! రాక్షసులను శిక్షించువాడా! స్తుతింపదగిన గుణములకు పాత్రుడైనవాడా! పద్మనేత్రా! సదాచార సంపద కలవాడా! ప్రసన్నా! అంటూ మిక్కిలి దుఃఖముచే ఉద్విగ్నమైన మనస్సు కలవాడై...

**విశే :** శ్రీరాముని ఈ సంబోధనలలో లక్ష్మణుని శీలసంపద తెలియవస్తున్నది. శ్రీరాముడే చెప్పడం వల్ల ఆ గుణములన్నీ సత్యసమ్మతమైనవే.

క. **జనకుని పంపున నడవికిఁ**
**జనుదెంచియు నిడుము కోర్చి సన్మునివృత్తిన్**
**ననుఁ గూడి నడవ నేర్చిన**
**యనుజన్మా! యెందుఁ బోయితయ్యా! తలఁపన్.** **47**

**ప్రతి :** జనకుని పంపునన్=తండ్రి ఆనతిని, అడవికిన్, చనుదెంచియున్=వచ్చి, ఇడుముకు=కష్టానికి, ఓర్చి=సహించి, సన్మునివృత్తిన్=ఉత్తమఋషి వృత్తిలో, ననున్, కూడి=కలిసి, నడవనేర్చిన=నడవడం తెలుసుకున్న, అనుజన్మా!=తోడబుట్టినవాడా!, ఎందుఁబోయితయ్యా!=ఎక్కడకు పోయావయ్యా! తలఁపన్= ఆలోచించగా.

**తా :** తండ్రి ఆజ్ఞమేరకు అడవికి వచ్చి ఇక్కడి కష్టాలకు ఓర్చి, మునుల జీవనాన్ని సాగిస్తూ నాతో కలిసి నడవడం తెలిసిన తమ్ముడా! ఎక్కడకు వెళ్లావని అనుకోనయ్యా!

**క. వనమునఁ గలఫలమూలము**
**లనుదినమును భక్తి యుక్తి నర్పింపుచు మ**
**జ్జనకుని భంగిని నన్నును**
**జనకజఁ బోషించి యెందుఁ జనితివి తండ్రీ!. 48**

**ప్రతి :** వనమునన్=అడవిలో, కల, ఫలమూలములు=పండ్లు దుంపలు, అనుదినమును=ప్రతిరోజు, భక్తియుక్తిన్=భక్తితో, అర్పింపుచు=తెచ్చి ఇస్తూ, మత్+జనకుని భంగిని=నా కన్న తండ్రివలె, నన్నును, జనకజన్=సీతను, పోషించి, ఎందున్, చనితివి=వెళ్ళితివి, తండ్రీ=నాయనా!.

**తా :** అడవిలోని పళ్లు దుంపలూ ప్రతిరోజు భక్తితో తీసుకొచ్చి సమర్పించి నా కన్నతండ్రిలా నన్ను సీతను పోషించావు కదా! ఇప్పుడు ఎక్కడికి వెళ్లావు తండ్రీ!

**విశే :** తండ్రీ! తల్లీ! ఇలా ఆదరంతో చిన్న పిల్లలను సంబోధిస్తూ ఉంటారు.

**క. నీవంటి తోడఁబుట్టువు**
**నీవంటి గుణోత్తరుండు నిజ మూహింపన్**
**భూవలయమందుఁ గలఁడే**
**భావింపఁగ నీవెతక్కఁ బావనచరితా! 49**

**ప్రతి :** నీవంటి, తోడబుట్టువు, నీవంటి, గుణోత్తరుండు=గుణశాలి, నిజము, ఊహింపన్=ఊహించగా, భూవలయమందున్=భూలోకములో, భావింపఁగ=భావన చేసి చూడగా, నీవెతక్కన్=నీవు తప్ప, కలదే!=ఉన్నాడా?, పావనచరితా=పుణ్యచరిత్రుడా!

**తా :** ఓ పుణ్యచరిత్రుడా! నీవంటి తోడబుట్టినవాడు నీవంటి ఉత్తమ గుణాలు కలవాడు, ఎంతగా ఆలోచించినా నిజంగా ఈ భూలోకంలో నువ్వు తప్ప ఎవరైనా ఉన్నారా?

**విశే :** రామునికి లక్ష్మణుని ఎడగల ప్రేమ ఎంత గొప్పదో ఈ పద్యంలో స్పష్టంగా తెలుస్తోంది.

**క. నెఱయక నిద్రాహారము**
**లెఱుఁగక పదునాలుగేండ్లు హితమతితో మ**
**మ్మతిముఱి నరసిన నిన్నును**
**మఱువ నగునె నీతి గల్గు మనుజుల కెందున్. 50**

**ప్రతి :** నెఱయక=బొత్తిగా, నిద్రాహారములు=నిద్ర ఆహారములు, ఎఱుగక=లేకుండా, పదునాలుగేండ్లు, హితమతితో=మేలు చేసే మనస్సుతో, మమ్ము=నన్ను సీతను, అతిముఱిన్=మిక్కిలిగా, అరసిన=రక్షించిన, నిన్నును, మఱవన్, అగునె, నీతిగల్గు, మనుజులకు, ఎందున్=ఎక్కడైనా?

**తా :** ఏమాత్రం నిద్రాహారాలు లేకుండా పధ్నాలుగు సంవత్సరాలు, మామేలు కోరుతూ మమ్మల్ని మిక్కిలి శ్రద్ధతో రక్షించిన నిన్ను మంచిచెడ్డా తెలిసిన మనుషులెవరైనా ఎక్కడైనా మరిచిపోగలరా!

**క.** **ని న్నిచట విడిచి పురికిని**
**జన్నను నినుఁ గన్న తల్లి సనుదెంచి ననున్**
**ని న్నడుగఁ దడవ మదిలోఁ**
**జిన్నం బోవుచును నేమి చెప్పుదుఁ దండ్రీ!** **51**

**ప్రతి :** నిన్ను, ఇచట, విడిచి, పురికిని, చన్నను=వెళ్ళినట్లయితే, నినున్, కన్నతల్లి, చనుదెంచి=వచ్చి, ననున్= నన్ను, నిన్ను, అడుగన్, తడవ=వెదుకుకొనగా, మదిలోన్=మనస్సులో, చిన్నంబోవుచునున్=చిన్నబోతూ, ఏమి, చెప్పుదున్, తండ్రీ!

**తా :** తండ్రీ! లక్ష్మణా! నిన్ను ఇక్కడ విడిచిపెట్టి అయోధ్యాపురికి వెళితే నీ కన్నతల్లి వచ్చి నన్ను లక్ష్మణుడు ఏడీ అని అడుగుతూ, వెదుక్కొంటూ ఉంటే మనసులో చిన్నబుచ్చుకుని నేను ఏమని చెప్పగలను.

**విశే :** చిన్నంబోవుచు – తెలుగునుడికారము.

**వ.** **అని మఱియును.** **52**

**చ.** **వినుఁడు కపీంద్రులార! పలవింపుచు మజ్జనకుండు నాకమున్**
**జనియె ధరాతనూభవ నిశాచరుచేఁ జెఱవోయె నేటితో**
**ననుజుఁడు దీఱె నింక నడియాసల నుండుట నాకు ధర్మమే**
**చనుఁడు నిజాశ్రమంబులకు సంశయ మొందక మీరుగొబ్బునన్.** **53**

**ప్రతి :** వినుఁడు, కపీంద్రులార!=వానర శ్రేష్ఠులారా!, పలవింపుచు=(నాకోసం) పలవరిస్తూ, మజ్జనకుండు= నా తండ్రి, నాకమున్=స్వర్గానికి, చనియె=వెళ్ళిపోయాడు, ధరాతనూభవ=భూపుత్రిసీత, నిశాచరుచేన్= రాక్షసునిచేత, చెఱవోయె=నిర్బంధింపబడింది, నేటితోన్=ఈ రోజుతో, అనుజుఁడున్=తమ్ముడు కూడా, తీఱెన్=తీరిపోయాడు, ఇంకన్, అడియాసలన్=వట్టి ఆసలతో, ఉండుట, నాకు, ధర్మమే, నిజాశ్రమంబులకు= మీ మీ ఇళ్లకు, సంశయము=అనుమానము, ఒందక=పొందక, మీరు, గొబ్బునన్= వేగముగా, చనుఁడు=వెళ్లండి.

**తా :** ఓ వానరోత్తములారా! వినండి, నా తండ్రి నాకోసం పలవరిస్తూ స్వర్గానికి వెళ్లిపోయాడు. సీతాదేవి రాక్షసుని చెఱలోకి వెళ్ళింది, ఈ రోజుతో నా తమ్ముడు కూడా పోయాడు. ఇంకా వట్టి ఆసలతో ఉండడం నాకు ధర్మమేనా! మీరు వేగంగా మీమీ ఇళ్లకి ఏ సంశయమూ లేదకుండా వెళ్ళిపొండి.

**వ.** **అని విభీషణుం గనుంగొని.** **54**

**తా :** అని పలికి, విభీషణుడి వంక చూస్తూ...

ఉ. అక్కట! నీకు నింటఁ గలయట్టి సుబాంధవకోటిఁ బాసి నీ
విక్కడ కేఁగుదెంచితి వహీన ముదంబున మమ్ము నమ్మి పెం
పెక్కఁగ రావణుండు తగ నేలెడిలంకఁ గడంగ నీకు నేఁ
దక్కఁగ నిత్తునన్ ప్రతిన తప్పె విభీషణ! నీవు పోవుమా. 55

**ప్రతి :** అక్కట!=అయ్యో! నీకున్, ఇంట గలయట్టి=ఇంట్లో ఉన్న, సుబాంధవ కోటిన్=మంచి బంధుసమూహన్ని, పాసి=వదిలిపెట్టి, నీవు, అహీనముదంబున=ఎంతో ఆనందంతో, మమ్ము, నమ్మి, ఇక్కడకు, ఏఁగుదెంచితివి= వచ్చితివి, పెంపెక్కగ=ఉత్సాహంతో, రావణుండు, తగన్=గొప్పగా, ఏలెడి= పరిపాలించెడి, లంకన్, కడంగ= పూనికతో, నీకు, నేన్, దక్కఁగన్=దక్కునట్లుగా, ఇత్తునన్=ఇచ్చెదను అనే, ప్రతిన=ప్రతిజ్ఞ, తప్పె=తప్పిపోయింది, విభీషణ!, నీవు, పోవుమా=వెళ్ళిపొమ్ము.

**తా :** అయ్యో విభీషణా! నీకు ఇంట్లో ఉన్న ఉత్తమ బంధుకోటిని వదిలిపెట్టి ఎంతో ఆనందంతో ఇక్కడికి మమ్మల్ని నమ్ముకుని వచ్చావు. ఉత్సాహంతో రావణుడు పరిపాలించే లంకను నేను నీకు దక్కేలా చేస్తానని ప్రతిజ్ఞ చేసాను. ఇప్పుడా ప్రతిజ్ఞ తప్పింది. నువ్వు వెళ్లిపో, పోవుమా! అని అభ్యర్థనగా చెప్తున్నాడు రాముడు.

వ. అని యనేక ప్రకారంబులఁ బ్రలపించుచున్న రామభూపాలునకు సుషేణుం డిట్లనియె. 56

**తా :** అని అనేకవిధాల దుఃఖిస్తున్న రామునితో సుషేణుడు ఇలా చెప్పాడు.

ఉ. దేవర! నీకు నీగతి మదిం దలపోయఁగ నేల తీవ్ర మై
రావణు చేతిశక్తి బవరంబున నాటుటఁజేసి లక్ష్మణుం
డీవిధిఁ నుండెఁగాని ధరణీశ్వర! చూడు ముఖారవిందమున్
జావఁడు సావఁ డియ్యెడ నిజంబుగ నమ్ము మనంబులోపలన్. 57

**ప్రతి :** దేవర!=దేవా! నీకున్, ఈగతి=ఈ విధంగా, మదిన్=మనస్సులో, తలపోయఁగన్=ఆలోచించడం, ఏల=ఎందుకు, తీవ్రమైన=తీక్షణమై, రావణుచేతి శక్తి=రావణుడు ప్రయోగించిన శక్తి, అనే ఆయుధం, బవరంబున=యుద్ధములో, నాటుటన్=గుచ్చుకొనుట, చేసి=వలన, లక్ష్మణుండు, ఈ విధిన్=ఈ విధముగా, ఉండెన్ కాని=ఉన్నాడు కాని, ధరణీశ్వర!=ఓ రాజా!, ముఖార విందమున్=ముఖపద్మాన్ని, చూడు=చూడుము, చావఁడు, సావడియ్యెడ=చనిపోలేదు ఇప్పుడు, నిజంబుగ, నమ్ము=నమ్ముము, మనంబులోపలన్=మనస్సులో–

**తా :** దేవా! ఈ రీతిగా మనస్సులో ఆలోచించడం ఎందుకు? యుద్ధంలో రావణుడు ప్రయోగించిన శక్తి చాలా తీక్షణమైనది కావడంవల్ల అది గట్టిగా గుచ్చుకోవడంవల్ల లక్ష్మణుడు ఇలా పడి ఉన్నాడు కానీ రాజా! సరిగ్గా ఆ ముఖపద్మాన్ని చూడు, ఇతడు చనిపోలేదు చనిపోలేదు ఇది నిజం, నామాట నీ మనస్సులో నమ్ము, అన్నాడు.

ఉ. పున్నమ చందురుందెగడి పొల్పెసలారెడి మోముఁదమ్మియున్
గన్నులు కల్వతేకులను గాంతి జయించెడుఁ గాని రక్తిమన్

**జెన్ను దొలంగియుండ వఱచేతులుఁ బాదములున్ దలంపఁగా**
**నున్నవి వర్ణముల్ గలిగి యొప్పుతొఱంగదు రాఘవేశ్వరా!** **58**

**ప్రతి :** పున్నమి చందురున్=పున్నమినాటి చంద్రుణ్ణి, తెగడి=తిరస్కరించి, పొల్పు=అందము, ఎసలారెడి= అతిశయించెడి, మోముఁదమ్మియన్=ముఖపద్మమును, కన్నులు, కల్వతేకులను=కలువపూరేకులను, కాంతి=కాంతి విషయంలో, జయించెడున్=జయిస్తున్నాయి, కాని, రక్తిమన్=ఎరుపురంగులో, చెన్ను=అందము, తొలంగియుండవు=లేకుండాలేవు, అఱచేతులున్, పాదములున్=కాళ్లు, తలంపగా=చూడగా, వర్ణముల్= రంగులు, కలిగి, ఉన్నవి, ఒప్పు=ఉండవలసిన స్థితి, తొఱంగదు=పోలేదు, రాఘవేశ్వరా!

**తా :** ఓ రామా! లక్ష్మణుని ముఖం పున్నమినాటి చంద్రుడి అందాన్నిమించి ప్రకాశిస్తోంది, కళ్లు కలువపూరేకులకాంతి, ఎఱుపుదనం, అందం కలిగి ఉన్నాయి, అఱచేతులు కాళ్లు చూస్తే చక్కని రంగు కలిగి ఉన్నాయి. జీవించిన మానవులకు ఉండవలసిన స్థితి ఎక్కడా పోలేదు, సర్వావయాలు చక్కగా ఆరోగ్యంగా జీవకళతో ఉన్నాయి.

**విశే :** సుషేణుడు వానరసేనలో గొప్ప వైద్యుడు. ఏయే దెబ్బలకు ఎలాంటి ఓషధులు వాడి వాటిని నయం చేయవచ్చో తెలిసిన వైద్యశిఖామణి, అంతే కాదు ఆయా ఓషధులు ఎక్కడ ఉంటాయో ఎలా తెచ్చుకోవాలో చెప్పగల లోకజ్ఞుడు.

**వ. అని విన్నవించుచు హనుమంతుఁ గనుంగొని సుషేణుం డిట్లులనియె.** **59**

**తా :** అని రామునకు చెప్తూ హనుమను చూచి, సుషేణుడు ఇలా అన్నాడు.

## సంజీవనికై హనుమ పయనము

**క. ఈయన ప్రాణము లెత్తఁగ**
**వాయుజ! యలనాఁటిమందు వడిఁ దేవలె నీ**
**వీయెడ నచటికిఁ దడయక**
**పోయి వెసన్ రమ్ము ప్రొద్దు పొడువక మునుపే.** **60**

**ప్రతి :** ఈయన=ఈలక్ష్మణుని, ప్రాణములు ఎత్తగన్=ప్రాణాలు లేపడానికి, వాయుజ!=హనుమా!, అలనాఁటి మందు=ఇంతకుపూర్వం నువ్వు తెచ్చిన మందు, వడిన్=వేగంగా, తేవలె=తీసుకుని రావాలి, నీవు, ఈయెడన్= ఇప్పుడే, అచటికిన్, తడయక=ఆలస్యంచేయకుండా, పోయి, వెసన్=వేగంగా, రమ్ము, ప్రొద్దు పొడవకమునుపే= సూర్యోదయం కాకముందే.

**తా :** లక్ష్మణుని ప్రాణాలు లేచిరావాలంటే హనుమా! పూర్వం నువ్వు తెచ్చిన మందు తొందరగా తేవాలి. నువ్వు ఇప్పుడే ఆలస్యం చేయకుండా అక్కడికి వెళ్ళి తొందరగా సూర్యుడు ఉదయించక ముందే రావాలి.

**విశే :** పొద్దుపొడవక ముందే – కందువ మాట.

**వ. అనిన భూకాంతుండు హనుమంతున కిట్లనియె. 61**

**ప్రతి :** అనిన=అనగా, భూకాంతుడు=రాజు, హనుమంతున కిట్లనియె=హనుమంతునితో ఇలా అన్నాడు.

**తా :** అనగా భూకాంతుండయిన రాముడు హనుమతో ఇలా అన్నాడు.

**క. రమ్మా వాయుతనూభవ!**
**యిమ్మహి సత్కీర్తిఁ బడయు మీతని ప్రాణం**
**బిమ్ముగ రక్షింపుము నా**
**తమ్ములలో నీవు నొక్కతమ్ముఁడ వరయన్. 62**

**ప్రతి :** రమ్మా!, వాయు తనూభవ!=హనుమా!, ఈ+మహిన్=ఈ భూమి మీద, సత్కీర్తిన్=ఉత్తమమయిన కీర్తిని, పడయుము=పొందుము, ఈతని=ఈ లక్ష్మణుని, ప్రాణంబు, ఇమ్ముగ=చక్కగా, రక్షింపుము, అరయన్=ఆలోచించగా, నా తమ్ములలో, నీవున్, ఒక్క తమ్ముడవు.

**తా :** ఓ వాయుపుత్రుడా! రమ్మా! ఈ మా తమ్ముని ప్రాణాలు చక్కగ రక్షించి ఈ భూమిమీద మంచికీర్తిని పొందు. ఆలోచించి చూడగా నా తమ్ముళ్లలో నీవుకూడా ఒక తమ్ముడవే.

**విశే :** ఈ పద్యంలో హనుమ అతివేగంగా వెళ్ళిరావాలి. మందుతీసుకొని తెల్లవారేలోగా రమ్మని సుషేణుడు చెప్పాడు, కాబట్టి వేగం ఎంతో అవసరం. అందుకే రాముడు హనుమను వాయుతనూభవ! అని పిలుస్తున్నాడు. వాయువుకు పుట్టినవాడవు కనుక వాయువేగంతో ఈపని చేసుకురావాలి అని.

ఇక హనుమ తాను రామదూతననీ, రామదాసుననీ, రామ భక్తుడననీ ప్రకటించుకున్నాడు అవకాశం వచ్చినప్పుడల్లా. కానీ ఈ రోజు రాముడు హనుమను నాయనా నువ్వు నా తమ్ముళ్లలో ఒక తమ్ముడువి సుమా! అని ఎంతో ప్రేమతో అభిమానంతో పేర్కొనడం విశేషం.

**విశే :** సర్వమానవ సౌభ్రాత్రము కాదు ఇది సర్వజీవ సౌభ్రాత్రము. చక్కని పద్యము. చక్కని భావము. మొల్ల అందమయిన కందంలో రమ్మా! వాయు తనూభవ! అని రాముని పిలుపే మధురంగా వినవస్తోంది.

**వ. అని దాయం జని కౌఁగిటం జేర్చి దీవించి యంపె నపుడు. 63**

**తా :** నా తమ్ముడవు! నా తమ్ముళ్లలో నువ్వు ఒకడివి అని దగ్గరగా వెళ్లి కౌగిలించకొని దీవించి పంపాడు. అప్పుడు.

**ఆ. పదము లూనఁ ద్రొక్కి వదనంబు దిగఁ జూచి**
**చేతు లూని నడుము చిక్కఁబట్టి**
**క్రుంగి నిక్కి యెగసి కుప్పించి వడి దాఁటి**
**చనియె గగనవీథి ననిలసుతుఁడు. 64**

**ప్రతి :** పదములు=పాదాలు, ఊనన్=గట్టిగా ఆనునట్లు, త్రొక్కి, వదనంబు=ముఖము, దిగఁజూచి=క్రిందికి చూచి, చేతులు, ఊని=నొక్కిపెట్టి, నడుము, చిక్కఁబట్టి, క్రుంగి=వంగి, నిక్కి=నిటారుగా పెట్టి, ఎగసి=ఎగిరి, కుప్పించి=దుమికి, వడి=వేగంగా, దాఁటి=గెంతి, చనియె, గగనవీథిన్=ఆకాశవీథిలో, అనిల సుతుడు= వాయువుకొడుకు హనుమ.

**విశే :** ఈ పద్యం ఛందస్సు - ఆటవెలది, ఆటవెలది అంటే నాట్యకత్తె అని అర్థం. నాట్యకత్తె=చూపే అభినయమంతా హనుమ ఈ పద్యంలో చూపాడు. ఆకాశంలోకి ఎగిరే ముందు, చేసే ప్రయత్నాలన్నీ చిన్న ఆటవెలదిలో అచ్చ తెనుగు పదాలలో నప్పింది మొల్ల.

**వ. అట్టి సమయందున. 65**

**తా :** అటువంటి సమయంలో

## కాలనేమి కపటోపాయము

**సీ. దనుజేశుఁ డావార్త విని కాలనేమి గే**
**హము సొచ్చి నడిరేయి యతనితోడఁ**
**తనచేత హతుఁ డైన ధరణీశు తమ్ముని**
**ప్రాణంబు లెత్తంగఁ బవనసుతుఁడు**
**సనుచున్న యట్టి యా పని విఘ్న మొనరింపఁ**
**గ్రక్కున నటఁ బోయి ర మ్మటన్నఁ**
**గాలనేమి యిదేటి కార్యంబు తగ దన్న**
**వినక కోపించిన వేగ నరిగి**

**తే. ద్రోణ శైలంబు చేరువ త్రోవయందు**
**వనముఁ గావించి తగ మునీశ్వరునిరీతి**
**జపము సేయుచుఁ గన్నులు చక్కమూసి**
**నడుము నిక్కించి పద్మాసనమున నుండె. 66**

**ప్రతి :** దనుజేశుఁడు=రావణుడు, ఆ వార్తవిని, కాలనేమి గేహము=కాలనేమి అనే రాక్షసుని ఇంట, చొచ్చి=ప్రవేశించి, నడిరేయి=అర్ధరాత్రి, అతనితోడన్, తనచేత హతుఁడైన=తనచే చంపబడిన, ధరణీశు తమ్ముని=రాము తమ్ముని, ప్రాణంబులు=ప్రాణాలు, ఎత్తంగన్=లేపుటకు, పవనసుతుఁడు=హనుమ, చనుచున్నయట్టి యాపని=వెళుతున్న పనిని, విఘ్నమొనరింపన్=పాడుచేయుటకు, గ్రక్కునన్=వెంటనే, అటన్=అచటకు, పోయిరమ్ము, అటన్నన్=అనిచెప్పగా, కాలనేమి, ఇదేటి-ఇది+ఏటి=ఇదేమి, కార్యంబు= పని, తగదు=వద్దు, అన్నన్=అని చెప్పినా, వినక, కోపించిన, వేగన్, అరిగి=వెళ్ళి, ద్రోణశైలంబు, చేరువత్రోవయందు=దగ్గరమార్గములో, వనమున్=ఒకతోటను, కావించి=సృష్టించి, తగ=సరిగా,

మునీశ్వరునిరీతి=మునీశ్వరునివలె, జపము, చేయుచున్, కన్నులు, చక్కమూసి=చక్కగా మూసుకొని, నడుము నిక్కించి=నడుము నిటారుగాపెట్టి, పద్మాసనమునన్=పద్మాసనము వేసుకుని, ఉండె.

**తా :** హనుమ ద్రోణగిరికి వెళుతున్న వార్తవిన్నరావణుడు ఆ అర్ధరాత్రి కాలనేమి ఇంటికి వెళ్ళి నేను రాముని తమ్ముడు లక్ష్మణుని చంపాను. అతని ప్రాణాలకోసం మందు తేవడానికి హనుమ బయలుదేరాడు, నువ్వు వేగంగా అక్కడకు వెళ్లి హనుమ పనికి విఘ్నం కలిగించు అని చెప్పాడు, కాలనేమి ఇదేమి పని - ఇలా చెయ్యడం తగదు అని చెప్పి చూసాడు, రావణుడు వినక కాలనేమి మీద కోపించగా అతడు వేగంగా బయలుదేరి ద్రోణగిరి సమీపమార్గంలో ఒక వనాన్ని సృష్టించి సరిగ్గా మునీశ్వరునివలె కళ్లు మూసికొని, నడుము నిటారుగాపెట్టి, పద్మాసనస్థుడై ఉన్నాడు.

**వ. అప్పు డాకాశమార్గంబునఁ జనుచున్న యప్పవనసుతుండు వనంబుగాంచి త్రోవ తప్పె నని మనంబున సందియ మొంది యమ్మునీంద్రు నడిగి చనువాఁడై యతనికి నమస్కరించి యిట్లనియె. 67**

**ప్రతి :** అప్పుడు, ఆకాశమార్గంబునన్=ఆకాశమార్గంలో, చనుచున్న=వెళ్ళుచున్న, అ+పవనసుతుండు-అప్పవనసుతుండు=ఆ హనుమంతుడు, వనంబుగాంచి=తోటను చూచి, త్రోవతప్పెను అని=దారి తప్పితినని, మనంబునన్=మనస్సులో, సందియము=సందేహమును, ఒంది=పొంది, అమ్మునీంద్రున్ (ఆ+మునీంద్రున్)= ఆ మునిశ్రేష్ఠుని, అడిగి, చనువాఁడై=వెళ్ళువాడై, అతనికిన్, నమస్కరించి, ఇట్లు, అనియెన్.

**తా :** అప్పుడు ఆకాశమార్గంలో వెళుతున్న హనుమంతుడు ఆ తోటను చూచి నేను త్రోవతప్పినట్లుగా ఉన్నానని మనసులో సందేహం కలగడంతో ఈ మునీంద్రుని అడిగి వెళదాము అనుకుని దిగి ఆ మునికి నమస్కరించి ఇలా అన్నాడు.

**తే. మునినాథ! నేను రాముని**
**పనికై చనుచున్న వాఁడఁ బరమౌషధముల్**
**గొని రావలె మది భావిం**
**చి నిజమ్ముగ నిపుడు త్రోవ సెప్పుము నాకున్. 68**

**ప్రతి :** మునినాథ! నేను, రాముని పనికై, చనుచున్నవాఁడన్=వెళుతున్న వాడను, పరమౌషధముల్= ఉత్తమమైన ఓషధులు, కొనిరావలె=తీసుకునిరావలెనని, మదిభావించి=మనస్సులో అనుకొని, నిజమ్ముగన్, ఇపుడు, త్రోవ, చెప్పుము, నాకున్.

**తా :** ఓ మునినాథ!, నేను రాముని పనిమీద పరమ ఓషధులు తీసుకుని రావడానికి వెళుతున్నాను. మనస్సులో నా స్థితిని గమనించి నిజమని భావించి నాకు ఇప్పుడు త్రోవచెప్పుము.

**వ. అని ప్రార్థించి దాహోపశమనంబున కుదకంబు వేఁడిన నక్కపట మునీంద్రుం డిట్లనియె. 69**

**ప్రతి :** దాహోపశమనంబునకు = దప్పిక తీరుటకు, ఉదకంబు = నీరు.

**తా :** అని ప్రార్థించి దప్పిక తీర్చుకోవడానికి నీరు కావాలని కోరగా ఆ కపటముని ఇలా అన్నాడు.

**ఆ. పవనతయ! రామభద్రునిపని మాకుఁ**
**దీర్పవలయుఁ గాన నేర్పుతోడఁ**
**బ్రాణరక్ష కొఱకు ద్రోణాద్రి కరుగంగ**
**వలదు వినుము నాదు వనమునందు. 70**

**ప్రతి :** పవనతనయ!=ఓ హనుమ, రామభద్రునిపని, మాకున్=మాకు కూడా, తీర్పవలయున్=చేయవలసినదే, కాన=కాబట్టి, నేర్పుతోడన్=నేర్పుతో, ప్రాణరక్షణ కొఱకు=ప్రాణాలు రక్షించడానికి, ద్రోణాద్రికిన్=ద్రోణపర్వతం దగ్గరికి, అరుగంగ వలదు=వెళ్లవద్దు, వినుము, నాదువనమునందు –

**తా :** పవనతనయా! రాముని పని మాకు కూడా చేయవలసినదే. కాబట్టి ఇప్పుడు ప్రయత్నంతో ప్రాణరక్షణ కోసమని ద్రోణపర్వతానికి వెళ్లవలదు, విను – నా వనములో (తరువాత పద్యంతో అన్వయము).

**తే. ఘనతరం బైన సంజీవి కరణి మొదలు**
**గాఁగ దివ్యౌషధంబులు గలవుగానఁ**
**గొంచుఁ బోవచ్చుఁ గావునఁ గోరుపండ్లు**
**తనివి దీఱంగఁ దిని నీళ్ళు త్రాగుమిచట. 71**

**ప్రతి :** ఘనతరంబైన=మిక్కిలి గొప్పవైన, సంజీవకరణి, మొదలుగాఁగ= మొదలయిన, దివ్యౌషధంబులున్= దివ్యమైన ఓషధులు, కలవుగానన్=ఉన్నవి కనుక, కొంచున్=తీసుకుని, పోవచ్చున్=వెళ్లవచ్చును, కావునన్= కాబట్టి, కోరుపండ్లు=నీకు కావలసినట్టి పండ్లు, తనివిదీఱంగన్=తృప్తిగా, తిని, నీళ్లు త్రాగుము, ఇచట.

**తా :** సంజీవకరణి వంటి గొప్ప ఔషధాలు ఉన్నాయి కాబట్టి నువ్వు తీసుకుని వెళ్లవచ్చు. ముందు నీకు నచ్చిన పళ్లుతిని మంచినీళ్లు తాగు.

**వ. అని తనహస్తంబున నున్న విషయుక్తం బైన కమండలూదకంబు చూపినం గని హనుమంతుడవి చాల వనిన నక్కపటమునీంద్రుండు క్రూరమకరావృతం బైన కమలాకరం బొకం డెఱింగించి పొమ్మనినఁ బవనాత్మజుండుసని. 72**

**ప్రతి :** అని, తనహస్తంబునన్ ఉన్న=తన చేతిలో ఉన్న, విషయుక్తంబైన=విషము కలిపిన, కమండలూదకంబు= కమండలులోని నీటిని, చూపినన్=చూపించగా, కని=చూచి, హనుమంతుడు, అవి, చాలవు=సరిపడవు, అనినన్=అనగా, అక్కపట మునీంద్రుండు (ఆ+కపటమునీంద్రుండు)=ఆ దొంగ ముని, క్రూర మకరావృతంబైన=భయంకరమైన మొసళ్ళతో నిండిన, కమలాకరంబు=సరస్సు, ఒకండు, ఎఱింగించి= తెలిపి, పొమ్ము, అనినన్=అనగా, పవనాత్మజుండు=వాయుపుత్రుడు హనుమంతుడు, చని=వెళ్ళి...

**తా :** అని తన చేతిలో ఉన్న కమండలములోని విషం కలిపిన నీటిని చూపాడు. హనుమంతుడు నా దాహానికి ఈ కొంచెం చాలవు అన్నాడు. అప్పుడు ఆ కపట మునీంద్రుడు భయంకరమైన మొసళ్లతో నిండి ఉన్న ఒక తామరకొలనుకు వెళ్లమని దారి చెప్పగా హనుమంతుడు –

క. విమల మకరంద లుబ్ధ
భ్రమర నికర పక్ష పవన పరికంపిత స
త్కమనీయ కుముద కైరవ
కమలంబులు గలుగు కొలనుఁ గనుఁగొని యచటన్. 73

ప్రతి : విమల=స్వచ్ఛమయిన, మకరంద=తేనెపై, లుబ్ధ=ఆశపడిన, భ్రమరనికర పక్షపవన=తుమ్మెదల సమూహము యొక్క రెక్కల గాలిచేత, పరికంపిత=అధికముగా చలించునట్టి, సత్కమనీయ=మంచి మనోహరమైన, కుముద కైరవకమలంబులు=తెల్లకలువలు, కలువలు, ఎఱ్ఱతామరలు, కలుగు, కొలనున్, కనుఁగొని, అచటన్.

తా : స్వచ్ఛమైన తేనెకోసం ఆశపడే తుమ్మెదల గుంపులు ఎగురుతూ ఉంటే వాటి రెక్కలగాలికి కదులుతున్న మనోహరమైన కలువలు, తెల్లతామరలు, ఎఱ్ఱతామరలతో నిండిన కొలనును చూచి అక్కడ.

విశే : సరళ సంస్కృత సమాస సంభరితమయిన కందమిది.

### శాప వియుక్తయై దేవకన్యయైన మొసలి

సీ. మడుగు లోపలఁ జొచ్చి కడుపార నుదకంబు
గ్రోలంగ దిగ నందుఁ గ్రాలు మొసలి
పాదముల్ కబళించి పట్టినఁ జరణముల్
విదళింపఁ బట్టూని విడవకున్న
గడు సూక్ష్మరూపుఁడై కడుపులోపలఁ జొచ్చి
వేగంబ భేదించి వెడలె నంత
నది దేవకన్యయై యాకాశముననుండి
తనదు వృత్తాంత మంతయును జెప్పి

తే. వీఁడు దైత్యుండు నమ్మకు వీనిఁ జంపి
పొమ్ము సంజీవి కొండకుఁబ్రొద్దు గలుగ
నీ కతంబున శాపంబు నాకుఁ దీఱె
ననుచు దీవించి చనియెఁ దా నమరపురికి. 74

ప్రతి : మడుగు, లోపలన్=లోపలికి, చొచ్చి=వెళ్ళి, కడుపార=కడుపునిండా, ఉదకంబున్=నీటిని, క్రోలంగ= త్రాగుటకు, దిగన్=దిగగా, అందున్, క్రాలు=తిరుగుచున్న, మొసలి, పాదముల్=కాళ్లు, కబళించిపట్టినన్= నోటితో పట్టుకోగా, చరణముల్=కాళ్లు, విదళింపన్=విదలించగా, పట్టు, ఊని=నొక్కిపట్టి, విడవకున్న= విడవకుండా ఉన్న, కడుసూక్ష్మరూపుఁడై=మరీ చిన్నరూపంతో, లోపలన్=లోపలికి, చొచ్చి=వెళ్ళి, వేగంబ= వేగంగా, భేదించి=చంపి, వెడలెను=బయటికి వచ్చాడు, అంత=అప్పుడు, అది=మొసలి, దేవకన్యయై=

దేవకన్యగా మారి, ఆకాశమున నుండి=ఆకాశానికి ఎగిరి అక్కడనుండి, తనదు=తనయొక్క, వృత్తాంతము=కథ, అంతయును=అంతా మొత్తము, చెప్పి, వీఁడు=ఈముని, దైత్యుండు=రాక్షసుడు, నమ్మకువీనిన్=వీణ్ణి నమ్మవద్దు, చంపి=వాణ్ణి చంపి, పొమ్ము=వెళ్లుము, సంజీవి కొండకున్, ప్రొద్దుగలుగ=ప్రొద్దు ఉండగానే, నీకతంబున=నీ కారణంగా, నాకున్, శాపంబు, తీఱెన్=తీరిపోయినది, అనుచు, దీవించి, చనియెన్, తాన్, అమరపురికి= దేవలోకానికి.

**తా :** ఆ మనోహరమైన మడుగు చూచి లోపలికి వెళ్ళి కడుపారా మంచినీళ్లు త్రాగుదామని కొలనులో దిగాడు. దిగగానే ఆ కొలనులో తిరుగాడే మొసలి అతడి కాళ్లను నోటితో పట్టుకుంది. హనుమ కాళ్లు విదిలించాడు కాని ఆ మొసలి గట్టిగా పట్టి విడవకపోవడంతో చిన్నరూపంగా మారి మొసలి లోపలికి ప్రవేశించి దాన్ని చీల్చి, చంపి బయటకు వచ్చాడు. ఆ మొసలి కూడా దేవకన్యగామారి ఆకాశంలోకి ఎగిరి అక్కడనుండే తన సంగతి అంతాచెప్పి, ఈ ముని ఒక రాక్షసుడు. వీణ్ణి నమ్మకు. వీణ్ణి చంపి నువ్వు సంజీవినీ కొండకు ప్రొద్దు ఉండగా వెళ్లు. నీ కారణంగా నాకు శాపం తీరిపోయింది అంటూ హనుమను దీవించి దేవలోకానికి వెళ్ళిపోయింది.

**విశే :** ఇది ఒక అద్భుత సన్నివేశం. కాలనేమి వృత్తాంతం వాల్మీకి రామాయణంలో లేదు. ఈ కథలో కూడా హనుమ తనకు అనుభవం ఉన్నరీతిలో, సురస, ఛాయాగ్రాహి (సింహిక)ల నోట్లో ప్రవేశించడానికి చిన్నగా మారినట్లే ఇక్కడ కూడా చిన్న శరీరంతో మొసలి కడుపులోకి ప్రవేశించి దాన్ని చంపి బయటపడ్డాడు. సాగరలంఘన సమయంలో సమకూడిన అనుభవం ఇక్కడ కూడా ఉపయోగపడింది.

**వ. అంత హనుమంతుడు తేజోవంతుడై యరుగుదెంచి కపటసంయమినిం గనిన నతండిట్లనియె. 75**

**ప్రతి :** సంయమి=ముని.

**తా :** అప్పుడు హనుమంతుడు మహాతేజస్సుతో వచ్చి కపట మునిని చూసాడు. ఆ ముని ఇలా అన్నాడు.

### కాలగతి చెందినకాలనేమి

**చ. తడసితి వేల యింతవడి దాపుననే వసియించినట్టి యీ**
**మడుగున కేఁగి రాకునికి మా కనుమానము దోఁచెనయ్య! యి**
**ప్పుడు గలదేనిఁ గొంత గురుపూజకు విత్తము కాన్క వెట్టి నీ**
**వడుగుము మందు లెట్టివి ప్రియంబగు నట్టివి నీకు నిచ్చెదన్. 76**

**ప్రతి :** తడసితివి=ఆలస్యం చేసావు, ఏల=ఎందువల్ల, ఇంతవడి=ఇంతసేపు, దాపునన్=దగ్గఱలోనే, వసియించినట్టి=ఉన్నటువంటి, ఈ మడుగునకు, ఏఁగి, రాకునికి=రాకపోయేసరికి, మాకు, అనుమానము, తోఁచెన్, అయ్య! ఇప్పుడు, కలదేనిన్=నీదగ్గర ఏమైనా ధనం ఉన్నట్లయితే, గురుపూజకు=గురువుకు చేసే పూజకు, కాన్కవెట్టి=కానుకగా పెట్టి, నీవు, అడుగుము, మందులు, ఎట్టివి, ప్రియంబగు=ఇష్టపడతావో, అట్టివి, నీకున్, ఇచ్చెదన్.

**తా :** చాలా దగ్గరలోనే ఉన్న ఈ మడుగుకు వెళ్ళి రావడానికి ఇంత ఆలస్యం చేసావేమి, ఎప్పటికీ రాకపోయేసరికి మాకు అనుమానం కలిగింది. సరే ఇప్పుడు నీ దగ్గఱ డబ్బు ఏదైనా ఉంటే గురుపూజకు కానుకగా (దక్షిణగా) పెట్టి నీకు ఏమేమి మందులు కావాలో అడుగు ఇస్తాను అన్నాడు కపట ముని.

**చ. అనవుడుఁ గోపమెత్తి పవనాత్మజుఁ డప్పుడు నీకుఁ బూజ గొ**
**మ్మని యురుముష్టిచేఁ బొడువ నాతఁడు డీకొని పక్షిరూపుఁడై**
**తనుఁగదియంగవచ్చుటయు దాని నపక్షముగాఁగ ద్రుంచినన్**
**గినిసి మృగేంద్రుఁడై పొడువఁ గేసరిపుత్త్రుఁడు దానిఁగూల్చినన్. 77**

**ప్రతి :** అనవుడున్=అనగానే, కోపమెత్తి=కోపంవచ్చి, పవనాత్మజుఁడు=హనుమంతుడు, అప్పుడు, నీకున్, పూజన్ కొమ్మని=పూజ చేస్తాను స్వీకరించు, ఉరుముష్టిచేన్=దృఢమైన పిడికిలితో, పొడువన్=పొడువగా, ఆతఁడు, డీకొని=ఎదుర్కొని, పక్షిరూపుఁడై=పక్షిరూపంలో, తనున్=తనను, కదియంగవచ్చుటయున్= దగ్గఱగా ఎదుర్కొనటానికి రాగా, దానిని=ఆ పక్షిని, అ పక్షముగాఁగన్=రెక్కలు లేకుండా, త్రుంచినన్=కోయగా, కినిసి=కోపించి, మృగేంద్రుఁడై=సింహరూపుడై, పొడువన్=కుమ్మగా, కేసరిపుత్త్రుఁడు=హనుమ, దానిన్= ఆ సింహాన్ని, కూల్చినన్=కూలగొట్టగా.

**తా :** కపటముని మాటలకు హనుమ కోపంతో నీకు పూజ చేస్తాను తీసుకో అంటూ దృఢమైన పిడికిలితో పొడిచాడు. ఆ ముని వెంటనే పక్షిగా మారి ఎదుర్కొన్నాడు. హనుమ ఆ పక్షికి రెక్కలు లేకుండా త్రుంచేశాడు. అప్పుడు ఆ రాక్షసుడు సింహంగా రూపాన్ని మార్చుకుని హనుమను కుమ్మాడు. కేసరి పుత్రుడయిన హనుమ ఆ సింహాన్ని కూలగొట్టగా -

**విశే :** ఈ పద్యంలో కపటముని సింహంగా మారినప్పుడు - కేసరి పుత్రుడు ఆతనిని పడగొట్టాడని మొల్ల - వర్ణన. కేసరి అంటే సింహము నువ్వు సింహానివయితే నేను సింహపుత్రుణ్ణి అని హనుమ విజృంభించాడు అన్నట్లు.

**తే. అంత సుగ్రీవుఁడై వచ్చి యనిలతనయ**
**బ్రతికె సౌమిత్రి మందులపని తలంప**
**వలదు రమ్మని నన్ను భూవరుఁడు పనిచె**
**మగిడి పోదము పద మన్న మాట వినుచు. 78**

**ప్రతి :** అంత, సుగ్రీవుఁడై, వచ్చి, అనిలతనయ! = హనుమా! బ్రతికె=జీవించాడు, సౌమిత్రి, మందులపని= మందులకోసం చేసే ప్రయత్నం, తలంపవలదు=ఆలోచించకు, రమ్మని=వచ్చెయ్యమని, నన్ను, భూవరుఁడు= రాముఁడు, పనిచె=పంపాడు, మగిడిపోదము=తిరిగి వెనక్కివెళదాము, పదమన్నమాట=పదఅన్న మాటవినుచు-

**తా :** ఈమారు ఆ కపటముని సుగ్రీవుని వేషంలో వచ్చి, హనుమా! సౌమిత్రి బ్రతికాడు, ఇక మందులతో పనిలేదు, ఆ ఆలోచన అక్కరలేదు తీసుకురమ్మని నన్ను రాముడు పంపాడు. పదవెనుకకు తిరిగి వెళదాము అన్నమాట వింటూ-

**వ. సుగ్రీవుండని విచారించి కాకుండు టెఱింగి వాని బాహుమధ్యంబుఁ బొడిచిన నతం డారూపంబు విడిచి శతశృంగుండై నొప్పించిన నలిగి జగత్ప్రాణ నందనుండు వాలంబున నడిచి కరంబులు ఛేదించి శిరంబుఁ ద్రుంచివైచి సింహనాదంబు చేసి జయలక్ష్మిం గైకొని. 79**

**ప్రతి :** సుగ్రీవుండు, అని, విచారించి=విచక్షణతో ఆలోచించి, కాకుండుట=కాకపోవుట, ఎరిఁగి=తెలిసి, వాని, బాహుమధ్యంబున్=వక్షస్థలముపై, పొడిచినన్=పొడవగా, అతండు, ఆరూపంబు విడిచి=ఆ రూపాన్ని విడిచిపెట్టి, శతశృంగుండై=నూరు కొమ్ములు కలవాడై, నొప్పించినన్=బాధించగా, అలిగి=కోపించి, జగత్ప్రాణ నందనుండు=వాయుపుత్రుడు హనుమ, వాలంబునన్=తోకతో, అడచి=అణచి, కరంబులు=చేతులు, ఛేదించి=ఖండించి, శిరంబున్=తలను, త్రుంచివైచి=ఖండించి, సింహనాదంబు చేసి=సింహగర్జన చేసి, జయలక్ష్మిన్=విజయలక్ష్మిని, కైకొని=పొంది...

**తా :** వీడు సుగ్రీవుడా? అని అనుమానించి, కాదు అని తెలుసుకుని ఆ ముని బాహుమధ్యంలో పొడిచాడు. పొడవగానే కాలనేమి సుగ్రీవరూపం విడిచి, నూరుకొమ్ములుగలవాడై హనుమంతుణ్ణి బాగా నొప్పించాడు. హనుమ కోపంతో తోకతో అడిచి పట్టుకుని, చేతులు కోసేసి, తలత్రుంచి వేసి సింహనాదం చేసి, విజయుడై జయలక్ష్మిని స్వీకరించి, శతశృంగుడు=నూరుకొమ్ములు గలవాడు, జగత్ప్రాణ నందనుండు=జగత్తులోని సర్వులకు ప్రాణమైన వాయుదేవుని నందనుడు=హనుమ.

## హనుమతుం(డు పెకలించి తెచ్చిన సంజీవని పర్వతము

**క. ద్రోణాద్రి కేఁగి మందులు**
**పోణిమి నీకున్నఁ గినిసి పొల్పలరఁగ నా**
**క్షోణీధర మగలింపుచుఁ**
**బాణితలాగ్రమునుఁ బెట్టి పట్టుకరాఁగన్. 80**

**ప్రతి :** ద్రోణాద్రికిన్=ద్రోణపర్వతానికి, ఏఁగి=వెళ్ళి, మందులు, పోణిమిని=గౌరవంతో, ఈ కున్నన్=ఇవ్వకపోగా, కినిసి=కోపగించి, పొల్పు+అలరఁగన్=అందము అతిశయించి, ఆక్షోణీధరము=ఆ పర్వతము, అగలింపుచున్=త్రవ్వుతూ తీసి, పాణితలాగ్రమునన్=అరచేతిలో, పెట్టి=పెట్టుకుని, పట్టుకరాఁగన్=తీసుకొని రాగా!

**తా :** ద్రోణ పర్వతానికి వెళ్ళి తనకు కావలసిన మందులను గౌరవంతో ఇవ్వని పర్వతము మీద కోపగించి ఆ పర్వతాన్ని పెకలించి అరచేతిలో పెట్టుకుని పట్టుకొనిరాగా!

**సీ. కావలి యున్నట్టి గంధర్వగణములు**
**పదునాల్గువేలు కోపంబుతోడ**
**నాహవం బొనరింప నందఱ నచ్చోట**
**వాలముఖంబున వసుధఁగూల్చి**

గగనమార్గంబునఁ గడుతీవ్రగతితోడఁ
బోవ నందిగ్రామపురమునందుఁ
దైలయుక్తం బైన తలలతోఁ బొరలాడ
గలిగిన రామలక్ష్మణుల తెఱఁగు

తే. భరతుఁ డారాత్రి కలఁ గని భయము దోఁచి
తొడరి దుస్స్వప్న దోషంబు దొలఁగి పోవ
విప్రవరులకు దానముల్ వేడ్కనిచ్చి
వెలుపలను నున్న భరత భూవిభునిఁ గాంచి. 81

**ప్రతి :** కావలియున్నట్టి=కాపలా ఉన్న, గంధర్వ గణములు, పదునాల్గువేలు, కోపంబు తోడ, ఆహవంబు=యుద్ధం, ఒనరింపన్=చేయగా, అందఱన్=అందఱను, అచ్చోట=ఆ ప్రదేశంలో, వాలముఖంబున=తోకచివరతో, వసుధన్=భూమిమీద, కూల్చి=పడవేసి, గగనమార్గంబునన్=ఆకాశమార్గంలో, కడు=మిక్కిలి, తీవ్రగతితోడన్=గొప్పవేగంతో, పోవ=వెళ్లగా, నందిగ్రామ పురమునందున్=భరతుడు మునివృత్తిలో ఉన్న నందిగ్రామంలో, తైలయుక్తంబైన=నూనె ఓడుతున్న, తలలతోన్=తలలతో, పొరలాడ గలిగిన=ఇటూ అటూ పొరలుతున్న, రామలక్ష్మణుల, తెఱగు=రీతి, భరతుడు, ఆరాత్రి, కలన్కని=కలలోచూచి, భయమున్=భయము, తోఁచి=అనిపించి, తొడరి=పూనుకొని, దుస్స్వప్నదోషంబు=ఈ చెడ్డకలయొక్క దోషం, తొలఁగిపోవ=తీరిపోయేలా, విప్రవరులకు=ఉత్తమ బ్రాహ్మణులకు, దానముల్=దానాలు, వేడ్కనిచ్చి=కోరియిచ్చి, వెలుపలను=ఆశ్రమం బయట ప్రదేశంలో, భరత భూవిభునిన్=భరతరాజును, కాంచి=చూచి.

**తా :** ద్రోణగిరికి కాపలా ఉన్న పదునాల్గువేల గంధర్వులు కోపంతో యుద్ధం చేయగా హనుమ అందరినీ తోకతో కొట్టి భూమిమీద పడేసాడు. ఆకాశమార్గంలో వేగంగా వస్తున్న హనుమ నందిగ్రామం మీదుగా వస్తూండగా, అక్కడ భరతునికి రామలక్ష్మణులిద్దరూ నూనె ఓడుతున్న తలలతో నేలమీద దొర్లుతున్నట్లు కల రావడంతో భయపడి పూనికతో ఆ దుస్స్వప్నదోషం పోయేందుకు బ్రాహ్మణోత్తములకు దానాలు ప్రేమతో ఇచ్చి ఆశ్రమంబయట ఉన్న భరతుణ్ణి చూచి -

తే. రాముఁడే యంచు నూహించి రాముఁ డేల
వచ్చు నిచటికి సౌమిత్రి వనచరులను
జనకనందనఁ దగ డించి జగ మెఱుంగఁ
బగరఁ జంపక రా నేమిపని తలంప. 82

**ప్రతి :** రాముఁడే=రాముడే, అంచున్=అని, ఊహించి=అనుకుని, రాముఁడు, ఏల వచ్చును, ఇచటికి, సౌమిత్రి, వనచరులను=వానరులను, జనకనందనన్=సీతను, తగడించి=వదలిపెట్టి, జగమెఱుంగన్=లోకమంతా తెలిసేలా, పగరన్=శత్రువును, చంపక, రాన్, ఏమి పని, తలంప=ఆలోచించగ.

**తా :** భరతుణ్ణి చూడగానే ఒక్కసారి రాముడే అనుకున్నాడు హనుమ. అంతలోనే రాముడు సౌమిత్రిని, వానరులను, సీతను వదిలి, శత్రువైన రావణుని లోకాలన్నీ తెలుసుకునేలా చంపకుండా ఇక్కడకు ఎందుకు వస్తాడు. ఇక్కడకు రావడానికి ఏమిపని ఉంది-అనుకున్నాడు.

## మాల్యవంతుని మరణము

**వ. అనియిట్లు సందియంపడి కాఁడని నిశ్చయించి యంత హనుమంతుండు దక్షిణపాథోనిధి దఱియం జనునప్పుడు దశాననుపంపున సేనలఁ గూడి మాల్యవంతుం డెదిరించి శస్త్రాస్త్రంబులు గురియించి నొప్పించినం గని వాతూల సంభవుండు వాల మల్లార్చి యార్చి పేర్చి దనుజబలంబులఁ జలంబునం దఱిమి వాలముఖంబున గళంబులు పట్టి నానాముఖంబులం బాఱవైచినన్ గని మాల్యవంతుండు తీవ్రశరంబుల నొప్పించిన నదరి యద్దానవేంద్రుని కంఠంబున వాలంబుంగీలించి గిరంగిరం ద్రిప్పి సముద్ర మధ్యంబునఁ బడవైచిన వాఁడును బాతాళంబునకుం జనియె నాక్షణంబ. 83**

**ప్రతి :** అని, ఇట్లు, సందియంపడి=సందేహించి, కాఁడు అని నిశ్చయించి=రాముడు కాదని నిర్ణయించుకొని, అంతన్=పిమ్మట, హనుమంతుండు, దక్షిణ పాథోనిధిన్=దక్షిణ సముద్రమును, తఱియున్=దాటుటకు, చనునప్పుడు=వెళ్ళునప్పుడు, దశాననుపంపునన్=రావణుడు పంపగా వచ్చిన, సేనలన్కూడి=సేనలను కలిసి, మాల్యవంతుడు, ఎదిరించి=ఎదుర్కొని, శస్త్రాస్త్రంబులు, కురియించి=కురిపించి, నొప్పించినన్=బాధించగా, కని=చూచి, వాతూలసంభవుండు=వాయుపుత్రుడు హనుమ, వాలము=తోక, అల్లార్చి=కదిల్చి, ఆర్చి=అరిచి, పేర్చి=అతిశయించి, దనుజబలంబులన్=రాక్షస సేనలను, జలంబులన్=నీళ్ళలో, తఱిమి=తరిమికొట్టి, వాలముఖంబునన్=తోకద్వారా, గళంబులు=కంఠములు, వట్టి, నానాముఖంబులన్=నానా దిక్కులకు, పాఱవైచినన్=పాఱవేయగా, కని=చూచి, మాల్యవంతుండు, తీవ్రశరంబులన్=వాడియైన బాణములతో, నొప్పించినన్=బాధించగా, అదరి=విజృంభించి, అద్దానవేంద్రుని-(ఆ+దానవేంద్రుని) కంఠంబునన్=ఆ రాక్షసశ్రేష్ఠుని కంఠానికి, వాలంబు కీలించి=తోకచుట్టి, గిరగిరన్ త్రిప్పి=గిరగిరా తిప్పి, సముద్రమధ్యంబునన్= నడిసముద్రంలో, పడవైచినన్=పడవేయగా, వాఁడును, పాతాళంబునన్=పాతాళ లోకంబునకు, చనియెన్= వెళ్ళెను, ఆ క్షణంబ=ఆ సమయంలోనే...

**తా :** అని ఈ విధంగా అనుమానించి రాముడు కాదని నిశ్చయించుకుని హనుమంతుడు దక్షిణసముద్రం దాటడానికి వెళుతుండగా, రావణుని పంపున మాల్యవంతుడు సేనలతోసహా వచ్చి ఎదిరించి శస్త్రాలు అస్త్రాలు కురిపించి బాధపెట్టాడు. అప్పుడు హనుమంతుడు తోక వేగంగా ఆడించి గట్టిగా అరిచి అతిశయించి రాక్షసబలాలను పట్టుదలతో తఱిమికొట్టి వాలాగ్రంతో మెడలు పట్టుకొని నానా దిక్కులకు విసిరి పడేసాడు, అదిచూసి మాల్యవంతుడు తీవ్రమైన బాణాలతో నొప్పించాడు. హనుమ మండిపడి ఆ రాక్షసేంద్రుని కంఠానికి తోకచుట్టి గిరగిరగా త్రిప్పి సముద్రమధ్యంలో పడేసాడు. వాడు పాతాళంలో పడిపోయాడు. ఆ క్షణంలోనే-

**తే. మాల్యవంతునిఁ బోకార్చి మానుషమున**
**గగనమండలఁ మందందఁ పగులనార్చి**
**వచ్చునప్పుడు శతకోటివారిజాప్త**
**దీప్తిఁ గనుపట్టెఁ బ్రాచీనదిక్కునందు. 84**

**ప్రతి :** మాల్యవంతునిన్, పోకార్చి=చంపి, మానుషమున=పరాక్రమముతో, గగనమండలము=ఆకాశం, అందంద=అక్కడక్కడ, పగులన్=పగులునట్లు, ఆర్చి=పెద్దబొబ్బపెట్టి, వచ్చునప్పుడు=వస్తూ ఉండగా, శతకోటి వారిజాప్త దీప్తి=నూరుకోట్ల సూర్యులకాంతి, ప్రాచీన=తూర్పు, దిక్కునందు=దిక్కున, కనుపట్టెన్=కానవచ్చినది.

**తా :** మాల్యవంతుణ్ణి చంపి పరాక్రమంతో ఆకాశ మండలం అక్కడక్కడ పగిలే విధంగా పెద్ద బొబ్బ పెట్టి హనుమ ద్రోణగిరిని పట్టుకుని వస్తూ ఉండగా తూర్పుదిక్కున నూరుకోట్ల సూర్యుల కాంతి కనిపించింది.

**వ. ఇట్లు వెలుంగుచున్న మహౌషధాచలంబు దివ్యదీప్తులు గనుంగొని రాఘవేశ్వ రుం డది సూర్యోదయబం బని మనంబునఁ దలంచి కపిరాజున కిట్లనియె. 85**

**తా :** ఇలా ప్రకాశిస్తున్న గొప్పఔషధాల కొండ దివ్యకాంతులు చూచి శ్రీరాముడు అది సూర్యోదయమని మనస్సులో అనుకుని సుగ్రీవునితో ఇలా అన్నాడు.

**చ. అదె కనుఁగొంటిరే కలయ నర్కుఁడు పూర్వగిరీంద్ర శృంగమం**
**దుదయమునొందె నింక నిటనుంచినఁ దమ్ముని ప్రాణవాయువుల్**
**బ్రదుకుట దుర్లభం బకట! పల్మఱు మ్రొక్కెడు ప్రొద్దె మాకుఁ దా**
**నదయత శత్రుఁడయ్యెఁ గపులార వినుండిదె మీకుఁ జెప్పెదన్. 86**

**ప్రతి :** అదె=అదుగో, కనుగొంటిరే=చూసారా!, కలయన్=మిక్కిలిగా, అర్కుఁడు=సూర్యుడు, పూర్వగిరీంద్ర శృంగమందు=తూర్పుకొండ శిఖరంమీద, ఉదయమునొందెన్=ఉదయించేశాడు, ఇంకన్=ఇక, ఇటనుంచినన్=ఇక్కడ ఉంచినట్లయిన, తమ్ముని ప్రాణవాయువుల్=తమ్ముని ప్రాణాలు, బ్రతుకుట= జీవించుట, దుర్లభంబు=కష్టము, అకట! అయ్యో!, పల్మఱు=అనేకసార్లు, మ్రొక్కెడు=నమస్కరించునట్టి, ప్రొద్దె=సూర్యుడే, మాకున్, తాన్, అదయత=దయలేకుండా, శత్రుఁడయ్యెన్, కపులారా, వినుండు, ఇదె, మీకున్, చెప్పెదన్.

**తా :** అదిగో! చూసారా తూర్పుకొండశిఖరం మీద సూర్యుడు గొప్పగా ఉదయించాడు. ఇంక ఇక్కడే ఉంచితే నా తమ్ముడు జీవించడం కష్టం. అయ్యో! మేము ఎన్నోసార్లు మ్రొక్కే ఈ సూర్యుడే దయలేకుండా మాకు తాను ఇలా శత్రువయ్యాడు. కపులారా! వినండి, మీకు ఇదే చెప్తున్నాను.

**తే. మా కులంబున కెల్లను మహిఁ దలఁపఁ**
**దానె కర్తయై యుండియు ధర్మ మగునె**
**యుదయ మందంగ మనుమఁ డిట్లున్న యెడను**
**గొసరి చుట్టాలుఁ బగవారిఁ గూడవలెనె. 87**

**ప్రతి :** మాకులంబున కెల్లను=మావంశానికంతకు, మహినిన్=ఈ భూలోకంలో తలపన్=ఆలోచించగా, తానెకర్తయై=తానేకర్తగా, ఉండియు=ఉండికూడ, ఉదయ మందంగ=ఉదయించడం, ధర్మమగునె= ధర్మమేనా? మనుమcడు, ఇట్లున్న, ఎడను=వేళలో, కొసరి చుట్టాలున్=అయిన చుట్టాలు కూడా, పగవారిన్, కూడవలెనె= కలిసిపోవాలా.

**తా :** మా వంశకర్త సూర్యడు, అయి ఉండీ ఇలా ఉదయించడం ధర్మమేనా? మనుమడు ఇలాపడి ఉన్నాడు, ఈ సమయంలో ఉదయిస్తాడా? సూర్యోదయంలోపే ఇతనికి మందు వేస్తేనే ఈతడు జీవిస్తాడు. మరి అయిన చుట్టాలు కూడా శత్రువులతో కలిసిపోవాలా?

**విశే :** 'కొసరి చుట్టాలు పగవారి కూడవలెనె' జాతీయము, శ్రీరాముడు తమ్మునికోసం ఎంతగా దుఃఖిస్తున్నదీ ఈ మాటల్లో వ్యక్తమవుతున్నది.

**క. ఈ లాగునc దాc బొడిచిన**
**మా లక్ష్మణు ప్రాణమేల మగుడును భానుం**
**గూలcగ నేసెద విల్లును**
**గోలలుc దెమ్మనుచు నందికొను నాలోనన్. 88**

**ప్రతి :** ఈలాగునన్=ఈ విధంగా, తాన్, పొడిచిన=ఉదయించిన, మా లక్ష్మణు ప్రాణమేల మగుడును=మా లక్ష్మణుని ప్రాణాలు తిరిగి ఎలా వస్తాయి, భానున్=సూర్యని, కూలనేసెద=పడవేస్తాను, విల్లును, కోలలు= బాణాలు, తెమ్మనుచున్, అందికొనున్=అందుకొనే, ఆలోనన్ అంతలోనే –

**తా :** ఈ విధంగా సూర్యుడు ఉదయిస్తే లక్ష్మణుని ప్రాణాలు ఎలా తిరిగి వస్తాయి. ఈ సూర్యుణ్ణి కూలవేస్తాను అంటూ విల్లూ బాణాలు తీసుకురండి అని వాటిని అందుకునే లోపల –

**వ. రామచంద్రునకు జాంబవంతుం డిట్లనియె. 89**

**తా :** రామచంద్రునితో జాంబవంతుడు ఇలా అన్నాడు.

**ఉ. భానుcడు కాcడు చూడు నరపాలక! మందులకొండ దీప్తు లీ**
**మానము దోcచెcగాని యనుమానములేదు వినుండు వేడ్కతో**
**వానరసేన నింకెదురు వాయుతనూజుని గారవింపcగా**
**మానవనాథ! పంపు మను మాత్రనె వచ్చె నతండు తీవ్రతన్. 90**

**ప్రతి :** భానుcడు=సూర్యుడు, కాcడు చూడు, నరపాలక!=రాజా, మందులకొండ, దీప్తులు=కాంతులు, ఈ మానము=ఈ విధముగా, తోcచెన్, కాని, అనుమానము లేదు, వినుండు, వేడ్కతో=కుతూహలముతో, వానరసేనన్, ఇంక, ఎదురు, వాయుతనూజుని, గారవింపcగా=గౌరవించడానికి, మానవనాథ!, పంపుము, అను మాత్రనె=అనేలోగానే, వచ్చెన్, అతండు=హనుమ, తీవ్రతన్=అతివేగంతో.

**తా :** ఓ రాజా! సరిగ్గా చూడు భానుడు కాదు, ఈ వెలుగులన్నీ మందుల కొండ అయిన ద్రోణగిరివి. నీకు ఇలా అనిపించింది గాని అనుమానమే లేదు. జాగ్రత్తగా వినండి పర్వతంతో వస్తున్న హనుమంతుని గౌరవించడానికి వానరసేనని పంపండి అని చెప్తుండగానే అతివేగంతో హనుమంతుడు వచ్చాడు.

**క. అనిమిషులు సన్నుతింపఁగ**
**హనుమంతుఁడు ద్రోణశైల మతిశీఘ్రముగాఁ**
**గొని వచ్చి నిలిచి రఘురా**
**ముని శ్రీపాదముల కెలమి మ్రొక్కినయంతన్. 91**

**ప్రతి :** అనిమిషులు=దేవతలు, సన్నుతింపఁగ=కొనియాడగ, హనుమంతుఁడు, ద్రోణశైలము, అతి శీఘ్రముగాన్, కొనివచ్చి, నిలిచి, రఘురాముని, శ్రీపాదములకు=పవిత్రమయిన పాదాలకు, మ్రొక్కిన, అంతన్

**తా :** దేవతలు కొనియాడగ హనుమంతుడు ద్రోణగిరిని వేగంగా తెచ్చి రఘురాముని శ్రీపాదాలకు నమస్కరించి నిలబడగా -

**వ. రామచంద్రుం డతనిం గౌఁగిలించుకొని సుషేణుం జూచి నీ విందలి దివ్యౌషధంబులవలన సౌమిత్రి ప్రాణంబులు తేర్పుమనిన నయ్యధిపు నాజ్ఞ శిరంబునఁ దాల్చి వనచర సహితుండై పర్వతం బెక్కి తొల్లి దేవత లమృతపానంబు చేసిన తావును నారాయణుండు మోహినీరూపంబున నమృతము పంచునప్పుడు సూర్యచంద్రులనడుమ నిఱికిన రాహువుశిరంబుఁ ద్రుంచితావును బలిచక్రవర్తి యాగంబుచేసిన తావును రాక్షసులు జన్మించినతావును శంకరభగవానుండు పర్వతరాజు కూఁతును బెండ్లియాడినతావును వానరులకుం జూపుచు నగ్గిరీంద్రంబుపై నున్న యౌషధంబులు గొనివచ్చి ప్రయోగింప నా యౌషధముల సామర్థ్యంబునం జేసి లక్ష్మణునకుఁ బ్రాణంబులు మగుడ వచ్చె నంత సకల వానరులు నానందరసాబ్ధిం దేలి రప్పుడ సౌమిత్రి రామునకు నమస్కరించిన రామచంద్రుండు కౌఁగిటం జేర్చి హనుమంతుం డొనరించిన యుపకృతికి సంతోషించి యీ పర్వతంబును దొల్లింటి యునికినే యుంచి రమ్మనిన నతం డట్లు కావించెనని నారదుండు సెప్పిన వాల్మీకి మునీశ్వరుండట మీఁది కథావిధానం బెట్టి దని యడుగుటయు. 92**

**ప్రతి :** రామచంద్రుండు, అతనిన్, కౌఁగిలించుకొని, సుషేణున్, చూచి, నీవు, ఇందలి, దివ్యౌషధంబుల వలనన్=దివ్యములగు ఔషధముల వల్ల, సౌమిత్రి ప్రాణంబులు=లక్ష్మణుని ప్రాణములను, తేర్పుము=తేరుకొన చేయుము, అనినన్=అని పలుకగా, అయ్యధిపు (ఆ+అధిపు) నాజ్ఞ=ఆ ప్రభుని ఆజ్ఞను, శిరంబునన్ తాల్చి= తలదాల్చి, వనచర సహితుండై=వానరునితో కూడినవాడై, పర్వతంబు, ఎక్కి, తొల్లి=మునుపు, దేవతలు, అమృతపానంబు చేసిన=అమృతమును త్రాగిన, తావును=ప్రదేశమును, నారాయణుండు, మోహినీరూపంబునన్=మోహినీరూపంతో, అమృతము పంచునప్పుడు, సూర్యచంద్రులనడుమన్= సూర్యచంద్రుల మధ్యలో, ఇఱికిన=దూరిన, రాహువు శిరంబున్=రాహువు తలను, త్రుంచిన తావును=

తెంచినచోటును, బలిచక్రవర్తి యాగంబు చేసిన తావును, రాక్షసులు జన్మించిన తావును, వానరులకున్, చూపుచున్, అగ్గిరీంద్రంబుపైన (ఆ+గిరీంద్రంబుపైన్)=ఆ కొండమీద, ఉన్న ఔషధములు=ఉన్న ఔషధములు (మందులు), కొనివచ్చి=తీసికొని వచ్చి, ప్రయోగింపన్=వినియోగింపగా (వాడగా), ఆ ఔషధముల సామర్థ్యంబునంజేసి=ఆ ఔషధముల శక్తిచేత, లక్ష్మణునకున్, ప్రాణంబులు, మగుడవచ్చెన్=తిరిగివచ్చెను, అంతన్=పిమ్మట, సకల వానరులున్= వానరులందరును, ఆనందరసాబ్ధిన్=ఆనందరస సముద్రములో, తేలి, హనుమంతుండు, ఒనరించిన=చేసిన, ఉపకృతికిన్=ఉపకారమునకు, సంతోషించి=ఆనందించి, ఈ పర్వతంబును, తొల్లింటి ఉనికినే ఉంచి=మునుపు ఉన్నచోటనే ఉంచి, రమ్ము, అనినన్=అనగా, అతండు, అట్లు, కావించెను=చేసెను, అని, నారదుండు, చెప్పినన్=చెప్పగా, వాల్మీకి మునీశ్వరుండు, అటమీఁది= అటుతర్వాతి, కథావిధానంబు, ఎట్టిది=ఎటువంటిది, అని, అడుగుటయు –

**తా :** అలా నిలచిన హనుమంతుని రామచంద్రుడు కౌగలించుకొన్నాడు. ఆ తరవాత సుషేణుని వంక చూచి ఈ కొండమీద దివ్యఔషధాలతో నీవు లక్ష్మణుని ప్రాణాలు తేరుకునేలా చేయి అన్నాడు. ప్రభువు ఆజ్ఞశిరసావహించి కోతులతో కలిసి ఆ పర్వతం మీదకు ఎక్కి, పూర్వం దేవతలు అమృతపానం చేసిన చోటు, నారాయణుడు మోహినీరూపం ధరించి అమృతం పంచుతుండగా, సూర్యచంద్రుల మధ్యలో దూరిన రాహువు శిరస్సు ఖండించిన చోటు, బలి చక్రవర్తియాగం చేసినచోటు, రాక్షసులు పుట్టిన ప్రదేశము, శంకర మహదేవుడు పర్వతరాజు హిమవంతుని కూతురు పార్వతిని వివాహమాడిన తావును, తనతో వచ్చిన వానరులకు చూపిస్తూ ఆ పర్వతం మీద ఉన్న ఓషధులు సేకరించుకుని వచ్చి లక్ష్మణుని మీద ప్రయోగించగా ఆ ఔషధాలకు గల శక్తిచేత లక్ష్మణునికి ప్రాణాలు తిరిగి వచ్చాయి, వానరులందరూ ఆనంద సముద్రంలో తేలి ఆడారు, సౌమిత్రి లేచి రామునికి నమస్కరించాడు, రామచంద్రుడు తమ్ముణ్ణి కౌగిట్లో చేర్చుకున్నాడు. హనుమంతుండు చేసిన సహాయానికి సంతోషించి ఈ పర్వతంబును ఎక్కడ ఉండేదో అక్కడ ఉంచి రమ్మన్నాడు, హనుమంతుడు అలా చేసివచ్చాడు. అని నారదుడు చెప్పగా వాల్మీకి మహర్షి ఆతరువాత కథ ఎలాజరిగింది అని అడిగాడు.

## ఆశ్వాసాంత పద్య గద్యములు

**క.** **జలజాక్ష! భక్త వత్సల!**
**జలజాసన వినుత పాద జలజాత! సుధా**
**జల రాశి భవ్యమందిర**
**జలజాకర చారు హంస! జానికి నాథా!** **93**

**గద్యము : ఇది శ్రీగౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద సూరి జన వినుత కవితా చమత్కారాతుకూరి కేసనసెట్టి తనయ మొల్ల నామధేమ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబునందు యుద్ధకాండమున ద్వితీయాశ్వాసము.**

* * *

# యుద్ధకాండ

## తృతీయాశ్వాసం

**క. విమల సుధాకరవదనా!**
**సుమనశ్చేతోబ్జ సదన! సుస్థిరకదనా!**
**కమనీయ రదన! శత్రువి**
**షమ! రఘుకుల సార్వభౌమ! జానకి రామా! 1**

**ప్రతి :** విమల సుధాకరవదనా!=స్వచ్ఛమైన ప్రకాశముగల చంద్రుని వంటి ముఖము కలవాడా!, సుమనః= దేవతల, చేతోబ్జ=మనస్సు అనే పద్మము, సదన!=ఇల్లుగా గలవాడా!, సుస్థిరకదనా!=యుద్ధములో స్థిరముగా నిలచిపోరాడువాడా, కమనీయ రదన!=అందమయిన పలువరుస గలవాడా!, శత్రువిషమ!=శత్రువులకు సాధ్యము కానట్టివాడా!, రఘుకులసార్వభౌమ!=రఘువంశసార్వభౌమ! జానకిరామా!

**తా :** నిర్మలమయిన చంద్రునివంటి ముఖముగలవాడా, దేవతల హృదయ పద్మాలలో నివసించేవాడా, యుద్ధనిపుణుడా, చక్కని పలువరుస గలవాడా, శత్రువులకు లొంగనివాడా, రఘుకులసార్వభౌమా! జానకి రామా!

**విశే :** ఇది స్తుతి. అన్నీ సంబోధనలే. రాముని గుణరూప విశేషాలే.

**వ. శ్రీనారద మునీంద్రుండు వాల్మీకి కెఱింగించిన తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 2**

**తా :** శ్రీ నారదమహర్షి వాల్మీకికి తెలిపిన విధమును తెలిపెదను, వినుము.

### రావణుని శత్రుంజయ హోమము

**క. కలకల పక్షులు గూయఁగఁ**
**బలపలనై తారకములు పడమటఁ దోఁపన్**
**జలజములు విరియఁ దూర్పున**
**బలపలనై తెల్లవాఱ భానుఁడు పొడమెన్. 3**

**ప్రతి :** కలకల=కలకలమని సందడి చేస్తూ, పక్షులు, కూయఁగన్=పక్షులు కూయగా, పలపలనై=కాంతి తగ్గి, తారకములు=నక్షత్రాలు, పడమటన్=పడమటి దిక్కున, తోఁపన్=కనబడగా, జలజములు=తామర పువ్వులు, విరియన్=విచ్చుకోగా, పలపలనై=కొలది కొలదిగా, తెల్లవాఱ=తెల్లవాఱగా చీకటిపోయి తెల్లగాకాగా, భానుఁడు=సూర్యుడు, పొడమెన్=కనబడెను.

**తా :** పక్షులు కలకలారావాలు చేయగా నక్షత్రాలు కాంతి తగ్గి పడమటి దిక్కున మినుమినుకుమంటూ ఉండగ, తామరలు విచ్చుకోగా, తూర్పున, కొద్ది కొద్దిగా తెలుపు రేఖలురాగా సూర్యుడు ఉదయించాడు.

**విశే :** కలకల, పలపల అనేవి అనుకరణ శబ్దాలు. పలపల అనేది తెల్లవాఱడానికి అనుకరణ శబ్దము. కలకల=పక్షుల కూతలకు.

**సీ.** **అట మున్ను దశకంఠు డాచార్యుఁడైనట్టి**
**శుక్రానుమతి దేహశుద్ధితోడ**
**రణజయార్థంబుగా రథములు గుఱ్ఱముల్**
**కవచంబు లస్త్రసంఘములు గలుగఁ**
**బాతాళగుహఁ జొచ్చి వీతిహోత్రునిఁగూర్చి**
**పాయక హోమంబు సేయుచుండ**
**నాహోమధూమంబు లాకసంబునఁ బర్వఁ**
**గని విభీషణుఁడు భూకాంతునకును**

**తే.** **విన్నవించెను మాయన్న నిన్న నరిగి**
**హోమ మొనరింపుచున్న వాఁ డుడుగ కిపుడు**
**మొనసి యా హోమ మది తుదముట్టెనేనిఁ**
**గలన బ్రహ్మాదు లాతని గెలువలేరు.** 4

**ప్రతి :** అటమున్న= అంతకు ముందే, దశకంఠుడు=రావణుడు, ఆచార్యుఁడైనట్టి=గురువుగారయిన, శుక్ర+అనుమతి, శుక్రానుమతి=శుక్రుని అనుమతితో, దేహశుద్ధితోడ=శరీరాన్ని శుద్ధి చేసుకొని స్నానాదికాలు పూర్తిచేసికొని, రణజయార్థంబుగా=యుద్ధములో జయము పొందడానికి, రథములు, గుఱ్ఱముల్, కవచంబులు, అస్త్రసంఘములు, కలుగన్=లభింపగా, పాతాళగుహన్=భూమిలోపలగల గుహలో, చొచ్చి=ప్రవేశించి, వీతి హోత్రునిన్=అగ్నిహోత్రుని, కూర్చి=గురించి, పాయక=నిష్ఠతో, హోమంబు=అగ్ని కార్యము, చేయుచుండన్= చేస్తూ ఉండగా, ఆ మహాధూమంబులు=ఆ హోమంనుండి వెలువడిన పొగలు, ఆకసంబున్=ఆకాశంలో, పర్వన్=వ్యాపించగా, కని=చూచి, విభీషణుఁడు, భూకాంతునకును=రామునకు, మా, అన్న, నిన్నన్, అరిగి=వెళ్లి, హోమము, ఒనరింపుచున్నాఁడు=చేస్తున్నాడు, ఉడుగక=విడిచిపెట్టకుండా, ఇపుడు, మొనసి=అతి ప్రయత్నంతో, ఆ హోమము, అది తుదముట్టెనేనిన్=అది సలక్షణంగా పూర్తి అయినట్లయితే, కలన=యుద్ధంలో, బ్రహ్మాదులు=బ్రహ్మ మొదలయిన దేవతలు, ఆతని=ఆరావణుని, గెలువలేరు= జయించలేరు, విన్నవించెను=అని చెప్పెను.

**తా :** అక్కడ లంకలో భానుడు ఉదయించకముందే రావణుడు తమ గురువైన శుక్రాచార్యుల వారి అనుమతితో శుద్ధుడై యుద్ధంలో జయము పొందడానికి, రథాలు, గుఱ్ఱాలు, కవచాలు, అస్త్రసమూహాలు ప్రాప్తించేందుకు, పాతళగుహలో అగ్నిహోత్రుని ఉద్దేశించి స్థిరంగా హోమం చేస్తుండగా ఆ హోమ గుండంలో నుండి వచ్చే పొగ ఆకాశమంతా వ్యాపించింది. ఆ పొగను చూచిన విభీషణుడు రామునితో మా అన్న నిన్న వెళ్లి హోమం చేస్తున్నాడు. ఇంకా హోమ కార్యక్రమంలోనే ఉన్నాడు. ఇప్పుడే మానడు. ఇలా ప్రయత్న

పూర్వకంగా చేస్తున్న ఈ హోమం సలక్షణంగా పూర్తి అయితే యుద్ధంలో ఇతనిని బ్రహ్మాదులు కూడా గెలువలేరు అని చెప్పాడు.

**విశే :** లంకలో రావణుడు పాతాళ గుహలో నిర్వర్తిస్తున్న హోమం నుండి వెలువడిన ధూమం ఆకాశమంతటా వ్యాపించి సముద్రతీరంలో విడిసిన సేనలో ఉన్న వారికి కనిపించింది అంటే ఆ హోమకార్యక్రమం ఎంత పెద్ద ఎత్తున జరుగుతున్నదో ఊహించవలసి ఉంది.

**క. ఈపని విఘ్నము సేయఁగ**
**భూపాలక! కపుల నేర్చి పుచ్చుము లేదే**
**మీపని విఘ్న మగు ననుడు**
**భూపాలవరేణ్యుఁ డపుడు భూధరచరులన్. 5**

**ప్రతి :** ఈ పని=ఈ హోమకార్యం, విఘ్నము=అడ్డంకి, చేయఁగ=చేసేలా, భూపాలక!=రామా, కపులను=వానరులను, ఏర్చి=ఎంపికచేసి, పుచ్చుము=పంపుము, లేదే=అలా కానట్లయితే, మీ, పని=కార్యం, విఘ్నమగును=చెడిపోతుంది, అనుడు=అనగా, భూపాల వరేణ్యుఁడు=రాజ శ్రేష్ఠుడు, అపుడు, భూధర చరులన్=కొండల మీద సంచరించే వారిని–వానరులను, రామా!

**తా :** ఈ మహాకార్యం పాడుచేసేందుకు వానరులను సమర్థులయినవారిని పంపు, అలా చేయకపోతే మీపని చెడిపోతుంది అని చెప్పాడు, విభీషణుడు. అప్పుడు రాజశ్రేష్ఠుడయిన రాముడు వానరులను .... (పంపాడు)

**చ. గవయ గవాక్ష వాలిసుత కంజహితాత్మజ నీల వాయుసం**
**భవ నల గంధమాదన విభాసిత భల్లుకనాథ ముఖ్యులన్**
**దివిజవిరోధిపైఁ బనుపఁ దీవ్రత నేఁగి పురంబు సొచ్చి దా**
**నవపతి సేనలం దటిమి నాకము భేదిల నార్చి యత్తఱిన్. 6**

**ప్రతి :** గవయ=గవయుడు, గవాక్ష=గవాక్షుడు, వాలిసుత=అంగదుడు, కంజహితాత్మజ=సుగ్రీవుడు, నీల=నీలుడు, వాయు సంభవ=హనుమ, నల=నలుడు, గంధమాదన=గంధమాదనుడు, విభాసిత భల్లుకనాథ=గొప్ప తేజస్సు గల జాంబవంతుడు, ముఖ్యులన్=మొదలైన ముఖ్యులను, దివిజవిరోధిపైన్=దేవతల విరోధి అయిన రావణుని మీదకు, పనుపన్=పంపగా, తీవ్రతన్=వేగంగా, ఏఁగి, పురంబు, చొచ్చి, దానవపతి సేనలన్=రావణుని సేనలను, తటిమి=పారద్రోలి, నాకము=స్వర్గము, భేదిలన్=బ్రద్దలగునట్లు, ఆర్చి=అరచి, అత్తఱిన్=ఆ సమయమున–

**తా :** గవయగవాక్ష అంగద సుగ్రీవ నీలహనుమ నల గంధమాదనులను జాంబవంతుని–రావణుని మీదకు పంపగా వారు వేగంగా వెళ్లి రాక్షస సేనలను తటిమికొట్టి, స్వర్గలోకం బ్రద్దలయ్యేటంతగా గట్టిగా అరిచారు.

**విశే :** వానరుల పేర్లతో చక్కని సమాసం అల్లింది మొల్ల. మొదటి రెండు పాదాలూ ఒకే సమాసం.

క. **గుహ సొచ్చి దనుజవల్లభ!**
**విహితమె సాహసము విడిచి విను మునివృత్తిన్**
**దహనగతధూమరేఖల**
**నహరహమును నీకు వ్రేల్వ నర్హంబగునే.** 7

**ప్రతి :** గుహసొచ్చి=గుహలో ప్రవేశించి, దనుజవల్లభ=రాక్షస రాజా! విహితమె=తగినదేనా, సాహసము విడిచి=నీలోని శౌర్యం విడిచిపెట్టి, విను, మునివృత్తిన్=మునులకు తగిన విధంగా, దహనగత ధూమరేఖలన్= అగ్నిహోత్రంలోని పొగలను, అహరహమును=ప్రతిదినమును, నీకు, వ్రేల్వన్=అగ్నిహోత్రం చేస్తూ ఉండడం, తగునే=సరియైనదా!

**తా :** వానరులు గుహలో ప్రవేశించి రాక్షసరాజా! సాహసం విడిచిపెట్టి ఇలా మునుల జీవితం అవలంబించడం నీకు తగినదేనా? విను ప్రతిదినమూ అగ్నిహోత్రం చేస్తూ హోమధూమాన్ని వ్యాపింప చేయడం నువ్వు చెయ్యదగినదేనా? అన్నారు.

క. **మగఁటిమి గలిగినపురుషులె**
**మగతనమును విడిచి నడువ మగువలు నగరా**
**తగ దనక నేఁడు మఱుగున**
**విగతవ్రీడుండ వగుచు వ్రేల్వం దగునే.** 8

**ప్రతి :** మగఁటిమి=పౌరుషము, కలిగిన=ఉన్న, పురుషులె=మగవారే, మగతనమును, విడిచి=వదలిపెట్టి, నడువ=నడుచుకుంటే, మగువలు=ఆడువారు, నగరా=నవ్వరా, తగదు, అనక, నేఁడు, మఱుగున=రహస్యంగా, విగతవ్రీడుండవు=వదలిపెట్టిన సిగ్గుగలవాడు, సిగ్గులేనివాడవు అగుచు, వ్రేల్వన్=అగ్నిహోత్రంలో నెయ్యి, పళ్లు మొదలయిన వాటిని భక్తితో వేయడం, తగునే=న్యాయమా!

**తా :** పౌరుషం గల పురుషులే మగతనం విడిచి ప్రవర్తిస్తే ఆడవారు నవ్వరా! ఇలా చేయడం తగదు అని భావించకుండా, సిగ్గు లేకుండా రహస్యంగా అగ్నిలో ఆజ్యంపోయడం యుక్తమా!

**విశే :** ఈ పద్యంలో-విగత వ్రీడుండు-అనే సమాసానికి-పోయినట్టి సిగ్గు గలవాడు అని అర్థం. ఇది సంస్కృత బహువ్రీహి సమాసానికి తెలుగులో అర్థం చెప్పేవిధానం. విగత జీవుడు=పోయిన ప్రాణాలు కలవాడు అని అర్థం. అంటే ప్రాణాలు పోయినవాడు అని. అలాగే విగత వ్రీడుండు అంటే సిగ్గుపోయినవాడు-సిగ్గులేని వాడు అని.

మ. **అని కేతెంచి నృపాల శేఖరుఁడు వాహ్యాళి ప్రదేశంబునన్**
**నిను రమ్మంచును బిల్చుచుండ నిచటన్ నీవుండి వ్యాజంబునన్**
**దనుజాధీశ్వర! వీరధర్మ మగునే తప్పించుకో నంచు న**
**వ్వనచారుల్ సిగవట్టి యీడ్వఁగను గ్రవ్యాదుండు నిశ్చింతుఁడై.** 9

**ప్రతి :** అనికిన్=యుద్ధానికి, ఏతెంచి=వచ్చి, నృపాలశేఖరుఁడు=రాజశ్రేష్ఠుఁడు, వాహ్యాళి ప్రదేశంబునన్=విహారం చేసేచోట, నిను, రమ్మంచును=రావలసినదని, పిల్చుచుండన్=పిలుస్తుండగా, ఇచ్చటన్=ఇక్కడ, నీవు, ఉండి, వ్యాజంబునన్=వంచనతో, దనుజాధీశ్వర!=రాక్షసరాజా!, తప్పించుకోన్=తప్పుకునిపోవడం, వీరధర్మమగునే=వీరుని ధర్మమవుతుందా? అంచున్=అంటూ, అవ్వనచారుల్=ఆ వనాలలో తిరిగే కపులు, సిగబట్టి=జట్టుముడిని పట్టుకొని, ఈడ్వఁగను=ఈడ్చగా, క్రవ్యాదుండు=మాంసభక్షకుడు రాక్షసుడు, నిశ్చింతుఁడై=ఏ విధమయిన చింతాలేనివాడై, కదలికలేనివాడై ఉన్నాడు.

**తా :** రాజశ్రేష్ఠుడు యుద్ధానికి వచ్చి అక్కడ విహార భూమిలో ఉండి నిన్ను రమ్మని పిలుస్తూ ఉంటే నువ్వు ఇక్కడ ఉండి రాక్షసరాజా! యుద్ధం పక్కనపెట్టి వంచనతో ఈ హోమం చేయడం వీరునికి ధర్మమేనా, ఇలా యుద్ధాన్ని తప్పించు కోవడానికి చూస్తావా అంటూ వానరులు అతని జుట్టుపట్టి ఈడ్వగా మాంసభక్షుడైన రావణుడు నిశ్చింతుడై ఎలాంటి కదలిక లేకుండా ఉన్నాడు.

**క.** **కదలక హృదయజ్ఞానము**
**వదలక మంత్రంబు చొప్పు వడి తప్పక లోఁ**
**జెదరక వ్రేల్చుచు నుగ్రత**
**బెదరక కూర్చుండె నట గభీర ప్రౌఢిన్.** **10**

**ప్రతి :** కదలక, హృదయజ్ఞానము వదలక=హృదయంలో నిలిపిన జ్ఞానాన్ని విడిచిపెట్టక, మంత్రంబు చొప్పు=మంత్రంపఠించే విధానముయొక్క, వడి తప్పక=వేగం తప్పకుండా, లోన్=మనసులో, చెదరక=కలవరపడక, వ్రేల్చుచు=హోమం చేస్తూ, ఉగ్రతన్=తన గట్టినిష్ఠ నుండి, చెదరక=చెదరిపోక, అట=అక్కడ, గభీర ప్రౌఢిన్=అధికమైన గాంభీర్యంతో, కూర్చొండెన్.

**తా :** హృదయంలో నిలిపిన జ్ఞానాన్ని వదలి పెట్టకుండా, కూర్చున్న స్థితి నుండి కదలకుండా, పఠిస్తున్న మంత్రాల స్వరాల వేగం తప్పకుండా మనస్సులో కలవరపడకుండా, హోమం చేస్తూ తన గట్టి నిష్ఠ నుండి చెదరక బెదరక గొప్ప గాంభీర్యంతో కూర్చుని ఉన్నాడు.

**విశే :** ఇంతమంది వానరులు ఎంతగానో గోలచేస్తూ నానావిధాలుగా మాట్లాడుతూ అవమానిస్తూ అవహేళన చేస్తూ జుట్టుపట్టి ఈడ్చినా కూడా – రావణుడు తాను చేస్తున్న యాగదీక్షను వదలకుండా మనస్సును ఇటూ అటూ పోనీయక, మంత్రపఠనం యథారీతిగా చేస్తూ, హోమం భక్తిగా నిర్వహిస్తూ గొప్ప గాంభీర్యంతో నిశ్చింతగా కూర్చుని ఉన్నాడు. అంటే రావణుడు ఎంత తీవ్రమయిన దీక్షతో ఉన్నాడో తెలియవస్తోంది.

ఈ కందపద్యంలో నాలుగు పాదాలూ క్రియాపదాలతో ఎత్తుకుంది. మొల్ల గంభీరమైన విషయాన్ని తెలుగుపదాలలో గంభీరంగా చెప్పింది. కదలక, వదలక, చెదరక, బెదరక అనే పదాలు కంద పద్యానికొక అందం తెచ్చాయి.

**వ.** **అట్లు శిలాస్తంభంబుపగిదిని జలింపకున్న నతనిచేతి యాహుతులు విడిచి పో వైచి స్రుక్స్రువంబులు నలుఁగఁద్రొక్కి యిధ్మంబు హోమద్రవ్యంబులు నొక్కింత నగ్నిలోఁ ద్రోచి హోమాగ్నిం జిందఱవందఱ చేసి**

**భుజంబు లెక్కి మీసలు పట్టుకొని లాగి తలలు గదలించి వీనుఁ బెనుబొబ్బలిడి కదలకున్నం గినిసి వాలితనూభవుండంత నంతఃపురంబునకుం బోయి యందున్న మండోదరినిఁ జట్టుపట్టి యీడ్చుచు బరువునఁ గొని వచ్చి దశవదనుముందఱ నిలుప నక్కాంత దుఃఖాక్రాంతయై తనకాంతున కిట్లనియె. 11**

**ప్రతి :** అట్లు, శిలాస్తంభంబు పగదినిన్=రాతిస్తంభంవలె, చలింపకున్నన్=కదలకుండా ఉన్న, అతనిచేతి ఆహుతులు=అతని చేతిలోని హోమద్రవ్యములు, విడిచిపోవఁగ=పిండిపడవేసి, స్రుక్స్రువంబులు=నేతిని గ్రహించు స్రుక్, స్రువములను, పలుగన్ త్రొక్కి=ముక్కలుగునట్లు త్రొక్కి, ఇధ్మంబు=సమిధ, హోమద్రవ్యంబులున్=హోమము కొరకగు వస్తువులును, ఒక్కింతన్=ఒక్కసారిగా, అగ్నిలోన్, త్రోచి=త్రోచిపడవేసి, హోమాగ్నిన్=హోమము కొరకగు అగ్నిని, చిందఱవందఱచేసి=చెల్లాచెదురుగా చేసి, భుజంబులు, ఎక్కి, మీసలు=మీసాలను, పట్టుకొని లాగి, తలలు=తలలను, కదిలించి=కదల్చి, వీనున్=చెవిలో, పెనుబొబ్బలు ఇడి=పెద్దగా అరిచి, కదలకున్నన్=కదలక ఉండగా, కినిసి=కోపించి, వాలితనూభవుండు=వాలి పుత్రుడు అంగదుడు, అంతన్=పిమ్మట, అంతఃపురంబునకున్, పోయి=వెళ్ళి, అందున్న=అక్కడ ఉన్న, మండోదరిని, జుట్టుపట్టి, ఈడ్చుచున్, పరువునన్=పరుగెత్తుతూ, కొనివచ్చి=తీసికొనివచ్చి, దశవదను ముందఱ=రావణాసురుని ముందు, నిలుపన్=నిలబెట్టగా, అక్కాంత (ఆ+కాంత)=ఆ స్త్రీ, దుఃఖాక్రాంతయై=మిక్కిలి దుఃఖము నొందినదై, తన కాంతునకున్=తన ప్రియునకు, ఇట్లు, అనియె.

**తా :** అలా రాతిస్తంభంలా కదలకుండా ఉన్న రావణుని చేతిలోని ఆహుతుల్ని పిండిపడేసి, నేతిని అగ్నికి అర్పించే పనిముట్లను తొక్కివేసి, అగ్నిహోత్రానికి వినియోగించే సమిధలను, హోమద్రవ్యాలను కొన్నిటిని అగ్నిలో త్రోసి, హోమాగ్నిని చిందర వందర చేసి, రావణుని భుజాలమీదకు ఎక్కి, మీసాలు పట్టుకొని లాగి, తలలు కదిలించి చెవుల్లో పెద్దపెద్దగా అరచి గోలపెడుతూ ఇంత చేసినా కదలకపోయేసరికి కోపగించి అంగదుడు అంతఃపురంలో ప్రవేశించి అక్కడ ఉన్న మండోదరిని జుట్టుపట్టి ఈడుస్తూ పరుగుతో తీసుకొని వచ్చి రావణుని ఎదుట నిలబెట్టగా ఆ మండోదరి దుఃఖిస్తూ తన భర్తతో ఇలా అన్నది.

**తే.** **రామచంద్రుండె యాదినారాయణుండు**
**గపులె దేవత లని నీకుఁ గనఁబడంగ**
**నెల్ల వేళల నేఁ జెవి నిల్లు గట్టి**
**విన్నపము సేయ నామాట వినకపోతి. 12**

**ప్రతి :** రామచంద్రుండె=శ్రీరాముడే, ఆదినారాయణుండు, కపులె=కోతులే, దేవతలని, నీకు, కనఁబడంగ=తెలియవచ్చేలా, ఎల్లవేళలన్, ఏన్=నేను, చెవినిల్లు గట్టి=చెవిలో ఇల్లుకుట్టుకుని-ఎంతో శ్రద్ధతో, విన్నపము సేయ=ఎంతగా చెప్పినా, నామాట, వినకపోతి=వినకపోతివి, విన్నావు కావు.

**తా :** శ్రీరాముడే సాక్షాత్తూ ఆ వైకుంఠవాసుడయిన నారాయణుడనీ, ఈ కోతులు దేవతలనీ నీకు తెలిసివచ్చేలా ఎల్లవేళలా నీ చెవికి అందేలా శ్రద్ధగా విన్నవించాను. అయినా నువ్వు విన్నావు కావు.

**విశే :** చెవినిల్లుకట్టి, వినకపోతి! కందువమాటలు.

మ. మయదైత్యేంద్రునకుం దనూజ నయి సేమం బొప్ప నీ పత్నినై
జయవెట్టంగను నింద్రజిజ్జననినై సర్వాంగనాపూజ్యనై
భయ మెన్నండు నెఱుంగనట్టి నను నిబ్భంగిన్ వనాటుండు ని
ర్భయవృత్తిం దలవట్టి యీడ్వఁ గనుఁగోఁ బాలైతి నీ ముంగలన్. 13

**ప్రతి :** మయిదైత్యేంద్రునకున్=మయుడనే రాక్షస శ్రేష్ఠునికి, తనూజనయి=కూతురనయి, సేమంబొప్ప= చక్కని రక్షణ కల్గిన, నీ పత్నినై=నీకు పట్టపురాణినై, జయవెట్టంగను=జయజయ ధ్వనులు పలికే విధంగా, ఇంద్రజిత్=ఇంద్రుణ్ణి జయించి ఇంద్రజిత్తు అనే బిరుదాన్ని పొందినవానికి, జననినై=కన్న తల్లినై, సర్వాంగనాపూజ్యనై=స్త్రీలందరిచేత పూజింపబడుదాననై, భయము, ఎన్నండున్= ఏనాడూ, ఎఱుంగనట్టి= తెలియని అట్టి, ననున్=నన్ను, ఇబ్భంగిన్=ఈ విధంగా, వనాటుండు=ఓ కోతిగాడు, నిర్భయవృత్తిన్=ఎలాంటి భయంలేకుండా, తలవట్టి=నా శిరస్సు పట్టి, ఈడ్వన్=ఈడ్వగా, నీ ముంగలన్=నీ ఎదుట, కనుగోన్=చూచే, పాలైతి=స్థితికి వచ్చాను.

**తా :** రాక్షస రాజుల్లో ప్రసిద్ధుడైన మయుని కూతురిని, నీ పట్టపు రాణిని. ఏ పక్కనుండి ఎట్టి ఆపదలు రావడానికి వీలులేనిదాన్ని. ఇంద్రుణ్ణి జయించి, ఇంద్రజిత్తు అని పేరు సంపాదించుకున్నవాని తల్లిగా జయజయధ్వానాలు అందుకొన్న దానిని. స్త్రీలందరి చేతా పూజింపబడేదానిని, భయం అంటే ఏమిటో తెలియని నన్ను, ఈ విధంగా ఏ భయం లేకుండా నా తలపట్టి ఒక కోతిగాడు ఈడ్చుకొని నీముందు కొస్తే నువ్వు చూచే స్థితికి వచ్చానేమిటి?

**విశే :** మొల్ల ఈ పద్యంలో మండోదరి ఆభిజాత్యాన్ని అక్షరబద్ధం చేసింది. తన పుట్టుక, తన భర్త, తన తనయుడు, తన ధైర్యం వివరిస్తూ ఇన్నిట ప్రశస్తికెక్కిన తనను చివరికి ఒకకోతి తలపట్టి తన భర్త కళ్లముందుకు లాక్కురావడం భరించలేకపోయింది. ఈ వాక్పటిమ ధీరురాలైన మండోదరిది. ఈ కవిత మొల్లది, ఈ పద్యం మహాభారతంలో ఉద్యోగపర్వంలో తిక్కనగారి ద్రౌపదిని గుర్తుకు తెస్తుంది.

చ. వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁజొచ్చితి నందుఁబాండుభూ
వరునకుఁ గోడలైతిజనవంద్యులఁ బొందితి నీతి విక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్. ఉద్యోగ-తృతీ-108

అక్కడా కొప్పుపట్టి ఈడ్చారు. ఇక్కడా కొప్పుపట్టి ఇడ్చాడు. అక్కడా భర్తలు చూస్తుండగానే, ఇక్కడా భర్త చూస్తూండగానే. తిక్కనగారిని భక్తితో అనుసరిస్తూనే చక్కని రచన తనదైనశైలిలో చేసింది మొల్ల. తిక్క కవిరాజు ప్రస్తుతింతు అని తిక్కనని కవిరాజుగా సంభావించింది మొల్ల.

క. రాముని దూతలు నన్నును
బాములు వెట్టంగఁ జూడఁ బందువె నీకున్

**నామానము గాపాడని**
**నీ మానుష మేటి కిపుడు నిర్జరవైరీ! 14**

**ప్రతి :** రాముని దూతలు, నన్నును, బాములు=కష్టములు, పెట్టంగన్=పెడుతూ ఉంటే, చూడన్=చూడడం, పండువె నీకున్=నీకు పండగలా ఉందా? నామానమున్=నా గౌరవాన్ని, కాపాడని=రక్షింపని, నీ మానుషము= నీ పౌరుషము, ఏటికి=ఎందుకు, ఇపుడు, నిర్జరవైరీ!=దేవతల శత్రువైనవాడా!

**తా :** రామదూతలు నన్నిలా కష్టపెడుతూ ఉంటే నీకు చూడడానికి పండుగలా ఉందా? నా మానం కాపాడలేని నీ పౌరుషమెందుకు? రాక్షసరాజా!

**విశే :** పండువెనీకున్–కందువ మాట.

**ఉ. ఈ మునివృత్తికన్న దనుజేశ్వర! రామునితోడ నేఁడు సం**
**గ్రామము సేసి గెల్చిన నఖండ రమావిభవంబు గల్గు నా**
**రామునిచేతఁ జచ్చిన స్థిరంబగు మోక్షము గల్గు దీనికై**
**యేమిటి కింత దైన్య మిసి! యిచ్చఁ దలంపుము రాక్షసేశ్వరా!. 15**

**ప్రతి :** దనుజేశ్వర!=ఓ రాక్షసరాజా! ఈముని వృత్తికన్న=ఇలామునిలా హోమాలు చేస్తూ ఉండం కన్న, నేఁడు=ఈనాడు, రామునితోడ, సంగ్రామముసేసి=యుద్ధం చేసి, గెల్చినన్=గెల్చినట్లయితే, అఖండ రమా విభవంబున్=పూర్ణమైన విజయ సంపద. గల్గున్=లభిస్తుంది. ఆ రామునిచేతన్. చచ్చిన, స్థిరంబగు= శాశ్వతమైన, మోక్షము గల్గు=మోక్షము లభిస్తుంది, దీనికై=ఈపాటి కోసం, ఏమిటికి=ఎందుకు, ఇంత, దైన్యము=ఇంత దీనత, ఇసి=అయ్యో, ఇచ్చన్=ఇష్టాన్ని, తలంపుము=ఆలోచించుకో, రాక్షసేశ్వరా!.

**తా :** ఇలా మునిలా హోమం చేస్తూ కూర్చోవడంకన్నా రామునితో యుద్ధం చేసి గెలిస్తే అఖండవిజయాన్ని పొందవచ్చు. యుద్ధ రంగంలో రాముని చేతిలో చనిపోయావా, శాశ్వతమైన మోక్ష పదవి లభిస్తుంది. అంతేకానీ ఈ దీనస్థితి ఏమిటి రాక్షసేశ్వరా!

**విశే :** రావణుడు ముక్కు మూసుకుని కూర్చోవడం మండోదరి భరించలేకపోయింది. కోపంతో గొప్పగా ప్రబోధించించి. ఎత్తిపొడిచింది. ఇంతటి ఎత్తి పొడుపులో కూడా రాక్షసేశ్వరా! అని సంబోధించింది. జీవితేశ్వరునిలోని, ఈశ్వరత్వాన్ని విస్మరించలేదు మండోదరి.

**వ. అని యనేక విధంబులుగా దీనాలాపంబు లాడుచు వెక్కి వెక్కి యేడ్వం గని లజ్జించి మహోగ్రాకారుండై లేచి దగ్ధశేషకాండంబులచే వానరవీరుల కరంబులు శిరంబులు ముక్కులుఁ జెక్కులు నలుఁగ మొత్తినం బఱచి వారు రామచంద్రుని సమ్ముఖంబునకుంబోయి తాము పోయివచ్చిన పని విన్నవించి రట్టి సమయంబున. 16**

**ప్రతి :** అని, అనేక విధంబులుగాన్=పలురకాలుగా, దీనాలాపంబులు=దైన్యముతోడి పలుకులు, ఆడుచున్= పల్కుచు, వెక్కి వెక్కి యేడ్వన్=వెక్కి వెక్కి ఏడవగా, కని=చూచి, లజ్జించి=సిగ్గుపడి, మహోగ్రాకారుండై=

మిక్కిలి భయంకరమైన రూపం కలవాడై, లేచి, దగ్ధశేషకాండంబులచేన్=కాలగా మిగిలిన కర్రలతో (కొఱకంచులతో), వానరవీరుల కరంబులు=వానర వీరులయొక్క చేతులు, శిరంబులు=తలలు, ముక్కులు, చెక్కులున్=దవుడలును, అలుఁగన్=కోపించినట్లు, మొత్తినన్=బాదగా, పఱచి=పరుగెత్తి, వారు, రామచంద్రుని సమ్ముఖంబునకున్=రామచంద్రుని ఎదుటకు, పోయి=వెళ్ళి, తాము పోయివచ్చిన పని=తాము వెళ్ళివచ్చిన పని, విన్నవించిరి=వినతి చేసిరి, అట్టి సమయంబునన్=ఆ సమయంలో...

**తా :** అని అనేక విధాలుగా దీనంగా మాట్లాడుతూ వెక్కివెక్కి ఏడ్చింది మండోదరి. ఆమె ఏడవడం చూసి రావణుడు సిగ్గుపడి పట్టరాని కోపంతో లేచి అగ్నిహోత్రంలో కాలగా మిగిలిన కొఱకంచులతో వానరవీరుల చేతులు, తలలు, ముక్కులు, చెంపలు నలిగిపోయే విధంగా గట్టిగా మొత్తాడు. ఆ దెబ్బకు వారు పారిపోయి రామచంద్రుని ఎదుటికి వెళ్ళి తాము వెళ్ళి చేసివచ్చిన పనిని విన్నవించారు ఆ సమయంలో.

**తే.** **నగచరుఁ దోలి క్రమ్మర నగరి కరిగి**
**పంక్తి కంఠుడు ధైర్యంబు పాదుకొల్పి**
**విన్నఁదనమున వగపునఁ జిన్న వోయి**
**చెంత నున్నట్టి తన కులకాంతఁజూచి.** **17**

**ప్రతి :** నగచరులన్=కోతులను, తోలి=వెళ్లగొట్టి, క్రమ్మర=తిరిగి, నగరికరిగి=అంతఃపురంలోకి వెళ్లి, పంక్తికంఠుడు=రావణుడు, ధైర్యంబు, పాదుకొల్పి=గట్టిగా నిలదొక్కుకుని, విన్నఁదనమునన్=కాంతి విహీనమై, వగపునన్=దుఃఖంతో, చిన్నవోయి=చిన్నబుచ్చుకుని, చెంతనున్నట్టి=పక్కనే ఉన్న, తనకులకాంతన్=తన భార్యను, చూచి.

**తా :** కోతుల్ని వెళ్లగొట్టి రావణుడు అంతఃపురంలోకి వచ్చి ధైర్యం గట్టిగా నిలదొక్కుకున్నాడు. ముఖం కళతప్పి దుఃఖంతో చిన్నబోయి తన పక్కన ఉన్న తన కులకాంత మండోదరిని చూచి.

**క.** **నాకేలు వట్టి వెలసిన**
**నీ కేలా చిన్న వోవ నీరజనయనా!**
**నాకులు బెదరఁ నల యి**
**క్ష్వాకు కులోద్భవుల గెలిచి వచ్చెద నింకన్.** **18**

**ప్రతి :** నీరజనయనా! తామరలవంటి కన్నులు గలదానా! నాకేలు పట్టి=(నా చేయి పట్టి) నన్ను వివాహమాడి, వెలసిన=ప్రకాశిస్తున్న, నీకు+ఏలా=నీకు ఎందుకు, చిన్నవోవ=దుఃఖపడడం, నాకులు=దేవతలు, బెదరఁగన్=భయపడేటట్లు, అల=ఆ, ఇక్ష్వాకు కులోద్భవులన్=ఇక్ష్వాకువంశంలో పుట్టిన శ్రీరామలక్ష్మణులను, గెలిచి=జయించి, వచ్చెదను, ఇంకన్=ఇక.

**తా :** నీరజనయనా! మండోదరీ! నన్ను పెళ్లాడి వైభవంగా ఉన్న నీకెందుకు ఇలా దుఃఖపడడం. దేవతలు భయపడే రీతిలో ఇక్ష్వాకు వంశజులయిన వారిని ఇంక జయించి వస్తాను.

**తే. తెలియ మయుపుత్త్రి! నాదు ప్రతిజ్ఞ వినుము**
**వనచరులతోడ రామభూవరుని నేఁడు**
**చంపుటొండెను వానిచేఁ జచ్చుటొండెఁ**
**గాని యూరక మరలుట కానిమాట. 19**

**ప్రతి :** మయపుత్త్రి!=ఓ మండోదరి, నాదు ప్రతిజ్ఞ=నా ప్రతిజ్ఞ, తెలియవినుము=పూర్తిగా అర్థమయేయ్యలా వినుము, వనచరులతోడన్=ఆ వానరులతో సహా, రామభూవరుని=రామరాజుని, నేఁడు, చంపుట, ఒండెను. వానిచే, చచ్చుట, ఒకటి, కాని, ఊరక మరలుట=ఏమీచెయ్యకుండా వెనుకకు రావడం, కానిమాట=జరగని మాట.

**తా :** ఓ మండోదరీ! నా ప్రతిజ్ఞ జాగ్రత్తగా విను. వానరులతో సహా రామ భూపాలుణ్ణి ఈరోజు చంపడమో, లేక వానిచే నేను చావడమో కాకుండా ఊరికే వెనుకకు తిరిగివచ్చేది లేదు అని గట్టిగా ప్రతిజ్ఞ చేసాడు రావణుడు.

**విశే :** ఇలా రావణుని చేత వీరోచితమైన ప్రతిజ్ఞ చేయించిన మానినీమణి మొల్ల చిత్రించిన మండోదరి. పాతాళహోమం, కపులు మండోదరిని అవమానించడం, మండోదరి ప్రబోధన, రావణుని సమరోత్సాహం– మొల్ల ప్రత్యేకంగా తీర్చిదిద్దింది. వాల్మీకి రామాయణంలో పాతాళ హోమ ప్రసక్తిలేదు. ఈ ఘట్టాలకు రంగనాథ, భాస్కర రామాయణాలు మొల్లకు మార్గదర్శకాలు.

**వ. అని వీరరసం బుప్పొంగఁ బ్రతిజ్ఞాలాపంబులఁ దనపట్టపుదేవి యగు మండోదరి నోదార్చి కొలువుకూటంబున కేతెంచి యచ్చట. 20**

**తా :** అని వీరరసం పొంగి పొరలే విధంగా ప్రతిజ్ఞ చేసి తన పట్టపుదేవిని ఓదార్చి రావణుడు కొలువు కూటానికి వచ్చి అక్కడ.

## రావణుని సమర సంరంభము

**క. శిరముల వీనుల గళములఁ**
**గరముల నురమున నడుమున గమనీయపదాం**
**బురుహముల భూషణావళు**
**లరుదారఁగఁ దాల్చి మోహనాకృతి మీఱన్. 21**

**ప్రతి :** శిరముల=తలలలో, వీనుల=చెవులలో, గళములన్=కంఠాలలో, ఉరమున=రొమ్మున, నడుమునన్= నడుము మీద, కమనీయ పదాంబురుహముల=అందమయిన పాదపద్మాలను, భూషణావళులు=సొమ్ముల సమూహాలు, అరుదారఁగన్=ఆశ్చర్యపడే విధంగా, తాల్చి=అలంకరించుకుని, మోహనాకృతి=మనస్సుకు ఆనందం కలిగించే రూపంతో, మీఱన్=అతిశయించగా.

**తా :** పదితలలో, ఇరవై చెవులలో, పదికంఠాలలో, రొమ్ముమీద, నడుము మీద, అందమైన పాదాలకు ఆయా నగలు అలంకరించుకుని ఆశ్చర్యపడేలా మోహనాకృతితో రావణుడు అతిశయించగా.

**విశే :** 'రణశృంగారము' అని యుద్ధభూమికి వెళ్లేవాళ్లు చాలా శ్రద్ధగా అలంకరించుకుటారు.

**తే.** **గంధమాల్యాంబరాదులు బంధురముగ**
**మేనఁ గలయంగ ధరియించి దానవేంద్రుఁ**
**డంత రణభేరి వ్రేయించి పంత మలర**
**బిరుదు రాహుత్తవీరులఁ బిలువఁ బనిచె.** **22**

**ప్రతి :** గంధమాల్య+అంబరాదులు=గంధము, పూలమాలలు, వస్త్రాలు మొదలయినవి, బంధురముగ= అధికముగ, మేనన్=శరీరం మీద, కలయంగ= అన్నిచోట్ల, ధరియించి=అలంకరించుకుని, దానవేంద్రుఁడు= రావణుడు, అంత=అప్పుడు, రణభేరి=యుద్ధ సందర్భంలో వాయించే భేరీని, వ్రేయించి=మ్రోగింప చేసి, పంతము=పట్టుదల, అలర=ప్రకాశింపగా, బిరుద రాహుత్త వీరులన్=గుఱ్ఱపు స్వారీ చేయుటలో ప్రసిద్ధులయి వీరులను (రౌతులను), పిలువన్=పిలుచుటకు, పనిచె=ఆజ్ఞాపించెను.

**తా :** రావణాసురుడు శరీరానికి అధికంగా గంధము పూసుకుని, పూలమాలలు వేసుకుని, వస్త్రాలు కట్టుకుని రణభేరి మ్రోగింపచేసి, పట్టుదలతో వీరులయిన రౌతులను పిలవమని ఆజ్ఞాపించాడు.

**వ.** **అట్టి యవసరంబున.** **23**

**తా :** ఆ సమయంలో

**ఆ.** **రోష మదర ఖడ్గరోముండు వృశ్చిక**
**రోముఁ డల్ల సర్పరోముఁ డగ్ని**
**వర్ణుఁడాది గాఁగ వచ్చిరి రాక్షస**
**వీరు లపుడు దనుజవిభునిఁ గొలువ.** **24**

**ప్రతి :** రోషము=కోపము, అదర=అధికముకాగా, ఖడ్గరోముండు, వృశ్చికరోముఁడు, అల్ల, సర్పరోముఁడు, అగ్నివర్ణుండు, ఆదిగాఁగ=మొదలయినవారు, వచ్చిరి, రాక్షసవీరులు, అపుడు, దనుజవిభునిన్=రాక్షసరాజును, కొలువన్=సేవించగా.

**తా :** అధికమైన కోపంతో ఖడ్గరోముడు, వృశ్చిక రోముడు, సర్పరోముడు అగ్నివర్ణుడు మొదలయిన రాక్షసవీరులు రాక్షసరాజుని సేవించడానికి వచ్చారు.

**విశే :** ఈ పేర్లు గల రాక్షస వీరులు వాల్మీకి రామాయణంలో లేరు.

**క.** **ఇరువది చేతుల శస్త్రో**
**త్కరములు మెఱయంగఁ దాల్చి కౌతుక మదరన్**

**దురగములు నూఱు గట్టిన**
**యరదముపైఁ గూరుచుండ నతివిభవమునన్.** 25

**ప్రతి :** ఇరువదిచేతుల=ఇరవైచేతులలో, శస్త్రోత్కరములు=శస్త్రముల సమూహాలు, మెఱయంగన్=ప్రకాశింపగా, దాల్చి=ధరించి, కౌతుకము=కుతూహలము, అదరన్=అధికముకాగా, తురగములు నూఱు=వందగుఱ్ఱాలు, కట్టిన, అరదముపైన్=రథము మీద, అతి విభవమునన్=గొప్ప వైభవంగా, కూరుచుండన్=కూర్చుండగ.

**తా :** రావణుడు తన ఇరువది చేతుల్లో వివిధ శస్త్రాలు ప్రకాశిస్తూ ఉండగా గొప్ప కుతూహలంతో నూఱు గుఱ్ఱాలు కట్టిన రథము మీద అతివైభవంగా కూర్చున్నాడు.

**సీ. భేరులు తమ్మటల్ పెల్లు నిస్సాణముల్**
**బూరగొమ్ములు కంచువీరణములు**
**మకిలక్రోవులు వీరమద్దెలల్ గిడుగిళ్ళు**
**పేరైన తప్పెటల్ పిల్లఁగ్రోళ్ళు**
**తారలు చిమ్మటతారలు శంఖముల్**
**కాహళాల్ పసిఁడిఢక్కలును బిడులు**
**గాలిగొమ్ములు డోళ్ళు కైవళ్ళు రుంజలు**
**ఛత్రసంఘంబులు చామరములు-**

**తే. బోరుకలఁగంగ దిక్కులు బూరటిల్ల**
**దనుజవర్గంబు లిరువంకఁ దవిలి కొలువ**
**వెడలె సన్నాహ మదరంగ వీరరవము**
**కరువు గట్టిన చందంబు గానఁబడఁగ.** 26

**ప్రతి :** భేరులు=పెద్ద ధ్వనిని పుట్టించే వాద్యాలు-భేరీ-భేరి-భేరులు, తమ్మటల్=చర్మవాద్యవిశేషము, పెల్లు=ఎక్కువగా, నిస్సాణముల్=చర్మవాద్యాలు, బూరగొమ్ములు=కొమ్ముబూరాలు, కంచువీరణములు=కంచుతో చేసినవాద్యాలు, మకిల క్రోవులు=నల్లని ఊదేవాద్యాలు, వీరమద్దెలల్=పెద్దపెద్ద మద్దెలలు, గిడుగిళ్లు=భజన చేసే పెద్ద చిరుతలు, పేరైన తప్పెటల్=పెద్దపెద్ద తప్పెటలు, పిల్లఁ గ్రోళ్లు=పిల్లన గ్రోవులు, తారలు=ఊదేవాద్యాలు, చిమ్మట తారలు=పొడుగు పాటి ఊదేవాద్యాలు, శంఖములు, కాహళాల్=సన్నాయివంటి వాద్యములు, పసిడి ఢక్కలు=బంగారంతో చేసిన ఢక్కలు, పిడులు=వాద్యవిశేషాలు, గాలిగొమ్ములు=వాద్యవిశేషాలు, డోళ్లు, కైవళ్లు, రుంజలు=వాద్యవిశేషాలు, ఛత్ర సంఘంబులు=గొడుగుల సమూహాలు, చామరములు=వీవనలు, బోరు కలఁగఁగ=పెద్దగా ధ్వనిచేయగా, దిక్కులు=అన్ని దిక్కులు,బూరటిల్ల=ధ్వనులతో నిండిపోగా, దనుజ వర్గంబులు=రాక్షససమూహాలు, ఇరువంకన్=రెండుప్రక్కల, తవిలికొలువ=చేరికొలువగా,

సన్నాహము=కావలసిన వస్తుసముదాయమంతా కూర్చుకుని, అదరంగ=అతిశయించగ, వీరరవము=వీరుల ధ్వని, కరువు గట్టిన చందంబున్=విగ్రహరూపము దాల్చిందా అన్నట్లు, కానఁబడఁగ=కనబడుచుండగ, వెడలె=వెళ్లెను.

**తా :** ఊదే వాయిద్యాలు, చర్మంతో చేసినవి చేతితో కానీ, కర్రలతో కానీ కొట్టి వాయించే వాద్యాలు, గొడుగులు చామరాలతో దిక్కులు నిండిపోయేలా పెద్దగా ధ్వని చేయగా రాక్షస వర్గాలు ఇరుపక్కల చేరి కొలుస్తూ ఉండగా వీరరసం విగ్రహంగా రూపొందిందా అన్నట్లుండగా గొప్ప సన్నాహంతో రావణుడు యుద్ధరంగానికి బయలు దేరాడు.

**విశే :** ఈ పద్యంలో వాద్యవిశేషాలు మొల్ల చాలా శ్రద్ధతో పేర్కొంది. ఇన్ని పేర్లతో ఇంతటి వైవిధ్యం గల వాద్యవిశేషాలు ఆంధ్ర దేశంలో వ్యవహారంలో ఉండే వన్నమాట.

మొల్ల పేర్కొన్న ఈ పేర్లకు సూర్యరాయాంధ్రనిఘంటువులో ఈ పద్యమే ప్రయోగాలకు ఉదాహరించారు. మొల్ల తెలుగు వాద్యాల పేర్లు పేర్కొనడంలో కూడా తనదైన ప్రత్యేకతను నిల్పుకున్నది.

క. **కాలాగ్ని కాలభైరవ**
**కాలాంతక కాలగండ కాలాహి కళా**
**భీల సముద్య ద్దినకర**
**కాలాకృతితోడఁ బంక్తికంఠుఁడు వెడలెన్.** **27**

**ప్రతి :** కాలాగ్ని=ప్రళయాగ్ని, కాలభైరవ=కాలభైరవుడు శివపరివారంలోని వాడు, కాలాంతకుడు=కాలమును అంతము చేసేవాడు శివుడు, కాలగండ=కాలమును నిలువరించేవాడు, కాలాహి=కాలమనే పాము=కాలసర్పము, కళాభీల=ఆయా కళలలో శ్రేష్ఠుడైన, సముద్యత్=బాగుగా ప్రకాశిస్తున్న, దినకరకాలాకృతి తోడ=సూర్యుని ఆకృతితో ప్రళయకాలము నాటి విశేష ప్రకాశముగలిగిన, పంక్తికంఠుడు=రావణుడు, వెడలెన్=బయలుదేరెను.

**తా :** కాలాగ్నిలా, కాలభైరవునిలా, కాలాంతకునిలా, కాలగండనిలా, కాలసర్పములా–ప్రళయకాలంనాటి సూర్యునివలె విశేష ప్రకాశంతో రావణుడు యుద్ధానికి బయలు దేరాడు.

వ. **ఇట్లుత్యుత్సాహంబుగా యుద్ధరంగంబునకు బయలుదేఱిన సమయంబున** **28**

## వందిచేసిన రావణుని స్తుతి

**చూర్ణిక.**

**జయజయ కైకసీగర్భ సముద్ర సంపూర్ణ సుధాకరా!**
**జయజయ మయతనూజామనోహరా!**
**జయజయ రాక్షస కులసార్వభౌమా!**
**జయజయ సాగరావరణ లంకేశ్వరా!**

**జయజయ పాకశాసనభద్రశ్రీ హరణచతురా!**
**జయజయ కుటిల వైశ్వానర పుటభేద నిర్ధూమధామా!**
**జయజయ సమవర్తి సంపద్విచ్ఛేదకా!**
**జయజయ దనుజవల్లభహల కల్లోలా!**
**జయజయ యబ్ధీశ్వర తోయ శోషణబడబానలా!**
**జయజయ పవమాన సంహారా!**
**జయజయ యక్షనాయక దుర్వార గర్వాపహారకా!**
**జయజయ యీశానైశ్వర్య హరణోద్యమా!**
**జయజయ నవగ్రహానుగ్రహ నిగ్రహా!**
**జయజయ దశగ్రీవాలంకారా!**
**జయజయ కైలాస నగేంద్రోత్పాటనకందుక క్రీడావినోదా!**
**జయజయ భవానీశ్వర శ్రీపాదకమల శిరఃకంజాతపూజాసమర్థా!**
**జయజయ పుష్పకారూఢసకల దిగంత విక్రాంత!**
**జయజయ బ్రహ్మవంశప్రదీపకా!**
**జయజయ త్రిలోకవిజయా!**
**రావణేశ్వరా! జయీభవ! దిగ్విజయీభవ!.** **29**

**ప్రతి :** జయజయ కైకసీగర్భసముద్ర సంపూర్ణ సుధాకరా=కైకసీ గర్భము అనే సముద్రానికి పూర్ణచంద్రుని వంటివాడ జయము జయము. కైకసి రావణుని తల్లి.

జయజయ మయతనూజా మనోహరా!=జయము జయము మయుని పుత్రిక అయిన మండోదరీ మనోహరుడా!

జయజయ రాక్షసకులసార్వభౌమా!=రాక్షసకులమునకు సార్వ భౌముడా! జయము జయము.

జయజయ సాగరావరణ లంకాధీశ్వరా!=సముద్రముచే చుట్టబడిన లంకకు నాయకుడా! జయము జయము.

జయజయ పాకశాసన భద్రశ్రీ హరణచతురా!=ఇంద్రుని భాగ్యాన్ని హరించడంలో నేర్పుగలవాడ! జయము జయము.

జయజయ కుటిల వైశ్వానర పుటభేద నిర్ధూమధామా!=వంకరటింకరగా ప్రకాశించే అగ్నిహోత్రుని భేదించువాడా! జయము జయము

జయజయ సమవర్తి సంపద్విచ్ఛేదకా!=యముని సంపదను నాశనము చేసినవాడా! జయము జయము

జయజయ దనుజవల్లభ హల కల్లోలా!=బలి చక్రవర్తి శోభను చిందరవందర చేసిన వాడా! జయము జయము.

జయజయ యబ్ధీశ్వర తోయశోషణ బడబానలా!=సముద్రుని నీటిని ఎండించు బడబాగ్ని వంటివాడా జయము జయము.

జయజయ పవమాన సంహారా!=వాయువును నిర్బంధించినవాడా!/నియంత్రించినవాడా! జయము జయము.

జయజయ యక్షనాయక దుర్వార గర్వాపహారకా!=యక్షనాయకుని కుబేరుని వారింపశక్యము గాని గర్వమును అణచి వేసినవాడా! జయము జయము.

జయజయ యీశానైశ్వర్య హరణోద్యమా!=ఈశాన్యదిక్కుకు పాలకుడైన ఈశానుని ఐశ్వర్యమును హరించే ప్రయత్నము కలవాడా! జయము జయము.

జయజయ నవగ్రహానుగ్రహ నిగ్రహా!=నవగ్రహాలు నీ అనుగ్రహము మీద నడిపేవాడా! జయము జయము.

జయజయ దశగ్రీవాలంకారా!=అలంకరింపబడిన పదికంఠములు గలవాడా! జయము జయము.

జయజయ కైలాస నగేంద్రోత్పాటన కందుక క్రీడా వినోదా!=కైలాస పర్వతాన్ని ఎత్తి బంతివలె క్రీడించుటలో ఆనందించువాడా! జయము జయము.

జయజయ భవానీశ్వర శ్రీపాదకమలశిరః కంజాత పూజా సమర్థా!=పార్వతీ పతి శ్రీపాదకమలాలను నీ తలలు అనే తామరలతో పూజించే సామర్థ్యము కలవాడా! జయము జయము.

జయజయ పుష్పకారూఢ సకలదిగంత విక్రాంతా!=పుష్పక విమానము ఎక్కి అన్ని దిక్కులను విశేషముగా ఆక్రమించినవాడా! జయము జయము.

జయజయ బ్రహ్మవంశప్రదీపకా!=బ్రహ్మవంశమునకు కాంతివంతమయిన దీపము వంటివాడా!

జయజయ త్రిలోక విజయా!=మూడు లోకములను జయించినవాడా! జయము జయము.

రావణేశ్వరా! జయాభవ! దిగ్విజయీభవ! రావణప్రభు! నీకు జయమగాక! దిగ్విజయము కలుగుగాక!

**తా :** కైకసీగర్భ మను సముద్రమునకు పూర్ణచంద్రుడా! జయము జయము; మయుని కూతురుకొడుకా! రాక్షసవంశ సార్వభౌమా! సాగరముచే చుట్టబడిన లంకాధిపా! జయము జయము. ఇంద్రుని భద్రగజమును హరించిన నేర్పరీ! వంకరగా మెలికలు తిరుగుతూ ప్రకాశించే అగ్నిహోత్రుని భేదించేవాడా! యముని సంపదను విచ్ఛిన్నము చేసినవాడా! బలిచక్రవర్తి శోభను చిందర వందర చేసినవాడా! సముద్ర జలమును ఇంకింపగల బడబానలమా! వాయువును నిర్బంధించినవాడా!/నియంత్రించినవాడా! కుబేరుని వారింపరాని

గర్వమును హరించినవాడా! ఈశ్వరుని ఐశ్వర్యమును వారింపయత్నించినవాడా! నవగ్రహానుగ్రహమును నిగ్రహించినవాడా! అలంకరించుకున్న పదితలలు కలవాడా! కైలాసపర్వతమును పెకలించి బంతి ఆటగా వినోదించినవాడా! ఈశ్వరుని పాదపద్మములను శిరస్సులనే పద్మములచే పూజింప సమర్థుడా! పుష్పకారూఢుడై దిగంతములను తిరిగినవాడా! బ్రహ్మవంశప్రదీపకా! త్రిలోకవిజయా! రావణేశ్వరా! జయుడవు కమ్ము! దిగ్విజయుడము కమ్ము!

**వ. అని వందిబృందంబు లుభయ పార్శ్వంబుల జయజయ ధ్వనులతో బిరుదు గద్యపద్యంబులు వక్కాణింప ముక్తాతపత్రంబుల నడుమ మహిళామండలార్పిత చామరపవన కంపిత కుంతలుండగుచు వీరరసంబు పురుషాకారంబు దాల్చినలీల నేతేర ముజ్జగంబులు గడగడ వడంకెఁ గరిబృంహితంబులు నశ్వహేషారవంబులును దనుజభటాట్టహాసంబులును సురత్రాస జనకంబుగాఁ బటహనిస్సాణ భేరీశంఖకాహళ భాంకార రవంబులును బ్రతిధ్వనుల నీన నంత రావణుపై మేఘంబులు రక్తధారలు వర్షించె బిరుదధ్వజంబులు విఱిగిపడియెఁ దురంగంబుల వాలంబుల నుండి నిప్పు లురలె దిక్కుల ధూమంబు నిబిడంబై పర్వెనట రామునిచే రావణుండు తెగుట యవశ్యంబని నభంబును మ్రోసెనట్టి సమయంబున. 30**

**ప్రతి :** అని, వందిబృందంబులు=స్తోత్రపాఠకుల సమూహములు, జయజయ ధ్వనులతో=జయము జయమనెడి శబ్దములతో, బిరుదు గద్యపద్యలు, వక్కాణింపన్=పలుకగా, ముక్తాతపత్రంబులనడుమ= తెరుచుకొన్న గొడుగులమధ్యలో, మహిళామండలార్పిత చామరపవనకంపితకుంతలుండు=స్త్రీ సమూహముచే వీయబడిన వింజామరముల గాలిచే కదిలిన జుట్టుకలవాడై, వీరరసంబు, పురుషాకారంబు=పురుషుని రూపము, తాల్చిన లీలన్=ధరించినట్లుగా, ఏతేరన్=రాగా, ముజ్జగంబులు=మూడులోకములు, గడగడవడంకె= గడగడావణికినవి, కరిబృంహితములున్=ఏనుగుల గర్జనలును, అశ్వహేషారవంబులును=గుఱ్ఱపు సకిలింపులును, దనుజభటాట్టహాసంబులును=రాక్షసభటుల పెద్ద నవ్వులును, సురత్రాసజనకంబుగా= దేవతలకు భయము కలిగించునవిగా, పటహ–నిస్సాణ–భేరీ–శంఖ–కాహళ–భాంకారరవంబులును=పెద్ద మద్దెల మున్నగు వాద్యముల భావోధ్వనులును, ప్రతిధ్వనులన్, ఈనన్=కలిగించగా, అంతన్=అటుపై, రావణుపైన్, మేఘంబులు, రక్తధారలు, వర్షించెన్, బిరుదధ్వజంబులు=చిహ్నము గల జండాకర్రలు, విఱిగిపడియెన్=విఱిగిపడెను, తురంగంబుల వాలంబులనుండి=గుఱ్ఱముల తోకలనుండి, నిప్పులు, ఉరవెన్= వెలువడెను, దిక్కులన్=దిక్కులందు, ధూమంబు=పొగ, నిబిడంబై=దట్టముగా, పర్వెను=వ్యాపించెను, అటన్= అక్కడ, యుద్ధరంగంలో రామునిచే, రావణుండు, తెగుట=చచ్చుట, అవశ్యంబు అని=తప్పనిసరి అని, నభంబును=ఆకాశము కూడ, మ్రోసెను=ధ్వనించెను, అట్టి సమయంబునన్=అటువంటి సమయంలో...

**తా :** స్తోత్రపాఠాలు చేసే వంది సమూహాలు రెండుప్రక్కలా నిలబడి జయజయ అంటూ బిరుదు గద్యలు పద్యాలు పఠిస్తూ ఉన్నారు. ముత్యాల గొడుగుల మధ్య రమణీమణులు వీస్తున్న చామరాల గాలి తాకిడికి రావణాసురుని కురులు వణుకుతున్నట్లుగా కదులుతున్నాయి. అలాంటి స్థితిలో వీరరసం పురుషుని ఆకారం దాల్చిందా అన్నట్లుగా రావణుడు వచ్చాడు. అతని రాకకు మూడు జగాలు గడగడా వణికిపోయాయి.

కులపర్వతాలు అన్నీ పక్కకు ఒరిగిపోయాయి. సూర్యమండలం, చంద్రమండలం తడబడ్డాయి. నక్షత్రాలు రాలిపడ్డాయి. ఆ సమయంలో ఏనుగుల బృంహితాలు, గుఱ్ఱాల హేషారవాలు, రాక్షసభటుల గట్టి నవ్వులు దేవతలకు భయం కలిగించేలా పటహ నిస్సాణభేరీ శంఖకాహళ భాంకారములనే వాద్యముల చప్పుళ్లు ప్రతిధ్వనిస్తున్నాయి. అప్పుడు రావణుని మీద మేఘాలు రక్తవర్షాన్ని కురిపించాయి. అతడి బిరుదులుగల జెండాలు విరిగిపడ్డాయి. గుఱ్ఱాల తోకల నుండి నిప్పురవ్వలు వెలువడ్డాయి. దిక్కులన్నిటా పొగలు దట్టంగా వ్యాపించాయి.

రామునిచే రావణుడు సంహరింపబడటం తథ్యము అని ఆకాశవాణి పలికింది ఆ సమయంలో.

**క. భూనాయకుఁ డతివేగమ**
**దానవసేనలకు నెదురు దార్కొని పోరన్**
**వానరసేనలఁ బంపెను**
**భానుజముఖ్యాధిపతులఁ బౌరుష మడరన్. 31**

**ప్రతి :** భూనాయకుఁడు=శ్రీరామచంద్రుడు, అతివేగమ=మిక్కిలి వేగంగా, దానవసేనలకున్=రాక్షస సేనలకు, ఎదురుదార్కొని=ఎదిరించి, పోరన్=యుద్ధము చేయుటకు, సుగ్రీవుడు మొదలయిన ప్రధాన నాయకులను, పౌరుషమడరన్=పౌరుషము ప్రకాశింపగా, పంపెను=పంపించెను.

**తా :** శ్రీరామచంద్రుడు అప్పుడు సుగ్రీవుడు మొదలైన ప్రధాన నాయకుల్ని కపిసేనను రాక్షస సేనలను ఎదుర్కొని పౌరుషం అతిశయించగా పోరాడడానికి పంపాడు.

**మ. తరు శైలంబులతోడ నార్చుచు భుజాదర్పంబు లుప్పొంగ వా**
**నరవర్గంబు లెదిర్చి వచ్చునెడ నానాకారు లాదక్షిణో**
**త్తరవార్ధుల్ ప్రకటించి డాయుగతి నుద్యత్ప్రౌఢిఁ దార్కొంచు సం**
**గరముంజేయఁగఁ జొచ్చి రంత సురలాకాశంబునం జూడఁగన్. 32**

**ప్రతి :** తరు శైలంబుల తోడన్=చెట్లతో కొండలతో, ఆర్చుచు=బిగ్గరగా అరుస్తూ, భుజాదర్పంబులు= భుజబలాలు, ఉప్పొంగ=ఎక్కువకాగా, వానరవర్గంబులు=వానరసమూహాలు, ఎదిర్చి=ఎదిరించి, వచ్చునెడ= వస్తూండగ, నానాకారులు=వివిధమైన ఆకారాలు గల రాక్షసులు, ఆ దక్షిణోత్తర వార్ధుల్=ఆ దక్షిణ సముద్రము ఉత్తర సముద్రము-లంకకు దక్షిణదిశను, ఉత్తరదిశను గల సముద్రాలు, ప్రకటించి=హెచ్చరిక చేసి, డాయుగతి=సమీపించే విధంగా, ఉద్యత్ ప్రౌఢిన్= విశేషముగా ప్రకాశించు అధికమైన శక్తితో, తార్కొంచు= ఒకదానిపై ఒకటి పడుచు, సంగరమున్=యుద్ధమును, చేయఁగన్=చేయుటకు, చొచ్చిరి= ఆరంభించారు, అంత=అప్పుడు, సురలు=దేవతలు, ఆకాశంబునన్=ఆకాశంలో నుండి, చూడఁగన్=చూస్తూ ఉండగా.

**తా :** వానరసేనా వాహిని చెట్లు కొండలు పెకలించి పట్టుకొని వారి భుజబలం పొంగిపొరలేలావస్తుండగా వివిధమైన ఆకారాలు గల రాక్షసులు అధికమైన శక్తితో వానరులను పైకొని యుద్ధం చేయసాగారు. ఆ

యుద్ధం దక్షిణసముద్రం ఉత్తరసముద్రం పరస్పరం హెచ్చరికలతో ఒకదానిని ఒకటి ఆక్రమించినట్లు ఉంది. ఆ విశేషమైన యుద్ధాన్ని దేవతలు ఆకాశం నుండి చూస్తూ ఉండగా.

**సీ. కరుల నెక్కించి భీకరలీలఁ ద్రొక్కించి**
**వాజులఁ దోలి తీవ్రముగ నేయ**
**రథములఁ బఱపి శిరంబులఁ జక్కాడి**
**చెలఁగి పదాతులఁ జేరి పొడువఁ**
**బంతంబు చేకూఱఁ బ్లవగోత్తములఁ గేరి**
**తరువులుఁ బాషాణతతులుఁ బఱపి**
**శైలంబు లడరించి సంహారములు సేయఁ**
**గలఁగక దైత్యులుఁ గపులు గలసి**

**తే. పోరునప్పుడు వానరవీరు లసుర-**
**వరులమీఁదను బాషాణవర్ష మధిక**
**లీలఁ గురియింపదనుజు లావేళ విఱిగి**
**తలలు వీడంగఁ బఱచిరి తత్తరమున.** **33**

**ప్రతి :** కరులను=ఏనుగులను, ఎక్కించి=శత్రుసైనికులపై ఎక్కించి, భీకరలీలన్= భయంకరముగా, త్రొక్కించి= కాళ్లతో త్రొక్కించి, వాజులన్=గుఱ్ఱములను, తోలి= పరుగుపెట్టించి, తీవ్రముగన్=ఎక్కువగా, ఏయ=పడవేయగ, రథములన్, పఱపి=పరుగుపెట్టించి, శిరంబులన్=తలలను, చక్కాడి=ఖండించి, చెలఁగి=చెలరేగి, పదాతులన్= కాలిభటులను, చేరి=సమీపించి, పొడువన్=పొడిచి వేయగా, పంతంబు=పట్టుదల, చేకూఱన్=కలుగగా, ప్లవగోత్తములన్=వానర శ్రేష్ఠులను, కేరి=ఉత్సాహంతో, తరువులున్=చెట్లు, పాషాణతతులు=రాళ్ల సమూహాలు, పఱపి=వేగంగా ప్రయోగించి, శైలంబులు=కొండలు, అడరించి= ప్రయోగించి, సంహారములు=చంపుటలు, చేయన్=చేయగా, కలఁగక= కలతపడక, దైత్యులున్=రాక్షసులు, కపులన్=వానరులును, కలసి=కూడి, పోరునప్పుడు=యుద్ధము చేయునప్పుడు, వానర వీరులు=కపివీరులు, అసురవరుల=రాక్షస శ్రేష్ఠుల, మీఁదనున్=మీదను, పాషాణవర్షము=రాళ్లవాన, అధికలీల=మిక్కిలి ఎక్కువగా, కురియింప=కురియింపగ, దనుజులు=రాక్షసులు, ఆవేళ=ఆసమయంలో, విఱిగి=ఓడిపోయి, తలలువీడంగన్=జుట్టుముడులు విడిపోగా, తత్తరమున=కంగారుతో, పఱచిరి=పరిగెత్తుకుని పోయిరి.

**తా :** ఏనుగుల చేత తొక్కించి, గుఱ్ఱాలను వేగంగా పరిగెత్తించి శత్రువులను పడవేసి, రథాలు వేగంగా నడిపి, తలలు ఖండించి, కాలిభటులను చెలరేగి పొడిచి రాక్షస వీరులు ఎదుర్కొనగా వానరవీరులకు పట్టుదల కలుగగా ఉత్సాహంతో చెట్లను రాళ్లను వేగంగా ప్రయోగించారు. పర్వతాలను పెఱికితెచ్చి ప్రయోగించి శత్రువులను చంపారు.వానరవీరులు దానవుల మీద రాళ్లవర్షం కురిపించారు. ఆ వర్షానికి తట్టుకోలేక రాక్షసులు తమ జుట్టుముడులు వీడిపోగా కలవరపాటుతో పరుగెత్తి పోయారు.

సీ. మెండైన రథముల మీఁదికిఁ గుప్పించి
విక్రమ ప్రౌఢిమై విఱుగఁ ద్రొక్కి
కరులకొమ్ములు పట్టి బిరబిర వడిఁ ద్రిప్పి
జగతీస్థలంబున జదియఁ గొట్టి
తొడరి సైంధవకోటి తడకాళ్లు విదళించి
పట్టి పెన్ జెక్కలు వాఱఁగొట్టి
కాల్బలంబులపైకిఁ గదిసి శస్త్రంబుల
తోడఁ గూడనె చుట్టి తునియఁ గొట్టి

తే. ఛత్రములు గూల్చి చామరసమితి విఱిచి
కెరలి యార్చుచు బిరుదుటెక్కెములు చించి
వాద్యసంఘంబు లవలీల వసుధఁ గూల్చి
కపులు దోలిరి దానవగణము నెల్ల. **34**

**ప్రతి :** మెండైన=ఎత్తైన, రథముల మీఁదికిన్, కుప్పించి=గెంతి, విక్రమ ప్రౌఢిమై=గొప్ప పరాక్రమముతో, విఱుగన్=విఱిగి పోవునట్లు, త్రొక్కి, కరుల కొమ్ములు=ఏనుగుల కొమ్ములు, పట్టి=పట్టుకొని, బిరబిరవడిన్= వేగంగా, గుండ్రంగా, త్రిప్పి=తిప్పి, జగతీ స్థలంబున=భూమిమీద, చదియన్=చితికి పోవునట్లు, కొట్టి, తొడరి=పూనుకొని, సైంధవకోటి=గుఱ్ఱాలసమూహముల, తడకాళ్లు=తొట్రుపడేకాళ్లు, విదళించి=విరచి, పట్టి, పెన్=పెద్ద, చెక్కలు వాఱన్=ముక్కల గునట్లుగ, కొట్టి, కాల్బలంబుల పైకిన్=నేలమీదనిలబడి యుద్ధం చేసే సైనికుల మీదకు, కదిసి=వెళ్లి, శస్త్రంబులతోడన్=బాణాలతోనే, కూడనె చుట్టి=చుట్టబెట్టి, తునియన్=ముక్కలు ముక్కలుగ, కొట్టి=కొట్టి, ఛత్రములు=గొడుగులు, కూల్చి=పడవేసి, చామర సమితి=చామరముల సమూహాన్ని, విఱిచి, కెరలి=సంతోషముతో, ఆర్చుచు=బొబ్బలు పెట్టుచు, బిరుదుటెక్కెములు=బిరుదులు వ్రాసిన జెండాలను, చించి=చింపివేసి, వాద్య సంఘంబులు=వివిధ రకాలయిన వాద్యసమూహాలను, అవలీల=ఏమీ శ్రమలేకుండా, వసుధన్ కూల్చి=నేల మీద పడవేసి, కపులు=వానరులు, దానవ గణమునెల్ల=అన్ని రాక్షసుల సమూహాల్ని, తోలిరి=పారతోలారు వెళ్లగొట్టారు.

**తా :** ఎత్తైన గొప్ప రథాల మీదకు గెంతి తమ గొప్ప పరాక్రమంతో విఱగత్రొక్కారు. ఏనుగుల దంతాలు పట్టుకుని వేగంగా గుండ్రంగా తిప్పి నేలమీద వాటి శరీరం మొత్తం చితికిపోయే విధంగా కొట్టారు. మంచి పూనికతో గుఱ్ఱాల సమూహాల తడబడే కాళ్లు విరిచి పట్టుకొని పెద్దపెద్ద ముక్కలుగా కొట్టి, కాలిభటుల మీదకు వెళ్లి వారి ఆయుధాలతోనే వారిని చుట్టేసి ముక్క ముక్కలుగా కొట్టి, గొడుగులు కూల్చేసి, చామరాలు విఱిచి, సంతోషంతో బొబ్బలు పెడుతూ, బిరుదులు వ్రాసిన జెండాలు చింపేసి, వివిధ వాద్యసమూహాల్ని ఏమీ శ్రమపడకుండా నేలమీద పడవేసి, రాక్షస సమూహాలనన్నిటిని వానరులు వెళ్లగొట్టారు.

## హనుమంతునిచే ఖండనము

ఆ. అంతఁ బంక్తివదను నరదంబు నెదురు
నడుచు వాయుపుత్త్రునకును ఖడ్గ
రోముఁ డనియె నతని రూపించి నా తోడ
రణము సేయ వేగ రమ్మటంచు. 35

**ప్రతి :** అంతన్=అప్పుడు, పంక్తివదనున్=రావణుని, అరదంబున్=రథము, ఎదురు, నడచు=నడుస్తున్న, వాయుపుత్రునకును=ఆంజనేయునితో, ఖడ్గరోముఁడు, అతని రూపించి=అతనిని పేర్కొని, నాతోడ, రణముసేయ=యుద్ధము చేయడానికి, వేగరమ్మటంచు=త్వరగా రమ్ము అనుచు, అనియె=అనెను.

**తా :** అప్పుడు రావణుని రథానికి ఎదరుగా నడుస్తున్న హనుమను చూచి ఖడ్గరోముడు ప్రత్యేకంగా పిలిచి నాతో యుద్ధం చేయడానికి వేగంగా రా అన్నాడు.

చ. పిలిచిన రోష మెత్తి కడు భీకరవృత్తిని ఖడ్గరోముతోఁ
దలపడ వానిరోమములు దాఁకి శరీరము నొచ్చి యంతలో
పల నొకపర్వతంబు గొని పావని దైత్యునిమీఁద నేయ ని
శ్చలతను ఖడ్గరోముఁడును జక్కుగఁజేసినఁ దత్క్షణంబునన్. 36

**ప్రతి :** పిలిచిన=పిలవగా, రోషమెత్తి=కోపంతో, కడుభీకరవృత్తి=మిక్కిలి భయంకరమైన పద్ధతితో, ఖడ్గరోముతోన్, తలపడ=యుద్ధం చేయడం మొదలు పెట్టగా, వాని రోమములు దాఁకి=ఆతని వెంట్రుకలు తగిలి, శరీరము నొచ్చి=శరీరము నొప్పిపుట్టగా, అంతలోపలన్=అంతలోనే, ఒక పర్వతంబుగొని=ఒక కొండ తీసుకొచ్చి, పావని=హనుమ, దైత్యుని మీఁదన్=రాక్షసుని మీద, ఏయన్=పడవేయగా, నిశ్చలతను=ఎట్టి చలనము లేకుండ, ఖడ్గరోముడును, చక్కుగన్=ముక్కలుగా, చేసినన్=చేయగా, తత్క్షణంబునన్=ఆ క్షణంలోనే.

**తా :** ఖడ్గరోముడు తనతో యుద్ధానికి రమ్మని పిలవగా హనుమ కోపంతో మిక్కిలి భయంకరమైన రీతిలో ఖడ్గరోమునితో తలపడ్డాడు. ఆ యుద్ధంలో ఖడ్గరోముని వెంట్రుకలు తగిలి హనుమ దేహం నొప్పిపుట్టింది. ఖడ్గరోముడు అంటే ఆతని రోమాలు ఖడ్గాలు అన్నమాట. కత్తులే రోమాలుగా గలవాడు. కానీ అంతలోనే ఒక పర్వతం తెచ్చి ఆ రాక్షసుని మీద పడేసాడు హనుమ. వాడు కదలక బెదరక ఆ కొండని ముక్కముక్కలు చేసేశాడు ఆ క్షణంలోనే.

చ. మఱియొక పర్వతంబు హనుమానుఁడు గైకొనివచ్చి క్రమ్మఱన్
మెఱవడిఁ ద్రిప్పి తద్రథముమీఁదను వైచిన వజ్రధారచేఁ
బఱియలువాఱి ధాత్రిఁ బడుపర్వతమో యనఁ దేరిడోడ ని
ర్భరముగ ఖడ్గరోముఁడు సపాటగఁగూలె దురంబు లోపలన్. 37

**ప్రతి :** మఱియొక=మరొక్క, పర్వతంబు, హనుమానుఁడు, కైకొని వచ్చి=తీసుకుని వచ్చి, క్రమ్మఱన్=తిరిగి, మెఱవడిన్=నేర్పుతో, త్రిప్పి=త్రిప్పి, తత్=ఆ, రథము మీఁదను, వైచిన=వేయగా, వజ్రధారచేన్=వజ్రాయుధపు దెబ్బవల్ల, పఱియలువాఱి=బీటలుపడి, ధాత్రిన్=భూమిమీద, పడు, పర్వతమో=పర్వతమా, అనన్=అనునట్టు, తేరితోడ=రథంతో సహా, నిర్భరముగ=మిక్కిలి భారంతో, సపాటగన్=ఒక్కుమ్మడిగ, ఖడ్గరోముఁడు, దురంబులోపలన్=యుద్ధములో, కూలె=కూలిపోయెను.

**తా :** హనుమ మరొక పర్వతాన్ని తెచ్చి నేర్పుతో రథముమీదకు త్రిప్పికొట్టాడు. ఆ దెబ్బకి వజ్రాయుధం దెబ్బకి బీటలువారి నేలమీద పడిన పర్వతంలా రథంతో సహా మిక్కిలి భారంతో ఒక్కుమ్మడిగా యుద్ధంలో ఖడ్గరోముడు కూలిపోయాడు.

**విశే :** పూర్వం పర్వతాలు రెక్కలు కలిగి ఆకాశంలో ఎగురుతూండేవి. ఇంద్రుడు వాటి రెక్కలు వజ్రాయుధంతో తెగగొట్టాడని పురాణ గాథ.

ఖడ్గరోముడు=ఈతని శరీరం మీద వెంట్రుకలు కత్తులు. సర్పరోముడు= పాములు రోమాలుగా గలవాడు. వృశ్చికరోముఁడు=తేళ్లు రోమాలుగా గలవాడు. ఈ ముగ్గురు వాల్మీకి రామాయణంలో కనబడరు.

## సర్పరోమాదుల సంహారము

**ఆ. రోజి కలన ఖడ్గరోముండు గూలుట**
**సర్పరోముఁ డెఱిఁగి సాహసమున**
**వాలిసుతుని దాఁక వాని రోమంబుల**
**విషము సోఁకి నొచ్చివేగఁ దెలిసి. 38**

**ప్రతి :** ఖడ్గరోముండు, కలన=యుద్ధంలో, కూలుట=చనిపోవుట, సర్పరోముఁడు, ఎఱిఁగి=తెలుసుకుని, రోజి=నిట్టూర్చి, సాహసమున, వాలి సుతుని=అంగదుని, తాఁక=ముట్టుకొనగా, వాని రోమంబుల విషము= సర్పరోముని రోమాలు సర్పాలు, ఆ సర్పాల విషము, సోఁకి=తగిలి, నొచ్చి=బాధపడి, వేగన్=వేగముగా, తెలిసి=తేరుకుని.

**తా :** యుద్ధంలో ఖడ్గరోముడు చనిపోయాడని విని సర్పరోముడు నిట్టూర్చి సాహసంతో అంగదుని తాకాడు. సర్పరోముని రోమాలు తగలడంతో ఆ పాముల విషంవల్ల అంగదుడు బాధపడి అంతలోనే తేరుకుని–

**క. ఆలోన సర్పరోమునిఁ**
**దూలించుచు వానిముక్కుదూలము పగులన్**
**వాలితనూజుడు దన్ని నఁ**
**జాలంగా నొగిలి తెలిసి సాహస మొప్పన్. 39**

**ప్రతి :** ఆలోన=అంతలో, సర్పరోమునిన్, తూలించుచు=పడగొట్టుచు, వానిముక్కు దూలము=ముక్కునకుగల అడ్డ ఎముక, పగులన్=పగులునట్లు, వాలితనూజుఁడు= అంగదుడు, తన్నిన=తన్నగా, చాలంగా= తట్టుకొనుటకు, నొగిలి=బాధపడి, తెలిసి= తేరుకొని, సాహసమొప్పన్=సాహసము ప్రదర్శిస్తూ.

**తా :** అంతలో అంగదుడు సర్పరోముని తూలిపడేలా చేసి వాని ముక్కు దూలం పగిలేలా ఒక తన్నుతన్నాడు. సర్పరోముడు అతి కష్టంమీద తెలివి తెచ్చుకుని సాహసంతో–

**ఉ. వాలితనూజునెన్ను దురు వ్రక్కలువాఱఁగ సర్పరోము దా**
**భీలత నార్చి చేకొలఁదిఁ బేర్కొని కొట్టిన రక్తధారలన్**
**దేలుచు నంగదుం డతని ఢీకొని పూని శిరంబు చెక్కలై**
**వ్రీలి పడంగ గొట్టఁ బృథివీస్థలిఁ గూలెను సర్పరోముఁడున్. 40**

**ప్రతి :** వాలితనూజున్=అంగదుని, నెన్నుదురు=నుదుటిభాగము, వ్రక్కలు వాఱఁగ=ముక్కలయ్యేలా, సర్పరోముఁడు, ఆభీలతన్=భయంకరముగ, ఆర్చి=అరచి, పేర్కొని=దృఢంగా, చేకొలఁదిన్=చేతికున్న బలంకొద్దీ, కొట్టినన్=కొట్టగా, రక్తధారలన్=రక్తపుధారలలో, తేలుచున్, అంగదుండు, అతని= సర్పరోముని, ఢీకొని=ఎదుర్కొని, పూని=పట్టుదలతో,శిరంబు=తల, చెక్కలై వ్రీలిపడంగన్=ముక్కలై నశించి పడిపోవునట్లుగా, కొట్టన్=కొట్టగా, పృథివీస్థలిన్=భూమిమీద, సర్పరోముఁడున్=సర్పరోముడు, కూలెను=కూలిపోయెను.

**తా :** సర్పరోముడు అంగదుని నుదురు ముక్కలయ్యేలా భయంకరంగా అరుస్తూ తన చేతికున్న బలంతో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు రక్తధారల్లో తేలిపోతూనే అంగదుడు సర్పరోముణ్ణి ఢీకొని పట్టుదలతో సర్పరోముని తలముక్కలై నశించేలా కొట్టాడు. ఆ దెబ్బకు సర్పరోముడు నేలకూలాడు. అంటే మరణించాడు.

**క. ఆలోన సర్పరోముఁడు**
**గూలుట కనుఁగొనుచు మిగుల గోపంబునఁదా**
**నాలో వృశ్చికరోముఁడు**
**నీలునిపై రథముఁ దోలె నిర్భయవృత్తిన్. 41**

**ప్రతి :** ఆలోన=అంతలో, సర్పరోముఁడు, కూలుట=చనిపోవుట, కనుఁగొనుచు=చూస్తూ, మిగులన్=మిక్కిలి, కోపంబునన్=కోపంతో, తాన్=తను, ఆలో=అంతలో, వృశ్చికరోముఁడు, నీలునిపై, రథమున్, తోలె, నిర్భయవృత్తిన్=ఎట్టి భయములేకుండా.

**తా :** సర్పరోముడు చనిపోవడం చూసిన వృశ్చికరోముడు పట్టరానికోపంతో ఎట్టి భయములేకుండా నీలుని మీదకు రథాన్ని నడిపించాడు.

**ఉ. బోరన నీలుఁ డంత నొకభూజముఁ గైకొని వాని తేరిపై**
**శూరత నేసి యాక్షణము చూర్ణముగా నొనరింప నేలకున్**

**ధీరతదాఁటి భూరుహముఁ ద్రెంచఁగనుంగొని నీలుఁడొక్క మం**
**దార మహీజమున్ వయిచె ధారుణి వృశ్చికరోముఁ డీల్గఁగన్. 42**

**ప్రతి :** బోరున=వెంటనే, నీలుడు, అంతన్, ఒక భూజమున్=ఒక చెట్టును, కైకొని=పట్టుకొని, వాని తేరిపై= వృశ్చికరోముని రథంమీద, శూరతన్=సాహసంతో, ఏసి=వేసి, ఆ క్షణము=ఆ క్షణంలోనే, చూర్ణముగాన్= పిండిపిండిగా, ఒనరింప=చేయగా, నేలకున్=భూమి మీదకు, ధీరతదాఁటి=ధైర్యంతో దూకి, భూరుహమున్= చెట్టును, త్రెంచన్=విరవగా, కనుగొని=చూచి, నీలుఁడు, ఒక్క మందార మహీజమున్=మందార చెట్టును, వయిచె=వేసెను, ధారుణి=భూమిమీద, వృశ్చిక రోముఁడు, ఈల్గఁగన్=చనిపోవునట్లుగా.

**తా :** వెంటనే నీలుడు ఒక చెట్టు తీసి వృశ్చిక రోముని రథం మీద విసిరి ఆక్షణంలోనే ఆ రథం పిండి పిండి చేసాడు. ఈలోగా వృశ్చిక రోముడు రథం మీద నుండి దుమికి చెట్టును విరవడం చూసిన నీలుడు మందార వృక్షంతో వృశ్చిక రోముని చచ్చేలా కొట్టి నేల మీద పడేసాడు.

**సీ. వృశ్చికరోముఁ డావేళఁ ద్రుంగుటఁ జేసి**
**వడి రోషమున నగ్ని వర్ణుఁ డదరి**
**త్రేతాగ్ను లొక్కఁడై తెరలి మండినలీలఁ**
**దనమేని మంటలు దరికొనంగ**
**రావణునెదురఁ బరాక్రమస్థితిఁ బేర్చి**
**రామచంద్రుని మీఁద రథముఁ దోలి**
**ప్రల్లదంబునఁ బెక్కుభాషలు నుడువుచు**
**సాయక నిచయంబు లేయునెడను**

**తే. వాని శౌర్యంబుఁ దెంపును వానిబలముఁ**
**జూచి భూపాలుఁడప్పుడు చోద్యపడుచు**
**ధనువు నందును వారుణాస్త్రంబు దొడిగి**
**యగ్ని వర్ణునితలఁ ద్రుంచె నాక్షణంబ. 43**

**ప్రతి :** వృశ్చికరోముఁడు, ఆవేళన్, త్రుంగుటన్జేసి=చనిపోవుట వలన, వడి=వేగముగా, రోషమున= కోపముతో, అగ్నివర్ణుఁడు, అదరి=విజృంభించి, త్రేతాగ్నులు=మూఁడు అగ్నులు (గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయముతో మూడు) ఒక్కఁడై=ఏకమై, తెరలి=అతిశయించి, మండినలీలన్=మండిన విధంగా, తనమేని=తన శరీరములో, మంటలు, దరికొనంగ=మండగ, రావణునెదురన్=రావణుని ఎదుట, పరాక్రమస్థితిన్=తనకు గల ప్రరాక్రమమును, పేర్చి=అతిశయింపచేసి, రామచంద్రుని మీఁద, రథముఁదోలి= రథాన్ని నడిపి, ప్రల్లదంబునన్=వాచాలత్వముతో (అధికముగా మాట్లాడుట), పెక్కు భాషలు=పెక్కు మాటలు, నుడువుచు=చెప్పుచు, సాయకనిచయంబులు=బాణసమూహాలను, ఏయున్=వేయు, ఎడను=సమయమున,

వాని శౌర్యంబున్=శూరత్వము, తెంపును=ధైర్యబు, వాని, బలమున్, చూచి, భూపాలుఁడు=శ్రీరాముడు, అప్పుడు, చోద్యపడుచు=ఆశ్చర్యపడుచు, ధనువునందును=వింటియందు, వారుణాస్త్రంబున్ తొడిగి=సంధించి, అగ్నివర్ణుని, తలన్, ఆ క్షణంబ=ఆ క్షణంలోనే, త్రుంచెన్=ఖండించెను.

**తా :** వృశ్చికరోముడు అలా చనిపోవడం చూసిన అగ్నివర్ణుడు అనే రాక్షసవీరుడు కోపంతో త్రేతాగ్నులు ఒకటై మండుతున్నట్లు తన శరీరంలో మంటలు మండగా, తన ప్రభువైన రావణుని ఎదుట మహాశౌర్యం అతిశయించగా-రామచంద్రుని మీదకి రథాన్ని తోలాడు. అతిగా వాగే స్వభావంకల ఆ అగ్నివర్ణుడు చాలా మాటలు అంటూ బాణ సమూహాన్ని ప్రయోగించసాగాడు. అగ్ని వర్ణుని శౌర్యాన్ని, ధైర్యాన్ని, బలాన్ని చూచి రాముడు ఆశ్చర్యపడుతూ తన వింటికి వారుణాస్త్రం తొడిగి ఆ అగ్నివర్ణుని తల ఆ క్షణంలోనే నరికేశాడు.

**తే.** **అగ్నివర్ణుండు తెగిపోవు టసురవరుఁడు**
**కన్ను లారంగఁ గనుఁగొని కలుషవృత్తి**
**రామచంద్రుని డాయంగ రథముఁ బరపి**
**పలికె నుత్కటగర్వ ప్రభావుఁ దగుచు.** **44**

**ప్రతి :** అగ్ని వర్ణుండు, తెగిపోవుట=చనిపోవుట, అసురవరుఁడు=రాక్షస శ్రేష్ఠుడైన రావణుడు, కన్నులారంగన్=కనులారా, కనుగొని, కలుషవృత్తి=మలినమైన చిత్తంతో, రామచంద్రుని, డాయంగ=సమీపించుటకు, రథమున్, పఱపి=నడిపి, ఉత్కటగర్వ ప్రభావుఁడగుచు=పట్టరాని గర్వప్రభావము కలవాడై, పలికె=పలికెను.

**తా :** అగ్నివర్ణుడు చనిపోవడం రావణుడు కనులారాచూసాడు. మనస్సు కలుషమై రామచంద్రుని సమీపించడానికి రథాన్నినడిపి పట్టరానిగర్వంతో ఇలా అన్నాడు.

**క.** **జాఱకుమా బీరము చెడి**
**పాఱకుమా రిపులు నవ్వ భయపడి వనమున్**
**దూఱకుమా పేర్కొంచును**
**జీరకుమా కపులఁ దోడు చేకొని పోరన్.** **45**

**ప్రతి :** బీరము చెడి=ధైర్యం కోల్పోయి, జాఱకుమా=పారిపోకుమా, రిపులు=శత్రువులు, నవ్వ=నవ్వేలా, భయపడి, వనమున్=అరణ్యంలోకి, పాఱకుమా=పఱుగుపెట్టకుమా, పేర్కొంచును=పేర్లుపెట్టి, దూఱకుమా=నిందించకుమా, కపులన్, తోడుచేకొని పోరన్, జీరకుమా=పిలువకుమా.

**తా :** రావణుడు రామునితో రామా! ధైరం చెడి యుద్ధరంగం నుండి ఎటో జారుకోకుమా, శత్రువులు నవ్వేలా భయంతో అరణ్యంలోకి పారిపోకుమా. పేరుపేరునా, నిందించకుమా, వానరుల్ని తోడు తీసుకుని యుద్ధం చేయాలనుకుని పిలవకు మా.

**విశే :** రావణుడు రామునితో మాట్లాడిన మొదటి మాటలివి. చాలా తేలికగా రాముణ్ణి తీసిపారేస్తూ మాట్లాడుతున్నాడు. రాముని పరాక్రం తెలియని సామాన్యునిలా –

జాఱకుమా! పాఱకుమా! దూఱకుమా! జీరకుమా : అనే పదాలు ప్రతి పాదం మొదటిలో ప్రయోగించి తెలుగు పదాలకొకక ఊగుతూగు తెచ్చింది కవయిత్రి ఈ పద్యంలో సాధురేఫకి, శకటరేఫకీ ప్రాస వేసింది. అదికాక త్ర్యక్షర ప్రాస కూడా సాధించింది. పోతన్నగారి భాగవత పద్యాలలో కూడ ఈ త్ర్యక్షర ప్రాసవిన్యాసం కనిపిస్తుంది. త్ర్యక్షర ప్రాస అంటే ప్రాసస్థానంలో మూడు అక్షరాలు అన్ని పాదాలలో ఒకేలా ఉండడం. 'ఱకుమా' అనేది 4 పాదాల్లోను వచ్చింది. ఇంత మాత్రమేకాక ఈ పద్యం సుమతీశతకంలోని ఒక పద్యాన్ని గుర్తుకు తెస్తోంది.

**ఏఱకుమీ కసుగాయలు**
**దూఱకుమీ బంధుజనుల దోషముసుమ్మీ!**
**పాఱకుమీరణమందున**
**మీఱకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ!**

సుమతీ శతకము ఆనాడు వ్యాప్తిలో ఉండేది అనడానికి ఈ మొల్ల అనుకరణమే సాక్షి.

**మ. అని విల్లెక్కిడి దైత్యనాయకుఁడు రోషాయత్త చిత్తమ్మునన్**
**ఘనమౌర్వీ నినదంబు భీకరముగాఁ గావించి పెల్లార్చి య**
**జ్జననాథాగ్రణిమీఁద నుగ్రశరముల్ సంధించి బిట్టేయఁగా**
**వినువీథిన్ సురసంఘము ల్గొలువఁగా వీక్షించె దేవేంద్రుఁడున్. 46**

**ప్రతి :** అని=అని, విల్లెక్కిడి=విల్లు ఎక్కువపెట్టి, దైత్యనాయకుఁడు=రావణుడు, రోషాయత్త చిత్తమ్మునన్= రోషముతో కూడిన మనస్సుతో, ఘనమౌర్వీనినదంబు=గొప్ప అల్లెత్రాటి ధ్వని, భీకరముగాన్= భయంకరముగా. గావించి=చేసి, పెల్లు=బిగ్గరగా. ఆర్చి=బొబ్బపెట్టి, ఆ జననాథాగ్రణిమీంద=ఆ రాముని మీద, ఉగ్రశరముల్=తీక్షణములైన బాణాలు, సంధించి=తొడిగి, బిట్టు+ఏయఁగా–బిట్టేయఁగా, వేగంగా, ప్రయోగించగా, వినువీథిన్=ఆకాశవీధిలో, సురసంఘముల్=దేవతా సమూహాలు, కొలువఁగా=చుట్టి ఉండగా, దేవేంద్రుఁడున్= దేవేంద్రుడు, వీక్షించె=చూచెను.

**తా :** రావణుడు రాముని ఆవిధంగా అని మహాకోపంతో విల్లు ఎక్కుపెట్టి నారిభయంకరంగా సారించి బిగ్గరగా బొబ్బపెట్టి తీక్షణమైన బాణాలు సంధించి రాముని మీద వేగంగా ప్రయోగించగా దేవతల ప్రభువైన ఇంద్రుడు దేవతా సంఘాలు కొలుస్తూ ఉండగా ఆకాశం నుండి ఈ యుద్ధాన్ని చూసాడు.

**వ. ఇట్లు కనుంగొని. 47**

**తా :** ఈ విధంగా చూచి

## శ్రీరామచంద్రునకింద్రుడు రథమును గానుకగాపంపుట

**క. రథ మెక్కి రావణుండును**
**బృథివీస్థలి నుండి రామపృథ్వీపతియున్**

**ప్రథనము సేయుట తగ దని**
**వ్యథఁ బొందుచు నాత్మలోన వాసవుఁడంతన్.** **48**

**ప్రతి :** రావణుండును, రథమెక్కి=రథము మీద ఉండి, పృథివీ స్థలినిన్=భూమి మీద, ఉండి, రామపృథివీ పతియున్=రామరాజు, ప్రథనము=యుద్ధము, చేయుట=సలుపుట, తగదని=పద్ధతికాదు అని, వ్యథన్=దుఃఖమును, ఆత్మలోన=మనస్సులో పొందుచున్, అంతన్=అప్పుడు, వాసవుఁడు=ఇంద్రుడు.

**తా :** రావణుడు రథమెక్కి, రాముడు కేవలం నేలమీద ఉండి యుద్ధం చేయడం పద్ధతికాదు అని మనస్సులో బాధపడుతూ ఇంద్రుడు అప్పుడు.

**విశే :** రథం మీద ఉన్నవారితో రథం మీద ఉన్నవారు, నేలమీద ఉన్నవారు నేలమీద ఉన్నవారితో పోరాడాలి అని యుద్ధనీతి.

క. **మాతలిచేతను గవచము**
**చాతుర్యము గలుగురథము చాపము శరమున్**
**భూతలనాయకునకుఁ బురు**
**హూతుఁడు పుత్తెంచెఁ గడు మహోన్నత మహిమన్.** **49**

**ప్రతి :** మాతలి చేతను=తన సారథి అయిన మాతలి చేత, కవచము=రొమ్ముకు రక్షణగా తొడుగుకునేది, చాతుర్యము=నేర్పు, కలుగు రథము, చాపము=విల్లు, శరమున్=బాణము, భూతలనాయకునకున్=భూనాయకుడయిన రామునకు, పురుహూతుఁడు=ఇంద్రుడు, పుత్తెంచెన్=పంపెను, కడు=మిక్కిలి, మహోన్నత మహిమన్=గొప్ప ఉన్నతమైన మహిమతో.

**తా :** ఇంద్రుడు మహోన్నతమహిమతో తన సారథి మాతలి చేత కవచము, చాతుర్యంగల రథము విల్లు బాణము శ్రీరామునకు పెక్కింటిని పంపాడు.

**విశే :** పురుహుతుఁడు=చాలా మంది చేత పిలువబడినవాడు.

వ. **ఇట్లు పుత్తెంచిన.** **50**

**తా :** అలా పంపగా

చ. **ధరణికి వచ్చి మాతలి ముదంబున రామునిఁ జూచి మీకుఁగా**
**సురపతి పంపినాఁ డధిక శోభనకృత్యములై వెలుంగు నీ**
**శరములు విల్లు వజ్రకవచంబును దేరును వీనిచేత సం**
**గరమున దైత్యునిం దునిమి కైకొను రాఘవ! శ్రీజయంబులన్.** **51**

**ప్రతి :** మాతలి, ధరణికివచ్చి=భూమి మీదకు వచ్చి, ముదంబున=ఆనందంతో, రామునిన్=రాముణ్ణి, చూచి, మీకుగా=మీ కోసమని, సురపతి=ఇంద్రుడు, అధిక=మిక్కిలి, శోభనకృత్యములై=శుభకరమైన పనులచే,

వెలుంగున్=ప్రకాశించునట్టి, ఈ శరములు=ఈ బాణాలు, విల్లు, వజ్రకవచంబును=వజ్రములతో చేసిన కవచము, తేరును=రథమును, పంపినాఁడు=పంపించినాడు. వీనిచేత=వీనిని ఉపయోగించి, సంగరమున=యుద్ధములో, దైత్యునిన్=రాక్షసుణ్ణి, తునిమి=సంహరించి, రాఘవ!=ఓరామ! శ్రీజయంబులన్=సీతను, విజయమును, జయసంపదలను, కైకొను=సంపాదించుకొమ్ము.

**తా :** మాతలి భూమి మీదకు వచ్చి ఆనందంతో రాముణ్ణి చూచి మా ప్రభువు ఇంద్రుడు మీకోసమని శుభకరమయిన క్రియలతో ప్రకాశిస్తున్న ఈ శరాలు, విల్లు, వజ్రకవచము, రథము పంపాడు. వీటితో యుద్ధంలో రావణుని సంహరించి విజయశ్రీని పొందుము.

**విశే :** శ్రీ విజయంబులను=శ్రీ అంటే లక్ష్మీదేవి. సీత లక్ష్మీదేవి అవతారమే. కాబట్టి శ్రీ విజయంబులు- అన్నప్పుడు సీతను, విజయాన్ని రెంటినీ పొందుము అనే అర్థం కూడా చెప్పుకోవచ్చు. శ్రీరామునికి ఈ రెండూ తప్పక పొందవలసినవే.

**వ. అని చెప్పిన మాతలి ప్రియవచనంబులకు సంతసించి విభీషణాను మతంబున రామభూపాలుండు వజ్రకవచంబు దొడిగి శరశరాసనంబులు గైకొని యింద్రస్యందనంబునకు వలగొని వందనం బాచరించి బాలాదిత్యుండు పూర్వ పర్వతం బెక్కుచందంబున రథం బెక్కునంత జయజయధ్వనులతో సుగ్రీవాంగద హనుమదాదులైన వానరవీరులు మ్రొక్కి రప్పు డంతరిక్షంబున దేవసంఘంబులు సంగ్రామ రంగంబుఁ జూడ వేడ్కపడి వచ్చి విమానంబులతో, గ్రిక్కిఱిసి చూచుచుండి రా సమయంబున. 52**

**ప్రతి :** అని చెప్పిన, మాతలి, ప్రియవచనంబులకు=ప్రియకరమైన మాటలకు, సంతసించి, విభీషణాను మతంబున-విభీషణ+అనుమతంబున=విభీషణుని అంగీకారముతో, రామభూపాలుండు, వజ్రకవచంబు, తొడిగి=ధరించి, శరశరాసనంబులున్=విల్లుబాణాలు, కైకొని=తీసుకుని, ఇంద్రస్యందనంబునకు= ఇంద్రుని రథానికి, వలగొని=ప్రదక్షిణముచేసి,వందనంబు=నమస్కారము, ఆచరించి=చేసి, బాలాదిత్యుండు= బాలసూర్యుండు ఉదయిస్తున్న సూర్యుడు, పూర్వ పర్వతంబు=తూర్పుకొండ, ఎక్కుచందంబునన్=ఎక్కేవిధంగా, రథంబెక్కునంత=రథంఎక్కగానే, జయజయధ్వనులతో, హనుమదాదులైన, వానర వీరులు, మ్రొక్కిరి, అప్పుడు, అంతరిక్షంబున=ఆకాశంలో, దేవసంఘంబులు=దేవతాసమూహాలు, సంగ్రామరంగంబున్= యుద్ధరంగాన్ని, చూడవేడ్కపడి=చూడడానికి కుతూహలపడి, వచ్చి, విమానంబులతోన్, క్రిక్కిఱిసి=ఒకదాని పక్కన ఒకటి స్థలం లేక ఇరుక్కుని, చూచుచుండిరి, ఆ సమయంబున.

**తా :** మాతలి చెప్పిన ప్రియవచనాలకు సంతసించి విభీషణుని అంగీకారంతో శ్రీరాముడు వజ్రకవచం తొడుక్కుని విల్లు బాణాలు తీసుకుని, ఇంద్రుని రథానికి ప్రదక్షిణం చేసి నమస్కరించి, ఉదయభానుడు తూర్పుకొండ ఎక్కిన విధంగా రథం ఎక్కాడు. సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు మొదలయిన వానరవీరులు జయజయధ్వానాలతో నమస్కరించారు. ఆ సయమంలో ఆకాశవీథిలో దేవతాసమూహాలు యుద్ధరంగం చూడడానికి విమానాలతో వచ్చారు. ఆ విమానాలు క్రిక్కటిసిపోయాయి. అంటే ఆకాశంలో చోటు సరిపోనంతగా విమానాలు వచ్చాయన్నమాట. ఆ సమయంలో-

క. గిరిగిరి నభము నభంబును
ధర ధరయును జలధి జలధి దార్కొనురీతిన్
సురరిపుఁడు నసురరిపుఁడును
దురమున నెదురించి రధిక దోర్బలయుక్తిన్. 53

**ప్రతి :** గిరిగిరి=పర్వతంతోపర్వతం, నభము=ఆకాశము, నభంబును=ఆకాశముతో, ధర=భూమి, ధరయును=భూమితోను, జలధి=సముద్రము, జలధిన్=సముద్రమును, తార్కొను రీతిన్=ఎదుర్కొని పోరాడిన విధంగా, సురరిపుడున్=దేవతలశత్రువైన రావణుడు, అసురరిపుఁడును=రాక్షసుల శత్రువయిన శ్రీరాముడు, దురమునన్=యుద్ధములో, ఎదురించిరి= ఎదుర్కొనిరి, అధిక=మిక్కిలి, దోర్బలయుక్తిన్=భుజబలముతో కూడినవారై –

**తా :** పర్వతంతో పర్వతం, ఆకాశంతో ఆకాశం, భూమితో భూమి, సముద్రంతో సముద్రం ఎదుర్కొని పోరాడినట్లుగా ఆ యుద్ధంలో రావణుడు రాముడు అధిక దోర్బలంతో ఒకరిని ఒకరు ఎదిరించారు.

**విశే :** ఈ పద్యంలో రాముడు రావణుడు–వీర ప్రతివీరులు. వీరు యుద్ధం చేస్తూ ఉంటే – ఆ దృశ్యం ఎలా ఉందో చెప్పడానికి కొండా కొండా, ఆకాశం ఆకాశం, భూమి భూమి, సముద్రం సముద్రం ఢీకొని పోరాడినట్లుగా ఉంది అని మొల్ల ప్రకృతిలోని ఘన వస్తుసముదాయాన్ని ఉపమానంగా చెప్పింది. చిన్న కంద పద్యంలో ఎవరికి ఎవరూ తక్కువకాని వీరుల పెద్ద యుద్ధాన్ని వర్ణించింది. శబ్దాటోపం లేకుండా, అర్థగౌరవం గల చిన్నచిన్న పదాలతో భీకరమయిన రామరావణ యుద్ధస్వరూపాన్ని ఆవిష్కరించింది. దీనికి మూలం వాల్మీకి రామాయణంలో ఉన్నది.

వ. ఇట్లు మార్కొనుచు. 54

**తా :** ఈవిధంగా పోరాడుచు.

శా. వీరాలాపము లాడుచుం గదిసి దోర్వీర్యంబుతోడన్ ధను
ర్జ్యారావంబులు మిన్నుముట్ట నతితీవ్రం బైన శబ్దంబులన్
వారాసుల్ కలఁగంగ నార్చి నిజగర్వస్ఫూర్తి నుప్పొంగుచున్
గ్రూరాస్త్రంబులనేసి రొండొరులపైఁ గోదండపాండిత్యులై. 55

**ప్రతి :** వీరాలాపములు=వీరత్వంతో కూడిన మాటలు, ఆడుచున్=మాట్లాడుతూ, కదిసి=ఢీకొని, దోర్వీర్యంబుతోడన్=భుజబలముతోను, ధనుర్జ్యారావంబులు=వింటినారి యొక్కనాదాలు, మిన్నుముట్టన్=ఆకాశాన్ని అంటునట్లు, అతితీవ్రంబైన=మిక్కిలి పెద్దవైన, శబ్దంబులన్=ధ్వనులతో, వారాసుల్=సముద్రాలు, కలఁగంగన్=కంగారు పడగా, ఆర్చి=బొబ్బపెట్టి, నిజగర్వస్ఫూర్తిన్=తమతమ గర్వ స్ఫూర్తితో, ఉప్పొంగుచున్=ఉత్సాహపడుచు, ఒండొరులపైన్=ఒకరిపై ఒకరు, కోదండ పాండిత్యులై=విలువిద్యాపండితులై, క్రూరాస్త్రంబులన్=భయంకరమైన బాణాలను, ఏసిరి=ప్రయోగించిరి.

**తా :** రామరావణులు ఇరువురూ వీరాలాపాడుతూ భుజబలంతో ఢీకొన్నారు. వింటినారి నుండి వచ్చే శబ్దాలు ఆకాశాన్ని అంటుతున్నాయి. సముద్రాలు భయపడేలా అరిచి, తమ తమ గర్వాన్ని చూచుకుని ఉప్పొంగుతూ ఒకరిపై ఒకరు తమ విలువిద్యా ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తూ తీక్షణమైన బాణాలు వేసారు.

**క. దనుజేశుఁ డేయు శరమును**
**మనుజేశుఁడు తప్పఁ ద్రుంచు మార్కొని కడిమిన్**
**మనుజేశుఁ డేయు శరముల**
**దనుజేశుఁడుఁ దప్పఁ ద్రుంచుఁ దత భుజశక్తిన్. 56**

**ప్రతి :** దనుజేశుఁడు=రాక్షసరాజు, ఏయు శరమును=వేసిన బాణాన్ని, మనుజేశుఁడు=శ్రీరాముడు, తప్పన్=తప్పిపోవు విధంగా, త్రుంచు=ముక్కలు చేయును, మార్కొని=ఎదిరించి, కడిమిన్=శౌర్యముతో, మనుజేశుఁడు=శ్రీరాముడు, ఏయు శరముల=ప్రయోగించిన బాణాలను, దనుజేశుఁడు=రావణుడు, తప్పన్, త్రుంచున్, తతభుజశక్తిన్=అధికమైన భుజశక్తితో.

**తా :** దనుజేశుడు వేసిన బాణాన్ని మనుజేశుడు అధిక శౌర్యముతో పడగొడుతున్నాడు. మనుజేశుడు వేసిన బాణాన్ని దనుజేశుడు గొప్ప భుజశక్తితో పడగొడుతున్నాడు.

**విశే :** రామ రావణులు ఇరువురు ఒకేవిధంగా శౌర్య పరాక్రమాలతో యుద్ధం చేస్తున్నారు అని చెప్పడానికి రచనలో పదప్రయోగం కూడా ఒకే రీతిలో చేసింది మొల్ల. దనుజేశుఁడు-మనుజేశుఁడు-మనుజేశుఁడు దనుజేశుఁడు తప్పఁ ద్రుంచు-తప్పఁద్రుంచు.

**క. కంటున వేసిశరములు**
**వింటన్ దప్పించుకొనుచు వెస బాణములన్**
**గెంటింపుచు దమగాత్రము**
**లంటక యుండంగ నేటులాడిరి కడిమిన్. 57**

**ప్రతి :** కంటున=ద్వేషంతో, వేసిన శరములు, వింటన్=వింటితో, తప్పించుకొనుచు, వెస=వేగముగా, బాణములన్, గెంటింపుచు=తొలగిస్తూ, తమ గాత్రములంటక=తమ శరీరములకు తగులకుండ, ఉండంగన్= ఉండే విధంగా, ఏటులాడిరి=బాణాలతో, పోరాడిరి, కడిమిన్=శౌర్యముతో.

**తా :** ద్వేషంతో ఒకరు వేసిన శరాలను మరొకరు వింటితో తప్పించుకుంటూ, వేగంగా బాణాలు తొలగించుకుంటూ తమ శరీరాలకు తగలకుండా ఉండేలా శౌర్యంతో బాణాలతో యుద్ధం చేసారు.

**క. మొదల నొకబాణ మావలఁ**
**బదులును బదిపదులు వేయిఁ బదివేలును నేఁ**
**బదివేలు లక్ష కోటియుఁ**
**జెదరక విలుకాండ్రమీఁద శీఘ్రమ పర్వెన్. 58**

**ప్రతి :** మొదలన్=మొదటగా, ఒక బాణము, ఆవలన్=ఆ తరువాత, పదులును, పదిపదులు=నూరు, వేయిన్= వేయి, పదివేలును=పదివేలును, ఏబదివేలును, లక్ష, కోటియున్, చెదరక=చెదిరిపోక, విలుకాండ్ర మీఁదన్=వింటితో యుద్ధము చేసే వారిమీద, శీఘ్రమ=వేగంగా, పర్వెన్=వ్యాపించినవి.

**తా :** విలుకాండ్రయి యుద్ధం చేస్తున్న వారిమీఁద మొదటి ఒకటి ఆ మీద పది, ఆ మీద వంద, ఆ మీదవేయి, పదివేలు, ఏబదివేలు, లక్ష, కోటి చెదరిపోకుండా వేగంగా వ్యాపించాయి.

**విశే :** ఈ పద్యంలో మొల్ల బాణాలు ఎంత వేగంగా సంఖ్యామానం చొప్పున వృద్ధి పొందుతూ ఆ వీరుల మీద వ్యాపించాయో చెప్పింది.

**క. తొడిగినబాణము వింటను**
**దొడిగినయట్లుండు మిగుల దోడ్తోనవలన్**
**వెడలెడు శరములు లెక్కకుఁ**
**గడగుఱు తనరాక చిత్రగతులన్ బర్వెన్. 59**

**ప్రతి :** తొడిగినబాణము, వింటను=విల్లునందు, తొడిగిన యట్లుండు=తొడిగినట్లే ఉంటుంది, మిగుల= అధికముగ, తోడ్తోన్=వెనువెంటే, అవలన్=ఆ తరువాత, వెడలెడు శరములు=వింటినుండివచ్చే బాణాలు, లెక్కకున్, కడగుఱుతన రాక=చివరిగుర్తు ఇదే అనడానికి వీలులేక, చిత్రగతులన్=విచిత్రమయిన మార్గంలో, పర్వెన్=వ్యాపించాయి.

**తా :** వింటికి తొడిగిన బాణము తొడిగినట్లే ఉంటుంది. ఆ వింటిలో నుండి వేగంగా బయట పడే బాణాలు ఇది చివరి బాణం అనుకోవడానికి లేకుండా చిత్రంగా వ్యాపించాయి.

**వ. అట్టి సమయంబున. 60**

**తా :** అటువంటి సమయంలో

**చ. అభవ మురాంతకాదులు మహాత్ములు వింటికి వారికన్ననున్**
**త్రిభువనమందు వీరె గణుతింపఁగ నెక్కు డటంచు మెచ్చుచున్**
**నభమున నుండి ప్రస్తుతి ఘనంబుగఁ జేతురు దేవకోటు ల**
**ట్లుభయఫలంబునం బొగడుచుందురు రాముని రావణాసురున్. 61**

**ప్రతి :** అభవమురాంతకాదులు=శివుడు విష్ణువు మొదలైనవారు, వింటికి=కోదండ విద్యలో, మహాత్ములు= గొప్పవారు, వారికన్ననున్=వారికంటె, త్రిభువనమందు=మూడులోకాలలో, వీరె=ఈ రామ రావణులే, గణుతింపఁగన్=పరిగణించగ, ఎక్కుడు=అధికము, అటంచు=అంటూ, మెచ్చుచున్=మెచ్చుకొంటు, నభమునన్=ఆకాశమున, ఉండి, ఘనంబుగన్=గొప్పగా, ప్రస్తుతి చేతురు=కొనియాడుదురు, దేవకోటులు= దేవతాసమూహాలు, అట్లు=ఈ విధముగా, ఉభయఫలంబునన్=ఇద్దరి ఫలితాలను, పొగడుచుందురు, రాముని రావణాసురున్.

**తా :** విలువిద్యలో శివుడు విష్ణువు గొప్పవారు అంటారు. వారికంటె కూడా మూడు లోకాల్లోనూ ఈ రామరావణులనే అధికులుగా లెక్కించవలసి ఉంది అని మెచ్చుకుంటూ దేవతాసమూహాలు ఇద్దరి ప్రతిభలను కొనియాడుతూ పొగడుతూ ఉన్నారు.

**చ. ధనువులమ్రోత మేఘనినదంబులుగా శరదీప్తి జాలముల్**
**ఘనవరచంచలావళులుగా మణిమౌక్తికదీప్తి ధాత్రిమీఁ**
**దను వడగండ్లుగా క్షతజధారలు సంతతవర్ష ధారగా**
**ననయముఁ జెప్ప నొప్పె విపులాహవ మప్పుడు వానకాలమై. 62**

**ప్రతి :** ధనువులమ్రోత=ధనుస్సులు చేసే శబ్దం, మేఘనినదంబులుగా=మేఘ గర్జనలుగా, శరదీప్తిజాలముల్=బాణాల ప్రకాశ సముదాయము, ఘనవరచంచలా వళులుగా=గొప్పవైన శ్రేష్ఠమయిన మెఱుపుల వరుసగా, మణి మౌక్తిక దీప్తి=మణుల యొక్క ముత్యాల యొక్క కాంతులు, వడగండ్లుగా, క్షతజధారలు=దెబ్బతగలడం వల్లకారిపోయేరక్తధారలు, సంతతవర్షధారగాన్=నిరంతరంకురుస్తున్న వర్షధార కాగా, అనయమున్=ఎల్లప్పుడు, విపులాహవము=పెద్దయుద్ధము, అప్పుడు=అప్పుడు, వానకాలమై=వానకాలముగా, చెప్పన్=చెప్పుటకు, ఒప్పె=తగియున్నది.

**తా :** ధనువుల మ్రోత మేఘగర్జనగా, బాణాల ప్రకాశం మెఱుపుతీగల్లా, రాలి పడుతున్న మణులు ముత్యాలు వడగళ్లుగా, బాణాల దెబ్బల వల్ల ఆవీరుల శరీరం నుండికారే రక్తధారలే నిరంతరం కురుస్తున్న వర్షధారలుగా, ఆ భయంకరమైన యుద్ధము వానాకాలము అని చెప్పేలా ఉంది.

**విశే :** ఈ పద్యంలో రూపకాలంకారం చెప్పబడింది. ఆ యుద్ధం-వానాకాలంలా ఉంది. యుద్ధం వానాకాలంలా ఎలా ఉందో, వానాకాలంలో ఉండే విషయాలన్నీ ఆ యుద్ధరంగంలో ఉన్నాయి అని కవయిత్రి నిరూపించింది. వానాకాలంలో ఉండే లక్షణాలన్నీ యుద్ధంలో చూపాలి. అలా చూపించినప్పుడు దాన్ని సావయవరూపకం అంటారు. వానాకాలానికి మేఘగర్జనలు, మెఱుపులు, వడగళ్లు, వర్షధార, తప్పకుండా ఉండాలి. ఇవన్నీ యుద్ధంలో కూడా ఉంటే యుద్ధం వానాకాలమై కనిపిస్తుంది.

యుద్ధంలో ధనుస్సులు పెద్దపెద్ద శబ్దాలు చేస్తూ ఉంటాయి. ఆ శబ్దాలే మేఘాలు చేసే శబ్దాలు అంటే ఉఱుములు. వీరులు పరస్పరం బాణాలు వదులుతూ ఉంటారు. అలా వదిలిన బాణాలు వేగంగా ప్రయాణిస్తూ ఉంటే మెరుపుల్లా ప్రకాశిస్తున్నాయి. యుద్ధవీరులు అలంకరించుకున్న ఆభరణాల నుండి రాలిపడే మణులు ముత్యాలే వడగళ్లు. బాణాలు గుచ్చుకోవడం వల్ల వీరుల శరీరం నుండి కారే రక్తధారలే సంతత వర్షధారలుగా ఆ గొప్పయుద్ధం వానాకాలమే అంటున్నది మొల్ల. యుద్ధాన్ని వానాకాలంగా భావన చేసి వర్ణించే విధానం-తిక్కన భారతంలోను, పోతన భాగవతంలోను కూడా కనిపిస్తుంది.

**తే. పంక్తికంఠుడు మిగులఁ గోపంబు గదురఁ**
**దేవగంధర్వశరము సంధించి తివిచి**

**రామ భూపాలుమీఁద విక్రమము మెఱసి**
**వేసి వడి నార్చె దిగ్దంతివిసర మడల. 63**

**ప్రతి :** పంక్తికంఠుడు=రావణుడు, మిగులన్=అధికముగ, కోపంబు, కదుర= హెచ్చుకాగా, దేవగంధర్వశరము=దేవతాసంబంధమైన, గంధర్వ సంబంధమైన అస్త్రమును, సంధించి=తొడిగి, తివిచి=లాగి, రామభూపాలుమీఁద, విక్రమము=పరాక్రమము, మెఱసి=అతిశయింపగా, వేసి, వడిన్=వేగముగ, దిగ్దంతివిసరము=దిక్కులను మోసే ఏనుగుల సమూహము, అడల=భయపడునట్లుగ, ఆర్చె=అరచెను.

**తా :** రావణుడు కోపంతో మండిపడుతూ దేవతాస్త్రాన్ని సంధించి లాగి తన విక్రమము ప్రదర్శించే విధంగా అష్టదిక్కులను మోసే ఏనుగుల సమూహం భయపడేలా అరచి ప్రయోగించాడు.

**క. దానికిఁ బ్రతిశర మప్పుడు**
**మానవనాథుండుఁ దొడగి మానుష మడరన్**
**బూనిక నేసిన దానిం**
**బోనీయక త్రుంచి వైచె భువనము లలరన్. 64**

**ప్రతి :** దానికి=ఆ అస్త్రానికి, ప్రతిశరము=బదులుగా వేసే బాణము, అప్పుడు, మానవ నాథుండున్=శ్రీరామ చంద్రుడు కూడా, తొడిగి=సంధించి, మానుష మడరన్=పౌరషము అతిశయించగా, పూనికన్=ప్రయత్నంతో, ఏసిన=వేయగా, దానిన్=ఆ బాణమును, పోనీయక=వెళ్లనీయక, త్రుంచి= విరిచి, వైచె=వేసెను, భువనములు= లోకములు, అలరన్=ఆనందిచగా.

**తా :** రావణుడు వేసిన బాణానికి ప్రతిగా రాముడు పౌరుషంతో బాణం సంధించి ప్రయోగించాడు. రావణుడు ప్రయోగించిన బాణాన్ని పోనీయక లోకాలు ఆనందించేలా త్రుంచివేసాడు.

**క. త్రుంచినఁ గనుఁగొని దనుజుఁడు**
**మించినకోపమున రాముమీఁదను వడి సం**
**ధించి స్ఫురద్విషబాణము**
**వంచింపక యేయ దానివలనన్ జాలన్. 65**

**ప్రతి :** త్రుంచినన్=విరిచివేయగా, కనుఁగొని=చూచి, దనుజుఁడు=రావణుడు, మించిన కోపమున= ఎక్కువైన కోపముతో, రాముమీఁదను=శ్రీరాముని మీద, వడి=వేగముగా, స్ఫురత్=ప్రకాశించుచున్న, విషబాణము=విషముతో కూడిన బాణమును, సంధించి=తొడిగి, వంచింపక=మోసగించక, ఏయ=వేయగా, దానివలనన్=ఆ బాణమువలన, చాలన్=మిక్కిలి.

**తా :** తాను ప్రయోగించిన బాణాన్ని రాముడు మధ్యలోనే త్రుంచి వేయగా మిక్కిలి కోపించిన రావణుడు వేగంగా ప్రకాశిస్తున్న విషబాణము–విషబాణమే అని తెలిసే విధంగా ప్రయోగించాడు. దానివలన మిక్కిలి...

ఆ. **నాగశరము లొదవి నానాముఖంబుల**
**వచ్చునపుడు మనుజవల్లభుండు**
**గరుడబాణ మేసి ఖండించె నన్నింటి**
**మింట సురలు సూచి మెచ్చి పొగడ.** **66**

**ప్రతి :** నాగశరములు=నాగాస్త్రాలు, ఒదవి=పుట్టి, నానాముఖంబుల=అనేక విధములుగా, వచ్చునపుడు=వస్తున్నప్పుడు, మనుజవల్లభుండు=మానవ ప్రభువయిన రాముడు, గరుడబాణము, ఏసి=ప్రయోగించి, అన్నింటిని=పాములనన్నింటిని, ఖండించె=ముక్కలు చేసెను, మింట=ఆకాశంలోని, సురలు=దేవతలు, చూచి, మెచ్చి=మెచ్చుకొని, పొగడ=నుతింపగా.

**తా :** రావణుడు ప్రయోగించిన బాణం నుండి నాగాస్త్రాలు అనేక విధాలుగా పుట్టుకు రావడం చూచిన శ్రీరాముడు గరుడబాణాన్ని ప్రయోగించి నాగాస్త్రాల నన్నిటిని విరిచేసాడు. పాములను ధ్వంసం చేసే గరుడ బాణప్రయోగం రాముడు చేయగానే ఆకాశంలోని దేవతలు ఆ సన్నివేశం చూచి మెచ్చుకుని రాముని నుతించారు.

**విశే :** నాగుల్ని భయపెట్టేవాడు గరుడుడు. అందుకే నాగాస్త్రాన్ని ధ్వసం చేయాలంటే గరుడాస్త్ర ప్రయోగం చేస్తారు. ఆగ్నేయాస్త్రానికి వారుణాస్త్రం లాగ.

చ. **అది వృథవోయినన్ దనుజుఁ డాగ్రహమూని కరత్రిశూలమ**
**య్యదనునఁ ద్రిప్పివైవ విపులార్చులఁబేర్చుచువచ్చు దానిపై**
**వదలక ముందుగాఁ ద్రిదశవల్లభుఁ డిచ్చినశక్తి నేసినన్**
**బొదలుచుఁ బాఱిత్రుంచె మణిభూషణజాలము నా త్రిశూలమున్.** **67**

**ప్రతి :** అది=ఆనాగాస్త్రము, వృథవోయినన్=పనికిరాకుండాపోగా, దనుజుఁడు= రావణుడు, ఆగ్రహము=కోపము, ఊని=పూని, కరత్రిశూలము=చేతిలోని త్రిశూలమును, అయ్యదనునన్=ఆసమయంలో, త్రిప్పివైవ=గిరగిరా త్రిప్పి ప్రయోగించగా, విపులార్చులన్=అధికమయిన జ్వాలలతో, పేర్చుచు=చెలరేగుతూ, వచ్చుదానిపై=వస్తున్నట్టి దానిమీద, వదలక=వదిలిపెట్టక, ముందుగాన్=పూర్వము, త్రిదశవల్లభుఁడు=ఇంద్రుడు, ఇచ్చిన, శక్తిన్=శక్తి అనే ఆయుధాన్ని, ఏసినన్=ప్రయోగించగా, పొదలుచున్=ప్రకాశిస్తూ, పాఱి=పరుగుపెట్టి, మణిభూషణజాలమున్=మణులుకూర్చిన భూషణములుగల, ఆ త్రిశూలమున్=ఆ త్రిశూలాన్ని, త్రుంచె=విరిచివేసెను.

**తా :** తాను ప్రయోగించిన నాగాస్త్రం పనికిరాకుండా పోవడంతో రావణుడు కోపావేశంతో చేతిలోని త్రిశూలాన్ని గిరగిరా త్రిప్పి రామునిపై ప్రయోగించాడు. పెద్దగా జ్వాలలతో చెలరేగిపోతూ వస్తున్న ఆ త్రిశూలాన్ని వదలిపెట్టకుండా శ్రీరాముడు పూర్వం తనకు ఇంద్రుడు ఇచ్చిన శక్తి అనే ఆయుధాన్ని ప్రయోగించాడు. అది ప్రకాశిస్తూ వేగంగా వెళ్లి మణిభూషణాదులతో ఉన్న త్రిశూలాన్ని విరిచి వేసింది.

**విశే :** అరణ్యకాండలో శ్రీరామునికి మునులు, ఇంద్రుడు వివిధాస్త్రాలను బహుకరిస్తారు రావణవధకోసమని.

**వ. అట్లు శూలంబును దూలిపోయిన. 68**

**తా :** ఆ విధంగా శూలం కూడా పడిపోగా –

**క. సూతుని రథమును వాజులఁ**
**గేతువుఁ దూలంగ నేసి కినుక మెయిం జే**
**సేతను నొప్పించిన నృపుఁ**
**డాతఱి దైతేయవిభుని నద్భుత మడరన్. 69**

**ప్రతి :** సూతుని=సారథిని, రథమును, వాజులన్=గుఱ్ఱాలను, కేతువున్=జెండాని, తూలంగన్=పడిపోవునట్లుగా, ఏసి=వేసి, కినుకమెయిన్=కోపముతో, చేసేతను=స్వయముగా, నొప్పించిన=బాధించగా, నృపుఁడు=రాముడు, ఆతఱి=ఆ సమయములో, దైతేయవిభునిన్=రాక్షసరాజుని, అద్భుతము, అడరన్=ప్రకాశింపగా –

**తా :** శూలం కూడా పడిపోవడంతో రావణుడు కోపంతో సూతుణ్ణి, రథాన్ని గుఱ్ఱాల్ని, జెండాన్ని కూలదోసి, స్వయంగా బాధపెట్టడం చూసిన రాముడు రావణుణ్ణి అద్భుతపడేలా –

**క. సూటి గొని యసుర తలల కి**
**రీటము లవలీల దుల్లిరివ్వన నొసలున్**
**బీటలు వాఱ శతాంగము**
**ఘోటకములగుండె లవిసి కూలఁగ నేసెన్. 70**

**ప్రతి :** సూటిగొని=సరిగ్గా చూసి, అసురతలల కిరీటములు=రాక్షసరాజు రావణుని పదితలల కిరీటాలు, అవలీలన్=అసలు శ్రమలేకుండా, దుల్లి=రాలిపోగా, రివ్వన=వేగంగా వెళ్లి, నొసలున్ బీటలువాఱ=నుదురు పగిలి బీటలు వాఱగా, శతాంగము=రథము, ఘోటకముల=గుఱ్ఱాల, గుండెలవిసి=గుండెలు బ్రద్దలై, కూలఁగనేసెన్=కూలిపోవునట్లు ప్రయోగించెను.

**తా :** రాముడు అందరూ ఆశ్చర్యపడేలా–సూటిగా ఒక బాణం ప్రయోగించాడు–అది రావణుని పదితలల కిరీటాలు అవలీలగా దుల్లగొట్టి, నుదురు బీటలు వారిపోగా, రివ్వుమంటూ రథము, రథానికి కట్టిన గుఱ్ఱాల గుండెలు బ్రద్దలయి కూలిపోయేలా చేసింది.

**ఉ. ఆయెడ దైత్యనాయకుఁ దహంకృతి రామునిమేన నాటఁగా**
**వేయుశరంబు లాయముల వేగమె గాఁడిన రక్తపూరముల్**
**కాయము దొప్పఁదోఁగఁ వడిఁ గ్రమ్మెడు నప్పుడు గూడ నొప్పెఁ బ**
**ద్మాయత లోచనుండు చరమాద్రితటిం దగు భానుఁడోయనన్. 71**

**ప్రతి :** ఆయెడ=అప్పుడు, దైత్యనాయకుఁడు=రావణుడు, అహంకృతి= అహంకారముతో, రామునిమేన= రాముని శరీరమున, నాటఁగా=నాటుకొనునట్లుగా, వేయు శరంబులు=ప్రయోగించిన బాణాలు, ఆయములన్=ఆయువుపట్టులందు, వేగమె= వేగంగా, గాఁటిన=గ్రుచ్చుకొనగా, రక్తపూరముల్= రక్తప్రవాహాలు, కాయము= శరీరమంతా, తొప్పన్+తోఁగ=తొప్పఁదోఁగ=మునిగిపోయేలా, వడిన్=వేగముగా, క్రమ్మెదున్= కమ్ముకునే, అప్పుడుకూడ=అట్టి సమయంలో కూడా, పద్మాయతలోచనుండు=పద్మములవంటి విశాలమైన నేత్రములుగల రాముడు, చరమాద్రి తటిన్=పడమటికొండఅంచున, తగు=ప్రకాశించు, భానుఁడోయనన్= సూర్యుడా! అనేటట్లుగా, ఒప్పెన్=ఒప్పెను.

**తా :** అప్పుడు రావణుడు అహంకారంతో రాముని శరీరం మీద నాటుకునే విధంగా ప్రయోగించిన బాణాలు ఆయువుపట్లలో వేగంగా గుచ్చుకున్నాయి. వేగంగా గుచ్చుకోవడంవల్ల శరీరమంతా రక్తంలో మునిగిపోయినట్లుగా అవుతున్న సమయంలో కూడా పద్మాయతలోచనుడయిన శ్రీరాముడు పడమటి కొండ అంచున ప్రకాశిస్తున్న సూర్యుడా! అన్నట్లుగా ఒప్పాడు.

**విశే :** ఇది ఉత్ప్రేక్షాలంకారం. సంధ్యాకాలంలో సూర్యుడు ఎఱ్ఱగా ప్రకాశించినట్లు సూర్యవంశజుడయిన రాముడు శరీరం అంతా రక్తం కారుతూ ఉండగా–సాయం సంధ్యాకాల సూర్యుడా! అన్నట్లు ఉన్నాడని–భావన చేయడంవల్ల ఉత్ప్రేక్ష.

**ఆ. అంత రామచంద్రుఁ డత్యంత కుపితుఁడై**
**బాణవృష్టిఁ గురియఁ బంక్తిముఖుఁడు**
**కాలు వ్రేలు చెయ్యి కదలింప నోపక**
**మెదల లేక రథముమీఁద నొరిగె. 72**

**ప్రతి :** అంత=అప్పుడు, రామచంద్రుడు, అత్యంతకుపితుఁడై=మిక్కిలి కోపించినవాడై, బాణవృష్టిన్=బాణాల వానను, కురియన్=కురిపించగా, పంక్తిముఖుండు=రావణుడు, కాలువ్రేలుచెయ్యి=కాలుగాని చేయిగాని చివరకువేలుకాని, కదలింపన్=కదల్చడానికి, ఓపక=శక్తిచాలక, మెదలలేక=చలనంలేక, రథముమీఁదన్, ఒరిగె=ఒరిగిపోయాడు.

**తా :** అప్పుడు రామచంద్రుడు మిక్కిలి కోపంతో రావణుని మీద, బాణాల వర్షం కురిపించాడు. ఆ బాణాల ధాటికి రావణుడు, కాలుగాని, చేయిగాని చివరకు వేలుగాని కదల్చ లేకపోయాడు. రథంమీద చలనం లేకుండా ఒరిగిపోయాడు.

**విశే :** కదలడు మెదలడు, కదలకమెదలక అనే ప్రయోగాలు తరుచు వింటూ ఉంటాం. మొల్ల రెండు క్రియలను విడివిడిగా ప్రయోగించింది. కదలింపనోపక, మెదలలేక–అని.

**వ. రావణుండు సొమ్మసిల్లిపోవు టెఱింగి కాలకేతుఁడు తేరు దూరంబుగాఁ గొనిపోయినఁ గొంత ప్రొద్దునకు దనుజేంద్రుడు మూర్ఛ దేరి యోరీ పగవారలు నవ్వఁ దగ దనక రథం బిట్లుఁ దేఁ దగునే యని కోపించినఁ**

**గాలకేతుండును యుద్ధమధ్యంబున దేవరకు సంకటం బైన రథంబు వెడలఁ గొనిపోవుట యోటమిగాదని ధర్మవిదులు సెప్పుదురు గావున నే నిట్లు దెచ్చితి నని విన్న వించిన సూతుని వాక్యంబులకు మెచ్చి పసదనంబు లిచ్చి మన రథంబు రాముని పయిం బఱపు మనిన నట్ల కావించినన్ గనుంగొని. 73**

**ప్రతి :** రావణుడు, సొమ్మసిల్లిపోవుట=స్పృహ తప్పియుండుటను, ఎఱింగి=తెలిసి, కాలకేతుఁడు=రావణుని సారథి, తేరు= రథమును, దూరంబుగాన్, కొనిపోయినన్=తీసికొనిపోగా, కొంత ప్రొద్దునకున్=కొంతసేపటికి, దనుజేంద్రుండు=రాక్షసరాజు, మూర్ఛదేరి=(స్పృహలోనికి వచ్చి) మూర్ఛనుండి తేరుకొని, ఓరీ! పగవారలు= శత్రువులు, నవ్వన్=నవ్వునట్లుగా, తగదు అనక=కూడదు అని భావింపక, రథంబు, ఇట్లు, తేఁదగునే= తీసికొనివచ్చుట యుక్తమా!, అని, కోపించినన్=కోపింపగా, కాలకేతుండును, యుద్ధమధ్యంబునన్=యుద్ధం మధ్యలో, దేవరకున్=రాజునకు/ప్రభువునకు, సంకటంబు ఐనన్=కష్టము కలిగినచో, రథంబు, వెడలన్ గొనిపోవుట=దూరముగా తీసికొనిపోవుట, ఓటమిగాదని=ఓడుట కాదని, ధర్మవిదులు=ధర్మము తెలిసినవారు, చెప్పుదురు, కావునన్=అందువల్ల, నేను, ఇట్లు, తెచ్చితిని=తీసికొని వచ్చితిని, అని, విన్నవించినన్=వినతి చేయగా, సూతుని వాక్యంబులకున్=సారథి మాటలకు, మెచ్చి=మెచ్చుకొని, పసదనంబులు ఇచ్చి= బహుమానములిచ్చి, మనరథంబు, రామునిపయిన్=రాముని మీదికి, పఱుపుము=నడుపుము/పోనిమ్ము, అనినన్=అనగా, అట్ల=అదేవిధంగా, కావించినన్=చేయగా, కనుంగొని=చూచి...

**తా :** రావణుడు అలా రథంమీద స్పృహలేకుండా పడిపోవడం చూసిన రావణుని సారథి కాలకేతుడు రథాన్ని యుద్ధరంగం నుండి దూరంగా తీసుకొని పోయాడు. కొంతసేపటికి రాక్షసరాజు మూర్ఛనుండి తేరుకుని – ఓరీ! శత్రువులు నవ్వేవిధంగా ఇలా రథాన్ని రణరంగం నుండి దూరంగా తీసుకురావడం ఏమి పద్ధతి? అని కోపించగా–కాలకేతుడు యుద్ధమధ్యంలో ప్రభువులకు ఇబ్బంది కలిగినప్పుడు రథాన్ని దూరంగా తీసుకు వెళ్లడం ఓడిపోవడం కాదని ధర్మం తెలిసిన పెద్దలు చెప్తారు – కాబట్టి నేను ఇలా తీసుకుని వచ్చాను అని చెప్పగా సూతుని మాటలను మెచ్చుకొని బహుమానాలు ఇచ్చి మన రథాన్ని రాముని మీదకు నడుపు అన్నాడు. ఆసూతుడు ఆ విధంగా చేయగా చూచి –

క. **అతని రథమున కెదురుగ**
**మాతలి! మన రథముఁ బఱపుమా యన నతఁడున్**
**వే తీవ్రగతిం బఱపిన**
**భూతలపతి పలికె దనుజపుంగవుతోడన్. 74**

**ప్రతి :** ఆతని రథమునకు=రావణుని రథానికి, ఎదురుగ, మాతలి! మన రథమున్, పఱుపుమా=తోలుమా, అనన్=అనగా, అతఁడున్, తీవ్రగతిన్=ఎక్కువ వేగంగా, పఱపిన=తోలగా, భూతలపతి=రాముడు, దనుజపుంగవు+తోడన్=రాక్షస శ్రేష్ఠునితో, పలికె=అనెను.

**తా :** మాతలీ! మన రథాన్ని రావణునికి ఎదురుగా నడిపించు అనగా మాతలి ఎక్కువ వేగంగా రథాన్ని తోలాడు. రాముడు అప్పుడు రావణునితో ఇలా అన్నాడు.

## రామ రావణుల వీరాలాపములు

**ఉ. భూరి భుజప్రతాపమునఁ బొంగుచు నిర్జర కోటి మాటికిన్**
**బోర జయించి తంచుఁ బలుపోకలు పోదువు నీవు భీతిమైఁ**
**దారక నిల్చి నాయెదఁ బ్రతాపము సూపుము చూపవేని నా**
**వారిజగర్భుఁ డడ్డపడవచ్చినఁ జంపుదు నిన్ను రావణా! 75**

**ప్రతి :** భూరిభుజప్రతాపమునన్=అధికమైన భుజశక్తితో, పొంగుచు=విఱ్ఱవీగుతూ, నిర్జరకోటి=దేవతల సమూహాన్ని, మాటికిన్=ఎల్లప్పుడు, పోరజయించితి=యుద్ధంలో జయించాను, అంచున్=అంటూ, పలుపోకలు పోవుచు=అనేకవిధాలుగా వ్యవహరిస్తున్నావు, నీవు, భీతిమైన్=భయంతో, తారక=ఇటూ అటూ పోక, నిల్చి=నిలబడి, నాయెడన్=నాకు, ప్రతాపము=నీ శక్తిని, చూపుము, చూపవేనిన్=చూపకపోయినట్లయితే, ఆ వారిజగర్భుఁడు=తామర పువ్వునుండి పుట్టిన బ్రహ్మ, అడ్డుపడ వచ్చినన్, చంపుదు, నిన్ను, రావణా!= ఓ రావణా!

**తా :** ఓ రావణా! గొప్ప భుజబలంతో విఱ్ఱవీగుతూ దేవతల్ని ఎప్పుడూ జయించాను అంటూ గొప్పలు చెప్పుకుంటూ వ్యవహరిస్తూ ఉంటావు. ఇప్పుడు భయంతో పాఱిపోకుండా నా ఎదుట నిలబడి నీ ప్రతాపం చూపించు. అలా చూపించకపోతే ఆ బ్రహ్మదేవుడు అడ్డుపడినా సరే నిన్ను సంహరిస్తాను.

**ఉ. ఆలములోన వానరుల నాలము సేసినయట్లు గాదు నా**
**పాలిశరంబు నీనుదుటివ్రాలు హరింపఁగఁ బాలుపడ్డ దీ**
**వేళ వృథాపహాస్యములు వేయివిధంబుల మానలేక తాఁ**
**గాలుఁడు కన్నుగీటె నిదె కాలము దగ్గఱె నీకు రావణా! 76**

**ప్రతి :** ఆలములోన=యుద్ధములో, వానరులన్=కోతులను, ఆలము=అనాదరణ చేసినయట్లుగాదు, నాపాలి=నాయొక్క, శరంబు=బాణము, నీ నుదుటివ్రాలు=నీ నుదుటను వ్రాసిన వ్రాతను (ఆయుష్షును) హరింపఁగన్=పోగొట్టుటకు, పాలుపడ్డది=సిద్ధపడినది, ఈవేళ, వృథాపహాస్యములు=పనికిరాని హేళన వాక్యాలు, వేయివిధంబుల=అనేకవిధాలుగా, మానలేక, తాన్=తాను, కాలుఁడు=యముఁడు, కన్నుగీటె= కన్నుకొట్టాడు, ఇదె=ఇదుగో, కాలము=మరణకాలము, దగ్గఱె=సమీపించెను, నీకు, రావణా!

**తా :** రావణా! యుద్ధంలో వానరులను లెక్కచేయక అల్లరి చేసినట్లుకాదు. నా బాణం ఈనాడు నీ నుదుటి వ్రాతను చెఱిపివేయడానికి సిద్ధపడింది. ఊరికే అపహాస్యాలు అనేక విధాలుగా చేస్తూ మానలేక పోతున్నావు. ఆ యముడు నీకు కన్ను కొట్టాడు. నీకు మరణకాలం సమీపించింది.

**విశే :** నీ నుదుటి వ్రాలుహరించుట=నుదుటి మీద బ్రహ్మ వ్రాసిన వ్రాతలు చెరిపివేయడం అంటే ఎంత ఆయుర్దాయం ఆయనవ్రాసినా నేను తుడిచేస్తాను. అంటే చంపుతాను అని. కాలుఁడుకన్నుగీటె=యముడు కన్నుకొట్టాడు=అంటే ఆయన చూపు నీమీద పడింది అని.

సాధారణంగా కన్ను గీటడం-ప్రేయసీ ప్రియుల మధ్య వర్ణిస్తారు. మొల్ల ఇక్కడ యముడు కన్నుగీటె అంది. కాలము దగ్గఱె=మరణకాలము సమీపించింది అని. నుదుటి వ్రాలు హరించు, కాలుఁడు కన్నుగీటె, కాలము దగ్గఱె-తెలుగు నుడికారాలు. కందువమాటలు.

**చ. హరి గిరి వహ్ని గిహ్నిఁ బ్రళయాంతకుఁ గింతకు దైత్యు గీత్యువా**
**ర్వరు గిరు గాడ్పు గీడ్పు ధనవల్లభు గిల్లభు రుద్రు గిద్రు సం**
**గరమున నోర్చినట్టి దశకంధర! నీకు జయింప వచ్చునే**
**సురనగ ధీరు నుగ్రరణశూరుఁ బయోధిగభీరు రాఘవున్. 77**

**ప్రతి :** హరిగిరి=హరిని (ఇంద్రుని) గిరిని, వహ్నిగిహ్నిన్=అగ్నిని గిహ్నిని, ప్రళయాంతకు గింతకు=యముణ్ణి గిముణ్ణి, దైత్యుగీత్యు=రాక్షసునిగీత్యుని, వార్వరుగిరు=వరుణుని గిరుణుని, గాడ్పుగీడ్పు=వాయువుని గీయువుని, ధనవల్లభు గిల్లభు=కుబేరుణ్ణి గిల్లభు, రుద్రుగిద్రు=రుద్రుణ్ణిగిద్రుని, సంగరమునన్=యుద్ధంలో, ఓర్చినట్టి=జయించినట్టి, దశకంధర=రావణా, సురనగధీరున్= మేరుపర్వతమువంటి ధైర్యము గలవానిని, ఉగ్రరణశూరున్=భయంకరమైన యుద్ధనైపుణ్యముగలవానిని, పయోధిగభీరు=సముద్రమువలె గంభీరమైన, రాఘవున్=రఘుకులజాతుడైన రాముని, నీకు, జయింపవచ్చునే=జయింపశక్యమా.

**తా :** ఓ దశకంధరా! ఇంద్రుని, అగ్నిని, ప్రళయాంతకుని యముని, దైత్యుని, నిరృతిని, వరుణుని, వాయువుని, కుబేరుని, రుద్రుని యుద్ధరంగంలో జయించావు. కాని అట్టినీకు సురనగధీరుడు, ఉగ్రరణ శూరుడు, పయోధిగభీరుడు అయిన రాఘవుణ్ణి జయించడం-శక్యమా! శక్యముకాదు అని తాత్పర్యము.

**విశే :** మొల్ల తెలుగునుడికార ప్రయోగానికి చక్కని ఉదాహరణ ఈ పద్యం. 'నిందయందు ఆమ్రేడితంబున గిగీలగు'-అని బాలవ్యాకరణ సూత్రం. ఏ విషయాన్నయినా, ఏ వ్యక్తియినా నిందించే సందర్భంలో-ఆమ్రేడితంలో అంటే ఒక పదం రెండోసారి చెప్పేటప్పుడు. హ్రస్వంతో ఉంటె 'గి' దీర్ఘమయితే 'గీ' వస్తాయి. ఈ విధానం తెలుగు నుడికారపు సొంపులో ఒక భాగం.

బాలకాండలో-పరుశురాముడు-కోపంతో రామునితో మాట్లాడే సందర్భంలో-'రాముఁడు గీముడంచును-(95ప) అంటాడు. గీముడుకి వేరే అర్థం ఉండదు. రాముడిని నిందార్థంలో చెప్పడమే. అంటే తేలిక పరచి మాట్లాడడం. అలాగే-సుందరకాండలో రావణుడు సీతతో మాట్లాడే సందర్భంలో-'రామున్ గీముని, చెప్ప గిప్ప నగరా!' అంటాడు. ఇదికూడ రాముణ్ణి తేలికపరచి మాట్లాడడమే. చెప్పు=క్రియాపదం. దానిని కూడా నిందార్థంలో-చెప్ప గిప్ప అన్నారు.

ఇక్కడ శ్రీరాముడు రావణునితో పలికిన పలుకులన్నీ, పద్యంలో సగభాగం తెలుగు భాషలోని ప్రత్యేక నుడికారాన్ని పలికించింది మొల్ల.

ఈ పద్యంలో - హరిని, వహ్నిని, ప్రళయాంతకుని, దైత్యుని, వరుణుని, వాయువుని, కుబేరుని, రుద్రుని-అవలీలగా జయించాడు కాబట్టి వారినందరినీ రావణుడు నిందార్హులుగా భావించినట్లు-ఈ గిగీల

ప్రయోగంలో వ్యక్తం చేయబడింది. గిగీలతో ఈ సందర్భంలోని పదాలకు వేరే అర్థాలు ఉండవు. నిందే ప్రధానము. మొల్ల ఈ పద్యంలో అష్టదిక్పాలకులను రావణుడు జయించాడు అనే విషయం కూడా స్పష్టం చేసింది.

**క. మతిఁ దలఁప సుఖరతిం బతి**
**వ్రతలను మునివరులఁ బట్టి వ్రతములు గర్వో**
**న్నతిఁ జెఱచినట్టి దురిత**
**స్థితి నిప్పుడు నీవు నాకుఁ జిక్కితి విచటన్. 78**

**ప్రతి :** మతిన్, తలఁప=ఆలోచించి చూడగ, సుఖరతిన్=సంతోషముతో, పతివ్రతలను, మునివరులన్, పట్టి, వ్రతములు=వారి వారి యజ్ఞయాగాదులు, గర్వోన్నతిన్=అతిశయించిన గర్వంతో, చెఱచినట్టి=పాడు చేసినట్టి, దురితస్థితి=పాపఫలితంగా, ఇప్పుడు, నీవు, నాకు, చిక్కితివి, ఇచటన్.

**తా :** ఆలోచించి చూడగా సంతోషంతో పతివ్రతలను, మునివరులను పట్టుకొని వారి వారి వ్రతాలు అహంకారంతో పాడుచేసిన పాపఫలితంగా ఇప్పుడు ఇక్కడ నువ్వు నాకు పట్టుపడ్డావు.

**వ. అని గర్వాలాపంబు లాడుచున్న యుర్వీశునకుఁ బూర్వగీర్వాణాధీశ్వరుం డగు రావణాసురుం డిట్లనియె. 79**

**ప్రతి :** గర్వాలాపంబులు=గర్వంతోకూడిన మాటలు, ఉర్వీశునకు=రాజుకు, పూర్వగీర్వాణాధీశ్వరుండు= రాక్షసుల రాజు

**తా :** అంటూ పౌరుషంతో మాట్లాడుతున్న రామునితో రాక్షసాధీశ్వరుడయిన రావణుడు ఇలా అన్నాడు.

**క. అంతటి భూరిపరాక్రమ**
**వంతుఁడ నౌ టెఱుఁగుదేని వసుధేశ్వర! నా**
**పంత మెఱింగియు నెఱుఁగక**
**యింత ప్రగల్భముల నాడ నేటికి నీకున్. 80**

**ప్రతి :** అంతటి, భూరిపరాక్రమ వంతుఁడనౌట=గొప్పపరాక్రమవంతుడనని, ఎఱుఁగుదేని=తెలిసినట్లయితే, వసుధేశ్వర!=ఓ రామా, నాపంతమెఱింగియున్=నా పట్టుదలతెలిసికూడా, ఎఱుగక=తెలియక, ఇంత= ఇంతగొప్పగా, ప్రగల్భములన్= గొప్పమాటలు, ఆడనేటికి=మాట్లాడడ మెందుకు, నీకున్.

**తా :** నేను అంతటి గొప్ప పరాక్రమవంతుడనని, నా పట్టుదల, శక్తి తెలిసికూడా ఇంత గొప్పగా ప్రగల్భాలు పలుకడం దేనికి నీకు ఓ రామా! తెలియనట్లుగా మాట్లాడుతున్నావు.

**క. నీ లావును నా లావును**
**వాలాయము సురలు సూచి వర్ణింపఁగ నేఁ**

**దాలములోపలఁ జూపుద**
**మేలా గర్వోక్తు లిప్పు డినకుల తిలకా! 81**

**ప్రతి :** నీ లావును=నీ బలము, నా లావును= నా బలము, వాలాయము=తప్పకుండ, సురలు=దేవతలు, చూచి, వర్ణింపఁగన్=వర్ణించే విధంగా, నేఁడు=ఈరోజు, ఆలములోపలన్=యుద్ధములో, చూపుదము= చూపుదాము, గర్వోక్తులు=గర్వంతో కూడిన మాటలు, ఇప్పుడు, ఇనకులతిలకా!= సూర్యవంశశ్రేష్ఠుడైన ఓరామా! ఏలా=ఎందుకు?

**తా :** ఓ రామా! నీబలము, నాబలము దేవతలు తప్పకుండా చూచి వర్ణించే విధంగా ఈ రోజు యుద్ధంలో ప్రదర్శిద్దాము. ఇప్పుడు ఈ గర్వోక్తులు ఎందుకు?

**మ. జననాథాగ్రణి! నా ప్రతిజ్ఞ వినుమా శాంతాత్ముఁడై నీకునై**
**వనజాప్తుం డిట వచ్చి కావు మనుచున్ వైళంబ నన్ గోరినన్**
**వినువీథిన్ సుర లెల్లఁ జూచి వెఱవన్ బీరంబు సంధిల్లఁగా**
**నిను నీతమ్మునిఁ జంపకుండ మరలన్ నే లంకకుం బోఁజుమీ. 82**

**ప్రతి :** జననాథాగ్రణి!=రాజశ్రేష్ఠుడా!రామా!, నాప్రతిజ్ఞ, వినుమా! శాంతాత్ముఁడై=శాంతచిత్తుడై, నీకునై=నీ కోసమని, వనజాప్తుండు=సూర్యుడు, ఇటవచ్చి=ఇక్కడకు వచ్చి, కావుము=రక్షింపుము, అనుచున్=అంటూ, వైళంబ= వేగంగా, నన్=నన్ను, కోరినన్=కోరినప్పటికీ, వినువీథిన్=ఆకాశవీధిలో, సురలెల్లన్= దేవతలందరు, చూచి, వెఱవన్=భయపడగా, బీరంబు=ప్రతాపము, సంధిల్లఁగా=వచ్చిచేరగా, నిను=నిన్ను, నీతమ్మునిన్= నీతమ్ముడిని, చంపకుండ=చంపకుండ, మరలన్=వెనుదిరిగి, నే=నేను, లంకకున్=లంకానగరానికి, పోఁజుమీ=వెళ్లను సుమా!

**తా :** రాజశ్రేష్ఠా! రామా! – నా ప్రతిజ్ఞ విను. ఒక వేళ సూర్యుడు శాంతాత్ముడై చల్లబడి నీ కోసమని వేగంగా ఇక్కడకు వచ్చి రక్షించమని నన్ను వేడు కొన్నప్పటికీ–ఆకాశవీథిలోని దేవతలందరూ చూసి భయపడేవిధంగా పరాక్రమంతో నిన్ను నీ తమ్ముణ్ణి చంపకుండా నేను లంకకు మరలిపోయేది లేదుసుమా!

**విశే :** రాముడు సూర్యవంశజుడు. కాబట్టి ఒకవేళ సూర్యుడే స్వయంగా దిగివచ్చి నిన్ను కాపాడుమని ప్రార్థించినా సరే నిన్నూ నీ తమ్ముణ్ణి చంపకుండా లంకకు తిరిగి వెళ్లను సుమా ఇదే నా ప్రతిజ్ఞ అంటూ–దృఢంగా చెప్తున్నాడు రావణుడు.

**వ. అని కోపోద్దీపిత మానసులై వీరాలాపంబు లాడుచు నిద్దఱును నుద్దవిడి గద్దింపుచు నోలమాసగొనక మీఱిన కోపంబున శరీరంబులు మఱచి జయోల్లాసంబు లుల్లసిల్ల నొసళ్ళుఁ బొడముపెన్ జెమట మొత్తంబులును రక్తపూరంబులునున్ బెరసి కాలువలై పాఱుచుండ మెఱుంగు కఱకుటంపగములు నాటినం జూఱు కెఱుంగక తమకంబులను నిష్ఠుర బాణసంఘట్టనంబులను బృథుల రథనేమిస్వనంబులను ద్విసహస్రతురంగహేషారవంబులను భటుల సింహనాదంబులను గగనంబు వగుల జగంబులు కలంగ**

**సముద్రంబులు ఘూర్ణిల్ల ధాత్రి వడంక దిగ్గజంబులు మ్రొగ్గతిల్లఁ బడ నభోభాగంబున దేవ గంధర్వ సిద్ధసాధ్యకిన్న రకింపురుషాదులు సూచి వెఱంగుపడ నిది పగ లిది రాత్రి యని యెఱుంగక తమకంబున నే డహోరాత్రంబులు పోరాడి యలసి బాణప్రయోగంబు లుజ్జగించి యొకరి నొకరు సూచుచుండ నయ్యవసరంబున. 83**

**ప్రతి :** అని=అని, కోపోద్దీపిత మానసులై=కోపంతో మండిపడుతూ, వీరాలాపంబులు=వీరులకు తగిన మాటలు, ఆడుచు=పలుకుచు, ఇద్దఱును=రామరావణులు ఇరువురు, ఉద్దవిడి=అతిగా, గద్దింపుచున్=ఒకరిని ఒకరు అదిలించుకుంటూ, ఓలమాసగొనక=వెనుదీయక, మీఱిన కోపంబున=ఎక్కువైనకోపంతో, శరీరంబులు మరచి=ఒళ్లుమరచి, జయోల్లాసంబులు=జయము తనకే అనే భావనతో కలిగే సంతోషం, ఉల్లసిల్ల=వ్యక్తము కాగా, నొసళ్ళన్=నుదుటి ప్రదేశంలో, పొడము= కనుపించు, పెన్‌జెమట=అధికమైన చెమట, మొత్తంబులును= సమూహాలు, రక్తపూరంబులునున్=రక్తధారలు, బెరసి=కలసి, కాలువలైపాఱుచుండ=కాలువలవలె ప్రవహించుచుండగా, మెఱుంగు=మెఱసిపోతున్న, పదునైన, కఱకుటంపగములు=వాడియైన బాణాల సమూహాలు, నాటినన్=గుచ్చుకున్నప్పటికి, చుఱుకెఱుంగక=చుఱుక్కుమన్న ఆ నొప్పిని పట్టించుకొనక, తమకంబులను=ఉత్కంఠతో, నిష్ఠుర బాణసంఘట్టనంబులను=వాడియైనబాణాలు ఒకదానితో ఒకటికొట్టుకొని శబ్దములుచేయగ, పృథుల=పెద్దవైన, రథనేమి=రథచక్రాల, స్వనంబులను=చప్పుళ్లును, ద్విసహస్రతురంగ హేషారవంబులను=రెండువేల గుఱ్ఱాలసకిలింపులకు, భటుల, సింహనాదంబులను=విశేషమైననాదాలకు, గగనంబు=ఆకాశము, పగుల=పగిలిపోవునట్లుగా, జగంబులుకలంగ=జగంబులుభయపడునట్లుగా, సముద్రంబులు, ఘూర్ణిల్ల=మ్రోగగా, ధాత్రి=భూమి, వడంక=వణకిపోగా, దిగ్గజంబులు=దిక్కులను మోసే ఏనుగులు, మ్రొగ్గతిల్లన్= మోకరించినట్లుగా, పడన్=పడిపోగా, నభోభాగంబున=ఆకాశంలో, దేవగంధర్వ సిద్ధసాధ్యకిన్నరకింపురుషాదులు, చూచి, వెఱంగుపడ=ఆశ్యర్యపడగా, ఇది పగలు, ఇదిరాత్రి, అని ఎఱుంగక, తమకంబున=పూనికతో, ఏడు, అహో రాత్రంబులు=రాత్రింబవళ్లు, పోరాడి=యుద్ధంచేసి, అలసి, బాణ ప్రయోగంబులు, ఉజ్జగించి=విడిచిపెట్టి, ఒకరినొకరు, చూచుచుండన్, అయ్యవసరంబున=ఆ సమయంలో...

**తా :** రామరావణులు ఇద్దరూ కోపంతో మండిపడుతూ వీరాలాపాలు ఆడుతూ ఒకరి నొకరు తీవ్రంగా గద్దించుకొంటూ వెనుదీయక అంతకంతకు కోపం పెరిగిపోగా ఒళ్లు తెలియకుండా జయోల్లాసాలతో నుదుటిమీద పట్టిన చెమటలు, శరీరంమీది రక్తాలు కలిసి ఏరులై పారుతున్నా ఎదుటి వాడి బాణం గుచ్చుకున్నా లెక్కచేయక ఉత్కంఠతో యుద్ధం చేస్తున్నారు. అప్పుడు వాడియైన బాణాలు ఒకదానికి ఒకటి తగిలి పుట్టిన శబ్దాలకు, పెద్దపెద్ద రథచక్రాల ధ్వనులకు, రెండువేల గుఱ్ఱాల సకిలింపులకు, భటులు చేస్తున్న సింహనాదాలకు – ఆకాశం పగిలింది, జగాలు భయపడ్డవి, సముద్రాలు ఘోషించాయి. భూదేవి వణికింది, అష్టదిగ్గజాలు మోకరిల్లినట్లు పడ్డాయి. ఆకాశవీథిలో – దేవతలు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, కింపురుషులు మొదలయినవారు చూచి ఆశ్చర్యపడేలా, ఇదిపగలు, ఇది రాత్రి అనికూడా గమనించకుండా పూనికతో ఏడురాత్రింబవళ్లు యుద్ధంచేసి అలసిపోయి, బాణాలు ప్రయోగించడం వదిలివేసారు. ఒకరినొకరు చూచుకుంటూ ఉన్న సమయంలో –

## తెగిన తోడనే మరల మొలుచుచున్న రావణుని శిరములు

**క. సరసీరుహమిత్త్రాన్వయుఁ**
**దరుదరుదని సురలు వొగడ నసురేశ్వరున**
**క్కరములు శిరములుఁ దెగిపడ**
**నురుముష్టిని దీసి వేగ నుగ్రాస్త్రములన్. 84**

**ప్రతి :** సరసీరుహమిత్రాన్వయుఁడు=సూర్యవంశజుడయిన రాముడు, అరుదరుదని=ఎక్కడా ఎప్పుడూ ఇలాంటిది చూడలేదు అని, సురలు=దేవతలు, పొగడన్=నుతించగా, అసురేశ్వరుని=రావణాసురుని, అక్కరములు=ఆ+కరములు=ఆ చేతులు, శిరములున్=తలలు, తెగిపడన్=తెగిపడిపోవునట్లుగా, ఉరుముష్టిన్=బలమైన పిడికిలితో, తీసి, వేగన్, ఉగ్రాస్త్రములన్=భయంకరములైన అస్త్రములను, ప్రయోగించెను.

**తా :** రాముడు తన బలమైన పిడికిలితో భయంకరమైన అస్త్రాలు తీసి ప్రయోగించగా రావణుని చేతులు, తలలు తెగిపడ్డాయి. దేవతలందరూ ఇది చాలా అరుదైన దృశ్యమని పొగిడారు.

**క. తెగి పడినతలలుఁ జేతులు**
**దెగినట్లే మొల్చుచుండఁ దీవ్రత యదరన్**
**జగతీశుఁ డపుడు మదిలోఁ**
**దెగ కుండుట చిత్ర మనుచు దీకొని మఱియున్. 85**

**ప్రతి :** తెగిపడిన తలలున్,చేతులు,తెగినట్లే=ఎంతవేగంగా తెగాయో అంత వేగంగా, మొల్చుచుండన్= మళ్లీ మొలుచుకు వస్తుండగ, తీవ్రత, అదరన్=ప్రకాశించగా, జగతీశుఁడు=శ్రీరాముడు, అపుడు, మదిలోన్=మనస్సులో, తెగకుండుట=చనిపోకుండుట, చిత్ర మనుచు=విచిత్రంగా ఉందే అనుచు, మఱియున్=అధికంగా, దీకొని=విజృంభించి.

**తా :** రావణుని తలలు చేతులు తెగిపడినవి తెగిపడినట్లే మొల్చుకొస్తుండగా, తీవ్రంగా తలలు చేతులు మొలవడం ఆగకపోవడం ఆశ్చర్యంగా ఉందే అంటూ శ్రీరాముడు మరింతగా విజృంభించాడు.

**క. ఒకకోలఁ దలలుఁ జేతులుఁ**
**బ్రకటంబుగఁ ద్రుంచినంత బాహులుఁ దలలున్**
**వికచాంబుజముల రీతిని**
**సకలేశుఁడు వెఱగుపడఁగఁ జయ్యన మొలిచెన్. 86**

**ప్రతి :** ఒక కోలన్=ఒక బాణంతో, తలలున్, చేతులున్, ప్రకటంబుగన్=ప్రత్యక్షంగా, త్రుంచినంతలో, బాహులున్=బాహువులు, తలలున్, వికచాంబుజములరీతిని=వికసించిన తామరపువ్వులవలె, సకలేశుఁడు=సకలానికి ప్రభువయిన శ్రీరాముడు, వెఱగుపడఁగన్=ఆశ్చర్యపోవునట్లుగ, చయ్యన=వెంటనే, మొలిచెన్.

**తా :** రాముడు ఒకే బాణంతో తలలు, చేతులు ప్రత్యక్షంగా త్రుంచాడు. కానీ వికసించిన తామరపువ్వుల్లా ఆ చేతులు తలలు-సకలేశుడయిన రాముడే ఆశ్చర్యపడేవిధంగా వెంటనే మొలుచుకొచ్చాయి.

**విశే :** చయ్యన - తెలుగు నుడికారము. వెంటనే వేగంగా అనే అర్థం.

**క.** **తొడిగెడి శరములు ధరపైఁ**
**బడియెడు మస్తకము లేరుపడకుండఁగ న**
**ప్పుడు రామమహీతలవరుఁ**
**డెడతెగ కుండంగ నేసె నేమని చెప్పన్.** **87**

**ప్రతి :** తొడిగెడిశరములు=వింటిలో తోడిగే బాణాలు, ధరపైన్=భూమిమీద, పడియెడు=పడిపోవునట్టి, మస్తకములు=తలలు, ఏరుపడకుండఁగన్=ఇవి బాణాలు, ఇవి తలలు అని విడదీసి చూపలేని విధంగా, రామ, మహీతలవరుడు=భూభర్త, ఎడతెగకుండంగన్=వ్యవధిలేకుండా ఒకదానికి మరోదానికి మధ్య ఎడంలేకుండా, ఏసెన్=ప్రయోగించెను, ఏమని, చెప్పన్=చెప్పను.

**తా :** వింటికి తొడిగే బాణాలు భూమిమీద తెగిపడే తలలు - ఇవి బాణాలు ఇవి తలలు అని విడతీసి చూపలేని విధంగా శ్రీరాముడు ఎడతెగకుండా బాణాలు ప్రయోగించాడు. ఏమని చెప్పను?

**విశే :** ఆ క్రీడావిధానాన్ని ఏమిని చెప్పాలో అని కవయిత్రి ఆశ్చర్యపోతున్నది.

**వ.** **అట్టి సమయంబున.** **88**

**తా :** అటువంటి సమయంలో

**ఆ.** **వింటఁ దొడుగుశరము వెడలెడుశరమును**
**దిరుగ మొలుచుతలలుఁ దెగినతలలు**
**నెట్టివారి కైన నెఱుఁగంగ రాకుండ**
**రాముఁ డేయఁ దొడఁగె రణములోన.** **89**

**ప్రతి :** వింటన్, తొడుగుశరము, వెడలెడు, శరమును, తిరుగ, మొలుచు తలలున్=మొలిచే తలలు, తెగినతలలున్=తెగిపడినతలలును, ఎట్టివారికైనన్=ఎంతటి వారికైన, ఎఱుఁగంగ=తెలుసుకొనుటకు, రాకుండ=వీలులేకుండ, రాముఁడు, ఏయన్=ప్రయోగించుటకు, తొడఁగె=పూనుకొనెను, రణములోన=యుద్ధమందు.

**తా :** వింట సంధించే బాణము, వింటి నుండి వచ్చే బాణము, తెగిపడిన తలలు, తిరిగి మొలిచే తలలు ఎంతటి నిశితంగా పరిశీలించే వారికై నా తెలియరాకుండా యుద్ధంలో రాముడు బాణాలు వేయసాగాడు.

**విశే :** రాముడు ఎప్పుడు బాణం సంధించి వదులుతున్నాడో, ఆ బాణానికి రావణుని తలలు ఎప్పుడు తెగిపడుతున్నాయో, అంతలోనే ఎప్పుడు తిరిగి మొలుస్తున్నాయో – విడదీసి చూడడానికి శక్యంలేకుండా రాముడు బాణప్రయోగం చేస్తూన్నాడు.

కోదండ విద్యాపండితుడయిన రాముని విలువిద్యా ప్రదర్శన మిది, రావణుని తలలు మొలవడం వరప్రభావం, తెగీ తెగగానే మొలుస్తున్నాయి తలలు, మొలిచీ మొలవగానే రామబాణం త్రుంచేస్తున్నది వేగంగా.

దర్శనీయమైన యుద్ధాన్ని చిన్నచిన్న తెలుగు పదాలతో కనులకు కట్టే విధంగా వర్ణించింది. ఏమని చెప్పన్, (87ప)–అంటూనే – ఈ వర్ణన చేసింది.

**ఆ.** **శరము దొడిగి తివియఁ జక్రంబువలె నుండు**
**శరము విడుచునపుడు చాప మగును**
**జూడ నొప్పె నౌర శోభితం బగు రాము**
**చేతివిల్లు సెప్పఁ జిత్ర మగును.** **90**

**ప్రతి :** శరము, తొడిగి, తివియన్=లాగగా, చక్రంబువలెన్=చక్రంవలె గుండ్రంగా, ఉండు=ఉంటుంది, శరము, విడుచునపుడు=వింటినుండి బాణాన్ని విడిచిపెట్టే సమయములో, చాపము, అగును, ఔర=ఆశ్చర్యము, చూడన్, ఒప్పె, శోభితంబగు=ప్రకాశించుచున్న, రాము చేతి విల్లు, చెప్పన్, చిత్రమగును=చిత్రంగా ఉంది.

**తా :** రాముడు వింటికి బాణంతొడిగి లాగగానే అదిచక్రంలా గుండ్రంగా ఉంటుంది. శరాన్ని విడిచి పెట్టగానే నారి వింటికి దగ్గరగా రావడంవల్ల చాపము వలె అయిపోతుంది. రాముని చేతిలో ప్రకాశించే ఆ విల్లు గురించి చెప్పడం ఔరా! ఎంత చిత్రమగును?

**విశే :** కోదండ విద్యాప్రవీణుడయిన రాముడు శరము సంధించి నారి ఆకర్ణాంతము లాగగానే ఆ విల్లు చక్రంవలె భాసిల్లింది అనడం–శ్రీరాముడు చక్రధారి అయిన శ్రీమహావిష్ణువు అనే విషయాన్ని సూచించడమే.

**ఉ.** **కాంచన పుంఖ దివ్య విశిఖంబుల బాహులు మస్తకంబులున్**
**ద్రెంచినఁ ద్రెంచినట్లె కడుఁ దేజ మెలర్పఁగ నుద్భవించు స**
**త్కాంచనరత్న భూషణ నికాయము దీప్తులు ప్రజ్వరిల్లఁగాఁ**
**గాంచన గర్భదత్త వర గర్వ విశేషముచేత సారెకున్.** **91**

**ప్రతి :** కాంచనపుంఖ దివ్యవిశిఖంబుల=బంగారు కట్లు గలదివ్య బాణములతో, బాహులు మస్తకంబులున్=చేతులుతలలును, త్రెంచినన్=త్రెంచగా, త్రెంచినట్లె=త్రెంచినంతలో, కడున్=మిక్కిలి, తేజమెలర్పఁగన్=ప్రకాశవంతముగ, ఉద్భవించు=పుట్టుచున్న, సత్కాంచనరత్నభూషణనికాయము=మేలిమి బంగారముతో రత్నములతో చేయబడిన ఆభరణముల సమూహము, దీప్తులు=కాంతులు, ప్రజ్వరిల్లఁగాన్=మిక్కిలి

ప్రకాశింపగా, కాంచనగర్భ దత్తవరగర్వ విశేషము చేత=బ్రహ్మచే ఇవ్వబడిన గొప్పవరము యొక్క విశేషం వలన, సారెకున్=మాటిమాటికి –

**తా :** బంగారు కట్లుగల దివ్యబాణాలతో రావణుని చేతులను తలలను రాముడు తెగ నరుకుతున్నాడు. బ్రహ్మ ఇచ్చిన గొప్ప వరవిశేషం వల్ల త్రెంచిన చేతులు తలలు త్రెంచినట్లే కాంచనరత్నభూషణాలు ప్రకాశిస్తూ ఉండగా మాటిమాటికి మొలుచుకు వస్తున్నాయి.

**విశే :** శ్రీరాముడు విసుగు విరామం లేకుండా త్రెంచుతున్నాడు, త్రెంచినవి త్రెంచినట్లే గొప్ప ప్రకాశంతో మాటిమాటికి, మొలుచుకొస్తున్నాయి.

ఇది ఒక దృశ్యకావ్యము.

**చ. పొరిఁబొరిఁ ద్రుంచినన్ దిరిగి పుట్టెడుచందముఁ గోల నారిపై**
**వెరవుగఁ బూనుచందమును వేసెడు చందముఁ బాఱుచందము**
**న్గరము నుతింపఁగా నరుదుగాదె తలంపఁగ దేవతాళికిన్**
**శిరముల చిత్రమున్ నృపతిచేతి విచిత్రము తూపు చిత్రమున్. 92**

**ప్రతి :** పొరిఁ బొరిన్=మాటి మాటికి (వెంటవెంటనే), త్రుంచినన్=ఖండించగా, తిరిగిపుట్టెడు చందమున్= మళ్లీ పుట్టుకొస్తున్న విధానము, కోల=బాణము, నారిపై= నారిమీద, వెరవుగన్=నేర్పుగ, పూనుచందమును= పూన్చు విధానము, పాఱుచందమున్=ఆ బాణంవేగంగా వెళ్లే విధానము, కరము=మిక్కిలి, నుతింపఁగాన్= కొనియాడగా, అరుదు గాదె=ఆశ్చర్యకరము కదా, తలంపఁగ=ఆలోచించగ, దేవతాళికిన్=దేవతల సమూహానికి, శిరముల చిత్రమున్=తలలు మొలిచే చిత్రము, నృపతిచేతి విచిత్రము=బాణం ప్రయోగించే శ్రీరాముని చేతి విచిత్రము, తూపుచిత్రము=బాణం వేగంగా ప్రయాణించి తలలు త్రుంచే చిత్రము –

**తా :** వెంటవెంటనే రాముడు తలలు త్రుంచుతున్నాడు. త్రుంచిన వెంటనే తలలు మళ్ళీ పుట్టుకొస్తున్నాయి. బాణం నారిమీద నేర్పుగా ఎప్పుడు సంధిస్తున్నాడో, ఎప్పుడు విడుస్తున్నాడో, ఆ బాణం ఎంత వేగంగా వెళ్తోందో చూస్తున్న దేవతలకు ఆశ్చర్యం కలిగి ఆ యుద్ధాన్ని విశేషంగా కొనియాడుతున్నారు. వారికి తలలు మొలవడం చిత్రంగా ఉంది. రాముడు బాణప్రయోగంలో చూపిస్తున్న, చేతి నేర్పు విచిత్రంగా ఉంది. రామబాణం వేగంగా వెళ్లి రావణుని తలలను త్రుంచడం చిత్రంగా ఉంది. అందువల్ల ఈ మూడు చిత్రాలను ఆశ్చర్యంతో కొనియాడుతున్నారు.

**విశే :** రామ రావణ యుద్ధంలో ప్రధానంగా మూడు విషయాలు అద్భుతంగా, ఆశ్చర్యకరంగా ఉన్నాయని మొల్ల వర్ణించింది. తలల చిత్రము, రాముని చేతి విచిత్రము, తూపు (బాణం) చిత్రము. తలలు రావణునివి, బాణం రాముని చేతిది. రాముడు ప్రయోగించిన బాణం తిరుగులేనిది. దేవతలకి అరుదయిన దృశ్యమిది.

**ఉ. రావణుఁడేయు బాణములు రాముని బాణము లొక్కపెట్టునన్**
**రావణు మేన నాటియును రామునినాటియు రక్తపూరముల్**

**పూవులతోడి మోదుగను బూర్వగిరీంద్రము మీఁది భానునిన్**
**జేవురుకొండ కాలువల సిందురమున్ తలపించు నెంతయున్.** **93**

**ప్రతి :** రావణుఁడేయు బాణములు, రాముని బాణములు, ఒక్కపెట్టునన్=ఒకేసారిగా, రావణుమేన=రావణుని శరీరంలో, నాటియును=గుచ్చుకొని, రాముని నాటియు=రామునికి గుచ్చుకొని, రక్తపూరముల్=రక్తంధారలుగా కారిపోతూ ఉండడం, పూవులతోడి మోదుగును=నిండుగా పూసిన మోదుగ చెట్టును, పూర్వ గిరీంద్రము= తూర్పుకొండ, మీఁది, భానునిన్=సూర్యుని, జేవురుకొండ=ఎఱ్ఱని రాళ్లతో నిండినకొండ, కాలువల= కొండమీది నుండి ప్రవహించే కాలువ, సిందురమున్=ఎఱ్ఱనిరంగును, తలపించున్=గుర్తుకు తెచ్చును, ఎంతయున్=మిక్కిలిగా.

**తా :** యుద్ధసమయంలో రావణుని మీద రాముడు, రాముని మీద రావణుడు ఒకేసారిగా బాణప్రయోగం చేయగా రావణుని శరీరం మీద, రాముని శరీరం మీద ఆ బాణాలు గుచ్చుకోవడం వల్ల వారి వారి శరీరం నుండి నెత్తురు ఎఱ్ఱగా ప్రవహింపసాగింది. నెత్తురుతో నిండిన ఆ మహావీరులు విరగ పూసిన మోదుగుచెట్టును, తూర్పుకొండ మీద ఉదయిస్తున్న సూర్యుని, జేగురు కొండమీద ప్రవహిస్తున్న ఎఱ్ఱని కాలువని గుర్తు చేస్తున్నారు.

**విశే :** రామరావణులు ఇరువురూ ఒకరిని మించి ఒకరు యుద్ధం చేస్తున్నారు. ఇద్దరూ బాణాల దెబ్బలు తింటున్నారు. వారి వారి శరీరాలు ఎలా ఉన్నాయో చెప్పడానికి మొల్ల మూడు ఉపమానాలు చెప్పింది, పూచిన మోదుగుచెట్టు, ఉదయిస్తున్న సూర్యుడు, జేగురుకొండ మీది కాలువ ఈ మూడిటిని చూడగానే ఎఱ్ఱని రంగు కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

మోదుగుపూలు ఎఱ్ఱగా ఉంటాయి, చూడడానికి అందంగా ఉంటుంది. ఉదయిస్తున్న సూర్యునిలో ఎఱుపుతోపాటు కాంతికూడా ఉంటుంది. జేగురుకొండ మీది కాలువ ఎఱ్ఱగా ప్రవహిస్తూ ఉంటుంది. రామరావణుల శరీరం మీద నుండి రక్తాలు ప్రవహిస్తున్నాయి. ఈ ఉపమానాల ప్రత్యేకత ఇది.

క. **ఒత్తిలి రాముఁడు దైత్యుని**
**కుత్తుక నొక కోలఁద్రుంచి కూల్చుట దొడ్డో!**
**నెత్తురు గ్రమ్మకమున్నే**
**మొత్తములుగఁ దలలు మరల మొలచుట దొడ్డో!** **94**

**ప్రతి :** ఒత్తిలి=మాటిమాటికి, రాముఁడు, దైత్యుని=రావణుని, కుత్తుకన్=కంఠమును, ఒకకోలన్=ఒకే బాణంతో, త్రుంచి=కోసి, కూల్చుట=పడవేయుట, దొడ్డో=గొప్పో, నెత్తురుగ్రమ్మకమున్న=తలలు కోయడంతో వచ్చే నెత్తురు ఇంకా పైకిరాకముందే, మొత్తములుగన్=ఒకేసారిగా, తలలు, మరల=మళ్ళీ, మొలచుట= మొలవడం, దొడ్డో=గొప్పో!

**తా :** మాటిమాటికి రాముడు ఒక్క బాణంతో పది తలలూ కోసి కూల్చడం గొప్పో, కోసినా నెత్తురు చిమ్మకముందే ఆ పదితలలూ ఒక్కసారిగా మళ్లీ మొలవడం గొప్పో!

**విశే :** యుద్ధరంగాన్ని కాని, యుద్ధాన్ని కాని చూడని మహిళామూర్తి ఇలా వర్ణించడం దొడ్డో! అని సంభావించవలసిన సందర్భమిది.

**వ. అని దేవసంఘములు గొనియాడ శ్రీరామచంద్రుండు దైత్య నాయకుని తలలుఁ జేతులుం ద్రుంచి త్రుంచి విసివినం గని విభీషణుండు నరేంద్రున కిట్లనియె. 95**

**తా :** అని దేవతల సమూహాలు కొనియాడగా శ్రీరాముడు రాక్షసనాయకుని తలలు, చేతులు త్రుంచి త్రుంచి విసిగిపోవడం చూసిన విభీషణుడు శ్రీరామునితో ఇలా అన్నాడు.

### విభీషణుఁడు తెలిపిన రావణ మరణ రహస్యము

**క. పోలఁగ నాతని నాభీ**
**మూలంబున నున్న యమృతమును మొదలను ని**
**ర్మూలముగా శ్రీరఘుభూ**
**పాలక! తెగవ్రేయు మగ్ని బాణముచేతన్. 96**

**ప్రతి :** పోలఁగన్=చక్కగ, ఆతని=రావణుని, నాభీమూలంబునన్=బొడ్డు మొదటిలో, ఉన్న=ఉన్నటువంటి, అమృతమును, మొదలను=మొదలంటా, నిర్మూలముగా=పూర్తిగా ఆధారం లేకుండా, శ్రీరఘుభూపాలక!=ఓరామరాజా!, అగ్నిబాణముచేతన్=అగ్నిబాణముతో, తెగవ్రేయుము=ఖండించుము.

**తా :** రామా! రావణుని బొడ్డులో అమృతం ఉంది. దాన్ని మొదలంటా నాశనం అయ్యేలా అగ్నిబాణంతో ఖండించు.

**విశే :** ఇలా రావణుని నాభీమూలంలో అమృతం ఉన్నదనీ, విభీషణుడు ఈ రహస్యం రామునకు చెప్పాడనే ఈ విషయం వాల్మీకి రామాయణంలో లేదు. అధ్యాత్మ రామాయణం నుండి ఈ ఘట్టాన్ని మొల్ల స్వీకరించింది. ఆంధ్రదేశంలో ఈ గాథ బాగా వ్యాప్తిలో ఉంది.

**క. అది తెగిపోయిన పిమ్మటఁ**
**బదితలలును రెట్టి గలుగు బాహులు మరలన్**
**జెదరక తునుమఁగఁ దునుమఁగ**
**దుది ముట్టఁగ మొలుచు నూటతొమ్మిదిమారుల్. 97**

**ప్రతి :** అది=ఆ అమృతము, తెగిపోయిన పిమ్మటన్=పడిపోయిన తరువాత, పదితలలును, రెట్టిగలుగు=రెట్టింపుగాగల పదికి రెట్టింపు ఇరవై, బాహులు=చేతులు, మరలన్=తిరిగి, బెదరక=కంగారుపడక, తునుమఁగ

తునుమఁగన్=ఖండించగా ఖండించగా, మొలుచు, నూట తొమ్మిదిమారుల్=నూటతొమ్మిదిసార్లు, తుదిముట్టగ=పూర్తి అగుటకు.

**తా :** రామ! ఆ అమృతం పోయాక కూడా పదితలలు, ఇరవై చేతులు నువ్వు ఖండించగా బెదరక నూట తొమ్మిదిసార్లు మొలుస్తాయి. అప్పుడుగాని ఈ ప్రక్రియ పూర్తికాదు.

**వ. అంత నంతంబౌ నని విన్నవించిన విని రామభూపాలుండట్లు గావించిన. 98**

**తా :** అప్పుడు రావణుడు అంతం అవుతాడని చెప్పగా రాముడు అలాగే చేసాడు.

**విశే :** 'ఇంటిగుట్టులంకకు చేటు' అనే మాట రావడానికి కారణమయిన ఘట్టమిది.

**క. ఒకతలయు రెండు చేతులు**
**నకలంకస్థితిని గల్గనట్లితనిన్ నేఁ**
**డొకతలఁకు దెచ్చె నౌ నని**
**ప్రకటించిరి సురలు రామభద్రుని నెలమిన్. 99**

**ప్రతి :** ఒక తలయు, రెండుచేతులు, అకలంకస్థితిని=నిర్మలమయిన స్థితి, కల్గునట్లు=కలిగేవిధంగా, ఇతనిన్= ఈరావణుని, నేడు=ఈ రోజు, ఒకతలఁకుదెచ్చెన్=ఒక కొలిక్కి తెచ్చెను, ఔను, అని, ప్రకటించిరి=అందరకు తెలియునట్లు చెప్పిరి, సురలు=దేవతలు, రామభద్రునిన్, ఎలమిన్=ప్రేమతో.

**తా :** ఒక తల, రెండు చేతులు ఉండేలా నిర్మలమయిన స్థితి గలిగేలా చేసి ఈ రోజు ఈ వ్యవహారాన్ని ఒక కొలిక్కితెచ్చాడు రాముడు అని ఆనందంతో దేవతలు ప్రకటించారు.

**విశే :** ఒక తలకు తెచ్చుట అనేది తెలుగు నుడికారం. చాలా అభిప్రాయాలు ఉన్నప్పుడు ఏకాభిప్రాయాన్ని తేవడం అని, ఇక్కడ నిజంగానే పదితలల రావణుని, ఒక తలకు తెచ్చాడు రాముడు. ఒక తల ఉండేలా చేసాడు కదా! అది మొల్ల చమత్కారం.

**తే. అంత నమృతంబు తెగిపోవ నసురవిభుని**
**మేన బాహులుఁ దలలును మిన్న కడఁగి**
**పోయి కనుపట్టె నప్పు దద్భుతము గాఁగ**
**రెండుచేతులు నొకతల గండు మిగుల. 100**

**ప్రతి :** అంతన్=అప్పుడు, అమృతంబు తెగిపోవన్=రావణుని నాభీమూలం నుండి అమృతం తెగిపడిపోగా, అసురవిభునిమేన=రాక్షసరాజు శరీరంలో, బాహులున్= చేతులు, తలలున్=తలలు, మిన్నక=అతిశయించక (మళ్లీ మళ్లీ మొలవక), అడఁగిపోయి=అణగిపోయి, రెండుచేతులు, ఒకతల, గండు మిగుల=గర్వంతో, అద్భుతముగాఁగన్=ఆశ్చర్యం గొలిపేలా, కనుపట్టెన్=కానబడెను, అప్పుడు.

**తా :** రావణుని బొడ్డులోని అమృతం పోగానే అతని శరీరంలో ఇరవైచేతులు పదితలలు అణగిపోయాయి. అద్భుతంగా ఒక తల రెండు చేతులతో గర్వంగా కనబడ్డాడు.

**వ. అంత దైత్యేంద్రుండు తన మనంబున. 101**

**తా :** అప్పుడు రాక్షసేంద్రుడయిన రావణుడు తన మనస్సులో -

**క. ఎవ్వరు నెఱుఁగని మర్మం**
**బివ్విభునకు నెఱుకపఱుప నిటు గావించెన్**
**మవ్వమున నీ విభీషణు**
**క్రొవ్వెల్ల నడంతు నంచుఁ గ్రూరతతోడన్. 102**

**ప్రతి :** ఎవ్వరున్, ఎఱుఁగని, మర్మంబు=రహస్యము, ఇవ్విభునకున్=ఈరాజునకు, ఎఱుకపఱుపన్=తెలియచేసి, ఇటు=ఈ విధముగ, కావించెన్=చేసెను, మవ్వమునన్=ఉత్సాహముతో, ఈ విభీషణు, క్రొవ్వెల్లన్=పొగరుబోతుతనము అంతా, అడంతు=అణచివేస్తాను, అంచున్=అంటూ, క్రూరతతోడన్=క్రూరభావముతో -

**తా :** నాకు సంబంధించిన ఎవ్వరికీ తెలియని ఈ రహస్యం ఈ రాజుకు తెలియచెప్పి నన్ను ఈ విధంగా చేసాడు మంచి ఉత్సాహంతో ఉన్న ఈ విభీషణుని పొగరుబోతుతనమంతా అణిచేస్తాను అంటూ క్రూరభావంతో...

**సీ. తొల్లి వరప్రాప్తి దొరికినయటువంటి**
**రక్తాభ మను మహాశక్తి దివిచి**
**గంధపుష్పాక్షతకలితమై కనుపట్టి**
**విపుల తేజంబున వెలయుచున్న**
**దానిఁబ్రయోగింప దారుణానలతీవ్ర**
**శిఖలు దిక్తటములఁ జెలఁగుచుండ**
**ఘనఘనారావమై ఘంటానినాదంబు**
**శ్రుతిపుటంబులకు నశ్రుతముగాఁగఁ**

**తే. జండతరముగ నట విభీషణునిపైకిఁ**
**జిచ్చు లుమియుచు నుగ్రమై వచ్చుదానిఁ**
**గాంచి రాముండు నిశిత మార్గణముచేతఁ**
**దృణము కైవడి నడిమికిఁ ద్రెంచివైచె. 103**

**ప్రతి :** తొల్లి=పూర్వము, వరప్రాప్తి దొరికినయటువంటి=వరముగా లభించినట్టి, రక్తాభము, అను, మహాశక్తి, తివిచి=పైకితీసి, గంధపుష్పాక్షతకలితమై=గంధము, పువ్వులు, అక్షతలతో కూడి, కనుపట్టి=దర్శనమిచ్చి,

విపులతేజంబున=విశేషమైన కాంతితో, వెలయుచున్న=ప్రకాశించుచున్న, దానిన్, ప్రయోగింప, దారుణానల తీవ్రశిఖలు=భయంకరమైన అగ్నియొక్క వేడి అయిన మంటలు, దిక్తటములన్=దిక్కుల అంచులలో, చెలఁగుచుండ=వ్యాపించుచుండ, ఘనఘనారావమై=గొప్ప దైనమేఘముల చప్పుడు, ఘంటానినాదంబు= గంటలచప్పుడు, శ్రతిపుటంబులకున్=చెవులకు, అశ్రుతముగాఁగన్=వినడానికి శక్యముకాకుండగ, చండతరముగన్=భయంకరరీతిలో, అట, విభీషణునిపైకిన్, చిచ్చులుమియుచు=అగ్నికణాలు కక్కుతూ (చిమ్ముచు), ఉగ్రమై=భయంకరమై, వచ్చుదానిన్, కాంచి=చూచి, రాముడు, నిశిత మార్గణము చేతన్=వాడి అయిన బాణముచేత, తృణముకైవడి=గడ్డిపరకవలె, నడిమికిన్=మధ్యకు, త్రెంచివైచె=విరిచివేసెను,

**తా :** రావణుడు పూర్వం వరముగా దొరికిన రక్తాభము అనే మహాశక్తిని పైకి తీసాడు, అది గంధము పువ్వులు, అక్షతలతో కూడి అధికమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నది. దాన్ని ప్రయోగించాడు. అది భయంకరమయిన మంటలతో దిక్కుల తీరాలన్నిటా వ్యాపించగా, గొప్పవైన మేఘాల చప్పుళ్ళు, ఘంటలు మ్రోగినట్లై చెవులు ఘళ్లుపడగా వినలేకపోగా మహాతీవ్రంగా విభీషణుని మీదికి మంటలు కక్కుతూ భయంకరంగా వచ్చే ఆ శక్తిని గమనించి రాముడు వాడియైన బాణంతో దానిని గడ్డిపరకవలె నడిమికి విరిచివేశాడు.

**వ. ఇట్లు తనశక్తి వృథ యగుటఁ గని దానవేంద్రుండు మానవేంద్రునిపైఁ గరం బలిగి నిట్టూర్పు నిగిడింపుచు నసి ముసల ముద్గర పరశు పట్టిస ప్రాస గదాదండ కోదండ భిండివాలాది సాధనం బుల నవక్రమంబున నాలంబు సేయుచుండగఁ గని విభీషణుం డులికి దేవా! వీఁడు రెండుకరంబులతోడనే మెండుగ యుద్ధంబు సేయం దొడంగె నింక శిరంబులుఁ గరంబులు మరల నుద్భవించెనేనిఁ గార్యంబు దప్పుటకు సందియంబు లేదు. కావున వీని నీలోనన బ్రహ్మాస్త్రంబున నడఁగింపఁ దగు నని విన్నవించిన. 104**

**ప్రతి :** ఇట్లు, తన శక్తి, వృథయగుటన్ కని=వ్యర్థమగుట చూచి, దానవేంద్రుండు=రాక్షసరాజు, మానవేంద్రునిపైన్=నరాధిపుడగు రామునిపై, కరంబు=మిక్కిలి, అలిగి=కోపించి, నిట్టూర్పు, నిగిడింపుచున్= నిశ్వాసము విడుచుచు, అసిముసల ముద్గరపరశు ప్రాసగదాదండకోదండ భిండివాల–ఆదిసాధనంబులన్= ఖడ్గము, రోకలి, ముద్గరము, గొడ్డలి, ఈటె, గద, కర్ర, విల్లు, భిండివాలము మొదలగు సాధనములతో, అవక్రమంబునన్=తెంపు లేకుండా, ఆలంబు=యుద్ధము, చేయుచుండగన్=చేస్తూండగా, కని=చూచి, విభీషణుండు, ఉలికి=ఉలిక్కిపడి/కంగారుపడి, వీఁడు, రెండు కరంబులతోడనే=రెండు చేతులతోనే, మెండుగాన్=బాగుగా, యుద్ధంబు, చేయన్ తొడంగెన్=చేయడం ప్రారంభించాడు, ఇంకన్=ఇంకనూ, శిరంబులు=తలలు, కరంబులు=చేతులు, మరలన్, ఉద్భవించెనేని=పుట్టినట్లైతే, కార్యంబు=పని, తప్పుటకున్= చెడిపోవుటకు, సందియంబులేదు=సందేహము లేదు, కావునన్=అందువలన, వీనిన్, ఈలోనన్=ఈలోగా, బ్రహ్మాస్త్రంబునన్=బ్రహ్మాస్త్రముతో, అడగింపన్ తగున్=అణగించ/చంపదగును, అని విన్నవించినన్=వినతి చేయగా –

**తా :** ఈ విధంగా రాముని బాణంతో తన శక్తి వృథాకావడం చూచిన రావణుడు రాముని మీద మిక్కిలి కోపం తెచ్చుకొని నిట్టూర్పు విడుస్తూ, కత్తి, ముసలము, ముద్గరము, పరశు, పట్టిసము, ప్రాసము, గదా దండము, కోదండము, భిండివాలము మొదలయిన ఆయుధాలతో గొప్ప పరాక్రమంతో యుద్ధం చేయ ప్రారంభించాడు. అపుడు విభీషణుడు ఇంక పదితలలు, ఇరవైచేతులు మళ్లీగాని పుట్టుకొస్తే మనం చేయాలనుకున్న పని (రావణసంహారం) తప్పిపోతుంది అనడానికి సందేహం లేదు. కాబట్టి నువ్వు ఈలోగా బ్రహ్మాస్త్రంబుతో చంపడం మంచిది అని చెప్పగా

**విశే :** రావణుణ్ణి బ్రహ్మాస్త్రంతో చంపమని వాల్మీకి రామాయణంలో మాతలి చెప్పాడు, ఇక్కడ విభీషణుడే చెప్పాడని మొల్ల వర్ణన.

### శ్రీరాముఁడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే రావణుహననము

**మ.** **అనఘుం డుజ్జ్వల చాపదండమున బ్రహ్మాస్త్రంబు సంధించి యొ**
**య్యనఁ గర్ణాంతముగాఁ గడున్ దివిచి ప్రత్యాలీఢ పాదస్థుఁడై**
**దనుజాధీశ్వరు బాహుమధ్యము వడిం దాఁకంగ లక్ష్యంబుగాఁ**
**గొని బిట్టేసె నదల్చి తీవ్రతరమౌ కోపంబు దీపింపఁగన్.** **105**

**ప్రతి :** అనఘుండు=పాపరహితుడు, పుణ్యాత్ముడు, ఉజ్జ్వలచాపదండమున= ప్రకాశిస్తున్నట్టి చాపదండమున, బ్రహ్మాస్త్రంబు, సంధించి=కూర్చి, ఒయ్యన=తిన్నగా, కర్ణాంతముగాన్=చెవి చివరిదాకా, కడున్=మిక్కిలి, తివిచి=పైదాకాతీసి, ప్రత్యాలీఢ పాదస్థుడై=బాణప్రయోగం చేసేటప్పుడు నేలమీద ఎడమకాలు మడిచి, కుడిమోకాలునిల బెట్టడం-ప్రత్యాలీఢ పాదస్థుడు అంటారు, దనుజాధీశ్వరు= రాక్షసరాజు, బాహుమధ్యము= భుజములమధ్య, వడిన్=వేగంగా, తాఁకంగ= తగులునట్లు, లక్ష్యంబుగాగొని=గురిగాపెట్టుకుని, బిట్టేసెన్= వేగంగా ప్రయోగించాడు, అదల్చి=బెదిరించి, తీవ్రతరమౌకోపంబున్=పట్టరాని కోపము, దీపింపగన్= ప్రకాశింపగా.

**తా :** పుణ్యమూర్తి అయిన శ్రీరాముడు తన ఉజ్జ్వల చాపదండమున బ్రహ్మాస్త్రాన్ని సంధించాడు, తిన్నగా చెవుల చివరిదాకా లాగాడు. ప్రత్యాలీఢపాదస్థుఁడై రాక్షసరాజు భుజమధ్యంలో తగిలేలా గురిపెట్టి తీవ్రమైన కోపంతో మండిపడుతూ బెదిరిస్తూ వేగంగా ప్రయోగించాడు.

**విశే :** ప్రత్యాలీఢపాదం=బాణం ప్రయోగించే సందర్భంలో ఉండే ఒకానొక భంగిమ. రావణుని సంహరించే సమయంలో రాముడు ఈ భంగిములో బాణప్రయోగం చేసాడు.

**క.** **ఆ వ్రేటు వడిగ నాటిన**
**రావణుఁ డతి వివశుఁడగుచు వ్రాలె ధరిత్రిన్**
**దేవతతి పొగడి యప్పుడు**
**పూవులవర్షంబు గురిసె భూవరు మీఁదన్.** **106**

**ప్రతి :** ఆ వ్రేటు=ఆ బాణపుదెబ్బ, వడిగ=వేగంగా, నాటిన=నాటుకొనగ, రావణుడు, అతి వివశుడగుచు= మిక్కిలిగ శరీరము స్వాధీనములో లేనివాడగుచు, ధరిత్రిన్=భూమిపై, వ్రాలె=వ్రాలిపోయాడు (చనిపోయాడు) దేవతతి=దేవతల సమూహము, పొగడి=నుతించి, అప్పుడు, భూవరుమీఁదన్=రామభద్రుని మీద పూవుల వర్షంబు గురిసె=పూలవాన కురిపించారు.

**తా :** రాముడు కోపము వృద్ధిచెందగా ప్రయోగించిన బాణపుదెబ్బ వేగంగా నాటుకోగానే రావణుడు వివశుడై నేలకొరిగాడు. దేవతల సమూహం అప్పుడు రాముణ్ణి కొనియాడి అతనిపై పూల వర్షం కురిపించింది.

**విశే :** రామ రావణయుద్ధ వర్ణనలో మొల్ల ఎక్కువగా కందపద్యాలే వ్రాసింది. చివరకు రావణ సంహార విషయం కూడా కందంలోనే చెప్పింది.

**ఉ. సంగరభూమి రావణుఁడు సత్త్వముఁదూలి ధరిత్రిఁ గూలినన్**
**గ్రుంగె భరంబునన్ ధరణి క్రుంగెఁ గులాచల వర్గమెల్ల వే**
**గ్రుంగె దిశాకరీంద్రములు గ్రుంగె మహోరగవంశనాథుఁడున్**
**గ్రుంగె ధులీకులేశ్వరుఁడు క్రుంగె వరాహము గ్రుడ్లు తేలఁగన్. 107**

**ప్రతి :** రావణుడు, సంగరభూమిన్=యుద్ధ భూమిలో, సత్త్వమున్=శక్తిని, తూలి=పోగొట్టుకొని, ధరిత్రిన్ కూలినన్=భూమిమీద, కూలగా, భరంబునన్=భారముతో, ధరణి=భూమి, క్రుంగె=క్రుంగినది=దిగబడినది, కులాచలవర్గ మెల్లన్=కులపర్వతాలన్నీ, వే గ్రుంగె=వేగంగా దిగబడిపోయాయి, దిశాకరీంద్రములు= దిగ్గజాలు– దిక్కులలో ఉండే ఏనుగులు, క్రుంగె, మహోరగ వంశ నాథుఁడున్=నాగజాతికి నాథుడయిన శేషుడు, క్రుంగె, ధులీకులేశ్వరుఁడు=తాబేటిరాజు, వరాహము=ఆదివరాహము, గ్రుడ్లుతేలఁగన్=కన్నులు తేలబడగా–క్రుంగె.

**తా :** యుద్ధభూమిలో రావణుడు శక్తి కోల్పోయి నేల కూలగానే ఆ వార్తతో బరువుతో భూమి దిగబడింది, సప్తకులపర్వతాలు క్రుంగాయి, అష్టదిక్కులలో ఉన్న ఏనుగులు క్రుంగాయి, నాగవంశనాథుడయిన శేషుడు క్రుంగాడు, ధులీకులేశ్వరుడు క్రుంగాడు, కళ్లుతేలవేసి ఆదివరాహం కూడా క్రుంగినది.

**విశే :** దేవతల్ని, అష్టదిక్పాలకుల్ని తన అధీనంలో ఉంచుకున్న మహావీరుడు రావణుడు. అతడు యుద్ధరంగంలో నేలకూలడంతో జగత్తంతా క్రుంగిందని మొల్ల వర్ణన. భూమి, సప్త కులపర్వతాలు, భూమిని మోసే అష్టదిగ్గజాలు, ఆదిశేషుడు, ఆదికూర్మము, ఆదివరాహము కూడా చలించిపోయాయి. అంటే రావణుడు ఎంతటి మహావీరుడో – ఎన్నెన్ని మహాకార్యాలు నిర్వర్తించాడో తెలియవస్తోంది.

**క. జగములకు నెల్లబాధకుఁ**
**దగు రావణుఁ డాజిఁ గూల నంతటితోడన్**
**బగ దీఱె ననుచు రాముఁడు**
**తగఁ దన విల్లెక్కు డించి తమ్ముని కిచ్చెన్. 108**

**ప్రతి :** జగములకునెల్ల=అన్నిలోకాలకు, బాధకుఁడగు=బాధించేవాడయిన, రావణుఁడు, ఆజిన్=యుద్ధములో, కూలన్=చనిపోగా, అంతటితోడన్, పగతీఱెన్ అనుచు రాముఁడు, తగన్=తగురీతిని, తనవిల్లు, ఎక్కుడించి=ఎక్కుపెట్టిన దానిని దింపి, తమ్మునికి, ఇచ్చెన్=ఇచ్చెను.

**తా :** జగాల నన్నిటినీ బాధించే రావణుడు యుద్ధంలో చనిపోవడంతో శ్రీరాముడు ఇంతటితో పగ తీఱిపోయింది అంటూ ఎక్కుపెట్టిన విల్లు దింపి జాగ్రత్తగా తమ్మునికి ఇచ్చాడు.

**సీ. అఖిల లోకమ్ముల కానంద మొదవెను**
**సురల కంటికి నిద్ర సోఁకె నంత**
**మునులు చేసిన తపంబులు చాల ఫలియించెఁ**
**దొడరి సాధ్యులకుఁ దుందుడుకు వాసె**
**గుహ్యకావళికినిఁ గూడు నోటికిఁ బోయె**
**సిద్ధుల తలఁపులు సిద్ధి నొందె**
**దర్వీకరంబుల తల్లడం బడఁగెను**
**గిన్నరసంఘంబు కీడు తొలఁగె**

**తే. గరుడ గంధర్వ ఖేచర గణములకును**
**క్షేమ మింపారె జనపరిణామ మయ్యె**
**వేడ్క లింపొందె బాధలు విఱుగఁడయ్యె**
**సంగరంబున దైత్యుండు సచ్చుకతన. 109**

**ప్రతి :** సంగరంబున=యుద్ధంలో, దైత్యుండు=రాక్షసుడు, చచ్చుకతన=చనిపోవుటవలన, అఖిలలోకమ్ములకు=లోకాలన్నిటికి, ఆనందము, ఒదవెను=సమకూడెను, సురలకంటికి=దేవతల కన్నులకు, నిద్రసోఁకెన్= నిద్ర వచ్చింది, అంత, మునులు చేసిన, తపంబులు, చాల ఫలియిచెన్=ఎక్కువగా ఫలవంతమయ్యాయి, తొడరి=ఉద్యమించు, సాధ్యులకున్, దుందుడుకు=తొందరపాటు తనము, వాసె=పోయెను, గుహ్యకావళికినిన్, కూడు=భోజనము, నోటికిన్, పోయె=వెళ్ళినది, సిద్ధుల, తలపులు=ఆలోచనలు, సిద్ధినొందె=ఫలించినవి, దర్వీకరంబుల=పాముల, తల్లడంబు=ఆందోళన, అడఁగెను=అడగిపోయెను, కిన్నెర సంఘంబు=కిన్నెర సంఘము, కీడు=అపాయము, తొలఁగె=పోయింది, గరుడ, ఖేచర, గణములకును, క్షేమము, ఇంపారె=చక్కగా లభించింది, జనపరిణామమయ్యె=జనులకోరిక ఫలించింది, వేడ్కలు=కోరికలు, ఇంపొందె=అధికమయ్యాయి, బాధలు, విఱుగఁడయ్యె=పోయాయి.

**తా :** యుద్ధంలో రాక్షసుడైన రావణుడు చనిపోవడంతో, లోకాలన్నిటికి ఆనందం కలిగింది. దేవతల కంటికి కునుకు పట్టింది. మునులు చేసిన తపస్సులు అన్నీ ఫలించాయి. సాధ్యులకు కంగారుపడటం తగ్గింది, గుహ్యకావళికి నోటికి అన్నం సహించింది. సిద్ధుల ఆలోచనలకు సిద్ధికలిగింది. నాగుల కలవరపాటు

తగ్గింది. కిన్నెరసంఘాలకు చేటు తొలగింది. గరుడ గంధర్వ ఖేచర గణాలకు క్షేమం ఏర్పడింది. జనుల కోరికలు అతిశయించాయి. యుద్ధంలో రావణుడు చావడం వల్ల అందరి బాధలు విఱుగడయ్యాయి,

**విశే :** కంటికినిద్రసోకె, కూడునోటికి పోయె, బాధలు విఱుగడయ్యె-కందువ మాటలు.

**ఉ. అంత విభీషణుండు తనయన్న పదంబులమీఁద వ్రాలి య**
**త్యంత విషాద దుఃఖజనితాశ్రుకణంబులు రాల నేడ్చె లో**
**కాంతకుఁ డైన రావణుమహాద్భుత దుష్టపరాక్రమంబు భూ**
**కాంతుని ముంగలన్ దడవి గద్గదకంఠ కషాయనేత్రుఁడై. 110**

**ప్రతి :** అంత, విభీషణుఁడు, తన, అన్న, పదంబుల మీఁద, వ్రాలి=పడి, అత్యంత=మిక్కిలి, విషాద దుఃఖజనితాశ్రుకణంబులు=శోకభారంతో దుఃఖవలన పుట్టిన కన్నీటి బిందువులు, రాలన్=రాలగా, ఏడ్చె, లోకాంతకుఁడైన=లోకాన్ని అంతం చేయగల పరాక్రమముగల, రావణు=రావణుని, మహాద్భుత=గొప్ప అద్భుతము తోకూడిన, దుష్టపరాక్రమంబు=చెడుపరాక్రమును, భూకాంతునిముంగలన్=రాముని ఎదుట, తడవి=స్మరించుకొంటు, గద్గదకంఠకషాయనేత్రుఁడై=వణుకుతున్న కంఠముతో ఎఱ్ఱనైన కళ్లతో -

**తా :** అప్పుడు విభీషణుడు లోకకంటకుడైన రావణుని మహాద్భుత దుష్టపరాక్రమాన్ని గురించి రాముని ఎదుట తలచుకుని శోకంవల్ల పుట్టిన కన్నీటి బిందువులు రాలగా అన్నగారి కాళ్లమీద పడి గద్గదకఠంతో ఎఱ్ఱనైన కళ్లతో ఏడ్చాడు,

**విశే :** ధర్మం తప్పాడని అన్నని వదలి వచ్చాడే గానీ సహోదరుడు మరణించడంతో దుఃఖం ఆపుకోలేక ఆతని శౌర్యపరాక్రమాలు తలుచుకుని శ్రీరామునితో చెప్పుకుని ఏడ్చాడు విభీషణుడు. ఎంతచెడ్డా అన్నగారు. అందుకే కాళ్లమీద పడి తనను క్షమించమని కోరుతున్నాడా అనే రీతిలో దుఃఖించాడు.

## మండోదరీ విలాపము

**వ. అట్టి సమయంబున మండోదరి మొదలైన అంతఃపుర సుందరీ సందోహంబు లేతెంచి తమ ప్రాణేశ్వరుండైన రాక్షసకులసార్వభౌముంగని వక్షంబులు శిరములు మోఁదుకొనుచు బహువిధంబులఁ బ్రలపించుచుఁ బరివేష్టించికొని యుండ భూకాంతుండు శాంతాలాపంబుల ననునయించి విభీషణుంగని నీవు దుఃఖం బుడిగి మీయన్నకు నగ్ని సంస్కారాది విధుల నాచరింపు మనిన నతం డట్ల కావించిన యనంతరంబ విభీషణుని లంకానగరంబునకు బట్టంబు గట్టించిన నతండు సుగంధద్రవ్యంబులును నవరత్న ఖచితంబులైన భూషణంబులును జీని చీనాంబరంబులును గానుకగా నిచ్చినం బరిగ్రహించి యవియెల్లను మాతలికిచ్చి ప్రియోక్తులం దనిపి యనిపిన నతండు స్వర్గంబునకుంజనియె నయ్యవసరంబున. 111**

**ప్రతి :** అట్టి సమయంబునన్=రావణుండు మరణించి, విభీషణుడు దుఃఖిస్తున్న ఆ సమయంలో, మండోదరి మొదలైన అంతఃపుర సుందరీసందోహంబులు=అంతఃపురంలోని స్త్రీసమూహాలు, ఏతెంచి=వచ్చి, తమ

ప్రాణేశ్వరుండు+ఐన=తమ భర్త అయిన, రాక్షసకులసార్వభౌమున్‌కని=రాక్షసవంశ మహారాజును చూచి, వక్షంబులు=వక్షస్థలములు, శిరములు=తలలు, మోఁదుకొనుచున్=కొట్టుకుంటూ, బహువిధంబులన్=పలు రకాలుగా, ప్రలపించుచున్=దుఃఖముతో మాట్లాడుతూ, పరివేష్టించుకొనియుండన్=చుట్టూ కూర్చొని యుండగా, భూకాంతుండు=రాజగు రాముడు, శాంతాలాపంబులన్=శాంతి వచనములతో, అనునయించి= ఊరడించి, విభీషణున్ కని=విభీషణుని చూచి, నీవు, దుఃఖంబు ఉడిగి=దుఃఖమును విడిచిపెట్టి, మీయన్నకున్, అగ్నిసంస్కారాది విధులన్=(అంతిమ) అగ్నిసంస్కారము మున్నగు కర్తవ్యములను, ఆచరింపుము=చేయుము, అనినన్=అని పలుకగా, అతండు, అట్ల=అట్లే, కావించినన్=చేయగా, అనంతరంబ=వెంటనే, విభీషణుని లంకానగరంబునకున్, పట్టంబు కట్టించినన్=పట్టాభిషిక్తుని చేయగా, అతండు, సుగంధద్రవ్యంబులును, నవరత్నఖచితంబులైన=నవరత్నములు పొదగబడినట్టి, భూషణంబులును= అలంకారములును, చీనిచీనాంబరములును, కానుకగాన్=బహుమతిగా, ఇచ్చినన్=ఈయగా, పరిగ్రహించి= తీసికొని, అవియెల్లను=వాటినన్నింటిని, మాతలికిన్, ఇచ్చి, ప్రియోక్తులన్=ఇష్టమగు మాటలతో, తనిపి= తృప్తిపరచి, అనిపినన్=పంపగా, అతండు, స్వర్గంబునకున్, చనియెను=వెళ్ళెను, అయ్యవసరంబునన్ (ఆ+ అవసరంబునన్)=ఆ సమయమున...

**తా :** ఆ సమయంలో మండోదరీ మొదలయిన అంతఃపురసుందరులు రావణుని భార్యలు తమ ప్రాణేశ్వరుడు రాక్షసకులసార్వభౌముడు, అయిన రావణుని చూచి గుండెలు తల బాదుకొంటూ అనేక విధాలుగా ఏడుస్తూ రావణుని చుట్టూ ఉండగా శ్రీరాముడు వారిని శాంత వచనాలతో ఓదార్చి ధైర్యం చెప్పాడు. విభీషణుని చూచి నువ్వుకాస్త ఊరడిల్లి మీ అన్నగారికి అగ్నిసంస్కార విధులు చేయుము అని చెప్పాడు. విభీషణుడు భక్తితో ఆ కార్యక్రమాలు పూర్తిచేసాడు. ఆ తరువాత విభీషణుని లంకానగరానికి పట్టం కట్టించాడు. ఆ సందర్భంలో విభీషణుడు రామునికి-సుగంధద్రవ్యాలు, నవరత్నఖచితమైన భూషణాలు, చీనిచీనాంబరాలు కానుకగా ఇచ్చాడు. వాటిని స్వీకరించి వాటినన్నిటిని మాతలికిచ్చి ప్రేమపూర్వకంగా వీడ్కోలు చెప్పాడు రాముడు. మాతలి ఆనందంతో స్వర్గానికి వెళ్లాడు. ఆ సమయమున -

## విభీషణుఁడు శ్రీరాముని విజయ వార్తను సీతకు నివేదించుట

**సీ.** **ఆలోన రాఘవుండా విభీషణుఁ జూచి**
**సత్ప్రీతియుక్తి మై సరగఁ బిలిచి**
**పంక్తికంధరు నాజిఁ బరిమార్చితి నటంచు**
**వసుమతీతనయకు వార్త సెప్పి**
**నీ దేవి మొదలగు నీరజాక్షులచేత**
**నతివకు శృంగార మమరఁ జేసి**
**కొంచు రమ్మని చెప్ప నంచితగతి నేఁగి**
**సరమాది సతుల కా సరణిఁజెప్ప**

**తే.** **సతులు నిర్మలజలముల జలక మార్చి**
**పట్టుపుట్టంబు ముదమునఁ గట్టఁ బెట్టి**
**చందన మలంది సురభి పుష్పములు ముడిచి**
**మేలిమణిభూషణంబుల సాలఁ దొడిగి.** **112**

**ప్రతి :** ఆలోన=అంతలో, రాఘవుండు=శ్రీరాముడు, విభీషణున్, చూచి, సత్ప్రీతి యుక్తిమై=ప్రీతితో కూడినవాడై, సరగ=వేగంగా, పిలిచి, పంక్తికంధరున్=రావణుని, ఆజిన్=యుద్ధములో, పరిమార్చితిన్=చంపితిని, అటంచు= అని, వసుమతీ తనయకు=భూపుత్రికకు, వార్త=కబురు, చెప్పి, నీదేవి=నీ భార్య, మొదలగు, నీరజాక్షులచేత= స్త్రీలచేత, అతివకు=సీతకు, శృంగారము=అలంకరణ, అమరన్=తగునట్లుగ,చేసి, కొంచురమ్మని= తీసుకొని రమ్ము అని, చెప్పన్=చెప్పగ, అంచిత గతిన్=వేగముగ, ఏఁగి=వెళ్ళి, సరమ+ఆది సతులకు=సరమ+ మొదలయిన స్త్రీలకు, ఆసరణిన్=ఆ విధానము, చెప్ప, సతులు=ఆ స్త్రీలు, నిర్మలజలముల=స్వచ్ఛమగు నీటితో, జలకమార్చి= స్నానం చేయించి, పట్టుపుట్టంబు=పట్టుచీర, ముదమునన్=ఆనందముతో, కట్టన్, పెట్టి=అలంకరించి, చందనము=మంచిగంధము, అలంది=పూసి, సురభి=సువాసనగల, పుష్పములు=పువ్వులు, ముడిచి= తలలోపెట్టి, మేలిమణిభూషణంబులు=మేలైనమణులతో కూడిన ఆభరణాలను, చాలన్=ఎక్కువగ, తొడిగి=అలంకరించి.

**తా :** అంతలో రాముడు విభీషణుని చూచి ప్రేమతో వేగంగా రమ్మని పిలిచి, రావణుని యుద్ధంలో చంపాను అనే వార్త భూపుత్రి అయిన సీతకు చెప్పి, నీభార్య మొదలయిన స్త్రీలచేత సీతను అలంకరించి తొందరగా ఇక్కడకు తీసుకొని రమ్ము అని చెప్పాడు. విభీషణుడు, అతివేంగా వెళ్లి తన భార్య సరమ మొదలయిన సతులకు రాముడు చెప్పిన విషయమంతా చెప్పగా, వారు స్వచ్ఛమైన జలములతో సీతాదేవికి స్నానం చేయించి, పట్టుచీర అందంగా కట్టారు. చందనం పూశారు, మంచిసువాసన గల పువ్వులు ఆమె తలలో అలంకరించారు. ప్రశస్తమయిన మణులతో కూడిన నగలు చాలా తొడిగారు.

**క.** **ఇందిరతో సరి యగు నా**
**సుందరిఁ ద్రైలోక్యమాత సొబ గొందఁగఁ దా**
**రందలమునఁ గొని వచ్చిరి**
**కందర్పనిభుండు రామునికడకుం బ్రీతిన్.** **113**

**ప్రతి :** ఇందిరతో=లక్ష్మీదేవితో, సరియగు=పోల్చదగిన, ఆ, సుందరిన్=ఆ సౌందర్యమూర్తిని, త్రైలోక్యమాత= ముల్లోకాలకుతల్లి, సొబగు=సౌందర్యము, ఒందఁగన్=ప్రకాశింపగా, తారు=వారు ఆస్త్రీలు, అందలమునన్= మేనాలో, కందర్పనిభుండు=మన్మథునివంటి, రామునికడకున్=రాముని వద్దకు, ప్రీతిన్=సంతోషముతో, కొనివచ్చిరి=తీసుకొనివచ్చిరి.

**తా :** సీతాదేవి సాక్షాత్తు లక్ష్మీదేవిలా ఉంది. ఆ సుందరి మూడులోకాలకు తల్లివలె ప్రకాశిస్తున్నది. అట్టి ఆమెను వారు మేనాలో మన్మథుని వంటి రాముని వద్దకు ప్రీతితో తీసుకువచ్చారు.

**విశే :** సీతాదేవి సాక్షాత్తూ త్రిపుర సుందరీదేవి అనే విషయాన్ని ఈపద్యంలో మొల్ల ఆవిష్కరించింది.

## సీత యగ్నిప్రవేశము

**వ. ఇట్లు గొనివచ్చి రామభూపాలుని సమ్ముఖంబున నునిచిన నద్ధరాతనూజాత పతికి వినయభక్తి తాత్పర్యంబులు వెలయఁ బ్రణమిల్లిన నతండు వనితారత్నం బగుసీతం గనుంగొని యిట్లనియె. 114**

**తా :** ఈ విధంగా తీసుకుని వచ్చి రామభూపాలుని ఎదుట నిలుపగా, ఆ భూపుత్రి సీత భర్త శ్రీరామచంద్రునకు వినయము భక్తి ప్రకటమయ్యే రీతిలో నమస్కరించింది. ఆ రాముడు స్త్రీరత్నమయిన సీతను చూచి ఇట్లా అన్నాడు.

**విశే :** రాముడు చూసిన సీత వనితారత్నమే. అయినా అతని ధోరణి తరువాతి పద్యంలో చూడండి.

**క. కులసతిఁ జెఱ గొనిపోయిన**
**యల శాత్రవు గెలువ నోపఁ డను పలుకులకున్**
**గెలిచితిఁ బగ చంపితి నిఁక**
**నెలఁతా! నీయిచ్చఁ జనుము నే నిన్నొల్లన్. 115**

**ప్రతి :** కులసతిన్=పద్ధతిగా వివామాడిన ధర్మపత్నిని, చెఱగొనిపోయిన=బంధించి తీసుకొని పోయిన, అల శత్రువు=ఆ శత్రువుని, గెలువనోపఁడను=గెలవలేక పోయాడు, అను పలుకులకున్=అనేమాటలు పడవలసి వస్తుంది అని, పగ చంపితి=శత్రువుని చంపాను, గెలిచితి=విజయం సాధించాను, ఇఁక=ఇక, నెలఁతా!= ఓ సీతా!, నీయిచ్చన్=నీకు ఇష్టమైన చోటికి, చనుము=వెళ్ళుము, నే, నిన్ను, ఒల్లను=స్వీకరించను, ఏలుకోను.

**తా :** ధర్మపత్నిని బధించిన శత్రువుని శిక్షించలేకపోయాడు, గెలవలేకపోయాడు అనే మాటలు పడడం ఇష్టంలేక శత్రువుని చంపాను, విజయం సాధించాను. ఓ సీతా! నేను నిన్ను ఏలుకోను. నువ్వు నీ ఇష్టం వచ్చినచోటికి వెళ్ళు అన్నాడు రాముడు.

**ఆ. అనుచుఁ బలుకుపలుకు లవనీతనూజాత**
**కర్ణములకు వాఁడి గలుగునట్టి**
**నారసములు సోఁకి నాటిన యట్లైన**
**సరసిజాక్షి మూర్ఛఁ జాలి నొంది. 116**

**ప్రతి :** అనుచు=ఆ విధంగా, పలుకు పలుకులు=మాట్లాడుతున్న మాటలు, అవనీతనూజాత=భూపుత్రి అయినసీత, కర్ణములకు=చెవులకు, వాఁడి=తీక్షణత కలుగునట్టి, నారసములు=బాణాలు, సోఁకి=తగిలి, నాటిన=నాటుకున్నట్లు గుచ్చుకొన్న, అట్లైన=అటులుకాగా, సరసిజాక్షి=తామర పూలవంటి కన్నులు గల సీత, జాలిన్=జాలితో మూర్ఛన్, ఒంది=పొంది.

**తా :** రాముడు ఆవిధంగా మాట్లాడిన మాటలు సీత చెవులకు వాడియైన బాణాలు గుచ్చుకున్నట్లుకాగా అమె జాలిగా మూర్ఛపోయింది.

**చ. నరవర! నాదుచిత్తము మనంబున నీవ యెఱింగియుండియున్**
**బరుషము లాడ నేమిటికిఁ బాపము నాయెడ లేదు కాదుపో**
**సురలు నుతింప మేటిసొదఁ జొచ్చెద మెచ్చుఁడటన్న రామభూ**
**వరుని మనం బొడంబడిన వారిజలోచన సీత యా తఱిన్. 117**

**ప్రతి :** నరవర!=నరులలో శ్రేష్ఠుడవయిన ఓ రామా!, నాదు చిత్తము=నామనస్సు, మనంబున=మనస్సున, నీవ=నీవే, ఎఱింగియుండియున్=తెలిసికూడా, పరుషములు= కఠినమైన, ఆడనేమిటికిన్=మాటలు మాట్లాడడం దేనికి, పాపము=చెడుచింతన, నాయెడ=నాయందు, లేదు, కాదుపో=లేదు నువ్వు నమ్మను అంటే, సురలు=దేవతలు, నుతింప=కొనియాడునట్లు, మేటిసొదన్=పెద్దమంటలో, చొచ్చెద=ప్రవేశిస్తాను, మెచ్చుఁడు=మెచ్చుకోండి, అటన్న=అని అనగా, రామభూవరుని=రాముని, మనంబు=మనస్సు, ఒడంబడిన= ఒప్పుకొనగా, వారిజలోచనసీత=పద్మములవంటి కన్నులు గల సీత, ఆ తఱిన్=ఆ సమయములో

**తా :** నరవరా! నా మనస్సేమిటో నీవు నీ మనస్సులో ఎఱిగి కూడా ఇలా పరుషమైన మాటలు ఎందుకు పలుకుతున్నావు, నా యెడల ఎలాంటి పాపమూ లేదు. కాదు నేనమ్మను అంటావా? దేవతలు కొనియాడే విధంగా అగ్నిలో ప్రవేశిస్తాను. అప్పుడు నమ్మి మెచ్చుకోండి అంది. శ్రీరాముని మనస్సు ఆ మాటకు ఒప్పుకొంది. ఆసమయంలో పద్మనేత్ర అయిన సీత...

**క. హృదయేశుఁ డలర నప్పుడ**
**సొదఁ జొచ్చెను భూమిపుత్త్రి సురలు నుతింపన్**
**ముద మంది పద్మభవుఁడా**
**యదనం బ్రత్యక్ష మయ్యె నౌ నౌ ననుచున్. 118**

**ప్రతి :** హృదయేశుఁడు=హృదయానికి ప్రభువువైన శ్రీరాముడు, అలరన్=ఆనందపడునట్లు, అప్పుడ= ఆ క్షణంలోనే, సొదన్=అగ్నిలో, చొచ్చెను=ప్రవేశించెను, భూమిపుత్రి=సీత, సురలునుతింపన్, ముదమంది= సంతోషపడి, పద్మభవుఁడు=పద్మము నుండి పుట్టినవాడు బ్రహ్మదేవుడు, ఆ, అదనన్=సమయంలో ఔను, ఔను, అంటూ ప్రత్యక్షమయ్యాడు.

**విశే :** హృదయేశ్వరుడు! రాముడు. నువు ఎక్కడికయినా వెళ్లు, నిన్ను నేను ఒల్లను అని పరుషంగా మాట్లాడినా, శ్రీరాముణ్ణి హృదయేశ్వరునిగా సంబోధించి గౌరవించింది సీత.

అగ్నిప్రవేశం చేసిన సీతను చూసి బ్రహ్మ ఆనందపడి– ఔను ఔను అంటూ ప్రత్యక్షమయ్యాడు. ఔను ఔను అంటే–ఏమిటి ఔను–సీత మనస్సులో రాముడే ఉన్నాడు. ఆ మాట నిజము! నిజము! అని అర్థం. సీత 'పాపము నాయెడ లేదు కాదుపో' అన్నది. సీతయెడల పాపము లేదు అన్నమాట – ఔను ఔను అంటూ

ఆమ్రేడితంగా బ్రహ్మ నొక్కిచెప్పాడు. ఒకసారి కాక రెండుసార్లు చెప్పడంవల్ల నొక్కి వక్కాణించినట్లయింది. పునరుక్తి ఇక్కడ గుణమే!

## బ్రహ్మ సీత సౌశీల్యమును బ్రస్తుతించుట

**ఆ. అంతఁ బద్మగర్భుఁ డవనీశుఁడగు రామ**
**భద్రుఁ జూచి పలికెఁ బరమపురుష!**
**వనజ నేత్ర సీతవలన దోసము లేదు**
**నమ్ము వసుమతీశ! నాదుమాట. 119**

**ప్రతి :** అంతన్=అప్పుడు, పద్మగర్భుఁడు=బ్రహ్మదేవుడు, అవనీశుఁడగు=రాజగు, రామభద్రున్, చూచి, పలికెన్, పరమపురుష!, వనజనేత్ర=తామరలవంటి కన్నులు గల, సీత వలన, దోసము, లేదు, వసుమతీశ!=రాజా, నాదుమాట, నమ్ము.

**తా :** అప్పుడు బ్రహ్మ రామభద్రుణ్ణి చూసి పరమపురుషా! సీతయందు ఎలాంటి దోషమూలేదు. రాజా! నామాట నమ్ము.

**విశే :** పరమపురుష! బ్రహ్మ రాముణ్ణి పరమపురుష! అని సంబోధించాడు. రామా! నువ్వు కేవలం నరుడవు కావు, సాక్షాత్తూ పరమపురుషుడవు - నారాయణుడవు, నరునిగా పుట్టడంవల్ల ఈ విధంగా నీ భార్యను శంకిస్తున్నావు, సీతలో ఏదోషమూ లేదు నామాట నమ్ము అన్నాడు! పరమపురుష! అని సంబోధన అర్థవంతమయినట్టిది. సాభిప్రాయ విశేషణమిది.

**వ. అని పలికిన పితామహునిమాటల కుభయసేనలును సంతసిల్లినవి. అనంతర మగ్ని భగవానుండు నయ్యంగనం గొనివచ్చి పరమ పతివ్రతాభరణం బగు నిద్ధరాతనూజాతం గైకొమ్మని యప్పగించిన నయ్యెడ దశరథుండు ప్రసన్నుండైన శ్రీరామచంద్రుడు సతీసమేతుండై తానును నమస్కరించినం గుమారద్వయంబును గోడలిని నాలింగనంబు చేసి తద్దుఃఖంబులం బాపి చనియె నప్పుడు సకలదేవతలు నిట్లనిరి. 120**

**ప్రతి :** అని=ఆ విధంగా, పలికిన పితామహునిమాటలకున్=చెప్పిన బ్రహ్మయొక్క మాటలకు, ఉభయ సేనలును=వానర రాక్షససేనలు రెండును, సంతసిల్లినవి=సంతోషించినవి, అనంతరము=తరువాత, అగ్నిభగవానుండున్=అగ్నిదేవుడును, అయ్యంగనన్ (ఆ+అంగనన్)=ఆ స్త్రీని (సీతమ్మను), కొనివచ్చి=తీసికొని వచ్చి, పరమ పతివ్రతాభరణంబు=గొప్ప పతివ్రతలకే అలంకారము, అగున్=అనదగు, ఇద్ధరాతనూజాతన్ (ఈ+ధరాతనూజుతన్)=ఈ భూపుత్రికను సీతను, కైకొమ్ము అని=స్వీకరింపుమని, అప్పగించినన్=అర్పించగా, అయ్యెడన్ (ఆ+ఎడన్)=ఆ చోటున, దశరథుండు, ప్రసన్నుండైన, ఈ రామచంద్రుఁడు, సతీసమేతుండై= భార్యతో కూడినవాడై, తానును, నమస్కరించినన్=నమస్కరించగా, కుమారద్వయంబును=కొడుకులిద్దరిని, కోడలినిన్, ఆలింగనంబుచేసి=కౌగిలించుకొని, తద్దుఃఖంబులన్=వారి దుఃఖములను, పాపి=పోగొట్టి, చనియెన్=వెళ్ళెను, అప్పుడు, సకల దేవతలును, ఇట్లు, అనిరి.

**తా :** ఆ విధంగా పితామహుడుయిన బ్రహ్మ పలికిన మాటలకు వానర రాక్షససేనలు రెండూ ఆనందపడ్డాయి. ఆ తరువాత అగ్నిదేవుడు ఆ సీతమ్మను స్వయంగా తీసుకొని వచ్చి పరమపతివ్రతాభరణంబగు ఈ భూపుత్రిని స్వీకరించుమని రామునికి అప్పగించాడు. ఆ సమయంలో దశరథమహరాజు ప్రత్యక్షమయ్యాడు. శ్రీరాముడు సతీసమేతుడై తమ్ముడు తాను భక్తితో నమస్కరించారు. ఇద్దరు కొడుకుల్ని కోడలిని కౌగలించుకొని వారి దుఃఖాన్ని పోగొట్టి వెళ్ళాడు దశరథుడు. ఆ సమయంలో దేవతలందరు ఇలా అన్నారు.

### దేవతలు చేసిన శ్రీరామ స్తోత్రము

**క.** **మాకొఱకు జనన మొందితి**
**రాకాసులరాజుఁ జంపి రక్షించితి వౌ**
**లోకంబు లెల్లఁ గృపతో**
**సాకేతపురాధినాథ! సజ్జనవినుతా!** **121**

**ప్రతి :** మాకొఱకు, జననమొందితి=పుట్టావు, రాకాసుల=రాక్షసుల, రాజున్=రాజయిన రావణుని, చంపి, లోకంబులెల్లన్=అన్ని లోకాలను, కృపతో=దయతో, రక్షించితివి, ఔ=ఓ, సాకేతపురాధినాథ!, సజ్జనవినుతా!= సజ్జనుల చేత కొనియాడబడేవాడా.

**తా :** సాకేతపురానికి రాజా! సజ్జనవినుతా! నువ్వు మాకోసం రామునిగా పుట్టి రాకాసుల రాజయిన రావణుణ్ణి చంపి దయతో లోకాలనన్నిటిని రక్షించావు, ఔను.

**విశే :** దేవతలందరూ లోకకంటకుడయిన రావణుని చేష్టలు విష్ణుమూర్తికి విన్నవించినప్పుడు తాను నరునిగా పుట్టి రావణసంహారం చేస్తాను అని మాట ఇచ్చాడు. ఎవ్వరి వల్లా చావురాకూడదనే వరం కోరే సందర్భంలో రావణుడు నరులను వానరులను చెప్పక వదిలేసాడు. అందువల్ల ఆ వైకుంఠనాథుడు మానవునిగా కౌసల్యా గర్భాన జన్మించాడు. మాకొఱకు జననమొందితి అని ప్రశంసిచడంలోని సంగతి ఇది.

**క.** **అని వినుతి సేసి కలనన్**
**జనిపోయిన కపుల నెల్ల సత్కృప బ్రదుకుం**
**డని వరము లిచ్చి యరిగిరి**
**ఘను లా దేవతలు మరలి గగనంబునకున్.** **122**

**ప్రతి :** అని, వినుతి సేసి=విశేషంగా కొనియాడి, కలనన్=యుద్ధంలో, చనిపోయిన, కపులన్, ఎల్లన్=అందరినీ, సత్కృపన్=దయతో, బ్రతుకుండు, అని, వరములు, ఇచ్చి, ఘనులు=గొప్పవారు, ఆదేవతలు, గగనంబునకున్= ఆకాశానికి దేవలోకానికి, మరలి=తిరిగి, అరిగిరి=వెళ్లిరి.

**తా :** ఆ విధంగా శ్రీరాముని విశేషంగా కొనియాడి, యుద్ధంలో చనిపోయిన వానరులందరినీ తిరిగి జీవించేవిధంగా దయతో వరం ఇచ్చి గొప్పవారైన ఆ దేవతలందరూ దేవలోకానికి తిరిగి వెళ్లారు.

**విశే :** రామరావణయుద్ధంలో ఒక్క వానరుడు కూడా మరణించలేదన్న మాట. దేవకార్యంలో ప్రాణాలు కోల్పోయిన వారికి దేవతలు ప్రాణంపోసి మరీ వెళ్లారు.

**వ. తదనంతరంబున. 123**

**తా :** ఆ తరువాత

**తే. భానుపుత్త్రాది వానరబలముతోడ**
**ఘనవిభీషణముఖ్యరాక్షసులతోడ**
**మఱియు జానకి తోడ లక్ష్మణునితోడఁ**
**బుష్పకంబెక్కి చనియె నాభూమివిభుఁడు. 124**

**ప్రతి :** భానుపుత్రాది=సుగ్రీవుడు మొదలైన, వానరబలముతోడ, ఘనవిభీషణ ముఖ్య=ఘనుడైనవిభీషణుఁడు మొదలైన, రాక్షసులతోడ, మఱియు, జానకితోడ, లక్ష్మణుని తోడన్, పుష్పకంబు=పుష్పకవిమానము, ఎక్కి చనియెన్, ఆ భూమి విభుఁడు=ఆ రాముడు.

**తా :** ఆ శ్రీరామచంద్రుడు సుగ్రీవుడు మొదలయిన వానరబలంతో ఘనవిభీషణ ముఖ్య రాక్షసులతోను, సీతాలక్ష్మణులతోను కలిసి పుష్పక విమానం ఎక్కి అయోధ్యకు ప్రయాణమయ్యాడు.

## సీతాలక్ష్మణసుగ్రీవాదులతోఁ బుష్పకవిమానమున శ్రీరాముని పయనము

**వ. ఇట్లు పుష్పకారూఢుండై చనుచుండి రామభూకాంతుండు కాంతా రత్నంబునకుఁ జేయెత్తి చూపుచు సంగ్రామస్థలం బిదె రావణ కుంభకర్ణాదులైన రాక్షసబలంబును మర్దించిన తా విదె సువేలాచలం బిదె సముద్రంబునన్ బంధించిన సేతుబంధనం బిదె విభీషణుఁడు మమ్ము శరణుచొచ్చిన ప్రదేశం బిదె సుగ్రీవుని కిష్కింధానగరం బిదె ఋశ్యమూకాచలం బిదె వాయుతనూభవుండు మమ్ము బొడగన్న తా విదె పంపాసరోవరంబునిదె కబంధుండను దానవుని వధించిన ప్రదేశం బిదె జటాయువను పక్షీంద్రుండు నిన్ను గొనిపోవునప్పుడు రావణాసురుని తోడంబోరి మడిసినస్థానం బిదె జనస్థానం బిదె దశవదనుండు నిన్నుఁ జెఱఁ గొని పోయిన చో టిదె మాయామృగంబును బడనేసిన చోటిదె ఖరదూషణాదులు నాతోడఁ బోరి పొలసిన తావిదె శూర్పణఖ యనుదాని ముక్కుసెవులుం జెక్కిన యిక్క యిదె సుతీక్ష్ణుండను మునీంద్రుండు వర్తించు నాశ్రమం బిదె యగస్త్యాశ్రమం బిదె యత్రి మహామునీంద్రుని పత్ని యనసూయాదేవి యంగరాగంబులు నీకిచ్చిన చక్కి యిదె విరాధుం డనురాక్షసుండు నిన్నుఁ బట్టుకొనిపోవుచుండ విడిపించిన చోటిదె చిత్ర కూటాచలం బిదె భరతుండు మనల నొడంబఱచి మరలఁ గొనిపోవ వచ్చిన చో టిదె గంగానది యల్లదే కనుంగొను మని చెప్పుచు భరద్వాజా శ్రమంబుఁ జేరంజని యచ్చటఁ బుష్పకంబుడిగ్గి యమ్మునీంద్రునకు నమస్కరించిన నతండు రాముని దీవించిన మహానందంబు నొంది యనిలసంభవా! వేవేగ నీవేఁగి నందిగ్రామమ్మున నున్న భరతునకు మారాక యెఱింగించి రమ్మని యనిపిన. 125**

**ప్రతి :** ఇట్లు, పుష్పకారూఢుండై=పుష్పక విమానమును ఎక్కినవాడై, చనుచుండి=వెళ్ళుతూ, రామభూకాంతుండు=రామరాజు, కాంతారత్నంబునకున్=నారీరత్నమగు సీతకు, చేయెత్తి చూపుచున్, సంగ్రామస్థలంబు ఇదె=ఇదే యుద్ధము జరిగిన స్థలము, రావణకుంభకర్ణాదులైన రాక్షసబలంబును= రావణ కుంభకర్ణాది రాక్షససైన్యమును, మర్దించినతావు=సంహరించిన ప్రదేశము, ఇదె, సముద్రంబునన్, బంధించిన= కట్టిన, సేతుబంధనంబు=ఆనకట్ట, ఇదె, విభీషణుండు, మమ్ము, శరణుచొచ్చిన=రక్షణ కోరిన, ప్రదేశంబు, ఇదె, సుగ్రీవుని కిష్కంధానగరంబు, ఇదె, ఋశ్యమూకాచలంబు=ఋష్యమూక పర్వతము, ఇదె, వాయుతనూభవుండు=వాయుసుతుడు హనుమ, మమ్ము, పొడగన్న తావు=చూచిన చోటు, ఇదె, పంపాసరోవరంబును ఇదె=పంపాసరస్సు ఇదే, కబంధుఁడను, దానవుని=రాక్షసుని, వధించిన ప్రదేశంబు= చంపినచోటు, ఇదె, జటాయువు అను, పక్షీంద్రుండు=పక్షిరాజు, నిన్నుకొనిపోవునప్పుడు=నిన్ను తీసికొని వెళ్ళునప్పుడు, రావణాసురుని తోడన్=రావణునితో, పోరి=యుద్ధము చేసి, మడిసినస్థానంబు ఇదె=మరణించిన చోటు ఇదె, దశవదనుండు=రావణుడు, నిన్నున్, చెఱఁగొని=చెఱబట్టిపోయిన చోటు ఇదే, వెళ్ళిన ప్రదేశము ఇదే, మాయామృగంబును=మాయలేడిని, పడనేసిన చోటు ఇదె=పడగొట్టిన చోటు ఇదే, ఖరదూషణాదులు, నాతోడన్, పోరి=యుద్ధముచేసి, పొలసిన తావు ఇదె=మరణించిన చోటు ఇదే, శూర్పణఖ యనిదాని ముక్కుచెవులన్, చెక్కిన=కోసిన, ఇక్క=ప్రదేశము, ఇదె, సుతీక్ష్ణుండు అను మునీంద్రుండు, వర్తించునాశ్రమంబు ఇదె=నివసించు ఆశ్రమము ఇదే, అగస్త్యాశ్రమంబు, ఇదె, అత్రిమహామునీంద్రుని, పత్ని యనసూయాదేవి, అంగరాగంబులు=శరీరముపై పూసుకొను సుగంధపు పొడులు, నీకున్, ఇచ్చిన చక్కి=ఇచ్చిన ప్రదేశము, ఇదె, విరాధుండు అను రాక్షసుండు, నిన్ను, పట్టుకొనిపోవుచుండన్=పట్టుకువెళుతూ ఉండగా, విడిపించిన చోటు ఇదే, చిత్రకూటాచలంబు=చిత్రకూట పర్వతము, ఇదే, భరతుండు, మనలన్, ఒడంబఱచి=ఒప్పించి, మరలన్=మళ్ళీ, గొనిపోవ వచ్చినచోటిదె=తీసికొనిపోవుటకు వచ్చిన ప్రదేశము ఇదే, గంగానది, అల్లదే= అల్లదిగో, కనుంగొనుము=చూడుము, అని చెప్పుచున్, భరద్వాజాశ్రమంబున్, చేరంజని=చేరుటకు వెళ్ళి, అచ్చటన్, పుష్పకంబు, డిగ్గి=దిగి, అమ్మునీంద్రునకున్=ఆ మునిశ్రేష్ఠునకు, నమస్కరించినన్, అతండు, రాముని, దీవించినన్=దీవించగా, మహానందంబున్=గొప్ప ఆనందము, ఒంది=పొంది, అనిల సంభవా!= వాయుపుత్రా!, వేవేగన్=మిక్కిలి వేగంగా, నీవు, ఏగి=వెళ్ళి, నందిగ్రామమ్మునన్=నందిగ్రామంలో, ఉన్న భరతునకున్, మారాక=మేము వచ్చుటను, ఎఱింగించి=తెలిపి, రమ్ము అని, అనిపినన్=పంపగా.

**తా :** ఈ విధంగా పుష్పకం ఎక్కివెళుతూ శ్రీరాముడు కాంతారత్నమయిన సీతకు చేయెత్తి చూపిస్తున్నాడు వరుసగా ఇదిగో ఇది యుద్ధం జరిగిన ప్రదేశం, రావణుడు కుంభకర్ణుడు మొదలయిన రాక్షసబలాన్ని సంహరించిన చోటు ఇదే, ఇదిగో ఇది సువేలాచం. ఇదిగో చూడు. సముద్రంమీద కట్టిన సేతువిదే! విభీషణుడు నన్ను శరణుచొచ్చిన ప్రదేశం ఇది, సుగ్రీవుని కిష్కింధానగరమిదే, వాలిని నేల కూలవేసిన చోటు ఇదిగో, సుగ్రీవుడు మమ్మల్ని చూసిన ప్రదేశం ఇదే, ఇది ఋష్యమూక పర్వతం, ఇదిగో ఈ స్థలంలోనే హనుమంతుడు మమ్మల్ని కలుసుకున్న స్థలం. ఇదిగో ఇదే పంపాసరోవరం, నేను కబంధుణ్ణి చంపిన

చోటు ఇదే, ఇదిగో నిన్ను అపహరించుకుపోతున్న రావణాసురునితో యుద్ధంచేసి జటాయువు అనే పక్షిరాజు నేలపడి మరణించిన చోటు ఇదే, ఇదిగో ఇదే జనస్థానం, దశవదనుడు నిన్ను చెఱగొని పోయిన చోటు ఇదిగో, మాయామృగాన్ని నేను పడవేసిన చోటు ఇదే, ఖరదూషణాదులు నాతో యుద్ధం చేసి చనిపోయిన తావు ఇదే, శూర్పణఖ ముక్కూ, చెవులూ చెక్కిన ప్రదేశమిదే. సుతీక్ష్ణుఁడు అనే మహర్షి నివసించే ఆశ్రమమిదే, ఇదిగో అగస్త్యాశ్రమం, ఇది అత్రిమహాముని ఆశ్రమం ఆ మహర్షి పత్ని అనసూయాదేవి నీకు ప్రేమతో అంగరాగంబులు ఇచ్చిన చోటు ఇదే, విరాధుడు అనే రాక్షసుడు నిన్ను పట్టుకుపోతూ ఉండగా విడిపించిన ప్రదేశమిదే, ఇదిగో ఇదే చిత్రకూటపర్వతం, భరతుడు మనలను ఒప్పించి అయోధ్యకు తీసుకువెళ్లడానికి వచ్చిన ప్రదేశం ఇదిగో, అదిగో ఆ కనబడేదే గంగానది చూడు అని చెప్తూ భరద్వాజుని ఆశ్రమ సమీపానికి వచ్చారు. అక్కడ పుష్పకం దిగి – ఆ మునీంద్రునకు నమస్కరించాడు. ఆ మునివరుడు రాముణ్ణి దీవించాడు. ఆ దీవెనలు అందుకొని మహానందాన్ని పొంది హనుమను పిలిచి, హనుమా! నువ్వు వేవేగ నందిగ్రామంలో ఉన్న భరతునికి మారాక గురించి చెప్పిరా అని పంపగా!

**విశే :** సీతాదేవికి ఆయా ప్రదేశాలు వేలుపెట్టి చూపిస్తూ విషయాలు వివరించడం వల్ల సీతకు అనేక విషయాలు, స్థలాలు తెలియవచ్చాయి. కొన్ని సంఘటనలు సీతకు తెలిసినవే అయినా పుష్పకం వచ్చే మార్గంలో వారు నివసించిన స్థలాలను కూడా దర్శించుకుంటూ రావడంవల్ల మనోల్లాసాన్ని వారికే కాదు పాఠకులకు కూడా కలిగిస్తాయి. వివిధ ప్రదేశాలను చూపే సందర్భంలో స్థలంబు, తావు, ప్రదేశం, స్థానం, చోటు, ఇక్క, చక్కి అనే పర్యాయపదాలు ప్రయోగించింది మొల్ల.

**క. అరుదెంచి చూచెఁ బావని**
**సురుచిరసౌభాగ్యభరతు శోభనచరితున్**
**విరచితపుణ్యస్ఫురితున్**
**నిరుపమసత్కీర్తి నిత్యనిరతున్ భరతున్. 126**

**ప్రతి :** అరుదెంచి=నందిగ్రామానికి వచ్చి, సురుచిర సౌభాగ్యభరతున్=గొప్ప సౌభాగ్యముతో ప్రకాశిస్తున్న, శోభనచరితున్=మంగళప్రదమయిన చరిత్ర కలవానిని, విరచిత పుణ్యస్ఫురితున్=ప్రకాశించే పుణ్యనిర్మాణము చేసినవానిని, నిరుపమ సత్కీర్తినిత్యనిరతున్=ఎల్లప్పుడు ఉపమింపరాని మంచికీర్తియందు ప్రీతి గలవానిని, భరతున్=భరతుని, పావని=పవనకుమారుడగుహనుమ, చూచెన్.

**తా :** రాముని పంపున హనుమ నందిగ్రామానికి వచ్చి గొప్ప సౌభాగ్యముతో ప్రకాశిస్తున్న శోభనచరిత్రుడు, పుణ్యశాలి, నిరుపమసత్కీర్తి నిత్యనిరతుడు అయిన భరతుణ్ణి చూసాడు.

**విశే :** సౌభాగ్యభరతు శోభనచరితున్ విరచితపుణ్యస్ఫురితున్ నిరుపమ సత్కీర్తి నిత్యనిరతున్ భరతున్– అనుప్రాస సౌందర్యము.

**వ. కనుంగొని వందనంబు సేసి కరంబులు మోడ్చి వినయంబున. 127**

**తా :** చూచి నమస్కరించి, చేతులు మోడ్చి వినయముతో

**ఆ. భరతునకు రామభద్రుఁ డేతెంచిన**
**వార్తఁ జెప్ప వినుచు వాయుసుతుని**
**గారవించి నిండు కౌఁగిట జేర్చుదు**
**నగ్రజన్ము సేమమడిగి యడిగి. 128**

**ప్రతి :** భరతునకును, రామభద్రుఁడు, ఏతెంచినవార్త=అరణ్యాల నుండి భరద్వాజాశ్రమం వరకు వచ్చిన కబురు, చెప్ప=చెప్పగ, వాయుసుతుని, గారవించి= గౌరవించి, నిండుకౌఁగిటన్=కౌగిలినిండుగ, చేర్చుదున్= చేర్చుకొని, అగ్రజన్మున్=అన్నగారి, సేమము=క్షేమము, అడిగి అడిగి.

**తా :** హనుమ భరతునకు రామచంద్రుడు భరద్వాజాశ్రమం వరకు వచ్చిన కబురు చెప్పగా, ఆ కబురు వింటూనే భరతుడు హనుమంతుని నిండుకౌగిట చేర్చుకుని, అన్నగారి క్షేమం గుఱించి అడిగి అడిగి.

**విశే :** అడిగి అడిగి – అనడంలో రాముని క్షేమసమాచారాలు తెలుసుకోవడంలో ఎంతగా ఆత్రపడుతున్నాడో తెలుస్తున్నది. మళ్ళీ మళ్ళీ అడిగితే కాని తృప్తి ఉండదు.

**క. తల్లులు మువ్వురకును రఘు**
**వల్లభుఁ డేతెంచినట్టి వార్తలు దెలుపన్**
**బల్లిదుఁ డగు తనతమ్ముని**
**నల్లన సాకేతపురికి ననిపెన్ వేడ్కన్. 129**

**ప్రతి :** తల్లులు మువ్వురకును=ముగ్గురు తల్లులకు, రఘువల్లభుఁడు=శ్రీరాముడు, ఏతెంచినట్టి వార్తలు= అరణ్యవాసం ముగించుకుని వచ్చిన సమాచారం, తెలుప=తెలియ చెప్పడానికి, బల్లిదుఁడగు=పరాక్రమ వంతుడయిన, తన తమ్ముని=శత్రుఘ్నుని, అల్లన=ప్రసిద్ధమైన, సాకేతపురికిన్=సాకేతపట్టణానికి, వేడ్కన్= ఆనందముతో, అనిపెన్=పంపెను.

**తా :** రఘువల్లభుడు అరణ్యాలనుండి తిరిగి వచ్చాడనే శుభవర్తమానం తల్లులు ముగ్గురికి తెలియపరచడానికి, పరాక్రమశాలి అయిన తన తమ్ముడు శత్రుఘ్నుణ్ణి ప్రసిద్ధికెక్కిన సాకేతపురికి ఆనందంతో భరతుడు పంపాడు.

**విశే :** నందిగ్రామంలో భరతుడి వెంట శత్రుఘ్నుడు కూడా ఉన్నాడు అని ఈ సందర్భం తెలియచెప్తున్నది.

## అయోధ్యానగర ప్రవేశము

**వ. అట భరద్వాజాశ్రమంబున మజ్జనభోజనాదులాచరించి నాఁటి రాత్రి నిలిచి మఱునాఁ డమ్మునీంద్రుని వీడ్కొని శ్రీరామచంద్రుండు పుష్పకారూఢుండై చనుదెంచుచున్న యప్పు డన్నకు భరతుండు సకలసేనా**

**సమేతుండై తల్లులుం దమ్ముండును నెదురేఁగి రాఘవేశ్వరు పాదారవిందంబులకు వందనం బాచరించిన నతం డనుజన్ములఁ గౌగిలించుకొని లక్ష్మణసహితుండై జనకరాజనందనం గూడి తల్లులు మువ్వురకుం బ్రణమిల్లి వార లతిస్నేహంబున నిండుకౌఁగిళ్ళ నొత్తుచు దీవింపఁ దమలోఁదాము పెద్దపిన్న యంతరువుల వందనంబులు సేసికొని మరలి నందిగ్రామంబున కేఁగి యచ్చటఁ బుష్పకంబు డిగ్గి దాని కర్చన లిచ్చి కుబేరుని వీటికిఁబొమ్మని యనిపి భరతుమందిరంబు ప్రవేశించె నట్టి శుభసమయందున. 130**

**ప్రతి :** అటన్=అక్కడ, భరద్వాజాశ్రమంబునన్=భరద్వాజుని ఆశ్రమంలో, మజ్జనభోజనాదులు=స్నానము, భోజనము మొదలగునవి, ఆచరించి=చేసి, నాఁటి రాత్రి, నిలిచి=ఉండి, మఱునాఁడు, అమ్మునీంద్రునిన్–ఆ+మునీంద్రునిన్=ఆ మునిశ్రేష్ఠుని, వీడ్కొని=వదిలిపెట్టి/అనుమతితో విడిచి, శ్రీరామచంద్రుండు, పుష్పకారూఢుండై=పుష్పక విమానమును ఎక్కినవాడై, చనుదెంచుచున్నయప్పుడు=వస్తూన్న సమయంలో, అన్నకున్, భరతుండు, సకల సేనాసమేతుండై=సేనలన్నింటితో కూడినవాడై, తల్లులున్, తమ్ముండును, ఎదురేఁగి=ఎదురుగా వెళ్ళి, రాఘవేశ్వరు పాదారవిందములకున్=రఘురాముని పాదపద్మములకు, వందనంబు ఆచరించినన్=నమస్కారము చేయగా, అతండు, అనుజన్ములన్=తమ్ముళ్ళను, కౌగిలించుకొని, లక్ష్మణసహితుండై, జనకరాజనందనన్ కూడి=జనక మహారాజు కూతురగు సీతతో కలిసి, తల్లుల ముువ్వురకున్=ముగ్గురు తల్లులకు, ప్రణమిల్లి=నమస్కరించి, వారలు, అతిస్నేహంబునన్=మిక్కిలి ప్రేమతో, నిండుకౌగిళ్ళన్=నిండైన కౌగిళ్ళయందు, ఒత్తుచున్=ఒత్తుకొనుచు, దీవింపన్=దీవించగా, తమతోఁదాము, పెద్ద పిన్నయంతరవులన్=పెద్ద, చిన్నతేడాలను బట్టి, వందనంబులు=నమస్కారములు, చేసికొని, మరలి=వెను తిరిగి, నందిగ్రామంబునకున్, ఏఁగి=వెళ్ళి, అచ్చటన్, పుష్పకంబు, డిగ్గి=దిగి, దానికిన్=ఆ విమానమునకు, అర్చనలు=పూజలు, ఇచ్చి=సమర్పించి/చేసి, కుబేరుని వీటికిన్=కుబేరుని నగరమునకు, అనిపి=పంపి, భరతుమందిరంబు, ప్రవేశించెన్, అట్టి శుభసమయందునన్=అటువంటి శుభసమయంలో –

**తా :** శ్రీరామచంద్రుడు భరద్వాజాశ్రమంలో స్నానాలు చేసి, భోజన కార్యక్రమాలు కానిచ్చి ఆ రాత్రి అక్కడే నిద్రించి, మఱునాడు భరద్వాజ మహర్షి నుండి అనుమతి తీసుకుని పుష్పకం ఎక్కి వస్తుండగా – భరతుడు సకలసేనతో, తల్లులతో, తమ్ముడుతో కలసి అన్నగారికి ఎదురువెళ్ళాడు. వెళ్ళి రాఘవేశ్వరుని పాదారవిందాలకు నమస్కరించాడు. రాముడు తోడబుట్టిన తమ్ముళ్లను కౌగలించుకొని ఆనందించాడు. లక్ష్మణునితో, సీతాదేవితో కలిసి తల్లులు ముువ్వురకు ప్రణామం చేసాడు. ఆ తల్లులు మిక్కిలి ప్రేమతో, నిండు కౌగిళ్లలో ఒత్తుచు దీవించారు. తరువాత అక్కడ చేరిన వారందరూ తమలో తాము పెద్ద పిన్న అంతరువులనుబట్టి నమస్కరించుకొని, నందిగ్రామానికి వచ్చారు. అక్కడ పుష్పకవిమానం దిగి, దానిని పూజించి కుబేరుని ఇంటికి వెళ్లమని పంపి, ఆ తరువాత భరతుని మందిరంలోనికి ప్రవేశించారు – అట్టి శుభసమయంలో.

**క. దానంబు లిచ్చి భద్ర**
**స్నానంబులు సేసి భూషణంబులు పూఁతల్**

**చీనాంబరములుఁ బరిమళ**
**సూనంబులుఁ దాల్చి రధిక శోభనలీలన్.** **131**

**ప్రతి :** దానంబులిచ్చి=వివిధదానాలు చేసి, భద్రస్నానంబులు=మంగళకరమయిన స్నానాలు, చేసి, భూషణంబులు=నగలు, పూఁతల్=చందనము, అగరువంటి పరిమళ ద్రవ్యాలమైపూతలు, చీనాంబరములున్=పట్టుబట్టలును, పరిమళ సూనంబులున్=మంచిసువాసన గల పువ్వులను, తాల్చిరి=ధరించిరి, అధికశోభన లీలన్=మిక్కిలి మంగళకరముగ.

**తా :** రామాదులు వివిధ దానాలు చేసి, మంగళస్నానాలు చేసి ఆభరణాలు, చందనగంధాలు, పట్టుబట్టలు, సువాసనాభరితమైన పువ్వులు ధరించి మనోహరంగా మంగళకరంగా శోభిల్లుతున్నారు.

**వ. ఇట్లు రామాది సోదరచతుష్టయంబును భూమినందనయును దపోవేషంబు లుజ్జగించి రాజచిహ్నంబులు గైకొని దానవ వానరబలంబులం గూడుకొని షడ్రసోపేతంబులైన భోజనంబులం బరితృప్తులై యారాత్రి గడపి మఱునాఁడు గజతురగస్యందనాది వాహనంబు లెక్కి ఛత్రచామరాదులు మెఱయ శంఖభేరీభాంకారంబు లుల్లసిల్ల వందిమాగధుల బిరుదుకైవారంబులు సెలంగ నయోధ్యాపురంబుఁ బ్రవేశించి నగరులోనికిఁ జొత్తెంచి వసిష్ఠానుమతంబున శుభముహూర్తంబున భద్రసింహాసనంబునఁ బట్టభద్రుండై రామచంద్రుండు భూసురులకు దానంబు లొసంగి యర్థార్థుల కిష్టార్థంబు లిచ్చి విభీషణసుగ్రీవాంగద జాంబవద్ధనుమదాదులఁ బ్రియవచనంబులం దనిపి వారివారికిం దగినపగిదిని గట్నంబులిచ్చి వీడ్కొలిపిన వారు నిజస్థానంబులకుం జని రంత మహానందంబున.** **132**

**ప్రతి :** ఇట్లు, రామాదిసోదరచతుష్టయంబును=రాముడు మొదలగు (అన్నదమ్ములు), సహోదరులు నలుగురును, భూమినందనయును=సీతయును, తపోవేషంబులు=తపస్సుకి సంబంధించిన వేషములను, ఉజ్జగించి=విడిచి, రాజచిహ్నంబులు=రాచరికపు లాంఛనములు, కైకొని=తీసికొని/ధరించి, వానరబలంబులన్ కూడుకొని=వానరసేనలతో కలిసి, షడ్రసోపేతంబులైన=ఆరు రకముల రుచులతో కూడిన, భోజనంబులన్=భోజనములతో, పరితృప్తులై=బాగా సంతుష్టులై/తృప్తినొందినవారై, ఆ రాత్రి, గడిపి, మఱునాఁడు, గజతురగస్యందనాది వాహనంబులు=ఏనుగులు, గుర్రములు, రథములు మొదలగు వాహనములను, ఎక్కి, ఛత్రచామరాదులు=గొడుగు, వింజామరము మొదలగునవి, మెఱయన్=ప్రకాశింపగా, శంఖభేరీభాంకారంబులు=శంఖము, భేరీవాద్యముల భాంకారధ్వనులు, ఉల్లసిల్లన్=విజృంభించగా/అంతా వ్యాపించగా, వందిమాగధుల బిరుదుకైవారంబులు=స్తోత్ర పాఠకుల బిరుదలతో కూడిన స్తుతులు, చెలంగన్=వ్యాపింపగా, అయోధ్యాపురంబున్, ప్రవేశించి, నగరులోనికిన్=రాచనగరు (ప్రధాన పట్టణము)లోనికి, చొత్తించి=ప్రవేశించి, వసిష్ఠానుమతంబునన్=వసిష్ఠుని అంగీకారముతో, శుభముహూర్తంబునన్=శుభ ముహూర్తమునందు, భద్రసింహాసనంబునన్=శుభప్రదమగు సింహాసనమునందు, పట్టభద్రుండై=రాజుగా పట్టాభిషిక్తుడై, రామచంద్రుండు, భూసురులకున్=బ్రాహ్మణులకు, దానంబులు, ఒసంగి=ఇచ్చి, అర్థార్థులకున్=

సొమ్ములను కోరుకొనువారికి, ఇష్టార్థంబులు=వారు కోరిన పదార్థములు, ఇచ్చి, విభీషణ, సుగ్రీవాంగద జాంబవద్ధనుమదాదులన్=సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు, హనుమంతుడు మొదలగువారిని, ప్రియవచనంబులన్=ఇష్టవచనములతో, తనిపి=తృప్తిపరచి, వారివారికిన్, తగినపగిదిని=తగినవిధంగా, కట్నంబులు=కానుకలు, ఇచ్చి, వీడ్కొలిపినన్=పంపగా, వారు, నిజస్థానంబులకున్=తమ నివాసములకు, చనిరి=వెళ్ళిరి, అంతన్, మహానందంబునన్=పిమ్మట మహానందంతో...

**తా :** ఈ విధంగా రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురు అన్నదమ్ములు, సీత తపోవేషాలు తీసివేసి రాజచిహ్నాలు స్వీకరించారు. రాక్షసబలాలతో, వానరబలాలతో కలిసి షడ్రసోపేతములయిన భోజనాలు తృప్తిగా చేసి ఆ రాత్రి నందిగ్రామంలో గడపి మఱునాడు ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు మొదలయిన వాహనాలు ఎక్కి, ఛత్రచామరాదులు ప్రకాశిస్తూ ఉండగా, శంఖభేరీభాంకారంబులు మ్రోగగా, వందిమాగధులు, బిరుదులు కైవారాలు పఠిస్తూ ఉండగా అయోధ్యాపురంలో ప్రవేశించి అంతఃపురం లోనికి వెళ్ళారు. వసిష్ఠమహర్షి అనుమతితో శుభముహూర్తంలో - భద్రసింహాసనము మీద పట్టం కట్టుకుని రామభద్రుడు బ్రాహ్మణులకు దానాలు ఇచ్చి, కోరినవారికి కోరినవి ఇచ్చి, విభీషణ, సుగ్రీవ, అంగద, జాంబవంత, హనుమంతుడు మొదలయిన వారితో ప్రేమతో తృప్తితీరా సంభాషించి వారివారికి తగినరీతిలో బహుమతులు ఇచ్చి వీడ్కొలిపాడు.

**ఆ.** **అశ్వమేధయాగ మన నొప్పు జన్నంబు**
**నెలమిఁ జేసి దివిజు లెల్ల మెచ్చ**
**లీలఁ బదునొకండు వేలేండ్లు ధరయేలెఁ**
**బరమధర్మమహిమఁ బ్రజలు వొగడ.** **133**

**ప్రతి :** అశ్వమేధయాగము, అనన్, ఒప్పు, జన్నంబు=యజ్ఞమును, ఎలమిన్=ఉత్సాహంతో, చేసి= నిర్వహించి, దివిజులు=దేవతలు, ఎల్ల=అందరూ, మెచ్చ, లీలన్=విలాసంగా, పదునొకండు వేలేండ్లు= పదకొండువేల సంవత్సరాలు, ధర= భూమిని, ఏలెన్=పరిపాలించెను, ప్రజలువొగడ=ప్రజలు పొగడేరీతిలో, పరమధర్మ మహిమన్=ధర్మయుతంగా.

**తా :** అశ్వమేధమనే యజ్ఞాన్ని ఉత్సాహంతో చేసి దేవతలందరూ మెచ్చేరీతిలో పదకొండువేల సంవత్సరాలు విలాసంగా పరమధర్మయుతంగా భూమిని పరిపాలించాడు.

## శ్రీరాముని ధర్మ పరిపాలనము

**సీ.** **సకలౌషధక్రియా సంజీవకరణిచేఁ**
**జెలఁగి దిక్కులను రక్షింపఁజాలు**
**బంధురోన్నతశస్త్ర సంధానకరణిచేఁ**
**గుటిలారులను రంభ గూర్పఁ జాలు**

సంతతోత్పాదనసౌవర్ణ కరణిచే
నర్థుల దారిద్ర్య మడఁపఁజాలు
ననుదిన సంధాన మను శల్యకరణిచేఁ
బురుషార్థనికరంబుఁ బ్రోవఁజాలు

తే. సిద్ధివిద్యానురాగ ప్రసిద్ధుఁడైన
రాజచంద్రుఁ డితండని రాజు లెల్ల
సన్నుతింపఁగ విలసిల్లె జగతియందు
భాగ్యవిస్తారి రామభూపాలశౌరి. 134

**ప్రతి :** సకలౌషధక్రియా సంజీవ కరణిచేన్=అన్ని ఔషధాల క్రియలు శక్తిగల సంజీవ కరణితో, చెలఁగి= ఉత్సాహంతో, దిక్కులను, రక్షింపన్, చాలు=శక్తిగలవాడు, బంధురోన్నత=దట్టమయిన ఉన్నతమైన, శస్త్ర సంధానకరణిచేన్=బాణములను సంధించే నేర్పుతో, కుటిల=కుటిలురయిన చెడుప్రవర్తన గల, అరులను= శత్రువులను, రంభగూర్పన్=స్వర్గలోకంలో రంభతో కూర్చగల, చాలు=శక్తిగలవాడు, సంతత=ఎల్లప్పుడు, ఉత్పాదన=పుట్టించు, సౌవర్ణకరణిచేన్=బంగారు కరణిచేత, అర్థుల=యాచకుల, దారిద్ర్యము, అడఁపన్= పోగొట్ట, చాలు=శక్తి గలవాడు, అనుదిన= ప్రతిరోజు, సంధానము=కూర్చుట, అను, శల్యకరణిచే= శల్యమనే కరణితో, పురుషార్థనికరంబు=ధర్మ, అర్థ, కామ, మోక్షములనే పురుషార్థ సముదాయుము, ప్రోవన్చాలు= రక్షించగలడు, సిద్ధవిద్యాను రాగ ప్రసిద్ధుడైన=అణిమగరిమాది అష్టసిద్ధులనే విద్యలయందు ప్రీతిగలవాడు అనే ప్రసిద్ధిగల, రాజచంద్రుఁడితండు=రాజులలో శ్రేష్ఠుడు ఇతడు, అని రాజులెల్ల=రాజులందరు, సన్నుతింపఁగ=కొనియాడగ, విలసిల్లె=ప్రకాశించె, జగతియందు=ఈ జగత్తులో, భాగ్యవిస్తారి=అధికమైన భాగ్యముగల, రామభూపాల శౌరి=పరాక్రమవంతుడైన రామరాజు.

**తా :** సకలమయిన ఓషధుల శక్తిగల సంజీవ కరణితో అన్నిదిక్కుల వారిని ఆనందంతో రక్షింపగలవాడు, తీవ్రమయిన, ఉన్నతమైన శస్త్రాలను సంధించి సంధానకరణితో కుటిలురయిన శత్రువులను సంహరించగలవాడు. నిరంతరము ధనమును ఉత్పత్తి చేసే సౌవర్ణకరణిచే యాచకుల దారిద్ర్యాన్ని పోగొట్టగలవాడు, నిత్యము సంధానమనే శల్యకరణితో పురుషార్థనికరాన్ని రక్షింపగలవాడు. సిద్ధ విద్యలయందు ప్రీతి గలవానిగా ప్రసిద్ధుడైన రాజచంద్రుడు ఇతడు అని తక్కిన రాజులందరూ కొనియాడుచుండగ జగత్తులో భాగ్యవిస్తారి అయిన రామ భూపాల శౌరి ప్రకాశిస్తున్నాడు.

**విశే :** రామరావణ యుద్ధంలో ఒకనాడు రావణుడు శక్తి అనే ఆయుధంతో లక్ష్మణుని పడవేశాడు. ఆ సందర్భంలో హనుమ సంజీవ పర్వతాన్ని తీసుకు వచ్చాడు. ఆ పర్వతంమీద సంజీవకరణి, సంధానకరణి, సౌవర్ణకరణి, విశల్యకరణి అనే ఔషధాలు ఉన్నాయి. ఇవి ప్రత్యేకమైన ఓషధులు. ఒకొక్కటి ఒకొక్కలా పని చేస్తాయి. సంజీవకరణి పోయిన ప్రాణాలను తిరిగితెస్తుంది. సంధానకరణి విరిగిన అవయవాలను అతుక్కునేలా

చేస్తుంది. సౌవర్ణకరణి కమిలిపోయి నల్లబడిన శరీరానికి బంగారురంగును కూరుస్తుంది. విశల్యకరణి– విరిగిన ఎముకలను అతికిస్తుంది. అయితే ఆ నాలుగు శ్రీరాముని వద్ద కూడా ఉన్నాయి. వాటిని ప్రయోగించి జగత్తును రక్షిస్తున్నాడని మొల్ల ఆ శబ్దాలకు గల అర్థశక్తిని ప్రదర్శించింది.

సకల దిక్కులను రక్షించడానికి సకల ఔషధక్రియా సంజీవకరణి ప్రయోగిస్తున్నాడు. సకల దిక్కులను రక్షించడం అంటే అన్ని దిక్కులగల జీవులతోపాటుగా, వాతావరణాన్ని కూడా సంజీవనివలె రక్షిస్తున్నాడు. శ్రీరామరాజ్యంలో వాతావరణ కాలుష్యం లేకుండా పరిశుభ్రంగా అన్నిదిక్కులు ఉండేవి అని, సంజీవకరణి అంటే సంజీవని అనే ఔషధపుకొమ్మ, ఇక్కడ సంజీవనివలే అంటే సంజీవని చేసే మేలు రాముడు చేకూరుస్తున్నాడు అని. క్రియా సంజీవకరణి=రాముడు చేసే పనులు–సంజీవనివలె ఉన్నవి. రెండోపాదంలో – శస్త్రసంధాన కరణి – బాణాలు సంధించి కుటిలురయిన శత్రువుల్ని రంభతో కూరుస్తాడు, సంధానము అంటే కూర్చడం. తన బాణాలనే సంధానకరణితో – శత్రువులను యుద్ధంలో సంహరించి రంభతో కూరుస్తాడు, యుద్ధంలో మరణించిన వారు స్వర్గంలో రంభ వద్దకు వెళ్లి ఆనందిస్తారని ప్రతీతి.

మూడోపాదంలో – సంతతోత్పాదన సౌవర్ణకరణి – నిరంతరం పాడిపంటలు ఉత్పత్తిచేసి పట్టిందంతా బంగారంచేసి అడిగిన వారి దారిద్ర్యాన్ని పోగొడుతున్నాడు. సౌవర్ణ అంటే సువర్ణసంబంధమయిన అని అర్థం, సువర్ణమంటే బంగారం.

సౌవర్ణకరణి ఔషధంగా ప్రయోగిస్తే శరీరానికి మంచి రంగును చేకూరుస్తుంది. 'ఉత్పాదన' సౌవర్ణకరణితో ప్రజలకు కొదువలేకుండా సంపదలు చేకూరుతున్నాయి. సువర్ణం ఉత్పన్నమవుతూ ఉంటే ఇక కొదవేముంటుంది.

నాలుగోపాదంలో – అనుదిన సంధానము అనే శల్యకరణితో – విరిగిన ఎముకలను అతికేశక్తి కలది. ధర్మ విషయాల మీద మనసు విఱిగిన వారికి – నిత్యము రామనామ స్మరణవల్ల ధర్మార్థకామమోక్షాలనే పురుషార్థాలను మనస్సుకు అతికిస్తున్నాడు. వాటిపై మనస్సు నిలిచేలా చేస్తున్నాడు. అలా సిద్ధింపచేసి విద్యతో ప్రజల ఎడల అనురాగంతో ప్రసిద్ధుడైన రాజచంద్రుడు రామచంద్రుడని లోకంలోని రాజులందరూ నుతిస్తూ ఉండగా భాగ్యవిస్తారి అయిన రామభూపాలశౌరి విలసిల్లాడు. శ్రీరాముని సర్వలోకరక్షణ సంరంభాన్ని మొల్ల – సంజీవ, సంధాన, సౌవర్ణ, శల్యకరణులతో అనుసంధించి అభివర్ణించి ఆనందించింది.

సీ. **కుటిలత నడులందుఁ గుంతలంబులయందు**
**బొంకు జూదములందు బూతులందు**
**లేమి వైరులయందు లేమల నడుమందు**
**భంగ మంబుధులందుఁ బరులయందుఁ**
**గోపంబు ఖలులందుఁ గ్రూరవర్తనులందు**
**వడఁకు వీణలయందు వ్యసనులందు**

బంధంబు రతులందుఁ బటుశిరోజములందు
మోహంబు ధనమందు ముదితలందు

తే. జింతకవులందుఁ దపసులచిత్తమందు
వర్ణమిళితంబు చిత్తరువందు యవను
లందుననె కాని యొండెడఁ జెందకుండ
లీల ధర యేలె రామభూపాలవరుఁడు. 135

**ప్రతి :** కుటిలత=వంకర, నదులందున్=నదులలోను, కుంతలంబుల యందు=జుట్టులోను, బొంకు=అబద్ధము, జూదములందు, బూతులందు, లేమి=దారిద్ర్యము, వైరులయందు=శత్రులయందు, లేమల=యౌవనవతులయిన స్త్రీల, నడుమందు=నడుము ప్రదేశంలోను, భంగము=పడిపోవడం, అవమానం పొందడం, అంబుధులందున్=సముద్రములలో, పరులందు=శత్రువులలోను, కోపంబు, ఖలులందున్=నీచులయందు, క్రూరవర్తనులందు=భయంకరమయిన ప్రవర్తన కలవారియందు, వడకు=వణికిపోవుట, వీణలయందు, వ్యసనులందు=తాగుడు మొదలయిన వాటికి అలవాటుపడిన వారియందు, బంధంబు=కట్టివేయుట, బంధించుట, రతులందున్=శృంగార క్రీడలలోను, పటుశిరోజములందు=నిడుపాటి జుట్టు విషయములోను, మోహంబు=కోరిక, ధనమందు=డబ్బు విషయములోను, ముదితలందున్=స్త్రీల విషయంలోను, చింత=నిరంతరం ఆలోచించడం, కవులందున్=కవులలోను, తపసులచిత్తమందు=తాపసుల మనస్సులోను, వర్ణమిళితంబు=వర్ణసాంకర్యము, చిత్తరువందు=బొమ్మలలోను, యవనులందునె=యవనదేశం నుండి వచ్చిన వారియందు మాత్రమే (యవని=తెర; బహువిధాలైన రంగుల కలయిక బొమ్మలలో, ఆ బొమ్మలు చిత్రించటానికి సాధనమైన తెరలలో మాత్రమే – అనికూడ చెప్పవచ్చు), కాని=తప్ప, ఒండెడన్=మరొకచోట, చెందకుండ=లేకుండ, లీలన్= సునాయాసంగా, రామభూపాలవరుఁడు=రాజశ్రేష్ఠుడయిన రాముడు, ఏలె=పరిపాలించెను.

**తా :** శ్రీరాముడు పరిపాలించిన విధానము గురించి వివరిస్తున్నది మొల్ల. తన రాజ్యంలో కుటిలత నదులలోను, శిరోజాలలోను, అబద్ధం చెప్పడం జూదంలోను, బూతులలోను, లేమి శత్రువులలోను స్త్రీల నడుములలోను, లేచి పడడం సముద్రంలోను, శత్రువులలోను, కోపం నీచులలోను, క్రూరులలోను, వణకు వీణలలోను, వ్యసనులలోను, బంధము రతుల్లోను, అధికంగా గల జుట్టులోను, మోహం ధనమందు, స్త్రీలయందు, చింత కవులలోను, తపసుల చిత్తంలోను, వర్ణసాంకర్యం చిత్రలేఖనంలోను, యవనులలోను తెరల మీదా తప్ప మరొకచోట ఎక్కడా లేకుండా రాజశ్రేష్ఠుడైన శ్రీరాముడు ఈ భూమిని లీలగా పరిపాలించాడు.

**విశే :** లోకంలో కొన్ని గుణాలను ఉత్తమగుణాలని, కొన్నిటిని నీచగుణాలని పరిగణించారు. కుటిలత, బొంకు, లేమి, భంగము, కోపము, వడకు, బంధము, మోహము, చింత, వర్ణమిళితంబు ఉత్తమగుణాలుగా పరిగణించలేదు. అయితే ఈ గుణాలు కొన్ని సందర్భాల్లో కొన్నిచోట్ల గుణాలే అవుతున్నాయి. రామరాజ్యంలో మరి ఉత్తమగుణాలు కానివి అసలే లేవా? అని ప్రశ్నించేవారికి సమాధానంగా మొల్ల ఈ పద్యం కూర్చింది.

వంకరగా ఉండడం గుణం కాదు, కానీ నదుల్లోనూ, కురులలోను రామరాజ్యంలో వంకరలు ఉన్నాయి అంటోంది మొల్ల. నదులు ప్రవహించేటప్పుడు వంకరలతోనే ప్రవహిస్తాయి. కొండలు అవీ అడ్డువస్తే పక్కనించి తిరిగి వెళ్ళడంలో వంకర ఏర్పడుతుంది. అది నది విషయంలో గుణమే. అలాగే జుట్టు గిరజాలు గిరజాలుగా వంకీలు తిరిగి ఉండడం అందమే. అందుకే ఆ రెంటి విషయంలో కుటిలత ఉంది అంది మొల్ల.

అబద్ధం ఆడరా? రామరాజ్యంలో ప్రజలు అంటే ఆడకేం ఆడతారు – జూదం ఆడేటప్పుడు, ఒకరినొకరు తిట్టుకునేటప్పుడు.

ఆ రాజ్యంలో లేమితనం అసలు ఎక్కడా లేదా? అంటే ఉంది శత్రువుల్లోను, తరుణులయిన స్త్రీల నడుముల్లోను – నడుము ఎంత సన్నగా ఉంటే అంత అందం. అందువల్ల రామరాజ్యంలో స్త్రీల నడుముల్లో దారిద్ర్యం ఉంది లేకపోలేదు అంటూ స్త్రీలు సౌందర్యవతులు అనే అర్థాన్ని చెప్తోంది. ఎత్తుగా లేచి పడిపోవడం విషయానికి వస్తే సముద్రంలో ఎత్తుగా లేచి కెరటాలు పడిపోతూ ఉంటాయి. భంగపడడమన్నమాట. ఇది శత్రువుల్లో కూడా ఉంది. రాముని చేతిలో శత్రువులు భంగపడుతూ ఉంటారు. ఓడి అవమానం పాలవుతూ ఉంటారు. ఇక కోపం – నీచుల్లో, క్రూరుల్లో మాత్రమే ఉంది. వడకు వీణలలోను, వ్యసనపరుల్లోను ఉంది. వీణ వాయించేటప్పుడు మెట్లమీద వేళ్లతో నొక్కి తీగను కదలించడం వల్ల మంచినాదం వస్తుంది. అలా ముందుకి వెనక్కి కదిలించడాన్ని వడకు అంటారు. వీణ విషయంలో ఇది గుణమే! దీన్ని గమకం అంటారు. ఇక వ్యసనపరులకు శరీరం పట్టుతప్పి వణుకుతుంది. కాబట్టి వణుకు వారిలో ఉంటుంది. బంధము అనేది రతుల్లోను, జుట్టుముడుల్లో మాత్రమే ఉంటుంది. మోహం ధనవిషయంలో, స్త్రీల విషయంలోను ఉంది. చింత కవులందు, తపస్సు చేసుకునే వారి మనస్సుల్లోను ఉంది. చింత అంటే ఆలోచన, ధ్యానించడం అనే అర్థాలు. చింత అంటే దుఃఖము అనే అర్థం కూడా ఉంది. ఇక్కడ చింత అంటే ఒక విషయాన్ని గురించి సదా ఆలోచించడం. అది నిర్మాణ దక్షులయిన, కావ్య కవుల్లోను, భగవంతుని ధ్యానించే తపసులలోనూ ఉండడం గుణమే. ఇక చివరగా వర్ణమిళితంబు రకరకాల రంగులు కలిపితే వేరువేరు రంగులు వస్తాయి. అలా కలపడం బొమ్మలువేసే చిత్రకారుల్లో ఆ బొమ్మలలో, ఆ బొమ్మలకు ఆధారమైన తెరలలో మాత్రమే ఉంది. అది గుణమే కదా!

ఇక వర్ణమిళితంబు అంటే వివిధ వర్ణాలకు చెందినవారు వర్ణవ్యవస్థను పాటించకుండా వివాహాలు చేసుకోవడం యవనులలోనే ఉంది తప్ప ఇంకెక్కడా లేకుండా శ్రీరామభూపాలవరుడు రాజ్యపాలన ఆనందంగా చేసాడు.

మొల్ల ఇలా రామరాజ్య వైభవాన్ని వర్ణించింది. "కాదు కాదని కొనియాడ గలిగినట్టి పురవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము" (బా–2) అన్న మొల్ల, కలదు కలదని కూడా కొనియాడ దగినట్లుగా రామరాజ్యాన్ని వర్ణించి తన కవితానైపుణిని ప్రదర్శించింది.

## ఫలశ్రుతి

క. **ఈ రామచరిత మెప్పుడు**
**వారక విన్నట్టివారు వ్రాసినవారున్**
**గోరి పఠించినవారును**
**శ్రీరాముని కరుణ మేలు సెందుదు రెలమిన్.** **136**

**ప్రతి :** ఈ రామచరితము, ఎప్పుడు=ఎల్లప్పుడు, వారక=తప్పకుండా, విన్నట్టివారు, వ్రాసినవారున్, కోరి= కోరికతో, పఠించినవారును, శ్రీరాముని కరుణన్=శ్రీరామునిదయవలన, మేలు సెందుదురు= మేలు పొందుతారు, ఎలమిన్=సంతోషముతో –

**తా :** ఈ శ్రీరామచంద్రుని చరితము నిరంతరం క్రమంతప్పకుండా విన్నట్టివారు, వ్రాసినవారు, చదవాలి అనే కోరికతో చదివినవారు శ్రీరాముని దయచేత సంతోషంతో మేలు పొందుతారు. మంచివారు కాగలరు.

**విశే :** ఫలశ్రుతిలో విన్నవారు చదివిన వారితోపాటుగా వ్రాసిన వారికి కూడా మేలు చేకూరుతుంది. అని ఇక్కడ రామకథ వ్రాయడం అనికాక ఈ రామకథ అని స్పష్టంగా చెప్పంది మొల్ల. కాబట్టి వ్రాయవలసినది ఈ మొల్ల వ్రాసిన రామాయణమే కాని వేరే స్వయంగా వ్రాయమని కాదు. విషయమేమిటంటే మనకు 19వ శతాబ్దిలో అచ్చుయంత్రం వచ్చేదాక ఒక పుస్తకం కావాలంటే శ్రద్ధగా వ్రాసుకోవాలి. అదీ తాటాకుల మీద, కొంతకాలానికి కాగితాలు వచ్చాయి, అప్పుడు కాగితపు ప్రతులు తయారు చేసుకునేవారు, ఈ మొల్ల రామాయణాన్ని శ్రద్ధతో ఎవరయితే వ్రాసి మరోపుస్తకం ప్రతి తయారు చేస్తారో వారుకూడా శ్రీరాముని దయతో మేలు పొందుతారు. తెలుగుదేశంలో ఒక సంప్రదాయం ఉండేది రెండుతరాల వెనకవరకు ఎవరయినా బుద్ధిమంతుడు వాల్మీకి రామాయణం పూర్తిగా వ్రాసి ప్రతిని తయారుచేసి ఇస్తే ఆతడికి కాళ్లు కడిగి తమ కూతురిని ఇచ్చి కన్యాదానం చేసేవారు. పెళ్లికొడుకుకు కావలసిన గొప్ప లక్షణం రామాయణ ప్రతి వ్రాయడం. అందువల్ల రామకథ విన్నవారికి, పఠించిన వారలతోపాటు వ్రాసినవారు కూడా ధన్యులు. మంచిఫలితాలు పొందగలరు, శ్రీరామరక్ష చేకూరగలదు.

## ఆశ్వాసాంత పద్య గద్యములు

క. **జలజాక్ష! భక్తవత్సల!**
**జలజాసనవినుత పాదజలజాత! సుధా**
**జలరాశిభవ్యమందిర!**
**జలజాకరచారుహంస! జానకినాథా!** **137**

ఈ పద్యము ప్రతి ఆశ్వాసాంతంలోను వ్రాసింది మొల్ల.

**మాలిని.**

**కువలయదళనేత్రా! కోమలస్నిగ్ధ గాత్రా!**
**భవముఖనుతిపాత్రా! భక్తవృక్షాళిచైత్రా!**
**రవిశశిసమధామా! రక్షితాక్షాంఘ్రిభామా!**
**కవిజననుతనామా! కావుమా మమ్ము రామా!** **138**

**ప్రతి :** కువలయదళనేత్రా!=కలువరేకులవంటి కన్నులు గలవాడా! కోమల స్నిగ్ధగాత్రా!=కోమలమైన, నున్ననైన శరీరము గలవాడా! భవముఖనుతి పాత్రా!=శివునిచే నుతింపబడుటకు పాత్రుడవైనవాడా! భక్తవృక్షాళి చైత్రా!=భక్తులనే చెట్లకు చైత్రమాసమువంటివాడా! (వసంతము), రవిశశిసమధామా=సూర్యచంద్రులతో సమానమైన కాంతిగలవాడా! రక్షితాక్షాంఘ్రిభామా=పాదస్పర్శచే రక్షింపబడిన స్త్రీ గలవాడా (అహల్య వృత్తాంతము) కవిజననుతనామా!=కవిజనులచేత నుతిపంబడే పేరు గలవాడా **కావుమా, మమ్ము, రామా!**

**తా :** కలువరేకులవంటి కన్నులు గలవాడా! కోమలమైన, స్నిగ్ధమైన శరీరము గలవాడా! శివునిచే నుతింపబడేవాడా! భక్తులనే వృక్షాలకు వసంతమువంటివాడా! సూర్యచంద్రులవంటి ప్రకాశముగలవాడా, పాదస్పర్శతో అహల్య శాపం తీర్చినవాడా!

కవులచే నుతింపబడే నామము కలవాడా! మమ్ము కావుమా! రామా!

**విశే :** రచన ముగింపులో 'మాలిని' పద్యం వ్రాయడం సంప్రదాయం. మొల్ల ఈ పద్యంలో చిన్న చమత్కారం చేసింది. శ్రీరాముని సంబోధనలన్నీ సంస్కృతంలో కూర్చింది. చివరి వేడుకోలు మాత్రం చక్కని తెలుగులో వ్రాసింది 'కావుమా మమ్ము రామా!' - అంటూ.

తెలుగు భాషమీద మొల్లకు గల మక్కువ అట్టిది. మొల్ల 'కావుమా నన్ను రామా! అనలేదు. **'కావుమా మమ్ము రామా!'** - అని మరింత ఉదాత్తరమణీయంగా ముగించింది.

## ఆశ్వాసాంత పద్య గద్యములు

**గద్యము : ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోదసూరి జనవినుత కవితా చమత్కారాతుకూరి కేసనసెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబునందు యుద్ధకాండము సర్వంబును తృతీయాశ్వాసము.**

శ్రీరామరక్ష సర్వజగద్రక్ష

శ్రీరామ శ్రీరామ జయరామా సీతారామా శ్రీరామ

* * *

# అనుబంధం - 1

## మొల్ల ఆశుకవితాసుగంధం

మొల్ల కృష్ణరాయల సమకాలికురాలని తెలుపు చక్కని సారస్వత గాథను శ్రీ నడకుదుటి వీరరాజుపంతులు 1935 ఫిబ్రవరి భారతి సంచికలో 'రాయలనాటిచాటు పద్యములు – రమ్యతరములగు వాని గాథలు' అను వ్యాసములో – మొల్ల పూరించిన ఒక దత్తపదిని పేర్కొన్నారు.

అది కృష్ణరాయల భువనవిజయసభా ప్రాంగణము. అష్టదిగ్గజ కవులు కొలువుదీరి ఉన్నారు. మొల్ల ఆ సభకు ఆహ్వానింపబడింది. శ్రీ కృష్ణదేవరాయలకు ఆమె ఆశుకవితాపాటవాన్ని పరీక్షించాలనే కోరిక పుట్టింది. కవులను ప్రశ్నించమని కోరాడు. కవులు తమలో తాము చర్చించుకుని తెనాలి రామకృష్ణుని ప్రశ్నించమని కోరారు. రామకృష్ణ కవి గొంతు సవరించుకొని –

"కవిరత్నమా, నీ శేముషీ విశేషంబునకును, కవితా సామర్థ్యమునకును, వినయవిధేయతాది సద్గుణ సంపత్తికిని మహారాజుదొట్టి కవి పండిత వర్యులెల్లరు సమ్మోదనిమగ్నమానసులైరి. ఇక నీయాశు కవిత్వమహిమను వెల్లడించి వీరి ప్రమోదము ద్విగుణమగునట్లొనర్పుము. ఆశువున నీవు చెప్పవలసిన పద్యమున నుండవలసిన సంగతులను దెల్పెదను వినుము :

"మకరికి జిక్కిన కనకలు గుడుచుచు వికల హృదయుడై తన్ను గాపాడుమని ప్రార్థించు గజేంద్రుని బరిరక్షింప సంభ్రమాయత్తచిత్తుడై వైకుంఠనగరమునుండి చనుదెంచు శ్రీ మహావిష్ణుని ప్రయాణ విశేషము నొక సీసపద్యమున నభివర్ణింపవలయును. సీస పాదములు నాలుగింట వరుసగా

"గుమ్ము, బుస్సు, రింగు, బొణుగు" అను పదములుండవలయును. మరియు, నితాంత భయాకులుడై ప్రాణముల మీది యాసను వదులుకొని మొఱపెట్టుచున్న యగ్గజరాజునకు, గడు దూరమున నుండియే శ్రీమన్నారాయణుని యభయ ప్రదాన వాక్కులు వినబడుటయు, దదీయ సందర్శన చిహ్నము కనబడుటయు నొక్క మాటే జరిగినట్లుండవలయును. ఈ నియమములను బాటించుచు నాశుపద్య రచనమున గల నీ ప్రజ్ఞా విశేషమును జూపి యీ సభాసదుల మెప్పునందుము' అని పలికెను.

'ఓహో! ఎంత విశేషమైన పరీక్ష' అని రాయలు తలంచెను. 'అకటా! ఒక యాడుదాని నాశుకవనమున నింత లేసి చిక్కులుగల నిబంధనలతో బరీక్షింతురా?' అని సభ్యులు చింతింప గడంగిరి.

అప్పు డక్కవయిత్రీ రత్న మొక్క నిమేషమాత్ర మాకసమువంక దృష్టిని బరగించి, శ్రీరామచంద్రమూర్తిని మనంబున నిలిపి, తనయాశు కవితా మహత్త్వము తేటవడ మృదుమధుర గంభీర స్వరముతో నీ క్రింది పద్యమును జెప్పెను.

సీ. "అనిలాభిహత దక్షిణా వర్త శంఖంబు
 గుంఫితంబై కేల'గుమ్మ' రనగ
గొడుగయి తరచుగా బడగ లొక్కదదట్టి
 భుజగాధిపతి మీద 'బుస్సు' రనగ
చఱచి నిబ్బరముగా బఱతెంచు ఖగరాజు
 ఱెక్కగాడ్పులు మింట 'ఱింగు'రనగ
దొంది బ్రహ్మాండ పంక్తులు బొజ్జలో నుండి
 బొఱకియొక్కొక మాఱు 'బుఱుగు' రనగ

తే. కూక కనుచూపు మేరకు గోకవిసరి
వెఱకు వెఱవకు! వెఱవకు! వెఱవ! కనుచు
నుద్దవడివచ్చి గజరాజునొద్దవ్రాలె
నార్తరక్షణచణుడు నారాయణుండు...!

అత్యంత మనోహరమైన యిప్పద్యము నాలించినంత సభాస్తరుల యుల్లంబులు సంతోషాశ్చర్యాదులచే నొక్కమాఱుగ నుప్పొంగెను. వారి నేత్రముల నుండి యానంద బాష్పములు వెల్లివిరిసెను. సభయంతయు నొక్క క్షణము నిశ్శబ్దమయ్యెను. తరువాత 'ఆహాహా! ఓహోహో' ఇత్యాది ప్రశంసనార్థకములు వెలువడెను. అప్పుడు రామకృష్ణకవి మొల్లకవి కిట్లనియెను.

"సెబాష్! కవయిత్రీమణీ! నీ పద్యము హృద్యమై నీ యాశుపద్య నిర్మాణ ప్రాగల్భ్యమును వెల్లడించుచున్నది. నీ ప్రజ్ఞావిశేష మసదృశము. భారతీదేవి కారుణ్యకటాక్షము నీపై బరిపూర్ణముగ బ్రసరించుచున్నది. 'ఇతరులెవ్వరైన నింత రసవత్తరముగ జెప్పగలిగియుందురా?' యని యాశ్చర్యపడదగినంతటి భక్తి రసముతోడను, భావమాధుర్యముతోడను, మనోజ్ఞ పదవిన్యాసముతోడను బరిఢవిల్లుచు, నీ పద్యరాజ మమ్మహావిష్ణువు నగ్గజరాజునకే కాక మాకును సాక్షాత్కరింపజేయుచున్నట్లున్నది. నా యడిగిన పదముల నన్నిటి నమిత ప్రౌఢిమెఱయ, నాయా సీస పాదముల యందు సందర్భశుద్ధిగా సంధానించి నాయాశయమున కనుగుణముగ నిరుపమాన పద్య రత్నమును రచియించి సభ్యుల కందఱకు, నెనలేని ముదంబు నొనగూర్చితివి. కాని, చూడము, మొల్లా నీవా పద్యమును వచించు సమయమున నీకు శ్రీ మహావిష్ణుని జగన్మోహనావతారము ప్రత్యక్షమైనదాయేమి, యాదేవుడు 'కోక విసరినట్లు చెప్పి యాతనికి కోక నంట గట్టితివి?"

చిరునవ్వుతోడి యక్కవిచంద్రుని వాక్యములను విని యా సీమంతినీమణి రామకృష్ణ కవితో, 'కవిసత్తమా! హాసప్రియులగుట మీరట్లు చమత్కరించితిరిగాని, 'కోకశబ్దము సామాన్య వస్త్ర పర్యాయముగా నుండుటను

మాత్రము మీరెఱుగనిదియా? కవిబిడౌజా! నాయల్ప కవనమును మీరు మిక్కిలియు బెద్దచేసి పొగడియున్నారు. కాని, యది మీకొక లెక్కలోనిదా 'మీ పదగుంభనం బొరులకు సాధ్యమగునదియా?' అని వక్కాణించెను.

పిమ్మట మహారాజు మొల్లను వీక్షించి, 'కవయిత్రీమ తల్లీ! నీ పద్యము ప్రబంధరాజములలోని పద్యమువలె గడుంగడు ప్రౌఢమై హృదయంగమమై సరళమై యలరారుచున్నది. తొలుదొల్త రామకృష్ణ కవీంద్రు డేర్పఱిచిన నిబంధనములను విని నీ వీ పద్యము నీ రీతిని నిర్వహింతువని నేను తలచి యుండలేదు. ఆహా! స్త్రీవై యుండియు నిట్టి ప్రజ్ఞావిశేషమును జూపిన నిన్నెంతయైన పొగడవచ్చును గద! ఇట్టి కవితా సామర్థ్యమును జెందియున్న నీకు గానుకగా, నీవు నివసించు గోపవర గ్రామమును సకల స్వాతంత్ర్యముల తోడను ఇచ్చితిని. ఇతోధికముగ గవిత్వాభివృద్ధి నొనర్చుకొనుచు సుఖముండుము" అని పరమ ప్రీతిమెయి బలికెను.

* * *

## అనుబంధం - 2

# మొల్ల రామాయణం ముద్రణలు కొన్ని

నెల్లూరు నుండి వెలువడిన అముద్రిత గ్రంథచింతామణి పత్రికలో మొల్ల రామాయణము కొంతభాగము నెలనెలా ప్రచురింపబడినది (1891).

రాజమండ్రి చింతామణి పత్రిక మొల్ల రామాయణాన్ని పూర్తిగా ముద్రించింది.

ఆ వెనుక వావిళ్లవారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు - 1967లో,

ఆ తరువాత ఎమెస్కోవారు 1971లో మొల్ల రామాయణాన్ని ప్రచురించారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన మొల్ల రామాయణానికి కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు 'ముకుంద విలాసము' అనే పేర భక్తిపరిమళభరితమైన పీఠికను కూర్చారు.

ఎమెస్కో వారు ముద్రించిన రామాయణానికి 'వాచవి' పేరుతో విద్వాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారు చవులూరే పీఠికను అందించారు.

శ్రీ మొన్నెల్లి శివశంకరయ్య & దగ్గుపాటి శ్రీదేవి అనే పరిశోధకులు 2017లో మొల్ల రామాయణం - కవయిత్రి ఆత్మకూరి మొల్ల - తాళపత్రాలు ఫోటో తీసి ముద్రించడంతోపాటు పద్యాలకు వివరణ వ్రాయడం విశేషం.

* * *